నియమముగా ఉండి మితాహారియై, జితేంద్రియుడై, భక్తితో భాగవత పాఠ, శ్రవణాదులు చేయాలి. సమాపనముగా వస్త్రాలంకార ద్రవ్యములచే పాఠకుని, పౌరాణికుని పూజించి, రుక్మిణీ కల్యాణము చేయించి, బ్రాహ్మణులకు, అన్నసంతర్పణ చేయాలి. బంగారు సింహాసనమును చేయించి దానిమీద చేతితో వ్రాసిన భాగవత గ్రంథమును ఉంచి పౌరాణికునికి దానం చేయడం వలన మోక్షప్రాప్తి కలుగుతుంది. భాగవత సప్తాహ శ్రవణము భాద్రపద నవమి నుండి పౌర్ణమి వరకు సమాప్తి చేయాలి. శ్రీశుక ముఖతః పరీక్షిత్తు ఇదే సమయములో శ్రవణము చేశాడు.

శ్లో ।
మనుకర్దమసంవాదపర్యంతం ప్రథమే ऽ హని ।
భరతాఖ్యానపర్యంతం ద్వితీయేऽహని ।
తృతీయే చ దినే కుర్యాత్ సప్తమస్కంధపూరణమ్ ।
కృష్ణావిర్భావ పర్యంతం చతుర్థే దివసే పఠేత్ ।
రుక్మిణ్యుద్వాహపర్యంతం పంచమేऽ హని శస్యతే ।
శ్రీ హంసాఖ్యాన పర్యంతం షష్ఠేऽహని పఠేత్సుధీః ।
సప్తమే తు దినే కుర్యాత్ పూర్తిం భాగవతస్యవై ।
ఏవం నిర్విఘ్నతా సిద్ధిర్విషయస్య న చాన్యథా ॥

మరి కొందరి మతంలో. శ్లో ॥
ఆద్యే హిరణ్యాక్ష వధో ద్వితీయే భరతావధి ।
తృతీయేత్వబ్ధి మథనం చతుర్థే కృష్ణ జన్మ చ ।
పంచమే రుక్మిణ్యుద్వాహః షష్ఠేచోద్ధవ వాచకమ్ ।
సప్తమే ऽ హ్ని సమాప్తిః స్యాత్ సప్తాహం మునిరబ్రవీత్ ॥

అని శ్రీమద్భాగవత మాహాత్మ్యం స్కాంద పురాణంలో వైష్ణవ ఖండంలో వివరించబడినది." శ్రీమద్భాగవతాఖ్యోయం ప్రత్యక్షః కృష్ణ ఏవహి". అని పద్మపురాణమున కలదు. శ్రీమద్భాగవతము అక్షరరూప శ్రీకృష్ణ స్వరూపము. పద్మ పురాణములో ఉద్ధవుడు శ్రీకృష్ణ నిర్యాణ సమయమున "స్వామీ ! కలి కాలమున మానవులెలా ఉద్ధరింపబడగలరు. పాపాత్ములు, అల్పాయుష్మంతులు, ఉగ్రరోగబాధితులు బాగుపడే మార్గము చెప్పుము." అని ప్రార్థించగా తన తేజస్సును శ్రీకృష్ణపరమాత్మ శ్రీమద్భాగవతమున ఉంచెను. ద్వాదశ స్కంధాత్మక శ్రీభాగవతము ద్వాదశాదిత్య సమానము. సూర్యుడు తమస్సును రూపుమాపి వెలుగును ప్రసరింపజేసినట్లు శ్రీమద్భాగవతము అజ్ఞానమనెడి చీకటిని తొలగించి భక్తి, జ్ఞాన, వైరాగ్యములనెడి వెలుతురు కలిగించెడి గొప్ప కల్పతరువు. "కలౌ నష్ట దృశామేష పురాణార్కో ऽ ధునోదితః". అన్నారు. భక్తి జ్ఞాన వైరాగ్య జనకమగు భాగవతము త్రివిధగతి గల సూర్యునితో సమానమేగాక సూర్యునికన్న మిక్కిలి విశిష్టమైన వ్యతిరేకాలంకారాలలో వివరించబడినది. సూర్యుడు పగలు మాత్రమే ప్రకాశిస్తాడు, కాని శ్రీమద్భాగవతము రాత్రింబవలు కూడా వెలుగుతుంది. సూర్యుడు మనోగుహలోని అంధకారాన్ని తొలగించలేడు, కాని భాగవతము మనోగుహాగతమైన అజ్ఞానమనెడి మాలిన్యాన్ని కూడా తొలగించగలదు. భాగవత పురాణ ప్రవచనము జరిగినచోట సర్వ శ్రేయస్సులు చేకూరుతాయి. భాగవత సప్తాహ శ్రవణము వలన ఈ లోకమున ఆయురారోగ్య ఐశ్వర్యాది సత్ఫలితములే కాక అంత్యమున మోక్షము కూడా లభించును. "నాన్యః పంథా విద్యతేయనాయ" అని శ్రుతి. మోక్షానికి జ్ఞానమే కారణము.

భాగవత సప్తాహము సర్వోత్కృష్టమగు జ్ఞాన యజ్ఞము. ఇది భక్తుల పాలిటి పెన్నిధి.

శ్లో ॥ శ్రీమద్భాగవతం పురాణ తిలకం యద్వైష్ణవానాం ధనమ్ ।
యస్మిన్ పారమహంస్యమేకమమలం జ్ఞానం పరం గీయతే ॥
యత్ర జ్ఞానవిరాగభక్తిసహితం నైష్కర్మ్యమావిష్కృతమ్ ।
తచ్ఛృణ్వన్ ప్రపఠన్ విచారణ పరో భక్త్యా విముచేన్నరః ॥

శ్రీమద్భాగవతము 12 స్కంధములు కలది. 12 అక్షరములు గల వాసుదేవ ద్వాదశాక్షరీ మహామంత్రమునకు సమానమని భావింపబడుచున్నది. శ్రీమద్భాగవతము గహనము. అంత సులభముగా అర్థముగాదు. భాగవతార్థము వ్యాఖ్యాగమ్యము. అనేకమంది పండిత ప్రకాండులు భాగవతానికి వ్యాఖ్యలు రచించారు.

వ్యాఖ్యానాలకు వ్యాఖ్యలు కూడా వెలుబడినవి. అన్నిటికన్నా శ్రీధరీయ వ్యాఖ్యానము ముఖ్యమైనది. శ్రీధరస్వామి రచించిన భావార్థ దీపిక అను అద్వైత సిద్ధాంతపరమైన వ్యాఖ్యానము మిక్కిలి విశిష్టమైనది. శ్రీమద్భాగవతము అద్వైత వేదాంత సిద్ధాంతముతో నిండియున్నదనుటకు సందేహము లేదు. దాన్ని ప్రతిపాదించునది భావార్థదీపిక. యథార్థమైనభావమును ప్రకాశింపజేయునది. శ్రీధరస్వామి గొప్ప నృసింహ భక్త్యుపాసనలు కల మహాపండితుడు. అంతటి ఉపాసకునికి గూడా భాగవత శ్లోకాలకు సరియైన అర్థము కొన్నిచోట్ల గోచరించకపోతే ఆయన ముఖముపై వస్త్రం వేసుకొని నృసింహ ధ్యానం చేస్తూ కూర్చొనేవాడనీ, కొద్ది సేపటికి ముఖవస్త్రం తీసి చూడగా అచట కొన్ని పంక్తులు చక్కని అర్థమును వివరించేవి వ్రాసియుండెడివని చివరన "అయం భావః" అని ఉండిందనీ, ఆ అర్థాలను స్వయంగా నృసింహస్వామి తెల్పినాడని ప్రతీతి. శ్రీధరీయ వ్యాఖ్యానాన్ని ఇతర వ్యాఖ్యానాలను పరికించి పండితులు ఏది గొప్పదని ఆలోచించి శ్రీధర వ్యాఖ్యలేనిచో, భాగవత నిగూఢార్థము ఎవ్వరికినీ తెలిసేది కాదని నిర్ధారించారు.

అట్టి శ్రీధర వ్యాఖ్య భావార్థదీపికకు వంశీధర వ్యాఖ్యానం కూడా వెలుబడింది. అంతేకాక ఈ వ్యాఖ్యానాలనన్నింటినీ జగన్నాథస్వామి గుడిలో ఉంచితే దేనిని స్వామి పరిగ్రహించునో అది గొప్పదని, తెలుసుకుందామని ఆ విధముగా గుడిలో ఉంచితే శ్రీధర వ్యాఖ్య జగన్నాథస్వామి చేతిలో కనిపించినదని ప్రతీతి.

శ్రీధర వ్యాఖ్యానము ప్రతులలో అనేక పాఠభేదాలు కలవని వాటిని శోధించి సుష్ఠు పాఠములను పండితవర్య నారాయణ శాస్త్రి ప్రభృతులు నిర్ణయించి ముద్రించారు. అందుకే........"వ్యాసో వేత్తి శుకో వేత్తి సంజయో వేత్తి రాజా వేత్తి న వేత్తి వా న వా శ్రీధరః సకలం వేత్తి శ్రీనృసింహప్రసాదతః ". అని ఆభాణకం వెలుబడినది. శ్రీధర వ్యాఖ్య గూడా చాలా జటిలం, వంశీధరవ్యాఖ్యయేకాక శ్రీధరీయానికి చాలా వ్యాఖ్యానాలు వెలుబడినవి. అట్టి శ్రీధరస్వామి భావార్థదీపిక సంస్కృత వ్యాఖ్యానానికి తెలుగు అనువాదం పండితులచే వ్రాయించి ప్రచురించాలని శ్రీగురు మదనానంద సరస్వతీ పీఠం సంకల్పించినది. శ్రీధరులు కఠిన పదాలకు మాత్రమే అర్థం వివరించారు. అనువాదం అటులనే చేసిన పాఠకులకు అగమ్యగోచరమగును. కావున శ్రీమద్భాగవతమునకు శ్రీధరవ్యాఖ్యానుసార ఆంధ్రానువాదము ఈ గ్రంథ ధ్యేయము.

డా॥ బ్రహ్మశ్రీ శివునూరి విశ్వనాథశర్మ
పీఠకార్యనిర్వాహక సభ్యులు

## శ్రీ మద్భాగవతం, సవ్యాఖ్యానమ్, చతుర్థస్కంధః

### ప్రథమోఽధ్యాయః

శ్లో॥ మనోస్తు శతరూపాయాం తిస్రః కన్యాశ్చ జజ్ఞిరే ।
ఆకూతిర్దేవహూతిశ్చ ప్రసూతిరితి విశ్రుతాః ॥ 1

టీ:- మనుకన్యాన్వయం విస్తరేణ వక్తుమాహ- మనోరితి. చకారాద్ద్వౌ పుత్రౌ చ. తు తిశబ్దాదన్యతోఽపి పుత్రలాభస్సూచితః. 1

శ్లో॥ ఆకూతిం రుచయే ప్రాదాదపి భ్రాతృమతీం నృపః ।
పుత్రికాధర్మమాశ్రిత్య శతరూపానుమోదితః ॥ 2

టీ:- తద్దర్శయితుమాహ- ఆకూతిమితి. శ్లో. అభ్రాతృకాం ప్రదాస్యామి తుభ్యం కన్యామలంకృతామ్, అస్యాం యో జాయతే పుత్రస్సమే పుత్రోభవిష్యతీతి. భాషాప్రబంధేన కన్యాదానం పుత్రికాధర్మః సచాభ్రాతృకాయాం కన్యాయాం పుత్రార్థీ సఏవ ప్రసిద్ధః. తథాపి పుత్రబాహుళ్య కామః తథా కృతవానిత్యాహ- భ్రాతృమతీమపీతి. 2

శ్లో॥ ప్రజాపతిస్స భగవాన్ రుచిస్తస్యా మజీజనత్ ।
మిథునం బ్రహ్మవర్చస్వీ పరమేణ సమాధినా ॥ 3

## శ్రీమద్భాగవతము, సవ్యాఖ్యానమ్, చతుర్థస్కంధము.

### 1వ అధ్యాయము

**మనువు యొక్క కుమార్తెల చరిత్రను చెప్పుచున్నాడు.**

శతరూపాదేవియందు మనువు ముగ్గురు కుమార్తెలను కన్నాడు. ఆకూతి, దేవహూతి, ప్రసూతియని పేర్లతో వీరు ప్రసిద్ధులు. 'కన్యాశ్చ' అనుచోట చకారము ద్వారా ఇద్దరు కుమారులను గూడా పొందెనని తెలియుచున్నది. 1

శతరూప అంగీకారముతో మనువు అన్నదమ్ములుగల ఆకూతిని పుత్రికా ధర్మమునాశ్రయించి రుచికి ఇచ్చెను. పుత్రికా ధర్మమనగా "అన్నదమ్ములులేని ఈ అలంకృతయైన కన్యను నీకిచ్చుచున్నాను. ఈమెకు కలిగిన పుత్రుడు నాకు పుత్రుడౌగాక యని ఒట్టుపెట్టించుకొని కన్యనీయడం." లేనివారికా పద్ధతి. ఉన్నవారికెందుకు? అనగా ఇద్దరే ఉన్నారు. చాలామంది పుత్రులు కావాలని కోరికతో... 2

ఉత్కృష్ట ఈశ్వర ధ్యానముచే బ్రహ్మవర్చస్వియైన భగవాన్ రుచి ప్రజాపతి, ఆకూతియందు ఒక కుమారుని, ఒక కుమార్తెను కనెను. 3

టీ:- ప్రజాపతిరితి. మిథునం పురుషం స్త్రియం చ పరమేణ సమాధినా ఈశ్వర ధ్యానేన. 3

శ్లో॥ యస్తయోః పురుషస్సాక్షాద్విష్ణుర్యజ్ఞ స్వరూప ధృత్ ।
యాస్త్రీ సాదక్షిణాభూతేరంశ భూతానపాయినీ ॥ 4

వారిద్దరిలో బాలుడు సాక్షాత్తు యజ్ఞస్వరూపుడైన విష్ణు భగవానుడే. ఆ అమ్మాయి అనపాయిని అనగా లవ కాలము గూడా విష్ణు భగవానుడిని విడచి ఉండని లక్ష్మీదేవి అంశయగు దక్షిణా..4

శ్లో॥ ఆనిన్యే స్వగృహం పుత్ర్యాః పుత్రం వితత రోచిషమ్ ।
స్వాయంభువో ముదాయుక్తో రుచేర్జగ్రాహ దక్షిణామ్ ॥ 5

విస్తారమైన కాంతిగలిగిన ఆకూతి కుమారుడైన యజ్ఞుడిని (మనుమడిని) అత్యంత సంతోషముతో స్వాయంభువమనువు తనింటికి తీసుకొచ్చెను. అమ్మాయి దక్షిణను రుచి వద్దనే ఉండెను. 5

టీ:- య ఇతి. భూతేర్లక్ష్మ్యాః అంశభూతః అతస్తయోర్వివాహో న విరుద్ధ ఇతి భావః.(4-5)

శ్లో॥ తాం కామయానాం భగవానువాహ యజుషాం పతిః ।
తుష్టాయాం తోషమాపన్నో ఽజనయద్ద్వాదశాత్మజాన్ ॥ 6

టీ:- తామితి. యజుషాం యజ్ఞానాం మంత్రాణాంవా పతిర్విష్ణుః. (6)

యజ్ఞములకు, యజ్ఞములో ప్రయోగించు మంత్రములకు పతియైన భగవానుడు తనను కోరుచున్న దక్షిణను వివాహము చేసుకొనెను. వీరిద్దరు లక్ష్మీవిష్ణువుల అంశలతో పుట్టినవారు కనుక ఒకే గర్భములో పుట్టినప్పటికి వివాహము విరుద్ధము కాదు. యజ్ఞుడు సంతుష్టాంతరంగుడై, సంతుష్టాంతరంగయైన ఆమె యందు పన్నెండు మంది కుమారులను కనెను. 6

శ్లో॥ తుష్టయోరభవన్ దేవా యామానామ మహాబలాః
తోషః ప్రతోషస్సంతోషో భద్రశ్శాంతిరిడస్పతిః ।
ఇధ్మః కవిర్విభుర్వహ్నిస్సుదేవో రోచనో ద్విషట్ ॥ 7

టీ:- తుష్టయోరితి. ద్విషట్ ద్వాదశ. 7

శ్లో॥ తుషితానామతే దేవా ఆసన్ స్వాయంభువాంతరే ।
మరీచి ముఖ్యా ఋషయో యజ్ఞస్సుర గణేశ్వరః ॥ 8

టీ:- ప్రసంగాత్స్వాయంభువ మన్వంతర గతం షట్కమాహ-ద్వాభ్యాం. తుషితా ఇతి. శ్లో."మన్వంతరే మనుర్దేవా మనుపుత్రా స్సురేశ్వరః, ఋషయోఽంశావతారశ్చ హరేష్షడ్విధముచ్యత" ఇతి. వక్ష్యతి. తత్ర స్వాయంభువో మనుః తుషితా దేవతాః. మరీచి ప్రముఖాస్సప్తఋషయః. యజ్ఞో హరేరవతారః. స ఏవ సురగణేశ్వరః ఇంద్రః. 8

శ్లో॥ ప్రియవ్రతోత్తానపాదౌ మనుపుత్రౌ మహౌజసౌ ।
తత్పుత్ర పౌత్రనప్తౄణామనువృత్తం తదంతరమ్ ॥ 9

వారు తోషుడు, ప్రతోషుడు, సంతోషుడు, భద్రుడు, శాంతుడు, ఇడస్పతి, ఇధ్ముడు, కవి, విభుడు, స్వహ్నుడు, సుదేవుడు, రోచనుడు అను పన్నెండుమంది. 7

స్వాయంభువ మన్వంతరగతషట్కమును గూర్చి తెలుపు-చున్నాడు ప్రతి మన్వంతరమున శ్రీహరి ఆరు రకములుగా ఉంటాడు. 1. మనువు 2. దేవతలు 3. మనుపుత్రులు 4. ఇంద్రుడు 5 ఋషులు 6. అంశావతారము. ఈ మన్వంతరమున, స్వాయంభువుడు మనువు, ఈ పైన చెప్పిన తుషితులే దేవతలు, మరీచి ప్రముఖులు సప్తఋషులు, ఈ యజ్ఞుడే హరి అవతారము, ఇతడే సురగణేశ్వరుడైన ఇంద్రుడు-ఇచ్చట మిశ్ర శబ్దము ప్రముఖార్థములో ప్రయోగింపబడినది. ఇంద్రుడిగా, యజ్ఞుడిగా రెండు రూపాలు గలిగి షట్ ప్రకారములు హరికి... 8

మహాప్రభావశాలులైన ప్రియవ్రత ఉత్తానపాదులు స్వాయంభువమను పుత్రులు వారి వంశము కుమారులు, మనుమళ్ళు, మునిమనుమళ్ళచే వ్యాప్తిచెందినది. అనంతరము. 9

టీ:- ప్రియవ్రతేతి. ప్రియవ్రతోత్తానపాదౌ మనుపుత్రౌ పృథివీ పాలకౌ. తదేవం యజ్ఞస్య ద్వైరూప్యేణ షడ్విధత్వం. తయోః పుత్రపౌత్ర నప్తౄణాం వంశైః అనువృత్తం వ్యాప్తం. పాలితం తన్మన్వంతరం. 9

శ్లో॥ దేవహూతిమదాత్తాతః కర్దమాయాత్మ జాం మనుః ।
తత్సంబంధి శ్రుత ప్రాయం భవతా గదతో మమ ॥ 10

నాయనా, విదురా! కర్దముడికి దేవహూతినిచ్చి వివాహము చేయడం మొదలగునవి నీవు చాలామార్లు వినే ఉంటావు. వారి మిగిలిన కన్యల విషయము నేను చెప్పగా వినకపోవడం భావ్యము కాదు కనుక వివరిస్తున్నాను. (వినకపోవడం వలన వివరిస్తున్నానుటనే ప్రాయగ్రహణం అంటారు) 10

శ్లో॥ దక్షాయ బ్రహ్మపుత్రాయ ప్రసూతిం భగవాన్మనుః ।
ప్రాయచ్ఛద్యత్కృతస్సర్గస్త్రిలోక్యాం వితతో మహాన్ ॥ 11

టీ:- దేవహూతిమితి. శ్రుతప్రాయం బాహుళ్యేన శ్రుతం తత్కన్యా వంశానామ శ్రుతత్వాత్ప్రాయ గ్రహణం. (10-11)

మనువు, బ్రహ్మపుత్రుడైన దక్షునకు ప్రసూతినిచ్చి వివాహము చేసినాడు. వీరి సంతానమే మూడు లోకాలలో వ్యాప్తి చెందినది. 11

శ్లో॥ యాః కర్దమ సుతాః ప్రోక్తా ఆసన్ బ్రహ్మర్షి పత్నయః ।
తాసాం ప్రసూతి ప్రసవం ప్రోచ్యమానం నిబోధ మే ॥ 12

టీ:- యా ఇతి. ప్రసూతి ప్రసవం పుత్రపౌత్రాదిభిర్విస్తారం. 12

కర్దమప్రజాపతి కుమార్తెలే తొమ్మిదిమంది బ్రహ్మర్షుల భార్యలు. వారి పుత్ర పౌత్రాది వంశ విస్తారమును గూర్చి తెలియజేస్తున్నాను. 12

శ్లో॥ పత్నీ మరీచేస్తు కళా సుషువే కర్దమాత్మజా ।
కశ్యపం పూర్ణిమానం చ యయోరాపూరితం జగత్ ॥ 13

టీ:- పత్నీతి. యయోర్వంశేనాపూరితం. కశ్యపస్యవంశం షష్ఠే వక్ష్యతి. (13)

కర్దముని కుమార్తె కలా మరీచిమహర్షి ధర్మపత్ని. వీరికి కశ్యపుడు, పూర్ణిమానుడను కుమారులు కలిగిరి. వీరిద్దరి వంశముచేతనే జగత్తు నిండినది. కశ్యపుడి వంశవిస్తారము షష్ఠస్కంధములో చెప్పబడును. 13

శ్లో॥ పూర్ణిమాऽసూత విరజం విశ్వగం చ పరంతప ।
దేవకుల్యాం హరేః పాదశౌచాద్యాభూత్సరిద్దివః ॥ 14

టీ:- ద్వితీయస్య వంశమాహ- పూర్ణిమేతి. దేవకుల్యాం నామ కన్యాం చ. శ్రీహరేః పాదప్రక్షాళణాత్. యా జన్మాంతరే దివస్సరిత్. గంగా అభూత్ తాం . 14

రెండవవాడైన పూర్ణిమునికి విరజుడు, విశ్వగుడు అను కుమారులు. శ్రీహరి పాదప్రక్షాళనము వలన జన్మాంతరమున, దేవ లోకమున, స్వర్గ గంగయైనట్టి దేవకుల్యా అను పేరు గల్గిన కన్య కలిగిరి. 14

శ్లో॥ అత్రేః పత్న్యనసూయా త్రీన్ సుషువే సుయశస్సుతాన్ ।
దత్తం దూర్వాససం సోమమాత్మేశ బ్రహ్మసంభవాన్ ॥ 15

టీ:- అత్రేరితి. ఆత్మేశ బ్రహ్మ సంభవాన్ విష్ణు రుద్ర బ్రహ్మణామంశై స్సంభవానుత్పన్నాన్. 15

అత్రి పత్ని అనసూయ. వీరికి విష్ణు, రుద్ర, బ్రహ్మాంశలతో యశోవంతులగు దత్తుడు, దుర్వాసుడు, చంద్రుడు అను పుత్రులు జన్మించిరి. 15

విదుర ఉవాచ

శ్లో॥ అత్రేర్గృహే సురశ్రేష్ఠాః స్థిత్యుత్పత్త్యంతహేతవః ।
కింస్విచ్చికీర్షవో జాతా ఏతదాఖ్యాహి మే గురో ॥ 16

టీ:- అత్రేరితి. కింస్విత్కించిత్కర్తుమిచ్ఛ న ఇతి వా. 16

విదురుడు అడుగుచున్నాడు.

సృష్టి, స్థితి, లయ కారకులైన దేవతా శ్రేష్ఠులు ఏమి చేయాలని ఇచ్ఛగలవారై అత్రి గృహములో జన్మించినారు? 16

మైత్రేయ ఉవాచ

శ్లో॥ బ్రహ్మణా చోదితస్సృష్టావత్రిర్బ్రహ్మ విదాం వరః ।
సహపత్న్యా యయావృక్షం కులాద్రిం తపసి స్థితః ॥ 17

టీ:- బ్రహ్మణేతి. ఋక్షం నామ కులాద్రిం తపసి స్థితస్సన్. 17

మైత్రేయుడిట్లు చెప్పచున్నాడు.

బ్రహ్మవిదులలో శ్రేష్ఠుడైన అత్రి, బ్రహ్మచే ప్రేరితుడై సృష్టి చేయడానికి అనసూయా సహితుడై ఋక్షమనే పర్వతముపైన తపస్సు చేసెను. 17

శ్లో॥ తస్మిన్ప్రసూన స్తబక పలాశాశోకకాననే ।
వార్భిస్స్రవద్భిరుద్ఘుష్టే నిర్వింధ్యాయాస్సమంతతః ॥ 18

శ్లో॥ ప్రాణాయామేన సంయమ్య మనోవర్షశతం మునిః ।
అతిష్ఠదేకపాదేన నిర్ద్వంద్వోఽనిల భోజనః ॥ 19

అడవులలో మోదుగ, అశోక వృక్షములు పూలగుత్తులతో నిండి, నిర్వింధ్యానదీ జలములు స్రవించుచుండగా ప్రవాహ శబ్దము అంతట నిండిన ఆ పర్వతముయందు ప్రాణాయామముచే మనస్సును నియంత్రించి నూరు సంవత్సరములు అత్రిమహర్షి శీతోష్ణ సుఖ దుఃఖములకు అతీతుడై ఒంటి కాలిపై నిలిచి తపస్సు చేసెను. 18,19

శ్లో॥ శరణంతం ప్రపద్యేఽహం య ఏవ జగదీశ్వరః ।
ప్రజామాత్మ సమాం మహ్యం ప్రయచ్ఛత్వితి చింతయన్॥20

ఈ జగత్తునకు ఎవడు ఈశ్వరుడో అతడిని శరణువేడుచున్నాను నాకు అతడితో సమానుడైన పుత్రుడిని ప్రసాదించుగాక అని ధ్యానిస్తు (తపమాచరించుచుండెను) 20

టీ:- తస్మిన్నితి. స చ తస్మిన్ కులాద్రౌ ప్రసూనానాం స్తబకాయేషు పలాశాశోకేషు తేషాం కాననే. నిర్వింధ్యానామ నదీ తస్యాః ప్రవద్భి ర్వార్భిః. ఉద్ఘుష్టే నాదితే. (18-20)

శ్లో॥ తప్యమానం త్రిభువనం ప్రాణాయామైధసాగ్నినా ।
నిర్గతేన మునేర్మూర్ధ్నస్సమీక్ష్య ప్రభవస్త్రయః ॥ 21

ప్రాణాయామమే ఇంధనములుగా కలిగిన ముని శిరస్సు నుండి బయల్వెడిన అగ్నిచేత తపించుచున్న మూడు లోకములను చూచి ప్రభువులైన త్రిమూర్తులు... 21

టీ:- తప్యమానమితి. ప్రాణాయామ ఏవ ఏధః సందీపకో యస్య తేన. మునేర్మూర్ధ్నో నిర్గతేన అగ్నినా. తప్యమానం సమీక్ష్య తదాశ్రమ పదం యయురిత్యన్వయః. 21

శ్లో॥ అప్సరో ముని గంధర్వ సిద్ధ విద్యాధరోరగైః ।
వితాయమాన యశసస్తదాశ్రమపదం యయుః ॥ 22

అప్సర, గంధర్వ, సిద్ధ, విద్యాధర, నాగముని గణములు విపులమైన ఆతని కీర్తిని గానము చేయుచు ఆ అత్రి మహర్షి ఆశ్రమ స్థానమునకు వచ్చిరి. 22

టీ:- అప్సర ఇతి. అప్సరః ప్రముఖైర్వితాయమానం విస్తార్యమాణం యశో యేషాం తే. 22

శ్లో॥ తత్ప్రాదుర్భావ సంయోగ విద్యోతితమనా మునిః ।
ఉత్తిష్ఠన్నేకపాదేన దదర్శ విబుధర్షభాన్ ॥ 23

టీ:- తదితి. తేషాం ప్రాదుర్భావః. ప్రాక్కృతస్య సంయోగస్సన్నిధిః తేన విద్యోతితం మనో యస్య ఉత్తిష్ఠన్ ఉత్కర్షేణ తిష్ఠన్. 23

ఒంటి కాలితో నిల్చున్న మహర్షి, వారి ప్రాదుర్భావ సాన్నిధ్యము వల్ల ప్రకాశవంతమైన మనస్సు కలిగిన దేవతాశ్రేష్ఠులైన త్రిమూర్తులను దర్శించెను. 23

శ్లో॥ ప్రణమ్య దండవద్భూమావుపతస్థేఽర్హణాంజలిః ।
వృషహంస సుపర్ణస్థాన్ స్వైస్స్వైశ్చిహ్నైశ్చ చిహ్నితాన్ ॥24

టీ:- ప్రణమ్యేతి. అర్హణం పుష్పాదికం అంజలౌ యస్య సః. ఉపతస్థే పూజయామాస. వృషాద్యారూఢాన్ స్వైఃస్వైః చిహ్నైః త్రిశూల కమండలు చక్రాదిభిః. 24

వృషవాహన, హంసవాహన, గరుడవాహనులై త్రిశూల, కమండలు, చక్రాద్యాయుధములు ధరించిన త్రిమూర్తులకు దీర్ఘ ప్రణామముచేసి, కమలములు మొదలగు అర్హములైన పుష్పములు సమర్పించి అంజలి ఘటించెను. 24

శ్లో॥ కృపావలోకన హసద్వదనే నోపలంభితాన్ ।
తద్రోచిషా ప్రతిహతే నిమీల్య ముని రక్షిణీ ॥ 25

టీ:- కృపేతి. కృపయా అవలోకనం యస్మిన్ హసచ్చ తద్వదనం చ తేన ఉపలంభితాన్ ప్రసన్నత్వేన జ్ఞాపితాన్. తేషాం రోచిషా దీప్త్యా. 25

ఆ మహర్షి ప్రసన్నవదనారవిందులై, కృపావలోకనులైన త్రిమూర్తుల దివ్యకాంతిని తట్టుకోలేక కన్నులు తెరచి చూడలేకపోచెను. (25)

శ్లో॥ చేతస్తత్ప్రవణం యుంజన్నస్తావీత్సంహతాంజలిః ।
శ్లక్ష్ణయా సూక్తయా వాచా సర్వలోక గరీయ సః ॥ 26

టీ:- చేత ఇతి. శ్లక్ష్ణయా మధురయా. సూక్తయా గంభీరార్థయా. 26

మనస్సును వారిపై నిలిపి, ఏకాగ్రత కలవాడై, చేతులొగ్గి మధుర గాంభీర్యార్థ యుక్తమైన వాక్కులచే ఆ సర్వలోక శ్రేష్ఠులను స్తుతించెను. (26)

**అత్రిరువాచ**

శ్లో॥ విశ్వోద్భవ స్థితి లయేషు విభజ్యమానైర్మాయా
గుణైరనుయుగం విగృహీత దేహాః ।
తే బ్రహ్మ విష్ణు గిరిశాః ప్రణతోఽస్మ్యహం
వస్తేభ్యః క ఏవ భగవాన్మ ఇహోపహూతః ॥ 27

టీ:- విశ్వేతి. అనుయుగం కల్పే కల్పే. విభజ్య గృహితో దేహో యైస్తే ప్రసిద్ధాః. బ్రహ్మ విష్ణు గిరిశాః యూయం. వః యుష్మాన్ ప్రణతోఽస్మి. తేభ్యస్సకాశాత్ క ఏవ. మే మయా ఉపహూతః శరణం తం ప్రపద్యేఽహమిత్యేకస్యైవ నిర్దిష్టత్వాత్స చ యుష్మాసు క ఇతి యుష్మాభిరేవ కథ్యతామిత్యర్థః. 27

**అత్రిమహర్షి అనుచున్నాడు.**

ప్రతి కల్పముయందు జగత్తు సృష్టి, స్థితి, లయములను కలిగించుటకు మాయా గుణములచే విభాగింపబడిన బ్రహ్మ, విష్ణు, రుద్ర దేహములుగల త్రిమూర్తులారా! మీకు నమస్కారము. నాకు నీవే శరణమని, నన్ను కాపాడమని, నేను ఒక్కరినే ఇచ్చుటకు పిలిచితిని. మీలో ఆ ఒక్కరెవరు? అది మీరే తెలపండి. 27

శ్లో॥ ఏకో మయేహ భగవాన్విబుధప్రధాన
శ్చిత్తీకృతః ప్రజాననాయ కథంను యూయమ్ ।
అత్రాగతాస్తనుభృతాం మనసోఽపి దూరా
ద్బ్రూత ప్రసీదత మహానిహ విస్మయో మే ॥ 28

నాకు సంతానము కావాలని నా హృదయమున ఒక్కడినే (భగవంతుడిని) వివిధోపచారములచే పూజించితిని. మానవ దేహధారుల మనస్సుకు కూడా అందని దూరంలో ఉండే మీరు నాకు ఇంత కరుణతో ప్రసన్నులైతిరి, కారణమేమో చెప్పండి. నాకు విస్మయం కలుగుచున్నది. 28

టీ:- ఏక ఇతి. అస్య ప్రపంచః వివిధైః ప్రధానైరుపచారైః.విబుధ ప్రధాన ఇతి వా పాఠః. ప్రజననాయ పుత్రోత్పత్త్యై చిత్తీకృతః చిత్తైనైక్యం నీతః మనసోఽపి దూరాః అగోచరాస్సంతః కథంను త్రయోఽప్యత్రా గతాః. 28,29

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఇతి తస్య వచశ్రుత్వా త్రయస్తే విబుధర్షభాః ।
ప్రత్యాహుః శ్లక్ష్ణయా వాచా ప్రహస్య తమృషిం ప్రభో ॥ 29

మైత్రేయుడు ఇట్లు చెప్పెను.

ఓ సమర్థుడవైన, ఋషితుల్యుడవైన విదురా! ఈ విధమైన అత్రిమహర్షి మాటలు విని, ఆ త్రిమూర్తులు నవ్వి మధురమైన వాక్కులతో ఆయనను గూర్చి ఇట్లనిరి. 29

దేవా ఊచుః

శ్లో॥ యథా కృతస్తే సంకల్పోభావ్యం తేనైవ నాఽన్యథా ।
సత్సంకల్పస్య తే బ్రహ్మన్ యద్వై ధ్యాయతి తద్వయమ్॥30

టీ:- యథా కృత ఇతి. తే త్వయా యథా కృత స్సంకల్పః తేన తథైవ భావ్యం నాన్యథా. యతస్సత్సంకల్పస్య తే తవ సంకల్పః.తర్హి కథమేకస్మిన్ ధ్యాయమానే త్రయః ప్రతీతాః స్థ? తత్రాహుః -యదేకం జగదీశ్వరాఖ్యం తత్త్వం భవాన్ ధ్యాయతి. త ఏతే వయం త్రయోపి హి. తదేవైకం తత్త్వం నాస్మాకం భేదోఽస్తీత్యర్థః. 30

దేవతలు ఇట్లు చెప్పినారు.

బ్రహ్మర్షీ! నీవు ఏ విధముగా సంకల్పించినావో అది అట్లా జరుగవలసినదే. వేరు మాదిరిగా జరగడానికి వీలులేదు. నీ సత్స సంకల్పమట్టిది. నీవు ధ్యానించినది మమ్మే. ముగ్గురిగా వచ్చిన మేము ఒక స్వరూపమే. (కించిత్ వివరణ:- అథాతోబ్రహ్మజిజ్ఞాసా అని బ్రహ్మ విచారణ చేయాలి. ఆ బ్రహ్మ ఎట్టిది. అన్నప్పుడు మొదట తటస్థ లక్షణాత్మకమైన బ్రహ్మ ప్రతిపాదనచేసినారు. జన్మాద్యస్య యతః యని అనగా జన్మ స్థితి భంగములు ఎవరి నుండి జరుగుచున్నవో అది బ్రహ్మ. అనగా కేవలం జన్మకర్తృత్వంగాని, కేవల పరిపాలనకర్తృత్వం

గాని, కేవల సంహార కర్తృత్వంగాని జగదీశ్వరత్వలక్షణం కాదు. మూడు కలిగినప్పుడే జగదీశ్వరత్వం. ఇచ్చట ఈ ముగ్గురు కలసినప్పుడే అనుగ్రహించినప్పుడే జగదీశ్వరానుగ్రహం) 30

శ్లో॥ అథాస్మదంశభూతాస్తే ఆత్మజా లోక విశ్రుతాః ।
భవితారోఽంగ భద్రంతే విస్రప్స్యంతి చ తే యశః ॥ 31

ఆ కారణముగా మా అంశసంభూతులు, లోకప్రసిద్ధులైన కుమారులు పుడతారు. నీ కీర్తిని నాలుగుదిక్కుల వ్యాపింపజేస్తారు. 31

టీ:- అథేతి. విస్రప్స్యంతి విస్తారయిష్యంతి అంతర్భూతణిజర్థస్య సృప్గతా విత్యస్య రూపం. 31

శ్లో॥ ఏవం కామవరం దత్వా ప్రతిజగ్ముస్సురేశ్వరాః ।
సభాజితా స్తయోస్సమ్యగ్దంపత్యోర్మిషతో స్తతః ॥ 32

ఈ విధముగా ఆ దంపతులకు కోరిన వరములిచ్చి, వారిచే పూజింపబడి, రెప్పవాల్చక చూచుచుండగనే అక్కడి నుండి వెడలిరి. 32

టీ:- ఏవమితి. తాభ్యాం సమ్యక్సభాజితాః పూజితాస్సంతః. తతః తదాశ్రమాత్ ప్రతిజగ్ముః. 32

శ్లో॥ సోమోఽభూద్బ్రహ్మణోఽంశేన దత్తో విష్ణోస్తు యోగవిత్ ।
దుర్వాసాశ్శంకరస్యాంశో నిబోధాంగిరసః ॥ 33

టీ:- సోమ ఇతి. నిబోధ బుధ్యస్వ. 33

బ్రహ్మాంశచేత చంద్రుడు, విష్ణ్వంశచేత యోగవిదుడగు దత్తుడు, శంకరాంశచేత దుర్వాసుడు జన్మించిరి. తరువాత బ్రహ్మదేవుని మూడవ కుమారుడైన అంగిరసుడి సంతానమును గూర్చి తెలుపుతున్నాను. 33

శ్లో॥ శ్రద్ధాత్వంగిరసఃపత్నీ చతస్రోసూత కన్యకాః ।
సినీవాలీ కుహూరాకా చతుర్థ్యనుమతి స్తథా ॥ 34

శ్లో॥ తత్పుత్రావపరావాస్తాం ఖ్యాతౌ స్వారోచిషాంతరే ।
ఉచథ్యో భగవాన్ సాక్షాద్బ్రహ్మిష్ఠశ్చ బృహస్పతిః ॥ 35

టీ:- తాః కన్యకా నిర్దిశతి.- సినీత్యాదినా.(34-35)

శ్లో॥ పులస్త్యోఽజనయత్పత్న్యామగస్త్యం చ హవిర్భుజి ।
సోఽన్య జన్మని దహ్రాగ్నిర్విశ్రవాశ్చ మహాతపాః ॥ 36

టీ:- పులస్త్య ఇతి. పులస్త్యః హవిర్భుజపత్న్యామిత్యన్వయః. సః అగస్త్యః దహ్రాగ్నిః జాఠరాగ్నిః. విశ్రవాశ్చ పులస్త్యస్య సుత ఇతి శేషః. 36

శ్లో॥ తస్య యక్షపతిర్దేవః కుబేరస్త్విళ బిలాసుతః ।
రావణః కుంభకర్ణశ్చ తథాన్యస్యాం విభీషణః ॥ 37

అంగిరసుడు శ్రద్ధ అనే పత్నియందు సినీవాలి, కుహూ, రాకా, అనుమతి అను నలుగురు కుమార్తెలను కనెను. . 34

ఈ నలుగురు కన్యలేకాక స్వారోచిష మన్వంతరములో ప్రసిద్ధులైన ఇద్దరు కుమారులు కూడా ఉండిరి. ఒకరు సాక్షాత్తు భగవంతుడు, బ్రహ్మిష్ఠుడైన ఉతథ్యుడు మరియు బ్రహ్మనిష్ఠుడైన బృహస్పతి. 35

పులస్త్యుడు, హవిర్భువి యందు ఇద్దరు కుమారులగనెను. ఒకడు అగస్త్యుడు, రెండవవాడు గొప్ప తపశ్శాలి అయిన విశ్రవసుడు. ఈ అగస్త్యుడే మరుజన్మయందు జఠరాగ్ని అయ్యెను. 36

ఆ విశ్రవసుడు ఇలబిలాయను పత్నియందు యక్షపతియైన కుబేరుని, కైకసియను భార్యయందు రావణ, కుంభకర్ణులు మరియు విభీషణులను కనెను. కించిత్ సజ్జనుల పేరు దుర్జనుల క్రమమున స్మరించుటకు కూడా ఇష్టపడని వ్యాసుల వారు శ్లోకమున వ్యవధానముతో చెప్పిరి. 37

శ్లో॥ పులహస్యగతిర్భార్యా త్రీన సూత సతీసుతాన్ ।
కర్మశ్రేష్ఠం వరీయాంసం సహిష్ణుం చ మహామతేః ॥ 38

టీ:- తస్యేతి. తస్య విశ్రవసః ఇలబిలాయాం జాతస్సుతః కుబేరః అన్యస్యాం భార్యాయాం కైకస్యాం రావణాదయః త్రయోజాతాః సుతాః (37-38)

పులస్త్యుడు గతియను తన భార్యయందు ముగ్గురు కుమారులను కనెను. కర్మశ్రేష్ఠుడు, వరీయాంసుడు, సహిష్ణువను వారు. 38

శ్లో॥ క్రతోరపి క్రియాభార్యా వాలఖిల్యానసూయత ।
ఋషీన్ షష్టిసహస్రాణి జ్వలతో బ్రహ్మతేజసా ॥ 39

టీ:- క్రతోరితి. జ్వలతః ప్రకాశమానాన్. 39

(మరియు) క్రతువు క్రియాయను యామె యందు బ్రహ్మ తేజస్సుచే ప్రకాశమానులైన అరవైవేలమంది వాలఖిల్య మహర్షులను కనెను. 39

శ్లో॥ ఊర్జాయాం జజ్ఞిరే పుత్రా వసిష్ఠస్య పరంతప ।
చిత్రకేతుప్రధానాస్తే సప్తబ్రహ్మర్షయోఽమలాః ॥ 40

టీ:- ఊర్జాయామితి. చిత్రకేతు ప్రముఖాః జజ్ఞిరే. తే చ సప్తర్షయో జాతాః. 40

అంతఃశత్రువులను తపింపజేసే విదురా! వసిష్ఠుడికి ఊర్జయందు (అరుంధతి) చిత్రకేతు ప్రముఖులు పుట్టిరి. వీరే బ్రహ్మర్షులు, దోష రహితులైన సప్తఋషులైరి. 40

శ్లో॥ చిత్రకేతుస్సురోచిశ్చ విరజా మిత్ర ఏవ చ ।
ఉల్బణో వసుభృ ద్యానో ద్యుమాన్ శక్త్యాదయో పరే ॥ 41

టీ:- తానేవాహ - చిత్రకేతురితి. వసుభృద్యానో నామ ఏకః. శక్త్యాదయో పరే అన్యస్యాః పుత్రాః.(41-42)

వారి పేర్లు చిత్రకేతువు, సురోచి, విరసుడు, మిత్రుడు, ఉల్బణుడు, వసుభృద్యానుడు, ద్యుమంతుడు. వీరే కాక మరియొక భార్య యందు శక్త్యాదులను కనెను. 41

శ్లో॥ చిత్తిస్త్వథర్వణః పత్నీ లేభే పుత్రం ధృతవతమ్ ।
దధ్యంచమశ్వశిరసం భృగోర్వంశం నిబోధ మే ॥ 42

అథర్వణుడు చిత్తియను భార్యయందు గొప్పవ్రతనిష్ఠగల దధీచి అను కుమారుడిని కనెను. అతడికే అశ్వశిరుడను పేరు కూడా కలదు. తదుపరి భృగువంశమును చెప్పుచున్నాను వినుము. 42

శ్లో॥ భృగుః ఖ్యాత్యాం మహాభాగః పత్న్యాం పుత్రానజీజనత్ ।
ధాతారం చ విధాతారం శ్రియం చ భగవత్పరామ్ ॥ 43

టీ:- భృగురితి. ఖ్యాత్యాం పత్న్యాం పుత్రాన్ పుత్రౌ పుత్రీం చ తానేవాహ- ధాతారమితి. 43

ఓ మహాత్మా! భృగువు ఖ్యాతియందు ధాతా, విధాతా యను ఇద్దరు కుమారులను, భగవదంకితమైన శ్రీయ అను ఒక కుమార్తెను కనెను. 43

శ్లో॥ ఆయతిం నియతిం చైవ సుతే మేరు స్తయోరదాత్ ।
తాభ్యాం తయోరభవతాం మృకండః ప్రాణ ఏవ చ ॥ 44

టీ:- ఆయతిమితి. తయోః ధాతృ విధాత్రోః. 44

ధాతృ విధాతృవులకు మేరువు తన కుమార్తెలైన ఆయతి, నియతిలనిచ్చి వివాహము చేసెను. వారికి మృకండుడు, ప్రాణుడను కుమారులు కలిగిరి. 44

శ్లో॥ మార్కండేయో మృకండస్య ప్రాణాద్వేదశిరా మునిః ।
కవిశ్చ భార్గవో యస్య భగవానుశనాసుతః ॥ 45

మృకండునకు మార్కండేయుడు, ప్రాణునకు వేదశిరుడు. భృగువునకు కవి అను కుమారులు కలిగిరి. కవి కుమారుడే భగవాన్ ఉషనుడు. ఈతడే శుక్రాచార్యుడు. 45

శ్లో॥ నవైతే మునయః క్షత్తర్లోకాన్ సర్గైర భావయన్ ।
ఏష కర్దమ దౌహిత్ర సంతానః కథితస్తవ ॥ 46

ఓ విదురా! ఈ మునులు వారి సృష్టిచేత ఈ మూడు లోకములను నింపివేసిరి, ఇంతవరకు కర్దమప్రజాపతి సంతానమును గూర్చి నీకు చెప్పినాను. 46

టీ:- మార్కండేయ ఇతి. కవిశ్చ భార్గవః భృగోః పుత్రః. (45-46)

శ్లో॥ శృణ్వత శ్శ్రద్దధానస్య సద్యః పాపహరః పరః ।
ప్రసూతిం మానవీం దక్ష ఉపయే మే హ్యజాత్మజః ॥ 47

**ఈ వృత్తాంతమును శ్రద్ధగా విన్న వారికి సమస్త పాపములు వెంటనే తొలగిపోవును.** బ్రహ్మపుత్రుడైన దక్షుడు, మనుకుమార్తెయైన ప్రసూతిని వివాహమాడెను. 47

శ్లో॥ తస్యాం ససర్జ దుహితౄఃషోడశామల లోచనాః ।
త్రయోదశా దాద్ధర్మాయతథైకామగ్నయే విభుః ॥ 48

దక్షుడు ప్రసూతియందు పదహారుమంది సుందరీమణులను కని పదమూడు మందిని ధర్మునకు-ఒకరిని అగ్నికి...48

టీ:- శృణ్వత ఇతి. అజాత్మజః బ్రహ్మపుత్రః. (47-48)

శ్లో॥ పితృభ్య ఏకాం యుక్తేభ్యో భవాయైకాం భవచ్ఛిదే ।
శ్రద్ధామైత్రీ దయా శాంతిస్తుష్టిః పుష్టిః క్రియోన్నతిః ॥ 49

నిగ్రహముగల పితురులకు ఒకర్తెను. సంసారచ్ఛేదకుడైన భవునకు ఒకామెను ఇచ్చి వివాహము చేసెను. 49

శ్లో॥ బుద్ధిర్మేధా తితిక్షా హ్రీర్మూర్తిర్ధర్మస్య పత్నయః ।
శ్రద్ధాసూత శ్రుతం మైత్రీ ప్రసాదమభయం దయా ॥ 50

శ్లో॥ శాంతిస్సుఖం ముదం తుష్టిస్స్మయం పుష్టిరసూయత ।
యోగం క్రియోన్నతిర్దర్పమర్థం బుద్ధిరసూయత ॥ 51

టీ:- పితృభ్య ఇతి. యుక్తేభ్యస్సంయుక్తేభ్య సంయుతేభ్యః మిళితేభ్యో వా. (49-51)

శ్లో॥ మేధాస్మృతిం తితిక్షా చ క్షేమం హ్రీః ప్రశ్రయం తథా ।
మూర్తిస్సర్వగుణోత్పత్తీ నరనారాయణవృషీ ॥ 52

టీ:- మేధేతి. సర్వేషాం గుణానాముత్పత్తిర్యయోస్తౌ. (52-54)

శ్రద్ధ, మైత్రి, దయా, శాంతి, తుష్టి, పుష్టి, క్రియ, బుద్ధి, మేధా, తితిక్ష, హ్రీ, మూర్తి వీరంతా ధర్ముడి పత్నులు.

శ్రద్ధా కుమారుడు శుభుడు.

మైత్రీ కుమారుడు ప్రసాదుడు.

దయా కుమారుడు అభయుడు. 50

శాంతి కుమారుడు సుఖుడు.

తుష్టి కుమారుడు ముదముడు.

పుష్టి కుమారుడు స్మయుడు.

క్రియా కుమారుడు యోగుడు.

ఉన్నతి కుమారుడు దర్పుడు.

బుద్ధి కుమారుడు అర్థుడు. 51

మేధా కుమారుడు స్మృతి.

తితిక్ష కుమారుడు క్షేమము.

హ్రీ కుమారుడు ప్రశ్రయుడు.

మూర్తి కుమారులు నర, నారాయణులు. 52

శ్లో॥ యయోర్జన్మన్యదో విశ్వమభ్యనందత్సు నిర్వృతమ్ ।
మనాంసి కకుభో వాతాః ప్రసేదుస్సరితోఽద్రయః ॥ 53

(ఏ) నరనారాయణుల జన్మచే ఈ విశ్వమంత నిజమైన సుఖానుభవముచేత ఆనందము పొందినది (నదో) మనస్సులు ప్రశాంతిని చెందినవి. దిక్కులు ప్రసన్నమైనవి. చక్కటి గాడ్పులు వీచినవి. నదులు చక్కగా ప్రవహించినవి. పర్వతములు పుష్ప, వృక్ష సంపదకలిగి ప్రసన్నమైనవి. 53

శ్లో॥ దివ్యవాద్యంతతూర్యాణి పేతుః కుసుమవృష్టయః ।
మునయస్తుష్టువుస్తుష్టా జగుర్గంధర్వ కిన్నరాః ॥ 54

ఆకాశమున బాజాలు మ్రోగినవి. పుష్పవృక్షాలు పూలు కురిపించినవి. మునులు ప్రసన్నులై స్తోత్రముచేసిరి. గంధర్వకిన్నరులు గానము చేసిరి. 54

శ్లో॥ నృత్యంతి స్మ స్త్రియో దివ్యా ఆసీత్పరమమంగళమ్ ।
దేవా బ్రహ్మాదయస్సర్వ ఉపతస్థురభిష్టవైః ॥ 55

టీ:- నృత్యంతీతి. ఉపతస్థుః భేజుః. 55

దేవతాస్త్రీలు నాట్యమాడిరి. బ్రహ్మాదిదేవతలు ఇష్టమైన స్తోత్రములు చేసిరి. జగమంతా పరమమంగళమాయెను. 55

దేవా ఊచుః

శ్లో॥ యో మాయయా విరచితం నిజయాత్మనీదం
ఖే రూప భేదమివతత్ప్రతిచ క్షణాయ ।
ఏతేన ధర్మసదనే ఋషిమూర్తినాద్య ప్రాదుశ్చ
కార పురుషాయ నమః పరస్మై ॥ 56

**దేవతలు ఈ విధముగా స్తోత్రముచేసిరి.**

ఆకాశములో తనదైన నిజమాయాశక్తిచేత శుద్ధ ఆత్మయందు మాయావి గంధర్వ నగరాదులు సృష్టించినట్టు ఈ విశ్వమును సృజించెను. ఈ మాయాప్రపంచ నిర్మాణమునకు కారణమైన ఆత్మను ప్రకాశింపచేయుటకు ఆ ఆత్మ ధర్మమునకు అవసరమైన జ్ఞాన బోధ

టీ:- య ఇతి. నిజయా మాయయా. యస్మిన్నాత్మని. ఖే గగనే. రూపభేదం గంధర్వనగరమివ. ఇదం విశ్వం విరచితం. తస్యాత్మనః ప్రతిచక్షణాయ ప్రకాశనాయ. ఆత్మానం యోఽద్య ప్రాదుశ్చకార ప్రకటీకృతవాన్. తస్మై పురుషాయనమః. కేన రూపేణ ప్రాదుశ్చకార. ఋషేర్మూర్తిరాకారో యస్మిన్ తేన రూపేణ. 56

చేయడానికి ధర్ముని గృహమున ఋషి రూపమున తనను తాను ప్రకటింపచేసుకున్నట్టి ప్రకృతికి అతీతుడైన పరమపురుషునకు నమస్కారము. 56

శ్లో॥ సోఽయం స్థితివ్యతికరోపశమాయ సృష్టాన్
సత్వేన నస్సురగణానుమేయతత్త్వః ।
దృశ్యాదదభ్రకరుణేన విలోకనేన యచ్ఛ్రీ
నికేతమమలం క్షిపతార విందమ్ ॥ 57

ఆ పరమాత్మ ఈ జగత్తు స్థితికి ప్రతిబంధకములైన వాటిని శమింపచేయుటకు సత్త్వగుణ ప్రధానులైన మమ్ము (దేవతలను) సృజించెను. ఆ పరమాత్మతత్త్వము ద్వారా మాత్రమే తెలియువాడు. అమంగళప్రదమైన సుందరమైన తామరకమలముల కాంతినీ తిరస్కరించెడు చూపులుగల పరమాత్మ తన మిక్కిలి కరుణాపూరితమైన చూపులచే మమ్ము చూచుగాక! 57

టీ:- స ఇతి. సోఽయం నోఽస్మాన్ సురగణాన్. అనల్ప కరుణా యుక్తేన విలోకనేన విశిష్టనేత్రేణ. దృశ్యాత్. పశ్యతు. కథంభూతేన. యచ్ఛ్రీ నికేతనమమలమరవిందం తత్. క్షిపతా తిరస్కుర్వతా. కథం భూతః. అను మేయం శాస్త్రతో వేద్యం న త్వస్మాకమపరోక్షం తత్త్వం యస్య. కథం భూతానస్మాన్. స్థితేర్జగన్మర్యాదాయాః. వ్యతికరః. అన్యథా త్వం తస్యోప శమాయ. సత్త్వేన గుణేన సృష్టాన్. 57

శ్లో॥ ఏవంసురగణైస్తాత భగవతావభిష్టుతౌ ।
లబ్ధావలోకైర్యయతురర్చితౌ గంధమాదనమ్ ॥ 58

టీ:- ఏవమితి. లబ్ధః అవలోకో యైస్సురగణైః. తైరభిష్టుతావర్చితౌ చ సంతౌ. యయతుః. 58

నాయనా విదురా! ఈ విధముగా దేవతాగణములచే స్తుతింపబడి ఆ దేవతలచే అర్చితులై నరనారాయణులు గంధమాధన పర్వతమునకు వెళ్ళిరి. 58

శ్లో॥ తావిమౌ వై భగవతో హరేరంశావిహాగతౌ ।
భారవ్యయాయ చ భువః కృష్ణౌ యదుకురూద్వహౌ ॥ 59

టీ:- తావితి. భువో భారస్య వ్యయాయ నాశాయ. చకార ఏవకారార్థః తౌ చ సాంప్రతమిహాగతావిత్యర్థః. తదుక్తం తంత్రే.శ్లో. 'అర్జునే తు నరావేశః కృష్ణో నారాయణస్స్వయమి'తి. యదూద్వహః శ్రీకృష్ణః. కురూద్వహోఽర్జునః. ఉభావపి కృష్ణనామానౌ. 59

భూమి భారమును తగ్గించుటకు పరమాత్మ శ్రీహరి అంశావతారులై ఆ ఇద్దరు ఇచట అవతరించిరి. యదూద్వహుడు కృష్ణుడు, కురూద్వహుడు అర్జునుడు. అర్జునుడియందు నరావేశము, కృష్ణుడు సాక్షాత్తు నారాయణుడని తంత్రములు తెలుపుచున్నవి. ఈ ఇద్దరికిగూడా కృష్ణుడనే పేరుకలదు. 59

శ్లో॥ స్వాహాభిమానినశ్చాగ్నే రాత్మజాం స్త్రీనజీజనత్ ।
పావకం పవమానం చ శుచిం చ హుతభోజనం ॥ 60

టీ:- స్వాహేతి. అగ్న్యభిమానినో దేవాన్. స్వాహానామ తస్య భార్యా. హుత భోజనమితి త్రయాణాం విశేషణం. 60

అగ్న్యభిమాని దేవత స్వాహా యందు పావకుడు, పవమానుడు, శుచి అను ముగ్గురిని కనెను. వీరు హోమద్రవ్యమును ఆరగించెదరు. (60)

శ్లో॥ తేభ్యోఽగ్న యస్సమభవంశ్చత్వారింశచ్చ పంచ చ ।
త ఏవైకోన పంచాశత్సాకం పితృ పితామహైః ॥ 61

టీ:- తేభ్య ఇతి. పితరస్త్రయః పితామహః ఏకః త్రైస్సాకం సహ. 61

ఆ ముగ్గురికి నలుబదిఐదుమంది సంతానము కలిగిరి. వారే పితరులు. తండ్రులు ముగ్గురు తాత ఒకరు కలిపి నలభైతొమ్మిదిమంది. వీరంతా అగ్నులైనారు. (తాత - అగ్ని; తండ్రులు - పావకుడు, పవమానుడు, శుచి; కొడుకులు 45 మంది) 61

శ్లో॥ వైతానికే కర్మణి యాన్నామభిర్బ్రహ్మవాదిభిః ।
ఆగ్నేయ్య ఇష్టయో యజ్ఞే నిరూప్యంతేఽగ్న యస్తు తే ॥ 62

టీ:- వైతానిక ఇతి. వైతానికే కర్మణి యజ్ఞే. యేషాం నామభిః. ఆగ్నేయ్యః అగ్నిదేవతాకాః ఇష్టమో నిరూప్యంతే క్రియంతే. త ఏతే ఆగ్నయః అలౌకికాః. అతో బహూనాం న వైయర్థ్యమితి భావః. 62

వైదిక కర్మలయందు మాత్రమే ఏ నామములచే బ్రహ్మవాదులు అగ్నిదేవతకు ఇష్టులు చేయుచున్నారో ఆ అగ్నులు వీరే. వీరు లౌకికాగ్నులు కారు. కేవల వైదిక కర్మలయందు మాత్రమే ప్రతిపాదింపబడినారు. అందుకే నలబది తొమ్మిదిమంది ఉన్నా వ్యర్థత లేదు. 62

శ్లో॥ అగ్నిష్వాత్తాబర్హిషదస్సౌమ్యాః పితర ఆజ్యపాః ।
సాగ్నయోఽనగ్నయస్తేషాం పత్నీ దాక్షాయణీ స్వధా ॥ 63

టీ:- అగ్నిష్వాత్తా ఇతి. సౌమ్యాస్సోమపాః. యేషా మగ్నౌ కరుణమస్తి తే సాగ్నయః తద్రహితాశ్చానగ్నయః. 63

అగ్నిష్వాత్తులు, బర్హిషదులు, సౌమ్యులు (సోమపానము చేసేవారు) ఆజ్యపులు, అనువారు పితృదేవతలు. వీరు సాగ్నులు కొంతమంది, నిరగ్నులు కొంతమంది. ఎవరికి అగ్నియందు సమర్పణ ఉన్నదో వారు సాగ్నులు లేనివారు, అనగ్నులు. వీరికి ధర్మపత్ని దక్షుడి కుమార్తె స్వధాదాక్షాయిణీ. 63

శ్లో॥ తేభ్యో దధార కన్యే ద్వే వయూనాం ధారిణీం స్వధా ।
ఉభేతే బ్రహ్మవాదిన్యౌ జ్ఞాన విజ్ఞాన పారగే ॥ 64

టీ:- తేభ్య ఇతి. తయోస్తు సంతతిర్నాభవత్. జీవన్ముక్తత్వాదిత్యాహ- ఉభే తే ఇతి. 64

ఆ పితరుల వలన దాక్షాయిణీస్వధా వయునా, ధారిణీ అను ఇద్దరు కుమార్తెలను కన్నది. వీరు జ్ఞానవిజ్ఞాన పారగులు.వీరిద్దరు బ్రహ్మవాదినులు. జీవన్ముక్తులు కనుక సంతతి లేదు. 64

శ్లో॥ భవస్య పత్నీ తు సతీ భవం దేవమనువ్రతా ।
ఆత్మనస్సదృశం పుత్రం న లేభ గుణశీలతః ॥ 65

టీ:- భవస్యేతి. గుణశీలతః ఆత్మనః సదృశం దేవ మనువ్రతాపి. సతీ పుత్రం న లేభే. 65

భవపత్ని సతీదేవి దేవదేవుడిని అనుసరించినప్పటికి గుణ శీలములచే తనతో సదృశుడైన పుత్రుడిని పొందలేదు. 65

శ్లో॥ పితర్యప్రతిరూపే స్వే భవాయానాగసే రుషా ।
అప్రౌఢేనాత్మ నాత్మానమజహాద్యోగ సంయుతా ॥ 66

టీ:- తత్ర హేతుః. పితరీతి. స్వే పితరి దక్షే అప్రతిరూపే అసదృశే ప్రతికూలే సతీత్యర్థః. ఆత్మనా స్వయమేవ. ఆత్మానం దేహం అజహాత్ త్యక్తవతీ. యోగ సంయుతా యోగమాశ్రి తేతి. 66

దోషరహితుడైన శివుడి యందు దోషము లేకున్నా, సతీ తండ్రి ఆయనకు ప్రతికూలముగా ప్రవర్తించెను. అప్పటికి ప్రౌఢకాని సతీ యోగముతో కలిగిన యోగాగ్నిచే స్వయముగా తనను తాను కాల్చుకొనెను. 66

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే, ప్రథమోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు మొదటి అధ్యాయము సమాప్తము.**

## ద్వితీయోఽధ్యాయః

శ్లో॥ ద్వితీయే ప్రథమాధ్యాయోపక్షిప్త భవ దక్షయోః ।
విద్వేషే వర్ణ్యతే హేతుర్విశ్వ సృద్యజ్ఞ సంభవః ॥

**విదుర ఉవాచ**

శ్లో॥ భవే శీలవతాం శ్రేష్ఠే దక్షో దుహితృ వత్సలః ।
విద్వేషమకరోత్కస్మా దనాదృత్యాత్మజాం సతీమ్ ॥ 1

టీ:- భవ ఇతి. సతీం సతీనామ్నీం. 1

శ్లో॥ కస్తం చరాచర గురుం నిర్వైరం శాంత విగ్రహమ్ ।
ఆత్మారామం కథం ద్వేష్టి జగతో దైవతం మహత్ ॥ 2

టీ:- న చాసౌ కస్య చిద్ద్వేషార్హ ఇత్యాహ- క ఇతి. చరాచర గురుం. జగతో దైవతం. తం కో ద్వేష్టిన కోఽపి ద్వేష్టీత్యర్థః.నిర్వైరత్వేహేతుః శాంతమితి భావేక్తః. శాంతం శాంతిరేవ విగ్రహో యస్య. తదపి కుతః ఆత్మన్యేవారామో రతిర్యస్య తం. యద్వా కః ప్రజాపతిః దక్షః. కథం ద్వేష్టి. ఏవంభూతే తస్మిన్ ద్వేషః అయుక్తః అశక్యశ్చేత్యర్థః. 2

## 2వ అధ్యాయము

ఈ ద్వితీయ అధ్యాయమున ప్రజాపతుల యజ్ఞమున, ప్రథమాధ్యాయమునందు ప్రారంభమైన శివ దక్షుల విద్వేషమునకు కారణము వర్ణింపబడుచున్నది.

**విదురుడు ఇట్లు పలికెను.**

శీలవంతులలోకెల్ల శ్రేష్ఠుడగు దక్షుడు కుమార్తెల యందు వాత్సల్యము కలవాడు. ఆయన తన కుమార్తె సతిని ఏ కారణము వలన నిరాదరణముచేసి ద్వేషించెను. 1

ఎవ్వరూ ద్వేషించనివాడు, స్థావర జగములకు తండ్రియైనవాడు, జగత్తునకు దైవతమైనవాడు, నిర్వైరుడైనవాడు, శాంతియే శరీరముగా గలవాడు, ఆత్మయందే విశ్రాంతిని పొందేవాడగు శంకరుని ప్రజాపతి -యగు దక్షుడు ఎందుకు ద్వేషిస్తున్నాడు. 2

శ్లో॥ ఏతదాఖ్యాహి మే బ్రహ్మన్ జామతుశ్శ్వశురస్య చ ।
విద్వేషస్తు యతః ప్రాణాం స్తత్యజే దుస్త్యజాన్ సతీ ॥ 3

టీ:- ఏతదితి. యతో హేతోర్విద్వేషః. యతో విద్వేషాత్ ప్రాణాం స్తత్యాజ ఏతదాఖ్యాహి. 3

ఓ మైత్రేయమహర్షీ! మామా అల్లుళ్ళకు ఏ కారణము వలన ద్వేషము కలిగెను? ఏ విద్వేష కారణమున విడువరాని దేహమును ప్రాణములను సతీదేవి విడిచినదో ఆ కారణమును నాకు తెల్పుము. 3

మైత్రేయ ఉవాచ

శ్లో॥ పురా విశ్వసృజాం సత్రే సమేతాః పరమర్షయః ।
తదామరగణాస్సర్వే సానుగా మునయోఽగ్నయః ॥ 4

టీ:- ఏత దేవాఖ్యాతుమితిహాసం ప్రస్తౌతి. పురేతి - సమేతా ఆసన్. 4

మైత్రేయమహర్షి చెప్పెను.

ఆ కారణమును చెప్పుటకు ఈ ఇతిహాసమును ప్రస్తావించు-చున్నాడు. పూర్వము సత్ర యాగము యందు మరీచి మొదలగు ప్రజాపతులు, పరమ ఋషులు, అమరగణము, శిష్యసహితులైన మునులు, అగ్నులు అందరూ ఒకచోట చేరిరి. 4

శ్లో॥ తత్ర ప్రవిష్టమృషయో దృష్ట్వార్కమివ రోచిషా ।
భ్రాజమానం వితిమిరం కుర్వంతం తన్మహత్సదః ॥ 5

టీ:- తత్రేతి. ప్రవిష్టం దక్షమితి శేషః. తత్ మహత్సదః. మహతీం సభాం. 5

తన కాంతులచే సూర్యుడి మాదిరిగా ప్రకాశిస్తూ చీకట్లను పారద్రోలుతూ ఆ గొప్పసభలో ప్రవేశించిన దక్షుడిని చూచి మునులు. 5

శ్లో॥ ఉదతిష్ఠన్ సదస్యాస్తే స్వధిష్ణ్యేభ్యస్సహాగ్నయః ।
ఋతే విరించిం శర్వం చ తద్భాసా క్షిప్త తేజసః ॥ 6

సదస్యులు అగ్నిసహితులై, దక్షకాంతిచే పరాభూతములైన మనస్సులు కలవారై బ్రహ్మ, శివుడు తప్ప అందరూ వారి ఆసనముల నుండి లేచి నిలబడి చూచిరి. 6

శ్లో॥ సదసస్పతిభిర్దక్షో భగవాన్ సాధుసత్కృతః ।
అజం లోకగురుం నత్వా నిషసాద తదాజ్ఞయా ॥ 7

టీ:- ఉదతిష్ఠన్నితి. స్వధిష్ణ్యేభ్యః స్వీయాసనేభ్యః. (6-7)

ముఖ్యులైన సభాసదులచే చక్కగా సత్కరింపబడి భగవాన్ దక్షుడు లోకగురువైన బ్రహ్మకు నమస్కరించి ఆయన ఆజ్ఞచే కూర్చుండెను. 7

శ్లో॥ ప్రాఙ్నిషణ్ణం మృడం దృష్ట్వా నామృష్యత్తదనాదృతః ।
ఉవాచ వామం చక్షుర్భ్యామభివీక్ష్య దహన్నివ ॥ 8

టీ:- ప్రాగితి. ప్రాక్ స్వోపవేశనాత్పూర్వమేవ నిషణ్ణం ఉపవిష్టం మృడం శివం. తదానాదృతః. తేనాభ్యుత్థానాదిభిరసత్ కృతో దక్షః నామృష్యత్. నాసహత్. వామం వక్రం యథా భవతి తథా అభివీక్ష్య. 8

తనకంటే ముందువచ్చి కూర్చొని తను వచ్చినాలేవని సుఖకరుడైన శివుడు లేచి నిల్చొని నమస్కరించడం మొదలైన వాటిచేత తనను ఆదరించక పోవటం సహించలేక దక్షుడు వంకర చూపులతో శివుడిని చూస్తూ... 8

శ్లో॥ శ్రూయతాం బ్రహ్మర్షయో మే సహ దేవాస్సహాగ్నయః ।
సాధూనాం బ్రువతో వృత్తం నాజ్ఞానాన్న చ మత్సరాత్ ॥ 9

టీ:- శ్రూయతామితి. మేవచనం శ్రూయతాం. అజ్ఞానాన్మత్సరాచ్చ న బ్రువతః. 9

దేవతాగ్నులసహితులైన బ్రహ్మర్షులారా! అజ్ఞానముచేతనో మాత్సర్యము చేతనో నేను మాట్లాడటం లేదు. కేవలం సాధుజనుల నడవడికను గూర్చి మాత్రమే చెబుతున్నాను వినండి. 9

శ్లో॥ అయం తు లోకపాలానాం యశోఘ్నో నిరపత్రపః ।
సద్భిరాచరితః పంథా యేన స్తబ్ధేన దూషితః ॥ 10

టీ:- అయమితి. స్తబ్ధేన ఉచిత క్రియా శూన్యేన. ధ్వస్తేనేతి పాఠే భ్రష్టేన. 10

ఈ శివుడు సిగ్గులేనివాడు. లోకపాలకుల కీర్తినాశకుడు. సజ్జన పరంపరగా ఆచరిస్తూ వస్తున్న మార్గమును, సదాచార రహితుడైన ఈతడు చెడగొట్టువాడు. 10

శ్లో॥ ఏష మే శిష్యతాం ప్రాప్తో యన్మే దుహితురగ్రహీత్ ।
పాణిం విప్రాగ్ని ముఖతస్సావిత్ర్యా ఇవ సాధువత్ ॥ 11

టీ:- తదేవాహ–ఏష ఇతి. యత్ యస్మాత్. విప్రాగ్ని సమక్షం. సావిత్రీ తుల్యాయా మే దుహితుః పాణిమగ్రహీత్. 11

ఈతడు నా శిష్యత్వమును పొందెను ఏలయనగా! సత్పురుషుని వలె బ్రాహ్మణుల, అగ్నుల సమక్షమున సావిత్రీ తుల్యయైన నా కూతురును పాణి గ్రహణము చేసెను. 11

శ్లో॥ గృహీత్వా మృగశాబాక్ష్యాః పాణిం మర్కట లోచనః ।
ప్రత్యుత్థానభివాదార్హే వాచాప్యకృత నోచితమ్ ॥ 12

టీ:- గృహిత్వేతి. మృగశాబస్య హరిణపోతస్య అక్షిణీ యస్యాః. ప్రత్యుత్థా నాభివాదార్హే మయి. ఉచితం సమ్మానం వాచాపినాకరోత్. 12

లేడిపిల్ల కన్నులవంటి కన్నులుగల అమ్మాయిని కోతివంటి కన్నులు గలవాడు పాణి గ్రహణము చేసినాడు. నన్ను చూడగానే లేచి నిల్చొనినమస్కరించాలి కానీ నాకు కనీసం వాక్కులతో కూడా నమస్కారమని చెప్పలేదు.(వాక్కులచే గూడా నమస్కారమని అనుచూ ఉచిత సత్కారము చేయలేదు). 12

శ్లో॥ లుప్త క్రియాయా శుచయే మానినేఽభిన్నసేతవే ।
అనిచ్ఛన్నప్యదాం బాలాం శూద్రాయేవోశతీం గిరమ్ ॥ 13

టీ:- అనర్హాయ కన్యాం దత్తవానస్మీత్యనుతప్యమాన ఆహ – సార్ధైశ్చ తుర్భిః. లుప్తేతి. ఉశతీం వేదలక్షణాం గిరం. 13

అనర్హుడైనవాడికి కన్యనిచ్చిన దక్షుడు తనను తాను తపింపచేసు –కుంటూ నాల్గున్నర శ్లోకాలలో ఈ విధముగా అంటున్నాడు.

లోపించిన వైదిక క్రియలు కలవాడు శుచిలేనివాడు, దురభిమానముకలవాడు, వైదికమర్యాదలను ఉల్లఘించినవాడు, ఇష్టము లేకున్నను ఈ అమ్మాయిని శూద్రుడికి (అర్హత లేనివానికి) వేదమును ఇచ్చినట్లుగా ఇచ్చినాను. 13

,శ్లో॥ ప్రేతావాసేషు యోఘోరైః ప్రేతైర్భూతగణైర్వృతః ।
అటత్యున్మత్తవన్నగ్నో వ్యుప్తకేశో హసన్రుదన్ ॥ 14

ఈయన ఘోరమైన శ్మశానముల యందు ప్రేత గణ భూత గణములచే పరివేష్టింపబడి, నగ్నుడై వెంట్రుకలు విరబోసుకొని పిచ్చివాడివలె నవ్వుతూ, ఏడుస్తూ తిరుగుతూ ఉంటాడు. 14

టీ:- ప్రేతావాసేష్వితి. ప్రేతా వాషేసు శ్మశానేషు. వ్యుప్తాః వికీర్ణాః కేశా యస్య. 14

శ్లో॥ చితాభస్మ కృత స్నానః ప్రేతస్రఙ్నస్థి భూషణః ।
శివాపదేశో హ్యశివో మత్తో మత్తజనప్రియః ।
పతిఃప్రమథ భూతానాం తమోమాత్రాత్మకాత్మనామ్ ॥ 15

రోజు శవ భస్మముచే స్నానము చేసేవాడు, ప్రేతల పుర్రెలే పూలమాలలుగా ధరించేవాడు. మరణించిన జనుల ఎముకలే ఆభరణములుగా గలవాడు. అతనికి శివుడని మంగళప్రదుడని పేరు పేరుకు మాత్రమే. అంతా అమంగళమే. అతడొక మత్తుడు. మత్తులో ఉన్న జనానికి అతడిష్టుడు. ప్రమథ గణాధిపుడు కేవలం చీకటి రూపము తమోగుణమే ఆత్మగాగల ప్రమథ గణాధిపుడు. 15

టీ:- చితేతి. చితాభస్మనా కృతం స్నానం యేన. ప్రేతానాం స్రజో మాల్యాని యస్య సః ప్రేత స్రక్. నృణామస్థీని భూషణాని యస్య సః శివ ఇత్యోపదేశో నామమాత్రం యస్య సః తమోమాత్రాత్మకః కేవల తమోరూపః ఆత్మాస్వభావో యేషాం. 15

శ్లో॥ తస్మాదున్మాదనాథాయ నష్టశౌచాయ దుర్హృదే ।
దత్తా బత మయా సాధ్వీచోదనాత్పరమేష్ఠినః ॥ 16

అయ్యో! ఉన్మాదులగు భూతగణమునకు నాథుడు, శుచి లేనివాడు దుష్టచిత్తుడు అయినవాడికి బ్రహ్మచే ప్రేరితుడినై సాధు స్వభావము గల నా కుమార్తెను ఇచ్చితిని కదా! 16

టీ:- తస్మాదితి. ఉన్మాదాః భూతవిశేషాః తేషాం నాథాయ దుర్హృదే

దుష్టచిత్తాయ. బతేతి ఖేదే. పూర్వోక్త శ్లోకచతుష్కస్య వాస్తవస్త్వయమర్థః లుప్తాః క్రియాః యస్మిన్పరబ్రహ్మరూపత్వాత్. అత ఏవ నాస్తి శుచిర్యస్మాత్. అమానినే అభిన్నసేతవ ఇతి ఛేదః. అస్య పరమేశ్వరస్య మదీయా మానుషీ కన్యాకథం యోగ్యాస్యాదితి లజ్జాదినా దాతుమనిచ్ఛ న్నపి తత్సంబంధలోభేన దత్తవాన్. శూద్రాయేత్య నర్హత్వమాత్రే దృష్టాంతః న హీనత్వే. యద్వా. శోకం ద్రావయతీతి శూద్రః. ఆత్మనిష్ఠః. తస్య వేదవాణీం కర్మవిద్యామివ పూర్వాపరస్వ వచన విరోధాపత్తేః. ఏతదుక్తం భవతి. యథా కశ్చిచ్ఛూద్రాయ వేదమర్థ లోభేన దదాతి తద్వదితి. ప్రేతావానేష్విత్యాది సర్వం విడంబనమాత్రమితి. స్వయమేవాహ–ఉన్మత్తవదితి. అన్యథా ఉన్మత్త ఇత్యేవ వదేత్. అశివః నాస్తి శివో యస్మాత్. అమత్తః అమత్త జనప్రియ ఇతిఛేదః. పతిః ప్రమథభూతనామితి భక్తవాత్సల్యమాహ–తామసానామపి దోష మశేష మపనీయ పాతీతి పతిః. నష్టానామపి శౌచాం శుద్ధిర్యస్మాత్. దుష్టేష్వపి ఏతేమయాను కంప్యా ఇతి హృన్మనో యస్య సః దుర్హృత్ తస్మై. బతేతి హర్షే. బ్రహ్మణో వాక్యాల్లజ్జా భయాదికం పరిత్యజ్యదత్తేత్యర్థః. 16

(దక్షుడు శివుడిని నిందించినట్టు కనబడ్డా! భగవద్డమరుకము నుండి వెలువడ్డ అక్షరరాశి భగవంతుడిని నిందించడానికి సిద్ధంగాలేదు) వాస్తవానికి ఈ శ్లోకాలకు ఈ అర్థము. శ్లో॥ తస్మా ఉన్మాదనాథాయ నష్ట శౌచాయ దుర్హృదే ।

దత్తా బతమయా సాధ్వీ చోదితే పరమేష్ఠినా ॥

అమ్మో! ఉన్మాదులనే భూతగణమునకు నాథుడు శుచిలేనివాడు. దుష్టచిత్తుడు అయినవాడికి బ్రహ్మప్రేరితుడైన సాధుస్వభావము గల నా కుమార్తెనిచ్చితినిగదా! (దక్షుడు శివుడిని నిందించినట్లు కనబడ్డా! భగవడ్డ మరుకమునుండి వెలుబడ్డ అక్షరరాశి భగవంతుడిని నిందించడానికి సిద్ధంగాలేదు.) వాస్తవానికి ఈశ్లోకాలకు అర్థం.

శ్లో॥ లుప్త క్రియాయ పరబ్రహ్మ స్వరూపము కనుక ఎవనియందు క్రియలు లోపించెనో క్రియాసంబంధము లేనివాడు "నిష్క్రియశాంతం"

ఆశుచయే = పూర్ణమగు శుచి కలవాడు లేదా

ఆశుచయే = క్రియనే లేదు గనుక శుచిలేదు.

పదవిభాగం ఇలాచేయాలి.

అమానినే = దురభిమానము లేకపోవడం లేదా ఆత్మనః శ్లాఘనం మానిత్వం.

అభిన్నసేతవే = వైదిక మర్యాదను ఉల్లంఘించనివాడు.

అశవిచ్ఛిన్నప్యదాంబాలాం = అంతటి పరిపూర్ణ స్వరూపుడైన

పరమాత్మకు మానుష్య కన్య ఎట్లు యోగ్యురాలవుతుంది. అని సిగ్గుపడి కోరినప్పడికిఆ పరమాత్మ సంబంధం దొరుకుతుందంటే ఆ లోభం చేత ఆశ పడి

శూద్రాయే వో౽ శతంగిరం = ఇక్కడ శూద్రాయ అనునది హీనత్వంలో కాదు అనర్హత్వంలో దృష్టాంతం, ధనికుడైన శూద్రుడికి ధనలోభం చేత వేదము నిచ్చినట్టుగా ఇక్కడ లోభంలో దృష్టాంతము సమన్వయంగా చేసుకోవాలి.

పరమాత్మతో ఏమాత్రం సంబంధం పొందదానికి అర్హతలేని తాను లోభం చేత ఇవ్వడానికి కన్యను సిద్ధమై ఇచ్చినాను.

ప్రేతావాసేఘఘోరేయి =ఈనిందలన్ని గూడా కేవలం మీదకు చూడడానికి మాత్రమే నిజానికి కాదని తానే స్వయముగా

అటత్యున్మత్తవన్నగ్నః = ఉన్మత్తుడి వలె అని అనెను.

అంటే లోగడ తను గూడా "చాలోన్మత్తపి చావత్ " అను శ్రుత్యనుసారం జ్ఞాని అనియే భావం.

అశివః నాస్తి శివః యస్మాత్ = అనగా ఎవరికంటే ఇంకామంగళ ప్రదుడులేడో అతడు ఆశివుడు. ఆయననే సర్వమునకు మంగళ ప్రదుడు..

పదవిభాగం - అమత్తః - అమత్త జన ప్రియః అహంకార రహితుడు అట్టి వారికే ఇష్టుడు.

తమోమాత్రాత్మనామ్ ప్రమథభూతానాంపతిః.

తామసికులైన తమస్వభావమును తొలగించి వారిని కాపాడడం భక్తవాత్సల్యమును తెలుపుచున్నది.

నష్టపోయినవారికి భ్రష్టులకు ఎవరివల్ల శుద్ధి కలుగుతుందో అతడు

దుర్హృదే = దుష్టులైన వీరిపై నేను దయ చూపెట్టి సజ్జనుల చేయవలె. "దుర్జనః సజ్జనో భూయాత్ "అను మనస్సు కలవాడు.

"బత్ అయ్యో అను అర్థంకాక" సంతోషార్థమున- బత బ్రహ్మదేవుడి వాక్యంవల్ల - నేను సరిపోను పిల్లనిచ్చుటకు ఈపరమేశ్వరుడికి. సామాన్యమైనవాడను అను భయము విడచి కన్యనిచ్చితిని అని అర్థము. 16

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ వినింద్యైవం సగిరిశమప్రతీపమవస్థితమ్ ।
దక్షోऽథాప ఉపస్పృశ్య క్రుద్ధశ్శప్తుం ప్రచక్రమే. 17

టీ:- వినింద్యేతి. అప్రతీపం యథా భవతి ఏవ మవస్థిమపి వినింద్య. (17)

**మైత్రేయుడు ఇట్లు చెప్పినాడు.**

క్రుద్ధుడైన దక్షుడు అవిరుద్ధ భావనలు కలిగి, కూర్చున్న గిరీశుడిని ఈ విధముగా నిందించి నీటిని స్పృశించి శపించుటకు సిద్ధుడాయెను. 17

**దక్ష ఉవాచ**

శ్లో॥ అయం తు దేవ యజన ఇంద్రోపేంద్రాదిర్భవః ।
సహ భాగం న లభతాం దేవైర్దేవ గణాధమః ॥ 18

టీ:- అయమితి. దేవానాం యాజన సమయే దేవైస్సహ యజ్ఞే భాగం న లభతాం కింతు తేభ్యః పూర్వమేవ లభతాం. అగ్ర భోజిత్వాత్. యద్వా తేషు భుక్తవత్సులభతాం సర్వపోషకత్వాదత్ర హేతుః. దేవగణః అధమో యస్మాత్సః. 18

ఈశివుడు దేవతలగూర్చిచేసే యజ్ఞాలలో ఇంద్రాదులవలె యజ్ఞ భాగము పొందకుండుగాక! ఇతడు దేవతలలో అధముడు. ఇక్కడ సహ భాగం 'నలభతాం' అనగా దేవతలతోసమానముగా భాగం వద్దు అనగా దేవతలకు అందించడానికి పూర్వమే ఇతడికి సమర్పించ వలసినది లేదా వారు తిన్న పిమ్మట లభించాలి. ఎందుకంటే స్వర్వ పోషకుడు కనుక దేవ గణాధములు= దేవగణము ఎవరి కంటే తక్కువగా ఉన్నారో అట్టివాడు. 18

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ నిషిధ్యమానస్స సదస్యముఖ్యైర్దక్షో గిరీశాయ విసృజ్య శాపమ్ ।
తస్మాదినిష్క్రమ్య వివృద్ధమన్యుర్జగామ కౌరవ్య నిజం నికేతనమ్॥ ॥19॥

టీ:- నిషిధ్యమాన ఇతి. స దక్షః తస్మాత్ స్థానాత్. వినిష్క్రమ్య జగామ. హే కౌరవ్య విదుర. 19

**మైత్రేయుడు పలికెను.**

ఓ విదురా! సదస్యముఖ్యులు వారించుచుండగాగూడా శివుడిని శపించి దక్షుడు కోపము పెరిగినవాడై ఆ స్థానము నుండి లేచి తన నిజ భవనమునకు వెళ్ళిపోయెను. 19

శ్లో॥ విజ్ఞాయ శాపం గిరి శానుగాగ్రణీ
ర్నందీశ్వరో రోష కషాయ రూషితః ।
దక్షాయ శాపం విససర్జ దారుణం యే
చాన్వమోదం స్తదవాచ్యతాం ద్విజాః ॥ 20

టీ:- విజ్ఞాయేతి. గిరిశస్యానుగానామగ్రణీః ముఖ్యః. రోష ఏవ కషాయః తేన రూషితః. ఆరక్తనేత్ర ఇత్యర్థః. తస్య గిరిశస్య అవాచ్యతాం వచనానర్హ తాం. వినింద్యతామిత్యర్థః తేభ్యోఽపి శాపం విససర్జ. 20

శివగణ శ్రేష్ఠుడైన నందీశ్వరుడు, రోషముతో ఎఱ్ఱగా మారిన రక్తనేత్రుడై, ఎవరెవరు ఈ సభలో శివదూషణ చేసినారో, అవాచ్యములైన నీచ శబ్దములను అనుమోదించినారో వారికి, దక్షుడికి కూడా శాపమిచ్చెను. 20

### నంద్యువాచ

శ్లో॥ య ఏతన్మర్త్యముద్దిశ్య భగవత్య ప్రతి ద్రుహి ।
ద్రుహ్యత్యజ్ఞః పృథగ్దృష్టిస్తత్త్వతో విముఖో భవేత్ ॥ 21

టీ:- దక్షం శపతి సార్ధైస్త్రిభిః-య ఇతి. ఏతన్మర్త్యం దక్షశరీరముద్దిశ్య. శ్రేష్ఠం మత్వా. అప్రతి ద్రుహి ప్రతిద్రోహమకుర్వతి. పృథగ్దృష్టిః భేదదర్శీ. తత్త్వతః. పరమార్థాత్. 21

### నందీశ్వరుడు దక్షుడిని శపించుచున్నాడు.

ఓరీ దక్షా! మరణధర్మము కలిగిన ఈ దక్షశరీరమును శ్రేష్ఠముగా దలచి ద్రోహము చేసిన వారికి కూడా ద్రోహము చేయని శివ భగవానుని యందు భేద దృష్టి కలిగి ద్రోహము తలపెట్టుచున్నాడో, అట్టివాడు పరమార్థము నుండి (యథార్థ జ్ఞానము నుండి) విముఖుడగు గాక!

(కించిత్- కొందరు శివ ద్రోహులకు శివ నిందకులకు శివుడికి కేశవుడికి భేద దర్శనము చేయడానికి ప్రయత్నించినవారికి శివ చరిత్రములు శివ పురాణములు తామసములని ప్రక్షిప్త శ్లోకప్రమాణ-ములు చదువుతూ తామసికానందము పొంది తదానందమును పంచి నిందించుటలో దక్షులై క్షుల్లక మనస్కులైన వారికి వృషభముయొక్క

శ్లో॥ గృహేషు కూట ధర్మేషు సక్తో గ్రామ్యసుఖేచ్ఛయా ।
కర్మతంత్రం వితనుతాద్వేదవాద విపన్న ధీః ॥ 22

టీ:- అజ్ఞత్వమేవాహ-గృహేష్వితి. కర్మతంత్రం కర్మపరికరం. వేదేషు యే వాదాః. అర్థవాదాః. శ్రు. "అక్షయగ్ం హి వై చాతుర్మాస్యయాజి నస్సుకృతం భవతీ" త్యాదయః. తైర్విపన్నా వినిష్టా ధీరస్య. 22

శ్లో॥ బుద్ధ్యా పరాభిధ్యాయిన్యా విస్మృతాత్మగతిః పశుః ।
స్త్రీకామస్సోఽస్త్వతితరాం దక్షో బస్తముఖోఽచిరాత్ ॥ 23

టీ:- బుద్ధ్యేతి. పరో దేహాదిః తవమేవాత్మత్వేనాభితో ధ్యాతుం శీలం యస్యాః తయా బుద్ధ్యా విస్మృతా ఆత్మనో గతిస్తత్త్వం యేన. అత ఏవ పశుః. పశుతుల్యః. అతితరాం స్త్రీ కామోఽస్త్వితి ద్వితీయ శ్శాపః. బస్తస్య ముఖమివ ముఖం యస్యేతి తృతీయశ్శాపః. 23

హెచ్చరిక! వృషమనగా ధర్మము. ధర్మము వేదాత్మకము, అ వేదాను శాసనము నీకు ఆత్మజ్ఞానము కలగకుండుగాకా అని శపించుచున్నది. తస్మాత్ జాగ్రత్త! ) 21

ఇంటియందు కపటధర్మములయందు సక్తుడై బాహ్యప్రపంచ సుఖములయందుఇచ్ఛచేవాటిని తీర్చుకోవడానికికర్మనుసాధనముగా చేసుకొని వేదములోని అర్థవాద వాక్యములను వినష్ట బుద్ధిగలవాడై చాతుర్మాస్య యాజికి అక్షయ్యమైన తాను చేసిన కర్మ ద్వారా నాశ రహితమైన లోకము వస్తుంది అనే వేదవాదముల చేమురిసి విస్తరింప చేయుచున్నాడు. 22

దేహమే ఆత్మయనే నిశ్చయ బుద్ధిచేత ఆత్మ యథార్థమును మరచినవాడై పశుతుల్యుడై అత్యంత స్త్రీ కాముడు అగుగాక, అని రెండవశాపము 'తత్వతః విముఖో భవేత్' అనునది మొదటి శాపము. మేకపోతు ముఖమే ముఖముగా కలవాడగు గాక అని మూడవ శాపము. 23

శ్లో॥ విద్యాబుద్ధిరవిద్యాయాం కర్మమయ్యామసౌ జడః ।
సంసరంత్విహ యే చేమమనుశర్వావ మానినమ్ ॥ 24

టీ:- అయం చ శాపో హ్యనురూప ఏవేత్యాహ-విద్యేతి. విద్యాబుద్ధిరితి ఇయమేవ తత్త్వవిద్యేతి బుద్ధిర్యస్య. అతోஉసౌ జడ ఏవ. ద్విజాన్ శపతి సార్ధ ద్వాభ్యాం. శర్వమవమన్యత ఇతి శర్వావమానీ తమముం దక్షం యే చానుమన్యంతే అనువర్తంతే. సంసరంతు జన్మ మరణాద్య నుభవంత్విత్యేకశ్శాపః. 24

శ్లో॥ గిరిశ్రుతాయాః పుష్పిణ్యా మధు గంధేన భూరిణా ।
మధ్నా చోన్మథితాత్మానస్సంముహ్యంతు హరద్విషః ॥ 25

టీ:- గిరఇతి. శ్రుతాయాః వేదరూపాయాః. పుష్పిణ్యాః పుష్పాణీ వార్థవాదాః. మనః క్షోభకత్వాత్. అర్థవాదా బహుళాయా ఇత్యర్థః. మధు గంధ తుల్యేన ప్రరోచనేన మధ్నా మనః క్షోభకేణ ఉన్మథితః ఆత్మా మనోయేషాం తే సంమూహ్యంతు. కర్మస్వాసక్తా భవంత్వితి ద్వితీయశ్శాపః. 25

అవిద్య ద్వారా కామము, కామము ద్వారా కర్మాచరణ అట్టి కర్మమయమైన అవిద్యయందు ఇదియే ఆత్మ విద్యయని అనగా కర్మ ద్వారా మోక్షమనే బుద్ధిగలవాడు. అందుకే అతడు జడుడు. ఇక్కడ బ్రాహ్మణులను శపిస్తున్నాడు. ఎట్టి బ్రాహ్మణులను శివుడిని అవమానించిన దక్షుడిని అనుసరించి శివ దూషణను ఒప్పిన వారంతా జన్మ మరణ దుఃఖమును అనుభవింతురుగాక అని ఒక శాపము. 24

వేదవాక్కులనేవి పుష్పములు. ఆ పుష్పములు ఏ విధముగా చూడగానే మనస్సును క్షోభింప చేస్తాయో అర్థవాదములైన వేద వాక్యములనే పుష్పాలుకూడా మనస్సును క్షోభింప చేస్తవి. ఈ అర్థవాద పుష్పములు మంచి తేనెల పరిమళము కలిగి మనస్సును క్షోభపెట్టి మనస్సులను కర్మాసక్తులనుగా చేయు గాక! అని రెండవ శాపము బ్రాహ్మణులకు... 25

శ్లో॥ సర్వభక్షాద్విజావృత్త్యై ధృత విద్యా తపోవ్రతాః ।
విత్తదేహేంద్రియారామా యాచకా విచరంత్విహ ॥ 26

టీ:- సర్వభక్షా ఇతి. సర్వభక్షాః భక్ష్యాభక్ష్యవిచారశూన్యాః వృత్త్యై దేహాది పోషణాయ ధృతాని విద్యా తపో వ్రతాని యైః. విత్తాదిష్వేవారామో రతిర్యేషాం తే. యాచకాస్సంతో విచరంత్వితి శాపస్తృతీయ. 26

ఈ శివద్వేషులైన బ్రాహ్మణులు ఇది తినవలె ఇది తినగూడదు అనే భక్ష్యాభక్ష వివేక శూన్యులై కేవలము దేహమును మాత్రమే పోషించు కొనుటకు విద్యాతపస్సులు, వ్రతాలు ధరించిన వారై ధనము, దేహము, ఇంద్రియములు మొదలైన వాటియందు రమించు వారగుదురని మూడవశాపము..26

శ్లో॥ తస్యైవం వదతశ్శాపం శ్రుత్వా బ్రహ్మకులాయ వై ।
భృగుః ప్రత్యసృజచ్ఛాపం బ్రహ్మదండం దురత్యయమ్ ॥ 27

టీ:- తస్యేతి. ప్రత్యసృజత్ ప్రత్యదాత్. శాపరూపం బ్రహ్మదండం. 27

ఈ విధముగా నందీశ్వరుడు శివనిందకులైన బ్రాహ్మణులకు ఇచ్చిన శాపమును విని, తప్పించుకొనుటకు వీలులేని శాపరూప బ్రహ్మదండమును భృగుమహర్షి తిరిగి బదులుగా ఇచ్చెను. (బ్రాహ్మణులకు ఇదియే ఆయుధము అని తెలియుటకు "బ్రహ్మదండ వాక్ మునయౌ కిల" మునులకు వాక్కే వజ్రాయుధము కదా అని లోకన్యాయము) 27

భృగురువాచ

శ్లో॥ భవవ్రతధరా యే చ యే చ తాన్ సమనువ్రతాః ।
పాషండినస్తే భవేయుస్సచ్ఛాస్త్ర పరిపంథినః ॥ 28

టీ:- భవేతి. సచ్ఛాస్త్రస్య పరిపంథినః. ప్రతికూలాః. 28

భృగుమహర్షి పలికెను.

ఎవరు శివవ్రతధరులౌతారో వారిని అనుసరిస్తారో వారు వేద శాస్త్ర సిద్ధాంతమునకు ప్రతికూలురై వేదమత విరుద్ధులై వేద నిందకులవుదురు గాక! 28

శ్లో॥ నష్టశౌచా మూఢధియో జటాభస్మాస్థిధారిణః ।
విశంతు శివదీక్షాయాం యత్ర దైవం సురాసనమ్ ॥ 29

టీ:- నష్టశౌచా ఇతి. సురాగౌడీపైష్టీ మాధ్వీచ. ఆసవః తాళాది సంభవం మద్యం. ద్వంద్వైక్యాత్ క్లీబత్వం. తద్యత్ర దైవం పూజ్యం దేవతావదాదరణీయమితి వా. 29

శుచిత్వము నశించి మోహబుద్ధులై జడలుపెంచి భస్మము రాసుకొని ఎముకలు, పుర్రెలు మెడలో వేసుకొని గౌడీ, పైష్టీ మాధ్వీ బెల్లము ఇప్పపువ్వు మొదలైన వాటిచే నిర్మితమైనది సురా! త్రాటిచెట్టు, ఈతచెట్టు మొదలైన వృక్షములనుండి ద్రవించే మద్యము అవియే దైవంఅనగా పూజ్యములలో లేదా దేవతలనాదరించినట్టుగా ఆదరణీయములో (పై వేషధారణ, అభ్యాసములే దైవములని భావించే) అట్లే పాశుపత దీక్ష యందు ప్రవేశింతురుగాక! 29

శ్లో॥ బ్రహ్మచ బ్రాహ్మణాంశ్చైవ యద్యూయం పరినిందథ ।
సేతుం విదారణం పుంసామతః పాషండమాశ్రితాః ॥ 30

టీ:- బ్రహ్మేతి. బ్రహ్మవేదం. కథంభూతం సేతుం మర్యాదారూపం తదేవాహ- పుంసాం వర్ణాశ్రమాచారవతాం విదారణం దారకం. 30

వర్ణాశ్రమ ధర్మములను ఆచరించేవారికి ధారకమైనది వ్యక్తి జీవనమును కట్టడి చేసినట్టిది వేదము. ఆ వేద రక్షకులు బ్రాహ్మణులు అట్టివారిని మీరు నిందించుచున్నారు. కనుకనే మీరు వేద విరుద్ధ మతమును ఆశ్రయించినారు. 30

శ్లో॥ ఏష ఏవ హి లోకానాం శివః పంథాస్సనాతనః ।
యం పూర్వే చానుసంతస్థుర్యత్ప్రమాణం జనార్దనః ॥ 31

టీ:- సేతుత్వం ప్రపంచయతి- ద్వాభ్యాం. ఏష ఇతి. వేదలక్షణ ఏవ శివః పంథాః యం పూర్వే ఋషయః అనుసంతస్థుః ఆశ్రితవంతః . యత్ యస్మిన్ జనార్దనః ప్రమాణం మూలం. 31

వేదము మానవజీవమునకు సేతువెట్లనో వివరించుచున్నాడు. ఈ వేదలక్షణమే మంగళకర మార్గము. సర్వలోకములకు ఇది ఎల్లప్పుడు ఉండేది. దేని యందు జనార్దనుడు ప్రామాణమై, మూలమై యున్నాడో, ఆ మార్గమునే నిష్కల్మషులై మానవశీలురైన మహర్షులు ఆశ్రయించినారు. 31

శ్లో॥ తద్బ్రహ్మ పరమం శుద్ధం సతాం వర్త్మ సనాతనమ్ ।
విగర్హ్య యాత పాషండా దైవం వో యత్ర భూతరాట్ ॥ 32

టీ:- తదితి. భూతరాట్ భూతానాం తామసానాం పతిః. 32

సనాతనమై, పరమ పవిత్రమై, పరిశుద్ధమై, సజ్జనులకు మార్గమై, భాసించుచున్నదో ఆ వేదమును నిందించి తామసులకు పతియైన వానిని దైవంగాచేసుకొని పాఖండమతమును పొందుదురుగాక!32

మైత్రేయ ఉవాచ

శ్లో॥ తస్యైవం వదతశ్శాపం భృగోస్స భగవాన్భవః ।
నిశ్చక్రామ తతః కించిద్విమనా ఇవ సానుగః ॥ 33

టీ:- తస్యేతి. అన్యోన్య శాపేన ఉభయోర్నాశాద్విమనా ఇవేతి. తథాపి భగవదనుగృహీతానాం నాశో న స్యాదితి భావః. 33

మైత్రేయ మహర్షి ఈ విధముగా పలికెను.

ఈ విధముగా భృగువు శాపము ఇచ్చుచుండగా శివభగవానుడు అన్యోన్య శాపములద్వారా ఉభయ నాశనమున కొంచెము మనస్సు వికలమైన వానివలె తన అనుచరులతో అక్కడినుండి వెళ్ళిపోయెను. అయినప్పటికి భగవదనుగ్రము పొందిన వారికి ఎన్నటికి నాశము లేదు కదా! 33

శ్లో॥ తేఽపి విశ్వసృజస్సత్రం సహస్రపరివత్సరమ్ ।
సంవిధాయ మహేష్వాస యత్రేజ్య ఋషభో హరిః ॥ 34

టీ:- తఇతి. ఋషభః సర్వశ్రేష్ఠః. శ్రీహరిః. యత్ర ఇజ్యః పూజ్యః. తత్సహస్ర పరివత్సరం సత్రం. సమ్యగ్విధాయ హే మహేష్వాస విదుర. (34)

ఓ గొప్ప ధనుస్సుగల విదురా! ఆ ప్రజాపతులు ఏ సత్రయాగమందు సర్వశ్రేష్టుడైన శ్రీహరి పూజ్యుడో వేయి సంవత్సరముల సత్రయాగమును చక్కగా ఆచరించి...34

శ్లో॥ ఆప్లుత్యావభృథం యత్ర గంగా యమున యాన్వితా ।
విరజేనాత్మనా సర్వే స్వం స్వం ధామ యయుస్తతః ॥ 35

టీ:- ఆప్లుతేతి. యత్ర ప్రయాగే అన్వితా తత్రావభృథ స్నానం కృత్వా తతః స్థానాత్ స్వం స్వం స్థానం యయుః. 35

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,**
**ద్వితీయోఽధ్యాయః**

తరువాత ప్రయాగ యందు యమునానదితో కూడిన గంగ యందు అవభృథ స్నానముచేసి నిర్మలములైన అంతఃకరణము కలిగి వారి వారి స్థానములకు వెళ్ళిరి. 35

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు**
**రెండవ అధ్యాయము సమాప్తము.**

## తృతీయోఽధ్యాయః

శ్లో॥ తృతీయే తు సతీ తాత యజ్ఞోత్సవదిదృక్షయా ।
గమిష్యంతీ మహేశేన వారితా నీతిహేతుభిః ॥

మైత్రేయ ఉవాచ

శ్లో॥ సదా విద్విషతోరేవం కాలో వై ధ్రియమాణయోః ।
జామాతుశ్శ్వశురస్యాపి సుమహానతిచక్రమే ॥ 1

టీ:- సదేతి. ధ్రియమాణయోః జామాతుః శ్వశురస్యాపి అవతిష్ఠమానయోః. ధృఙ్ అవస్థాన ఇత్యస్మాన్నిష్పన్నం. 1

శ్లో॥ యదాభిషిక్తో దక్షస్తు బ్రహ్మణాపరిమేష్ఠినా ।
ప్రజాపతీనాం సర్వేషామాధిపత్యే స్మ యోఽభవత్ ॥ 2

టీ:- యద్యపి. రుద్ర విహీనో యజ్ఞో నాస్తేవ్య. తథాపి దక్షస్య రుద్ర పరిత్యాగో ద్వేషాద్గర్వాచ్చ. తత్ర ద్వేష హేతురుక్తః. గర్వే హేతుమాహ- యదేతి. యదా తు ప్రజాపతీనామాధిపత్యే అభిషిక్తః. తదా తస్యస్మయో గర్వోఽభవత్. 2

## 3వ అధ్యాయము

యజ్ఞోత్సవమును దర్శించాలని అభిలాష కలిగి వెళ్ళడానికి సిద్ధమైన సతీదేవిని నీతి మార్గముచే యుక్తులచే శివుడు నివారించుట

మైత్రేయుడు పలికెను.

ఎల్లప్పుడు ద్వేషించుకొనుచునే యున్న మామ అల్లుళ్ళకు కాలము ఆ విధముగానే సాగి పోయెను. ఈ విధముగా చాలాకాలము గడిచెను. 1

నిజానికి రుద్రదేవతారహితమైన యజ్ఞము లేనేలేదు. అయినప్పటికి దక్షుడు రుద్ర పరిత్యాగము చేయడానికి రెండు కారణములు ఒకటి ద్వేషము. ద్వేషమునకు కారణము తాను వచ్చినప్పుడు లేచినిలుచొని నమస్కరించక పోవడము. రెండవది గర్వము. గర్వమునకు కారణము ప్రజాపతులందరిపైన అధిపతిగా బ్రహ్మదేవుడు దక్షుని అభిషిక్తుని చేయడమే. 2

శ్లో॥ ఇష్ట్వా చ వాజపేయేన బ్రహ్మిష్ఠానభిభూయ సః ।
బృహస్పతిసవం నామ సమారేభే క్రతూత్తమమ్ ॥ 3

టీ:- ఇష్ట్వేతి. గర్వాదేవ సర్వాన్ బ్రహ్మిష్ఠాన్. సేశ్వరానభిభూయ తిరస్కృత్య. శ్రు. "వాజపేయే నేష్ట్వా బృహస్పతిసవేన యజేతే" తి శ్రుతేః. వాజపేయేనేష్ట్వా బృహస్పతిసవం సమారేభే. 3

వాజపేయ యాగమునుచేసి బ్రహ్మిష్ఠులను అనగా శివుడికి యజ్ఞభాగము నీయక, శివానుయాయులను పిలిచి సత్కరించక అవమానపరచి బృహస్పతి సవమనే ఉత్తమమైన క్రతువును ప్రారంభించెను. 3

శ్లో॥ తస్మిన్ బ్రహ్మర్షయస్సర్వే దేవర్షి పితృదేవతాః ।
ఆసన్ కృతస్వస్త్యయనాస్తత్పత్న్యశ్చ స భర్తృకాః ॥ 4

టీ:- తస్మిన్నితి. కృతస్వస్త్యయానాః కృతమంగళాః. సభర్తృకా ఇతి. దక్షిణాదిభిః ప్రధమమర్చ్యి తానామపి పత్న్యర్చణేనపునరర్చణముక్తం. 4

ఆ యజ్ఞమున పాల్గొన్న బ్రహ్మర్షులు, దేవర్షులు, పితృదేవతలు దక్షిణా దానములచే పూజితులై వారి పత్నులను పూజించినపుడు (దంపతుల పూజలో) మళ్ళీ వీరు కూడా పూజితులైరి. 4

శ్లో॥ తదుపశ్రుత్య నభసి ఖేచరాణాం ప్రజల్పతామ్ ।
సతీ దాక్షాయణీ దేవీ పితృయజ్ఞ మహోత్సవమ్ ॥ 5

టీ:- తదితి తత్ తదా. ఖేచరాణాం ప్రజల్పతాం సతాం పితృ యజ్ఞ మహోత్సవం శ్రుత్వా. 5

తన తండ్రిగారి యజ్ఞమహోత్సవమును గూర్చి ఆకాశమార్గమున వెళ్ళుతూ ఆకాశసంచారులైన దేవతలు మాట్లాడుకొనుచుండగా సతి దాక్షాయణీదేవి (వినెను) విని...5

శ్లో॥ వ్రజంతీస్సర్వతోదిగ్భ్య ఉపదేవవర స్త్రియః ।
విమానయానాస్సప్రేష్ఠా నిష్కకంఠీస్సువాసనః ॥ 6

టీ:- వ్రజంతీరితి. తత్ర వ్రజంతీరుపదేవానాం గంధర్వాదీనాం. వరస్త్రియశ్చ స్వనిలయస్యాభ్యాశే సమీపే దృష్ట్వా ఔత్సు క్యాత్పతి మభ్యభాషతేతి త్రయాణామన్వయః. కథం భూతాః స్త్రియో దృష్టాః విమానాని యానాని యాసాం తాః. ప్రేష్ఠైస్సహితాః. నిష్కాని పతకాదీని కంఠేషు యాసాం. 6

ఆకాశమున అన్ని దిక్కుల నుండి వెళ్ళుతున్న గంధర్వుల శ్రేష్ఠ పత్నులు, భర్తృసహితలై మెడలో బంగారు పతకములు కంఠమున ధరించి, శోభనకర వస్త్రములను ధరించి, విమానయానములు కలిగి. 6

శ్లో॥ దృష్ట్వా స్వనిలయాభ్యాశే లోలాక్షీర్మృష్ట కుండలాః ।
పతిం భూతపతిం దేవమౌత్సుక్యాదభ్యభాషత ॥ 7

టీ:- దృష్ట్వేతి. శోభనాని వాసాంసి యాసాం. లోలాని చంచలాని అక్షీణి యాసాం. మృష్టాన్యుజ్జ్వలాని కుండలాని యాసాం తాః. 7

చంచలములైన నేత్రములుగల ఉజ్వలముగా ప్రకాశించుచున్న కర్ణకుండలములు గలిగి, వెళ్ళుచున్న వారిని తన ఇంటి సమీపములో చూచి భూతపతిఅయిన తన పతిని, దేవదేవుని గూర్చి ఉత్సుకతతో ఇట్లు భాషించెను. 7

**సత్యువాచ**

శ్లో॥ ప్రజాపతేస్తేశ్వశురస్య సాంప్రతం
నిర్యాపితో యజ్ఞమహోత్సవః కిల ।
వయం చ తత్రాభిసరామవామతే
యద్యర్థితామీ విబుధా వ్రజంతి హి ॥ 8

**సతీదేవి ఇలా అనెను.**

హే శివా! ఇప్పుడు ప్రజాపతి అయిన మీ మామగారి యొక్క యజ్ఞమహోత్సవము మునులచే ప్రవర్తిల్లుచున్నది. నీకు యజ్ఞము చూడాలని కోరికయున్నచో మనము వెళ్ళుదాము. ఇంకాయజ్ఞము పూర్తికాలేదు. ఎందుకనగా ఇప్పటికీ ఇంకా చాలా మంది దేవతలు వెళ్ళుచున్నారు. 8

టీ:- ప్రజాపతేరితి. నిర్యాపితః ప్రవర్తితః. హే వామ శివ. తేయ దృర్థితా ఇచ్ఛా. తర్హి వయం చ తత్రాభిసరామ గచ్ఛామః. న చాద్యాపి యాగో నివృత్తః. యతో౽మీ విబుధాః వ్రజంతి. 8

శ్లో॥ తస్మిన్భగిన్యో మమ భర్తృభిస్స్వ
క్షైర్ధ్రువం గమిష్యంతి సుహృద్దిదృక్షవః ।
అహం చ తస్మిన్భవతాభికామయే
సహోపనీతం పరిబర్హ మర్హితుమ్ ॥ 9

ఉత్సుకతను ప్రకటిస్తూ ఇంకా ఇట్లనెను. నా అక్కాచెల్లెళ్ళు వారివారి భర్తలతో బంధుమిత్రాదులను చూడగోరి తప్పకుండా వెళుతారు. నేను కూడా నీతోగూడి మా తల్లిదండ్రులు ఈ సందర్భములో ఇచ్చిన అలంకార వస్తువులను స్వీకరించుటకు ఇష్టపడుచున్నాను. 9

టీ:- ఔత్సుక్యం ప్రకటయంత్యాహ-షడ్భిః. తస్మిన్నితి. పితృభ్యాము పనీతం దత్తం. పరిబర్హమలంకారాదిద్రవ్యం. భవతాసహఅర్హితుం స్వీ కర్తుమభికామయే. అర్హితమితి పాఠేసత్కృతం పరిబర్హ మిచ్ఛామీతి. 9

శ్లో॥ తత్ర స్వసౄర్మే నను భర్తృసంమితా మాతృ
ష్వసౄః క్లిన్నధియం చ మాతరమ్ ।
ద్రక్ష్యే చిరోత్కంఠమనా మహర్షిభ
రున్నీయమానం చ మృడాధ్వర ధ్వజమ్ ॥ 10

ఓ మృడా, సుఖకారకా, ఆయజ్ఞమహోత్సవమునకు భర్తలతో వచ్చే నా అక్కచెల్లెళ్ళను, మా చిన్నమ్మ పెద్దమ్మలను ప్రేమతో తడిసిన మనస్సుగల మా అమ్మను చిరకాలము నుండి చూడాలనే మనస్సు గలదు. అంతే కాదు మా తండ్రి ఆచరిస్తున్న యజ్ఞాలలో ధ్వజమువలె శ్రేష్ఠమైన యజ్ఞమును. ఆ యజ్ఞమున రెప రెపలాడుతున్న ధ్వజమును యూపస్తంభమును చూడాలని కోరిక బాగా ఉన్నది. 10

టీ:- తత్రేతి. స్వసౄః భగినీః భర్తృభిస్సమ్మితాః సదృశీః. క్లిన్నధియం స్నేహార్ద్ర చిత్తాం చిరముత్కంఠం ఉత్సుకం మనో యస్యాస్సాహం.

హే మృడ ఉన్నీయమానమూర్ధ్వం క్రియమాణం. ప్రవర్త్యమానం. అధ్వరేషు ధ్వజమివ దృశ్యం శ్రేష్ఠమధ్వరం. యద్వా ఉత్క్షిప్యమాణమితి పాఠే యజ్ఞకేతుం యూపం వా. 10

శ్లో॥ త్వయ్యేతదాశ్చర్యమజాత్మమాయయా
వినిర్మితం భాతి గుణ త్రయాత్మకమ్ ।
తథాప్యహం యోషిదతత్త్వవిచ్చ తే
దీనా దిదృక్షే భవ మే భవక్షితమ్ ॥ 11

,టీ:- అహో కిం తత్రాశ్చర్యం యేన తవైతదౌత్సుక్యమితి చేదత ఆహ-త్వయీతి. హే అజ ఏతద్విశ్వం ఆశ్చర్యరూపం. త్వయ్యేవత్వన్మాయయా విరచితం .విభాతి. అతోయద్యపి తవ నాశ్చర్యబుద్ధిః. తథాప్యహం యోషిత్. ఉత్సుకస్వభావా తవ తత్త్వం చ న జానామి. అతో దీనా కృపణాసతీ. హే భవ. మే భవక్షితిం జన్మభూమిం. దిదృక్షే ద్రష్టు -మిచ్ఛామి. 11

ఓ సతీ అంత ఉత్సుకతను పొందుటకు ఆక్కడ ఆస్వాదించుటకు గల విశేషమేమున్నది? అని అనుకొందువేమో! ఓ జన్మరహితా! ఈ జగత్తంతా ఆశ్చర్యరూపమే, 'ఆసమంతాచ్చరితుం ఆస్వాదితుం యోగ్యం ఆశ్చర్యం, చరగతిభక్షణయోః' అద్భుతమైన గుణత్రయాత్మకమైన ఈ జగత్తంతా నీ యందే, నీ మాయ ద్వారా సృజింపబడి, నీ యందు భాసించుచున్నది. ఆశ్చర్యాత్మకమైన జగత్తునకు అధిష్ఠానము నీవు కనుక నీ కాశ్చర్యము లేదు ఉత్సుకత కలుగదు. కానీ రెండు కారణముల ద్వారా నాకు ఉత్సుకత. ఒకటి స్త్రీ సహజ స్వభావమగు, ఉత్సుకత్వము. 'ఇష్టార్థోద్యుక్తత్సుకః' తన కిష్టమైన దాని కొరకు విశేష ప్రయత్నము చేయుట రెండవది నీ యథార్థ ఆత్మస్వరూపమును తెలుసుకోలేకపోవుట కనుక హే భవా! దీనురాలగు నేను నా పుట్టినింటిని చూడ గోరుచున్నాను. 11

శ్లో॥ పశ్య ప్రయాం తీర భవాన్య యోషితోఽ పృ
లంకృతాః కాంతసఖా వరూధశః ।
యాసాం వ్రజద్భిశ్శితికంఠ మండితం
నభో విమానైః కలహంసపాండుభిః ॥ 12

టీ:- దిదృక్షామేవ కైముతికన్యాయేన వ్యనక్తి-ద్వాభ్యాం. పశ్యేతి. హే అభవతి సుహృద్వియోగ దుఃఖం త్వయా నానుభూతమితి భావః. అన్యా యోషితః సంబంధరహితా అపి ప్రయాంతీః పశ్య. కాంతసఖాః భర్తృసహితాః. వరూధశః సంఘశః కథంభూతాః. యాసాం విమానైర్నభో మండితం. తాః. హే శితికంఠ నీలకంఠేతి పరానుగ్రహార్థం త్వయా విషం భక్షితమితి సూచయతి. 12

ఓ అభవా! జన్మరహితా! అభవా అనుటలో స్వారస్యముకలదు. భవముఅనగా జన్మజన్మకలిగిన తల్లి తండ్రి, అక్కా చెల్లెలు, అన్నా తమ్ముడు అను అనుబంధములు ఏర్పడి వారిని విడిచినప్పుడు ఆ వియోగ దుఃఖము ఏర్పడుతుంది. నీవు అనుబంధ సుఖాస్వాద, వియోగ దుఃఖాస్వాదన రెండూ లేని వాడవు. ఓ శితికంఠా! గుంపులుగుంపులుగా ఏ చుట్టరికము లేకున్నా చక్కగా అలంకృతులై భర్తలతో తెల్లటి రాజహంసలవలెఉన్న విమానములతో ఆకాశమునకే అందమును కలిగించిన ఇతర స్త్రీలను చూడుము. ఇక్కడ సతీదేవి సంబోధన "ఓ శితికంఠ" అని అనగా నల్లని కంఠము కలవాడా. ఇతరులను కాపాడటానికి విషమును భక్షించిన వాడా అనగా నాయందు విశేషదయ ఉండనే ఉండాలి కదా! అని సూచన. 12

శ్లో॥ కథం సుతాయాః పితృగేహ కౌతుకం
నిశమ్య దేహస్సురవర్య నేంగతే ।
అనాహుతా అప్యభియంతి సౌహృదం
భర్తుర్గురోర్దేహ కృతశ్చ కేతనమ్ ॥ 13

టీ:- కథమితి. హే సురశ్రేష్ఠ పితృ గేహోత్సవం నిశమ్య. సుతాయాః దేహః కథం నేంగతేద్రష్టుం నప్రచలతి. తథాప్యనాహూతాస్సంతః కథంగచ్ఛామస్తత్రాహ - సౌహృదం. సుహృత్సంబంధికేతనం గృహం.

ఓ సురశ్రేష్ఠా! ఇంతమంది వెళ్ళుచుండగా, మా పుట్టింటిలో ఇంత గొప్ప ఉత్సవము జరుగుతుండగా విని, కుమార్తెనైన నేను ఎందుకు వెళ్ళకూడదు? ఔను వెళ్ళవచ్చును కానీ వెళ్ళేవారికి అందరికి ఆహ్వానములు ఉన్నవి. మనకున్నదా! లేదు అంటావేమో. తల్లి గారింటిని గూర్చి, అత్తగారింటిని గూర్చి, సుహృత్తుల గృహములను గూర్చి, ఆహ్వానము ఉండవలసిన అవసరములేకనే వెళ్ళవచ్చునన్నారు పెద్దలు. (13)

తథా భర్త్రా దీనాం చ గృహం. అనాహుతా అపి అభియాంతి సంతః ప్రస్వత్వమార్షం. 13

శ్లో॥ తన్మే ప్రసీదేదమమర్త్య వాంఛితం
కర్తుం భవాన్ కారుణికో బతార్హతి ।
త్వయాత్మనోర్ధేహమదభ్ర చక్షుషా
నిరూపితా మానుగృహాణ యాచితః ॥ 14

ఓ అమర్త్యా! ఆ కారణమున నాపై ప్రపన్నుడవుకమ్ము, నీవు కరుణామూర్తివి. అందుకొరకు నేను మా తండ్రి గృహమునకు వెళ్ళాలను కోరికను తీర్చుటకు అర్హుడవు. నీవు గొప్ప జ్ఞానముతో నన్ను శరీర సగభాగము చేసుకొన్నావు. (అధభ్ర చక్షువనగా = పత్ని శరీరమున సగ భాగమని యజుర్వేద బ్రాహ్మణము చెప్పుచున్నది. ఆ వేదజ్ఞానము కలిగి) అందుకే నీవు అర్ధనారీశ్వరుడవని ప్రసిద్ధుడవైనావు. అడగకుండగనే అను గ్రహించేదేవుడవు నిన్ను నేనడుగుచున్నాను. నన్నను(గ్రహింపుము .14

టీ:- తదతి. హే అమర్త్య తత్ తస్మాత్ ప్రసీద. ఇదం మే వాంఛితం కర్తుం. భవనార్హతి కారుణికత్వమేవాహ-అదభ్రచక్షుషా అనల్పజ్ఞానేనాపి త్వయా ఆత్మనోదేహాస్యార్థే. అహం నిరూపితా భృతా. యతోఽర్ధ నారీశ్వర ఇతి ఖ్యాతోఽసి. అతో మామనుగృహాణ యాచితస్సన్. 14

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఏవం గిరిత్రః ప్రియయాభిభాషితః
ప్రత్యభ్యధత్త ప్రహసన్ సుహృత్ప్రియః ।
సంస్మారితో మర్మభిదః కువాగిషూన్
యానాహ కో విశ్వ సృజాం సమక్షతః ॥ 15

మైత్రేయ మహర్షి ఈ విధముగా పలికెను.

ఈ విధముగా తన ప్రియురాలగు సతీదేవి చేత ప్రార్థితుడైన పరమశివుడు సహృదయ ప్రియుడు ప్రజాపతుల సమక్షమున మర్మ భేదకములైన దక్షప్రజాపతి చెడు మాటలనే బాణముల స్మరణ కలిగి, నవ్వుతూ ఈ విధముగా సమాధానము చెప్పెను. 15

టీ:- ఏవమితి. అభిభాషితః అభియాచితః. కః దక్షః యానాహ మర్మహృదయంభిందంతీతి తథా తాన్. కువాగిషూన్ దురుక్తి బాణాన్. సంస్మారితస్సన్. 15

శ్రీ శంకర ఉవాచ

శ్లో॥ త్వయోదితం శోభనమేవ శోభనే అనాహు
తా అప్యభియంతి బంధుషు ।
తే యద్యనుత్పాదిత దోషదృష్టయో
బలీయసానాత్మ్యమదేన మన్యునా ॥ 16

టీ:- త్వయేతి. అనాహుతా అపీతి త్వయా యదుదితముక్తం తచ్ఛోభనమేవ. కింతు అనాత్మ్యం దేహదావహంకారః తత్కృతేన మదేన మన్యునా చ. తే బంధవో యద్యనుత్పాదిత దోష దృష్టయః. న ఉత్పాదితా ఆరోపితా దోషే దృష్టిరేష్యాం తే. యది భవంతి. 16

శ్లో॥ విద్యా తపో విత్త వపుర్వయః కులై
స్సతాంగుణైష్షడ్భిరసత్తమేతరైః ।
స్మృతౌ హతాయాంభృత మానదుర్దృశ
స్తథానపశ్యంతి హి ధామ భూయసామ్ ॥ 17

శివభగవానుడు ఇట్లు పలికెను.

సతీ ! శోభనే! నీవు చెప్పినది సత్యం బాగానే ఉంది, పిలవకున్నా బంధువుల ఇంటికి వెళ్ళుతారు కాని ఎప్పుడు? దేహాదుల యందు అహంకార బుద్ధి కలిగి తత్కృత మదముచే, బలీయమైన క్రోధము కలిగి, దోష దృష్టిగల బంధువుల ఇంటికి కాదు. దోష దృష్టి రహితులైన బంధు గృహములకు వెళ్ళవచ్చు. 16

1.చదువు 2.తపస్సు 3.సంపద 4.శరీరము 5.యౌవనము 6.సత్కులీనత ఈ ఆరు కలిగిన దక్షునకు మహనీయులైన శివాదుల యందు దోషదృష్టి ఎందుకు కలిగినది? వివేకజ్ఞానము నశించుటచేత. ఎవరికి వివేకజ్ఞానము నశించునో వారు మహనీయుల దివ్యతేజమును దర్శించలేరు.

టీ:- తర్హి నను విద్యాదిగుణోయుక్తో దక్షః. తాదృశేషు మహత్సు కథం దోషదృష్టిర్భవేత్తత్రాహ-విద్యేతి విద్యాదిభిరేవ స్మృతౌ హతాయాం. వివేక జ్ఞానే నష్టేసతి. భూయసాం మహత్తమానాం. ధామ తేజః. న పశ్యంతి హి. నను గుణైః కథం వివేకనాశస్తత్రాహ-సతాం గుణైః వివేకహేతుభిరపి. అసత్తమానామితరైః దోషభూతైః. అతఏవ తైః భృతః ధృతః పుష్టో వా. అహం విద్వాన్ తాపస ఇత్యాదిః. మానోగర్వః. తేన దుష్టాదృష్టిః యేషాం తే. 17

శ్లో॥ నైతాదృశానాం స్వజనవ్యపేక్షయా
గృహాన్ప్రతీయాద నవస్థితాత్మనామ్ ।
యేఽభ్యాగతాన్వక్రధియాభిచక్షతే
హ్యారోపిత భ్రూభిరమర్షణాక్షిభిః ॥ 18

టీ:- నైతాదృశానామితి. స్వజనవ్యపేక్షయా బంధుదృష్ట్యా. గృహాన్న ప్రతీయాత్ నావలోకయేత్. అనవస్థితచిత్తత్వమేవాహ-యే వక్రధియా కుటిలయా బుద్ధ్యా పశ్యంతి. ఆరోపితా ఉత్తంభితా భ్రూర్యేషు తాన్యా రోపిత భ్రూణి తైరారోపిత భ్రూభిరితి వా. అమర్షణైస్సక్రోధైరక్షిభిః. 18

ప్రశ్న:- ఇన్ని గుణములుండగా వివేకజ్ఞానము ఎట్లు నశించును అనగా సజ్జనులకు ఆరు గుణములు వివేక జ్ఞానమును ఎట్లు కలిగించునో అట్లానే ఈ ఆరు గుణములు దుర్జనులకు అహంకారమును కలిగించును. అట్టి వారికి ఇవి దోషములుగా పరిణమించును. నేను విద్యావంతుడను, నేను తాపసుడను అను గర్వముచే దుష్టచిత్తులై దోషదృష్టులగుదురు. 17

చపలచిత్తులైన ఇట్టివారింటికి బంధుదృష్టితో వెళ్ళరాదు. వారు కనుబొమ్మలు ముడిచి ఎగిరేస్తూ క్రోధదృష్టులై ఇంటికి వచ్చిన వారిని కుటిల బుద్ధితో చూస్తుంటారు. 18

శ్లో॥ తథారిభిర్న వ్యధతే శిలీముఖైశ్శేతేఽర్ది
తాంగో హృదయేన దూయతా ।
స్వానాం యథా వక్రధియాందురుక్తి
భిర్దివానిశం తప్యతి మర్మతాడితః ॥ 19

టీ:- నను స్వజనానాం గృహం సుహృద్భిర్గంతవ్యం తేషాం దుశ్చేష్టితం చ సోఢవ్యం న తస్యాతి దుస్సహత్యాదిత్యాహ- తథేతి. అరిభిశ్శిలీముఖైర్బాణైర ర్దితాంగః ఖండితగాత్రోఽపి తథానవ్యధతే. యతః శేతే స్వపితి. స్వానాం దురుక్తిభిః. మర్మసు తాడితో యథా. దూయతా వ్యధమాన్యేన. హృదా దివానిశంత్యపతి. 19

నా వాళ్ళు అనుకున్నప్పుడు, ఒక మాట వాళ్ళు అన్నా తప్పుగా పలికినా, తప్పున్నా, ఒక దుశ్చేష్టచేసినా సహించి వెళ్ళాలి. వెళ్ళకుండా ఉండరాదందువేమో కాని శత్రువు యుద్ధరంగమున తన బాణములచే కొట్టినప్పుడు శరీరావయములు ఖండించబడినప్పటికీ ఎంత దుఃఖం కలగదో, బాణాలుతాకినా రాత్రో పగలో కొంతనిద్రిస్తాడు. కాని నావాళ్ళు అనుకున్నవాడు వంకరబుద్ధిచే చెడుమాటలనే బాణములు హృదయమునకు తాకినపుడు పగలు రాత్రి ఎప్పుడు నిద్దురరాదు. ఈ వ్యధ చేత మనస్సు రాత్రి పగలు తపించుచుండును. 19

శ్లో॥ వ్యక్తం త్వముత్కృష్టగతేః ప్రజాపతేః
ప్రియాత్మజానామసి సుభ్రుమే మతా ।
అథాపి మానం న పితుః ప్రపత్స్యసే
మదాశ్రయాత్కః పరితప్యతే యతః ॥ 20

టీ:- మయి తత్ర గతాయాం నేయం శంకేతి చేత్తత్రాహ-వ్యక్తమితి. వ్యక్తం నిశ్చితం ఉత్కృష్టా గతిః స్థితిర్యస్య. తస్యాత్మజానాం కన్యానాం మధ్యే. త్వం ప్రియేతి మే సంమతాసి. తథాపి పితుస్సకాశాత్. మానం న లప్స్యసే. మదాశ్రయాత్ మత్సంబంధాత్. 20

నేను వెళ్ళినంతమాత్రాన ఇంత జరుగుతుంది అనే ఆ శంక మీకు వద్దు అని అనెదవేమో! దక్షప్రజాపతి సంతానములో ఉన్నతస్థితి కలిగిన వారిలో గూడా అందరికన్నా నీ వంటే ఆయనకు మిక్కిలి వాత్సల్యము. అయినా ఇప్పుడు ఆ ప్రీతిని నీవు పొందబోవు. ఎందుకనగా నా మూలకముగా బాగా పరితాపమును పొంది యున్నాడు. ఇప్పుడు నీవు వెళ్ళితే ఆ అక్కసునంతా నీ యందు వెళ్ళ గక్కుతాడు. కారణం నా ధర్మపత్నివి నీవు కనుక, (కించిత్= లోకంలో గూడా ప్రధానమైన వ్యక్తి యందు గల ద్వేషమును అనుచరుల యందు ప్రదర్శించడం సహజం). 20

శ్లో॥ పాపచ్యమానేన హృదాతురేంద్రియ
స్సమృద్ధిభిః పూరుషబుద్ధిసాక్షిణామ్ ।
అకల్య ఏషామధిరోఢుమంజసా
పదం పరం ద్వేష్టి యథా సురా హరిమ్ ॥ 21

టీ:- నన్వేవమపి భగవన్త్వయాకిమితి దక్షఃతిరస్కృతః.యతో2సౌ త్వాం ద్వేష్టి అతఆహ-పాపచ్యమానేనేతి.పాపచ్యమానేనేన.అలం దహ్యమానేనహృదా.అతిరేంద్రియః దుఃఖితేంద్రియః.కాభిః పూరుషోజీవః. తస్య బుద్ధిశ్చిత్తం. తత్సాక్షిణాం నిరహంకారిణామిత్యర్థః. సమృద్ధిభిః పుణ్యకీర్త్యాదిభిః. ఏషాంపదం స్థానమైశ్వర్యం. ప్రాప్తుం అకల్యః అశక్తస్సన్. తాన్ పరం కేవలం ద్వేష్టి. అసురాః యథా శ్రీహరిం ద్విషంతి. 21

శ్లో॥ ప్రత్యుద్గమప్రశ్రయణాభివాదనం
విదీయతే సాధుమిథస్సుమధ్యమే ।
ప్రాజ్ఞైః పరస్మై పురుషాయచేతసా
గుహాశయా యైవ న దేహమానినే ॥ 22

ఓ స్వామీ నీ చేత దక్షుడు ఎందుకు తిరస్కరింపబడ్డాడు. కనుక అతడు నిన్ను ద్వేషిస్తున్నాడు. అనగా కాదు నీద్వేషానికి కారణం ఇది. మహాత్ముల అణిమాది సిద్ధులు, పుణ్యకీర్తి ఇవి విని మండుచున్న హృదయముగలవాడై వ్యాకులము చెందిన ఇంద్రియముగల దక్షుడు తన గొప్ప జన్మ ధన ధాన్యాదుల ద్వారా అస్మత్ సదృశులైన , జీవ బుద్ధి సాక్షులైన, 'సర్వ'జ్ఞులైన జ్ఞానుల నిరహంకారుల ఉత్కృష్ట స్థానమును కష్టం లేకుండా అనాయాసంగా పొందదానికి అసమర్థుడై ఏ విధముగా శ్రీహరి ఐశ్వర్యమును పొందలేక అసురులు కేవలం శ్రీహరిని ద్వేషిస్తారో ఆ విధంగా ఈ దక్షుడు కేవలం నన్ను ద్వేషిస్తున్నాడు. (కించిత్ 'పురుషబుద్ధిసాక్షిణాం' పురుష శబ్దమునకు జీవుడని జీవబుద్ధి అనగా జీవచిత్తము చిత్తముయందు భాసించు చైతన్యము పరమాత్మా, 'సాక్షీ, చేతా, కేవలో నిర్గుణశ్చ' శ్వేతాశ్వత రోపనిషత్, ఆ సాక్షీ స్వరూపమును పొందిన శోధితజీవుడు ఆత్మ స్వరూపుడే ఆతడే, పురుష బుద్ధి సాక్షి, జ్ఞాని.) 21

మరిస్వామీ! మీరు ఎదురేగి వినయపూర్వక నమస్కారములు చేయక అవమానించితిరి అని అనుకుంటావేమో! లోకంలో పరస్పరం ఎదుర్కొని నమస్కరించడం అనునది ఏది చేస్తున్నావో ఆ పని వివేకవంతులు చక్కగా ఆచరిస్తున్నారు. చక్కగా నమస్కరించడం అనగా!

టీ:- నను త్వయా ప్రత్యుత్థాన వినయాద్యకరణాదవజ్ఞాత ఏవాసౌ దక్షః తత్రాహ-ప్రత్యుద్గమేతి. హే సుమధ్యమే. ప్రత్యుద్గమాదికం మిథో జనైర్యద్విధీయతే. తత్ప్రాజ్ఞైస్సాధు విధీయతే. సాధుత్వమేవాహ- పరస్మై శ్రీవాసుదేవాయ. గుహాశయాయ అంతర్యామిణ ఏవ. తచ్చ చేతసైవ. పరిపూర్ణే తస్మిన్ కాయికవ్యాపారాయోగాత్. అతో అంతర్యామిదృష్ట్యా మనసైవ సర్వం కృతమితి భావః. 22

శ్లో॥ సత్త్వం విశుద్ధం వసుదేవ శబ్దితం
యదీయతే తత్ర పుమానపావృతః ।
సత్త్వే చ తస్మిన్భగవాన్వాసుదేవో
హ్యధోక్షజో మే నమసా విధీయతే ॥ 23

టీ:- కించ న కేవలం అభ్యాగతేష్వేవ శ్రీవాసుదేవదృష్ట్యా నమనం క్రియతే. కింతు నిత్యమేవ మనసి శ్రీవాసుదేవశ్చింత్యత ఇత్యాహ-సత్త్వమితి. విశుద్ధం సత్త్వమంతఃకరణం సత్త్వగుణో వసుదేవ శబ్దితం వసుదేవశబ్దేనోక్తం. కుతః యద్యస్మాత్. తత్ర తస్మిన్. సత్త్వే. పుమాన్ వాసుదేవః. ఈయతే ప్రకాశతే. అపగతమావృతం ఆవరణం యస్మాత్సః అయమర్థః. వసుదేవే భగవతి ప్రతీయత ఇతి హి వాసుదేవఃపరమేశ్వర. ప్రసిద్ధః. స చ విశుద్ధే సత్త్వే ఈయతే ప్రతీయతే. అతః ప్రత్యయార్థేన

సజ్జనులు సర్వుల హృదయములయందు భాసించు అంతర్యామియైన వాసుదేవునకు నమస్కరించినట్లు, పరిపూర్ణ స్వరూపమునకు శారీరక నమస్కారము చేయుట కుదరదు. కావున మొదలే అంతర్యామి దృష్ట్యా మనస్సుచే పరమాత్మను పూజించడం గౌరవించడం అని తెలిపినాను. బాహ్యదేహాభిమానులైన వారికి ఈ పనులు చేయబడవు. 22

ఓ సతీ! కేవలము వచ్చినవారి యందు మాత్రమే వాసుదేవ దృష్టిచేత నమస్కరించడం కాదు. నిరంతరము మనస్సున వాసుదేవుడిని చింతిస్తున్నాను అని ఈ విధముగా చెప్పుచున్నాడు.

ఇక్కడ వసుదేవ శబ్దము చేత రజోగుణ తమో గుణరహితమైన శుద్ధమైన సత్త్వము అనగా అంతఃకరణమని, అథవా సత్వగుణమని అర్థము. అంతఃకరణములో ఆదరణము తొలగినవాడై ఆ అంతః కరణముయందు లేదా సత్వగుణముయందు వాసుదేవుడు ప్రకాశించు -చున్నాడు. ఆ సత్వమును నేను నమస్కారములచేత సేవించు-చున్నాను. ఎందుకనగా ఆ పరమాత్మ ఇంద్రియ అగోచరుడు. పుణ్యకర్మలచే ప్రకాశించునది అని వసుదేవ శబ్దమునకు వాచ్యము అంతఃకరణమే. 23

ప్రసిద్ధేన ప్రకృత్యర్థో నిర్ధార్యతే. తతశ్చ వాసయతి దేవమితి పుత్పత్త్యా వా. వసత్యస్మిన్నితి వా వసుః దీవ్యతే ద్యోతత ఇతి దేవః వసుభిః పుణ్యైః దీవ్యతే ప్రకాశత ఇతి వా. వసుదేవ శబ్దవాచ్యం శుద్ధం సత్త్వం. తతః కిమిత్యత ఆహ - సత్వే చ తస్మిన్. మే మయా. నమసా నమస్కారేణ. అనువిదీయతే ఆశ్చర్యత ఇత్యర్థః. మనసేతి పాఠే మనసా విశేషేణ ధీయతే ధార్యతే. చింత్యత ఇత్యర్థః. యతః అధోభూతేషు ప్రత్యాహృతేషు అక్షేషు ఇంద్రియేషు జాయతే ప్రకాశతే అధోక్షజః. ఇంద్రియాగోచర ఇతి వా అర్థః. 23

శ్లో॥ తత్తే నిరీక్ష్యో న పితాపి దేహకృద్దక్షో
మమ ద్విట్తమనువ్రతాశ్చ యే ।
యో విశ్వసృడ్యజ్ఞ గతం వరోరుమా
మనాగసం దుర్వచసాఽకరోత్తిరః ॥ 24

టీ:- తదితి. తస్మాత్తే త్వయా న నిరీక్ష్యః. దేహకృదసీతి పోషకత్వాది భిరౌపచారిక పితృత్వవ్యావృత్యర్థం ద్విట్ శత్రుః తదేవాహ- హేవరోరు. యోదక్షః. విశ్వసృజో యజ్ఞగతం మాం నిరపరాధం. తిరః అకరోత్ తిరస్కృతవాన్. 24

నిన్ను కన్నప్పటికి నన్ను ద్వేషించే అతడి అనుచరులను కన్నెత్తిగూడా చూడగూడదు. ఏ ప్రజాపతులంతా ఉండగా వారి యజ్ఞమునకు వెళ్ళిన నన్ను నిరాపరాధుడిని, దుష్టమైన వాక్కులచే తిరస్కరించినాడు కదా! 24

శ్లో॥ యది వ్రజిష్యస్యతిహాయ మద్వచో భద్రం
భవత్యా న తతో భవిష్యతి ।
సంభావితస్య స్వజనాత్పరాభవో
యదా స సద్యో మరణాయ కల్పతే ॥ 25

టీ:- విపక్షే దోషమాహ-యదీతి. మద్వచోఽతిహాయ అతిక్రమః. యతస్సంభావితస్య పూజితస్య సుప్రతిష్ఠతస్య. యదా పరాభవః. ఆస భవతి. తదా స పరాభవస్తస్య మరణాయ కల్పతే. అతస్త్వం గతా సతీ పునర్నాయాసీతి భావః. దక్షం దృష్ట్వా తజ్జమేనం దేహ మపి విదారయసీతి సూచితం. భవతి. 25

**విపక్షముల దోషమును చెప్పచున్నాడు.**

నామాట కాదని నీవు వెళ్ళితే నీకు మంచి జరుగదు. సుప్రతిష్ఠితుడైన వాడికి తనవారిచే పరాభవము ఎప్పుడు కలుగునో అదే ఆ పరాభవమునకు కారణము అవుతుంది. 25

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,**
**తృతీయోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు**
**మూడవ అధ్యాయము సమాప్తము.**

## చతుర్థోఽధ్యాయః

శ్లో॥ చతుర్థే తు పతిం హిత్వా గతా పిత్రావమానితా ।
రుషా నిర్భర్త్స్యతం యజ్ఞే జహౌ దేహమితీర్యతే ॥

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ ఏతావదుక్త్వా విరరామ శంకరః
పత్న్యంగ నాశం హ్యుభయత్ర చింతయన్ ।
సుహృద్దిదృక్షుః పరిశంకితా భవా
న్నిష్క్రామతీ నిర్విశతీ ద్విధాససా ॥ 1

టీ:- ఏతావదితి. ఉభయత్ర అనుజ్ఞాదానే బలాన్నివారణే చ. సుహృద్దిదృక్షుః నిష్క్రామతీ భవాత్పరిశంకితా పునర్నిర్విశతీ చ. తదా సా సతీ ద్విధా. ఆందోళితచిత్తా ఆస బభూవ. 1

శ్లో॥ సుహృద్దిదృక్షా ప్రతిఘాః ఆతదుర్మనాః
స్నేహాద్రుతంత్వశ్రుకలాతి విహ్వలా ।
భవం భవాన్య ప్రతిపూరుషం రుషా
ప్రధక్ష్యతీ వై క్షతజాతవేపథుః ॥ 2

## 4వ అధ్యాయము

ఈ అధ్యాయమున పతిని విడిచి తల్లిగారింటికి వెళ్ళిన సతీదేవి తండ్రిచే అవమానింపబడి కోపముచే అతడిని దూషించి ఆ యజ్ఞమున దేహమును విడుచుట వివరింపబడుచున్నది.

**మైత్రేయుడు ఇట్లు పలికెను.**

ఒకవేళ సతిని వెళ్ళమన్నా బలవంతముగా నివారించినా దేహత్యాగము చేసుకొనునేమోయని శంకరుడు ఇంతమాత్రము పలికి యూరకుండెను.

బంధువులను చూడాలనే బలీయమైన కోరికచో బయటకు వెళ్ళుతూ, శంకరుడు ఒప్పలేదని లోపలికి వస్తూ మనస్సు రెండు విధములా ఆలోచిస్తూ ఏదీ తేల్చుకోలేక వెళ్ళలేక ఉండలేక ఉయ్యాలవలె సతీదేవి ఊగిసలాటలో పడినది. 1

ఇష్ట బంధువులను చూడాలనే కోరికకు విఘ్నమేర్పడడం ద్వారా మనస్సు చెడినదై వారియందుగల ప్రేమచే రోదనముచేయుచు కన్నులవెంబడి నీరుకారుచుండగామిక్కిలి కల్లోలముచెందినదై ఎవరితో సమానుడైనపురుషుడులేడో అట్టి పరమశివుడిని కోపముతో ఊగిపోవుచు దహించువేయునా అన్నట్టు చూచెను. 2

టీ:- సుహృదితి. సుహృదాం దిదృక్షాయాః ప్రతిఘాతేన దుర్మనాః. అశ్రుణాం కలాభిర్లేశైః. అతివిహ్వలా వ్యాకులా అప్రతిపూరుషం స్వసమాన పురుషాంతరరహితం, ప్రధక్ష్యతీ భస్మీకరిష్యంతీవ. రుషా జాతో వేపథుః కంపో యస్యాః. 2

శ్లో॥ తతో వినిశ్వస్య సతీ విహాయ తం
శోకేన రోషేణ చ దూయతా హృదా ।
పిత్రోరగాత్స్త్రైణ విమూఢదీర్గృహా
న్ప్రేమ్ణాత్మనో యోఽర్ధమదాత్సతాం ప్రియః ॥ 3

అటు పిమ్మట గాఢముగా నిట్టూర్చి శోకముచే కోపముచే మండుచున్న హృదయముగలదై ప్రీతిపూర్వకముగా సతీదేవికి తన శరీర భాగమున అర్ధ భాగమును ఇచ్చినట్టి ప్రియతముడైన శివుడిని విడిచి స్త్రీ స్వభావమైన అనాలోచిత విమూఢమైన బుద్ధి కలిగి తల్లిదండ్రులవద్దకు వెళ్ళెను. 3

టీ:- తత ఇతి. తతః తం శ్రీరుద్రం. విహాయ పిత్రోర్గృహానగాత్. కథంభూతం యః ప్రీత్యా తస్యై ఆత్మనో దేహస్య అర్ధం అదాత్. త్యాగే హేతుః. స్త్రైణం స్త్రీస్వభావః తేన విముఢా ధీర్యస్యాస్సా. 3

శ్లో॥ తామన్వ గచ్ఛన్ ద్రుతవిక్రమాం సతీ
మేకాం త్రినేత్రానుచరాస్సహస్రశః ।
సపార్ష దయక్షామణిమన్మదాదయః
పురో వృషేంద్రాస్తరసా గతవ్యథాః ॥ 4

ఒంటరియై శీఘ్రముగా వెళ్ళుచున్న సతీదేవిననుసరించి వేలకొద్ది శివ అనుచరులు పార్షదులైన మణిమంతుడు, మదుడు మొదలగువారు ముందునందినుంచుకొని వెళ్ళిరి. శివానుచరులు కనుక నిర్భయులే యైనను సతీదేవి వెళ్ళుటవల్ల దుఃఖము గలవారైరి. 4

టీ:- తామితి. ద్రుత విక్రమాం శీఘ్రం గచ్ఛంతీం. సహపార్ష దైర్య క్షైశ్చ వర్తమానాః. మణిమాన్ మదశ్చ ఆదిరేష్యాం తే పురః పురతో వృషేంద్రః యేషాం తే. గత వ్యధాః నిర్భయాః. శ్రీరుద్రాతిక్రమేణ తస్యాః గమనాదాగతవ్యధ ఇతి వా. 4

శ్లో॥ తాం శారికా కందుక దర్పణాంబుజైః
శ్వేతాతపత్ర వ్యజన స్రగాదిభిః ।
గీతాయనైర్దుంభిశంఖ వేణుభిర్వృ
షేంద్రమారోప్య విటంకితా యయుః ॥ 5

ఆ సతీదేవిని నందీశ్వరునిపై నెక్కించి మాట్లాడే శ్యామవర్ణము గల చిలుకను బంతి, అద్దము, పద్మము, పుష్పమాలిక, వింజామర, శ్వేతచ్ఛత్రము మొదలగు క్రీడాసామగ్రి మరియు మహారాజ వైభవ సామగ్రి కలిగి సంగీత సామగ్రియైన భేరి, శంఖ, వేణువులతో శోభితులై వెళ్లిరి. (5)

టీ:- తామితి. తాం సతీం. వృషేంద్రమారోప్య. శారికాదిభిః క్రీడోప కారిణైః. శ్వేతాతపత్రాదిభిశ్చ. మహారాజవిభూతిభిస్సహ-విటంకితాః శోభితాః. యయుః శారికాః పఠననిపుణాః పక్షిణ్యః గీతాయనైః. గీతాశ్రయైః. 5

శ్లో॥ ఆబ్రహ్మ ఘోషోర్జిత యజ్ఞ వైశసం
విప్రర్షిజుష్టం విబుధైశ్చ కృత్స్నశః ।
మృద్దార్వయః కాంచనదర్భ చర్మ భి
ర్నిసృష్ట భాండం యజనం సమావిశత్ ॥ 6

అంతటా వేద ధ్వనులచే అలరించి, యజ్ఞసంబంధి పశువిశసన ముచే(వపాస్వీకరణము కొరకు పశువును చంపుట) లేదాయజ్ఞ సంబంధ పరస్పర శాస్త్ర విచార ఇచ్ఛ, స్పర్ధ కలిగిన బ్రహ్మర్షులు, దేవతలచే సేవింపబడుచూ, మట్టి, చెక్క, ఇనుము, బంగారము, దర్భలు, తోలు

టీ:- ఆబ్రహ్మేతి. ఆసమంతాత్. యో వేదఘోషః తే నోర్జితం శోభితం యజ్ఞ సంబంధి పశు విశసనం యస్మిన్. యద్వా తేనోర్జితం అతిశయితం యజ్ఞ వైశసం పరస్పర స్పర్ధా యస్మిన్ తత్ యజనం యజ్ఞస్థానం సమావిశత్. విబుధైర్జుష్టం. మృదాదిభిఃనిసృష్టాని నిర్మితాని భాండాని పాత్రాణి యస్మిన్. 6

శ్లో॥ తామాగతాం తత్ర న కశ్చనాద్రి య
ద్విమానితాం యజ్ఞకృతో భయాజ్జనః ।
ఋతే స్వస్రూస్స్వాం జననీం చ సాదరాః
ప్రేమ్ణాశ్రుకంఠ్యః పరిష స్వజుర్ముదా ॥ 7

టీ:- తామితి కశ్చన నాశ్రయత్ నాదృతవాన్ యజ్ఞకృతః దక్షాత్ యద్భయం తస్మాత్. తత్ర హేతుః. తేన విమానితాం. స్వస్రూః జననీం చ ఋతే వినా. తాస్తు సాదరాః. పరిషస్వజుః ఆలింగితవత్యః. ప్రేమ్ణా శ్రుభిః నిరుద్ధః కంఠో యాసాం. 7

శ్లో॥ సౌందర్య సంప్రశ్న సమర్థ వార్తయా
మాత్రా చ మాతృష్వసృభిశ్చ సాదరమ్ ।
దత్తాం సపర్యాం వరమాసనం చ సా
నాదత్తపిత్రా ప్రతినందితా సతీ ॥ 8

మొదలైన వాటితో నిర్మితమైన యజ్ఞ పాత్రలు కలిగిన యజ్ఞ స్థానము -లోనికి ప్రవేశించెను. 6

ఆ యజ్ఞశాలలో ప్రవేశించిన సతీదేవిని ఎవ్వరూ కూడా ఆదరించలేదు. కారణము యజ్ఞకర్తయైన దక్షుడికి భయపడి. అతడిచే అవమానింపబడిన సతిని, అక్క చెల్లెళ్ళు, తల్లి మాత్రము ప్రేమతో ఆనందబాష్పములు స్రవించగా సాదరముగా, సంతోషముతో కౌగిలించుకొనిరి. 7

తల్లి, పినతల్లులు ఒకే గర్భమున జనించిన అక్కాచెల్లెళ్ళు చక్కని కుశల ప్రశ్నలు వేస్తూ, సమర్థవంతమైన సంభాషణలు ఆదర పూర్వకముగా చేసినప్పటికీ, చక్కటి సపర్యలు చేసి శ్రేష్ఠమైన ఆసనము ఏర్పరచినప్పటికి తండ్రి చేత ఆనాదరణకు గురియైన సతీదేవి వాటిని స్వీకరించలేదు. 8

టీ:- సౌందర్యేతి. అప్రతినందితా అనాదృతాసతీ నాదత్త న గృహీత వతీ. కథం సౌందర్యేణ సోదరత్వేన. భగినీనాం యస్సంప్రశ్నః తత్ర సమర్థాయోగ్యా యావార్తా తయా సహతాంచ నాదత్త నాశ్రుణోదిత్యర్థః (8)

శ్లో॥ అరుద్రభాగం తమవేక్ష్య చాధ్వరం
పిత్రా చ దేవే కృతహేళనం విభౌ ।
అనాదృతా యజ్ఞసదస్యధీశ్వరీ
చుకోప లోకానివ ధక్ష్యతీ రుషా ॥ 9

రుద్రుడికి భాగములేని ఈ యజ్ఞమును, విభుడైన రుద్రునికి తన తండ్రిచే జరిగిన అవమానమును, యజ్ఞ సదస్సున తనకు జరిగిన అనాదరణమునుచూచి చరాచరప్రపంచాధీశ్వరియైన సతీ లోకములను కాల్చునాయన్నట్లు కోపించెను. 9

టీ:- అరుద్రేతి. న విద్యతే రుద్రస్య భాగో యస్మిన్ తం దేవే రుద్రే కృతం హేళనం అవజ్ఞానం చ. ఆహ్వానాద్యకరణాత్. 9

శ్లో॥ జగర్హ సామర్ష విపన్నయా గిరా
శివద్విషం ధూమపథశ్రమస్మయమ్ ।
స్వతేజసా భూతగణాన్ సముత్థితా
న్నిగృహ్య దేవీ జగతోఽభి శ్రుణ్వతః ॥ 10

తన కోపమునుచూచి యజ్ఞమునకు ఉపద్రవము కలిగించడానికి సిద్ధమైన ప్రమథగణమును కేవలము తన కనుసంజ్ఞలచే నివారించి ఆ యజ్ఞ స్థిత జనము వినుచుండగా కర్మకాండ యందు అభ్యాసముచే గర్వించినవాడై, శివద్వేషియైన దక్షుడిని అతికోపము కలిగినప్పుడు వెలువడే అస్పష్టాక్షరములుతో నిందించినది. 10

టీ:- జగర్హేతి. జగర్హనిందితవతీ. అమర్షేణ కోపేన విపన్నా అవ్యక్తా తయా గిరాశివం ద్వేష్టీతి శివద్విట్ తంధూమ పథః కర్మమార్గః తత్ర శ్రమః అభ్యాసః తేన స్మయో గర్వో యస్య దక్షవధాయ సముత్థితాన్. స్వాజ్ఞయా నిగృహ్య నివార్య. 10

దేవ్యువాచ

శ్లో॥ న యస్య లోకేఽస్త్యతి శాయనః ప్రియాస్తథా
ప్రియో దేహభృతాం ప్రియాత్మనః ।
తస్మిన్ సమస్తాత్మని ముక్తవైరకే ఋతే
భవంతం కతమః ప్రతీపయేత్ ॥ 11

టీ:- నిందామేవాహ-త్రయోదశభిః. నేతి. ముక్తవైరకే త్యక్త విరోధే తస్మిన్ శివే భవంతమృతే వినా. కతమః కః. ప్రతీపయేత్ ప్రతికూల మాచరేత్ వైరాభావే హేతవః. యస్య లోకే అతిశాయనః అతిశయితో నాస్తి. తథా ప్రియో ప్రియశ్చ నాస్తి. సమాస పాఠే. అతిశయేన ప్రియో నాస్తి దేహభృతాం ప్రియోయ ఆత్మా తస్య సమస్తస్యాత్మని కారణభూతే. సమస్త రూప ఇతి వా. 11

శ్రీ సతీదేవి ఈ విధముగా పలికెను.

ఈ లోకమున దేహము ధరించిన ప్రతి వారికి ప్రియమైన ఆత్మస్వరూపుడతడు. ఈయనను మించిన ఐశ్వర్యాదులు కలిగిన ఉత్కృష్టుడు లేడు. ఈయనకు ప్రియుడని, అప్రియుడని లేడు. అతిశాయనః ప్రియః అని సమాస పాఠము స్వీకరించిన దేహధారులకు ఈయనను మించిన ఉత్కృష్టుడైన ఆత్మస్వరూపుడు లేడు. సమస్త ప్రాణులందు వైర భావన విడిచినవాడు, అట్టి పరమశివుడిని నీవు తప్ప ఎవడు నిందించగలడు. కృద్ధుడు కాగలడు. విరోధించగలడు. 11

శ్లో॥ దోషాన్పరేషాం హి గుణేషు సాధవో
గృహ్ణంతి కేచిన్న భవాదృశా ద్విజ ।
గుణాంశ్చ ఫల్గూన్బహులీకరిష్ణవో
మహత్తమాస్తేష్వవిదద్భవానఘం ॥ 12

టీ:- తస్య చ ప్రతికూలకరణం ద్వేధా మహత్తమద్రోహేణ. సాక్షాత్త ద్ద్రోహేణ చ. తత్ర పురుషాణాం చాతుర్విధ్యం వదంతి. మహత్తమద్రోహ

శివుడి యందు వ్యతిరేకముగా ప్రవర్తించడం రెండు విధములు. ఒకటి మహత్ముడియందు ద్రోహము, రెండు సాక్షాత్తుగా దూషించడం. మహాత్ముడియందు ద్రోహమును వివరిస్తూ నాలుగు రకాలైన జనులు ఉంటారు. ఓ బ్రాహ్మణాధమా!

1. అధములు:- అసూయకలిగిన నీవంటి వారు. వీరు ఇతరుల గుణములయందుగూడా దోషములను అభివర్ణిస్తారు, చూస్తారు.
2. మధ్యములు:- వీరు సద్గుణములయందు దోషములను చూడరు.

మాహ–ద్వాభ్యాం. దోషానితి. హే ద్విజేత్యధిక్షేపః. భవాదృశాస్త్వద్విధాః అసూయకాః పరేషాం గుణేషు దోషనేవ గృహ్ణంతి, న తు గుణాన్. కే చిన్మధ్యస్థాః. పరగుణేషు దోషాన్న గృహ్ణంతి.కింతు యథాస్థి తాన్ గుణాన్. దోషన్వివేకేన గృహ్ణంతి. తేతు మహాంత ఉచ్యంతే. సాధవస్తు కేవలం గుణానేవ గృహ్ణంతి న దోషాన్. తేతు మహత్తరా ఉచ్యంతే. మహత్తమాస్తు. దోషాన్న గృహ్ణంత్యేవ. ప్రత్యుత ఫల్గూన్ తుచ్ఛానపి గుణాన్. బహులీకరిష్ణవో భవంతి. భవానఘమవిథత్ విదితవాన్ కల్పితవానిత్యర్థః. తచ్చ బ్రహ్మిష్ఠానభిభూయసీత్యనేన సూచితం. 12

శ్లో॥ నాశ్చర్య మేతద్యదసత్సు సర్వదా
మహద్వినిందా కుణపాత్మవాదిషు ।
సేర్ష్యం మహాపూరుష పాదపాంసుభి
ర్నిరస్తతేజస్సు తదేవ శోభనమ్ ॥ 13

టీ:– ఏతశ్చ దుర్జనేషు యుక్తమేవేత్యాహ–నేతి. కుణపం మృతం శరీరం. తదేవాత్మేతి యే వదంతి తేషు. ఈర్ష్యా అక్షాంతిః తయా సహితం సేర్ష్యం యథా భవత్యేవం మహతాం వినిందేతి యత్. ఏతదాశ్చర్యం న భవతి. యద్వా మహతాం పాదపాంసుభిస్సేర్ష్యం.

కాని గుణములను గుణములుగా, దోషములను దోషములుగా చూస్తారు. వీరిని 'మహన్' అని అంటారు.

3. సాధుజనులు:– వీరు గుణములను మాత్రమే అభివర్ణిస్తారు. దోషములున్నా వాటిని కీర్తించరు. వీరు మహత్తరులు అని అంటారు.

4. ఇంకొక రకమువారు:– వీరు దోషములను స్మరించనే స్మరించరు. వీరు చిన్నవైన గుణముగా పెద్దగాచేసి చెపుతారు. వీరినే మహత్తముడని అంటారు.

నీవు బ్రహ్మిష్టుడైన శివుడిని ఎరుగక ఆయనపట్ల ద్రోహము చేసి, ఆ మహనీయుడి గుణములను వక్రీకరించి అధముడవైతివి. 12

మహాజనులను నిందించుట నీ వంటి దుర్జనులకు యుక్తమే. జడాత్మకమైన శరీరమునే నేను అనగా ఆత్మయని ఎవరు చింతించెదరో అట్టి అసజ్జనుల విషయమున మహాజ్జనులను వారు నిందించే విషయములో మనము ఆశ్చర్యపోవలసిన అవసరములేదు. ఈర్ష్య కలిగిన అనగా ఓర్పులేనట్టి స్వభావము కలిగినవారు ఈర్ష్యాసహితులై వారి తేజమును లేకుండా చేసుకొందురు. దానికి కారణము నిందింపబడిన మహనీయులు కారు. వారు వారినిందను సహిస్తారు. కానీ వారి పాదధూళి వీరిని సహించక నిందించిన వారిని తేజో హీనులను చేస్తుంది. కాని మహనీయులతో విరోధము ఒక విధముగా

నిరస్తం తేజః ప్రభావో యేషామితి. యద్యపి మహాంతః స్వనిందాం సహంతే తథాపి తత్పాదరేణవః తదసహమానా స్తేషాం తేజో నిరస్యంతి. అతోసత్సు మహన్నిందన మేవ ఉచితమిత్యర్థః. 13

శ్లో॥ యద్ద్వ్యక్షరం నామగిరేరితం నృణాం
సకృత్ప్రసంగాదఘమాశు హంతి తమ్ ।
పవిత్ర కీర్తిం తమలంఘ్యశాసనం
భవానహో ద్వేష్టి శివం శివేతరః ॥ 14

టీ:- తదేవం మహత్తమద్రోహముక్త్వా తస్మిన్నేవ కృతం ద్రోహమాహ-ద్వాభ్యాం. యదితి. యత్ యస్య ద్వ్యక్షరం నామ శివ ఇతి. తత్ప్రసిద్ధం నామ నృణాం సర్వేషామఘం సర్వమాశు హంతి. కేవలం గిరై వేరితం. ఉచ్చరితం న తు మనః పూర్వకం. తచ్చ సకృదపి ప్రసంగాదపి తం శివం ద్వేష్టి. న లఘ్యం శాసనం ఆజ్ఞా యస్య. అహో శివేతరః అమంగళరూపః. 14

శ్లో॥ యత్పాదపద్మం మహతాం మనో౽భి
ర్నిషేవితం బ్రహ్మరసాసవార్థిభిః ।
లోకస్య యద్వర్షతి చాశిషో౽ర్థిన
స్తస్మై భవాన్ ద్రుహ్యతి విశ్వబంధవే ॥ 15

ఉద్గారమునకు కూడా కారణమౌతుంది. శిక్షించి రక్షిస్తుంది. 13

సామాన్యముగా మహనీయుల విషయమున నిందాదులను పెద్ద ద్రోహముగా అభివర్ణించి. ఇక్కడ సాక్షాత్ శివనిందనే వివరించు చున్నాడు. 'శివ' యను రెండు అక్షరములను ఒక్కమారు ప్రసంగమున పలికిన చాలు అతి వేగముగ పాపాలు తొలగిపోతాయి. కేవలము వాక్కులతో యంటే చాలు మనఃపూర్వకముగా అనుకున్న అట్టి పవిత్రమైన కీర్తి కలిగినఎవరి ఆజ్ఞను ఉల్లఘించుటకు జగత్తునకు సాధ్యముకాదో అట్టి మంగళప్రదుడిని నీవు ద్వేషించుచున్నావు. అమంగళప్రదుడవు. 14

శివనామోచ్చారణ పాపహరమని తెలిపి మరియు శివుడు భుక్తి, ముక్తి ప్రదుడని తెలుపుచూ ఏ మహనీయుల మనస్సులు బ్రహ్మానంద మకరంద రసమును కోరుచున్న తుమ్మెదలై శివ పాదపద్మములయందు వాలుచున్నవో, సేవించుచున్నవో, సకామనులైన జనులు పుత్రధనాదుల

టీ:- పాపహరత్వ ముక్త్వా భుక్తిముక్తి ప్రదత్వేన శివం వర్ణయంత్యాహ – యదితి. యస్య పాదపద్మం. మహతాం మనాంస్యేవాళయః తైః బ్రహ్మ రసో బ్రహ్మానందః స ఏవాసవో మకరందః. తదర్థిభిః. యశ్చార్థినః స కామస్య లోకస్య తాస్తా ఆశిషోవర్షతి. 15

శ్లో॥ కిం వా శివాఖ్యమశివం న విదుస్త్వదన్యే
బ్రహ్మాదయ స్తమవకీర్య జటాః శ్మశానే ।
తన్మాల్యభస్మనృకపాల్య వసత్పిశాచై
ర్యేమూర్ధభిర్దధతి తచ్చరణావసృష్టం ॥ 16

టీ:- యదుక్తం శివాపదేశో హ్యశివ ఇతి. యచ్చోక్తం ప్రేతావాసేష్వి త్యాది తదాక్షిపంత్యాహ – కింవేతి. యో జటాః అవకీర్య శ్మశానే అవసత్ వసతిస్మ, తస్య శ్మశానస్య మాల్యాని భస్మనృ కపాలాని చ భూషణత్వేన సంతి యస్య తం త్వత్తో౽న్యే నవిదుః కింవా న విదంత్యేవేతి చేత్ న తథా సతి తేషాం తద్దాస్యానుపపత్తేరిత్యాహ – తస్య చరణావసృష్టం గళితం నిర్మాల్యం యే మూర్ధభిర్ధారయంతి. 16

కొరకు ఆశ్రయించిన ఏ శివ పాదములు కోరిన వాటిని వర్షించుచున్నవో అట్టి ఈ విశ్వమున రక్తుల, విరక్తుల ఆపద్రక్షకుడైనట్టి విశ్వబంధువునా నీవు నిందించుచున్నది. ఆ విశ్వబంధునకా నీవు ద్రోహము తలపెట్టుచున్నావు. 15

పూర్వము దక్షుడు శివుడని పేరుకలిగిన ఆ శివుని, స్మశానవాసి అని దూషించినాడో, వాటిని ఖండిస్తు సిద్ధాంతరీకరిస్తుంది. ఓహో ఆయన జడలు విరబోసుకొని స్మశానమున నివసిస్తున్నాడని ఆ స్మశానమునగల శవభస్మమును పూసుకొని పుర్రెలు మాలలుగా మెడలో ధరిస్తు పిశాచములతో విహరిస్తున్నాడని శివుడని పేరుపెట్టుకున్న అమంగళుడని నీకంటే వేరైన దేవతలకు తెలియదాఏమి? తెలుసునందువేమో! కాదు. ఓరీ! నీవలె వారు వెర్రితలలు కలిగి ఆయనకు దాస్యము చేసే యుందరు. విను, బ్రహ్మాది దేవతలు ఆయన నడుచుచున్నప్పుడు కాలి నుండి రాలిన నిర్మాల్యమును శిరస్సున ధరించుచున్నారు. 16

శ్లో॥ కర్ణౌ పిధాయ నిరయాద్యదకల్య ఈశే
ధర్మావితర్య సృణిభిర్నృభిరస్యమానే ।
ఛింద్యాత్ప్రసహ్య రుశతీమసతాం ప్రభు
శ్చేజ్జిహ్వామసూనపి తతో విసృజేత్సధర్మః ॥ 17

టీ:- ఇదానీం దేహం త్యక్తుకామా ధర్మ తత్త్వమాహ-కర్ణావితి. కర్ణౌ పిధాయ ఆచ్ఛాద్య నిర్గచ్ఛేత్. యదిమర్తుం మారయితుం వా. అకల్యః సమర్థో న భవతి. తథా ధర్మావితరి ధర్మరక్షకే. ఈశే స్వామిని. అసృణిభిర్నిరంకుశైః నృభిః అస్యమానే అధిక్షిప్యమాణే ప్రభుశ్శక్తశ్చేత్. రుశతీం అకళ్యాణవాదినీం . ప్రసహ్య బలాత్. ఛింద్యాత్. తథా స్వయం ప్రాణాన్ విసృజేదితి యత్ స ధర్మః. 17

భగవతీ సతీ దేహమును విడువవలెనను నిర్ణయమునకు వచ్చి ధర్మ యథార్థ స్వరూపమును వ్యాఖ్యానించుచున్నది. ధర్మ విషయమున చావడానికి, చంపడానికైన సమర్థులు కావాలి. రెండింటికి సమర్థుడు కానిచో ధర్మమును పరీక్షించే పరమేశ్వరుడు నిరంకుశుడైన వాడిచే అధిక్షేపింపబడుచున్నప్పుడు రెండు చెవులు మూసుకొని అక్కడి నుండి వెళ్ళవలెను శక్తిగలవాడైతే ఆ తిట్టేవాడి నాలుకను బలాత్కారముగా లాగి కోసివేయాలి. లేదా భగవన్నిందను విన్న ఈ ప్రాణములను ధరించకుండా ప్రాణములనే విడువవలెను ఇది విశేషమైన ధర్మాచరణ. (17)

శ్లో॥ అతస్తవోత్పన్న మిదం కళేబరం
న ధారయిష్యే శితికంఠ గర్హిణః ।
జగ్ధస్య మోహాద్ధి విశుద్ధిమంధసో
జుగిప్సిత స్యోద్గిరణం ప్రచక్షతే ॥ 18

టీ:- అతఇతి. తవ తత్త్వ ఉత్పన్నం శరీరం శితికంఠో నీలకంఠః. తన్నిందకాత్. ప్రమాదాదాపన్నస్యాప విత్రస్య త్యాగం వినా న విశుద్ధిరితి దృష్టాంతేనాహ. జగ్ధస్యభక్షితస్యాన్నస్య. ఉద్గిరణం. వమనమేవ. పుంసః శుద్ధిం ప్రచక్షతే. 18

ఓయీ! పరులకు క్షేమము జరగాలని విష పానము చేసిన పరోపకారియైన వానినా నీవు దూషించినావు. పరమేశ్వర దూషణాత్ముడి నుండి వచ్చిన ఈ దేహము నేను ధరించలేను. భ్రమవలన ఆసన్నమైన అపవిత్రమైన వస్తువును విడువవలెను. విడుచుటవల్లనే శుద్ధి. వేరొక మార్గములేదు. ఏ విధముగానైతే అపవిత్రమైన ఆహారమును స్వీకరించిన పిమ్మట శుద్ధుడు కావలెనన్నా (వమనము) కక్కుకొనిననే శుద్ధుడు కాగలడు కదా! 18

శ్లో॥ న వేదవాదనానువర్తతేమతి
స్స్వఏవ లోకే రమతో మహామునేః ।
యథా గతిర్దేవ మనుష్యయోః పృథ
క్స్వ ఏవ ధర్మే న పరంక్షిపేత్స్థితః॥ 19

టీ:- యదుక్తం లుప్తక్రియాయాశుచయ ఇతి తత్రృత్యాహ-నేతి. వేదవాదాన్ విధి నిషేధ రూపాన్. స్వ ఏవ లోకే స్వాత్మన్యేవ రమమాణస్య. మహతో మునేః. సమ్యగ్విరక్తస్య. మతిర్నానువర్తతే. నివృత్తాధికారిత్వాత్. అధికారిభేదే దృష్టాంతః. యథా దేవానాం గతిరాకాశఏవ. మనుష్యాణాం పృథివ్యామేవ. అతస్స్వధర్మ ఏవ ప్రవృత్తిలక్షణే నివృత్తిలక్షణే వా స్థితస్సన్ పరం అన్యం ధర్మం పురుషం వా. న క్షిపేత్. న నిందేత్ వ్యవస్థితాధి కారత్వేన ఉభయోస్సత్యత్వాత్. న క్షిపేదేవేతి వా అన్వయః. 19

ఓయీ! క్రియా శుచిత్వములు లోపించినవాడని అన్నావు. విధి నిషేధములు ఆత్మారాముని యందు రమించు విరక్తుని యందు వర్తించవు. ప్రవృత్తి నివృత్తులకెంత భేదమో దృష్టాంత పురస్సరముగా తెలుపుచున్నారు. దేవతలు ఆకాశమున సంచరించుదురు. మనుష్యులు భూమిమీద సంచరించుదురు. కనుక స్వస్థితి ననుసరించి ప్రవృత్తి లేదా నివృత్తి ధర్మముయందు గలవారు ఇతరులను నిందించరాదు. ఈ రెండు మార్గములు గూడా వేద సిద్ధాంతముచే వ్యవస్థితములు, సత్యములే. అధికారి భేదముచే సమన్వయపరుచుకొనవలెను. 19

శ్లో॥ కర్మ ప్రవృత్తం చ నివృత్తమప్యృతం
వేదే వివిచ్యోభయలింగ మాశ్రితమ్ ।
విరోధితద్యొగ పదైక కర్తరి
ద్వయం తథా బ్రహ్మణి కర్మ నర్ఛతి ॥ 20

టీ:- ఏతదేవోపపాదయంత్యాహ-కర్మేతి. యత్ప్రవృత్తం అగ్ని హోత్రాది. నివృత్తం శమ దమాది చ. ఋతం సత్యమేవ. యతః. వేదే

పూర్వవిషయమునే ఉపపాదించుచున్నాడు. వేదము యందు ప్రవృత్తి లక్షణమును సూచించు అగ్నిహోత్రాదులు, నివృత్తి లక్షణమును సూచించు శమ దమాదులు ఉన్నవి కనుక రెండు సత్యమే. రెండూ ఒక్కరికి సరిపోవు. రాగముగల వాడికి ప్రవృత్తిమార్గ అగ్నిహోత్రము, వైరాగ్యముగలవాడికి శమదయాది నివృత్తిమార్గము ఉపదేశించబడినది. ప్రత్యేకముగా వేదమునందు అధికార విభాగము కనబడుటలేదు కదా యనగా సత్యమే, కాని ప్రవృత్తి, నివృత్తి మార్గములు ఒకే వ్యక్తి యందు

ఆశ్రితం. విహితం తచ్చ వివిచ్య వ్యవస్థయా శ్రితం. సత్త్వస్య విశేషేణ వ్యవస్థా మేవాహ-ఉభయం రాగవైరాగ్యలక్షణం. లింగం చిహ్నం అధికార విశేషణం యస్మిన్ తత్. నను సూ. "యావజ్జీవమగ్నిహోత్రం జుహోతి శాంతోదాంత"ఇత్యాదిషు నైవం వ్యవస్థా ప్రతీయతే. సత్యం. తథా పృథయో రేకాధికారిత్వ విరోధాత్తథా పర్యవస్యతీత్యాహ. యుగపద్భావో యౌగపదం. యౌగపదేన ఏకస్మిన్ కర్తరి తత్కర్మ ద్వయం విరోధి. నను తర్హి నివృత్తకర్మ శివేనాపి కర్తవ్యమేవ. నేత్యాహ-బ్రహ్మణి సదాశివే. అదః ఉభయలక్షణం. కించిదపి కర్మ. నర్ఛతి నప్రాప్నోతి. అతో యథా ప్రవృత్త నివృత్తయోః పరస్పర ధర్మాకరణేన దోషః. ఏవమీశ్వరే తదుభయ కర్మా కరణేఽపి నదోష ఇతి భావః. 20

ఏక కాలమున ఉండడం సాధ్యం కాదు కనుక ఈ విధముగా పర్యవసించినది. నివృత్తి కర్మ శివుడి యందు గలదుకదా యనగా లేదు. సదాశివుడైన శివునియందు కొంచెముగూడా కర్మచేరదు. కావున ఆయన ఈ రెండింటిని ఆశ్రయించిలేదు. 20

శ్లో॥ మా వః పదవ్యః పితరస్మదాస్థితా
యా యజ్ఞశాలా స్వనుధూమవర్త్మభిః ।
తదన్నతృప్తైరసుభృద్భిరీడితా
అవ్యక్తలింగో అవధూతసేవితాః ॥ 21

టీ:- చింతాభస్మ కృతస్నానః తథా నగ్న ఇత్యాదినా యో భోగాద్యభావః ఉక్తః. తత్రాహ-మేతి. హే పితః అస్మాభిః ఆస్థితా ఆశ్రితాః. పదవ్యః అణిమాది సమృద్ధయః వః యుష్మాకం. మా న సంతీత్యర్థః. యతః

శివుడు చితాభస్మస్నాతుడు, నగ్నుడు, యే భోగములేనివాడు, అతడు దరిద్రుడు. మేము ధనికులమను భావము నీకు గలదు. కాని మాకుగల అణిమాది సమృద్ధి మీకు లేనేలేదు. మీకున్న ఐశ్వర్యము కేవలము యజ్ఞశాలయందు యజ్ఞగత అన్నమును తిని హోమధూమము పీల్చుటే. కాని మా ఐశ్వర్యములు మీవాటి మాదిరిగా కాదు. మా సిద్ధులు, అవ్యక్తలింగములు, కారణములు కానరావు. కోరినప్పుడు ప్రకాశించేవి. బ్రహ్మవేత్తలచే సేవింపబడునది. 21

వః పదవ్యః యజ్ఞశాలాస్వేవ భవంతి. తాశ్చ తదన్నేన యజ్ఞగతేనాన్నేన తృప్తైః కేవలం ఈడితాః. ధూమవర్త్మ భుజ్యంతే. యాశ్చస్మత్పదవ్యః తాస్తు నైవంభూతాః కింతు అవ్యక్తలింగాః. నవ్యక్తం లింగం హేతుః యాసాంతాః. ఇచ్ఛామాత్ర ప్రభవత్వాత్. అవధూతైః బ్రహ్మవిద్భిః సేవితాః అతోఽహమాఢ్యః. శ్రీరుద్రో దరిద్ర ఇతి గర్వం మాకృథా ఇతి భావః. 21

శ్లో॥ నైతేన దేహేన హరే కృతాగసో
దేహోద్భవేనాలమలం కుజన్మనా ।
వ్రీడా మమాభూత్కుజన ప్రసంగత
స్తజ్జన్మ ధిగ్యో మహతామ హృద్యకృత్ ॥ 22

టీ:- కిం బహునోక్తేన ఇదం మద్దేహం త్యక్ష్యామ్యేవేత్యాహ-ద్వాభ్యాం. నేతి. ఏతేన నాలం న పూర్యతే కిం. అపి తు అలమేవ. కథంభూతేన. కుజన్మనా. తదేవాహ-శ్రీహరేకృతాగసః కృతాపరాధస్య తవ. దేహాదుద్భూతేన. నను శ్లాఘోఽయం దేహః కథం త్యాజ్యః తత్రాహ-కుజనస్య తవ. ప్రసంగతః సంబంధాత్. మమ లజ్జాభూత్. అతః యః మహతాం అహృద్యకృత్. విప్రియకర్తా తస్మాత్ యజ్జన్మ.తత్ ధిక్. త్వత్సంబంధాదశ్లాఘ్యమిత్యర్థః. 22

ఇంతమాట్లాడడమెందుకు, ఈ దేహమును విడుస్తాను, ఆ పరమేశ్వరుడిపట్ల అపరాధముచేసిన నీ దేహము నుండి పుట్టిన ఈ దేహమును విడుస్తాను. ఈ శిక్షచాలును. ఈ దేహమును విడువ వచ్చునా! దుష్టుడవైన నీ సంబంధమువల్ల నాకు సిగ్గు కలుగుచున్నది. మహాజనులకు అప్రియము కలిగించిన నీ నుండి పుట్టిన ఈ దేహము వ్యర్థము, నీ నుండి పుట్టుటవల్ల ఇది అపకీర్తికరము. 22

శ్లో॥ గోత్రం త్వదీయం భగవాన్వృషధ్వజో
దాక్షాయణీత్యాహ యదా సుదుర్మనాః ।
వ్యపేత నర్మస్మితమాశు తద్ధ్యహం
వ్యుత్స్రక్ష్య ఏతత్కుణపం త్వదంగజమ్ ॥ 23

టీ:- గోత్రమితి. కించ. పరిహాసాదిషు వినోదవాక్యాదిషు దాక్షాయణీతి సంబోధయన్. త్వదీయం త్వత్సంబంధవాచకం గోత్రం నామ. యదా వృషభధ్వజ ఆహ- గృహ్ణాతి. తదా అహం. వ్యపేతం నర్మస్మితం యథా భవత్యేవం. సుదర్మనాః అతి దుఃఖిత చిత్తా భవామి. తత్ తస్మాత్. హి నిశ్చితం.ఏతత్కుణపప్రాయం వ్యుత్రసక్ష్యే త్యక్ష్యామి. 23

భగవాన్ వృషభధ్వజుడు ఎప్పుడైనా వినోదమునకైననూ దాక్షాయణీ అని పిలిచినప్పుడు నా ముఖమునందు చిరునవ్వుపోయి అతి దుఃఖితనగుదును. అందుచేత నీ శరీరము నుండి పుట్టిన, శవప్రాయమైన ఈ శరీరమును విడిచెదను. 23

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఇత్యధ్వరే దక్షమనూద్య శత్రుహన్
క్షితావుదీచీం నిషసాద శాంతవాక్ ।
స్పృష్ట్వా జలం పీత దుకూల సంవృతా
నిమీల్య దృగ్యోగపథం సమావిశత్ ॥ 24

టీ:- ఇతీతి. దక్షం ప్రతి ఇద్యానువాదం కృత్వా. శత్రుహన్ క్రోధాది రిపుఘాతిన్. ఉదీచీం దిశం ఉదీచ్యాం దిశి. పాఠాంతరే. ఉదఙ్ముఖీ శాంతవాక్ గృహీత మౌనా జలం స్పృష్ట్వా ఆచమ్య. దృక్ దృశ్యం. 24

మైత్రేయుడు పలికెను.

క్రోధాది శత్రువులను సంహరించిన ఓ రాజా! ఈ విధముగా యజ్ఞమందు దక్షుడు పలికిన వాటికి ఉత్తరము చెప్పి వాక్కులను విరమింపచేసి, ఉదన్ముఖియై భూమియందు కూర్చొని, పసుపుపచ్చ వస్త్రమును ధరించి జల స్పర్శ గావించి కన్నులు మూసుకొని యోగ మార్గమున ప్రవేశించెను. 24

శ్లో॥ కృత్వా సమానావనిలౌ జితాసనా
సోదానముత్థాప్య చ నాభిచక్రతః ।
శనైర్హృది స్థాప్య ధియోరసి స్థితం
కంతా ద్భ్రువోర్మధ్యమ నిందితానయత్ ॥ 25

టీ:- యోగమార్గమేవాహ-కృత్వేతి. అనిలౌ ప్రాణాపానౌ. ఊర్ధ్వాధో వృత్తి నిరోధేన సమానౌ. ఏక రూపౌనాభి చక్రే కృత్వా తతః ఉదాన ముత్థాప్య. ధియా సహ హృధి స్థాపయిత్వా. కంఠమార్గేణ భ్రువోర్మధ్య మనయత్. 25

యోగమార్గమును తెలుపుచు పైకి కిందికి వెళ్ళే ప్రాణాపాన వాయువులను నిరోధించి, జితాసనయై, నాభిదేశమున ఏకరూపమునకు తెచ్చి, పిమ్మట ఉదాన వాయువులను నాభి స్థానము నుండి పైకిలేపి నిదానముగా, బుద్ధి సహితయై, హృదయమునందు నిలిపి, కంఠ మార్గమున కనుబొమ్మల మధ్య తెచ్చి నిలిపెను. 25

శ్లో॥ ఏవం స్వదేహం మహతాం మహీయసా
ముహుస్సనామారోపితమంకమాదరాత్ ।
జహౌ సతీ దక్షరుషా మనస్వినీ
దధార గాత్రేష్వనిలాగ్ని ధారణమ్ ॥ 26

టీ:- ఏవమితి. మహతాం పూజ్యతమేన. 26

ఈ విధముగా అభిమానవతియైన సతీదేవి మహనీయులకు పూజనీయుడైన శ్రీరుద్రునిచే అనేకమార్లు ప్రేమగా ఒడిలో కూర్చో-పెట్టుకున్న తన సుందరదేహమును దక్షునిపై కోపకారణముగా విడిచిపెట్టతలచినదై శరీరావయముల యందు వాయ్వగ్నులను ధారణ చేసెను. 26

శ్లో॥ తతస్స్వభర్తుశ్చరణాంబుజాసవం
జగద్గురోశ్చింతయతీ న చాపరమ్ ।
దదర్శ దేహే హతకల్మషా సతీ
సద్యః ప్రజజ్వాల సమాధినాగ్నినా. ॥ 27

టీ:- తత ఇతి. తతః చరణాంబుజాసవం చరణారవింద మకరందం. భర్తురపరం న దదర్శ. దేహశ్చ సద్యః ప్రజ్వలితోऽభూత్. సమాధినా యోऽగ్నిస్తేన. 27

అటుపిమ్మట వేరొక చింతలేక , తన భర్తయైన జగద్గురు శంకర చరణాంబుజ భజనానందమును దర్శిస్తుండగా, దోషములు లేని ఆమె దేహము సమాధి నుండి పుట్టిన అగ్నిచే వెంటనే కాలిపోయినది. 27

శ్లో॥ తత్పశ్యతాం ఖే భువి చాద్భుతం మహ
ద్ధాహేతి వాదస్సు మహానజాయత ।
హంత ప్రియా దైవతమస్య దేవీ జ
హౌ వసూన్ కేన సతీ ప్రకోపితా ॥ 28

టీ:- తదితి. ఖే భువి చ హాహేత్యాదివాదః. తమేవాహ-హంతేతి విషాదే దైవతమస్య పూజ్యతమస్య ప్రియా కేన దక్షేణ. ప్రకోపితా సతీ. (28)

ఈ అద్భుతమును చూచి ఆకాశమున, భూమిపైనగలవారిలో అయ్యో! అయ్యో! అను పెద్ద కలకలము పుట్టెను. వారంతా విషాదముగా, దేవదేవుడి ప్రియురాలైన సతీదేవి దక్షుడిపై కోపము కారణముగా శరీరము విడిచెను గదా! అని అనుకొనిరి. 28

శ్లో॥ అహో అనాత్మ్యం మహదస్య పశ్యతః
ప్రజాపతేర్యస్య చరాచరం ప్రజాః ।
జహావసూన్యద్విమతాత్మజా సతీ
మనస్వినీ మానమజస్ర మర్హతి ॥ 29

టీ:- అహో ఇతి. మహత్ అనాత్మ్యం దౌర్జన్యం. అస్య సర్వత్ర స్నేహ ఏవ న్యాయ్య ఇత్యాహుః. యస్యేతి. యేన విమతా అవజ్ఞాతా. 29

అయ్యో ఏ ప్రజాపతి చరాచర ప్రపంచమందు ప్రేమ కలిగి ఉండాలో ఆ ప్రజాపతి యొక్క పెద్ద దౌర్జన్యమును చూడుడు. పవిత్రమైన, సున్నితమైన మనస్సుగల సతీదేవి ప్రజాపతి కుమార్తె. ఇతనిచే అవమానింపబడి ప్రాణములను విడిచినది. ఈయమ్మ తిరిగి తిరిగి ఎంత గౌరవించినను ఆ గౌరవమునకు అర్హురాలే. 29

శ్లో॥ సోఽయం దుర్మర్షహృదయో బ్రహ్మ
బంధుర్లోకేఽపకీర్తిం మహతీమవాప్స్యతి ।
యదంగజాం స్వాం పురుషద్విడుద్యతాం
న ప్రత్యషేధన్మృతయేఽపరాధతః ॥ 30

టీ:- స ఇతి. దుర్మర్షం అత్యసహనం. హృదయం యస్య లోకే జనమధ్యే. చకారాత్ నరకం చ. యత్ యతః. స్వీయాం అంగజాం. సుతాం అపరాధతః స్వావజ్ఞయా మృతయే మరణాయ ఉద్యతాం. న నివారిత వాక్. పురుషద్విట్ శివద్వేషీ. 30

ఏ మాత్రము సహనశక్తిలేని భగవంతుడికి ద్రోహముచేసే శివ ద్వేషియైన ఆ దక్షుడు జనముచే నరకములో గూడా గొప్పనైన అపకీర్తిని పొందగలడు. తన అనాలోచిత చేష్ట కారణముగా మరణమునకు ఉద్యుక్తురాలైన తన కుమార్తెను నివారించలేదు. 30

శ్లో॥ వదత్యేవం జనే సత్యాదృష్ట్వా సుత్యాగమద్భుతమ్ ।
తం దక్షం పార్షదా హంతుముదతిష్ఠన్నుదాయుధాః ॥ 31

టీ:- వదతీతి. అద్భుతం. దృష్ట్వా చ. 31

సతీదేవి చేసిన ఈ అద్భుత ప్రాణ త్యాగము చూచి, జనులు చెప్పుకొనుచుండగా శివపార్షదులు దక్షుడిని తుదముట్టించుటకు ఆయుధములెత్తిరి. 31

శ్లో॥ తేషాం మాపతతాం వేగం నిశామ్య భగవాన్భృగుః ।
యజ్ఞఘ్నఘ్నేన యజుషా దక్షిణాగ్నౌ జుహావ హ ॥ 32

టీ:- తేషామితి. యజ్ఞఘ్నాన్ హంతీతి యజ్ఞఘ్నఘ్నం తేన. శ్రు. "అపహతా అసురారక్షాగ్ంసి పిశాచా" ఇత్యాదినా. 32

శివపార్షదులు మీద పడటం చూచి, తపఃసంపన్నుడైన భృగువు యజ్ఞమునకు హాని జరుపు శక్తులను సంహరించే యజుర్వేద మంత్రములచే దక్షిణాగ్ని యందు హోమము చేసెను. 32

శ్లో॥ అధ్వర్యుణా హూయమానే దేవా ఉత్పేతురోజసా ।
ఋభవో నామ తపసా సోమం ప్రాప్తాస్సహస్రశః ॥ 33

టీ:- అధ్వర్యుణేతి. అధ్వర్యుణా భృగుణా. యే తపసా సోమం ప్రాప్తాః తే ఋభవో నామ దేవా ఉత్థితాః. 33

శక్తి సంపన్నుడైన భృగువు ఈ విధముగా హోమము చేయగానే తపస్సు చేత సోమమును పొందిన ఋభువులనే దేవతలు వేలకు వేల మంది దివ్యమైన బలముతో లేచిరి. 33

శ్లో॥ తైరలాతాయుధైస్సర్వే ప్రమథాస్సహ గుహ్యకాః ।
దహ్యమానా దిశో భేజురుశద్భిర్బ్రహ్మతేజసా ॥ 34

టీ:- తైరితి. బ్రహ్మతేజసా ఉశద్భిర్దీప్యమానైః. 34

బ్రహ్మ తేజస్సుచే దేదీప్యమానముగా వెలిగే అ ఋభువులు మండే కొరివి కట్టెలనే ఆయుధములుగా ధరించి యుద్ధము చేస్తూ ఉండగా ప్రమథగణములు, గుహ్యకులు కొట్టబడుచు, చంపబడుచు అనేక దిక్కులకు పరుగిడిరి. 34

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,**
**చతుర్థో ఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు**
**నాల్గవ అధ్యాయము సమాప్తము.**

## పంచమోఽధ్యాయః

శ్లో॥ పంచమే తు సతీ దేహత్యాగమాకర్ణ్య శంకరః ।
వీరభద్రం రుషోత్పాద్య తేన దక్షమజీ ఘనత్ ॥

### మైత్రేయ ఉవాచ

శ్లో॥ భవో భవాన్యాని ధనం ప్రజాపతే
రసత్కృతాయా అవగమ్య నారదాత్ ।
స్వపార్షదసైన్యం చ తదధ్వరర్భు
భిర్విద్రావిత క్రోధమపారమాదధే ॥ 1

టీ:- భవ ఇతి. ప్రజాపతేర్హేతోర్నిధనం. కుతః తేన అసత్కృతాయాః తస్యాధ్వరే. యే ఋభవః దేవా స్తైః. 1

శ్లో॥ క్రుద్ధస్సుదష్టోష్ఠపుటస్స ధూర్జటి
ర్జటాంతటి ద్వహ్ని సటోగ్ర రోచిషమ్ ।
ఉత్కృత్యరుద్ర స్సహసోత్థితో హస
న్గంభీర నాదో విససర్జ తాం భువి ॥ 2

,టీ:- క్రుద్ధ ఇతి. సః ధూర్జటి రుద్రః. ఘోరస్సన్ జటాం ఉత్కృత్య ఉత్పాట్య ఉత్థితస్సన్ తాం భువి విససర్జ. సుదుష్ట ఓష్ఠపుటో యేన. తటితాం వహ్నీనాం చ సటాః జ్వాలాస్తద్వదుగ్రరోచిః యస్యాస్తాం. 2

## 5వ అధ్యాయము

ఈ ఐదవ అధ్యాయమున సతీదేహము విడిచినదను వార్తను విని శంకరుడు కోపముచే వీరభద్రుడిని సృష్టించుట, అతడు దక్షుడిని చంపుట తెలుపబడినది.

### మైత్రేయుడు పలికెను.

ప్రజాపతి కారణముగా అవమానింపబడిన భవాని మరణము పొందడం తన పార్షదులు, ఋభువులచే పారిపోయేట్టుగా చేయబడడం నారదుడి ద్వారా విని శివుడు అంతులేని క్రోధమును పొందెను. 1

కృద్ధుడైన ధూర్జటి పండ్లు పటపట కొరుకుచు(కొరకబడిన పెదవులతో అగ్రభాగములుగల) మెరుపు తీగలవలె, అగ్నికీలలవలె కొప్పనైన కాంతికలిగిన జడను ఒకదానిని పీకి వెంటనే వికటాట్ట హాసమును చేయుచూ భూమి మీదకు విడిచెను. 2

శ్లో॥ తతోఽతికాయ స్తనువాస్పృశన్ దివం
సహస్రబాహుర్ఘన రుక్త్రి సూర్యదృక్ ।
కరాళదంష్ట్రోజ్వల దగ్ని మూర్ధజః
కపాలమాలీ వివిధోద్యతాయుధః ॥ 3

టీ:- తత ఇతి. తతః జటాయాస్సకాశాత్. అతికాయ వీరభద్రః జాత ఇతి శేషః. తనువా దేహేన. దివం స్పృశన్ అత్యుచ్చ ఇత్యర్థః. ఘన రుక్. కృష్ణవర్ణః. త్రయస్సూర్యా ఇవ దృశో యస్య కరాళా ఉదగ్రాస్తుంగాః దంష్ట్రాః యస్య. జ్వలదగ్నిరివ మూర్ధజా యస్య. కపాలమాలాః విద్యంతే యస్య. వివిధాని ఉద్యతాని ఆయుధాని యస్య. 3

దానినుండి పెద్ద శరీరము పుట్టెను. ఆ శరీరము ఆకాశము నంటుతూ, వేయి చేతులు, మేఘంవలె నల్లటి వర్ణము, ముగ్గురు సూర్యులవలె చూపులు, ఎత్తుగాగల కోరలు, అగ్నిజ్వాలవలె వెంట్రుకలు కలిగి, వివిధ ఆయుధములు ధరించి, కపాలమాలికను వేసుకొని యుండెను. 3

శ్లో॥ తం కిం కరోమీతి గృణంతమాహ
బద్ధాంజలిం భగవాన్భూతనాథః ।
దక్షం సయజ్ఞం జహి మద్భటానాం
త్వమగ్రణీరుద్ర భటాం శకో మే ॥ 4

టీ:- తమితి. హే రుద్రభట యుద్ధకుశల. మద్భటానాం త్వం అగ్రణీస్సన్. స యజ్ఞం దక్షం జహి. బ్రహ్మతేజో దుర్జయమితి మామంస్థాః యతః త్వం మే అంశకః. 4

చేతులు జోడించి నేనేమి చేయవలెను అని పలుకుచున్న అతడిని చూచి భగవాన్ భూతనాథుడు "ఓ రుద్రా!" యుద్ధముయందు కౌశల్యముగలవాడా! నా భటులకు నీవు నాయకుడవు. యజ్ఞసహితముగా దక్షుడిని చంపివేయి. బ్రహ్మతేజస్సును జయించడం సాధ్యము కాదనుకోకు. నీవు నా అంశవు. 4

శ్లో॥ ఆజ్ఞప్త ఏవం కుపితేన మన్యునా సదేవ
దేవం పరిచక్రమే ప్రభుమ్ ।
మేనేతదాత్మానమసహ్యరంహసా
మహీయసాం తాత సహస్సహిష్ణుమ్ ॥ 5

టీ:- ఆజ్ఞప్త ఇతి. మన్యునా రుద్రేణ. పరిచక్రమే ప్రదక్షిణం చకార. అసహ్యం. అప్రతిఘాతం. యత్ రంహో వేగస్తేన. భో తాత మహీ యసాం బలీయసామపి. సహస్సహిష్ణుం. బలంసోఢుం క్షమం మే నే. 5

ఓ విదురా! ఈ విధముగా కోపించిన రుద్రుడిచే ఆజ్ఞాపింపబడిన వీరభద్రుడు, సర్వవ్యాపకుడైన దేవదేవుడగు శివునికి ప్రదక్షిణముచేసి, తనను తాను, ఎదురులేని వేగముగల వానిగా ఎంతటి బలవంతుడినైనా తట్టుకోగల వానిగా తలచెను. 5

శ్లో॥ అన్వీయ మానస్సతు రుద్ర పార్షదైర్భృశం
నదద్భిర్వ్యనదత్సు భైరవమ్ ।
ఉద్యమ్య శూలం జగదంత కాంతకం
సంప్రాద్ర వద్ఘోషణ భూషణాంఘ్రిః ॥ 6

టీ:- అన్వీయమాన ఇతి. జగదంతకః మృత్యుః తస్యాప్యంతకం శూలం. ఘోషయంతి శబ్దం కుర్వంతీతి ఘోషణాని నూపురాదీని భూషణాని యయోస్తావంఘ్రీ యస్య సః. 6

ఈ విధముగా తలచి, పెద్దగా నాదము చేయుచున్న రుద్ర-పార్షదులచే అనుసరింపబడుచున్నవాడై, మిక్కిలి భీకరముగా సింహనాదమును చేస్తూ మృత్యువునకు కూడా మృత్యువును గొలిపే త్రిశూలమును ఎత్తి పట్టుకొని, కాళ్ళకుగల గలలాడుచున్న గజ్జెల ధ్వనులు మ్రోగుచుండగా బయలుదేరెను. 6

శ్లో॥ అథర్త్విజో యజమానస్సదస్యాః
కకుభ్యుదీచ్యాం ప్రసమీక్ష్య రేణుమ్ ।
తమః కిమేత్కుత ఏత ద్రజోఽభూ
దితి ద్విజాద్విజ పత్న్యశ్చ దధ్యుః ॥ 7

టీ:- అథేతి. కకుభీ దిశి తమో న భవతి. కింతు రజ ఇతి జ్ఞాత్వాహుః రజ ఏతత్కుతోఽభూత్. దధ్యుః చింతయామాసుః. 7

యజ్ఞమున దక్షుడు, సదస్యులు, ఋత్విక్కులు, బ్రాహ్మణులు, బ్రాహ్మణపత్నులు ఉత్తర దిక్కున లేచిన గాలిదుమారమును, ధూళిని చూచి ఈ చీకటేమిటి? ఈధూళి ఏమిటి? వేరే కారణము ఏది కనబడుటలేదు. కనుక ఏమైన ఉత్పాతములు కలుగుచున్నవా ? అని మనస్సులో చింతించుచుండిరి. 7

శ్లో॥ వాతా న వాంతి న హి సంతి దస్యవః
ప్రాచీనబర్హి ర్జీవతీహోగ్రదండః ।
గావో న కాల్యం త ఇదం కుతో రజో
లోకోఽధునా కిం ప్రళయాయ కల్పతే ॥ 8

టీ:- హేత్వంతరాసంభవే ఔత్పాతికం కల్పయంతి. వాతా ఇతి. దస్యూనామభావే హేతుః. ప్రాచీనబర్హిః తదానీంతనో రాజా. జీవతీతి. న కాల్యంతే న శీఘ్రం నీయంతే. 8

ఇప్పుడు తుఫానుగాల్పులు వీచుటలేదు. పోని దొంగలు గుంపుగా వస్తుండడంద్వారా ధూళి లేచినదా! చండశాసకుడైన ప్రాచీన బర్హి పరిపాలిస్తున్న కాలములో ఆయన జీవించి ఉండగా అది అసంభవము. పోని గోవులను గుంపులుగా గోపాలకులు తీసుకువెళ్ళితే సాయంకాలం గోధూళి లేస్తుంది. ఇప్పుడు గోధూళి వేళకాదు. మరి ఈ ధూళి ఎక్కడిది. లోకమునకు ప్రళయము రావడం లేదుకదా! ప్రళయానికి సిద్ధమగుచున్నదా! 8

శ్లో॥ ప్రసూతిమిశ్రాః స్త్రియ ఉద్విగ్నచిత్తా
ఊచుర్విపాకో వృజినస్యైవ కస్య ।
పశ్యంతీనాం దుహితౄణాం ప్రజేశ
స్సుతాం సతీమవదధ్యావనాగామ్ ॥ 9

టీ:- ప్రసూతీతి. ప్రసూతిర్దక్షపత్నీ సా మిశ్రా ముఖ్యా యాసాం తాః విపాకః ఫలం. పశ్యంతీనామపీతి తస్యా దుఃఖాధిక్యే హేతుః. అవదధ్యౌ అవజ్ఞాతవాన్. అనాగామనాగసం అనపరాధాం. 9

కలత చెందిన దక్షపత్ని ప్రసూతి మొదలగు స్త్రీలు ఈయన చేసిన పాపమునకు ఫలమే ఈ ధూళి. ఇంతమంది కుమార్తెలు చూస్తూ ఉండగా నిర్దోశురాలగు కుమార్తెను అవమానపరచినాడని మిక్కిలి దుఃఖమును వ్యక్తపరుస్తూ పలికిరి. 9

శ్లో॥ యస్త్వంతకాలే వ్యుప్త జటాకలాపః
స్వశూలసూచ్యర్పితదిగ్గజేంద్రః ।
వితత్య నృత్యత్యుదితాస్త్రదోర్ధ్వ జాను
చ్చాట్టహాస స్తనయిత్ను భిన్న దిక్ ॥ 10

టీ:- న చేదం సుతావజ్ఞామాత్రం. కింతు రుద్రావజ్ఞా చ. అతో నాస్య భద్రం భవిష్యతీత్యాహుర్ద్వాభ్యాం- య ఇతి. వ్యుప్తో వికీర్ణో జటాకలాపో యస్య. స్వశూలస్య సూచ్యాః. అగ్రే అర్పితాః ప్రోతాః. దిగ్గజేంద్రా యేన. ఉదితాని ఉన్నమితాని. అస్త్రాణి యైస్తే. దోషః బాహవ ఏవ ధ్వజాః. త్వానితత్యహర్షేణ నృత్యతి. ఉచ్చః అట్టహాసః. కఠోరో హాస ఏవ స్తనయిత్నుర్గర్జితం తేన. భిన్నాః విదీర్ణాః. దిశః యేన సః. 10

ఇది కేవలము అమ్మాయిని అవమానపరచిన ఫలమేకాదు. రుద్రావమానము కూడా జరిగినది. ఇక ఈయనకు శుభం జరుగదు అని అనుకొంటున్నారు. ఏ శివుడు ప్రళయకాలమున జటలు విరబోసుకొని శూలాగ్రము మీద అష్టదిగ్గజములను గ్రుచ్చి తన వికటాట్ట హాసములే మేఘ గర్జనలై, పిడుగుపాటులై దిక్కులను ముక్కలుచేస్తూ, ఎత్తబడిన ఆయుధములు కలిగి భుజములనే ధ్వజములుగా ఎత్తిపెట్టి హర్షముతో నృత్యముచేస్తాడో...10

శ్లో॥ అమర్షయిత్వా తమసహ్యా తేజసం
మన్యుప్లుతం దుర్నిరీక్ష్యం భ్రుకుట్యా ।
కరాళదంష్ట్రాభి రుదస్త భాగణం
స్యాత్స్వస్తి కిం కోపయతో విధాతుః ॥ 11

టీ:- అమర్షయిత్వేతి. అమర్షయిత్వా అసహనయుక్తం కృత్వా మన్యుప్లుతం క్రోధవ్యాప్తం. ఉదస్తః ఉత్క్షిప్తః భాగణః నక్షత్రసంఘః యేన సః. పునశ్చ తం కోపయతః విధాతురపి కిం స్వస్తి స్యాత్. న స్యాదేవ. తస్య చైవం సతి అన్యస్య కా కథా. 11

సహించడానికి సాధ్యముకాని తేజస్సు కలిగి భయమునుకొల్పే కోపముతో నిండిన కనుబొమ్మలు ముడివడి భయంకరమగు కోరలతో నక్షత్రగణమును చెదరకొట్టిన ఆ శివుని అసహనముగలవానిగా చేసి కోపమును కలిగిస్తే బ్రహ్మదేవుడికైనా మంచి జరుగునా ఏమి? జరగనే జరుగదు. ఇతరుల విషయమున ఇక తెలుపవలసిన అవసరమేలేదు. (11)

శ్లో॥ బహ్వేవముద్విగ్న దృశోచ్యమానే
జనేన దక్షస్య ముహుర్మహాత్మనః ।
ఉత్పేతురుత్పాతతమాస్సహస్ర
శోభయా వహాది విభూమౌ చ పర్యక్ ॥12

టీ:- బహ్వీతి. ఉద్విగ్నా ప్రచలితా దృక్ యస్య తేన జనేన. బహు యథా భవతీత్యేవం ఉచ్యమానే సతి. ఉత్పాతతమాః మహోత్పాతః ఉత్థితాః పర్యక్ సర్వతశ్చ. కథంభూతాః. మహాత్మనో దక్షస్య భయావహాః (12)

భయమును కొలిపే చూపులుగల జనము అనేక విధములుగా మాట్లాడుకొనుచుండగా, మహాత్ముడైన దక్షుడికి గూడా భయముగొల్పే లాగున. అనేకములైన ఉత్పాతములు ఆకాశమున, భూమిపైన సర్వత్ర కలిగెను. 12

శ్లో॥ తావత్స రుద్రానుచరైర్మఖో మహాన్నా
నాయుధైర్వా మనకైరుదాయుధైః ।
పింగైః పిశగైర్మకరోదరాననైః
పర్యాప్లవద్భిర్విదురాన్వరుధ్యత్ ॥ 13

టీ:- తావదితి. నానావిధాని ఆయుధాని యేషాం వామనకైర్హ్రస్వైః. ఉద్యతాయుధైః. పింగైః కపిశైః. పిశంగైః పీతవర్ణైః మకరస్యేవ ఉదరం ఆననం చ యేషాం తైః. పరితో ధావద్భిః అవరుద్ధః. 13

ఓ విదురా! అంతలో వివిధ రకముల ఆయుధములు ధరించి, ఎత్తి పెట్టిన ఆయుధములుతో, కపిలవర్ణము, పసుపు వర్ణములు కల మొసలివంటి పొట్టా, ముఖము కలిగి, ఇటునటు పరుగెత్తుచూ పొట్టిగా గల రుద్రానుచరులచే ఆ గొప్పనైన యజ్ఞము అడ్డుకొనబడెను. 13

శ్లో॥ కేచిద్బభంజుః ప్రాగ్వంశం పత్నీ శాలామథాపరే ।
సద ఆగ్నీధ్ర శాలం చ త్వదిహారం మహానసమ్ ॥ 14

టీ:- కేచిదితి. యజ్ఞశాలాయాః పూర్వపశ్చిమ స్తంభయోరర్పితం పూర్వ పశ్చిమాయాతం కాష్ఠం ప్రాగ్వంశః. తంస్తంభం. యజ్ఞశాలాయాః. పశ్చిమతః పత్నీశాలాం యజ్ఞశాలాయాః పురతః స్థితం. సదో మంటపం. సదసః పురతః హవిర్ధానం. తస్యోత్తరతః ఆగ్నీధ్ర శాలాం. తద్విహారం యజమాన గృహం. మహానసం పాక భోజనశాలాం. 14

యజ్ఞశాలకు తూర్పు పడమరల స్తంభములపై పెట్టబడిన, తూర్పు పడమరలయందు ఆ పొడుగుగాగల కర్రను ప్రాగ్వంశ మందురు. దానిని, యజ్ఞశాలలో పశ్చిమ భాగమునగల పత్నీశాలను, యజ్ఞశాలకు ఎదురుగా ఉండే సదోమండపమును, దాని ఎదురుగాగల హోమద్రవ్య స్థానమును దానికి ఉత్తరదిశనగల ఆగ్నీధ్రశాలను, అలాగే యజమాని గృహం, పాక, భోజనశాలను కొంతమంది కూల్చిరి. 14

శ్లో॥ రురుజుర్యజ్ఞ పాత్రాణి తథైకేఽగ్నీ న శామయన్ ।
కుండేష్వమూత్ర యన్కేచిద్బిభిదుర్వేది మేఖలాః ॥ 15

టీ:- రురుజురితి. రురుజుః బభంజుః ఉత్తరవేద్యాః మేఖలాః పీమాసూత్రాణి. (15-17)

యజ్ఞపాత్రలను ముక్కలు ముక్కలు చేసిరి. కొంతమంది అగ్నిని నశింపజేసిరి, కొంతమంది కుండములయందు మూత్రము చేసిరి, హవిర్ధాన ఉత్తరదేశమున గల వేదీ అవధి పరిధులను తొలగించిరి. యజ్ఞమును మలినపరచడం దోషంకాదా? యనగా 'ఆజ్ఞా గురూణాం అవిచారణీయా' గురువులు ఆజ్ఞాపించిన పిమ్మట విచారించవలదు అను న్యాయమునను సరించి వీరు దోషభాక్కులు కారు. 15

శ్లో॥ అబాధంత మునీనస్య ఏకే పత్నీ రతర్జయన్ ।
అపరే జగృహుర్దేవాన్ ప్రత్యాసన్నాన్పలాయితాన్ ॥ 16

మరికొందరు మునులను పీడించిరి. కొందరు మునిపత్నులను భయపెట్టిరి. కొందరు ఆ పారిపోవుచున్న, సమీపమున ఉన్న దేవతలను పట్టుకొనిరి. 16

శ్లో॥ భృగుం బబంధ మణిమాన్వీరభద్రః ప్రజాపతిమ్ ।
చండీశః పూషణం దేవంభగం నందీశ్వరోఽగ్రహీత్ ॥ 17

భృగుమహర్షిని మణిమంతుడు, ప్రజాపతిని వీరభద్రుడు బంధించిరి. చండీశుడు పూషదేవతను, భగదేవుడిని నందీశ్వరుడు పట్టుకొనిరి. 17

శ్లో॥ సర్వ ఏవర్త్విజో దృష్ట్వా సదస్యాస్సదివౌకసః ।
తైరర్ద్యమానాస్సుభృశం గ్రావభిర్నైకదా ద్రవన్ ॥ 18

టీ:- సర్వ ఇతి. గ్రావభిః అర్ద్యమానాః.నైకధా అనేకధా దుద్రువుః (18)

అందరు ఋత్విక్కులు, సదస్యులు, దేవతలగూడినవారు ఆ శివానుచరులు విసిరిన రాళ్ళచే పీడింపబడినవారై అనేక దిక్కులకు పారిపోయిరి. 18

శ్లో॥ జుహ్వతస్స్రువహస్తస్య శ్మశ్రూణి భగవాన్భవః ।
భృగోర్లులుంఛే సదసి యో హసన్ శ్మశ్రుదర్శయత్ ॥ 19

టీ:- జుహ్వత ఇతి. స్రువః హస్తే యస్య. భవః వీరభద్రః. లులుంఛే ఉత్పాటితవాన్. 19

దక్షయజ్ఞసదస్సున మీసములు మెలివేయుచూ, నవ్వి సృవము చేబూని హోమము చేయుచున్న భృగుమహర్షి మీసములను వీరభద్రుడు పీకివేసెను. 19

శ్లో॥ భగస్య నేత్రే భగవాన్పాతి తస్య రుషా భువి ।
ఉజ్జహార సదస్థోక్ష్ణా యశ్శపంతమసూసుచత్ ॥ 20

టీ:- భగస్యేతి. ఉజ్జహార ఉద్ధృతవాన్ సదస్థః. సభాయాం స్థితస్సన్. శపంతం శివనిందాం కుర్వంతం దక్షం. అక్ష్ణా లోచనేన. అసూసుచత్. సూచితవాన్ ప్రేరితవానిత్యర్థః. 20

సదస్థుడై శివనిందను చేయుచున్న దక్షుడిని, కంటిచూపుచే ప్రేరేపించిన భృగుడి నేత్రములను పెకిలించి భూమిపై పడవేసెను. 20

శ్లో॥ పూష్ణశ్చాపాతయన్ దంతాన్కళింగస్య యథాబలః ।
శప్యమానే గరిమణి యో హసద్దర్శయన్ దతః ॥ 21

టీ:- పూష్ణ ఇతి. కళింగదేశరాజస్య అనిరుద్ధోద్వాహే బలభద్రో యథా ద్యూతే దంతాన్ పాటితవాన్. గరిమణి గురుతరేరుద్రే. నింద్యమానే దతః దంతాన్ దర్శయన్. యో జహాస. పూష్ణోరితి పాఠే ద్వివచనం. శ్రు. "ఐంద్రాపౌష్ణశ్చరుర్భవతీ" త్యత్ర. తత్సహితస్యాపి పూష్ణః. దంతపాతనప్రాప్త్యర్థం. సూచితవాన్. తథాహి. శ్రు.

అనిరుద్ధుని వివాహ సందర్భములో బలరాముడు, రుక్మితో ద్యూతమాడుచుండగా నవ్విన కళింగుని దంతాలను బలరాముడు రాలగొట్టినట్లు, దక్షుడు పరమేశ్వరుడుని నిందించున్నపుడు దంతములు కనిపించేటట్లుగా నవ్విన పూషుడనే సూర్యుడి పళ్ళను రాలగొట్టెను. పూష్ణః అని ఏకవచనముకాక 'పూష్ణోశ్చాపాతయత్' అని ద్వివచన పాఠమునననుసరించినపుడు, ఈ విధముగా మైత్రేయుడు ద్వివచనమును ఎందుకు సూచించినాడనగా, పూషాదేవతకు పళ్ళు లేవు కనుక అతను గోధుమపిండిని లేక బియ్యపుపిండిని తింటాడు అని శ్రుతి.

"పూషాప్రవిష్ట భాగోదంత కోహితం దేవా అబ్రువన్ని" తి. విహితస్య పిష్టభాగస్య. ద్వి దైవత్యాభావాత్. తత్ర తస్య దంసాస్సంతీతి వక్తవ్యం స్యాత్. నైతత్సంగచ్ఛత ఇత్యాశంక్య. తస్యాపి తత్ర దంతపాతావస్థాభేదే ప్రవృత్తే న ద్వివచనేన జ్ఞాప్యతే. అత ఏవ పూషోఽనుగ్రహం ద్వేధా వక్ష్యతి. శ్లో. "పూషా తు యజమానస్య దద్భిర్జక్షతి పిష్టభుగి" తి. కేవలశ్చేత్పిష్ట భుగ్భవిష్యతి. అన్యసహితశ్చేత్ యజమానదద్భిః భక్షయిష్యతీతి. 21

కాని ఇద్దరు దేవతలు కలిసి ఉన్నప్పుడు దంతములు కలిగియుండి, ఒక్కడే ఉన్నపుడు దంతములు లేనివాడని అర్థం చెబుదాం అనే దానిని ఖండించుట కొరకే ద్వివచనం అని చెబుతూ, పూషకు రెండు విధములైన అనుగ్రహములు. పూష ఒక్కడే ఉన్నపుడు 'పిష్టభుక్' పిండిని తింటాడు. ఇంద్ర సహితుడైనపుడు యజమాని దంతములతో పిష్టమును భక్షించును కావున ద్వివచన పాఠమును స్వీకరించిన ఎట్టి దోషములు లేవని అభిప్రాయము. 21

శ్లో॥ ఆక్రమ్యోరసి దక్షస్య శితధారేణ హేతినా ।
ఛిందన్నపి తదుద్ధర్తుం నాశక్నో త్ర్యంబక స్తదా ॥ 22

టీ:- ఆక్రమ్యేతి. ఛిందన్నపీత్యత్ర శిర ఇత్యుపరివ్యక్తీ భవిష్యతి. త్ర్యంబకో వీరభద్రః. 22

వీరభద్రుడు, దక్షుడి వక్షఃస్థలమున కాలుంచి శితధారమనే ఖడ్గముతో తల నరికినప్పటికీ తల మొండెమునుండి వేరుచేయలేక పోయినాడు . 22

శ్లో॥ శస్త్రైరస్త్రాన్వితైరేన మనిర్భిన్న త్వచం హరః ।
విస్మయం పరమాపన్నో దధ్యౌ పశుపతిశ్చిరమ్ ॥ 23

టీ:- శస్త్రైరితి. అస్త్రాన్వితైర్మంత్రసహితైః. న నిర్భిన్నా త్వగ్యస్య. తథా భూతం దృష్ట్వేతి శేషః. 23

మంత్రములచే ప్రయోగించునవి అస్త్రములు, సహజ ఆయుధములు శస్త్రములు. ఈ రెంటిచేత దక్షుడి చర్మము (వేరుకాక-పోవడంచే) తెగకపోవడంచే మిక్కిలి విస్మయం పొంది, మూడు కన్నులున్న వీరభద్రుడు చాలాసేపు ఆలోచించినాడు. 23

శ్లో॥ దృష్ట్వాసంజ్ఞపనం యోగం పశూనాం సపతిర్మఖే ।
యజమానపశో స్తస్య కాయాత్తే నాహరచ్ఛిరః ॥ 24

టీ:- దృష్ట్వేతి. సః పశూనాం పతిః మఖే సంజ్ఞపనం యోగం. కంఠ నిష్పీడనాది రూపం మరణోపాయం. దృష్ట్వా తేనోపాయేనాహరత్. (24)

అప్పుడు ధ్యానములో తెలిసినది ఈ యజ్ఞమున యజమానుడే పశువు. యజ్ఞమున పశువును ఏ విధముగా నవ రంధ్రములు మూసి ప్రాణము వెళ్ళిన తర్వాత శిరఃఖండనమును చేస్తారో (ఇదియే సంజ్ఞపన యోగము) అదే విధముగా దక్షుడి శిరస్సును ఖండించెను. 24

శ్లో॥ సాధువాదస్తదా తేషాం కర్మ తత్తత్ప్రశంసతామ్ ।
భూతప్రేత పిశాచానామన్యేషాం తద్విపర్యయః ॥ 25

టీ:- సాధువాద ఇతి. అన్యేషాం బ్రాహ్మణాదీనాం. తద్విపర్యయః అసాధువాదః. అభూదితి శేషః. 25

ఆ సమయమున భూత, ప్రేత, పిశాచములు వీరభద్రుడి పరాక్రమమును స్తుతిస్తూ (సాధువాదములు) ప్రశంసలు కురిపించిరి. బ్రాహ్మణులకు మాత్రము దుఃఖము కలిగెను. 25

శ్లో॥ జుహావైతచ్ఛిరస్తస్మిన్ దక్షిణాగ్నావమర్షితః ।
తద్దేవయజనం దగ్ధ్వా ప్రాతిష్ఠద్గుహ్యకాలయమ్ ॥ 26

టీ:- జుహావేతి. గుహ్యకాలయం కైలాసం. 26

దక్షిణాగ్నిలో శిరస్సును వేసి కోపములో యజ్ఞశాలను కాల్చి కైలాసమునకు వెళ్ళెను. 26

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,**
**పంచమోఽ ధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు**
**ఐదవ అధ్యాయము సమాప్తము.**

## షష్ఠోఽధ్యాయః

శ్లో॥ షష్ఠే తు దేవసంఘేన సహ గత్వా భవం విధిః ।
సాంత్వయామాస దక్షాది జీవితాద్యర్థ మాదరాత్ ॥

## 6వ అధ్యాయము

ఓ ఆరవ అధ్యాయమున దక్షాదులను పునర్జీవితుల చేయుటకు బ్రహ్మదేవుడు ఆదరపూర్వకముగా పరమేశ్వరుడిని శాంతింపజేయుట వివరించబడినది

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ అథ దేవగణాస్సర్వే రుద్రానీకైః పరాజితాః ।
శూలపట్టపని స్త్రింశగదా పరిఘముద్గరైః ॥ 1

టీ:- అథేతి. అథ దేవగణాః స్వయంభువే న్యవేదయన్నితి ద్వితీయేనాన్వయః. శూలాదిభిః. 1

శ్లో॥ సంఛిన్న భిన్న సర్వాంగాస్సర్త్విక్సభ్యా భయాకులాః ।
స్వయంభువే నమస్కృత్వా కార్త్స్న్యేనైతన్న్య వేదయన్ ॥ 2

టీ:- సంఛిన్నేతి. సంఛిన్నాని త్రుటితాని. భిన్నాని విదీర్ణాని అంగాని యేషాం. సహ ఋత్విగ్భిః సభ్యైశ్చ వర్తమానాః. 2

**మైత్రేయుడు పలికెను.**

అటుపిమ్మట రుద్రసైన్యముచే పరాజితులై శూలములు, అడ్డకత్తులు, కత్తులు, గదలు, ఇనుపగుదియలు, సమ్మెటలచే చిన్నాభిన్నమైన సర్వఅవయవములుగల దేవగణమంతా ఋత్విక్కులను, సభ్యులను తీసుకొని బ్రహ్మదేవుడి వద్దకు వెళ్ళి నమస్కరించి ఆయనను సంపూర్ణముగా విషయమును విన్నవించుకొనిరి. (1-2)

శ్లో॥ ఉపలభ్య పురైవైతద్భగవానబ్జసంభవః ।
నారాయణశ్చ విశ్వాత్మా న కస్యాధ్వరమీయతుః ॥ 3

టీ:- ఉపలభ్యేతి. కస్య దక్షస్య నేయతుః న జగ్మతుః. 3

విశ్వాత్మకుడైన నారాయణుడు, కమలోద్భవుడైన బ్రహ్మదేవుడు ఈ యజ్ఞము అరుద్రకమనే విషయమును మొదలే తెలిసి దక్షయజ్ఞము -నకు వెళ్ళలేదు. 3

శ్లో॥ తదాకర్ణ్య విభుః ప్రాహ తేజీయసి కృతాగసి ।
పుంసి క్షేమాయ సా భూయన్న ప్రాయేణ బుభూషతామ్ ॥ 4

టీ:- తదితి. విభుః బ్రహ్మ. తేజీయసి అతితేజస్విని పురుషేకృతాగసి సత్యసి. స్వయం తత్ర కృతాగసాం. బుభూషతాం అపరాధం కర్తుమిచ్ఛతాం. సా తథా బుభూషా. తేషాం క్షేమాయ. నభూయాత్ ప్రాయేణేతి లోకోక్తిః. న భవేదేవేత్యర్థః. 4

దేవతలు వెళ్ళి బ్రహ్మదేవుడికి చెప్పగా బ్రహ్మదేవుడు విని ఈ విధముగా పలికెను. అతి తేజస్వంతుడైన మహాపురుషుడు ఒకవేళ మన విషయములో అపరాధము చేసినవాడైనప్పటికి, మనము తిరిగి అపరాధము చేయదలచిన అది మనకు క్షేమమును కలిగించదు అని పెద్దలమాట. అట్టిది ఏ పాపమెరుగని అతి తేజస్వంతుడైన పరమ శివుడియందు చేయదలచిన అపరాధము మీకెందుకు క్షేమము కలిగించును? 4

శ్లో॥ అథాపి యూయం కృతకిల్బిషా భవం
యే బర్హిషో భాగభుజం పరాదుః ।
ప్రసాదయధ్వం పరిశుద్ధ చేతసా
క్షిప్ర ప్రసాదం ప్రగృహీతాంఘ్రి పద్మమ్ ॥ 5

టీ:- అథాపీతి. అథాపి ప్రసాదయధ్వం క్షమాపయధ్వం. యే భవంతః బర్హిషః యజ్ఞస్య. భాగభుజం పరాదుః. దూరాదేవ ఖండితవంతః. ప్రగృహీతాంఘ్రి పద్మం యథా భవతి తథా. పాదౌ ప్రగృహ్యేత్యర్థః. 5

నిజానికి మీరు భవుడియందు అపకారము చేసినవారే. శివుడికి యజ్ఞముయందు భాగమును దూరము నుండి ఖండించినవారే అయినప్పటికి పరిశుద్ధమైన మనసుతో తొందరగా అనుగ్రహించే పరమాత్మ పాదములు పట్టుకొని ప్రసన్నుడిని చేసుకొనండి. (క్షమించమని ప్రార్థించండి). 5

శ్లో॥ ఆశాసానాజీవితమధ్వరస్య
లోకాస్సపాలః కుపితేన యస్మిన్ ।
తమాశు దేవం ప్రియయా విహీనం
క్షమాపయధ్వం హృదివిద్ధం దురుక్తైః ॥ 6

టీ:- ఆశాసానా ఇతి. అధ్వరస్య జీవితం పునస్సంధానం. ప్రార్థయ మానాస్సంతః. యస్మిన్ కుపితే సతి. స లోకపాలో లోకో న భవేత్. నశ్యేదిత్యర్థః. 6

నిలచిపోయిన యజ్ఞము పునస్సంధానము కావాలని మీకు కోరిక ఉంటే, చెడుమాటలచే గాయపరచబడిన హృదయముగల, ప్రియురాలి వియోగము గలిగిన ఆ పరమశివుడిని తొందరగా ప్రసన్నుడిని చేసుకొనండి. ఆయననే కోపించిన లోకపాలసహితమైన లోకమే లేకుండా పోతుంది. 6

శ్లో॥ నాహం న యజ్ఞో న చ యూయమన్యే
యే దేహభాజో మునయశ్చ తత్త్వమ్ ।
విదుః ప్రమాణం బలవీర్యయోర్వా
తస్యాత్మతంత్రస్య క ఉపాయం విధిత్సేత్ ॥ 7

టీ:- వయం తత్ర గంతుం బిభిమః త్వమేవ కించిదుపాయం విధత్స్వేతి చేత్తత్రాహ-నేతి. యజ్ఞః తదానీంత న ఇంద్రః.యస్య తత్త్వం. బల వీర్యయోః ప్రమాణం ఇయత్తాం చ న విదుః. వీర్యం పరాక్రమః పాపమితి పాఠే అపరాధం. (7-8)

అయ్యా! బ్రహ్మదేవా! ఆయన ముందుకు వెళ్ళడానికి మేము భయపడుచున్నాము. నీవే ఏదో ఒక ఉపాయమును కల్పించుమనగా ఏ మహాదేవుడి బలము, పరాక్రమము, యథార్థ ఆత్మతత్త్వము దేహాత్మ బుద్ధులుగాని మునులు, మీరు, ఇంద్రుడు, అంతేకాదు నేను గూడా తెలుసుకొనలేము. అట్టి ఆత్మతంత్రుడైనవాడి విషయములో మీకు నేను ఉపాయమును ఎలా తెలుపగలను? 7

శ్లో॥ స ఇత్థమాదిశ్య సురానజ స్తై
స్సమన్వితః పితృభిస్స్రజేశైః ।
యయౌ స్వధిష్ణ్యా న్నిలయం పురద్విషః
కైలాసమద్రి ప్రవరం ప్రియం ప్రభోః ॥ 8

ఈ విధముగా ఆదేశించి, ప్రజాపతులు, పితృదేవతలు, దేవతలు వెంటరాగా బ్రహ్మదేవుడు తన సత్యలోకమునుండి త్రిపుర సంహారకుడైన శివుడికి అత్యంత ప్రియమైన పర్వతములలో శ్రేష్ఠమైన కైలాసమును గూర్చి వెళ్ళెను. ఆ కైలాసపర్వతమును పధ్నాలుగు శ్లోకాల్లో ఈ విధముగా వర్ణించుచున్నాడు. 8

శ్లో॥ జన్మౌషధి తపోమంత్ర యోగసిద్ధైర్నరేతరైః ।
జుష్టం కిన్నర గంధర్వైరప్సరోభిర్వృతం సదా ॥ 9

టీ:- కైలాసం వర్ణయతి-చతుర్దశభిః, జన్మేతి. నరేతరైర్దేవైర్జుష్టం. 9

1.పుట్టుకతోనే సిద్ధుల ఇంటిలో పుట్టుట 2. మూలికలచే 3.తపస్సుచేత 4.మంత్రములచే 5. యోగముచే, అను ఐదు విధములుగా సిద్ధులు గలరు. వారిచే, దేవతలచే సేవింపబడుచూ, గంధర్వాప్సరసలచే, విహారార్థము వచ్చిన వారిచే నిండి ఎల్లప్పుడు...9

శ్లో॥ నానామణిమయైః శృంగైర్నానాధాతు విచిత్రితైః ।
నానా ద్రుమ లతాగుల్మైర్నానా మృగగణాన్వితైః ॥ 10

టీ:- నానేతి. శ్లోకద్వయస్యైకాన్వయః. శృంగైః కూటైః రమణం. రతిప్రదమిత్యుత్తరేణాన్వయః. కథం భూతైర్నానాధాతుభిర్విచిత్రైః నానా ద్రుమ లతా గుల్మా యేషు. 10

ఆ పర్వతరాజము అనేక విధముల మణులచే అనేక ధాతువులచే రంగురంగులుగా కనబడుచు అనేక చెట్లు, తీగలు, పొదలచే నిండి అనేక రకములైన మృగ సమూహములచే నిండి...10

శ్లో॥ నానామల ప్రస్రవణైర్నానాకందరసానుభిః ।
రమణం విహరంతీనాం రమణైస్సిద్ధయోషితామ్ ॥ 11

టీ:- నానేతి. నానా అమలాని ప్రస్రవణాని యేషు. నానా కందరాస్సానవశ్చ యేషు. రమణైస్సహ క్రీడంతీనాం. 11

అనేక విధములుగా నిర్మలమైన జలధారలు స్రవిస్తూ అనేక విధములైన గుహలుగలిగి, సుందర రమణీమణులచే సిద్ధులు విహరించుచున్నట్టి మరియు...11

శ్లో॥ మయూర కేకాభిరుతం మదాంధాళి విమూర్ఛితమ్ ।
ప్లావితై రక్త కంఠానాం కూజితైశ్చ పతత్రిణామ్ ॥ 12

టీ:- మయూరేతి. మయూరాణాం కేకాభిః స్వనైః నాదితం మదాంధైరళిభిః విమూర్ఛితం మూర్ఛనారాగ గతి విశేషాః. తద్వ్యాప్తం కృతం. రక్త కంఠానాం కోకిలానాం ప్లావితైః ప్లుతత్వంనీతైః స్వరైః అన్యేషాం పతత్రిణాం చ కూజితైః.12

నెమళ్ళ కేకారవములచే నిండి, తేనెజుర్రి మదమెక్కిన తుమ్మెదల మూర్ఛనలచే, అనగా రాగగతి విశేషఝుంకారములచే కోకిలల దీర్ఘ రవములచే, ఇతర పక్షుల సుందర ధ్వనులచే మరియు... 12

శ్లో॥ ఆహ్వయంతమివోద్ధస్తైర్ద్విజా న్కామదుఘైర్ద్రుమైః ।
వ్రజంతమివ మాతంగైర్గృణంతమివ నిర్ఝరైః ॥ 13

టీ:- ఆహ్వయంతమితి. ఉద్ధస్తైరున్నతశాఖైః ద్రుమైః. ద్విజాన్ పక్షిణః ఆహ్వయంతమివ. లోకే హి హస్తముత్క్షిప్య ఉచ్చైస్స్వరేణ ఆహ్వాన మర్థినాం కుర్వంతి. అద్రిశ్చ ఉత్క్షిప్త హస్తాకారైః ద్రుమైః తత్రత్య పక్షిస్వనైశ్చ తథా లక్షిత ఇత్యర్థః. వ్రజద్భిర్మాతంగైర్గజైర్వ్రజంతమివ. నిర్ఝర ధ్వనిభిః గృణంతం భాషణమివ. (13-14)

ఎత్తైన ఆ పర్వతము పైన వృక్షములు, కోరినకోర్కెలు తీర్చడానికి పక్షులను చేతులెత్తి పిలుస్తున్నట్టుగా (లోకంలో ఎవరినైన పలిచి ఏదైన పెట్టాలి అనుకున్నప్పుడు చేతులెత్తి గట్టిగా పిలుస్తాము) ఏనుగుల గుంపుచే కదులుచున్నదా అన్నట్టుగా ప్రవహించుచున్న సెలయేల్ల ధ్వనులు మాట్లాడుతున్నట్లుగా మరియు...13

శ్లో॥ మందారైః పారిజాతైశ్చ సరళైశ్చోపశోభితమ్ ।
తమాలైస్సాలతాలైశ్చ కోవిదారాసనార్జునైః ॥ 14

మందార, పారిజాతములు మరియు ఇతరములగు పొదువు గలిగన చెట్లచే మరియు కానుగ, సాల, తాటి, రక్తకాంచన, వేగిస, మద్ది చెట్లచే మరియు...14

శ్లో॥ చూతైః కదంబైర్నీపైశ్చ నాగ పున్నాగ చంపకైః ।
పాటలాశోక వకుళైః కుందైః కురవకైరపి ॥ 15

టీ:- చూతైరితి. చూతామ్రయోరవాంతర జాతిభేదః. 15

ప్రత్యేకమైన మామిడి, కడిమి, కడిమిచెట్టులో ఒక భేదం పొన్న, సురపొన్న, సంపెంగ, కంకేళి, కలిగొట్టు, పాగడ, గన్నేరు, ఎర్రగోరింట చెట్లతో మరియు...15

శ్లో॥ స్వర్ణార్క శతపత్రైశ్చ వరరేణుక జాతిభిః ।
కుటజైర్మల్లికాభిశ్చ మాధవీభిశ్చ మండితమ్ ॥ 16

బంగారు వర్ణము కలిగిన తామర కమలములతో గన్నేరు, ఏలకులు, జాజి, ఉత్తరేణి, మల్లె, పూలగురువెంద మొదలగు తీగచెట్లచే అలంకరింపబడిన...16

శ్లో॥ పనసోదుంబరాశ్వత్థ ప్లక్ష న్యగ్రోధ హింగుభిః ।
భూర్జైరోషధిభిః పూగై రాజపూగైశ్చ జంబుభిః ॥ 17

టీ:- స్వర్ణేతి. రేణుకజాతిభిరిత్యత్ర. రేణుకాః ఏలాః. జాతిః మాలతీ.(16-17)

పనస, మేడి, రావి, జువ్వి, మర్రి, ఇంగు, భూర్జ పత్రము ఔషధములతో, పోకచెట్లతో, రాజపూగములు, నేరేడుచెట్లతో...17

శ్లో॥ ఖర్జూరామ్లాత కామ్రాద్యైః ప్రియాళు మధు కేంగుదైః ।
ద్రుమాజాతిభిరన్యాభీ రాజితం వేణుకీచకైః ॥ 18

టీ:- ఖర్జూరేతి. ద్రుమజాతిభిరిత్యత్ర. జాతిరవాంతరభేద సామాన్యా. వేణుకీచకయోర్నీ రంధ్ర సరంధ్రత్వే న భేదః. 18

ఆ కైలాసము ఖర్జూరము అంబాళపు చెట్టు, మామిడి మొదలగు వృక్షములతో మోరటి, ఇప్పగార చెట్లతో ఇతరములగు వృక్షజాతి అవాంతర భేదములతో వెదురు బొంగుపొదలతో, వేణు, కీచకములతో (రంధ్రములులేని వెదురు. వేణువు, రంధ్రములు గలవి కీచకము.) ప్రకాశించుచున్నది. 18

శ్లో॥ కుముదోత్పల కల్హార శతపత్ర సమృద్ధిభిః ।
నలినీషు కలం కూజత్ఖగ బృందోపశోభితమ్ ॥ 19

ఆ కైలాసములోని సరస్సులలో తెల్ల కలువలు, నల్లకలువ, చెంగలువ, తామరపువ్వులు గుంపులుగా పూయడంద్వారా సంవృద్ధంగా ఉండడంచేత మధురమైనదిగా కూయుచున్న పక్షి బృందములు కలిగి ప్రకాశించుచున్నది. 19

శ్లో॥ మృగైశ్శాఖామృగైః క్రోడైర్మృగేంద్రైరృక్షశల్యకైః ।
గవయైశ్శరభైర్వ్యాఘ్రైరురుభిర్మహిషాదిభిః ॥ 20

టీ:- కుముదేతి. కుముదాది సమృద్ధిభిః హేతుభిః. నళీనీషు సరస్సు. కలం మధురం యథా భవత్యేవం కూజంతి యాని పక్షిబృందాని తైరుపశోభితం. (19-20)

లేళ్ళచే, కోతులచే, ఆడవిపందులచే, సింహములచే, గుడ్డేలుగుల (ఎలుగుబంట్లు)చే, ముళ్ళపందులచే, అడవి ఆవులచే, శరభమృగములచే, పెద్దపులులచే, నల్లచారల దుప్పులచే, అడవిదున్నలు మొదలగు వాటిచే (పూర్వం మృగగణములు కొమ్ములతో గలవి ఇప్పుడు కొమ్ములు లేనివని అని చెప్పుకొనిన పునరుక్తి దోషము ఉండదు) శోభించుచున్నది. (20)

శ్లో॥ కర్ణోర్ణైకపదశ్వాద్యైర్నిర్జుష్టం మృగనాభిభిః ।
కదలీషండ సంరుద్ధ నళినీ పులిన శ్రియమ్ ॥ 21

టీ:- కర్ణేతి. మృగాదిభిర్నిర్జుష్టం నిషేవితం. నాభిః కస్తూరిమృగః. పూర్వం మృగగణాః శృంగవిశేషిత్వేనోక్తాః. ఇదానీం స్వాతంత్ర్యేణేత్యపౌనరుక్త్యం. కదలీషండైస్సంరుద్ధాని ఆవృతాని. నళినీనాం పులినాని తైః. శ్రీః శోభా యస్మిన్. 21

గోకర్ణ మృగములచే, ఒకేపాదం కలిగిన మృగములు, గుర్రం మూతులుగల మృగములు, తోడేళ్ళచే కస్తూరి మృగములచే సేవించబడుతూ, అరటిచెట్ల గుంపులచే, నదుల ఇసుక తిన్నెలచే శోభాయమానముగా ఉన్నది. 21

శ్లో॥ పర్యస్తం నందయా సత్యా స్నానపుణ్యతరోదయా ।
విలోక్య భూతేశగిరిం విబుధా విస్మయం యయుః ॥ 22

టీ:- పర్యస్తమితి. నందయా గంగయా పర్యస్తం పరివేష్టితం. సత్యాః భవాన్యాః. స్నానేన. పుణ్యంతరం అతిసుగంధి ఉదకం యస్యాం. 22

భగవతీ భవానీ స్నానముచే అతి సుగంధ పూరితమైన గంగానదిచే చుట్టబడిన (పరివేష్టించబడిన) కైలాస పర్వతమును చూచి దేవతలు ఆశ్చర్యమును పొందిరి. 22

శ్లో॥ దదృశుస్తత్ర తే రమ్యామలకాం నామ వై పురీమ్ ।
వనం సౌగంధికం చాపి యత్ర తన్నామపంకజమ్ ॥ 23

టీ:- దదృశురితి. తత్రగిరౌ. వనంచ దదృశుః. యత్ర వనే తన్నామ సౌగంధికం నామ పంకజం భవతి. జాతావేకవచనం. 23

ఆ పర్వతముయందు రమ్యమైన అలకాపురిని, సౌగంధికమనే వనమును, సౌగంధిక కమలములను చూచిరి. పంకజమని ఏక వచనము ఒకే పువ్వని కాదు. (జాతియందు ఏక వచన ప్రయోగము పుష్ప జాతి కలదు అని) 23

శ్లో॥ నందాచాలకనందా చ సరితౌ బాహ్యతః పురః ।
తీర్థపాదపదాంభోజ రజసాఽతీవ పావనే ॥ 24

టీ:- పురీం వర్ణయతి–చతుర్భిః. నందేతి. పురః పురాత్. బాహ్యతః భవతః తీర్థపాదస్య హరేః. పాదాం భోజరసా. 24

శ్లో॥ యయోస్సురస్త్రియః క్షత్తరవరూహ్య స్వధిష్ణ్యతః ।
క్రీడంతి పుంభిస్సించంత్యో విగాహ్య రతికర్శితాః ॥ 25

టీ:- యయోరితి. యయోర్విగాహ్య ప్రవిశ్య క్రీడంతి. 25

శ్లో॥ యయోస్తత్స్నాన విభ్రష్టన్నవ కుంకుమపింజరమ్ ।
వితృషోఽపి పిబంత్యంభః పాయయంతో గజాగజీః ॥ 26

టీ:- యయోరితి. యయోరంభః. విగతతృషోఽపి గజాః పిబంతి. తత్ర హేతుః. తాసాం సురస్త్రీణాం. స్నానేన విభ్రష్టం గళితం. యన్నవకుంకుమం తేన. పింజరం పీతవర్ణం. గజీః కరిణీః. 26

**అలకాపురిని వర్ణిస్తున్నాడు.**

అలకాపురికి బయట నందా, అలకనందా అను రెండు నదులు ప్రవహించుచున్నవి. తీర్థమువలె పరమ పవిత్రమైన పాదములుగల విష్ణుపాదకమలధూళిచే అతి పావనమైనవి. 24

ఓ విదురా! భోగములచే అలసిపోయిన పురస్త్రీలు తమ లోకములనుండి వచ్చి ఈ రెండు నదులయందు ప్రవేశించి భర్తలపై నీళ్ళను చల్లుతూ క్రీడించుచున్నారు. 25

నందా, అలకనందా అనే ఈ రెండు నదులలో దేవతాస్త్రీలు స్నానము చేయగా వారి దేహమునుండి జారిన కుంకుమపువ్వుచే పసుపుపచ్చగా మారిన ఆ జలమును దప్పికలేకున్నా మగ ఏనుగులు అవి త్రాగుచూ ఆడ ఏనుగులకు త్రాగించుచున్నవి. 26

శ్లో॥ తారహేమమహారత్న విమాన శత సంకులామ్ ।
జుష్టాం పుణ్యజనస్త్రీ భిర్యథా ఖం సతటిద్ఘనమ్ ॥ 27

టీ:- తారేతి. తారం రూప్యం.తారాదిమయ విమానానాం శతైః సంకులాం తటిద్భిః స్త్రీణాం ఘనైః విమానానాం ఖేనపుర్యాస్సాదృశ్యం. 27

అలకాపురిపై ఆకాశములో వెండి, బంగారు మహారత్నములచే గూడిన వందల విమానములచే రద్దీగా తిరుగుచున్నవి. వాటిలో యక్షస్త్రీలు విహరించుచున్నారు. (వారు ఏ విధముగా ఉన్నారనగా ఆకాశములో మెరుపుతీగలవలె. ఇచ్చట మెరుపు తీగలకు దేవతా స్త్రీలకు, మేఘములకు విమానములకు, ఆకాశమునకు అలకాపురికి పోలిక). 27

శ్లో॥ హిత్వా యక్షేశ్వరపురీం వనం సౌగంధికం చ తత్ ।
ద్రుమైః కామదుఘైర్హృద్యం చిత్రమాల్యఫలచ్ఛదైః ॥ 28

టీ:- హిత్వేతి. యక్షేశ్వరపురీం హిత్వా అతిక్రమ్య. తద్వనం చ దృష్ట్వా తే దేవాః. ఆరాద్దూరాత్. వటం దదృశురితి చతుర్థేనాన్వయః. కథంభూతం వనం విచిత్రాణి మాల్యాని ఫలాని ఛదాశ్చ యేషు తే ద్రుమైః హృద్యం సుఖకరం. 28

యక్షేశ్వరపురిని దాటి సౌగంధిక వనమును చూచి ఆ దేవతలు చిత్రమైన పుష్పములు, ఫలములు, పత్రములతో కూడిన సుఖకరమైన దూరముగాయున్న వటవృక్షమును చూచిరి. 28

శ్లో॥ రక్తకంఠఖగానీక స్వరమండిత షట్పదమ్ ।
కలహంస కులశ్రేష్ఠం ఖర దండ జలాశయమ్ ॥ 29

టీ:- రక్తకంఠేతి. రక్తకంఠఖగానామనీకస్య స్వరైర్మండితాష్షట్పదాః షట్పదస్వరా యస్మిన్. కలహంసానాం కులస్య శ్రేష్ఠం. ఖరదండాని పద్మాని. తద్యుక్తాః జలాశయా యస్మిన్. 29

కోకిలల సామూహిక స్వరములు, తుమ్మెదల సుస్వరములు కలిగి రాజహంసలకిష్టమైన, శ్రేష్ఠమైన పద్మములతో నిండిన జలాశయమును చూచిరి. 29

శ్లో॥ వనకుంజర సంఘృష్ట హరిచందన వాయునా ।
అధి పుణ్యజనస్త్రీణాం ముహురున్మదయన్మనః ॥ 30

టీ:- వనేతి. వనకుంజరైః సంఘృష్టాః. యే హరిచందనద్రుమాః తత్సంబంధినా వాయునా పుణ్యజనస్త్రీణాం మనః. అధి అధికం ఉన్మదయన్. 30

ఆ వనములోని శ్రేష్ఠ గజములచే రాపిడి పెట్టబడ్డ హరిచందన వృక్షములకు తాకిన గాలులు తమను తాకగా యక్షస్త్రీల మనస్సులు పునః పునః మథించబడుచున్నవి. 30

శ్లో॥ వైడూర్యకృత సోపానా వాపీరుత్పల మాలినీః ।
వ్యాప్తం కింపురుషైర్దృష్ట్వా తఆరాద్దదృశుర్వటమ్ ॥ 31

టీ:- వైడూర్యేతి. యత్ర చ ఉత్పలమాలిన్యో వాప్యః తత్కింపురుషైః వ్యాప్తం వటం దృష్ట్వా. పాఠాంతరే కింపురుషైః ప్రాప్తా వాపీశ్చ దృష్ట్వేత్యర్థః. 31

వైడూర్యములచే చేయబడిన చెట్లు కలిగి, నల్లకలువలచే నిండిన దిగుడు బావులను, కింపురుషులచే పొందబడిన ఆ సౌగంధిక వనమును చూచి, దూరములో వారు వటవృక్షమును చూచిరి. లేదా కింపురుషులచే గూడిన బావులను చూచి అని పాఠాంతరము. 31

శ్లో॥ సయోజనశతోత్సేధః పాదోన విటపా యుతః ।
పర్యక్కృతాచల చ్ఛాయో నిర్నీడస్తాప వర్జితః ॥ 32

టీ:- సఇతి. యోజన శతం ఉత్సేధః. ఉచ్ఛ్రాయో యస్య పాదోనైః సర్వతః. పంచసప్తతియోజన ప్రమాణైః. విటపైః శాఖాభిః. ఆయతః విస్తృతః. పర్యక్ సర్వతః కృతా ఆచలచ్ఛాయాయేన. నిర్గతం నీడం యస్మాత్. 32

ఆ వటవృక్షము వందయోజనముల ఎత్తుకలిగి డెబ్బైఐదు యోజనముల విస్తృతమైన కొమ్మలు కలిగి అన్నిచోట్ల నిండిన నీడచే పక్షుల గూళ్ళులేనిదై, వేడిలేనిదై యున్నది. శీతోష్ణరహితమైనదని తాత్పర్యము. (32)

శ్లో॥ తస్మిన్మహాయోగమయే ముముక్షు శరణేసురాః ।
దదృశుర్దేవమాసీనం త్యక్తామర్ష మివాంతకమ్ ॥ 33

టీ:- తస్మిన్నితి. ముముక్షూణాం శరణే ఆశ్రయే. త్యక్తః అమర్షో యేన సః. అంతకః తత్తుల్యః. 33

అణిమాదిసిద్ధులు కలిగి ముముక్షువులకు మోక్షేచ్ఛ గలవారికి ఆధారమైన, ఆశ్రయమైన ఆ వటవృక్షమువద్ద కోపము విడిచిన యమునివలె కూర్చొని ఉన్న శివుని చూచిరి. 33

శ్లో॥ సనందా ద్యైర్మహాసిద్ధైశ్శాంతైస్సంశాంత విగ్రహమ్ ।
ఉపాస్యమానం సఖ్యా చ భర్త్రా గుహ్యక రక్షసామ్ ॥ 34

టీ:- తం విశినష్టి పంచభిః. సనందాద్యైరితి. సఖ్యా కుబేరేణ. ఉపాస్యమానం. 34

ఐదుశ్లోకాలలో ఆ పరమశివుని గూర్చి చెప్పుచున్నాడు. శాంతులు, మహాసిద్ధులు అయిన సనందనాదులచే గుహ్యకరాక్షసులకు అధిపతియైన, మిత్రుడైన, కుబేరుడిచే ఉపాసింపబడుచున్న (శివుని చూచిరి)...34

శ్లో॥ విద్యా తపో యోగ పథమాస్థితం తదధీశ్వరమ్ ।
చరంతం విశ్వ సుహృదం వాత్సల్యాల్లోక మంగళమ్ ॥ 35

టీ:- విద్యేతి. విద్యా ఉపాసనా. తపశ్చిత్తైకాగ్ర్యం. యోగస్సమాధిః. తేషాం పంథానం. ప్రవర్తన ద్వారా లోకస్య. మంగళం హితం తపః వాత్సల్యాత్ స్నేహాత్. ఆచరంతం. 35

విద్యాయనగా ఉపాసన, తపస్సనగా చిత్తమును ఒకేవస్తువు యందు నిలుపుట, యోగమనగా సమాధిస్థితి, తనప్రవర్తనద్వార లోకానికి వీటియొక్క మార్గమును చూపుతూ, అనుష్ఠిస్తూ ఈ జగత్తుకు నాయకుడైనట్టి, జగత్తునకు హితకారియైన, లోకమునకు హితము జరగాలని ప్రేమచే వాత్సల్యముచే తపమును చేయుచున్న శివుని చూచిరి. 35

శ్లో॥ లింగం చ తాపసాభీష్టం భస్మ దండ జటాజినం ।
అంగేన సంధ్యాభ్రరుచా చంద్రరేఖాం చ బిభ్రతం ॥ 36

టీ:- లింగమితి. సంధ్యా భ్రరుచా రక్త వర్ణేన అంగేన. భస్మాది లింగం చంద్రరేఖాం చ బిభ్రతం. 36

తపస్సంపన్నులకు అత్యంత ప్రియమైన సంధ్యాకాలపు మేఘము వలె (సూర్యోదయ, సుర్యాస్తమయ సంధ్యా కాలములలో మేఘము ఎరుపెక్కి కనబడును. కన్యాకుమారాది క్షేత్రములలో ఎరుపు మేఘము లను దర్శించవచ్చును) ఎరుపు శరీరము కలిగి, భస్మం ధరించి, జడలు కలిగి, దండము కలిగి, మృగచర్మము కలిగిన చిహ్నములుగల చంద్రలేఖను ధరించిన (శివునిచూచిరి)...36

శ్లో॥ ఉపవిష్టం దర్భమయ్యాం బ్రుస్యాం బ్రహ్మ సనాతనమ్ ।
నారదాయ ప్రవోచంతం పృచ్ఛతే శ్రుణ్వతాం సతామ్ ॥ 37

టీ:- ఉపవిష్టమితి. వ్రతినామాసనం బ్రుసీ. తస్యా ముపవిష్టం. నారదాయ బ్రహ్మ ప్రవోచం తం బ్రువంతం. 37

వ్రతనిష్టలోగలవారు కూర్చొనే దర్భమయమైన ఆసనము పేరు 'బ్రుసీ' దానియందు కూర్చొని సనకాదులు, సజ్జనులు వింటూ ఉండగా వారి మధ్యలో అడిగిన నారదునకు సనాతనమైన బ్రహ్మతత్త్వమును విశేషముగా బోధించుచున్న (శివునిచూచిరి)...37

శ్లో॥ కృత్వోరౌ దక్షిణే సవ్యం పాదపద్మంచ జానుని ।
బాహుప్రక్షోష్ఠేఽక్షమాలా మాసీనం తర్కముద్రయా ॥ 38

టీ:- కృత్వేతి. సవ్యం పాదపద్మం దక్షిణే ఊరౌ. కృత్వావిన్యస్య. సర్వే జానుని చ. సవ్యం బాహుం కృత్వా. దక్షిణ బాహు ప్రకోష్ఠే మణి బంధస్థానే. అక్షమాలాం కృత్వా. దక్షిణహస్త కృతయా తర్కముద్రయా

కడితొడపైన ఎడమపాదపద్మమునుఉంచి ఎడమ మోకాలుపైన ఎడమచేతినుంచి కుడి మణికట్టుయందు రుద్రాక్షమాలను ధరించి కుడి దక్షిణహస్తముచే తర్కముద్రను ధరించిన (శివునిచూచిరి). వీరాసనము వేసుకొని కూర్చున్నాడని అర్థము. వీరాసన లక్షణములను తర్కముద్రను యోగశాస్త్రములో ఈ విధముగా తెలిపిరి. ఒక పాదమును మరొక తొడపైన యుంచి ఎడమ మోకాలుపైన చేయిని ఉంచడం

ఉపలక్షితమాసీనమిత్యర్థః. తదుక్తం యోగశాస్త్రే.శ్లో. "ఏకం పాదమథైకస్మిన్ విన్యసే దూరుసంస్థితమ్. ఇతరస్మింస్తదా బాహుం వీరాసనమిదంస్మృత" మితి. తథా తర్కముద్రా చోక్తా. శ్లో. "తర్జన్యంగుష్ఠ యోరగ్రే మిథస్సంయోజ్యచాంగుళీః, ప్రసార్యబోధనం ప్రాహుస్తర్క ముద్రేతి మాంత్రికా" ఇతి. 38

వీరాసనం. పెద్దనవేలు, చూపుడువేలు కలుపవలెను. మిగతావి జాపవలయును దీనినే తర్కముద్ర అందురు. 38

శ్లో॥ తం బ్రహ్మ నిర్వాణ సమాధిమాశ్రితం
వ్యపాశ్రితం గిరీశం యోగకక్ష్యామ్ ।
సలోకపాలా మునయో మునీనామాద్యం
మునిం ప్రాంజలయః ప్రణేముః ॥ 39

టీ:- తమితి. బ్రహ్మనిర్వాణం బ్రహ్మానందః. తత్ర సమాధిం ఐకాగ్ర్యం. ఆశ్రితం. యోగకక్ష్యాం యోగపట్టం చ. వామజాను దృఢీ కరణార్థం విశేషేణోపాశ్రితవంతం. మననశీలా మునయః తేషామాద్యం ముఖ్యం. 39

బ్రహ్మానందముయందు ఏకాగ్రతను ఆశ్రయించినట్టి ఎడమ కాలు దృఢముగా ఉండడం కొరకు యోగపట్టమును బిగించి (బాసి కట్టు) పట్టుకొని మననశీలులలో మొదటి మననశీలుడైన కైలాసపతిని లోకపాలసహితులైన మునులు చేతులు జోడించి నమస్కరించిరి. 39

శ్లో॥ స తూపలభ్యాగతమాత్మయోనిం
సురాసురేశైరభి వంధి తాంఘ్రిమ్ ।
ఉత్థాయ చక్రే శిరసాభివాదనం
మహత్తమః కస్య యథైవ విష్ణుః ॥ 40

దేవరాక్షస ప్రభువులచే నమస్కరింపబడే పాదపద్మములుగల పరమశివుడు, వచ్చిన బ్రహ్మదేవుడికి ఎదురేగివెళ్ళి శిరస్సు వంచి నమస్కరించెను. పూజ్యతముడైనప్పటికి వామనావతారమెత్తిన విష్ణు భగవానుడు కశ్యపుడికి నమస్కరించి నటుల... 40

టీ:- స ఇతి. అర్థాత్తమో విష్ణుః వామనమూర్తిః. యథా కస్య కాశ్యపస్య. (40)

శ్లో॥ తథాపరే సిద్ధగణా మహర్షిభి
ర్యే వై సమంతా దనునీలలోహితమ్ ।
నమస్కృతః ప్రాహ శశాంకశేఖరం
కృత ప్రణామం ప్రహసన్నివాత్మభూః ॥ 41

టీ:- తథేతి. మహర్షిభిస్సహితాః యే నీలలోహితమనువర్తంతే. తేఽపి తస్మై అభివాదనం వందనం చక్రుః. ఏవం సర్వైః నమస్కృతః ప్రాహ. కృతః ప్రణామో దేవైర్యస్మై తం. 41

నీలలోహితుడైనశివుడిని (కంఠం యందు నీలము, శరీరము యందు ఎరుపుగల) పరివేష్టించిన మహర్షులు సిద్ధపురుషులుగూడా బ్రహ్మదేవుడికి నమస్కరించిరి. ఈ విధంగా అందరిచేత నమస్కరింపబడ్డ బ్రహ్మదేవుడు శశాంకశేఖరుడైన శివుడిని చూచి నవ్వుతూ ఈ విధంగా పలికెను. 41

బ్రహ్మోవాచ

శ్లో॥ జనే త్వామీశ విశ్వస్య జగతో యోనిబీజయోః ।
శక్తేశ్శివస్య చ పరం యత్తద్బ్రహ్మ నిరంతరమ్ ॥ 42

టీ:- యద్యపి త్వం నీచవన్మాం నమస్కరోషి. తథాపి తదైశ్వర్యమహం వేద్మీత్యాహ-జానఇతి. విశ్వస్య ఈశం జానే తత్ర హేతుః జగతో యోనిర్యాశక్తిః ప్రకృతిః బీజంచ యశ్శివః పురుషః. తయోః పరం కారణం. తథాపి నిర్భేదం యద్బ్రహ్మ. నిర్వికారం చ తదేవ త్వమితి జానే. 42

బహ్మదేవుడు పలుకుచున్నాడు.

ఓ పరమేశ్వరా! నీవు చిన్నవాడివలె నాకు నమస్కరించుచున్నావు నీ ఐశ్వర్యమెట్టిదో నాకు తెలుసును. నీవు ఈ జగత్తునకు నియామకుడవు. ఈ జగత్తునకు ఉపాధాన నిమిత్త కారణభూతులైన ప్రకృతి పురుషులు శివ, శక్తులు. ఈ శివ, శక్తులకు కారణభూతుడవు నీవు. నిర్భేదము, నిర్వికారమైన బ్రహ్మావు నీవే. 42

శ్లో॥ త్వమేవ భగవన్నేతచ్ఛివశక్త్యోస్సరూపయోః ।
విశ్వం సృజసి పాస్యత్సిక్రీడన్నూర్ణ పదో యథా ॥ 43

టీ:- నను విరుద్ధమేతత్తత్రాహ-త్వమితి. త్వమేవ సరూపయోః అవిభక్తయోః. శివశక్త్యోః క్రీడన్విశ్వసృష్ట్యాది కరోషి. ఊర్ణనాభిరివ. స్వరూపయోరితి పాఠే-స్వాంసయోరతో న విరోధః. 43

జగన్నియామకత్వము, నిర్వికారనిర్దేశ బ్రహ్మత్వము పరస్పర విరుద్ధములుగదా యనగా నీవే అవిభక్తులైన శివ శక్తులయందు క్రీడించుచు సృష్ట్యాదులను చేయుచున్నావు. ఏ విధముగా సాలీడు తన గృహ సృష్టి స్థితి లయములకు కారణమో అట్లానే నీవే జగత్సృష్టి స్థితిలయములను చేయుచున్నావు. (కించిత్) బ్రహ్మనిర్వికారమైనప్పటికి సృష్టి చేయడం బ్రహ్మకు విరుద్ధంకాదు. 'లోకవత్తులీలాకైవల్యం' సర్వోపేతాచతద్దర్శనాత్ శ్రుతేస్తు శబ్దమూలత్వాత్ మొదలగు సూత్రముల యందు శ్రీఆదిశంకరులు విపులముగా చర్చించినారు. ఇక్కడ సమన్వయ వాక్యములను భగవత్పాదుల ప్రసన్న గంభీరమైన దివ్యవాగమృతమున దర్శిద్దాం. 'ప్రతిషిద్ధ సర్వ విశేష స్యాపి బ్రహ్మణః సర్వశక్తి యోగః సంభవతీత్యే తదప్యవిద్యా కల్పితరూప భేదదోపన్యా సేనోక్తమేవ క్రీడన్' అనుపదము లోకవత్తులీలాకైవల్యము ను సూత్రమును స్మరింపచేయుచున్నది. నీచేయం పరమార్థ విషయా సృష్టి శ్రుతిః, అవిద్యాకల్పిత నామరూప వ్యవహార గోచరత్వాత్, బ్రహ్మత్వభావ ప్రతిపాదన పరత్వాచ్చ ఇత్యపినైవ విస్మర్తవ్యమ్ ॥ 2-1-33 భాష్యం

ఈ వాక్యములన్ని సృష్టి పరమార్థమైనదని చెప్పడం కొరకు కాదు. అవిద్యాకల్పిత నామరూప వ్యవహారాలను నిర్దేశిస్తూ ముఖ్యంగా బ్రహ్మాత్మ భావ ప్రతిపాదనయందు పరమతాత్పర్యమని విస్మరించరాదు. (43)

శ్లో॥ త్వమేవ ధర్మార్థదుఘాభిపత్తయే
దక్షేణ సూత్రేణ ససర్జిథాధ్వరమ్ ।
త్వయైవ లోకేఽవసితాశ్చ సేతవో
యాన్బ్రాహ్మణాః శ్రద్దధతే ధృతవ్రతాః ॥ 44

టీ:- త్వమేవేతి. ధర్మమర్థం చ దోగ్ధి. యా త్రయీ తస్యా అభిపత్తయే రక్షణాయ. అధ్వరం సృష్టవానసి. యద్వా హే ధర్మార్థదుఘ ధర్మాద్య, అభిపత్తయే తత్ప్రాప్తయే. దక్షేణ సూత్రేణ నిమిత్తేన. సేతవో వర్ణాశ్రమాచారమర్యాదాశ్చ. అవసితాః నిబద్ధాః నిర్ణీతా ఇతి వా శ్రద్దధతే శ్రద్ధయా అనుతిష్ఠంతీతి. 44

ధర్మార్థములను అనుగ్రహించేది వేదము. ఆ వేదమును రక్షించుటకు యజ్ఞమును సృజించినావు. లేక ఓ ధర్మార్థములను ప్రసాదించువాడా! ధర్మాదులను పొందుటకు దక్షుడి నిమిత్తంగా వర్ణాశ్రమ ధర్మ మర్యాదలు నిర్ణీతములైనవి. ఆ నియమములనే వ్రతనిష్ఠలుగల బ్రాహ్మణులు శ్రద్ధగా అనుష్ఠించుచున్నారు. 44

శ్లో॥ త్వం కర్మణాం మంగళం మంగళానాం
కర్తుస్మ్స లోకం తనుషే స్వః పరం వా ।
అమంగళానాం చ తమిస్ర ముల్బణం
విపర్యయః కేన తదేవ కస్య చిత్ ॥ 45

టీ:- సర్వకర్మఫలదాతాపి త్వమేవేత్యాహ-త్వమితి. హే మంగళం మంగళానాం శుభానాం కర్మాణాం. కర్తుఃస్వః స్వర్గం పరం మోక్షం వా. తనుషే.తత్రఇహ.అమంగళానాం అశుభానాం కర్మణాం కర్తుశ్చ తమిస్రం నరకం తనుషే. తత్ర కేనాపి హేతునా తదేవ తస్మిన్నేవ. కస్య చిద్విపర్యయో భవతి. 45

ఓ మంగళస్వరూపా! సర్వకర్మఫలదాతవు నీవేగదా! మంగళప్రద కర్మలు చేసినవాడికి స్వర్గమును, మోక్షమును అనుగ్రహించుచున్నావు, పాపకర్మలను చేసినవారికి భయంకరమైన నరకమును కల్పించుచున్నావు. ఏ కారణముచేతనో శుభకర్మ చేసినప్పటవకి కొంతమందికి దుఃఖ ఫలితమును అశుభకర్మ చేసిన వాడికి శుభ ఫలితమును ఇచ్చుచున్నావు. 45

శ్లో॥ న వై సతాం త్వచ్చరణార్పితాత్మనాం
భూతేషు సర్వేష్వభిపశ్యతాం తవ ।
భూతాని చాత్మన్యపృథగ్దిదృక్షతాం
ప్రాయేణ రోషోఽభిభవేద్యథా పశుమ్ ॥ 46

సర్వభూతములయందు నిన్ను దర్శించు వారిని, నీ చరణముల యందు లగ్నముచేయబడిన మనస్సుగల సజ్జనులను, సర్వప్రాణులను తన యందు భేదరహితులై చూచువారిని, ఏ విధముగా అజ్ఞుడిని కోపము పరాభూతులను చేయునో, ఆ విధముగా పరాభూతులను చేయదు. 46

టీ:- కోపోఽత్ర హేతురిత్యసంభావితమిదమితి. కైముతి కన్యాయే నాహ – నేతి. సతాం సతః. రోషో నాభిభవేత్. తవ త్వాం ద్వితీయార్థే షష్ఠీ. పశుం అజ్ఞం యథాభిభవేత్. తద్వత్. 46

శ్లో॥ పృథగ్ధియఃకర్మదృశో దురాశయాఃపరోద
యేనార్పిత హృద్రుజోఽనిశమ్।
పరాన్ దురుక్తైర్వితుదంత్యరుంతుదా
స్తాన్మావధీద్దైవవధాన్భవద్విధః ॥ 47

ఎవరికైతే భేదబుద్ధి కలిగి కర్మలయందే దృష్టి ఉంటుందో, నిరంతరము ఇతరుల అభివృద్ధిని చూచి మానసికముగా పీడింపబడుతారో, ఎవరైతే మర్మభేదనము చేయుదురో, ఇతరులను చెడు మాటలచే వ్యధ కల్పించెదరో, అట్టివారు వారి ప్రారబ్ధకర్మ చేతనే వధింపబడుతారు. అట్టివారిని మీ వంటి నిరుపమానులు, సాధుజనులు వధింపరాదు. 47

టీ:- పృథగ్ధియ ఇతి. యతః యే పృథగ్ధియః భేదదృశః. అతః కర్మణ్యేవ దృష్టిర్యేషాం. దుష్టః ఆశయో యేషాం. పరేషాముదయేన సంపదా. అర్పితా హృదిరుగ్యేషాం అరుంతుదాః మర్మభేత్తారః. దైవేనవధో యేషాం తాన్. భవద్విధః నిరుపమః సాధుః. మావధీత్. న హన్యాత్. 47

శ్లో॥ యస్మిన్యదా పుష్కరనాభ మాయయా
దురంతయా స్పృష్టధియః పృథగ్ద్ృశః ।
కుర్వంతి తత్ర హ్యనుకంపయా కృపాం
న సాధవో దైవబలాత్కృతే క్రమమ్ ॥ 48

టీ:– ప్రత్యుత సాధూనాం.వృత్తమాలోక్య. అనుగ్రహమేవ కర్తుమర్హా సీత్యాహ–ద్వాభ్యాం. యస్మిన్నితి. యస్మిన్ దేశే యదాకాలే. స్పృష్టధియః మోహితచిత్తాః. పృథగ్దృశో భవంతి. తత్ర అపరాధే. సాధవో హ్యను కంపయా. అనంతరమేవ పరదుఃఖాసహిష్ణుతయా చిత్తప్రకంపేన. కృపాం కుర్వంతి న తు క్రమం పరాక్రమం. కుతః దైవబలాత్కృతే అనర్థే సతి. మమైవ దైవం ఏవంభూతం కోఽత్రాపరాధస్తేషామితి మత్వాహననం న కుర్వంతీత్యర్థః. 48

శ్లో॥ భవాంస్తు పుంసః పరమస్య మాయయా
దురంతయాఽస్పృష్టమతి స్సమస్తదృక్ ।
త్వయా హతాత్మ స్వనుకర్మ చేతస్స్వను
గ్రహం కర్తుమిహార్హసి ప్రభో ॥ 49

టీ:– భవానితి. భవాంస్తు అస్పృష్టమతిః. అతః సమస్త దృక్ సర్వజ్ఞః తయా మాయయా ఆహతః ఆత్మా యేషాం తేషు. అతఏవ కర్మానుగత చిత్తేషు. ఇహాపరాధే. అనుగ్రహం కర్తుమర్హసి. 49

అంతేకాదు సాధుజనుల నడవడికననుసరించి అనుగ్రహమును కురిపించాలి పరమేశ్వరా అని అనుచున్నాడు.(సాధుజనుల పరంపరా, దుష్టులను హాని జరిపిన వారిని కూడా ద్వేషబుద్ధి లేక అనుగ్రహిస్తారు.) ఏ ప్రదేశమునందు, ఏ కాలమునందు భగవంతుడి మాయచే మోహిత చిత్తులై భిన్న దృష్టి కలిగియుంటారో అట్టివారి యందు సాధుజనులు దయకలిగి యుంటారు. ప్రారబ్ధకర్మ ద్వారా వారు అపరాధులైనప్పటికి వారియందు పరాక్రమమును చూపెట్టకుండా ఈ విధముగా ఆలోచింతురు. ఈ విధముగా జరిగినదంటే (ఏదైనా అనర్థము కలిగినప్పుడు) నా ప్రారబ్ధకర్మ వలన ఇది జరిగినదేకాని వారి తప్పుకాదు. నా కర్మ ఇట్లా ఉంటే ఇంకొకరిపై అపరాధము వేయరాదని ఆలోచించి వారిని అనుగ్రహించదరే కాని ఆగ్రహించరు. 48

ఓ ప్రభూ! నీవు దాటడానికి శక్యముకాని పరమపురుషుడి మాయచేత తాకబడని బుద్ధి కలిగిఉన్నావు. కావుననే సర్వజ్ఞుడవు. ఆ మాయచేత ఆవరింపబడిన బుద్ధి కలవారి కర్మలయందే చిత్తము కలిగిన వారియందు వారు అపరాధము చేసినప్పటికి అనుగ్రహించవలె. 49

శ్లో॥ కుర్వధ్వరస్యోద్ధరణం హతస్య భో
త్వయాఽసమాప్తస్య మనోప్రజాపతేః ।
న యత్ర భాగం తవ భాగినో దదుః
కుయజ్వనో యేన మఘోని నీయతే ॥ 50

టీ:- ఏవంసామాన్యేనోక్త్వా ప్రస్తుతమహ-త్రిభిః. కుర్వితి త్వయా హతస్య. అతఏవ అసమాప్తస్య. ప్రజాపతేరధ్వరస్య. హేమనో యత్రాధ్వరే. కుయాజ్ఞికాః. భాగినోఽపి తవ భాగం న దదుః. భాగార్హత్వ మేవాహ - యేన త్వయేదం మఖో నినీయతే. ఫలం ప్రాప్స్యతే. (50-51)

ఈ విధముగా సామాన్యముగ పలకవలసినవి పలికి ఇప్పుడు చెప్పవలసినవి చెప్పుచున్నాడు. ఓ ఆదికారణ పరమేశ్వరా! నీచే ధ్వంసముచేయబడి సమాప్తి చెందని దక్షప్రజాపతి యజ్ఞమును ఉద్ధరించుము, మూర్ఖులైన యాజ్ఞీకు లు ఏ యజ్ఞమందు నీవు భాగియైనప్పటికి నీకు భాగము కల్పించలేదో ఆ యజ్ఞమును ఉద్ధరించుము. ఏ యజ్ఞమైనను నీచే ఫలమీయబడు -చున్నదే. 50

శ్లో॥ జీవతాద్యగమానోఽయం ప్రపద్యేతాక్షిణీ భగః ।
భృగోశ్మశ్రూణి రోహంతు పూష్ణోదంతాశ్చ పూర్వవత్ ॥ 51

ఈ యజమాని దక్షుడు జీవించుగాక, భగుడు కన్నులు పొందునుగాక, భృగుమహర్షికి గడ్డములు మీసములు మొలుచును గాక, పూషదేవతకు పూర్వమువలె దంతములు ఉండునుగాక...51

శ్లో॥ దేవానాం భగ్నగాత్రాణామృత్విజాం చాయుధాశ్మభిః ।
భవతానుగ్రహీతానామాశు మన్యోఽస్త్వనాతురమ్ ॥ 52

టీ:- దేవానామితి. హేమన్యో అనాతురం ఆరోగ్యమస్తు. 52

ఓ రుద్రా ఆయుధములచే, రాళ్ళచే దేవతల, ఋత్విక్కుల శరీర భాగములు విరగకొట్టబడినవి. నీ అనుగ్రహముచే వారికి వెంటనే మళ్ళీ ఆరోగ్యము కలుగుగాక ! 52

శ్లో॥ ఏష తేరుద్రభాగోఽస్తు యదుచ్ఛిష్టోఽధ్వరస్య వై ।
యజ్ఞస్తే రుద్రభాగేన కల్ప్యతామద్య యజ్ఞహన్ ॥ 53

టీ:- భాగశ్చ తవాస్త్విత్యాహ-ఏష ఇతి. హే రుద్ర యావదిత్యర్థే యదిత్య వ్యయం. యజ్ఞే కృతే. యావానుచ్ఛిష్టః అవశిష్టోఽర్థః. తావానేషః. తవ భాగోఽస్తు. హే రుద్ర తేన భాగేన. అద్య యజ్ఞః. కల్ప్యతాం సంపద్యతాం. 53

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,
షష్ఠోఽ ధ్యాయః

ఓ రుద్రా! ఈ యజ్ఞమున ఏమి ఎంత మిగిలినదో అది నీ భాగము అగుగాకా! ఓ పరమేశ్వరా! యజ్ఞ ధ్వంసకా! నీ భాగముచేతనే ఈ యజ్ఞము పరిపూర్తిచేయుము. 53

శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు
ఆరవ అధ్యాయము సమాప్తము.

## సప్తమోఽధ్యాయః

శ్లో॥ సప్తమే విష్ణురుద్భూతః స్తుతో దక్షభవాదిభిః ।
యజ్ఞం ప్రవర్తయామాస దక్షేణేతి నిరూప్యతే ॥

## 7వ అధ్యాయము

ఈ ఏడవ అధ్యాయమున విష్ణు భగవానుడు ప్రాదుర్భూతుడు కాగా దక్షుడు, భవుడు మొదలగువారు స్తుతించుట. దక్షుడు యజ్ఞమును చేయుట నిరూపింపబడును.

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ ఇత్యజేనానునీతేన భవేన పరితుష్యతా ।
అభ్యధాయి మహాబాహో ప్రసహ్య శ్రూయతామితి ॥ 1

టీ:- శ్లో. సప్తమే విష్ణురుద్భూతః స్తుతో దక్షభవాదిభిః, యజ్ఞం ప్రవర్తయామాస దక్షేణేతి నిరూప్యతే. ఇతీతి. అజేన యోఽనునీతః ప్రార్థితోఽభవత్ తేన. అభిహితం. హే మహాబాహో విదుర. 1

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

ఓ మహాబాహుడవైన విదురా! బ్రహ్మదేవునిచే ప్రార్థితుడైన శివుడు సంతోషించి నవ్వుతు వినుడు అని ఈ విధముగా పలికెను. 1

**భవ ఉవాచ**

శ్లో॥ నాఘం ప్రజేశ బాలానాం వర్ణయే నానుచింతయే ।
దేవమాయాభి భూతానాం దండస్తత్ర ధృతోమయా ॥ 2

టీ:- నేతి. అఘమపరాధం. 2

**శ్రీమహాదేవుడు ఈ విధముగా పలికెను.**

ఓ బ్రహ్మా! ఈశ్వర మాయచే కప్పబడిన అవివేకుల అపరాధమును నేను వర్ణించను, చింతించను. కాని అపరాధ విషయమున శిక్ష మాత్రము నాచేత వేయబడినది. 2

శ్లో॥ ప్రజాపతేర్దగ్ధశీర్ష్ణో భవత్వజముఖం శిరః ।
మిత్రస్య చక్షుషేక్షేత భాగం స్వం బర్హిషో భగః ॥ 3

టీ:- స్వాపరాధమపహ్నుత్యానుగృహ్ణాతి-ప్రజాపతేరితి. దగ్ధం శీర్షం యస్య తస్య ప్రజాపతేర్దక్షస్య. అజస్య ముఖం యస్మిన్ తత్తథాభూతం శిరోఽస్తు బర్హిషస్సంబంధినం స్వం భాగం. మిత్రనామ్నో దేవస్య. 3

వారువారు చేసిన అపరాధమును తొలగించి వారినను గ్రహించుచున్నాడు. యజ్ఞముయందు కాలిన ముఖము గల దక్ష ప్రజాపతికి మేక ముఖము కలుగుగాక! భగుడను వాడు యజ్ఞము యందు తన భాగమును మిత్రుడను పేరుగల దేవుడి నేత్రముచేత చూచును గాక! 3

శ్లో॥ పూషా తు యజమానస్య దద్భిర్జక్షతు పిష్టభుక్ ।
దేవాః ప్రక్లృప్తసర్వాంగా యే మ ఉచ్ఛేషణం దదుః ॥ 4

టీ:- పూషేతి. ప్రకర్షేణ క్లృప్తాని. సర్వాణ్యంగాని. యేషాం తే భవంతు. ఉచ్ఛేషణం యజ్ఞవశిష్టం. 4

పూషాదేవత యజమాని దంతములచే మెత్తటి పిండిని భక్షించు గాక. ఏ దేవతలైతే యజ్ఞమైన పిమ్మట మిగిలిన భాగమును నాకు సమర్పించినారో వారి సర్వాంగములు విశేషముగా పూర్వము వలెనే ఉండును గాక. 4

శ్లో॥ బాహుభ్యామశ్వినోః పూష్ణోహస్తాభ్యాం కృతబాహవః ।
భవంత్వధ్వర్యవశ్చాన్యేబస్తశ్మశ్రుర్భృగుర్భవేత్ ॥ 5

టీ:- బాహుభ్యామితి. యేషాం తు అంగాని వినష్టాని. తేతు అశ్వినోర్బాహుభ్యాం. కృతబాహవః. పూష్ణో హస్తాభ్యాం. కృతహస్తాశ్చ భవంతు. అధ్వర్యవః అన్యేచ ఋతిజ్వః. బస్తస్య శ్మశ్రూణి యస్య. 5

అధ్వర్యులకు గాని, ఇతర ఋత్విక్కులకు గాని ఏ అంగములు నష్టములు జరిగినవో - వారు అశ్వినుల బాహువులచే చేయబడిన బాహువులు గలిగి, పూషాదేవత హస్తములచే చేయబడిన హస్తములు గలవారగుదురు గాక. భృగువు మేకపోతు గడ్డం, మీసములే, గడ్డంమీసం గలవాడగుగాక ! 5

మైత్రేయ ఉవాచ

శ్లో॥ తదా సర్వాణి భూతాని శ్రుత్వా మీఢుష్టమోదితమ్ ।
పరితుష్టాత్మభిస్తంతు సాధుసాధ్విత్యథాబ్రువన్ ॥ 6

టీ:- తదేతి. మీఢుష్టమశ్శివః. తేనోక్తం పరితుష్టచిత్తైః. 6

శ్లో॥ తతో మీఢ్వాంసమామంత్ర్య శునాసీరాస్సహర్షిభిః ।
భయాస్తద్దేవయజనం సమీఢ్వద్వేధసో యయుః ॥ 7

టీ:- తత ఇతి. మీఢ్వాంసం శివం. త్వయా ఆగత్య సర్వం కార్యమితి. ఆమంత్ర్య సంప్రార్థ్య. శునాసీరా దేవాః. సహమీఢుషా వేధసా చ వర్తమానాః సమీఢ్వద్వేధసః. 7

శ్లో॥ విధాయ కార్త్స్న్యేన చ తద్యథాహ భగవాన్భవః ।
సందధుః కస్య కాయేన సవనీయ పశోశ్శిరః ॥ 8

టీ:- విధాయేతి. కార్త్స్న్యేన వక్త్ర హస్త బాహ్వాదినా. సాధారణ్యం విధాయ. (8-9)

మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

వత్సా! శివుడు చెప్పిన మాటలు విని సర్వప్రాణులు (హృదయమున) సంతోషించి పిమ్మట బాగుబాగని పలికిరి. 6

అటుపిమ్మట మహర్షులతో గూడిన దేవతలు వరముల వర్షించే శివుని నీవే వచ్చి సర్వమును చేయవలెనని ప్రార్థించి శివుడు బ్రహ్మతోడుగా గలవారై తిరిగి యజ్ఞశాలలకు వెళ్ళిరి. 7

వారచట శివుడు ఏ విధముగా చెప్పినాడో ఆ విధముగా ముఖ, హస్త, బాహ్వాదులను ఎప్పటి మాదిరిగా చేసి యజ్ఞ పశువైన మేక శిరస్సును ప్రజాపతి శరీరమున కతికించిరి. 8

శ్లో॥ సంధీయమానే శిరసి దక్షో రుద్రాభివీక్షితః ।
సద్యస్సుప్త ఇవో త్తస్థౌ దదృశే చాగ్రతో మృడమ్ ॥ 9

శిరస్సును అతికించగనే రుద్రుడిచేత చూడబడిన దక్షుడు నిద్రనుంచి లేచినవాడివలె ఎదురుగా సుఖకరుడైన శివుడిని చూచెను. 9

శ్లో॥ తదా వృషధ్వజ ద్వేషకలిలాత్మా ప్రజాపతిః ।
శివావలోకాదభవచ్ఛరద్ధ్రద ఇవామలః ॥ 10

పూర్వము, వృషధ్వజుడైన శివుడియందు ద్వేషముచేత కలుషితమైన దక్షుని మనస్సు, శివుని చూపు వలన శరత్కాలపు సరోవరము వలె స్వచ్ఛమాగా మారినది. 10

శ్లో॥ భవాస్తవాయ కృతధీర్నాశక్నోదనురాగతః ।
ఔత్కంఠ్యాద్బాష్ప కలయా సంపరేతాం సుతాం స్మరన్ ॥ 11

శివుడిని స్తుతించాలని బుద్ధి కలిగి గూడా శరీరమును విడిచిన కుమార్తె స్మరణకు వచ్చి, అనురాగము వలన, ఆందోళన వలన కన్నీటి ధారణచే సమర్థుడు కాలేకపోయెను. 11

శ్లో॥ కృచ్ఛ్రాత్సంస్తభ్య చ మనః ప్రేమవిహ్వలితస్సుధీః ।
శశంస నిర్వ్యలీకేన భావేనేశం ప్రజాపతిః ॥ 12

విద్వాంసుడు ప్రేమచే విచలితుడైన దక్షప్రజాపతి (మనస్సును) అతి కష్టముతో నిలదొక్కుకొని కపటము లేని భావముతో ఈశ్వరుడిని స్తుతించెను. 12

టీ:- తదేతి. పూర్వం వృషధ్వజ ద్వేషేణ కలిలః కలుషీకృతః ఆత్మా యస్య సః. తదా శరత్కాలీనో హ్రద ఇవ అమరోఽభవత్. (10-12)

**దక్ష ఉవాచ**

శ్లో॥ భూయాననుగ్రహ అహో భవతా కృతో మే
దండ స్త్వయా మయిభృతో యదపి ప్రలబ్ధః ।
న బ్రహ్మబంధుషు చ వాం భగవన్నవజ్ఞా
తుభ్యం హరేశ్చ కుత ఏవ ధృతవ్రతేషు ॥ 13

టీ:- భూయాదితి. యదపి యద్యపి విప్రలబ్ధః పరాభూతో మయా భవాన్ తథాపి త్వయా దండో భృతః ధృతః. శిక్షాకృతా. న తూపేక్షితోஉస్మి. యుక్తమే వై తదిత్యాహ - నేతి. బ్రహ్మబంధుషు చ బ్రాహ్మణాభాసేష్వపి. తుభ్యం తవ హరేశ్చేతి. వాంయువయోః. అవజ్ఞా ఉపేక్షా నాస్తి. 13

**దక్షుడు ఈ విధముగా పలికెను.**

ఆహా! నేను నిన్ను నిందించుటచే నన్ను శిక్షించినావు. కానీ నన్ను నిరాదరణ చేయలేదు. ఇదియే నీకు నాయందుగల గొప్ప అనుగ్రహము. ఇది మీకు యుక్తమే. ఎందుకనగా బ్రాహ్మణ ధర్మములను పాటించక నటించే బ్రాహ్మణులయందే శ్రీహరికి నిరాదరణ లేదు. వ్రతనిష్ఠగల వారియందు ఏలుండును? నిరాదరణ లేకపోవడానికి కారణమును చెప్పుచున్నాడు. 13

శ్లో॥ విద్యా తపోవ్రత భృతో ముఖతస్తు విప్రా
న్బ్రహ్మాత్మతత్త్వమవితుం ప్రథమం త్వమస్రాక్ ।
తద్బ్రాహ్మణాన్ పరమసర్వవిపత్సు పాసి
పాలః పశూనివ విభో ప్రగృహీతదండః ॥ 14

టీ:- తత్రహేతుమాహ-విద్యేతి. బ్రహ్మీభూత్వా త్వం అస్రాక్ అస్రాక్షీః కిమర్థం? ఆత్మతత్త్వమవితుం యద్వా బ్రహ్మవేదం ఆత్మతత్త్వం చ. అవితుం సంప్రదాయ ప్రవర్తనేన జ్ఞాపయితుమిత్యర్థః. తత్తస్మాత్. హే పరమ ఉత్కృష్ట. 14

ఓ పరమేశ్వరా! నీవు బ్రహ్మదేవుడవై ఆత్మతత్త్వమును రక్షించడానికి సృష్టి ఆదియందు, జ్ఞానము, తపస్సు, కర్మకాండకు చెందిన వ్రతములను ధరించు బ్రాహ్మణులను ముఖమునుండి సృష్టించితివి. లేదా వేదమును, ఆత్మతత్త్వమును రక్షించడానికి అనగా సాంప్రదాయముల ప్రవర్తనచే జ్ఞాపనము చేయడానికి అనికూడా అర్థము చెప్పుకొనవచ్చును. వేదములు, ఆత్మతత్త్వము లోకమున ప్రవర్తించాలను కోరిక గలవాడవై స్వయముగా నీవే సృష్టించినావు కనుక దండధరుడైన పశుపాలకుడు పశువులను రక్షించునట్టుగా నీవు బ్రాహ్మణులను సర్వ ఆపదలయందు కాపాడుచున్నావు. 14

శ్లో॥ యోఽసౌ మయాఽవిదిత తత్త్వదృశాసభాయాం
క్షిప్తో దురుక్తి విశిఖైరగణయ్య తన్మామ్ ।
అర్వాక్పతంతమర్హత్తమ నిందయా పార్ధ్వ
ష్ట్యార్ద్రయా స భగవాన్ స్వకృతేన తుష్యేత్ ॥ 15

టీ:- అత్ర చ ప్రత్యుపకారో నాస్తీత్యాహ-య ఇతి. అవిదితతత్త్వదృశా అప్రాప్త తత్త్వజ్ఞానేన. తత్ విగణయ్య విస్మృత్య. అర్హత్తమస్య నిందయా అర్వాగధః పతంతం మాంఅపాత్ రక్షితవాన్. స్వకృతేనైవ పరానుగ్రహేణైవ తుష్యేత్ న మయా. తత్ప్రతికర్తుం శక్యమిత్యర్థః. 15

మైత్రేయ ఉవాచ

శ్లో॥ క్షమాప్యైవం సమీఢ్వాంసం బ్రహ్మణా చానుమంత్రితః ।
కర్మానువర్తయామాస సోపాధ్యాయర్త్విగాదిభిః ॥ 16

టీ:- క్షమాప్యేతి. అనుమంత్రితః అనుజ్ఞాతః. ఉపాధ్యాసహితైః ఋత్విగాదిభిః. కర్మ అనువర్తయామాస. 16

శ్లో॥ వైష్ణవం యజ్ఞసంతత్యై త్రికపాలం ద్విజోత్తమాః ।
పురోడాశం నిరవపస్వీర సంసర్గ శుద్ధయే ॥ 17

ఇచ్చట ప్రత్యుపకారము లేనేలేదని చెప్పుచున్నాడు. నేను యథార్థ జ్ఞానశూన్యుడనై సభయందు నిందావచనములనే బాణములచే కొట్టితిని. అయినప్పటికి వాటిని మరచి, మిక్కిలి పూజనీయుడైన పరమశివ నిందచేత నరకమున పడబోవుచున్న నన్ను దయార్ద్ర దృష్టులచే రక్షించిన భగవానుడైన శివుడు తనచేత చేయబడిన ఇతరుల ననుగ్రహించుటచేతనే సంతోషించుగాక! ఆయనకు ప్రత్యుపకృతి చేయ నేను శక్తుడకానని అర్థము. 15

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

ఆ దక్షుడు భక్తులకు వరాలను వర్షించే శివుడికి క్షమాపణ చెప్పి బ్రహ్మదేవుడిచే అనుజ్ఞను పొంది, ఉపాధ్యాయ సహితులైన ఋత్విక్కులు మరియు అగ్నులతోగూడి యజ్ఞకర్మను చక్కగా నిర్వర్తించెను. 16

యజ్ఞభూమిలో ప్రమథగణములు ప్రవేశించుట ద్వారా కలిగిన దోషము తొలగడానికి, యజ్ఞము సుసంపన్నము కావడానికి

టీ:- వైష్ణవమితి. వీరాణాం ప్రమథాదీనాం. సంసర్గ కృతదోషస్య. శుద్ధయే నివృత్త్యర్థం. 17

బ్రాహ్మణులు మూడు కపాలములయందు సంస్కరింపబడిన విష్ణు దేవతా కమైన పురోడాశమునుసంజ్ఞ కలిగిన హావిర్విశేషమును హోమము చేసిరి. 17

శ్లో॥ అధ్వర్యుణాత్త హవిషా యజమానో విశాంపతే ।
ధియా విశుద్ధయా దధ్యౌ తదా ప్రాదురభూద్ధరిః ॥ 18

టీ:- అధ్వర్యుణేతి. ఉపాత్తహవిషా అధ్వర్యుణా సహ. విశుద్ధయా బుద్ధ్యా దధ్యౌ. హే విశాంపతే విదుర. 18

ఓ విదురా! యజమానియైన దక్షుడు హవిస్సును చేతిలో తీసుకొని, అధ్వర్యు సహితుడై, విశుద్ధమైన అంతఃకరణములతో శ్రీహరిని ధ్యానించెను. అదేరూపమున శ్రీహరి ప్రాదుర్భవించెను. 18

శ్లో॥ తదా స్వప్రభయా తేషాం ద్యోతయంత్యా దిశో దశ ।
ముష్ణన్ తేజ ఉపానీతస్తార్క్ష్యేణ స్తోత్ర వాజినా ॥ 19

టీ:- తదేతి. స్వయా ప్రభయా తేషాం తేజో ముష్ణన్. తిరస్కుర్వన్. ఉపానీతః సమీపం ప్రాపితః. స్తోత్రే బృహద్రథంతరే ఏవ వాజౌ పక్షౌ తద్వాతా. "బృహద్రథంతరే పక్షావి"తి. శ్రుతేః. 19

అప్పుడు పది దిక్కులయందు తన కాంతిని వెదజల్లుతు అక్కడ గలవారి తేజస్సును తిరస్కరింపచేస్తూ, బృహద్రథంతరమనే సామ భాగములే రెక్కలుగా గలిగిన గరుడిచే సమీపమునకు తీసుకురాబడి నాడు. "బృహద్రథంతరేపక్షౌ" (సం.4-1-10-42 పనస). 19

ఓం న మో భ గ వ తే వా సు దే వా య ఓం న మో భ గ వ తే వా సు దే వా య

శ్లో॥ శ్యామో హిరణ్య రశనోఽర్క కిరీటజుష్టో
నీలాలక భ్రమరమండిత కుండలాస్యః ।
కంబ్వబ్జచక్ర శరచాపగదాసి చర్మ
వ్యగ్రైర్హి రణ్మయ భుజైరివ కర్ణికారః ॥ 20

టీ:- తమేవానువర్ణయతి ద్వాభ్యాం-శ్యామ ఇతి. హిరణ్యవద్రశనా యస్యేతి. వస్త్రంలక్ష్యతే. అర్కతుల్యేన కిరీటేన జుష్టః. నీలాలకా ఏవ భ్రమరాః తైర్మండితం. కుండల యుక్తమాస్యం యస్య. కంబ్వాది భిరాయుధైః. భృత్య రక్షార్థం వ్యగ్రైః హిరణ్మయైర్భుజైః పుష్పితఃకర్ణికార ఇవ శోభమానః భుజానాం హిరణ్మయత్వం. హిరణ్యకృతేయూర కంకణముద్రికాద్యలంకారైః. 20

శ్లో॥ వక్షస్యధిశ్రితవధూర్వనమాల్యుదార
హాసావలోక కలయా రమయంశ్చ విశ్వమ్ ।
పార్శ్వభ్రమద్వ్యజన చామర రాజహంస
శ్శుభ్రాతపత్ర శశినోపరి రజ్యమానః ॥ 21

టీ:- వక్షసీతి. వక్షసి అధిశ్రితా. వధూర్లక్ష్మీర్యస్య. ఉదారో యో హాసః అవలోకశ్చ. తయోః కళయా లేశేన పార్శ్వే ఉభయతః. భ్రమంతీ వ్యజన చామరే ఏవ రాజహంసౌ యస్మిన్. సహ రజ్యమానః శోభాతి శయం నీయమానః. 21

ఆ భగవంతుడినే వర్ణించుచున్నాడు. నల్లనివాడును, బంగారు వస్త్రమును ధరించినవాడును, సూర్యుని కాంతితో సమానమైన కాంతిగల కిరీటముతో ప్రకాశించుచున్నవాడును, వెంట్రుకలనే తుమ్మెదలచే అలంకరింప బడిన కుండలముచే కూడిన ముఖము గలవాడు, శంఖము, పద్మము, చక్రము, బాణములు, ధనుస్సు, గదా, ఖడ్గము, చర్మమనే ఆయుధము లచే భృత్యుల రక్షార్థం తొందర పడుచున్న కేయూర, కంకణ ముద్రికాది అలంకారములచేత బంగారు భుజములు గలిగి పూచిన కొండగోగు వృక్షమువలె భాసించు చున్నవాడు..20

వక్షఃస్థలమందు లక్ష్మీదేవి గలవాడు, వనమాలధరించినవాడు, ప్రేమాత్మకమైన చిరునవ్వు, ప్రేమను ఒలికే చూపు యొక్క లేశమాత్రము చేత ఈ విశ్వమును రమింపచేయుచూ, రెండు ప్రక్కలకు కదలాడుచున్న వ్యజన చామరములే రాజహంసలుగా గలవాడు, తెల్లని ఛత్రమనే చంద్రుడు పైన గలిగి, విశేష శోభను కలిగించుచున్న వాడును..21

ఓం న మో భ గ వ తే వా సు దే వా య ఓం న మో భ గ వ తే వా సు దే వా య

శ్లో॥ తముపాగతమాలక్ష్య సర్వే సురగణాదయః ।
ప్రణేముస్సహసోత్థాయ బ్రహ్మేంద్రత్ర్యక్షనాయకాః ॥ 22

టీ:- తమితి. బ్రహ్మేంద్రత్ర్యక్షాః నాయకాః ముఖ్యా యేషాంతే. 22

దగ్గరకు వచ్చిన శ్రీహరిని చూచి బ్రహ్మ, ఇంద్రుడు, ముక్కంటి ముఖ్య నాయకులుగాగల సర్వదేవతా గణములు దిగ్గున లేచి నమస్కరించిరి. 22

శ్లో॥ తత్తేజసా హతరుచస్సన్న జిహ్వాస్ససాధ్వసాః ।
మూర్ధ్నా ధృతాంజలిపుటా ఉపతస్థురధో క్షజమ్ ॥ 23

టీ:- తదితి. హతరుచః తిరస్కృతప్రభాః. సన్నజిహ్వాః గద్గదవాచః . ససాధ్వసాః తన్మహిమ్నా క్షుభితచిత్తాః. ఉపతస్థుః తుష్టువుః. 23

శ్రీహరి తేజస్సుచేత తిరస్కరింపబడిన తేజస్సుగల దేవతలు, ఆయన మహిమచే విచలిత చిత్తులై తలలయందు చేతులు జోడించి గద్గద స్వరముతో అధోక్షజుడిని స్తుతించిరి. 23

శ్లో॥ అప్యర్వాగ్వృత్తయో యస్య మహిత్వాత్మ భువాదయః ।
యథామతి గృణంతి స్మకృతానుగ్రహ విగ్రహమ్ ॥ 24

టీ:- అపీతి. యస్య మహి మహిమాసం ప్రతి తు. అర్వాగేన వృత్తిరేష్యాం తేఽపి. యథామతి గృణంతి స్మ అస్తువన్. కృతః ప్రకటీకృతః. అనుగ్రహార్థం నిగ్రహోయేన తం. యద్వా. తేషామర్వాగ్వృత్తిత్వే హేతుః. తేతుయస్యమహి మహిమా. విభూతిమాత్ర రూపా ఇత్యర్థః. 24

ఎవని మహిమను బ్రహ్మాది దేవతల చిత్త వృత్తులు చేరుకోలేవో అట్టి అనుగ్రహించడానికి ప్రకటించిన రూపముగల పరమాత్మను వారి బుద్ధి, శక్తిని అనుసరించి స్తుతించిరి. లేదా వారి వాక్ మనోవృత్తులు అందుకోలేక పోవడానికి కారణం - ఏ దేవతలు గలరో వారంతా పరమాత్మువి విభూతులు మాత్రమే (అనగా పరమాత్ముడి చిన్నచిన్న మహిమలు మాత్రమే). 24

శ్లో॥ దక్షో గృహీత్వార్హణసాధనోత్తమం
యజ్ఞేశ్వరం విశ్వసృజాం పరంగురుమ్ ।
సునందనందాద్యనుగైర్వృతం ముదా
గృణన్ప్రపేదే ప్రయతః కృతాంజలిః ॥ 25

టీ:- తత్ర తావద్దక్షస్తుతి ప్రకారమాహ-దక్ష ఇతి. గృహీతం అర్హణ సాధనోత్తమం యేన తం ఉత్తమే పాత్రే. ఆగతే ఆసాద్య అర్హణేషు సమర్పితేషు ప్రీత్యా సార్హణం పాత్రమేవ యేన గృహీతమిత్యర్థః. యద్వా. కథం ప్రపేదే. గృహీతం అర్హణసాధనోత్తమం యథా భవతి తథా. తద్గృహీత్వా ప్రపేద ఇత్యర్థః. గృహీతేతి పాఠస్తు సుగమః. గృణన్ స్తువన్. ప్రపేదే శరణం జగామ. 25

యజ్ఞేశ్వరుడు, ప్రజాపతులకు పరమ గురువైనట్టియును, సునందనుడు, నందుడు మొదలగు అనుచరులచే పరివేష్టితుడును అయిన పరమాత్మను; ఒక పాత్రయందు యోగ్యమైన పూజాసామగ్రి నంతను స్వయముగా ఉంచుకొని లేదా పూజకు అవసరమైన, యోగ్యమైన పూజాసామగ్రి గల ఒక పాత్రను తీసికొని ఏకాగ్రత కలిగిన చిత్తముతో చేతులు జోడించి సంతోషముతో స్తుతిస్తూ దక్షుడు శరణు జొచ్చెను. 1. దక్షుడు, 2. ఋత్విక్కులు,3. సదస్యులు, 4. రుద్రుడు, 5. భృగువు, 6. బ్రహ్మ, 7. ఇంద్రుడు, 8. స్త్రీలు, 9. ఋషులు, 10. సిద్ధులు, 11. యజమాని దక్షపత్ని, 12. లోకపాలకులు, 13. యోగులు 14. వేదపురుషుడు, 15. అగ్ని, 16. దేవతలు, 17. గంధర్వులు, 18. విద్యాధరులు, 19. బ్రాహ్మణులు వారివారి సంకల్పితమైన వాక్యముల ద్వారా పందొమ్మిది మంది పందొమ్మిది వేరువేరు ఛందస్సులలో భగవంతుడిని స్తుతించిరి. 25

దక్ష ఉవాచ

శ్లో॥ శుద్ధం స్వధామ్న్యుపరతాఖిలబుద్ధ్యవస్థం
చిన్మాత్రమేకమభయం ప్రతిషిధ్యమాయామ్ ।
తిష్ఠం స్తయైవ పురుషత్వముపేత్య తస్యా
మాస్తే భవాన పరిశుద్ధ ఇవాత్మతంత్రః ॥ 26

దక్షుడు ఈ విధముగా పలికెను.

మరి సాక్షాత్తు పరమేశ్వరుడే రుద్రుడు. అట్టి పరమాత్మకు బ్రహ్మ పుత్రుడిగా పుట్టడం, జీవభావమును పొందడం కేవలము నటన మాత్రమే. అయ్యో! మరి నీవు భేదదృష్టిచేత అతడిని ఎందుకు అవమానపరిచావని నన్ను భగవంతుడు ఆక్షేపిస్తాడేమో అని ఆశంకించి

టీ:- శ్లో. దక్ష ఋత్విక్సదస్యేశ భృగు బ్రహ్మేంద్రయోషితః, ఋషయశ్చ తథా సిద్ధాః యజమానీ చ లోకపాః. యోగిబ్రహ్మాగ్ని దేవాశ్చ స్తువంతి జగదీశ్వరమ్. తథా గంధర్వవిద్యాధ్ర బ్రాహ్మణాశ్చ పృథఙ్మతైః శ్రీధరీయ శ్లోకావేతౌ నను సాక్షాత్పరమేశ్వర ఏవ శ్రీరుద్రః తస్య తు బ్రహ్మపుత్ర త్వేన జీవత్వమను కరణమాత్రం. అతః కిమితి త్వయా భేదదృష్ట్యా సోపజ్ఞాన ఇతి. మాం భగవనాక్షేప్స్యతీత్యాశంక్య. అప్రచ్యుతస్వరూపస్య. జీవధర్మనాట్యం. తవైవ సంగచ్ఛతే. నాన్యస్యేత్యాహ-శుద్ధమితి. స్వధామ్ని స్వస్వరూపే. తిష్ఠన్ భవాన్. శద్ధం చిన్మాత్రం చైతన్యఘనః శుద్ధత్వే హేతుః. ఉపరతా నిత్యనివృత్తాః. అఖిలాః బుద్ధ్యవస్థాః యస్మాత్. అతః ఏకం భేదశూన్యం. అత ఏవ అభయం "ద్వితీయాద్వై భయం భవతీ'' తి శ్రుతేః. జీవ స్యాపి వస్తుత ఏవం భూతత్వాత్. తద్వైలక్షణ్యార్థముక్తమ్. మాయాం ప్రతిషిధ్య అభిభూయ. స్వతంత్ర ఏవసన్. తయా మాయయా. పురుషత్వం మనుష్యనాట్యముపేత్య. తస్యాం మాయాయాం తిష్ఠన్. అపరిశుద్ధ ఇవ రాగాదిమానివ. ఆస్తే రామకృష్ణాద్యవతారేషు తథా ప్రతీయతే. భవానిత్యర్థః. అన్యేతు అవిద్యోపాధయః. మాయాభిభూతాస్సంసరంతి అతస్త్వమేవేశ్వరః. న రుద్రాదయ ఇతి భావః. అత ఏవేమాం భేదదృష్టిం. భగవాన్వార యిష్యతి. శ్లో. "అహం బ్రహ్మా చేశ్వరశ్చ జగతః కారణం పరమి" త్యాదినా. 26

నాశరహితమైన స్వరూపము జీవధర్మము పొందినట్టుగా నటించడం నీకు మాత్రమే చెల్లుతుంది. ఇంకొకరికి సాధ్యంకాదు అని అంటున్నాడు దేవా! నీ స్వరూపమందే నిలిచియున్నవాడవైన నీవు శుద్ధమైన చైతన్య ఘనుడవు. శుద్ధుడు అనడానికి కారణం సంగద్వేషాదులు, జాగ్రదాద్యవస్థలు, బంధ్ధ్యవస్థలు ఇవ్వన్ని గూడా ఎల్లప్పుడు నీయందు తొలిగిపోయే ఉండును. (అనగా ఉండవు) కావున ఆ తత్త్వము భేద శూన్యమైనది. అభయము లేనిది రెండవదుంటే భయం. "ద్వితయాద్వైవభయంభవతి" యథార్థ రూపమున జీవునకు గూడా ఇవ్వన్నీ గలవు. అని జీవ విలక్షణత్వమును, ఈశ్వరునకు ప్రతిపాదించుటకు చెప్పుచున్నాడు. మాయను నిషేధించి స్వతంత్రు డవైనప్పటికి ఆ మాయను నిమిత్తముగా చేసుకొని మనుష్య వేషము వేసుకొని ఆ మాయ యందే ఉంటూ రాగాది ద్వేషములు గలవాడిగా నటిస్తుంటావు. రామకృష్ణాది అవతారములయందు సీతావియోగ దుః ఖాదులు పొందినట్టు కనబడు చున్నావు నీవు. "నీవు మాయోపాధి కలిగినవాడవై కనబడగా" ఇతరులు అవిద్యోపాధిగా గలవారై మాయచే కప్పబడినవారై సంసారమున మునుగుచున్నారు. అందుకొరకు నీవే ఈశ్వరుడవు రుద్రాదులు కారు. అని దక్షాభిప్రాయము. అందుకొరకే, "నేను, బ్రహ్మ, రుద్రుడు ముగ్గురము ఈ జగత్తునకు కారణము" అని ఈ భేదదృష్టిని భగవంతుడు నివారించగలడు (ముందు). 26

**ఋత్విజ ఊచు**

శ్లో॥ తత్త్వం న తే వయమనంజన రుద్ర శాపా
త్కర్మణ్యవగ్రహాధియో భగవన్విదామః ।
ధర్మోపలక్షణమిదం త్రివృదధ్వరాఖ్యం
జ్ఞానం యదర్థమధి దైవమదో వ్యవస్థాః ॥ 27

టీ:– ఋత్విజోఽపి స్వాపరాధం పరిహరంతః స్తువంతి–తత్త్వమితి. భో అనంజన ఉపాధిమలశూన్య. యద్యపి త్వమేవ రుద్రాది దేవతారూపః తథాపి నందీశ్వర శాపాత్. కర్మణ్యేవ దురాగ్రహధియస్సంతః తవ తత్త్వం న విద్మః. కింతుధర్మస్య అపూర్వస్య. ఉపలక్షణభూతం. త్రివృత్ త్రయీ ప్రతిపాద్యం. అధ్వరాఖ్యం తవ రూపం. అస్మాభిర్జ్ఞాతం. కీదృశం యదర్థం యస్య సిద్ధయే అధిదైవం దేవాధికారేణ అధోవ్యవస్థాః అమూర్వ్యవస్థాః. అత్ర ఇయమేవ దేవతానాన్యేత్యేవంరూపాః .నియమాఇత్యర్థః యద్వా వ్యవస్థా ఇతి క్రియాపదత్వేన వ్యాఖ్యాతం. అడాగమాద్యభావ ఆర్షః. యదర్థం అదః ఇదం ఇంద్రాద్యధి దేవరూపం. విశేషేణాస్థితవానసీత్యర్థః. 27

**ఋత్విక్కులు ఈ విధముగా స్తుతిస్తున్నారు.**

ఋత్విక్కులుగూడా వారి అపరాధమును తొలిగించుకొనుటకు స్తుతిస్తున్నారు. ఓ ఉపాధిదోషములు లేనివాడా! నిజానికి నీవే రుద్రాది దేవతల రూపములో గలవాడవు. అయినప్పడికి నందీశ్వరుడి శాప ప్రభావము వలన కర్మలయందే మొండి పట్టుదలగల మతులచే నీ తత్వమును తెలుసుకొన లేకున్నాము. ధర్మమనగా ఇచ్చట అపూర్వము. ఈ అపూర్వము వేదప్రది పాద్యమైన యజ్ఞముల ద్వారా పుట్టుచున్నది. ఈ అపూర్వ జనకమైన వేదంద్రిపాద్య యజ్ఞము నీ రూపమేనని మేము తెలుసుకొన్నాము.

(అపూర్వము అనగా యజ్ఞము స్వర్గము కొరకు చేసినప్పుడు ఆ యజ్ఞము నశించినప్పడికి ఆ యజ్ఞ జనితమైన ఒక అపూర్వమనునది పుడుతుంది. ఈ అపూర్వము మాత్రము ఈ చేసినవాడు స్వర్గము వెళ్ళువరకు ఉంటుంది. అనగా ఫలము ఇచ్చువరకు ఉంటుంది. ఎంతకాలమైన సరే ఇదే అపూర్వము). ఎట్టిది నీరూపమనిన "యజ్ఞస్సద్వేరూపేద్రవ్యందేవతాచ" అన్నారు. యజ్ఞమునకు రెండు రూపములు. ద్రవ్యము మరియు నిర్ణీత దేవతా. ప్రతి యజ్ఞమునకు ఒక దేవత ఉంటుంది. ఆ దేవతారూపము నీవేనని ఈ వ్యవస్థ ఆ యజ్ఞము సిద్ధించుట కొరకే ఈ యజ్ఞమునకు ఈ దేవతయని నియమ రూపమును పొందినవాడైనావు. 27

సదస్యా ఊచు

శ్లో॥ ఉత్పత్త్యధ్వన్యశరణ ఉరుక్లేశ దుర్గేంత కోగ్ర
వ్యాళాన్విష్టే విషయమృగతృష్ణాత్మ గేహోరుభారః ।
ద్వంద్వశ్వభ్రే ఖలమృగభయే శోకదావేఽజ్ఞసార్థః
పాదౌ కస్తే శరణద కదా యాతి కామోపసృష్టః ॥ 28

టీ:- సదస్యాస్తు నిరీశ్వరేఽపి దక్షాధ్వరే. ధనలోభేన స్వ ప్రవృత్తిమను చింత్యానుతప్తాః విరక్తిమాశానాస్తువంతి. ఉత్పత్తీతి. హేశతణ ఆశ్రయ ప్రద. ఉత్పత్త్యధ్వని సంసారమార్గే వర్తమానః. అజ్ఞానాం సార్థస్సమూహః తే పాదౌకః త్వత్పాదరూపం నివాసంకదా యాతి యాస్యతి. కథం భూతే సంసారమార్గే అశరణే అవిశ్రమస్థానే. ఉరుక్లేశా ఏవ దుర్గమ స్థానాని యస్మిన్ అంతక ఏవ ఉగ్రవ్యాళః తేనానిష్టే లక్ష్మీ కృతే విషయ రూపా మృగతృష్ణికాయస్మిన్. ఆత్మాఅహంకారాస్పదం శరీరం. మమత్వాస్పదం గేహం చ. సఏవ ఉరుర్భారో యస్య సః. ద్వంద్వాని సుఖ దుఃఖాన్యేవ శ్వభ్రాణి గర్తా యస్మిన్.ఖలాఏవ మృగాః వ్యాఘ్రాదయః తేభ్యోభయం యస్మిన్. శోకో ఏవ దావాగ్నిర్యస్మిన్ కామేన ఉపసృష్టః పీడితః. 28

సదస్యులు ఈ విధముగా స్తుతిస్తున్నారు.

సదస్యులు ఈశ్వరుడు లేని దక్షుడి యజ్ఞమునకు ధనలోభము చేత వెళ్ళడాన్ని గూర్చి బాధపడి విరక్తిని కోరుచూ ఈ విధముగ స్తుతించారు. ఓ ఆశ్రయుడా! సంసార మార్గమున పడిఉన్న కోరికలచే పీడితమైన ఈ అజ్ఞసమూహము నీపాదమును నివాసముగా ఎన్నడు చేసుకొనునో కదా! ఎట్టిదా సంసార మార్గమనగా? విశ్రాంతి స్థానము లేనిది. గొప్పనైన క్లేశములే దుర్గమ స్థానములుగా గలది. మృత్యువనే గొప్ప పామునకు లక్ష్యమైనట్టి, విషయరూముపములనే ఎండమావులు గలది, అహంకారస్పదమైన శరీరము, మమతకు ఆస్పదమైన గృహమే గొప్పనైన భాగముగా గలది. సుఖదుఃఖములే గోతులుగా గలది, మూర్ఖులే పులులు, సింహాలుగా గలిగి, భయంగలది, శోకమనే చెట్ల రాపిడిచే అంటుకున్న అగ్నిగాగల, ఆ సంసార మార్గమును..28

రుద్ర ఉవాచ

శ్లో॥ తవ వరద వరాంఘ్రావాశిషే వాఖిలార్థే
హ్యపి మునిభిరసక్తైరాదరేణార్హణీయే ।
యది రచితధియం మావిద్య లోకోపవిద్ధం
జపతి న గణయేతత్త్వత్పరానుగ్రహేణ ॥ 29

టీ:- శ్రీరుద్రస్తు పూర్వం మమ నిందా దుస్సహాసీత్. ఇదానీం తాః న గణయామీత్యాహ-తవేతి. ఆశిషాకామేన. అసక్తైర్నిష్కామైః రచిత ధియం అభినివేశితచిత్తం మామాం. అవిద్యః విద్యాహీనో లోకః యది అపవిద్ధం ఆచారభ్రష్టం జపతి జల్పతి తజ్జల్పనం తవ తేయః పరోఽనుగ్రహః తత్పరాణాం వా యోఽనుగ్రహః తేన. తవ చాంఘ్రౌ రచితధియం కృతబుద్ధిం భక్తం మాం. యది జానీషే. తర్హి స్వానపి లోకాన్ కైలాసాదీన్. న గణయే న బహుమన్యే త్వత్పరానుగ్రహేణ పరిపూర్ణ ఇతి శేషః. త్వత్పరాణాం యోఽనుగ్రహః తేన వా. 29

శ్రీ రుద్రుడు ఈ విధముగా స్తుతిస్తున్నాడు.

పూర్వము నన్ను నిందించిన సహించలేకపోతిని గాని ఇప్పుడు నిందించిననూ, లెక్కచేయను అని అనుచున్నాడు.

ఓ వరదా! ఈ జగత్తున సకాములచే, నిష్కాములైన మునులచే (శ్రద్ధతో) పూజనీయమైన నీ పాదములయందు బుద్ధి గలిగిన నన్ను , అజ్ఞానలోకము ఆచారభ్రష్టుడని అన్నా, నేను నీ గొప్పనైన అనుగ్రహము చేత, నీకు భక్తులయందుగల అనుగ్రహము చేత లెక్కచేయను. 29

భృగురువాచ

శ్లో॥ యన్మాయయా గహనయాపహతాత్మబోధా
బ్రహ్మాదయ స్తనుభృత స్తమసి స్వపంతః ।
నాత్మన్ సృతం తవ విదంత్యధునాపి తత్త్వం
సోఽయం ప్రసీదతు భవాన్ప్రణతాత్మబంధుః ॥ 30

భృగువు ఈ విధముగా పలికెను.

స్వభావముచేత తత్త్వజ్ఞాన హీనులైన వారు జీవులు అందుచేత అజ్ఞానము వలన నేను చేసిన దుర్మార్గపు పనిని క్షమించమని అనుచున్నాడు.

నీ దుస్తరమైన మాయచేత అపహరింపబడిన ఆత్మబోధ కలిగినవారై, చీకటియందు నిద్రించుచున్న దేహధారులైన బ్రహ్మాదులు ఇప్పటికీ ఆత్మయందు అనుగతమైన నీ తత్త్వమును తెలియలేకున్నారు. నమస్కరించినవారికి ఆత్మబంధువు అయిన నీవు ప్రసన్నుడవు అగుదువు గాక! 30

బ్రహ్మోవాచ

శ్లో॥ నైతత్స్వరూపం భవతోఽసౌ పదార్థ
భేదగ్రహైః పురుషో యావదీక్షేత్ ।
జ్ఞానస్య చార్థస్య గుణస్య చాశ్రయో
మాయామయద్వ్యతిరిక్తో సతస్త్వమ్ ॥ 31

టీ:- భృగుస్తు స్వభావతః తత్త్వజ్ఞానహీనాజీవాః. అతః అజ్ఞానకృతం మమ దుశ్చేష్టితం క్షమస్వేత్యాహ-యదితి. ఆత్మన్ ఆత్మని సృతం అనుగతం తవ తత్త్వం న విదంతి. ప్రణతానామాత్మా బంధుశ్చ. 31,32

బ్రహ్మ ఈ విధముగా పలికెను.

బ్రహ్మాదులుగూడా తెలియకున్నారని భృగువనగానే దానిని సహించలేని బ్రహ్మ తత్త్వజ్ఞానమును ఆవిష్కరిస్తూ, ఈ మానవుడు పదార్థ భేదమును గ్రహించే ఇంద్రియములచేత ఎంతవరకు ఈ జగత్తును చూస్తున్నాడు. ఈ దృశ్య ప్రపంచము నీ స్వరూపము కాదు. ఎందుకనగా నీవు ఘటాది విషయకమైన వృత్తి జ్ఞానమునకును; ఘటాదులకును; ఘటాది గ్రాహక ఇంద్రియములకును అధిష్ఠానములై యున్నావు. అథవా జ్ఞానార్థములకు కారణమైన సత్త్వాదులకు అధిష్ఠానమై యున్నావు. మాయామయమైన దృశ్య ప్రపంచమునకు అధిష్ఠానమువై అపదాత్మక మైన దృశ్య ప్రపంచమునకు భిన్నమై యున్నావు. 31

ఇంద్ర ఉవాచ

శ్లో॥ ఇదమప్యచ్యుత విశ్వభావనం వపురానందకరం మనోదృశామ్
సురవిద్విట్క్షపణైరుధాయుధైర్భుజదండైరుపపన్నమష్టభిః ॥ 32

టీ:- ఇంద్రస్తు ఇంద్రియ విషయస్సర్వోఽపి మిథ్యేతి. బ్రహ్మణోక్తమ సహమాన ఆహ-ఇదమితి. ఇదం తవ వపురపి ఉపపన్నమేవ. న తు ప్రపంచవదనిర్వచనీయతయానుపపన్నం. సురాణాం విద్విషః క్షపయంతీతి తథా తైర్భుజదండైరుపలక్షితం. 32

ఇంద్రుడు ఈ విధముగా అనుచున్నాడు.

ఇంద్రియ విషయమైన సర్వము మిథ్యా అనే బ్రహ్మ దేవుడి వాదమును సహించలేక ఇంద్రుడు ఇలా అనుచున్నాడు.

ఓ అచ్యుతా! జగత్పాలకమైన మనస్సునకు, కన్నులకు ఆనందమును కలిగించు దేవతలను ద్వేషించే రాక్షసులను నశింపజేయు ఎత్తిన ఆయుధమును గలిగిన ఎనిమిది చేతులచే కూడిన ఈ దేహము మాకు జ్ఞాతమై ప్రసిద్ధమైయున్నది అనగా దృగోచరమై యున్నది. ప్రపంచమువలె అనిర్వచనీయమై, అప్రసిద్ధమై లేదు. 32

పత్న్యః ఊచుః

శ్లో॥ యజ్ఞోఽయం తవ యజనాయ కేన
సృష్టో విధ్వస్తః పశుపతినాద్య దక్ష కోపాత్ ।
తం నస్త్వం శవ శయనాభశాంతమేధం
యజ్ఞాత్మన్నలిన రుచా దృశా పునీహి ॥ 33

టీ:- ఋత్విజాం పత్న్యః స్తువంతి. యజ్ఞ ఇతి. యజ్ఞోఽయం తవ యజనాయ త్వాం యష్టుం. కేన బ్రహ్మణా. పూర్వం సృష్టః హే యజ్ఞాత్మన్ తం నః యజ్ఞం నళినకాంత్యా దృశా నేత్రేణ. పునీహి పవిత్రం కరుం కథంభూతం యజ్ఞం. శవాః శేరతే యస్మిన్నితి శవ

ఋత్విక్కుల పత్నులు స్తోత్రము చేయుచున్నారు.

ఈ యజ్ఞములు నిన్ను ఆరాధించడానికి బ్రహ్మదేవుడిచేత సృష్టింపబడినవి. ఆ యజ్ఞము దక్షుడి కోప మూలకమున శివుడిచేత నాశనము చేయబడినది. ఓ యజ్ఞస్వరూపుడా! స్మశానమువలె కనబడుచున్న ఆ యజ్ఞవాటికను నీ కలువ కాంతుల చూపులతో పావనము చేయుము. శవ శయనాభః అనగా శవమనగా నీరు, నీటియందు ఉండునది కమలము అది నాభియందు కలవాడు "శవస్యాత్ కుణపే పుమాన్, నపుంసకం తు పానీయే" ఇతి మేథినీ నపుంసలింగమున శవం అని చెప్పినప్పుడు నీరని అర్థము. పుంలింగ ప్రయోగమున శవమని అర్థము. 33

శయనం శ్మశానం. తద్వత్ ఆభాప్రతీతిరస్య. సచాసౌ శాంతమేధశ్చ ఉపరతోత్సవః. మేధ శబ్దేన పశుహింసాద్యుత్సవో లక్ష్యతే. శరం ఉదకం తత్ర శేరత ఇతి తథా పద్మం తన్నాభౌ యస్యేతి సంబోధనం వా. 33

**ఋషయః ఊచుః**

శ్లో॥ అనన్వితం తవ భగవన్విచేష్టితం
యదాత్మనా చరసి హి కర్మ నాజ్యసే ।
విభూతయే యత ఉపసేదురీశ్వరం
న మన్యతే స్వయమనువర్తినీం భవాన్ ॥ 34

టీ:- ఋషయస్తు కర్మాణ్యనుతిష్ఠంతే. తత్పుణ్యేనతత్ఫలేన చ యజ్యంతే. భగవతి తదభావమాలక్ష్య విస్మితాః స్తువంతి. అననిత్వమితి. అనన్వితం అఘటమానం.యత్ యస్మాత్. ఆత్మనా స్వయం కర్మ ఆచరసి అనుతిష్ఠసి న త్యజ్యసే న లిప్యసే. యతః అన్యే. విభూతయే సంపదే. ఈశ్వరీం లక్ష్మీం. ఉపసేదుః భేజుః. యద్వా యత ఇతి సార్వవిభక్తికస్తసిః. యామిత్యర్థః. భవాంస్తు స్వయమేదానువర్తమానాం తాం. న మన్యతే నారదియతే. 34

ఋషులు కర్మానుష్ఠానముచేసి తజ్జనిత పుణ్యమును తత్ఫలమును పొందుచున్నారు. భగవంతుడు కర్మ చేసినప్పటికీ, పుణ్యమును కాని, ఫలమును గాని పొందకుండుట చూచి విస్మయము పొంది స్తుతిస్తున్నారు.

భగవంతుడా! నీ చేష్ట అత్యద్భుతము ఎందుకనగా స్వయముగా నీవు కర్మ చేయుచున్నావు. కాని ఫలములు అంటుకోవడం లేదు. ఇతరులేమో సంపదల కొరకు లక్ష్మీదేవిని ఉపాసించుచున్నారు. నీవు మాత్రం స్వయముగా నిన్ను అనుసరించుచున్నప్పటికీ ఆ లక్ష్మిని ఆదరించుట లేదు. 34

**సిద్ధా ఊచు**

శ్లో॥ అయం తే కథామృష్ట పీయూషనద్యాం
మనోవారణః క్లేశదావాగ్ని దగ్ధః ।
తృషార్తోఽవగాఢో న సస్మార దావం
న నిష్క్రామతి బ్రహ్మసంపన్న వన్నః ॥ 35

టీ:- సిద్ధాస్తు తత్కథాసుఖమభినందంతః స్తువంతి- అయమితి. అయం నః మనోవారణః మనోగజః.త్వత్కథైవమృష్టం శుద్ధం పీయూషం. తన్మయీ యానదీతస్యాం. అవగాఢః ప్రవిష్టఃదావాగ్ని తుల్యం సంసారతాపం. న స్మరతి స్మ. న చ తతోనిర్గచ్ఛతి. బ్రహ్మ సంపన్న వత్. బ్రహ్మైక్యం ప్రాప్త ఇవ. 35

**సిద్ధులు ఈ విధముగా స్తుతిస్తున్నారు.**

సిద్ధులు భగవత్ కథా సుఖమును అభినందిస్తు స్తుతిస్తున్నారు. ఈ మనస్సనే ఏనుగు, చిత్తమాలిన్యమనే దావాగ్నులచే కాల్చబడినట్టి, తృష్ణ అనే దప్పిక గొన్నదై నీ కథ అనే శుద్ధమైన అమృతపు నదియందు ప్రవేశించి సంసార తాపమును స్మరించుటలేదు. బ్రహ్మైక్యము పొందినవారివలె దానినుండి బయటకు రాదు. 35

**యజమాన్యువాచ**

శ్లో॥ స్వాగతం తే ప్రసీదేశ తుభ్యం నమ
శ్శ్రీనివాసశ్రియా కాంతయ త్రాహి నః ।
త్వామృతేధీశ నాంగైర్మఖశ్శోభతే
శీర్షహీనః కబంధో యథా పూరుషః ॥ 36

టీ:- దక్షపత్నీ యజమానీ స్తౌతి–స్వాగతమితి. తే స్వాగతం భద్రమా

**యజమానీ అయిన దక్ష పత్నీ స్తోత్రము చేయుచున్నది.**

ఓ పరమేశ్వరా! శ్రీనివాసా! జగదాధీశ! నీకు స్వాగతం. నీ ఆగమనము మంగళప్రదమైనది. ఏ విధముగానైతే శోభతో కూడిన కాళ్ళు, చేతులు మొదలగు అవయవములు కలిగినప్పటికి శిరస్సులేని మొండెము శోభించదో అదే విధముగా నీవు లేకుండా ప్రయాజాది అంగములతోగూడిన యజ్ఞము శోభించదు. అందుచేత శ్రీమహాలక్ష్మితో కూడిన వాడవై, మమ్ము నీ భక్తులను చేసుకొని రక్షించు. 36

గమనం జాతం. హే అధీశ. యదా శిరసా విహీనః. కబంధ మాత్రః పురుషః. అంగైః కరచరణాద్యవయవైః శోభమానైరపి న శోభతే. తథా త్వాం వినా. నః కేవలం ప్రయాజాదిభిరంగైః. మఖో న శోభతే. అతో నః. శ్రియా సహ త్రాయస్వ. త్వద్భక్తాన్ కుర్విత్యర్థః. 36

**లోకపాలా ఊచుః**

శ్లో॥ దృష్టః కిం నో దృగ్భిరసద్గ్రహైస్త్వం
ప్రత్యగ్ద్రష్టా దృశ్యతే యేన దృశ్యమ్ ।
మాయా హ్యేషా భవదీయాహిభూమన్
యస్త్వం షష్ఠః పంచభిర్భాసిభూతైః ॥ 37

టీ:- లోకపాలస్తు ఈశ్వరాభిమానరూఢాః భగవతస్తత్త్వమపశ్యంత ఊచుః. దృష్టఇతి. దృష్టఃఇత్యర్థః.కుతః అసద్గ్రహైః పుంస్త్వమావిష్ట లింగత్వాత్ అసత్ప్రకాశరూపాభిః. దృగ్భిః. ఇంద్రియైః. అయంభావః. శుద్ధచిత్తానాం త్వం శుద్ధసత్త్వమూర్తిర్భాసి. అస్మాకం తు బహుర్ముఖేంద్రియాణాం. పంచభూతోపలక్షితో జీవవిశేషః ఇవాభాసి. అతస్త్వమస్మదింద్రియ గోచరో న భవసి. ధిగస్మజ్జీవితమితి. 37

**లోకపాలకులు ఈ విధముగా పలికిరి..**

లోకపాలకులు మేమే జగదీశ్వరులమను అభిమానము కలవారై భగవతత్త్వమును చూడకుండా పలికిరి. ఓ పరబ్రహ్మ స్వరూపా! జీవుల అంతరాత్మయైన దృక్ స్వరూపుడవగు నీవు మిథ్యాత్మకమగు జగత్తును చూచే ఇంద్రియములచే చూడబడుదువా! చూడబడవు. ఎవడు ప్రత్యగాత్మ స్వరూపుడై లోపల వెలుగొందుట ద్వారా, దృశ్యాత్మకమగు జగత్తు చూడబడుచున్నదో నీవు పంచభూత వ్యతిరిక్తుడవైన సచ్చిదానంద దేహుడవైనప్పడికి పంచభూత విశిష్టుడివిగా కనపడుచున్నావు. ఇదియే నీ మాయ.

ఇది భావము - శుద్ధచిత్తులైన వారికి నీవు శుద్ధ సత్వమూర్తిగా భాసిస్తావు. బహిర్ముఖులమైన మాకుమాత్రం పంచభూత ఉపలక్షితుడవై, జీవ విశేషుడవుగా భాసిస్తున్నావు. నీవు ఇంద్రియ గోచరుడవుకావు. అయ్యో! మా జీవితం వ్యర్థము. 37

**యోగీశ్వరా ఊచుః**

శ్లో॥ ప్రేయాన్నతేఽన్యోస్త్య ముతస్త్వయి ప్రభో
విశ్వాత్మనీక్షేన్న పృథగ్య ఆత్మనః ।
అథాపి భక్త్యేశ తయోపధావతా
మనన్య వృత్త్యానుగృహాణ వత్సల ॥ 38

టీ:- యోగేశ్వరాస్తు అభేదేన భజతామనుగ్రహభాక్త్వం మన్యమానాః స్వామిభృత్యభావేన భజతామప్యనుగ్రహం ప్రార్థయమానాః స్తువంతి ద్వాభ్యాం. ప్రేయానితి. విశ్వాత్మని పరబ్రహ్మణీత్వయి. ఆత్మానాం పృథక్త్వం నేక్షేత్. అముతః. అముష్మాత్. అన్యస్తే ప్రేష్ఠోనాస్తి. ఆత్మనో జీవాన్ పృథఙ్నేక్షేతేతి వా. హే వత్సల భక్తప్రియ అనన్యవృత్త్యా అవ్యభిచారిణ్యా భక్త్యా. భజతః అనుగృహాణేత్యర్థః. 38

**యోగేశ్వరులు ఈ విధముగా పలికిరి.**

యోగేశ్వరులు అభేదముగా భజించువారలు భగవదనుగ్రహము పొందుదురని అనుకొని, స్వామి సేవక భావముచేత భజించు వారలకు గూడా నీ అనుగ్రహము కలుగనీయమని ప్రార్థించుచున్నారు. ఎవడైతే పరబ్రహ్మవైన నీకంటే తనను వేరుగా చూడడో, అతని కంటే వేరొకరి యందు నీకు ప్రేమ అంతగా లేదు. లేదా ఆత్మను జీవుడికంటే భిన్నుడిగా దర్శించడో అని అర్థము చెప్పుకొనవచ్చును. ఓ భక్తజన ప్రియుడా! వేరొకవైపు మనస్సు వెళ్ళకుండా నీ యందే మనోవృత్తులు కలిగి భక్తిచేత భజించిన వారిని అనుగ్రహించుము. 38

శ్లో॥ జగదద్భువ స్థితి లయేషు దైవతో
బహుభిద్య మానగుణయాత్మ మాయయా ।
రచితాత్మ భేదమత యే స్వసంస్థయా
వినివర్తిత భ్రమగుణాత్మనే నమః ॥ 39

టీ:- అవ్యభిచారిణీ భక్తిః కథం స్యాత్ భజనీయానాం బహుత్వాదిత్యా

భజించవలసిన దేవతలెంతో మంది కనబడుచున్నప్పుడు చలించని భక్తి ఎట్లు కలుగును? అనగా యోగులు ఈ విధముగా చెప్పుచున్నారు. సృష్టి, స్థితి, ప్రళయముల యందు జీవుల ప్రాక్ జన్మకృత పుణ్యాపాపకర్మ జనిత అదృష్టము వలన; అవి అనేకములు కనుక, అనేక విధములుగా భేదమును పొందే గుణములు గల స్వమాయ చేత ఆత్మయందు బ్రహ్మాది దేవతారూపముల యొక్క నానాత్వజ్ఞానము

శంక్యాహుః - జగదితి. జగతః ఉద్భవాదిషు నిమిత్తేషు. దైవతః జీవాదృష్టాత్. బహుధా భిద్యమానాః గుణాః యస్యాస్తయా స్వ మాయయా. ఆత్మని స్వరూపే. రచితా బ్రహ్మాదిభేదమతిర్యేన తస్మై. స్వసంస్థయా కేవలస్వరూపావస్థానేన చ.వినివర్తితః. భేదభ్రమః. గుణాశ్చతద్ధేతవః. ఆత్మనియేన తస్మై. 39

కలుగుతుందో అట్టి వాడికి నమస్కారము. మరియు కేవల స్వరూపుడైన సచ్చిదానంద స్వరూపము గలవాడైనప్పుడు ఆత్మయందు ఏ భేదభ్రమలు కాని సత్వరజస్తమోగుణములుగాని దానికి హేతువైన అజ్ఞానము లేనట్టి పరమాత్మకు నమస్కారము. 39

శబ్దబ్రహ్మోవాచ

శ్లో॥ నమస్తే శ్రితసత్త్వాయ ధర్మాదీనాం ప్రసూతయే ।
నిర్గుణాయ చ యత్కాష్ఠాం నాహం వేద పరేఽపి వా ॥ 40

టీ:- శబ్దబ్రహ్మస్తౌతి-నమ ఇతి. శ్రితం స్వీకృతం సత్త్వం యేన. అతో భక్తానాం ధర్మాదిఫలప్రసవిత్రే. సత్త్వగుణత్వం నిర్గుణత్వం చ కథమిత్యాశంక్యాహ-యస్య కాష్ఠాం తత్త్వం. నాహం వేద్మి. అపరే బ్రహ్మాదయశ్చ న విదుః. తస్మై నమః. 40

శబ్ద బ్రహ్మయైన వేదము స్తుతిస్తుంది.

స్వీకరింపబడిన సత్వ రూపము గలవాడు, ధర్మార్థ కామమోక్షములను, ఫలములను ఇచ్చువాడు సత్వరూపుడెందుకనగా ధర్మాదుల ఫలములను అనుగ్రహించుటకు

మరి సత్వగుణము, నిర్గుణత్వము ఒక్కడికే ఎట్లు పొసగును? అనగా ఏ ఆత్మ యథార్థ స్వరూప అవధిని నేను తెలియలేకున్నానో ఇతరులైన బ్రహ్మాదులుగూడా తెలియలేకున్నారో అట్టి పరమాత్మకు నమస్కారము. 40

**అగ్నిరువాచ**

శ్లో॥ యత్తేజసాహం సుసమిద్ధతేజా
హవ్యం వ హే స్వధ్వర ఆజ్యసిక్తమ్ ।
తం యజ్ఞియం పంచవిధం చ పంచభి
స్స్విష్టం యజుర్భిః ప్రణతోఽస్మి యజ్ఞమ్ ॥ 41

టీ:- అగ్నిస్తు. యజ్ఞమూర్తిం ప్రణమతి-యదితి. యస్య తేజసా సుష్ఠు సమిద్ధం ప్రదీప్తం తేజో యస్య సోఽహం. ప్రశస్తే అధ్వరే. హవిర్వహామి తంయజ్ఞియం యజ్ఞాయ హితం.పాలకం. యజ్ఞం యజ్ఞమూర్తిం. పంచ విధత్వమైతరేయకే ఉక్తం. శ్రు. "స ఏష యజ్ఞః పంచవి ధో2గ్ని హోత్రం దర్శపూర్ణమాసౌ చాతుర్మాస్యాసి పశుస్సోమ" ఇతి. పంచభి ర్యజుర్భిర్యజ్ఞ మంత్రైః. స్విష్టం సంపూజితం తథా చ శ్రుతిః. "ఆశ్రావ యేతి చతురక్షరమస్తు శ్రౌషడితి చతురక్షరం యజేతి ద్వ్యక్షరం యే యజామహ ఇతి పంచాక్షరం ద్వ్యక్షరో షట్కార" ఇతి. స్మృతిశ్చ. "చతుర్భిశ్చ చతుర్భిశ్చ ద్వాభ్యాం పంచభిరేవ చ, హూయతే చ పున ర్ద్వాభ్యాం సనో విష్ణుః ప్రసీదత్వి" తి. 41

**అగ్ని యజ్ఞస్వరూపుడికి నమస్కారము చేయుచున్నాడు.**

ఏ పరమాత్మ యొక్క తేజస్సుతో చక్కటి తేజోవంతుడనై, ప్రశస్తమైన యజ్ఞములయందు చక్కటి నెయ్యితో తడసిన హవ్యమును దేవతలకు అందించుచున్నానో ఆ యజ్ఞపాలకుడిని, యజ్ఞమూర్తిని ఐదురకముల యజ్ఞరూపములో ఉన్నట్టి యజుర్మంత్రముల చేత చక్కగా ఆరాధింపబడే శ్రీహరిని నమస్కరించుచున్నాను.

ఐతరేయకమున పంచవిధములు ఈ విధముగా చెప్పబడినవి. ఈ యజ్ఞము ఐదు విధములు. 1. అగ్నిహోత్రము 2. దర్శపూర్ణ మాసములు 3. చాతుర్మాస్యము 4. పశువు 5. సోమము (యజుర్వేద సంహితా, కాండ, షష్ఠప్రశ్న-11 అనువాకం) ఆశ్రావయేతి చతురక్ష రమస్తుశ్రౌషడితి చతురక్షరం యజేతి ద్వ్యక్షరం యేయజామహ ఇతి పంచాక్షరంద్వ్యక్షరో వషట్కారః. స్మృతియందు చతుర్భిశ్చ అనగా ఆశ్రావయ 4 అక్షరములు చతుర్భిశ్చ అస్తు, శ్రౌషత్ అను 4 అక్షరములు ద్వాభ్యాం = యజ-2అక్షరాలు, పంచభిరేవచ=యేయజామహే అను 5 అక్షరములు మళ్ళీ 2 అక్షరములు వషట్. వీటిచే హోమము చేయబడునో ఆ విష్ణువు ప్రసన్నుడగుగాక! (ట్ అను అర్ధాక్షరము లెక్కకు రాదు). 41

దేవా ఊచుః

శ్లో॥ పురా కల్పాపాయే స్వకృతముదరీకృత్య వికృతం
త్వమేవాద్య స్తస్మిన్ సలిల ఉరగేంద్రాధిశయనే ।
పుమాన్ శేషి సిద్ధైర్హృది విమృదితాధ్యాత్మ
పదవిస్స ఏవాద్యాక్ష్ణోర్యః పథి చరసి భృత్యానవసి నః ॥ 42

టీ:- దేవాస్తు సత్యం వయమపి దేవాః. తథాపి జగదా ద్యంతయో స్త్వమేవ నాన్యః కశ్చిదస్తీత్యాహుః-పురేతి. కల్పాపాయే ప్రళయే వికృతం కార్యజాతం. ఉదరీకృత్య సంహృత్య. త్వమేవ ఆద్యః పుమాన్. ఉరగేంద్రః శేష ఏవ అధికం శయనం శయ్యా యస్మిన్ తస్మిన్. శేషే శయనం కరోషి. సిద్ధైర్జనర్లోకాదివాసిభిః. హృది విమృశితా విచింతితా. అధ్యాత్మపదవీ ఆత్మతత్త్వమార్గో యస్య. సఏవ త్వం. యః ఇదానీం అక్ష్ణోఃపథి చరసి. ప్రత్యక్షోఽసి. అవసి రక్షసి. 42

దేవతలు ఈ విధముగా పలికిరి

దేవతలము మేముగూడా దేవతలమే కాని జగత్ప్రారంభ సమాప్తుల యందు ఉండేది నీవే, వేరువాడు ఉండడు అని అనుచున్నారు.

ఈ కల్పము సమాప్తి అయినప్పుడు ఈ వికార జాతమైన జగత్తును తన పొట్టన పెట్టుకొని అనగా ఉపసంహరించి, నీవే ఆద్యుడవైన పురుషుడవు. ఆ ప్రళయ జలముపై నాగరాజనే శయ్యపై పడుకొని యుందువు. జనలోక స్థిత సిద్ధులచే చింతించిన జ్ఞాన మార్గము గల వాడవైన నీవు ఈనాడు మా కంటికి కనబడుచున్నావు, రక్షించుచున్నావు. 42

గంధర్వా ఊచుః

శ్లో॥ అంశాంశాస్తే దేవమరీచ్యాదయ ఏతే
బ్రహ్మేంద్రాద్యా దేవగణా రుద్రపురోగాః ।
క్రీడాభాండం విశ్వమిదం యస్య విభూమం
స్తస్మై నిత్యం నాథ నమస్తే కరవామ ॥ 43

గంధర్వులు ఈ విధముగా పలికిరి.

గంధర్వాప్సరసలమైన మేము కేవలము భయంచేత అందరిని గూడా పరమేశ్వరుడిగా పొగుడుచుంటాము, నీవే పరమేశ్వరుడవు. ఇతరులంతా నీ అంశాంశలని స్తోత్రము చేయుచున్నారు.

ఓ మహత్తముడా! మరీచ్యాదులు,ప్రజాపతులు, రుద్రాదిగణము

టీ:- గంధర్వాప్సరసస్తు వయం భియా కేవలం సర్వానపి పరమేశ్వ రత్వేనోపశ్లోకయామః. త్వమేవ పరమేశ్వరః. అన్యే త్వదంశా ఏవేత్యాహుః - అంశేతి. హే విభూమన్మహత్తమ. క్రీడాభాండం. క్రీడోపకరణం. విశ్వం బ్రహ్మాండం యస్య తస్మై తే నమః కరవామ నమస్కుర్మః. 43

బ్రహ్మ, ఇంద్రుడు మొదలగు దేవతాగణములు నీ అంశలలో అంశలు. ఓ దేవా! ఈ బ్రహాండమంతా క్రీడా సాధనము ఎవరికో అట్టి నీకు ఓ నాథా! ఎల్లప్పుడు నమస్కారము చేయుచున్నాము. 43

**విద్యాధరా ఊచుః**

శ్లో॥ త్వన్మాయయార్థమభిపద్య కళేబరేఽస్మిన్కృత్వా
మమాహమితి దుర్మతిరుత్పథైస్స్వైః ।
క్షిప్తోఽప్య సద్విషయలాలస ఆత్మమోహం
యుష్మత్కథామృత నిషేవక ఉద్వ్యుదస్యేత్ ॥ 44

టీ:- విద్యాధరాస్తు. కేవలం విద్యాభిః సంపదః ప్రాప్యంతే. అహం కారాదివ్యామోహనివృత్తిస్తు త్వత్కథాశ్రవణం వినానాస్తీత్యాహుః-త్వదితి. అర్థం పురుషార్థసాధనం కళేబరం. అభిపద్య ప్రాప్య. త్వన్మాయయా. అస్మిన్ కళేబరే. మమేతి అహమితి చ. అభిమానం కృత్వా. ఇమం ఆత్మ మోహం. యుష్మత్కథామృతనిషేవకః. ఉత్ ఉచ్చైః. వ్యుదస్యేత్. పరిత్యజేత్. నాన్యః. నను స్వైః పుత్రాదిభిరధిక్షిప్తః, దుఃఖితస్సన్. పరిత్య జేదేవనే త్యాహుః క్షిప్తోఽపి దుర్మతిఃఅసత్సు విషయేష్వేవ లాలసా తృష్ణా యస్య సః. 44, 45

**విద్యాధరులు ఈ విధముగా పలికిరి.**

విద్యాదుల ద్వారా సంపదలు లభించును కానీ, అహంకారాది వ్యామోహము మాత్రము నీ కథాశ్రవణము లేక తొలగదని స్తోత్రము చేయుచున్నారు.

పురుషార్థ సాధనమైన దేహమును పొంది నీ మాయచేత ఈ దేహముయందు నేను, నాదని అభిమానము పొందిన ఈ మమాత్మ మోహమును నీ కథామృతమును సేవించువాడు దూరముగా విడిచి పెట్టును; నీ కథామృతపానము చేయనివాడు విడిచిపెట్టలేడు అనగా మరి? మమాత్మ మోహమును విడిచిపెట్టడాన్ని కథ అక్కరనే లేదు. వారివారి కొడుకులు, భార్య మొదలగు వారిచేత దుఃఖితుడై అతడే విడిచి పెట్టును కదా? అనగా కాదు. వారు వెళ్ళకొట్టినప్పటికి దుర్మతియై దుష్టమగు ఇంద్రియభోగలాలసుడై తృష్ణగలవాడై విడిచిపెట్టలేడు. 44

బ్రాహ్మణా ఊచుః

శ్లో॥ త్వం క్రతుస్త్వం హవిస్త్వం హుతాశస్స్వయం
త్వం హి మంత్రస్సమిద్దర్భ పాత్రాణి వై ।
త్వం సదస్యర్త్విజో దంపతీ దేవతాహ్యగ్ని
హోత్రం స్వధా సోమ ఆజ్యం పశుః ॥ 45

బ్రాహ్మణులు ఈ విధముగా స్తోత్రము చేయుచున్నారు.

నీవే యజ్ఞమువు, నీవే హవిస్సువు, నీవే అగ్నిహోత్రము, నీవే స్వయముగా మంత్రము, సమిధలు, దర్భలు, పాత్రలు, నీవే సదస్యులు, ఋత్విజులు, యజమానపత్నీ, యజమానుడవు, నీవే దేవతవు, అగ్ని యందు చేయబడే హోమము, పితరులకు అందించే కవ్యశక్తివి, సోమరసమువు నీవే, ఆజ్యమువు నీవే, హోమపశువు నీవే. 45

శ్లో॥ త్వం పురాగాం రసాయా మహాసూకరో
దంష్ట్రయా పద్మినీం వారణేంద్రో యథా ।
స్తూయమానో నదన్ లీలయా యోగిభి
ర్వ్యుజ్జహాథ త్రయీ గాత్ర యజ్ఞః క్రతుః ॥ 46

టీ:- బ్రాహ్మణాః స్తువంతి త్రిభిః-త్వమితి. గాం పృథ్వీం. రసాయాః రసాతలాత్. దంష్ట్రయా. వ్యుజ్జహాథ విశేషేణ ఉద్ధృతవానసి. యోగిభిః . స్తూయమానః. హే త్రయీగాత్ర వేదమూర్తే. యజ్ఞో యాగః. క్రతుస్సయూపః. తద్విశేషస్తద్రూపీ. యజ్ఞసంకల్పరూప ఇతి వా. యజ్ఞః క్రతుః కర్మ యస్యేతి వా. 46

నీవు పూర్వము యోగుల చేత స్తుతింపబడుతూ, ఏ విధముగా గొప్ప గజరాజము తామర కమలమునెత్తునో, ఆ విధముగా భూమిని రసాతల లోకము నుండి నీ కోరలపైన లేవనెత్తితివి.

ఓ వేదమూర్తీ! యూపస్తంభము కలిగినది యజ్ఞము. ఆ యజ్ఞము రూపముగాగల వాడవు లేదా యజ్ఞ సంకల్పరూపుడవు. లేదా యజ్ఞమే కర్మ ఎవరికో అతడు యజ్ఞ క్రతువు. 46

శ్లో॥ సంప్రసీదత్వమస్మాకమాకాంక్షతాం
దర్శనం సంపరిభ్రష్టసత్కర్మణామ్ ।
కీర్త్యమానే నృభిర్నామ్ని యజ్ఞేశ తే
యజ్ఞ విఘ్నాః క్షయం యాంతి తస్మై నమః ॥ 47

టీ:- సంప్రసీదేతి. సత్త్వమస్మాకం. త్వద్దర్శనమాకాంక్షతాం ప్రసీద అస్మద్యజ్ఞముద్ధరేత్యర్థః. నచాశక్యం తవైతత్. యతః తవనామ్నికీర్త్యమాన ఏవ. యజ్ఞవిఘ్నాః క్షయం యాంతి ఏవం ప్రభావో యస్య తస్మై నమః. 47

ఓ యజ్ఞేశా! నీ దర్శనమును కోరుచున్న, నశించిన మంచి కర్మలుగల మాకు ప్రసన్నుడవు కమ్ము. మా యజ్ఞమును గూడా ఉద్ధరించుము అని అర్థము. నీకిది అసాధ్యము కాదు. ఎందుకనగా మానవులు నీ నామమును కీర్తించిన మాత్రమున యజ్ఞవిఘ్నములు నశించును. ఇంతటి ప్రభావముగల నీకు నమస్కారము. 47

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఇతి దక్షః కవిర్యజ్ఞం భద్రరుద్రాభిమర్శితమ్ ।
కీర్త్యమానే హృషీకేశేసం నిన్యే యజ్ఞభావనే ॥ 48

టీ:- ఇతీతి. ఇత్యనేన ప్రకారేణ. సర్వైః కీర్త్యమానే. హే భద్ర విదుర సంనిన్యే ప్రవర్తయామాస. 48

మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

ఓ భద్రా విదురా! ఈ ప్రకారముగా అందరిచేత యజ్ఞభావనుడు హృషీకేశుడు కీర్తింపబడగా రుద్రుడిచే నశింపచేయబడిన యజ్ఞమును స్వచ్ఛమైన అంతఃకరణముగల దక్షుడు ప్రవర్తింపచేసెను. 48

శ్లో॥ భగవాన్ స్వేన భాగేన సర్వాత్మా సర్వభాగ భుక్ ।
దక్షం బభాష ఆభాష్య ప్రీయమాణ ఇవానఘ ॥ 49

ఓ పాపరహితుడైన విదురా! సర్వాత్మకుడై, సర్వభోగములకు తనే భోక్తయైనప్పటికి, భగవంతుడు నిజానందముచే తృప్తుడైనప్పటికీ,

టీ:- భగవానితి. సర్వాత్మకతయా సర్వభాగభోక్తాపి భగవాన్. నిజానందతృప్తోఽపి. స్వేన భాగేన. త్రికపాలపురోడాశేన. ప్రీయయాణ ఇవ. దక్షమాభాష్య సంబోధ్య బభాషే. 49

తన భాగముచే త్రికపాల పురోడాశముచే సంతోషించినవాడివలె దక్షుడిని సంబోధించి ఈ విధముగా పలికెను. 49

**శ్రీ భగవానువాచ**

శ్లో॥ అహం బ్రహ్మాచ సర్వశ్చ జగతః కారణం పరమ్ ।
ఆత్మేశ్వర ఉపద్రష్టా స్వయం దృగవిశేషణః ॥ 50

టీ:- అహమితి. యోఽహం జగతః కారణం ఆత్మా చ ఈశ్వరశ్చ ఉపద్రష్టా సాక్షీ చ. స్వయంప్రకాశశ్చ సఏవ బ్రహ్మాచ. సర్వశ్చేత్యన్వయః (50)

**శ్రీ భగవానుడు ఈ విధముగా పలికెను.**

నేను జగత్తునకు కారణుడను. ఈ సర్వమునకు ఆత్మను, ఈశ్వరుడను, ఉపద్రష్టను, సాక్షిని, స్వయంప్రకాశుడను, ఉపాధి రహితుడను, నేనే బ్రహ్మను, శివుడను గూడా. 50

శ్లో॥ ఆత్మమాయాం సమావిశ్య సోఽహం గుణమయీం ద్విజ ।
సృజన్రక్షన్ హరన్విశ్వం దధ్రే సంజ్ఞాం క్రియోచితామ్ ॥ 51

టీ:- కుత ఇత్యత ఆహ-ఆత్మమాయామితి. అహమేవ ఆత్మమాయా మధిష్ఠాయ. జగత్సృష్ట్యాది కుర్వన్. స చ సచ సన్. సర్వశక్తి క్రియోచితాం సంజ్ఞాం ధారయామి. 51

ఎందుకనగా-ఓ దక్షా! నేను త్రిగుణాత్మకమైన నా ఆత్మ మాయను పొంది జగత్తు సృష్టి, స్థితి, లయములను చేయుచూ ఆ యా రూపములను పొందుచై, సర్వశక్తినై యజ్ఞాది క్రియాయుక్తమైన సంజ్ఞను పొందుదును. 51

శ్లో॥ తస్మిన్బ్రహ్మణ్య ద్వితీయే కేవలే పరమాత్మని ।
బ్రహ్మరుద్రౌ చ భూతాని భేదేనాజ్ఞో ను పశ్యతి ॥ 52

టీ:- తస్మిన్నితి. తస్మిన్ కేవలే. అద్వితీయే సమానాసమాన జాతీయ భేదరహితే. బ్రహ్మణి మయి బ్రహ్మరుద్రౌ భూతాని చేతి భేదేన. అజ్ఞః పశ్యతీత్యర్థః. 52

కేవల అద్వితీయమైన సమాన, అసమాన, జాతీయ భేదము లేని బ్రహ్మస్వరూపమైన నాలో అజ్ఞుడు బ్రహ్మ, రుద్రుడు, ప్రాణులు అను భేదమును చూచుచున్నాడు. 52

శ్లో॥ యథా పుమాన్నస్వాంగేషు శిరః పాణ్యాదిషు క్వచిత్ ।
పారక్యబుద్ధిం కురుత ఏవం భూతేషు మత్పరః ॥ 53

టీ:- విద్వాంస్తు భేదం న పశ్యతీత్యత్ర సదృష్టాంతమాహ-యథేతి. 53

విద్వాంసుడైనవాడు భేదమును చూడడని దృష్టాంత పురస్సరముగా చెప్పుచున్నాడు. ఏ విధముగానైతే మనుష్యుడు కాళ్ళు, చేతులు, తల మొదలగు శరీరావయవములను ఎప్పుడుగూడా తనకంటే వేరని చూడడో, ఈ విధముగానే వివేకియైన నా భక్తుడు ప్రాణులను నాకంటే వేరుగా చూడడు. 53

శ్లో॥ త్రయాణా మేకభావానాం యోన పశ్యతి వైభిదామ్ ।
సర్వభూతాత్మనాం బ్రహ్మన్ స శాంతిమధిగచ్ఛతి ॥ 54

టీ:- తస్మాత్ ఏవం ఐక్యం. పశ్యన్ కృతార్థో భవతీత్యాహ-త్రయాణా మితి. త్రయాణా మేకో భావః స్వరూపం యేషాం తే. 54

ఓ మహాత్మా! ఒకే స్వరూపము కలిగి సర్వ ప్రాణములకు ఆత్మ రూపులయియున్న బ్రహ్మ, విష్ణు, మహేశ్వరుల స్వరూపము ఒకటేనని తెలుసుకొని, వారియందు భేదము చూడనివాడు ఐక్యమును దర్శించి కృతార్థుడవుతాడు. 54

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఏవం భగవతాదిష్టః ప్రజాపతి పతిర్హరిమ్ ।
అర్చిత్వా క్రతూనా స్వేన దేవానుభయతోఽయజత్ ॥ 55

టీ:- ఏవమితి. స్వేన క్రతునా. త్రికపాలేష్ట్యా. ఉభయతః అంగైః. ప్రాధాన్యేన చ. 55

మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

ఈ విధముగా భగవంతుడిచే ఆదేశింపబడినవాడై ప్రజాపతులకు పతియైన దక్షుడు శ్రీహరిని తన క్రతువైన త్రికపాలేష్టిచే ఆరాధించి దేవతలను ప్రియాజాది అంగములచేత, దర్శపూర్ణమాసాది ప్రధానముల చేత ఆరాధించెను. 55

శ్లో॥ రుద్రం చ స్వేన భాగేన హ్యుపాధావత్సమాహితః ।
కర్మణో దవసానేన సోమపానిత రానపి ॥ 56

టీ:- రుద్రమితి. స్వేన భాగేన యజ్ఞావశిష్టేన. ఉదవస్యతే. సమాప్యతేఽనేనేతి ఉదవసానంతేన కర్మణా సోమపానితరానపి ఉపాధావదిత్యను షంగః. 56

ఏకాగ్ర చిత్తుడైన దక్షుడు, యజ్ఞావశిష్టమైన రుద్ర భాగముచే రుద్రుని పూజించెను. ఏ కర్మచేత యజ్ఞము సమాప్తి చేయబడునో ఆ ఉదవసానేష్టిని చేసి సోమము నందు భాగముగల ఇతర దేవతలను గూడా పూజించెను. సర్వ యజనానంతరము కర్మ సమాప్తిచేసి అవభృథ స్నానము చేసెను. 56

శ్లో॥ ఉదవస్య సహర్త్విగ్భిస్స స్నావవభృథం తతః ।
తస్మా అప్యనుభావేన స్వేనైవావాప్తరాధసే ॥ 57

తన ప్రభావముచేతనే సిద్ధి పొందినప్పటికిగూడా, దేవతలకు ధర్మముయందు మాత్రమే బుద్ధి నిలుచునట్టుగా అనుగ్రహించి స్వర్గమునకు వెళ్ళిరి. 57

శ్లో॥ ధర్మ ఏవమతిం దత్త్వాత్రిదశాస్త్రిదివం యయుః ।
ఏవం దాక్షాయణీ దేవి త్యక్త్వా పూర్వకళేబరమ్ ॥ 58

టీ:- ఉదవస్యేతి. తతశ్చ ఉదవస్య కర్మ సమాప్య అవభృథరూపం యథా భవతి తథా స్నాతవాన్. స్వేనైవానుభావేన. అవాప్తరాధసే ప్రాప్తసిద్ధయే. (57-58)

శ్లో॥ జజ్ఞే హిమవతః క్షేత్రే మేనాయామితి శుశ్రుమ ।
తమేవ దయితం భూయ ఆవృఙ్క్తే పతిమంబికా ॥ 59

టీ:- జజ్ఞ ఇతి. ఆవృఙ్క్తే భజతేస్మ. 59

శ్లో॥ అనన్యభావైకగతిం శక్తిస్సుప్తేవ పూరుషమ్ ।
ఏతద్భగవతశ్శంభోః కర్మ దక్షాధ్వర ద్రుహః ।
శ్రుతం భాగవతాచ్ఛిష్యాదుద్ధవాన్మే బృహస్పతేః ॥ 60

టీ:- అనన్యేతి. అనన్యభావానాం ఏకైవ గతిర్యస్య తం. ప్రళయకాలే సుప్తాశక్తిరీశ్వరమివ. బృహస్పతేశ్శిష్యాత్ మే మయా శ్రుతం. 60

ఈ విధముగా దక్షపుత్రి సతీదేవి పూర్వ దేహమును విడిచి హిమవంతుడి భార్యయగు మేనకయందు జన్మించెనని వింటిమి. ప్రళయ కాలమున భగవంతునియందు నిద్రించిన శక్తి సృష్టి కాలమున పునరుత్థానము చెంది, ఈశ్వరుని చేరినట్లు వేరొకవైపు మనస్సును పోనియక ఈతడియందే నిలిపిన మనస్సు గలవారికి దిక్కైనవాడైన ఆ పరమశివుని, అంబిక తిరిగి భర్తగా (భజించెను) పొందెను. 58, 59

దక్షుడి యజ్ఞమును వినాశము చేసిన భగవంతుడైన శివుడి ఈ అద్భుత కర్మను బృహస్పతి శిష్యుడు, భక్తుడైన ఉద్ధవుడి నుండి వింటిని. 60

శ్లో॥ ఇదం పవిత్రం పరమీశచేష్టితం
యశస్యమాయుష్య మఘౌఘమర్షణమ్ ।
యో నిత్యదాకర్ణ్య నరోనుకీర్తయే
నోత్యఘం కౌరవ భక్తి భావతః ॥ 61

టీ:- ఇదమితి. పరం పవిత్రం యః ఆకర్ణ్య తథా అనుకీర్తయేత్. ఆత్మనః పరస్యాప్యఘం. సంసార వ్యసనం. సర్వదా ధునోతి. 61

ఓ విదురా! పాపనాశకము, ఆయుప్రదానకము. కీర్తికరములగు, మిక్కిలి పవిత్రమైన పరమేశ్వరుడి ఈ అద్భుత లీలలను ఎవరైతే విని, భక్తి పురస్సరముగా కీర్తించునో అట్టి మానవుడు తన యొక్క మరియు ఇతరుల యొక్క సంసార మోహమును పోగొట్టును. 61

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,**
**సప్తమోఽ ధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు**
**ఏడవ అధ్యాయము సమాప్తము.**

## అష్టమోఽధ్యాయః

శ్లో॥ మనుకన్యాన్వయే ప్రాప్తా దక్షయజ్ఞ కథోదితా ।
మనుపుత్రాన్వయే ప్రాప్తా ధ్రువ చర్యథ పంచభిః ॥

అష్టమే గురుదారోక్తిరోషమత్సరతః పురాత్ ।
నిర్గతేన ధ్రువేణాహ తపసా తోషణం హరేః ॥

## 8వ అధ్యాయము

ఈ ఎనిమిదవ అధ్యాయమున ధ్రువుడు తన సవతి తల్లియన్న మాటలకు రోషాశ్చర్యములచే పురమును విడిచి వెళ్ళి తపస్సు ద్వారా శ్రీహరిని ప్రసన్నుడిని చేసుకోవడం వివరింపబడినది. ( ఈ విధముగా మనుకన్యా వంశమును చెప్పుటచేతనే బ్రహ్మపుత్రులైన మరీచ్యాదుల వంశమును గూర్చి చెప్పడం జరిగింది. అక్కడ మిగలిన వంశమును గూర్చి చెప్పుచున్నాడు.

### మైత్రేయ ఉవాచ

శ్లో॥ సనకాద్యా నారదశ్చ ఋభుర్హంసోఽరుణిర్యతిః ।
నైతే గృహాన్బ్రహ్మసుతా హ్యావసన్నూర్ధ్వరేతసః ॥ 1

టీ:- ఏవం తావన్మనుకన్యాన్వయోక్త్యైవ. మరీచ్యాదీనాం బ్రహ్మ పుత్రాణాం. వంశాః వర్ణితాః. తత్రావశిష్టం కించిదాహ-సనకాద్యా ఇతి. నావసన్ నాశ్రితాః ఊర్ధ్వరేతసః నైష్ఠికాః. అతస్తేషాం వంశోనాస్తి. 1

### మైత్రేయుడు పలుకుచున్నాడు.

సనక, సనందన, సనాతన, సనత్కుమారులు, నారదుడు, ఋజు, హంసుడు, అరుణి, యతి వీరు బ్రహ్మదేవుడి పుత్రులు. వీరు నైష్ఠికులగుటచేత గృహస్థాశ్రమమును స్వీకరించలేదు. అందుచేత వీరికి వంశము లేదు. 1

శ్లో॥ మృషా ధర్మస్య భార్యాసీద్దంభం మాయాం చ శత్రుహన్ ।
అసూత మిథునం తత్తు నికృతిర్జగృహేఽప్రజః ॥ 2

టీ:- అధర్మోఽపి బ్రహ్మపుత్రస్తస్య వంశమాహ-చతుర్భిః. మృషేతి.

అధర్మముగూడా బ్రహ్మపుత్రుడే కావున అతడి వంశమునుగూడా వివరించుచున్నాడు. అధర్ముడి భార్య మృష (అబద్ధము) ఆమెకు ఇద్దరు సంతానము. దంభము (అనగా ఇతరులను వంచించుట), ఒక కూతురు మాయా (అనగా ఆ వంచనకు అవసరమైన చేష్ట). వీరు

దంభః పరప్రతారణం. మాయా తదుచితా చేష్టా. అప్రజః అపుత్రః. 2

ఒకతల్లి పిల్లలైనప్పటికీ దాంపత్యమును పొందిరి. అధర్మ అంశలు కనుక సంతానములేని నిఋరుతి ఈ జంటను తీసుకువెళ్ళెను. 2

శ్లో॥ తయోస్సమభవల్లోభో నికృతిశ్చ మహామతే ।
తాభ్యాం క్రోధశ్చ హింసా చ యద్దురుక్తి స్స్వసాకలేః ॥ 3

టీ:- తయోరితి తయోస్సోదరయోరపి దాంపత్యం అధర్మాంశతయా. ఏవముపర్యపి నికృతిశ్శంతతా. యత్ యాభ్యాం. కలిశ్చ తస్య స్వసాదురుక్తిశ్చేత్యర్థః. 3

ఈ దంభ, మాయలకు లోభము, (నికృతి అనగా శఠతా = మొండితనం అనువారు పుట్టిరి) వారికి క్రోధము, హింసయను వారు సంతానముగా కలిగిరి. అధర్మఅంశలు కావున వారు వావి వరుసలులేక దంపతులై కలిసి, కలిని, అతడికి చెల్లెలు, దురుక్తిని (చెడుమాటలను) కనిరి. 3

శ్లో॥ దురక్తౌ కలిరాధత్త భయం మృత్యుం చ సత్తమ ।
తయోశ్చ మిథునం జజ్ఞే యాతనా నిరయస్తథా ॥ 4

శ్లో॥ ఏతేహ్యధర్మ వృక్షస్య శాఖాస్సంసృతి హేతవః ।
శ్రేయస్కామో న సేవేత సుతరామాశ్ర మోత్తమః ॥ 5

టీ:- దురుక్తావితి. యాతనా తీవ్రవేదనా. (4-5)

దురుక్తియందు కలి, భయమును, మృత్యువును తన సంతానమునుగా కనెను. భయ, మృత్యువులకు యాతనా(అనగా తీవ్రవేదన) నిరయుడు (దోషము) కుమారులు కలిగిరి. (4-5)

శ్లో॥ సంగ్రహేణ మయాఖ్యాతః ప్రతిసర్గస్తవానఘ ।
త్రిశ్శ్రుత్వైతత్పుమాన్పుణ్యం విధునోత్యాత్మనో మలమ్ ॥ 6

టీ:- సంగ్రహేణేతి. ప్రతిసర్గః అనుసర్గ ఏవ. యద్వా ప్రతిసర్గః ప్రళయః. అధర్మస్య ప్రళయహేతుత్వాత్. ప్రతిసర్గత్వం హేతుః ఏతత్. ఏతం. అధర్మవంశం. పుణ్యమితి వర్జనద్వారా పుణ్యహేతుత్వాత్. 6

ఓ విదురా! నీకు ప్రతిసర్గను (అనగా భౌతికసృష్టిని) చెప్పితిని లేదా ప్రతిసర్గ యనగా ప్రళయమునుగూర్చి చెప్పితిని. సంక్షిప్తముగా అధర్మము తీవ్రమైనప్పుడు ప్రళయము వచ్చును. ప్రళయకారణము కనుక అధర్మ చరితము. ప్రతిసర్గము, ఏ మానవుడైతే ఈ అధర్మ చరితమును మూడుమార్లు వినునో సమస్త పాపములనుండి విముక్తిని పొందును. పుణ్యము సిద్ధించును. (కారణం అధర్మ వంశమునుగూర్చి తెలుసుకొని వాటిని వినడంవలన.) 6

శ్లో॥ అథాతః కీర్తయే వంశం పుణ్యకీర్తేః కురూద్వహ ।
స్వాయంభువస్యాపి మనోర్హరేరంశాంశ జన్మనః ॥ 7

టీ:- అథేతి. మనోః పుత్రవంశః. హరేరంశో బ్రహ్మా. తస్య అంశాత్ దేహార్ధాజ్జన్మ యస్య. 7

కురుశ్రేష్ఠుడవైన ఓ విదురా! పూర్వము కొంత చెప్పి వదిలిన కారణముగా పవిత్ర కీర్తి కలిగిన హరియొక్క అంశ బ్రహ్మ. ఆ బ్రహ్మ శరీర సగభాగమునుండి పుట్టిన స్వాయంభువమనువు ఆ మనువు పుత్ర వంశమును ఇప్పుడు కీర్తిస్తాను. 7

శ్లో॥ ప్రియవ్రతోత్తానపాదౌ శతరూపాపతేస్సుతౌ ।
వాసుదేవస్య కలయా రక్షాయాం జగతస్థితౌ ॥ 8

టీ:- ప్రియవ్రతేతి. జగతః రక్షాయాం స్థితౌ. 8

శతరూప, స్వాయంభువమనువునకు ఇద్దరు కుమారులు. ప్రియవ్రత, ఉత్తానపాదులు. వారు వాసుదేవుడి అంశనుండి పుట్టి జగద్రక్షణయందు స్థిరముగా యున్నారు. 8

శ్లో॥ జాయే ఉత్తానపాదస్య సునీతిస్సురుచిస్తయోః ।
సురుచిః ప్రేయసీ పత్యుర్నేతరా యత్సుతో ధ్రువః ॥ 9

టీ:- జాయే ఇతి. తస్య సునీతిస్సురుచిశ్చేతి ద్వే జాయే. తయోర్మధ్యే. ఇతరా సునీతిః అప్రియా. 9

ఉత్తానపాదుడికి ఇద్దరు భార్యలు. సునీతి, సురుచి. వారిద్దరిలో సురుచియందు ఇతడికి ప్రేమ ఎక్కువ. ధ్రువమాత సునీతియందు ఈ ప్రేమలేదు. 9

శ్లో॥ ఏకదా సురుచేః పుత్రమంకమారోప్య లాలయన్ ।
ఉత్తమం నారురుక్షంతం ధ్రువం రాజాభ్యనందత ॥ 10

టీ:- తయోః ప్రియా ప్రియత్వే ప్రపంచయన్. ధ్రువచరిత్రమాహ -పంచభిరధ్యాయైః ఏకదేతి. సురచేః పుత్రం ఉత్తమసంజ్ఞం. లాలయన్. (10)

ఒకనాడు ఉత్తానపాదుడు సురుచి పుత్రుడైన ఉత్తముడిని (పేరుకు మాత్రమే ఉత్తముడు) తనతొడపై కూర్చోపెట్టుకొని లాలించుతూ అంకమును ఎక్కపోయిన ధ్రువుడిని అంగీకరించలేదు. 10

శ్లో॥ తథా చికీర్షమాణాం తం సపత్న్యాస్తనయం ధ్రువమ్ ।
సురుచిశ్శృణ్వతో రాజ్ఞస్సేర్ష్య మహాతిగర్వితా ॥ 11

టీ:- తథేతి. తథా అంకారోహణం చికీర్షమాణం. 11

ఈ ప్రకారముగా అంకమును ఎక్కపోవుచున్న సపత్నీ (సవితి) కుమారుడైన ధ్రువుడిని రాజు వినుచుండగా అతి గర్వితయైన సురుచి ఈర్ష్యతో ఈ విధముగా మందలించెను. 11

శ్లో॥ న వత్స నృపతేర్ధిష్ణ్యం భవానారోఢుమర్హతి ।
న గృహీతో మయా యత్త్వం కుక్షావపి నృపాత్మజః ॥ 12

టీ:- గర్వోక్తిమాహ-త్రిభిః. నేతి. నృపతేర్ధిష్ణ్యం ఆసనం నృపాత్మజోఽపి భవాన్. ఆరోఢుం వార్హతి. (12-13)

ఇచ్చట మూడుశ్లోకాలతో ఆ సురుచి గర్వోక్తులు పలుకుచున్నది. నాయనా నీవు రాజకుమారుడవైనప్పటికీ, నీవు నాకడుపునపుట్టలేదు కనుక, రాజుగారి ఆసనముయందు (అంకము) కూర్చొనుటకు అర్హుడవు కావు. 12

శ్లో॥ బాలోఽసి బత నాత్మానమన్యస్త్రీ గర్భ సంభృతమ్ ।
నూనం యస్య భవాన్వేద దుర్లభేఽర్థే మనోరథః ॥ 13

అయ్యో! పాపం నీవు నిన్ను నాకడుపులో కాక వేరేస్త్రీ గర్భమున పుట్టినావని తెలుసుకోలేక పోతున్నావు. అందుకొరకే నీకు పొందరాని విషయమున కోరిక కలిగినది. 13

శ్లో॥ తపసారాధ్య పురుషం తస్యైవానుగ్రహేణ మే ।
గర్భేత్వం సాధయాత్మానం యదీచ్ఛసి నృపాసనమ్ ॥ 14

టీ:- తపసేతి. పురుషం ఈశ్వరం. 14

ఒకవేళ నీవు రాజుగారి తొడపైన కూర్చోవాలి అని కోరుకుంటే తపస్సుచేసి ఆ పరమేశ్వరుడి అనుగ్రహముచే నా గర్భముయందు పుట్టుము. 14

మైత్రేయ ఉవాచ

శ్లో॥ మాతుస్సపత్న్యాస్స దురుక్తివిద్ధః
శ్వసన్రుషా దండహతో యథాఽహిః ।
హిత్వా మిషంతం పితరం సన్న వాచం
జగామ మాతుః ప్రరుదన్ సకాశమ్ ॥ 15

టీ:- మాతురితి. మిషంతం పశ్యంతం సన్నవాచం కుంఠితవాచం. 15

మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

సవతితల్లి చెడుమాటలచే గాయపడినవాడై ఆ ధ్రువుడు ఏ విధముగానైతే కర్రతో కొట్టబడిన పాము బుస కొడుతుందో ఆ విధముగా కోపముతో నిట్టూర్పులను విడుస్తూ మాట్లాడచేతగాక ఊరకే చూస్తూఉన్న తండ్రిని విడిచి ఏడుస్తూ తల్లివద్దకు వచ్చినాడు. 15

శ్లో॥ తం నిశ్శ్వసంతం స్ఫురితాధరోష్ఠం
సునీతి రుత్సంగముదూహ్య బాలమ్ ।
నిశమ్య తత్పౌరముఖాన్నితాంతం సా
వివ్యథే యద్గదితం సపత్న్యా ॥ 16

టీ:- తమితి. ఉదూహ్య ఆరోప్య. అంతఃపురజనముఖాచ్ఛ్రుత్వా. 16

క్రిందిపెదవు వణుకుచుండగా నిట్టూర్పులు విడుచుచున్న ఆ ధ్రువుడిని సునీతి తన ఒడిలో కూర్చోపెట్టుకొని తన సపత్ని సురుచి మాట్లాడిన మాటలు అంతఃపురజనుల ముఖమునుండి విని వ్యధ చెందినది. 16

శ్లో॥ సోత్సృజ్య ధైర్యం విలలాప శోక
దావాగ్నినా దగ్ధలవతేవ బాలా ।
వాక్యం సపత్న్యాస్స్మరతీ సరోజ
శ్రియా దృశా బాష్పకలా మువాహ ॥ 17

టీ:- సేతి. శోక ఏవ దావాగ్నిః. తేన దావాగ్నినా. దగ్ధా లతేవ స్థితా. సా బాలా. విలలాప విలాపం చకార. 17

ఆ వ్యధ చెందిన సునీతి శోకమనే దావాగ్నిచే (దావాగ్ని అనగా అడవిలో రెండు చెట్ల రాపిడిద్వార పుట్టిన అగ్ని) దావాగ్ని మధ్యగల తీగలవలె వడలిపోయెను. ధైర్యములేనిదై విలపించెను. తనసపత్ని మాట్లాడిన మాటలు పదేపదే జ్ఞాపకము వచ్చి, తామర కమలములవంటి కన్నుల నుండి నీరు ధారగా ప్రవహించుచుండెను. 17

శ్లో॥ దీర్ఘం శ్వసంతీ వృజినస్య పార
మపశ్యతీ బాలకమాహ బాలా ।
మామంగళం తాత పరేష్వమంస్థా
భుంక్తే జనో యత్పర దుఃఖద స్తత్ ॥ 18

అమాయకురాలైన సునీతి దీర్ఘముగా నిట్టూర్చినది. తన దుఃఖమునకు అంతము కానరానిదై ఆ బాలకునితో ఇట్లనినది. నాయనా! పురుషుల విషయమున అశుభమును తలపోయరాదు. ఎందులకనగా ఇతరులకు ఎవడైతే దుఃఖమును కలిగించునో వాడు ఇతరులకు కల్పించిన దుఃఖమునే స్వయముగా అనుభవించును. 18

టీ:- దీర్ఘమితి. వృజినస్య దుఃఖస్య అమంగళమపరాధం. పరేషు మామంస్థాః యత్ యతః. పరేభ్యో దుఃఖం దదాతి యః స్వదత్తమేవ తద్దుఃఖం భుంక్తే. 18

శ్లో॥ సత్యం సురుచ్యాభిహితం భవాన్మే
యద్దుర్భగాయా ఉదరే గృహీతః ।
స్తన్యేన వృద్ధశ్చ విలజ్జతే యాం
భార్యేతి వా వోఢుమిడస్పతిర్మామ్ ॥ 19

నాయనా! సురుచి చెప్పినమాటలు సత్యం, మహారాజు నన్ను భార్య కాదు కదా! దాసీగా స్వీకరించుటకైనను సిగ్గుపడుచున్నాడు, దురదృష్టవంతురాలినైన నా గర్భమున పుట్టినావు. ఈ దురదృష్టవంతు-రాలి స్తన్యముచే పెరిగినావు. 19

టీ:- సత్యమితి. దుర్భగాయా ఉదరే. గృహీతః తస్యాఏవ స్తన్యేన వృద్ధశ్చ. దుర్భగత్వమేవాహ. యాం మాం. ఇడస్పతిర్భూపతిః. భార్యేతి వోఢుం స్వీకర్తుం. విలజ్జతే. వా శబ్దాద్దాసీత్యపి. 19

శ్లో॥ ఆతిష్ఠతత్తాత విమత్సర స్త్వముక్తం
స్వమాత్రాపియదవ్యలీకమ్ ।
ఆరాధయాధోక్షజ పాదపద్మం
యదీచ్ఛసేఽధ్యాసన ముత్తమో యథా ॥ 20

నాయనా! నీవు తల్లితో సమానురాలైన పినతల్లిచే 'తపస్సుచే పరమేశ్వరుడిని ఆరాధించు" అని ఏ సత్యము చెప్పబడినదో దానిని, ద్వేషము లేనివాడవై ఆచరించుము. నీవు ఉత్తముడివలె శ్రేష్ఠమైన ఆసనమును కోరితే అధోక్షజుడి పాదపద్మములను ఆరాధించుము. 20

టీ:- ఆతిష్ఠేతి. పితృ భార్యాత్వేన. స్వమాత్రా మాతుస్సపత్నీ తయాపి. యదుక్తం. తప సారాధ్య పురుషమిత్యాది. తత్. ఆతిష్ఠ కురు. అధ్యాసనం అధికం సర్వోత్కృష్టం ఆసనం యదీచ్ఛసి. 20

శ్లో॥ యస్యాంఘ్రిపద్మం పరిచర్య విశ్వ
విభావనాయాత్తగుణాభిపత్తేః ।
అజోఽధ్యతిష్ఠత్ఖలు పారమేష్ఠ్యం
పదం జితాత్మశ్వస నాభివంద్యమ్ ॥ 21

టీ:- యస్యేతి. పరిచర్య నిషేవ్య విశ్వస్య విభావనాయ పాలనాయ ఆత్తా స్వీకృతా. గుణాభిపత్తిః సత్త్వగుణాధిష్ఠానం యేన తస్య. జితః ఆత్మా మనః శ్వసనః ప్రాణవాయుశ్చ యైస్తైః. అభివంద్యం. 21

ఈ చరాచర విశ్వమును పరిపాలించుటకు సత్వగుణము, అధిష్ఠానము ఎవరికో, మనస్సును, ప్రాణములనుగూడా జయించిన వారికి ఏ పాదములు అభివంద్యములో, ఏ పదముల నాశ్రయించి బ్రహ్మదేవుడు సర్వోన్నతమైన స్థానమును పొందినాడో. 21

శ్లో॥ తథా మనుర్వో భగవాన్పితామహో
యమేకమత్యా పురుదక్షిణైర్మఖైః ।
ఇష్ట్వాభి పేదే దురవాపమన్యోతో
భౌమం సుఖం దివ్యపథాపవర్గ్యమ్. ॥ 22

టీ:- తథేతి. ఏకామత్యా సర్వాంతర్యామిదృష్ట్యా. 22

నాయనా! మీ తాతగారైన భగవాన్ మనువు, సర్వాంతర్యామి అను దృష్టిచే పరమాత్మను గొప్పనైన దక్షిణలచే గూడిన యజ్ఞములచే ఆరాధించి, ఇతర మార్గములచే పొందశక్యముగాని భూలోక సుఖము -లను, స్వర్గభోగములను, మోక్షసుఖమును కూడా పొందెను. 22

శ్లో॥ తమేవ వత్సాశ్రయ భక్తవత్సలం
ముముక్షుభిర్మృగ్య పదాబ్జ పద్ధతిమ్ ।
అనన్యభావే నిజధర్మ భావితే
మనస్యవస్థాప్య భజస్వ పూరుషమ్ ॥ 23

నాయనా ధ్రువా! సేవకులయందు దయ కలిగిన, మోక్షేచ్ఛగల వారిచే వెతకబడే పాదపద్మములే మార్గముగా కలిగిన ఆ శ్రీహరినే శరణువేడుము. వేరే వాటియందు ఆసక్తి పొందని భక్తి భావముచే శోధితమైన మనస్సున ఆ పరమపురుషుడిని స్థిరముగా నిలిపి భజించుము. 23

టీ:- తమితి. మృగ్యా పదాబ్జయోః పద్ధతిః మార్గోయస్య. తమేవాశ్రయ శరణం వ్రజ తథా భజస్వ. న అన్యస్మిన్ భావో యస్య తస్మిన్. నిజధర్మై ర్భావితే శోధితే. 23

శ్లో॥ నాన్యం తతః పద్మ పలాశ లోచనా
ద్దుఃఖచ్ఛిదం తే మృగయామి కంచన ।
యో మృగ్యతే హస్త గృహీత పద్మయా
శ్రియేతరైరంగ విమృగ్యమాణయా ॥ 24

టీ:- తమేవేత్యనేన సూచితం. సర్వోత్తమత్వం ప్రపంచయతి-నేతి. హస్తేన గృహీత్వం దీపవత్. పద్మం యయా ఇతరైః బ్రహ్మాదిభిః. 24

బ్రహ్మాది దేవతలచేత వెతకబడుచున్న లక్ష్మీదేవి, దీపమువలె వెలుగుచున్న పద్మమును చేతిలో ధరించి, సర్వోత్తముడైన, పద్మ పత్రములవంటి కన్నులుగల ఏ శ్రీహరిని వెతుకుచున్నదో! అట్టి శ్రీహరికంటే, నీ దుఃఖమును తొలగించు ఇతరులు కానరారు. (శ్రీహరి తప్ప ఇతరులెవ్వరూ నీ దుఃఖమును తొలగించలేరని భావము) 24

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ ఏవం సజల్పితం మాతురాకర్ణ్యార్థాగమం వచః ।
సంయమ్యాత్మనాత్మానం నిశ్చక్రామ పితుః పురాత్ ॥ 25

టీ:- ఏవమితి. సంజల్పితం విలాపితం తతః అర్థసాగ్యమో యస్మాత్. (25)

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

ఈ విధముగా తల్లి ఏడుస్తూ చెప్పిన అర్థసిద్ధిని కలిగించే మాటలను విని, బుద్ధిచే మనస్సును నియంత్రించి, తండ్రిచే పాలింప-బడే పట్టణము నుండి వెడలిపోయెను. 25

శ్లో॥ నారదస్తదుపాకర్ణ్య జ్ఞాత్వా చాస్య చికీర్షితమ్ ।
స్పృష్ట్వా మూర్ధన్యఘఘ్నేన పాణినా ప్రాహ విస్మితః ॥ 26

టీ:- నారద ఇతి. తత్ర తథాభూతం వచః ఆకర్ణ్య. 26

నారదమహర్షి ధ్రువుడు చేయదలచుకున్న పనిని తెలుసుకొని ఆశ్చర్యమును పొందినవాడై పాపమును నశింపజేయు తన దివ్య హస్తమును ధ్రువుని శిరస్సున ఉంచి ఈ విధముగా పలికెను. 26

శ్లో॥ అహో తేజః క్షత్రియాణాం మానభంగమమృష్యతామ్ ।
బాలోఽప్యయం హృదా ధత్తే యత్స మాతురసద్వచః ॥ 27

టీ:- విస్మిత. ఇత్యుక్తం తదేవాహ – అహోఇతి. అహో తేజః ప్రభావః (27-28)

ఆశ్చర్యచకితుడైన నారదుడు అనుకుంటున్నాడు. ఆహా! మానభంగమును సహించని క్షత్రియుల యొక్క ప్రభావముగల ఈతడు పిల్లవాడైనప్పటికీ, సవతితల్లి దుష్టవాక్కులను హృదయమునకు స్వీకరించినాడే! 27

నారద ఉవాచ

శ్లో॥ నాధునాప్యవమానం తే సమ్మానం వాపి పుత్రక
లక్షయామి కుమారస్య రక్తస్య క్రీడనాదిషు ॥ 28

**నారదుడనుచున్నాడు.**

ధ్రువా! ఈ చిన్నవయస్సులో క్రీడలయందు ఆసక్తుడుగాగల సందర్భములో నీకు అవమానము కాని సమ్మానము కాని తెలియవు. 28

శ్లో॥ వికల్పే విద్యమానేఽపి న హ్య సంతోషహేతవః ।
పుంసాం మోహమృతే భిన్నాయల్లోకే నిజకర్మభిః ॥ 29

టీ:- వికల్ప ఇతి. వికల్పే మానవామాన వివేకే సత్యపి. మోహంవినా. భిన్నాః వ్యతిరిక్తాః. నసంతి. కింతు మోహవికల్పితా ఏవేత్యర్థః కుతః యత్ సుఖం దుఃఖం వా లోకే తత్ నిజకర్మభిరేవ భవతి యతః. 29

మానావమానముల వివేకము నీకున్నప్పటికీ వాటినుండి కలిగే దుఃఖములకు, మోహముకన్నా వేరు కారణములేదు. అజ్ఞానమే కారణము. దుఃఖముగాని, సుఖముగాని లోకములో తను చేసుకొన్న కర్మానుసారమే కలుగుతుంది. 29

శ్లో॥ పరితుష్యేతత్తస్తాత తావన్మాత్రేణ పూరుషః ।
దైవోపసాదితం యావదీక్ష్యేశ్వరగతిం బుధః ॥ 30

టీ:- ఏతదేవ ఉపశమోపదేశేన నివర్తయతి షడ్భిః - పరితుష్యేదితి. ఈశ్వరగతిం వీక్ష్య. ఈశ్వరానుకూల్యం వినా నోద్యమాః ఫలహేతవ ఇతి జ్ఞాత్వా. పరితుష్యేత్ సంతోషమేవ కుర్యాత్. 30

శ్లో॥ అథ మాత్రోపదిష్టేన యోగేనావరురుత్ససి ।
యత్ప్రసాదం స వై పుంసాం దురారాధ్యో మతో మమ ॥ 31

టీ:- దుష్కరస్తవాయముద్యమ ఇత్యాహ-ద్వాభ్యాం. అథేతి. యస్య ప్రసాదం. అవరురుత్ససి అవరోధుం ప్రాప్తుమిచ్ఛసి. 31

శ్లో॥ మునయః పదవీం యస్య నిస్సంగేనోరుజన్మభిః ।
న విదుర్మృగయంతోఽపి తీవ్ర యోగసమాధినా ॥ 32

టీ:- మునయ ఇతి. నిస్సంగేన. తీవ్రయోగేన యుక్తేన సమాధినా. మృగయంతోఽపి యస్య పదవీం మార్గం. న విదుః. సదేవో దురారాధ్యః (32)

ఉపశమ ఉపదేశముచే నారదుదు పిల్లవాడిని తన లక్ష్యము నుండి తొలగింపజేయుటకు ఈ విధముగా బోధించినాడు. ఈశ్వరుడి గతిని తెలుసుకొనుము. ఈశ్వరుడి ఆనుకూల్యము లేకుండా మన ప్రయత్నములు ఫలహేతువులు (అనగా ఫలవంతములు కావడానికి కారణములు) కావని తెలుసుకొని దైవము ద్వారా సమకూర్చబడిన దానిచే సంతృప్తుడు కావలెను. (సంతోషించవలెను). 30

నీ ప్రయత్నముచాలా దుష్కరమైనది అని చెపుతూ, నీవు నీతల్లి చెప్పిన ఈశ్వరారాధనయను ఉపాయముచే ఏ శ్రీహరి అనుగ్రహమును పొందగోరుచున్నావో ఆ శ్రీహరి ఆరాధించుటకు శక్యముకానివాడని నా అభిప్రాయము. 31

మహర్షులు నిస్సంగులై తీవ్రమైన ప్రాణాయామాది యోగయుక్తమైన సమాధిద్వారా అనేక జన్మలనుండి వెతుకుతున్నప్పటికీ ఆ శ్రీహరి మార్గమును తెలుసుకొనలేకపోయిరి. ఆ శ్రీహరి దురారాధ్యుడు. 32

శ్లో॥ తతో నివర్తతామేష నిర్బంధస్తవ నిష్ఫలః ।
యతిష్యతి భవాన్కాలే శ్రేయసాం సముపస్థితే ॥ 33

టీ:- తత ఇతి. శ్రేయసాం కాలే వృద్ధత్వే. 33

బాబూ! నీ ప్రయత్నము ఇప్పుడు సఫలముకాదు. అందులకా ప్రయత్నమునుండి విరమించుము! కొంతకాలమైన పిమ్మట నీకు వృద్ధావస్థ కలుగుతుంది. అప్పుడు నీవు ప్రయత్నించుము. 33

శ్లో॥ యస్య యద్దైవ విహితం సతేన సుఖ దుఃఖయోః ।
ఆత్మానం తోషయన్ దేహీ తమసః పారమృచ్ఛతి ॥ 34

టీ:- యస్యేతి. సుఖ దుఃఖయోర్మధ్యే. సుఖే సతి పుణ్యం క్షీయతే దుఃఖే సతి పాపం క్షీయత ఇత్యాత్మా నంతోషయన్. తమసః పారం మోక్షం ప్రాప్నోతి. 34

సుఖ దుఃఖములలో మానవుడికి ఏది దైవ విహితమో దానిని పొంది, సంతోషపడినవాడు అజ్ఞానపు ఆవలి ఒడ్డున అనగా మోక్షమును పొందుతాడు. సుఖమువల్ల సంతోషము కలుగును. కాని దుఃఖమును పొందికూడా ఎట్లు సంతోషపడాలి అనగా సుఖము కలిగినప్పుడు పుణ్యము క్షీణించినదని, దుఃఖము కలిగినప్పుడు పాపము క్షీణించినదని తెలుసుకొని సంతోషించాలి. మోక్షమునకు పుణ్య పాపములు రెండూ గూడా ప్రతిబంధకములే. 34

శ్లో॥ గుణాధికాన్ముదం లిప్సేదనుక్రోశం గుణాధమాత్ ।
మైత్రీం సమానాదన్విచ్ఛేన్న తాపైరభిభూయతే ॥ 35

టీ:- గుణాధికాదితి. కించ గుణైః అధికారాత్ పుంస ఇతిల్యబ్లోపే పంచమీ తం దృష్ట్వా ప్రీతింకుర్యాత్ నత్వసూయాదిత్యర్థః. అనుక్రోశం కృపాంలిప్సేత్. న తు తిరస్కారం సమానాత్ మైత్రీం న తు స్పర్ధాం. (35,36)

మానవుడు తనకంటే గొప్పగుణములను కలిగిన వారిని చూచి సంతోషించాలి తప్ప అసూయ పడకూడదు. తనకంటే తక్కువ గుణము కలిగిన వారిపై దయచూపాలి. తిరస్కారభావమును చూపకూడదు. సమాన గుణములు కలిగిన వారితో స్నేహము చేయవలె. స్పర్ధ కలిగి ఉండరాదు. ఇట్టివ్యక్తి సంసారమున తాపమును పొందదు. 35

ధ్రువ ఉవాచ

శ్లో॥ సోఽయం శమో భగవతా సుఖదుఃఖహతాత్మనామ్ ।
దర్శితః కృపయా పుంసాం దుర్దర్శోఽస్మద్విధైస్తు యః ॥ 36

ధ్రువుడు ఈ విధముగా పలికెను.

మీరు ఉపదేశించిన ఈ శాంతచిత్తత్వమును సుఖ దుఃఖములచే హతులైన వారికి (చేతకాని వారికి) దయతో చూపెట్టిన మార్గము మా వంటి వారికి మాత్రము తలపోయుటకు శక్యముకాదు. 36

శ్లో॥ అథాపి మేఽవినీతస్య క్షాత్త్రధర్మముపేయుషః ।
సురుచ్యా దుర్వచోబాణైర్నభిన్నే శ్రయతే హృది ॥ 37

టీ:- అథేతి. క్షాత్రం స్వభావం ప్రాప్తవతః. అత ఏవావినీతస్య. దుర్వాక్యబాణైర్భిన్నే హృది. న శ్రయతే న తిష్ఠతి. 37

అయినప్పటికీ తలవంచుట ఎరుగని ఉగ్రమైన క్షత్రియత్వము స్వభావముగా గలిగి, సురుచియొక్క చెడుమాటలనే బాణములచే గాయమైన నా హృదయములో శాంతత్వము నిలువదు. 37

శ్లో॥ పదం త్రిభువనోత్కృష్టం జిగీషోస్సాధువర్త్మ మే ।
బ్రూహ్యస్మత్పితృభిర్బ్రహ్మన్నన్యైరప్యనధిష్ఠితమ్ ॥ 38

టీ:- పదమితి. అన్యైర్యనధిష్ఠితం. త్రిభువనే ఉత్కృష్టం పదం జేతుమిచ్ఛోర్మే సాధు వర్త్మ. మార్గం బ్రూహి. 38

హే బ్రహ్మన్! మా పూర్వీకులచేకాని, ఇతరులచేకాని పొందబడని మూడు లోకములలో గొప్పదైన స్థానమును జయించాలని కోరిక కలిగిన నాకు చక్కని మార్గమును చూపించుము. 38

శ్లో॥ నూనం భవాన్భగవతో యోఽంగజః పరమేష్ఠినః ।
వితుదన్నటతే వీణాం హితాయ జగతోఽర్కవత్ ॥ 39

నీవు భగవంతుడైన బ్రహ్మదేవుడి ఒడిలోనుండి పుట్టినాడవు. ప్రపంచమునకు మేలు జరగాలని వీణను మీటుతూ సూర్యుడివలె సంచరిస్తూ ఉంటావు. 39

టీ:- నూనమితి. అంకజ ఇతి పాఠే. శ్లో. "ఉత్సంగాన్నారదో జాతః" ఇతి. యస్స భవాన్. తత్ర లింగం వీణాం. వితుదన్ వాదయన్. జగతో హితాయాటతీతి. 39

### శ్రీనారద ఉవాచ

శ్లో॥ జనన్యాభిహితః పంథాస్స వై నిశ్శ్రేయసస్య తే ।
భగవాన్వాసుదేవస్తం భజతత్ప్రవణాత్మనా ॥ 40

### నారదుడు ఈ విధముగా పలికెను

నీ తల్లి చూపెట్టిన మార్గము నీకు సంపూర్ణముగా శ్రేయస్సును కలిగించును. ఆ శ్రేయస్సు ఏవరో తెలుసునా! భగవాన్ వాసుదేవుడే. అతడిని ఏకాగ్రచిత్తముతో భజించుము. 40

శ్లో॥ ధర్మార్థ కామ మోక్షాఖ్యం య ఇచ్ఛేచ్ఛ్రేయ ఆత్మనః ।
ఏకం హ్యేవ హరేస్తత్ర కారణం పాదసేవనమ్ ॥ 40

ఎవడైతే ధర్మార్థ కామ మోక్షములనే శ్రేయస్సును కోరుతాడో ఆయనకు పురుషార్థసిద్ధికి శ్రీహరి పాదసేవనము ఒక్కటే కారణము. 41

టీ:- జనస్యేతి. నిశ్శ్రేయసస్య అభిప్రేతార్థస్య పంథాః కో౭సావిత్యత ఆహ-భగవాన్ వాసుదేవ ఏవ. అతస్తం భజ. (40-41)

శ్లో॥ తత్తాత గచ్ఛ భద్రంతే యమునాయాస్తటం శుచి ।
పుణ్యం మధువనం యత్ర సాన్నిధ్యం నిత్యదా హరేః ॥ 42

మధువనమనే పేరు కలిగిన యమునా తీరము పుణ్యోపేత-మైనది, పరిశుభ్రమైనది, సర్వకాలముల యందు శ్రీహరి సాన్నిధ్యమును పొందినది. నీవక్కడకు వెళ్ళు. నీకు మేలుజరుగుతుంది. 42

టీ:- తదితి. మధువనం తదేవాఖ్యం తటం గచ్ఛ. యత్ర మధువనే. (42)

శ్లో॥ స్నాత్వానుసవనం తస్మిన్కాళింద్యాస్సలిలే శివే ।
కృత్వోచితాని నివసన్నాత్మనః కల్పితాసనః ॥ 43

టీ:- స్నాత్వేతి. అధ్యయనాద్యభావేఽపి. ఆత్మనః ఉచితాని యోగ్యాని. దేవతా నమస్కారాదీని కృత్వా ఇతి నియమా ఉక్తాః. ఆసన కల్పనం చ కుశాదిభిః స్వస్తికాదిభిశ్చ. 43

అధ్యయనము లేనప్పటికీ అతడికి ఏది ఉచితమో, అనగా అనుపనీతుడైన ఆయన పూజించడానికి, మంగళప్రదమైన కాళింది నదిలో మూడు పూటల స్నానము, దేవతా నమస్కారాదులను, యమ, నియమాదులను తెలిపి, కూర్చోవడానికి కుశాసనాదులను కల్పించి స్వస్తికాసనాదుల ఉపదేశించి... 43

శ్లో॥ ప్రాణాయామేన త్రివృతా ప్రాణేంద్రియ మనోమలమ్ ।
శనైర్వ్యుదస్యాభిధ్యాయేన్మనసా గురుణా గురుమ్ ॥ 44

టీ:- ప్రాణాయమేనేతి. ప్రాణేంద్రియ మనసాం మలం చాంచల్యం వ్యుదస్యేతి ప్రాణాయామ ప్రత్యాహారౌ ధారణామాహ-అభిధ్యాయేదితి షడ్భిః. గురుణా ధీరేణ మనసా. గురుం శ్రీహరిం. 44

మూడు ప్రాణాయామములచే, ప్రాణ, ఇంద్రియ, మనస్సుల యొక్క చాంచల్యమును మెల్లగా తొలగించి, (దీని ద్వారా ప్రాణాయామ ప్రత్యాహారములు తెలిపి, ధారణగూర్చి తెలిపి) ధైర్యము కలిగిన మనస్సుచే శ్రీహరిని ధ్యానించుము అని చెప్పెను. 44

శ్లో॥ ప్రసాదాభిముఖం శశ్వత్ప్రసన్న వదనేక్షణమ్ ।
సునాసం సుభ్రువం చారుకపోలం సురసుందరమ్ ॥ 45

టీ:- ప్రసాదేతి. సురేషు సుందరం. 45

శ్లో॥ తరుణం రమణీయాంగ మరుణోష్ఠేక్షణాధరమ్ ।
ప్రణతాశ్రయణం నృమ్ణం శరణ్యం కరుణార్ణవమ్ ॥ 46

అనుగ్రహించుటకు ఎల్లప్పుడూ సిద్ధముగా ఉన్నవాడు, అన్ని కాలములయందును ప్రసన్నమైన ముఖము, కనుచూపులు కలిగినట్టి చక్కటి ముక్కు, కను బొమ్మలు కిలిగి, సుందరమైన చెక్కిళ్ళు కలిగి దేవతలలోకెల్ల సుందరుడైన, యవ్వనవంతుడైన, రమణీయములైన అవయవములు కలిగిన, ఎరుపెక్కిన క్రింది పెదవి మరియు కన్నులు కలిగినట్టి, శరణువేడిన వాడికి ఆశ్రయమిచ్చునట్టి, సుఖకరమైనట్టి,

టీ:- తరుణమితి. రమనీయాని అంగాని యస్య. ఓష్ఠశ్చ ఈక్షణే చ ఓష్ఠేక్షనం. అరుణం ఓష్ఠేక్షణం ఆధారయతీతి తథా తం అరుణమోష్ఠ మీక్షణం చ ఆధారయతీతి వా. నృష్ణం సుఖరూపం. యద్వా నృష్ణం ధనం. సర్వపురుషార్థనిధిమిత్యర్థః. 46

శ్లో॥ శ్రీవత్సాంకం ఘనశ్యామం పురుషం వనమాలినమ్ ।
శంఖ చక్ర గదా పద్మైరభివ్యక్త చతుర్భుజమ్ ॥ 47

టీ:- శ్రీవత్సేతి. పురుషం పురుషలక్షణ యుక్తం. 47

శ్లో॥ కిరీటినం కుండలినం కేయూరవలయాన్వితమ్ ।
కౌస్తుభాభరణగ్రీవం పీతకౌసేయ వాసనమ్ ॥ 48

టీ:- కిరీటనమితి. కౌస్తుభాభరణం గ్రీవాయాం యస్య. 48

శ్లో॥ కాంచీకలాప పర్యస్తం లసత్కాంచన నూపురమ్ ।
దర్శనీయతమం శాంతం మనోనయన వర్ధనమ్ ॥ 49

టీ:- కాంచీతి. కాంచీకలాపేన పర్యస్తం పరివేష్టితం మనసో నయనయోర్వర్ధనం హర్షకరం. 49

శ్లో॥ పద్భ్యాం నఖ మణి శ్రేణ్యా విలసద్భ్యాం సమర్చతామ్ ।
హృత్పద్మ కర్ణికాధిష్ణ్యమాక్రమ్యాత్మన్యవస్థితమ్ ॥ 50

సర్వపురుషార్థ నిధియు, శరణుపొందదగిన కరుణాసముద్రుడు, శ్రీవత్సము చిహ్నముగా కలిగిన, మేఘమువలె నల్లనైన, పురుష లక్షణయుక్తుడైన, వనమాల ధరించిన, శంఖ చక్ర గదా పద్మములచే ప్రకాశించుచున్న నాలుగు భుజములు కలిగిన వానిని, కిరీటముకల, కుండలములు ధరించిన, భుజములయందు ధరించు కేయూరమను గుండ్రముగా యుండు ఆభరణ విశేషమును ధరించిన వాడు, కౌస్తుభమను ఆభరణమును మెడయందు ధరించిన వాడును, పసుపుపచ్చ వర్ణము కలిగిన పట్టు వస్త్రమును ధరించినవాడు, చిరుగంటల మొలతాడుచే పరివేష్టితుడును, ప్రకాశించుచున్న బంగరు అందెలు గలవాడును, మనస్సునకు, నేత్రములకు, ఆనందమును కలిగించువాడును శాంతస్వరూపము కలిగి దర్శనీయ వస్తువులలో శ్రేష్ఠమైనదగు, మణులవలె ప్రకాశించుచున్న కాలిగోటి పంక్తులచే కూడిన పాదపద్మములచే వెలుగొందుచున్న, హృదయ పద్మకర్ణికా మధ్య దేశమును ఆశ్రయించి చక్కగా అర్చించు వారల మనస్సున యున్నట్టి వానిని ధారణచేయవలెను. (45- 50)

టీ:- పద్మ్యామితి. హృత్పద్మకర్ణికాయాం. ధిష్ణ్యం మధ్యస్థానం తత్. ఆక్రమ్య సమర్చతాం. ఆత్మని మనసి స్థితం. 50

శ్లో॥ స్మయమానమభిధ్యాయేత్సాను రాగావలోకనమ్ ।
నియతేనైక భూతేన మనసా వరదర్షభమ్ ॥ 51

టీ:- ధ్యానమాహ-స్మయమానమితి. నియతేన ప్రాగుక్తయా ధారణయా సుస్థిరేణ. అతఏవ ఏకభూతేన ఏకాగ్రేణ. ధారణోక్తాని శేషణాని. ధ్యానేஉపి ద్రష్టవ్యాని. యద్వా. యథోక్తమేతదేకాదశస్కంధే. శ్లో. "నాన్యాని చింతయేద్భూయస్సుస్మితం భావయేన్ముఖమి" తి. 51

(ధ్యానమును గూర్చి చెప్పుచున్నాడు) చిరునవ్వులు చిందించు చున్నట్టి అనురాగముతోకూడిన చూపులుకల వరములిచ్చుటలో శ్రేష్ఠుడైన, ఆ శ్రీహరిని పూర్వము చెప్పబడిన ధారణచే సుస్థిరమైన ఏకాగ్రతగల మనస్సుచే ధ్యానించవలెను. ధారాణార్థమై చెప్పబడిన విశేషణములనన్నింటిని ధ్యానమునందు కూడా అన్వయించు కొనవలెను. లేదా చెప్పిన అనురాగపురస్సరమైన చిరునవ్వుల మోమును మాత్రమే ధ్యానించవలెను. ఏకాదశస్కంధమున ఈ విధముగా చెప్ప-బడినది. "వేరే వేటినీ చింతించకు. ఒక్క చిరునవ్వుల మోమును తప్ప". 51

శ్లో॥ ఏవం భగవతో రూపం సుభద్రం ధ్యాయతో మనః ।
నిర్వృత్త్యా పరయా తూర్ణం సంపన్నం న నివర్తతే ॥ 52

టీ:- సమాధిమాహ-ఏవమితి. తూర్ణం శీఘ్రం సంపన్నం సత్. 52

సమాధిని గూర్చి చెపుతూ! ఈ విధముగా భగవంతుడి మంగళ ప్రదమైన రూపమును ధ్యానించు మనస్సు సర్వోత్కృష్టమైన ఆనందమును శీఘ్రముగా పొందును. ధ్యేయమైన పరమాత్మ నుండి తిరిగిరాదు. 52

శ్లో॥ జప్యశ్చ పరమో గుహ్యః శ్రూయతాం మే నృపాత్మజ ।
యం సప్తరాత్రం ప్రపఠన్పుమాన్పశ్యతి ఖేచరాన్ ॥ 53

రాజకుమారా! నా మాట విను. అతిరహస్యమైన మంత్రమును నీవు జపించవలెను. ఈ మంత్రమును ఏడు రాత్రులు జపించిన ఆకాశ సంచారులైన వారిని దర్శించవచ్చును. 53

శ్లో॥ ఓం నమోభగవతే వాసుదేవాయ మంత్రేణా
నేన దేవస్య కుర్యాద్ద్రవ్యమయీం బుధః ॥ 54

వివేకీ! 'ఓం నమోభగవతే వాసుదేవాయ' అను దివ్య మంత్రము చేత దేశకాలముల విభాగమునెరిగి (ఏ ప్రదేశమున, ఏ ఋతువున, ఏ సమయమున, ఏ వస్తువులచే) భగవంతుని ఆరాధించవలెను తెలుసుకొని వివిధ వస్తువులచే పూజించవలెను. 54

శ్లో॥ సపర్యాం వివిధైర్ద్రవ్యైర్దేశ కాల విభాగవిత్ ।
సలిలైశ్శుచిభిర్వన్యైర్మాల్యైర్మూల ఫలాదిభిః ॥ 55

పూజించు ద్రవ్యములను గూర్చి చెబుతూ!
పవిత్రమైన నీటితో, పుష్పమాలికలతో, అడవియందు లభించు దుంపలు పళ్ళు మొదలగువాటిచే, ప్రశస్తమైన లేతగరికతో, భూర్జపత్రములచే ప్రభువునకు అత్యంత ప్రియమైన తులసితో ఆరాధించవలెను. 55

టీ:- జప్య ఇతి. జప్యో మంత్రః. (53-55)

శ్లో॥ శస్తైర్దూర్వాంకురైశ్చాన్యై స్తులస్యా ప్రియయా ప్రభుమ్ ।
లబ్ధ్వా ద్రవ్యమయీమర్చాం క్షిత్యంబ్వాదిషు చార్చయేత్ ॥ 56

టీ:- ద్రవ్యాణ్యేవాహ-శస్తైర్దూర్వాంకురైశ్చాన్యైరిత్యత్ర అన్యైరంకురైరేవ భూర్జత్వగాదిభిః, అధిష్ఠానమాహ-లబ్ధ్వా సంపాద్య. ద్రవ్యమయీం శిలాదిభిర్నిర్మితాం. 56

దేవతలను పూజించు స్థానమునుగూర్చి చెబుతూ!
పాషాణాది(చెక్క, పంచలోహాలు మొదలైన)నిర్మితమైన ప్రతిమను పొంది గానీ లేదా భూమి, నీరు మొదలగువాటి యందుగాని అర్చించవలెను. పూజా సాద్గుణ్యమునకు కారణములను చెప్పుచున్నాడు. చిత్తమునందు ధైర్యమును నిలుపుకొని మననశీలుడగువాడు శాంతుడై వాక్కును నియంత్రించుకొని, అడవిలోగల పండ్లను మితముగా భక్షిస్తూ అర్చించవలెను. (శ్రీహరిని). 56

శ్లో॥ ఆహృతాత్మా మునిశ్శాంతో యతవాఙ్మితవన్య భుక్ ।
స్వేచ్ఛావతారచరితైరచిన్త్యం నిజమాయయా ॥ 57

టీ:- పూజాసాద్గుణ్య హేతూనాహ - సార్ధద్వాభ్యాం. - ఆహృతేతి. ఆహృతాత్మా ధృతచిత్తః. మితం వన్యం భుఙ్క్త ఇతి తథా సన్ యత్కరిష్యతీతి తదానీమవతార ప్రాచుర్యాభావాత్. 57

స్వాయంభువ మన్వంతరమున అవతారప్రాచుర్యము లేక పోవడంవలన, ఉత్తమమైన కీర్తిగల భగవానుడు ఊహకందని తన మాయాశక్తి ద్వారా తను స్వేచ్ఛగా పొందే అవతారచరితములచే మనో హరమైన లీలలను చేయగలడు. ఆ లీలలను ధ్యానించవలెను. 57

శ్లో॥ కరిష్యత్యుత్తమశ్లోకస్తం ధ్యాయేద్ధృదయంగమమ్ ।
పరిచర్యా భగవతో యావత్యః పూర్వసేవితాః ।
తామంత్ర హృదయేనైవ ప్రయుంజ్యాన్మంత్రమూర్తయే ॥ 58

టీ:- కరిష్యతీతి. పూర్వసేవితాస్సేవనం కారితాః.కార్యత్వేన విహితా ఇత్యర్థః. మంత్రహృదయేన ద్వాదశాక్షరేణ. 58

పూర్వాచార్యులచే ఏ ఏ ఉపచారములు భగవంతుడికి చేయబడి నవో వాటిని, ద్వాదశాక్షర మంత్రముచే మనఃపూర్వకముగా వేదమూర్తి యైన శ్రీహరికి సమర్పించవలెను. 58

శ్లో॥ ఏవం కాయేన మనసా వచసా మనోగతమ్ ।
పరిచర్యమాణో భగవాన్భక్తి మత్పరిచర్యయా ॥ 59

టీ:- ఏవమితి. ఏవముక్తరీత్యా మనోగతం యథా భవతి తథా కాయాదిభిః. భక్తిమత్యా పరిచర్యయా పరిచర్యమాణః. 59

పూర్వము చెప్పిన ప్రకారముగా, చక్కగా కపటములేకుండా, మనస్సున నిల్చునట్టుగా శరీరముచే, వాక్కుచే, మనస్సుచే భక్తి కలిగిన పరిచర్యచే సేవింపబడు చున్న భగవానుడు భజించు వారికి ధర్మ, అర్థ, కామములలో ఏది అభిమతమో ఆ శ్రేయస్సును కల్పించు చుండును. (ప్రసాదించును) (59-60)

శ్లో॥ పుంసామమాయినాం సమ్యగ్భజతాం భావవర్ధనః ।
శ్రేయో దిశత్యభిమతం యద్ధర్మాదిషు దేహినామ్ ॥ 60

టీ:- పుంసామితి. ధర్మార్థ కామేషు యదభిమతం తచ్ఛ్రేయో దిశతీతి ద్వయోరన్వయః. 60

శ్లో॥ విరక్తశ్చేంద్రియరతౌ భక్తియోగేన భూయసా ।
తం నిరంతరభావేన భజేతాద్ధా విముక్తయే ॥ 61

టీ:- విరక్త ఇతి. విరక్తశ్చ భజేత కిమిర్థం విముక్తయే. 61

ఇంద్రియ భోగములయందు విరక్తికలవాడు, దృఢమైన భక్తి యోగముచే నిరంతరము శ్రీహరిని భజించవలెను. ఎందుకనగా ముక్తి కొరకు భజించవలెను. 61

శ్లో॥ ఇత్యుక్తస్తం పరిక్రమ్య ప్రణమ్య చ నృపార్భకః ।
యయౌ మధువనం పుణ్యం హరేశ్చరణ చర్చితమ్ ॥ 62

టీ:- ఇతీతి. హరిశ్చరణాభ్యాం. చర్చితం మండితం. 62

ఈ విధముగా నారదుడిద్వారా ఉపదేశింపబడిన ఆ రాజబాలకుడు ఆయనకు ప్రదక్షిణ నమస్కారములు చేసి, శ్రీహరిపాదపద్మముల చేత అలంకరింపబడిన పుణ్యప్రదమైన మధువనమునకు వెళ్ళెను. 62

శ్లో॥ తపోవనం గతేతస్మిన్ప్రవిష్టోఽంతఃపురం ముని ।
అభ్యర్హితార్హణో రాజ్ఞా సుఖాసీన ఉవాచ హ ॥ 63

టీ:- తపోవనమితి. అర్హితం సత్కృత్య సమర్పితం అర్హణం అర్ఘ్యాది యస్మై. 63

ధ్రువుడు తపమునకు వెళ్ళగానే నారదుడు రాజభవనములో ప్రవేశించెను. మహర్షిని మహారాజు సత్కరించి విశేషమైన, విలువగల ఉపచారములను సమర్పించెను. సుఖముగా కూర్చొన్న నారదుడు రాజుతో ఇట్లనెను. 63

**శ్రీ నారద ఉవాచ**

శ్లో॥ రాజన్ కిం ధ్యాయసే దీర్ఘం ముఖేన పరిశుష్యతా ।
కింవా నరిష్యతే కామో ధర్మో వార్థేన సంయుతః ॥ 64

టీ:- రాజన్నితి. కింవా నరిష్యతే న నశ్యతీతి. సవిమర్శః. సవితర్కః ప్రశ్నః. 64

**నారదుడు ఇట్లు పలికెను.**

రాజా! వాడిపోయిన ముఖముగల వాడవై, దీర్ఘముగా ఏమి ఆలోచించుచున్నావు. అర్థముతో కూడిన కామమునుగాని, అర్థముతో కూడిన ధర్మముగాని నశించుట లేదు కదా! 64

**రాజోవాచ**

శ్లో॥ సుతోమే బాలకో బ్రహ్మన్ స్త్రైణేనాకరుణాత్మనా ।
నిర్వాసితః పంచవర్షస్సహమాత్రా మహాన్కవిః ॥ 65

టీ:- సుత ఇతి. మాత్రాసహ నిర్వాసిత ఇతి. తస్యా అప్యనాదృత -త్వాత్. 65

**రాజు అనుచున్నాడు.**

హే బ్రహ్మర్షీ! నా చిన్నభార్యకు లొంగినవాడనై, పెద్ద భార్య యందు అనాదరణ కలిగి, ఐదుసంవత్సరముల చిన్నవాడనే దయగూడా లేకుండా, గొప్పవాడు, బుద్ధిమంతుడగు, పిల్లవాడిని తల్లితో సహా వెళ్ళగొట్టాను. 65

శ్లో॥ అప్యనాథం వనే బ్రహ్మన్మాస్మాదంత్యర్భకం వృకాః ।
శాంతం శయనాం క్షుధితం పరిమ్లాన ముఖాంబుజమ్ ॥ 66

ఓ బ్రహ్మర్షీ! అడవియందు దిక్కులేకుండా, దుర్బలుడైన పిల్లవాడిని, అలసిపోయి, ఆకలితో పద్మమువంటి ముఖము వాడిపోయి, ఎక్కడో అక్కడ పడుకొన్నవాన్ని తోడేళ్ళువచ్చి తినవుగదా! 66

శ్లో॥ అహో మే బత దౌరాత్మ్యం స్త్రీజితస్యోపధారయ ।
యోఽంకం ప్రేమ్ణా రురుక్షంతం నాభ్యనందమసత్తమః ॥ 67

టీ:- అపీతి. మాస్మాదంతి కిం స్విన్న ఖాదంతీత్యర్థః.(66-67)

హే నారదా! స్త్రీచే జయింపబడిన నాదుర్బుద్ధిని ఏమని చెప్పమంటావు. అయ్యో! ప్రేమగా నా తొడపైన కూర్చోడానికి వచ్చిన పిల్లవాడిని ఆదరించకపోతిని గదా! 67

### శ్రీ నారద ఉవాచ

శ్లో॥ మా మాశుచస్వ తనయం దేవగుప్తం విశాంపతే ।
తత్ప్రభావమవిజ్ఞాయ ప్రావృఙ్క్తే యద్యశో జగత్ ॥ 68

టీ:- మామేతి. యస్య యశః జగత్ప్రావృఙ్క్తే వ్యాప్నోతి. 68

### నారదుడు పలికెను.

ఓ రాజా! దేవదేవుడైన శ్రీహరిచే ఆత్మీయుడై రక్షితుడైన నీ కుమారునిగూర్చి, ఏ పిల్లవాడి యశస్సు ఈ జగత్తునందు వ్యాపించ గలదో, అతడి ప్రభావము తెలియక దుఃఖించవద్దు. 68

శ్లో॥ సుదుష్కరం కర్మకృత్వా లోకపాలైరపి ప్రభుః ।
ఏష్యత్యచిరతో రాజన్ యశో విపులయం స్తవ ॥ 69

ఓ రాజా! లోకపాలకులకు కూడా సాధ్యముకాని గొప్పదైన పనినిచేసి నీ కీర్తిని దశ దిశల విస్తరింపజేయుచు తొందరలోనే వస్తాడు. (69)

### మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఇతి దేవర్షిణా ప్రోక్తం విశ్రభ్య జగతీపతిః ।
రాజ్య లక్ష్మీమనాదృత్య పుత్ర మేవాన్వచింతయత్ ॥ 70

టీ:- సుదుష్కరమితి. విపులయన్ విస్తారయన్. (69-70)

### మైత్రేయుడు చెప్పచున్నాడు.

దేవర్షుల వారిచే చెప్పబడిన మాటలువిని రాజు రాజ్యలక్ష్మిని కూడా లెక్కచేయక పుత్రుడి కోసమే చింతించుచుండెను. 70

శ్లో॥ తత్రాభిషిక్తః ప్రయతస్తాముపోష్య విభావరీమ్ ।
సమాహితః పర్యచర దృష్ట్యాదేశేన పూరుషమ్ ॥ 71

టీ:- ధ్రువో మధువనే కిమకరోదిత్య పేక్షయామాహ-తత్రేతి. అభిషిక్తః స్నాతః యస్యాం ప్రాప్తస్తాం. 71

ఇక ధ్రువుడు మధువనమున ప్రవేశించి స్నానముచేసి ఆ రాత్రి ఉపవసించి మహర్షి ఉపదేశించినట్లు, ఏకాగ్రచిత్తుడై పరమపురుషుడైన హరిని పూజించెను. 71

శ్లో॥ త్రిరాత్రాంతే త్రిరాత్రాంతే కపిత్థ బదరాశనః ।
ఆత్మవృత్త్యనుసారేణ మాసం నిన్యేఽర్చయన్ హరిమ్ ॥ 72

మూడు రాత్రుల కొకమారు దేహస్థితికి అనుకూలముగా వెలగ పండ్లు, రేగుపండ్లను ఆహారముగా తీసుకుంటూ ఒక మాసము శ్రీహరిని అర్చించినాడు. 72

శ్లో॥ ద్వితీయం చ తథామాసం షష్ఠే షష్ఠేఽర్భకో దినే ।
తృణపర్ణాదిభిర్జీర్ణైః కృతాశోఽభ్యర్చ యద్ధరిమ్ ॥ 73

రెండవ నెలలో ఆరు రోజులకొకమారు ఎండిన ఆకులు, గడ్డి మొదలగు వాటినే ఆహారముగా తీసుకొని శ్రీహరిని ఆరాధించినాడు. (73)

టీ:- త్రీతి. కపిత్థాని బదరాణి చ అశనం యస్య. ఆత్మవృత్తిః దేహస్థితిః తదనుసారేణ. (72-73)

శ్లో॥ తృతీయం చానయన్మాసం నవమే నవమేఽహని ।
అబ్భక్ష ఉత్తమశ్లోక ముపాధావత్సమాధినా ॥ 74

మూడవ మాసమున తొమ్మిది రోజులకొకమారు నీటిని మాత్రమే ఆహారముగా తీసుకొనుచు ఉత్తమ కీర్తిమంతుడైన శ్రీహరిని ధ్యానించెను. అనగా ప్రతి మాసము ఆహారమును తగ్గిస్తూ తపస్సును పెంచుచున్నాడని తాత్పర్యము. 74

శ్లో॥ చతుర్థమపి వై మాసం ద్వాదశే ద్వాదశేఽహని ।
వాయుభక్షో జితశ్వాసో ధ్యాయన్ దేవమధారయత్ ॥ 75

నాల్గవనెలలో పన్నెండు రోజులకొకమారు వాయువును పీల్చి శ్వాసను నిలిపి భగవంతుడిని ధ్యానిస్తూ ప్రాణములు నిలుపుకొనెను. 75

శ్లో॥ పంచమే మాస్యనుప్రాప్తే జితశ్వాసో నృపాత్మజః ।
ధ్యాయన్బ్రహ్మపదైకేన తస్థౌ స్థాణురివాచలః ॥ 76

టీ:- తృతీయమితి. తృతీయంమాసం చ ఆనయన్. ఈషదివ నయన్. ఉపాధావదిత్యన్వయః. ప్రతిమాసమాహారనియమం తపోతిరేకం చ కృతవానిత్యర్థః. (75-76)

ఐదవ మాసము ప్రాప్తించగానే వాయుభక్షణముకూడా నిలిపి వేసి శ్వాసను నిలిపి ఆ రాజకుమారుడు ఒకే పాదముపై స్తంభమువలె కదలక నిలిచి బ్రహ్మపదమును ధ్యానించుచుండెను. 76

శ్లో॥ సర్వతో మన ఆకృష్య హృది భూతేంద్రియాశయమ్ ।
ధ్యాయన్భగవతో రూపం నాద్రాక్షీత్కించనా పరమ్ ॥ 77

టీ:- సర్వత ఇతి. భూతాని శబ్దాదీని. ఇంద్రియాణి చ ఆశేరతే యస్మిన్. తన్మనః ఆకృష్య బ్రహ్మ ధ్యాయన్. 77

భూతములు, శబ్దాది ఇంద్రియములు, ఏ మనస్సునకు అధీనమైయుండునో ఆ మనస్సును పరిపరివిధములుగా పరిగెత్తకుండా హృదయమునందు నిలిపి భగవద్రూపమును చింతిస్తూ ఇక వేరుగా దేనిని చూడలేదు. 77

శ్లో॥ ఆధారం మహదాదీనాం ప్రధాన పురుషేశ్వరమ్ ।
బ్రహ్మధారయమాణస్య త్రయో లోకాశ్చకంపిరే ॥ 78

టీ:- ఆధారమితి. ధారయమాణస్య సతః. తస్య తేజసోఽధమశక్నువంతః. కంపితాః. 78

మహతత్త్వాదులకు, అవ్యక్తమునకు (మాయాశక్తికి), పురుషునకు (జీవునకు) గూడా ప్రభువైన బ్రహ్మమును ధరించుటచే ఆ తేజమును సహించుటకు సాధ్యముకాక మూడు లోకములు గడగడలాడెను. 78

శ్లో॥ యద్యైకపాదేన సపార్థివార్భకస్తస్థౌతదంగుష్ఠ నిపీడితా మహీ ।
సనామతత్రార్థమిభేంద్రధిష్ఠితా తరీవ సవ్యేతరతః పదేపదే ॥79

టీ:- యద్యేతి. తస్య అంగుష్ఠేన. నిపీడితా ఆక్రాంతా సతీ మహీ. తత్ర తదా అర్ధం ననామ సమేఽంశకే అర్ధశబ్దస్య నపుంసకత్వా దంశాంశినోరభేదాచ్చైవం సామానాధికరణ్యం. ఇభేంద్రేణాధిష్ఠితా అత్ర దీర్ఘాభావ ఆర్షః. తరీ నౌర్యథా. పదేపదే సవ్యతో దక్షిణతశ్చ నమతి తద్వత్. 79

ఎప్పుడైతే రాజకుమారుడు ఒంటికాలి బొటనవేలిపై నిలబడెనో, అప్పుడు అతనిచే ఒత్తబడిన భూమి అర్ధభాగము వంగినది. (సగభాగము వంగినది) అర్ధ శబ్దము పుంలింగమున ప్రయోగించిన ఏదో కొంత ముక్క అను అర్థము వచ్చును. నపుంసకలింగమును ప్రయోగించిన సగభాగమనే అర్థము వచ్చును. ఇచ్చట నపుంసకమున ప్రయోగించ బడినది. అంశి భూమి, అంశము సగభాగము. అదియు రెండింటికి సామానాధికరణ్యము. (ఏకాధికరణ వృత్తిత్వం సామానాధికరణ్యం)79

శ్లో॥ తస్మిన్న భిధ్యాయతి విశ్వమాత్మనో
ద్వారం నిరుధ్యా సుమనస్యయా ధియా ।
లోకా నిరుచ్ఛ్వాస నిపీడితా భృశం
సలోకపాలాశ్శరణం యయుర్హరిమ్ ॥ 80

టీ:- అన్యదప్యాశ్చర్యమాహ-తస్మిన్నితి. తస్మిన్ ధ్రువే. విశ్వం విశ్వాత్మకం విష్ణుం ఆత్మనస్సకాశాత్. అనన్యయా ధియా. స్వాత్మభేద దృష్ట్యా. అభిధ్యాయతిసతి. కిం కృత్వా. అసుం ప్రాణం. తద్ద్వారం చ నిరుధ్య. విశ్వం ఆత్మన్యేకీకృత్య. స్వప్రాణ నిరోధే కృతే సతి. విశ్వస్య ప్రాణనిరోధో జాత ఇతి భావః. 80

ఇంకా ఆశ్చర్యకరమైన విషయమును చెప్పుచున్నాడు. ఆ ధ్రువుడు, విశ్వత్మాకుడైన విష్ణువును, తనకంటే అభేదుడుగా ఆత్మాభేద దృష్ట్యా అభిధ్యానించుచున్నాడు. ప్రాణములను, తద్వారములైన ఇంద్రియములను నిరోధించి విశ్వమును తనయందు ఏకీకరణము చేయుటవల్ల విశ్వప్రాణ నిరోధము జరిగినది. దాని ద్వారా ఉచ్ఛ్వా-సాదులు లేకుండటచే పీడను పొంది లోకపాలకులు శ్రీహరిని శరణువేడిరి. 80

దేవా ఊచుః

శ్లో॥ నైవం విదామో భగవాన్ప్రాణరోధం
చరాచరస్యాఖిల సత్వధామ్నః ।
విధేహి తన్నో వృజినాద్విమోక్షం
ప్రాప్తావయం త్వాం శరణం శరణ్యమ్ ॥ 81

టీ:- నేతి ఏవం విధం ప్రాణనిరోధం కదాచిదపి న విద్మః. అఖిల సత్త్వ ధామ్నః. సర్వప్రాణి శరీరస్య. తత్తస్మాత్. వృజినాత్. క్లేశాత్. 81

దేవతలు ఇలా పలికిరి.

హే భగవాన్! చరాచరమైన సకలప్రాణి శరీరగత ప్రాణ నిరోధ -మును ఇంతవరకు మేమెరుగము. నీవు మమ్ములను ఈ క్లేశము నుండి తప్పించుము, శరణ్యుడవైన నిన్ను శరణువేడుచున్నాము. 81

శ్రీ భగవానువాచ

శ్లో॥ మాభైష్ట బాలం తపసో దురత్యయాన్ని
వర్తయిష్యే ప్రతియాత స్వధామ ।
యతో హి వః ప్రాణ నిరోధ ఆసీ
దౌత్తాన పాదిర్మయి సంగతాత్మా ॥ 82

టీ:- మేతి. యతో బాలాత్. కోఽసౌ బాలః. కథం చ తస్మాత్ ప్రాణనిరోధ ఇత్యత ఆహ-ఉత్తానపాదస్య పుత్రః. మయి విశ్వరూపే. సంగతాత్మా ఐక్యం ప్రాప్తో వర్తత ఇతి. 82

భగవానుడు చెప్పుచున్నాడు.

ఓ దేవతలారా! శక్యముకాని ధ్రువుడి తపస్సును చూచి, మీరు భయపడకండి. అతనిని తపస్సు నుండి నేను వెనుకకు మరల్చగలను. ఎవరా బాలుడు? ఎందుకు అతడు ప్రాణనిరోధము చేసినాడనగా ఇతడు ఉత్తానుపాదుడి కుమారుడు. నా యందు ఏకాత్మ భావమును పొందియున్నాడు. ఇదియే సకల ప్రాణ నిరోధమునకు కారణము కావున మీరు మీ మీ స్థానములకు వెళ్ళండి. 82

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే, అష్టమోఽ ధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.**

## నవమోఽధ్యాయః

శ్లో॥ నవమే తు హరిం స్తుత్వా లబ్ధ్వా తస్మాద్వరాన్ ధ్రువః ।
ప్రత్యాగత్వా కరోద్రాజ్యం పిత్రా దత్తమితీర్యతే ॥

## 9వ అధ్యాయము

ఈ తొమ్మిదవ అధ్యాయమున హరిని స్తుతించి ఆయన నుండి వరాలనుపొంది ధ్రువుడు తిరిగి వచ్చి తండ్రి ఇచ్చిన రాజ్యమునేలినాడని చెప్పబడుచున్నది.

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ త ఏవముత్సన్నభయా ఉరుక్రమే
కృతావనామాః ప్రయయుస్త్రివిష్టపం ।
సహస్ర శీర్షాపి తతో గరుత్మతా
మధోర్వనం భృత్యదిదృక్షయా గతః ॥ 1

టీ:- త ఇతి. ఏవం భగవద్వాక్యేన. గత భయాః. 1

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

ఆ దేవతలు భగవద్వాక్యములచే భయము తొలగి, భగవంతుడికి నమస్కరించి దేవలోకమునకు వెళ్ళిరి. సహస్రశిరస్కుడైన భగవానుడు గూడా సేవక భక్తుడిని చూడాలను కోరికచే గరుత్మంతుడి సహితుడై మధువనమునకు వెళ్ళెను. 1

శ్లో॥ స వై ధియా యోగవిపాక తీవ్రయా
హృత్పద్మకోశే స్ఫురితం తటిత్ప్రభం ।
తిరోహితం సహసైవోపలక్ష్య
బహిస్థ్సితం తదవస్థం దదర్శ ॥ 2

టీ:- స ఇతి. స వై ధ్రువః యోగస్య విపాకేన దార్ఢ్యేన తీవ్రయా. నిశ్చలయా. గరుడాధిరూఢం పురతః స్థితమపి. యదా అంతర్దృష్టిత్వాత్

(ధ్రువుడు) యోగముయొక్క దార్ఢ్యముచే నిశ్చలమైన బుద్ధితో హృదయమనే పద్మకోశముయందు మెరుపుతీగవలె ప్రకాశించుచున్న భగవద్రూపము, గరుడారూఢుడై ఎదురుగా నిల్చొన్నప్పటికీ, అతడు అంతర్దృష్టి గలవాడగుటచే (ధ్యానిస్తూ) చూడలేదు. అప్పుడు భగవంతుడే హృదయాంతరస్థిత భగవద్రూపమును అంతర్ధానమును చేయగా, ధ్రువుడు ధ్యానమునుండి లేచి హృదంతరాళమున ఏ రూపమును చూచెనో అదే రూపమును బాహ్యప్రపంచమున చూచెను. 2

అసౌ నాపశ్యత్. తదా భగవతైవాంతస్స్వరూపమాకృష్టం. అతస్తిరోహితం ఉపలక్ష్య ఉత్థితస్సన్ తదవస్థం యాదృగంతః స్ఫురితః తాదృశం. 2

శ్లో॥ తద్దర్శనేనాగత సాధ్వసః క్షితావ
వందతాంగం వినమయ్య దండవత్ ।
దృగ్భ్యాం ప్రపశ్యన్ప్రపిబన్నివార్భక
శ్చుంబన్నివాస్యేన భుజేన చాశ్లిషన్ ॥ 3

టీ:- తదితి. ఆగతసాధ్వసః. జాత సంభ్రమః వినమయ్య ఆనతం కృత్వా. సంభ్రమమేవాహ. దృగ్భ్యాం ప్రపిబన్నివ. పశ్యన్నవందత. ఆస్యేన చుంబన్నివా వందత. భుజాభ్యామాలింగన్ని వానందతేత్యర్థః. 3

ఆ భగవద్రూప దర్శనముచేత సంభ్రమాశ్చర్యములతో శరీరమును నేలపై కఱ్ఱవలె వంచి, (ఆ రూపమును) కనుచూపులతోనే జుఱ్ఱుతూ నమస్కరించెను. ముఖముచే ముద్దించుచున్నట్టు భావిస్తూ నమస్కరించెను. భుజములచే కౌగలించుకొన్నట్టు భావిస్తూ నమస్కరించెను. 3

శ్లో॥ సతం వివక్షంత తమద్విదం హరిర్జ్ఞా
త్వాస్య సర్వస్య చ హృద్యవస్థితః ।
కృతాంజలిం బ్రహ్మమయేన కంబునా
పస్పర్శ బాలం కృపయా కపోలే ॥ 4

టీ:- స ఇతి. వివక్షంతం తద్గుణాన్వక్తుమిచ్ఛంతం. అతద్విధం స్తుత్యాదికర్తుమజానంతం. అస్య ధ్రువస్య. సర్వస్య లోకస్య చ.హృద్యవస్థితత్వాత్ జ్ఞాత్వా.బ్రహ్మమయేన వేదాత్మకేన. శంఖేన. 4

తద్గుణములను స్తుతించాలనే కోరిక కలిగిన వాడైనప్పటికీ, స్తుతించుటకు శక్తిలేని వాడగు ధ్రువుని కోరికను, (ఏ విధముగా స్తుతించాలోకూడా తెలియని) సర్వజనుల యొక్క హృదయముల యందుండు శ్రీహరి తెలుసుకొని, చేతులు జోడించిన పిల్లవాని చెక్కిళ్ళను వేదాత్మకమైన శంఖముచే తాకెను. 4

శ్లో॥ స వై తదైవ ప్రతిపాదితాం గిరం
దైవీం పరిజ్ఞాతపరాత్మనిర్ణయః ।
తం భక్తి భావోఽభ్యగృణాదసత్వరః
పరిశ్రుతోరుశ్రవసం ధ్రువక్షితిః ॥ 5

టీ:- స ఇతి. భగవతా ప్రతిపాదితం గిరం. ప్రతిపద్యేతిశేషః. ప్రతిపద్య తామితిపాఠే. తాం వేదాత్మికాం. పరిజ్ఞాతః పరాత్మనోరీశ్వర జీవయో ర్నిర్ణయో యేన సః. అతఏవ భక్త్యా. భావః ప్రేమ యస్య. అసత్వరః. త్వరా రహితః పరితః శ్రుతం విఖ్యాతం ఉరుశ్రవః కీర్తిః యస్య తం. ధ్రువా క్షితిః స్థానం యస్యేతి. భావినిర్దేశః. 5

ధ్రువుడు ఆ క్షణములోనే భగవంతుడిచే ఇవ్వబడిన దైవీవాక్కును పొంది (ప్రతిపద్యతాం, అనే పాఠమును స్వీకరించిన) వేదాత్మకమైన వాక్కును పొందినాడు. కనుక జీవేశ్వరుల స్వరూప నిశ్చయము కలవాడై, (తెలిసినవాడై) స్థైర్యముగలవాడై, సర్వత్ర వ్యాప్తిచెందిన కీర్తిగలవాడై భక్తితో నిండిన ప్రేమగలవాడై, నిశ్చయమైన స్థానముగల ఆ శ్రీహరిని (ముందు రాబోయే స్థితి నిర్దేశము చేయుచున్నవాడు) స్తుతించెను. 5

ధ్రువ ఉవాచ

శ్లో॥ యోఽంతః ప్రవిశ్య మమ వాచమిమాం ప్రసుప్తాం
సంజీవయత్యఖిల శక్తి ధరస్స్వధామ్నా ।
అన్యాంశ్చ హస్త చరణ శ్రవణ త్వగాదీ
న్ప్రాణాన్నమో భగవతే పురుషాయ తుభ్యమ్ ॥ 6

టీ:- శ్లో. శ్రీధరీయః ఈశానుగ్రహ సంప్రాప్త వాగాద్యద్భుత వృత్తిభిః ద్వాదశాదిత్యసంకాశైశ్లోకైరస్తోద్ధరిం ధ్రువః. య ఇతి. యో మే ప్రసుప్తాం

ధ్రువుడు ఈ విధముగా స్తుతించెను. (పలికెను)

ఈశ్వరానుగ్రహము ద్వారా పొందిన వాక్కుచే అద్భుతమైన వృత్తులతో పన్నెండుగురు సూర్యులచే ప్రకాశించునట్టుల పన్నెండు శ్లోకములలో శ్రీహరిని స్తుతించినాడు. ఏ పరమాత్మ నాలో ప్రవేశించి నా నిద్ర పోవుచున్న వాక్కును మేలుకొలుపుచున్నాడో(ఇక్కడ వాక్ నిద్రపోవడం అనగా బాహ్య ప్రపం చమున కేవల అన్న పానాది విషయభోగములను మాత్రమే సర్వేంద్రియాలు అనుభవిస్తు ఉండడం) ఇతరములగు చేతులు, కాళ్ళు, చర్మము మొదలగు ఇంద్రియ

లీనాం వాచం. అన్యాంశ్చ ప్రాణాన్. ఇంద్రియాణి స్వధామ్నా చిచ్ఛక్త్యా సంజీవయతి యతః అఖిలా చక్షురాది జ్ఞాన క్రియా శక్తిః ధారయతీతి తథా పురుషాయ అంతర్యామిణే. 6

ములనుగూడా తన చిచ్ఛక్తిద్వారా పునర్జీవింప చేయుచున్నాడో, అట్టి సకలశక్తిధరుడు, అనగా అఖిల చక్షురాది జ్ఞాన, క్రియాశక్తులు ఎవరిచేత ధరింపబడుచున్నాయో, అట్టి భగవంతుడైన సర్వాంతర్యామికి నమస్కారము. (భగవత్కృపద్వారా సర్వేంద్రియములు 'చిత్' మయములు కాగలవు. అప్పుడే భగవత్ప్రాప్తికి కారణములుకాగలవు)6

శ్లో॥ ఏకస్త్వమేవ భగవన్నిదమాత్మశక్త్యా
మాయాఖ్యయోరుగుణయా మహదాద్య శేషం ।
సృష్ట్వానువిశ్య పురుష స్తదసద్గుణేషు
నానేవ దారుషు విభావసువద్విభాసి ॥ 7

టీ:- నను వాగాదీంద్రియ శక్తిధరాః వహ్న్యాదయః ప్రసిద్ధాః నాహ మిత్యత ఆహ-ఏక ఇతి. అనువిశ్య పురుషః అంతర్యామీ. త్వం. ఏకఏవ. తస్యా మాయాయాః అసత్సు గుణేషు. ఇంద్రియాదిషు స్థితస్సన్ తత్తద్దేవతా రూపోనానేవ భాసి న తు త్వద్వ్యతిరేకేణ జ్ఞాన క్రియాశక్తిధరః కశ్చిదస్తీత్యర్థః. 7

'అగ్నిర్మేవాచిశ్రితః' ఇత్యాదులద్వారా వాగాది ఇంద్రియ శక్తిధరులైన, అగ్న్యాది ప్రసిద్ధ దేవతలు ఎంతో మంది గలరుగదా! అనగా ఓ భగవంతుడా! సత్త్వాది త్రిగుణాత్మకమైన మాయాశక్తిచేత మహత్తత్వము మొదలుకొని సకలజగత్తును సృజించి, వాటిలో ప్రవేశించి అంతర్యామివై నీవొక్కడివే మాయయొక్క 'అసద్గుణేషు' నిద్రితమైన విషయభోగముల యందు సత్తయైన గుణములయందు, దేహేంద్రియ దేవతాది రూపముగా పరిణమించిన కార్యములందు ఉంటున్నావు. ఏ విధముగానైతే అగ్ని ఒకటే ఐనప్పటికి కట్టెలయందు అనేకాగ్నుల వలె భాసిస్తుందో (నిజానికి అనేకాగ్నులు లేవు) ఆ విధముగా నీవు ఒక్కడివే. కాని నీకంటే వేరుగా జ్ఞానక్రియాశక్తిధరుడు వేరొకడు లేడు. కావున వాగాదిశక్తిధరులు, అగ్న్యాదులు నీవే. (నానా ఉపాధులయందు చైతన్య మొక్కటే) 7

శ్లో॥ త్వద్దత్తయా వయునయేదమచేష్ట
విశ్వం సుప్తః ప్రబుద్ధ ఇవ నాథ భవత్ప్రపన్నః ।
తస్యాపవర్గ్య శరణం తవ పాదమూలం
విస్మర్యతే కృతవిదాకథమార్త బంధో ॥ 8

టీ:- అపి చ కిమువక్తవ్యం. వహ్న్యాదయో జ్ఞానాదిశక్తిధరా న భవంతీతి యస్మాద్బ్రహ్మణోఽపి జ్ఞానం త్వదధీనమేవేత్యాహ-త్వదితి. త్వద్దత్తయా. వయునయా జ్ఞానేన. భవంతం శరణం ప్రపన్నః బ్రహ్మా. ఇదం విశ్వం. ఆచష్ట అపశ్యత్. కథం సుప్త పురుషః. ప్రబుద్ధస్సన్ యథా పశ్యతి తద్వత్. అతః యే అపవర్గ్యాః ముక్తాః. తేషామపి శరణం కృతవిదా సర్వేంద్రియజీవనేన త్వత్కృతముపకారం జానతా. కథం విస్మర్యతే ఏవంభూతం త్వామభజంతః కృతఘ్నా ఇత్యర్థః. 8

మరియు బ్రహ్మదేవుడి జ్ఞానమే నీయధీనమైనప్పుడు ఇక ఏమి చెప్పాలి? "అగ్న్యాదులు, జ్ఞానశక్తిధరులు, స్వతంత్రులు కాదు "అని నీవిచ్చిన జ్ఞానముగలిగి నిన్ను శరణువేడిన బ్రహ్మ నీ అనుగ్రహముచే జనించిన జ్ఞానముచే ఈ ప్రపంచమును చూచుచున్నాడు. ఏ విధముగా? అనగా నిద్రపోయిన వ్యక్తి లేచి మళ్ళీ ప్రపంచమును చూచినట్టుగా. అందుచేత ముక్తులకుగూడా ఆశ్రయము నీ పాదమూలము. ఉపకారము పొందిన వాడు నిన్ను ఎట్లు మరువగలడు? (మా) సర్వేంద్రియములు మరణ ప్రాయములైనప్పుడు సర్వేంద్రియ సంజీవనము ద్వారా (మాకు) నీ నుండి ఉపకారము జరిగినది కనుక నీ ఉపకారము మరచినవాడు కృతఘ్నుడే! 8

శ్లో॥ నూనం విమృష్టమతయస్తవ మాయయాతే
యే త్వా భవాప్యయ విమోక్షణమన్య హేతోః ।
అర్చంతి కల్పకతరుం కుణపోపభోగ్య
మిచ్ఛంతి యత్స్పర్శజం నరకేఽపి నృణామ్ ॥ 9

టీ:- యే చ మాదృశాః కామద్యర్థం భజంతి. తేఽతిమూఢా ఇత్యాహ

హే భగవన్! మావంటివారు కామాదుల కొరకు నిన్ను పూజించుచున్నారు. అట్టివారు అతి మూఢులే! కల్పతరువులె కోరిన కోర్కెలుతీర్చే వానిగా నిన్ను అర్చిస్తున్నారు. నీవు జన్మమరణముల నుండి విముక్తిని కలిగించేవాడవు. కాని నీనుండి ముక్తినికాక శవతుల్యమైన శరీరసుఖమునుకోరుచున్నారు.(కామధేనువు కనబడితే పొలందున్ని పెట్టుమన్నాడట ఓ మూర్ఖుడు! ఒకచోట భగవత్పాదుల

– ద్వాభ్యాం. నూనమితి. భవాప్యయౌ జన్మమరణే. తద్విమోక్షహేతుం త్వాం. అన్యహేతోః కామాద్యర్థం. యే భజంతి. తే నూనం విమృష్ట మతయః. వంచితచిత్తాః. యతస్తే కల్పతరుం త్వాం అర్చంతి. తతః కుణ పతుల్యేన దేహేన. ఉపభోగ్యం సుఖమిచ్ఛంతి. న చేచ్ఛాయోగ్యం తదిత్యాహ. యత్ యతః స్పర్శజం విషయసంబంధ జన్యం సుఖం. తన్నరకేఽపి భవతి. 9

శ్లో॥ యా నిర్వృతి స్తనుభృతాం తవ పాదపద్మ
ధ్యానాద్భవజ్జన కథా శ్రవణేన వా స్యాత్ ।
సా బ్రహ్మణి స్వమహిమన్యపి నాథ మాభూ
త్కిన్వంతకాసి లులితాత్పతతాం విమానాత్ ॥ 10

టీ:– నను స్వర్గాది సుఖం సకామైః ప్రాప్యతే. నిష్కామ భజనేన తన్నస్యాదిత్యత ఆహ–యేతి. స్వమహిమని నిజానందరూపేఽపి. మాభూత్. న భవతీత్యర్థః అంతకస్య అపి నాకాలేన. లులితాత్ఖండితామ్. విమానాత్ పతతాం సానాస్తీతికిమువక్తవ్యం. 10

దృష్టాంతం). నిజానికి అది కోరవలసిన కోరిక కాదు. ఈ సుఖము అనగా ఇంద్రియ సంయోగము ద్వారా కలిగేది, కొద్దో గొప్పో నరకమందుకూడా లభిస్తుంది. 9

భగవానుడిని సకాములై భజిస్తే స్వర్గసుఖాలు పొందవచ్చు, నిష్కామభజనలో అదిలేదుకదా? అనగా హే పరమాత్మా! దేహధారులకు నీ పాదపద్మముల ధ్యానము ద్వారా లేక నీ భక్తజనులతో కూడి నీ కథా శ్రవణము ద్వారా ఏ సుఖము కలుగుతుందో ఆ సుఖము నిజానంద రూపమైన బ్రహ్మమందుగూడా కలుగదు. (ఈ మాట కథాశ్రవణ ధ్యానస్తుత్యర్థం) స్వర్గాదులయందు విమానాల్లో సంచరిస్తున్నవారికి మృత్యువు యొక్క కాలమనే ఖడ్గముచే తెగనరకబడి ఆ విమానాల్లోనుండి కిందపడే వారి సుఖాన్ని గూర్చి ఇక ఏమి చెప్పాలి. 10

శ్లో॥ భక్తిం ముహుః ప్రవహతాం త్వయి మే ప్రసంగో
భూయాదనంతమహతామమలాశయానమ్ ।
యేనాంజసోల్బణ మురువ్యసనం భవాబ్ధిం
నేష్యే భవద్గుణ కథామృత పానమత్తః ॥ 11

టీ:- అతస్త్వత్కథా శ్రవణాయ సత్సంగతిం దేహీత్యాహ - భక్తిమితి. భక్తిం త్వయి ప్రవహతాం సాతత్యేన కుర్వతాం. నను మోక్షం కిం న యాచసే అత ఆహ-యేన మహత్ప్రసంగేన. అంజసా అయత్నత ఏవ. ఉరూణి వ్యసనాని యస్మిన్ తం. నేష్యే పారం గమిష్యామి. భగవద్గుణకథైవ అమృతం తస్య పానేన మత్తస్సన్. 11

అందుకొరకు కథాశ్రవణమునకు సత్సంగతిని ప్రసాదించుమని ఈ విధంగా అంటున్నాడు.

ఓ అనంతా! నీయందు ప్రేమాత్మకమైన భక్తి నిరంతరము ప్రవహించుగాక. శుద్ధచిత్తులైన మహాత్ముల సంగము నాకు కలుగుగాక. వీటిని అడుగుచున్నావు. ముక్తిని ఎందుకు అడగడంలేదు అనగా నీ గుణకథనమే అమృతము. సాధు సంగమముచే దానిని ఆస్వాదించి మత్తుడనై ఆనందముపొంది నేను ప్రయత్నము లేకుండగనే దుఃఖములతో గూడిన భయంకరమైన సంసార సముద్రమును దాటగలను. 11

శ్లో॥ తేన స్మరంత్యతితరాం ప్రియమీశమర్త్యం
యే చాన్వదస్సుత సుహృద్గృహ విత్త దారాః ।
యే త్వబ్జనాభ భవదీయ పదారవింద
సౌగంధ్య లుబ్ధ హృదయేషు కృత ప్రసంగాః ॥ 12

టీ:- కథామృతపానస్యమాదకత్వమాహ - తఇతి. తే అతితరాం ప్రియమపి. మర్త్యం దేహం న స్మరంతి నానుసందధతే. యే చ సుతాదయః అదః మర్త్యమనుసంబంధాః. తానపి తేన స్మరంతి. యే చ కృత ప్రసంగాస్తేషు భవదీయపదారవింద సౌగంధ్యే లుబ్ధం హృదయం

ఓ పద్మనాభా! (అబ్జనాభ)! ఓ ఈశా! నీ పాదపద్మ పరిమళముచే ఆకర్షితమైన హృదయము గలవారు నీ యందు విశేషముగా స్నేహమును, ఆసక్తిని పెంచుకొన్నవారు, అన్నింటికంటే అత్యంత ప్రియమైన దేహమునుకాని, దేహసంబంధమైన సంతానము, స్నేహితులు, గృహములు, ధనమును, భార్యాదులను గాని స్మరించరు. కథామృతముయందు ఆసక్తిలేని కేవల యోగాదులయందే శ్రద్ధగలవారికి దేహాదులయందు అభిమానముపోదు. 12

యేషాం తేషు. తు శబ్దేనాన్యేషాం కేవలయోగాది నిష్ఠానాం. దేహాభి-మానినాం. నివృత్తిం దర్శయతి. 12

శ్లో॥ తిర్యఙ్నర ద్విజసరీసృప దేవదైత్య
మర్త్యాదిభిః పరిచితం సదసద్విశేషమ్ ।
రూపంస్థ విష్ఠమజ తే మహదాద్యనీకం
నాతః పరం పరమవేద్మి న యత్ర వాదః ॥ 13

టీ:- నన్వేవం విద్వానపి త్వం కిమిత్యాత్మాభిమానం వహసీత్యత ఆహ-తిర్యగితి. తిర్యగాదిభిః పరిచితం వ్యాప్తం. సతోఽసతశ్చ విశేషాః యస్య. మహదాదీని అనేకాని కారణాని యస్య. హే పరమ అజ తే ఇదం రూపం. స్థవిష్ఠం విరాడ్రూపం కేవలం వేద్మి అతః పరం ఈశ్వర స్వరూపం న వేద్మి. యత్రవాదః. శబ్దవ్యాపారో నాస్తి తద్బ్రహ్మ స్వరూపం న వేద్మి. అతః అభిమానో న నివర్తత ఇతి భావః. 13

శ్లో॥ కల్పాంత ఏతదఖిలం జఠరేణ గృహ్ణన్
శేతే పుమాన్ స్వదృగనంతసఖస్తదంకే ।
యన్నాభి సింధురుహ కాంచన లోక పద్మ
గర్భే ద్యుమాన్భగవతే ప్రణతోఽస్మి తస్మై ॥ 14

జననాదిరహితా ఓ పరమేశ్వరా! ధ్రువా! ఇంతతెలిసినవాడవు నీవు దేహాదులయందుగాని, మనసాదులయందుగాని ఇంత అభిమానము ఎందుకు కలిగి యున్నావు అని అడుగుదువేమో!

పశువులు, చెట్లు, పక్షులు, పాములు, దేవతలు, రాక్షసులు, మానవులు మొదలగు వాటిచే వ్యాప్తమైనట్టి స్థూల సూక్ష్మభూతములతో కూడినదియు, మహతత్త్వము మొదలగు అనేక తత్త్వములు కారణములుగాగల నీ స్థూలరూపమైన కేవల విరాడ్రూపమును మాత్రమే తెలుసుకొనుచున్నాము. దీనికంటే అతీతమైన పరబ్రహ్మ స్వరూపమును తెలుసుకోలేకున్నాను. 'యతోవాచో నివర్తంతే' ఎచ్చట శబ్ద ప్రక్రియలేదో అచ్చట ఆ బ్రహ్మ స్వరూపము తెలుసుకోలేకున్నాను. అందుచేత అభిమానము తొలుగుటలేదు. 13

భగవదనుగ్రహము పొందినవాడై భగవంతుడి సగుణ, నిర్గుణ రూపములనెరిగి ఈశ్వర సాకారమును అభివర్ణించుచూ, నమస్కరించుచున్నాడు.

కల్పము పరిసమాప్తికాగా మూడులోకములను తన ఉదరమున

టీ:- తదేవం భగవదనుకంపయా. తద్రూపద్వయం జ్ఞాత్వా. ఈశ్వర స్వరూపమనువర్ణయన్నమస్కరోతి-కల్పాంత ఇతి. ఏతత్త్రైలోక్యం. యః పుమాన్ శేతే. స్వస్మిన్నేవ దృక్ న బహిర్యస్య. యోగనిద్రారూఢత్వాత్. అనంతసఖః శేష సహాయః తదంకే శేషోత్సంగే. యస్య నాభిరేవ సింధుః సముద్రః. తస్మిన్ రోహతీతి తథాతస్య కాంచనలోకపద్మస్య. గర్భే కర్ణికాయాం ద్యుమాన్. ఓజస్వీ బ్రహ్మభవతి. తం ప్రణతోఽస్మీత్యర్థః. 14

ఉంచినవాడై, తనయందే చూపుకలిగి బాహ్యపు చూపులేనివాడై అనగా యోగనిద్రారూఢుడైన ఆదిశేషుడే సహాయముగా కలిగి, శేషుడి అంకముయందు ఏ పురుషుడు నిద్రించుచున్నాడో ఎవ్వరి నాభియే సముద్రమో, దానియందు ఉదయించిన మూడు బంగారు లోకముల రూపమైన పద్మము యొక్క గర్భముయందు కాంతిమంతుడగు బ్రహ్మ ఉదయించెనో అట్టి భగవానునికి నమస్కారములు. 14

శ్లో॥ త్వం నిత్యముక్త పరిశుద్ధ విబుద్ధ ఆత్మా
కూటస్థ ఆదిపురుషో భగవాంస్త్ర్యధీశః ।
యద్బుద్ధ్యవస్థితిమఖండి తయా స్వదృష్ట్యా
ద్రష్టా స్థితావధిమఖో వ్యతిరిక్త ఆస్సే ॥ 15

టీ:- నను మమాపి స్వాపాద్యవస్థావత్త్వేకో జీవాద్విశేష ఇత్యత ఆహ-త్వమితి. త్వం తు వ్యతిరిక్తః జీవవిలక్షణః. ఆస్సే తిష్ఠసి. వైలక్షణ్యమేవాహ. త్వం తు నిత్యముక్తః. జీవస్తు త్వత్ప్రసాదాన్ముచ్యతే. త్వం పరిశుద్ధః. స తుమలినః. త్వం విబుద్ధస్సర్వజ్ఞః. స తు కించిజ్ఞః త్వం ఆత్మా. స తు జడః. త్వం కూటస్థః. సతు వికారీ. త్వం ఆదిపూరుషః స తు ఆదిమాన్. త్వం భగవాన్. సతు భగహీనః. త్వం త్రయాణాం

ధ్రువా! జీవుడివలె నిద్రాది అవస్థలు కలిగిన నాకు, జీవుడికి ఏమి భేదము? అని అందువేమో!

ప్రభూ! నీవు జీవ విలక్షణుడవై ఉన్నావు. ఆ వైలక్షణ్యమును చెప్పుచున్నాడు. నీవు నిత్య ముక్తుడవు. జీవుడేమో నీ అనుగ్రహము ఉంటే ముక్తుడు, లేనిచో లేదు. నీవు పరిశుద్ధుడవు, జీవుడు మలినుడు. నీవేమో విశేషముగా తెలిసినవాడవు, జీవుడు అజ్ఞాని. నీవు చైతన్యమువు, జీవుడు జడుడు. నీవు వికార రహితుడవు, అతడు వికారి. నీవు ఆరంభమునుండి పురుష రూపధరుడవు అథవా ఆది కారణుడవు. జీవుడు ఆది గలవాడు. నీవు షడ్గుణ ఐశ్వర్య సంపన్నుడవు, జీవుడు ఐశ్వర్య శూన్యుడు. నీవు మూడుగుణములకు అధినాయకుడవు, జీవుడు పరతంత్రుడు, ఈ భేదం ఎందుకనగా, బుద్ధి యొక్క ఆ అవస్తను

గుణానాం అధీశః. సతు పరతంత్రః. కుత ఏతద్వైలక్షణ్యం. యత్ యతః బుద్ధ్యవస్థితం బుద్ధేస్తాం తామవస్థాం అఖండితయా స్వదృష్ట్యా. చిచ్ఛక్త్యా. ద్రష్టా పశ్యసి. ద్రష్టేతి తృన్ ప్రత్యయాంతః. ప్రథమాంతం. అతో బుద్ధ్యవ స్థితిమిత్యత్ర షష్ఠ్యభావః. తథాభూత ఏవ త్వం స్థితౌ పాలనే. అధిమఖః యజ్ఞాధిష్ఠాతా శ్రీవిష్ణుః. 15

శ్లో॥ యస్మిన్విరుద్ధగతయోఽ ప్య నిశం పతంతి
విద్యాదయో వివిధ శక్తయ ఆనుపూర్వ్యాత్ ।
తద్బ్రహ్మ విశ్వ భవమేకమనంతమాద్య
మానందమాత్రమవికారమహం ప్రపద్యే ॥ 16

టీ:- తమేవ బ్రహ్మరూపేణ జ్ఞాతం నమస్కరోతి-యస్మిన్నితి.పతంతి అకస్మాదుద్భవంతి విశ్వస్య భవో యస్మాత్. ఏకమఖండం. ఆద్యమనాదిం. 16.

శ్లో॥ సత్యా శిషో హి భగవం స్తవ పాదపద్మ
మాశీస్తథానుభజతః పురుషార్థమూర్తేః ।
అప్యేవమార్య భగవాన్పరిపాతి దీనాను
స్రేవ వత్సక మనుగ్రహ కాతరోఽ స్మాన్ ॥ 17

అఖండితమైన తన చిచ్ఛక్తిచేత చూచుచున్నావు. స్థితి కాలమున యజ్ఞమునకు అధిష్ఠా తవు, శ్రీవిష్ణువు అయి ఉన్నావు. 15

ఆ పరమాత్మనే బ్రహ్మ రూపముగా నెరిగి నమస్కరించుచున్నాడు పరస్పర విరుద్ధమగు స్వభావములుగల విద్య అవిద్య మొదలగు వివిధ శక్తులు ఒకటి పిమ్మట ఒకటిగా నిరంతరము ఏ పరమాత్మయందు ఉద్భవించు చున్నవో అట్టిజగత్తునకు పుట్టుక, స్థానమైనట్టి, అఖండమైన, అంతము లేనట్టి అనాదియైన వికార రహితమైన ఆనందస్వరూపమును మాత్రమే నేను శరణు వేడుచున్నాను. 16

సకామభజన ద్వారా గూడా మోక్షమిచ్చునని విశ్వసిస్తూ ఇట్లనుచున్నాడు. ఓ భగవానుడా! నిన్ను సేవించుచున్న వ్యక్తికి పరమానందమే మూర్తిగాగల నీయొక్క పాదపద్మములు రాజ్యాది భోగములకంటే పరమార్థ ఫలితమని నిశ్చితము. ఎవరికనగా ఏవరైతే నీవే పురుషార్థమని

టీ:- సకామభజనాదపి మోక్షమాశాసానాఆహ-సత్యేతి. హే భగవన్ పురుషార్థః పరమానందః సఏవ మూర్తిర్యస్య తస్య. తవ పాదపద్మం. ఆశిషో రాజ్యాదేస్సకాశాత్. సత్యా ఆశీః. పరమార్థఫలం హి నిశ్చితం యస్య తస్య తథా తేన ప్రకారేణ. త్వమేవ పురుషార్థ ఇత్యేవం నిష్కామతయా అన్వనుభజతః. యదప్యేవం తథాపి హి ఆర్య స్వామిన్. దీనాన్ సకామానప్యస్మాన్. భగవాన్ భవాన్. పరిపాతి సంసార భయాద్రక్ష త్యేవ. యతః అనుగ్రహే హితాచరణే. కాతరః పరవశః. యథా ఉస్రా నవప్రసూతాధేనుః వత్సం క్షీరం పాయయతి వృకాదిభ్యో రక్షతి చ తద్వత్. (17-18).

నిష్కామముగా భజించుదురో వారికి. అయినప్పటికి హే స్వామీ! దీనులము, సకామనులైన మమ్ముగూడా నీవు పరిపాలించుచున్నావు. సంసార భయము నుండి తప్పక రక్షిస్తావు. కొత్తగా ఈనిన ఆవు లేగదూడకు పాలిచ్చి, తోడేళ్ళనుండి రక్షణ కల్పించినట్లుగా, దుఃఖముల నుండి విముక్తి కలిగించి సుఖమును కలిగించడంలో, ఇతరులకు హితమాచరించుటలో భగవానుడు పరవశుడైతాడు. 17

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ అథాభిష్టుత ఏవం వై సత్సంకల్పేన ధీమతా ।
భృత్యానురక్తో భగవాన్ప్రతినంద్యేదమబ్రవీత్ ॥ 18

**మైత్రేయుడు ఇట్లు పలుకుచున్నాడు.**

మంచి సంకల్పము కలిగిన బుద్ధిమంతుడైన ధ్రువుడు స్తుతించిన పిదప భక్తులయందు అనురాగము కలిగిన ఆతనిని భగవానుడు మెచ్చుకొని ఈ విధముగా పలికెను. 18

**శ్రీ భగవానువాచ**

శ్లో॥ వేదాహం తే వ్యవసితం హృది రాజన్యబాలక ।
తత్ప్రయచ్ఛామి భద్రం తే దురాపమపి సువ్రత ॥ 19

టీ:- వేదేతి. వ్యవసితం సంకల్పితం. 19

**భగవానుడు అనుచున్నాడు.**

ఓ రాజకుమారా! నీ హృదయమందుగల కోరిక నాకు తెలుసును ఎంత ఈయరానిదైనప్పటికైనా నీకు మంగళప్రదమైన వరము నిచ్చెదను. 19

శ్లో॥ నాన్యైరధిష్ఠితం భద్ర యద్భ్రాజిష్ణు ధ్రువక్షితి ।
యత్రగ్రహర్క్ష తారణాం జ్యోతిషాం చక్రమాహితమ్ ॥ 20

టీ:- తత్ప్రయచ్ఛామీత్యుక్తం కిం తదిత్యపేక్షాయామాహ-సార్ధ ద్వాభ్యాం నేతి. హే భద్ర ధ్రువా క్షితిః నివాసో యస్మిన్. యత్ర యస్మిన్. అహితం అర్పితం. 20

"వరమునిచ్చెదను" అని అన్నాడు, ఏమా వరము?అనగా, మంగళప్రదుడా ధ్రువా! ఇంతవరకు ఇతరులచే అధిష్ఠింపబడిన, ప్రకాశవంతమైన, నిశ్చయమైన నివాసము దేనియందో, దేనియందు గ్రహములు, నక్షత్రములు, తారలనే ప్రకాశమండలముల చక్రము అర్పితమో.(దానిని ఇస్తాను) 20

శ్లో॥ మేఢ్యాంగో చక్రవత్ స్థాస్ను పరస్తాత్కల్పవాసినమ్ ।
ధర్మోఽగ్నిః కశ్యపశ్శుక్రో మునయో యే వనౌకసః ।
చరంతి దక్షిణీకృత్య భ్రమంతో యత్సతారకాః ॥ 21

టీ:- మేఢ్యామితి. ధాన్యాక్రమణాయ భ్రామ్యమాణానాం పశూనాం బంధనస్తంభో మేఢిః తస్యాం. బలీవర్ద సమూహవత్. అవాంతర కల్ప వాసినాం. పరస్తాదపి స్థాస్ను లోకత్రయనాశేఽప్యనశ్వరం ధర్మాగ్న్యాదయో నక్షత్రరూపాః వనౌకసస్సప్త ఋషయః. యత్రప్రదక్షిణీకృత్య భ్రమంతశ్చరంతి. 21

వడ్లను గడ్డినుండి వేరుచేయుటకు చుట్టు ఎడ్లను త్రిప్పుదురు. ఆ ఎడ్లను కట్టివేసే మధ్యస్తంభమును మేఢీయందురు, దాని చుట్టు కట్టిన ఎడ్లవలె తార గ్రహాదులు, ఆ లోకమునకు విబుద్ధులౌదురు. ఇతర కల్పవాసులకు, వారి లోకములు నశించిన పిమ్మట కూడా ఈ లోకము నిలిచి యుండును. ధర్ముడు, అగ్ని, కశ్యపుడు, శుక్రుడు, వానప్రస్థులగు మునులు, సప్తఋషులు, తారాగణములతో కూడియున్న వారై ఏ లోకము చుట్టు ప్రదక్షిణాకారమున సంచరిస్తున్నారో. (అట్టి ధ్రువపదమును ఇస్తున్నాను) 21

శ్లో॥ ప్రస్థితే తు వనం పిత్రా దత్వా గాం ధర్మ సంశ్రయః ।
షడ్వింశద్వర్ష సాహస్రం రక్షితావ్యాహతేంద్రియః ॥ 22

ఇది రాజ్యపరిపాలనానంతరము కలుగుతుంది. మీ తండ్రి భూమిని నీకిచ్చి వనమునకు వెళ్ళగా ధర్మయుక్తుడవై ముప్పది ఆరు

టీ:- ఏతశ్చ రాజ్యానంతరం భవిష్యతీత్యాహ-ప్రస్థిత ఇతి. తుభ్యం పృథివీం దత్వా. వనం ప్రస్థిత ఇతి భావేక్తః. వనం ప్రతి గమనే కృతే సతి. రక్షితా రక్షిష్యసి. 22

వేల సంవత్సరములు ఇంద్రియ నిగ్రహము కలిగి రాజ్యమును పరిపాలిస్తావు. 22

శ్లో॥ త్వద్భ్రాతర్యుత్తమే నష్టే మృగయా యాతం తు తన్మనాః ।
అన్వేష్యంతీ వనం మాతా దవాగ్నిం సా ప్రవేక్ష్యతి ॥ 23

టీ:- త్వయా అసంకల్పితమపి మద్భక్తస్య తవ ద్రోహాదేవం భవిష్యతీత్యాహ - త్వదితి. సా సురుచిః ప్రవేక్ష్యతి. 23

నీ తమ్ముడు ఉత్తముడు వేటాడడానికి వెళ్ళి మరణించగా, వాని యందే మనస్సుగలదై అడవిలో వెతుకుతూ ఆ సురుచి అడవిలో చెట్ల రాపిడిలో పుట్టిన అగ్నిలో ప్రవేశిస్తుంది. నీవు సంకల్పించనప్పటికి నా భక్తుడవైన నీకు ద్రోహము తలపెట్టినారు కనుక వారికి ఈ విధముగా జరుగుతుంది. 23

శ్లో॥ ఇష్ట్వా మాం యజ్ఞ హృదయం యజ్ఞైః పుష్కల దక్షిణైః ।
భుక్త్వా చేహాశిషస్సత్యా అంతే మానుస్మరిష్యసి ॥ 24

టీ:- కించ. దృష్ట్వేతి. ఇష్ట్వా మాం. యజ్ఞోహృదయం ప్రియా మూర్తిరస్య తం. 24

మరియు యజ్ఞమే నా హృదయము (అనగా ప్రియమైన మూర్తి) అట్టి నన్ను సమృద్ధమైన దక్షిణలచే కూడిన యజ్ఞములచే ఆరాధించి ఇచ్చట ఉత్తమమైన భోగములననుభవించి చివరి వరకు నన్ను చక్కగా స్మరించగలవు. 24

శ్లో॥ తతో గంతాసి మత్ స్థానం సర్వలోకనమస్కృతమ్ ।
ఉపరిష్టా దృషిభ్యస్త్వం యతో నావర్తతే గతః ॥ 25

టీ:- తత ఇత. యతః స్థానాత్. 25

అటు పిమ్మట, సర్వలోకములచే నమస్కరింపబడు సప్తఋషి స్థానముకంటే పైన ఉన్నట్టి, మరియు ఏ స్థానమును చేరితే యతీశ్వరుడు తిరిగిరాడో ఆ స్థానమును నీవు చేరుతావు. 25

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ ఇత్యర్చితస్స భగవానతిదిశ్యాత్మనః పదమ్ ।
బాలస్య పశ్యతో ధామ స్వమాయాద్గరుడ ధ్వజః ॥ 26

టీ:- ఇతీతి. అతిదిశ్య దత్త్వా. 26

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

ఈ విధముగా ధ్రువుడిచే అర్చితుడైన భగవానుడు తన స్థానమును బాలునకు ఇచ్చి, అతను చూచుచుండగానే గరుడారూఢుడై స్వస్థానమునకు వెళ్ళెను. 26

శ్లో॥ సోఽపి సంకల్పజం విష్ణోః పాదసేవోపసాదితమ్ ।
ప్రాప్య సంకల్ప నిర్వాణం నాతిప్రీతోఽభ్యగాత్పురమ్ ॥ 27

టీ:- స ఇతి. సంకల్పజం మనోరథం. పాదసేవయా ప్రాపితం. సంకల్పస్య నిర్వాణం సమాప్తిర్యస్మాత్. 27

ఆ ధ్రువుడు గూడా విష్ణుభగవానుడి పాదసేవ ద్వారా తీరిన మనోరథముగలవాడై, కోరిక తీరిగూడా సంపూర్ణమైన ప్రీతిని పొందకుండగానే తన పురమునకు వెళ్ళినాడు. 27

**విదుర ఉవాచ**

శ్లో॥ సదుర్లభం యత్పరమం పదం హరే
ర్మాయావినస్తచ్చరణార్చనార్జితమ్ ।
లబ్ధ్వాప్య సిద్ధార్థమివైకజన్మనా కథం
స్వమాత్మా నమమన్యతార్థవిత్ ॥ 28

**విదురుడు ఈ విధముగా అడిగెను.**

సకాముడికి ఏ స్థానము అనగా శ్రీహరి పరమపదము ఏ విధముగానూ లభించదో, అట్టి దానిని శ్రీహరిచరణార్చనచే ఒకే జన్మలో పొందిగూడా, పురుషార్థుడైగూడా తనను అప్రాప్త మనోరథుడిగా ఎందుకు తలపోసెను? 28

మైత్రేయ ఉవాచ

శ్లో॥ మాతుస్సపత్న్యా వాగ్బాణైర్హృదివిద్ధస్తు తాన్ స్మరన్ ।
నైచ్ఛన్ముక్తిపతే ర్ముక్తిం తస్తాత్తాపముపేయివాన్ ॥ 29

టీ:- సుదుర్లభమితి. మాయావినస్సకామస్య. యత్సుదుర్లభం హరేః పదం తదేకేనైవ జన్మనా లబ్ధ్వాపి. స్వమాత్మానం మనః. అప్రసిద్ధార్థం అప్రాప్త మనోరథమివ. కథమమన్యత పురుషార్థవిదపి. (28-29)

మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

సవతితల్లి యొక్క బాణములవంటి మాటలచే హృదయము గాయపడి, వాటినే స్మరిస్తూ ముక్తిపతి నుండి ముక్తిని కోరలేదని, దుఃఖమును పొందెను. 29

ధ్రువ ఉవాచ

శ్లో॥ సమాధినా నైకభవేన యత్పదం
విదుస్సనందాదయ ఊర్ధ్వరేతసః ।
మాసైరహం షడ్భిరముష్య పాదయో
శ్ఛాయాముపేత్యాగతః పృథఙ్మతిః ॥ 30

టీ:- తాపమేవాహ-సార్ధైష్షడ్భిః. సమాధినేతి. నైకే అనేకేభవాః యస్మిన్ తేన. అనేక భవేన సమాధినా. బహుజన్మాభ్యస్తేనేత్యర్థః. ప్రణామస్తుత్యాది సమయే. గరుడాధి రూఢస్య హరేః. పాదచ్ఛాయాయాం స్థితం. ఆత్మానాం స్మరన్నాహ - ఛాయాముపేత్యేతి. పృథఙ్మతిః. భేదదృష్టిస్సన్. హాకష్టమితి భావః. 30

ధ్రువుడు ఈ విధముగా పలికెను.

ఊర్ధ్వరేతస్కులైన సనందాదులు అనేక జన్మలనుండి అభ్యసించి నప్పటికి ఏ పదమును ఏకాగ్ర ధ్యానముచే గూడా పొందలేదో ఆ స్థానమును ఆరు మాసములలో పొంది నమస్కార స్తోత్రాదులు చేస్తునప్పుడు గరుడారూఢుడైన భగవంతుడి యొక్క సామీప్యమున ఆయన పాదము యొక్క నీడలో ఉండి కూడా అయ్యో భేదదృష్టినై ఉండిపోతినిగదా!. 30

శ్లో॥ అహో బత మమానాత్మ్యం మందభాగస్య పశ్యత ।
భవచ్ఛిదః పాదమూలం గత్వా యాచే యదంతవత్ ॥ 31

టీ:- అహోఇతి. అనాత్మ్యం ఆత్మశూన్యత్వం. అజ్ఞత్వమితి. యావత్. భవచ్ఛేత్తుః భవత్తః యత్ అంతవత్ అనిత్యం. తత్ ఆయాచే యాచితవానస్మి. 31

అయ్యో! మందభాగ్యుడనైన నా అజ్ఞానమును చూడండి. జన్మాదులను త్రుంచే భగవంతుడి పాదములను చేరికూడా అజ్ఞానంతో, నశించు దానినే అడిగితిని. 31

శ్లో॥ మతిర్విదూషితా దేవైః పతద్భిరసహిష్ణుభిః ।
యో నారద వచస్తథ్యం నా గ్రహీషమసత్తమః ॥ 32

టీ:- అజ్ఞత్వే కారణం సంభావయతి-మతిరితి. పతద్భిః మదపేక్షయా అధః ప్రాప్నువద్భిః. అతఏవ అసహిష్ణుభిః. అసహనశీలైః. శ్లో. "నాధునాప్యవమానంత" ఇత్యాది సత్యమపి. నారదస్య వచః. యో న గృహీతవానస్మి. తస్య మే మతిర్విదూషితా. 32

అజ్ఞత్వమునకు కారణము ఆలోచించుకొనుచున్నాను. నా కంటే తక్కువ స్థానమును పొందిన దేవతలు, సహించలేక నా బుద్ధిని కలుషితము చేసినారు. లేకుంటే ఈ చిన్న వయస్సున అనేక అవమానాదుల పట్టింపువలదను శ్రీనారదులవారి మాటలు సత్యమైనప్పటికీ అయోగ్యుడనైన నేను గ్రహించలేకపోతినిగదా! 32

శ్లో॥ దైవీం మాయాముపాశ్రిత్య ప్రసుప్త ఇవభిన్నదృక్ ।
తప్యే ద్వితీయేఽప్యసతి భ్రాతృ భ్రాతృవ్య హృద్రుజా ॥ 33

టీ:- కించ. దైవీమితి. ప్రసుప్తః స్వప్నాని పశ్యన్. ద్వితీయే అసత్యపి. భ్రాతైవ భ్రాతృవ్యః శత్రురితి దృష్ట్వా. హృద్రుజా హృదయగతశోకేన. తప్యే తాపమనుభవామి. 33

రెండవ పదార్థమే లేనప్పటికీ, నిదురించినవాడు దైవమాయచే స్వప్నమున లేని రెండవ పదార్థమును చూచినటుల భిన్న దృష్టినై తమ్ముడినే శత్రువుగా భావించి మానసిక రోగముచే తపించితిని. 33

శ్లో॥ మయైతత్ప్రార్థితం వ్యర్థం చికిత్సేవ గతాయుషి ।
ప్రసాద్య జగదాత్మానం తపసా దుష్ప్రసాధనమ్ ॥ 34

టీ:- మయేతి. కించ మయా ప్రసాద్యయత్ప్రార్థితం. తద్వ్యర్థం. 34

భగవంతుడిని ప్రసన్నుని చేసుకొని దేనిని ప్రార్థించినానో అది వ్యర్థమని తలపోయుచున్నాడు. సంసారమును తొలగించువానిని, జన్మ మరణ నివర్తకుని, ఇతరులు ప్రసన్నము చేసుకోవడానికి శక్యముకాని జగదాత్ముని ప్రసన్నుని చేసుకొనిగూడా భాగ్యహీనుడనై ఆయుస్సు తీరిపోయినవాడికి చికిత్స చేసినట్లుగా నశించే సంసారమునే యాచించితిని. నేను కోరిన ఈ వరము వ్యర్థము కదా! 34

శ్లో॥ భవచ్ఛిదమయాచేఽహం భవం భాగ్యవివర్జితః ।
స్వారాజ్యం యచ్ఛతో మౌఢ్యాన్మానో మే భిక్షితో బత ।
ఈశ్వరాత్క్షీణ పుణ్యేన ఫలీకారానివాధనః ॥ 35

టీ:- ప్రార్థితమాహ-భవచ్ఛిదమితి. ఏత దేవ సదృష్టాంతమాహ - స్వారాజ్యం నిజానందం ప్రయచ్ఛతస్సకాశాత్. మానః అభిమానః. క్షీణేన పుణ్యేన మయా భిక్షితః యాచితః. క్షీణపుణ్యేనేతి వా సంబంధః యథా అధనః క్షీణ పుణ్యతయా. ఈశ్వరాచ్చక్రవర్తినః. ఫలీకారాన్ సతుష తుండులకణాన్. యాచతే తద్వత్. 35

పుణ్యము క్షీణించిన భిక్షుకుడు ధనములేనివాడై, ఒక చక్రవర్తి నుండి తౌడును లేదా తౌడుతోగూడిన నూకను యాచించినటుల నిజానందమును ప్రసాదించే భగవంతుడు ఎదురుగా ఉండగా, మూర్ఖముగా, దురభిమానినై, అభిమాన హేతువులైన రాజ్యాదుల కోరితినిగదా! 35

మైత్రేయ ఉవాచ

శ్లో॥ న వై ముకుందస్య పదారవిందయో
రజోజుషస్తాత భవాదృశా జనాః ।
వాంఛన్తితద్దాస్యమృతేఽర్థమాత్మనో
యదృచ్ఛయా లబ్ధమనస్సమృద్ధయః ॥ 36

మైత్రేయ మహర్షి అనుచున్నాడు.

వత్సా విదురా! ముకుందుడి పాదపద్మములకంటిన పుప్పొడి వంటి మట్టిని సేవించు నీ వంటి జనులు ఆయన దాస్యమును తప్ప వేరే ధనాదులను అడుగరు. వారు యదృచ్ఛగా లభించిన దానితోనే (మనస్సమృద్ధమై) కోరికలన్నీ తీరినట్లుగా భావిస్తారు. . 36

టీ:- ఏవం నిస్పృహత్వం తస్య యుక్తమేవేత్యాహ- నేతి. రజోజుషః పరాగం ప్రాప్తః. తస్య దాస్యం వినా. అన్యమర్థం. ఆత్మనో న వై వాంఛంతి. యదృచ్ఛయైవ లబ్ధేన మనస్సమృద్ధిర్యేషాంతే ప్రాప్త మనోరథా ఇత్యర్థః. 36

శ్లో॥ ఆకర్ణ్యాత్మజమాయాంతం సంపరేత్య యథాగతమ్ ।
రాజా న శ్రద్దధే భద్రమభద్రస్య కుతో మమ ॥ 37

తన కుమారుడు వచ్చుచున్నాడను వార్తను విని ఉత్తానపాదుడు, చనిపోయినవాడు లేచి వచ్చుచున్నాడంటే ఎట్లు విశ్వసించమో అట్లు విశ్వసించలేదు. ఎందుకనగా అమంగళ ప్రదుడనైన నాకు మంగళము జరుగుటనా? ఇది అసంభవమని తలచెను. 37

టీ:- ప్రస్తుతమాహ–ఆకర్ణ్యేతి. సంపరేత్య మృత్వా. ఆగతమాకర్ణ్య. యథా న శ్రద్దధే విశ్వాసం న చకార. అభద్రస్యమమభద్రం కుతఇతి మత్వా. 37

శ్లో॥ శ్రద్ధాయ వాక్యం దేవర్షేర్హర్షవేగేన ధర్షితః ।
వార్తాహర్తురతి ప్రీత్యా హారం ప్రాదాన్మహాధనమ్ ॥ 38

తొందరలోనే నీ కుమారుడు వచ్చునను దేవర్షినారదుడి మాట యందు శ్రద్ధగల(గురువాక్యమునందుగల విశ్వాసము) ఉత్తానపాదుడు సంతోషముతో పులకించి, ఈ వార్త తెచ్చిన వార్తాహరునిపట్ల అతి -ప్రీతుడై ఆతనికి విలువగల మంచి హారమును ఇచ్చెను. 38

టీ:- శ్రద్ధాయేతి. ఏష్యత్యవిరత ఇతి దేవర్షి వాక్యం శ్రద్ధాయ. 38

శ్లో॥ సదశ్వం రథమారుహ్య కార్తస్వర పరిష్కృతమ్ ।
బ్రాహ్మణైః కులవృద్ధైశ్చ పర్యస్తో౽మాత్య బంధుభిః, 39

కుమారుడిని చూడాలని ఉత్తానపాదుడు మంచి గుఱ్ఱములుగల బంగారు రథమునెక్కి, బ్రాహ్మణులు, కులపెద్దలు మంత్రులు, బంధువులతోగూడి...(బయలుదేరెను) 39

శ్లో॥ శంఖ దుందుభి నాదేన బ్రహ్మఘోషేణ వేణుభిః ।
నిశ్చక్రామ పురాత్తూర్ణమాత్మజావేక్షణోత్సుకః ॥ 40

తన కుమారుడిని చూడాలని ఉత్సుకత కలవాడై శంఖ, దుందుభి వేణునాదములచే, వేదఘోషచేగూడి శీఘ్రముగా పట్టణము నుండి బయలుదేరెను. 40

టీ:- సదశ్వమితి. బ్రాహ్మణాదిభిః పర్యస్తః పరివృతః. (39-40)

శ్లో॥ సునీతిస్సురుచిశ్చాస్య మహిష్యౌ రుక్మ భూషితే ।
ఆరుహ్య శిబికాం సార్ధముత్తమే నాభిజగ్మతుః ॥ 41

ఉత్తానపాదుడి పట్టమహిషులు సునీతి, సురుచి బంగారు అభరణములు ధరించి ఒకే పల్లకిలో మధ్యలో ఉత్తముడిని కూర్చోపెట్టుకొని బోయీలు మోయుచుండగా బయలుదేరిరి. 41

టీ:- సునీతిరితి. అస్య రాజ్ఞో మహిష్యౌ ఉత్తమం నిధాయ. ఏకామేవ శిబికాం నరవిమానమారుహ్య. 41

శ్లో॥ తం దృష్ట్వోపవనాభ్యాశ ఆయాంతం తరసా రథాత్ ।
అవరుహ్య నృపస్తూర్ణమాసాద్య ప్రేమవిహ్వలః ॥ 42

తన కుమారుడైన ధ్రువుడిని, ఉద్యానవన సమీపమున చూచిన రాజు రథము నుండి దిగి ప్రేమవిహ్వలుడై త్వరగా కుమారుడిని చేరెను. 42

,టీ:- తమితి. ఉపవనస్యాభ్యాశే సమీపే. 42

శ్లో॥ పరిరేభేఽఙ్గజం దోర్భ్యాం దీర్ఘోత్కంఠమనాశ్శ్వసన్ ।
విష్వక్సేనాంఘ్రి సంస్పర్శ హత శేషాఘ బంధనమ్ ॥ 43

టీ:- పరిరేభ ఇతి. విష్వక్సేనాంఘ్రి సంస్పర్శేన హతం అశేషం అఘ బంధనం చ యస్య. 43

చిరకాలము నుండి ధ్రువుని చూడాలని కోరికచే వేగిరపడుచున్న మనస్సు కలిగిన ఉత్తానపాదుడు, నిట్టూర్పులు విడుచుచూ, భగవంతుడి పాదములు తాకి ఆ స్పర్శ మహిమచే సంపూర్ణముగా పాపములు మరియు బంధనములు తొలగిపోయిన ధ్రువుడిని, తన బాహువులతో కౌగిలించుకొనెను. 43

శ్లో॥ అవజిఘ్రన్ముహుర్మూర్ధ్ని శాంతైర్నయనవారిభిః ।
స్నాపయామాస తనయం జాతోద్దామ మనోరథః ॥ 44

టీ:- అవజిఘ్రన్నితి. జాతః ఉద్దామః మహాన్మనోరథో యస్య. 44

అటుపిమ్మట, గొప్ప కోరిక సిద్ధించిన మహారాజు తన కుమారుడి తలపై పలుమార్లు ముద్దిడుతూ కన్నీటి జలముచే తడిపెను. 44

శ్లో॥ అభివంద్య పితుః పాదావాశీర్భిశ్చాభిమంత్రితః ।
ననామ మాతరౌశీర్ష్ణా సత్కృతస్సజ్జనాగ్రణీః ॥ 45

సజ్జనులలో శ్రేష్ఠుడైన బాలకుడు, తండ్రిగారి పాదములకు నమస్కరించి, ఆశీస్సులు తీసుకొని కొంత తడవు తండ్రితో మాట్లాడి తల్లులకు తలవంచి నమస్కరించెను. 45

శ్లో॥ సురుచిస్తం సముత్థాప్య పాదావనతమర్భకమ్ ।
పరిష్వజ్యాహ జీవేతి బాష్పగద్గదయా గిరా ॥ 46

టీ:- అభివంద్యేతి. అభిమంత్రితః. పితురాశీర్భిః సత్కృతః తేన. కృత సంభాషణః. (45-46)

శిరస్సువంచి పాదములకు నమస్కరించిన బాలుడిని సురుచి లేపి, కౌగలించుకొని, ఆనంద బాష్పములచే గద్గదమైన కంఠముతో నాయనా! బహుకాలము జీవించుము అని ఆశీర్వదించెను. 46

శ్లో॥ యస్య ప్రసన్నో భగవాన్గుణైర్మైత్ర్యాదిభిర్హరిః ।
తస్మై నమంతి భూతాని నిమ్నమాప ఇవ స్వయమ్ ॥ 47

టీ:- సురుచ్యాః ప్రీతిర్నాసంభావితేత్యాహ-యస్యేతి. నమంతి అనుసరంతి. ఆపో యథా. స్వయమేవ నిమ్నం దేశమవతరంతి. 47

సురుచి ప్రేమ పడినాదా? అని సంశయపడవద్దు. మైత్రి, కరుణ మొదలగు గుణములచే భగవంతుడైన శ్రీహరి ఎవరికి ప్రసన్నుడగునో, అతనికి సర్వభూతములు నమస్కరించును, అనుసరించును, నీరు స్వయముగా పల్లము ఉన్నచోటునకే ప్రవహించును కదా! 47

శ్లో॥ ఉత్తమశ్చ ధ్రువశ్చోభావన్యోన్యం ప్రేమవిహ్వలౌ ।
అంగసంగాదుత్పులకావస్రౌఘం ముహురూహతుః ॥ 48

ప్రేమచే పరవశులై, ఉత్తముడు ధ్రువుడు అన్యోన్యముగా కౌగలించుకొనుటవల్ల పులకాంకురములు గలిగి పలుమార్లు ఆనందబాష్పములు కలిగినవారైరి. 48

శ్లో॥ సునీతిర్యస్య జననీ ప్రాణేభ్యోఽపి ప్రియం సుతమ్ ।
ఉపగుహ్యాజహావాధిం తదంగస్పర్శనిర్వృతా ॥ 49

టీ:- ఉత్తమ ఇతి. ఊహతుః. దధతుః. (48-49)

ధ్రువుని తల్లి సునీతి ప్రాణములకంటే అతి ప్రియమైన పుత్రుడిని కౌగిలించుకొని పుత్ర గాత్ర స్పర్శచే ఆనందించి, మానసిక దుఃఖమును విడిచెను. (ఆమె దుఃఖము తొలిగెను అని భావము) 49

శ్లో॥ పయస్స్తనాభ్యాం సుస్రావ నేత్రజైస్సలిలైశ్శివైః ।
తథాభిషిచ్యమానాభ్యాం వీరవీరసువో ముహుః ॥ 50

టీ:- పయ ఇతి. హే వీర విదుర వీరసువః. వీరజనన్యాః ధ్రువమాతుః అభిషిచ్యమానాభ్యాం స్తనాభ్యాం పయః తథా సుస్రావ. 50

ఓ వీరవిదురా! వీరమాతయైన సునీతి నేత్రముల నుండి పుట్టిన ఆనంద బాష్పములచే తడుపబడిన స్తనముల నుండి క్షీరము స్రవించెను. (50)

శ్లో॥ తాం శశంసుర్జనా రాజ్ఞీం దిష్ట్యా తే పుత్ర ఆర్తిహా ।
ప్రతిలబ్ధశ్చిరం నష్టో రక్షితా మండలం భువః ॥ 51

మహారాజ్ఞియైన సునీతిని జనులు ప్రశంసించిరి. చాలా కాలము నుండి కనబడని నీ కుమారుడు దైవకృపచే లభించినాడు. ఈయన ఈ భూమండలమును రక్షించగలడు, జనుల దుఃఖమును పోగొట్టగలడు. 51

శ్లో॥ అభ్యర్చితస్త్వయా నూనం భగవాన్ప్రణతార్తిహా ।
యదనుధ్యాయినో ధీరా మృత్యుం జిగ్యుస్సుదుర్జయమ్ ॥ 52

టీ:- తామితి. చిరం నష్టః దర్శనమప్రాప్తః రక్షితా రక్షిష్యతి.(51-52)

ఓ సునీతీ! నమస్కరించువారి దుఃఖమును తొలగించు భగవానుని నీవు మిక్కిలి చక్కగా ఆరాధించినావు. ఏ పరమాత్మను ధ్యానించుటద్వారా, వీరులుచే కూడా జయింపరాని మృత్యువును గూడా జయించినారో...(అట్టి భగవానుని ఆరాధించినావు) 52

శ్లో॥ లాల్యమానం జనైరేవం ధ్రువం సభ్రాతరం నృపః ।
ఆరోప్య కరిణం హృష్టః స్తూయమానోఽవిశత్పురమ్ ॥ 53

టీ:- లాల్యమానమితి. ఏవమితి వ్యవహితం పిత్రాద్యుపలాలనం పరామృశ్యతే. 53

సంతుష్టుడైన మహారాజు, జనులచేత లాలింపబడుతూ, పొగడబడుతున్న ధ్రువుడిని తమ్ముడితో సహా ఏనుగుపై కూర్చోపెట్టి పట్టణములోనికి ప్రవేశించెను. 53

శ్లో॥ తత్ర తత్రోపసంక్లిప్తైర్లసన్మకర తోరణైః ।
సంవృతైః కదలీ స్తంభైః పూగపోతైశ్చ తద్విధైః ॥ 54

పురమును వర్ణించుచున్నాడు.

అక్కడక్కడనే దగ్గరి దగ్గరిగా ఏర్పాటు చేయబడిన ప్రకాశించుచున్న మకర తోరణములచేత, గెలలు కలిగిన అరటి స్తంభములతో ఆ విధముగానే లేత పోకచెట్లతో...(ఆ పురము అలంకరించబడెను)54

టీ:- పురం వర్ణయతి-చతుర్భిః. తత్రేతి. సంవృతైః ఫలమంజరీయుక్తైః పూగానాం పోతైర్బాలవృక్షైః. తద్విధైస్సంవృతైః. ఉపస్కృతం ప్రతి ద్వారమిత్యుత్తరేణాన్వయః. 54

శ్లో॥ చూతపల్లవ వాసస్స్రఙ్ముక్తాదామ విలంబిభిః ।
ఉపస్కృతం ప్రతి ద్వారమపాం కుంభైస్సదీపకైః ॥ 55

టీ:- చూతేతి. చూతప్రవాళాశ్చ వాసాంసి చ స్రజశ్చ ముక్తాదామాని చ తేషాం. విశిష్టం లంబనమస్తి యేషు కుంభేషు. 55

దీపముతో కూడిన నీటి కుండలు ప్రతి గృహ ద్వారము వద్ద ఉంచబడినవి, లేతమామిడి ఆకులు, వస్త్రములు, పూలమాలలు, ముత్యాలహారములతో గృహములు అలంకరింపబడినవి. 55

శ్లో॥ ప్రాకారైర్గోపురాగారైశ్శాతకుంభ పరిచ్ఛదైః ।
సర్వతోఽలంకృతం శ్రీమద్విమానశిఖరద్యుభిః ॥ 56

టీ:- ప్రాకారైరితి. గోపురైః అగారైశ్చ. శాతకుంభాః పరిచ్ఛదాః పరికరా యేషు తైః విమానానాం శిఖరైః ద్యుతిరేషాం. 56

ప్రాకారములు, గోపురములు, భవనములు, బంగారు పరికరములతో, మంగళయుక్తమైన విమాన శిఖరముల కాంతిచే అలంకరింపబడిన పురమున ప్రవేశించెను. 56

శ్లో॥ మృష్టచత్వర రథ్యాట్టమార్గం చందనచర్చితమ్ ।
లాక్షాక్షతైః పుష్పఫలై స్తండులైర్బలిభిర్యుతమ్ ॥ 57

చక్కగా ఊడ్చి, శుభ్రముచేయబడిన, అంగణములు నాలుగు దిక్కుల మార్గములు, (చౌరస్తా) రథ్యా = పెద్దమార్గములు, అట్టా=ఎత్తుగా కట్టిన భవనములు,(అటుక, బంగ్లా)మార్గః ఉపమార్గములు (సందులు)

టీ:- మృష్టేతి. చత్వరమంగణం రథ్యా రాజమార్గః అట్టః ఉచ్చస్య ప్రాకారస్యోపరి వినిర్మితో భూమికామార్గః. అవాంతరః. మృష్టాస్సమ్మార్జితాశ్చత్వరాదయో యస్మిన్. 57

కలిగి, గంధపునీళ్ళతో చల్లిన, వరిపేలాలు, యవలు, పూలు, పండ్లు, బియ్యంతో బలులు సమర్పింపబడిన పురమున ప్రవేశించెను. 57

శ్లో॥ ధ్రువాయ పథి దృష్టాయ తత్ర తత్ర పురస్త్రియః ।
సిద్ధార్థాక్షతదధ్యంబు దూర్వా పుష్ప ఫలాని చ ॥ 58

టీ:- ధ్రువాయేతి. సిద్ధార్థః శ్వేత సర్షపః అక్షతా యవాః ఉపజహ్రుః వ్యకిరన్. 58

శ్లో॥ ఉపజహ్రుః ప్రయుంజనా వాత్సల్యాదాశిషస్సతీః ।
శ్రుణ్వంస్తద్వల్గు గీతాని ప్రావిశద్భవనం పితుః ॥ 59

రాజమార్గమున ధ్రువుడు కనపడగానే పతివ్రతలగు పురస్త్రీలు తెల్లఆవాలు, యవలు, పెరుగు, పవిత్రజలము, గరిక, పూలు, పండ్లను, వాత్సల్యపూరితమైన ఆశీస్సులు తెలుపుతూ ధ్రువుడిపై చల్లిరి. వారి మనోహరమగు గీతములను వింటూ, తండ్రిగారి భవనమున ప్రవేశించెను. 58, 59

శ్లో॥ మహామణి వ్రాతమయే తస్మిన్ సభవనోత్తమే ।
లాలితోఽతి తరాం పిత్రా న్యవసద్దివి దేవవత్ ॥ 60

ధ్రువుడు తండ్రిచే లాలింపబడి, మహామణుల సమూహముచేత నిర్మితమైన ఉత్తమమైన భవనమున స్వర్గములో దేవతలవలె శోభిల్లెను. (60)

శ్లో॥ పయఃఫేననిభాశ్శయ్యా దాంతరుక్మ పరిచ్ఛదా ।
ఆసనాని మహార్హాణి యత్ర రౌక్మా ఉపస్కరాః ॥ 61

టీ:- ఉపపజహ్రురితి. సతీః సత్యః. (59-61)

ఉత్తమమైన ఆ భవనమున పాల నురుగువలె తెల్లని కాంతి కలిగి, కోమలములైన శయ్యలున్నవి. ఆ శయ్యాపరికరములు దంతనిర్మితములు, సువర్ణ నిర్మితములు, అక్కడ వాడే ప్రతి పాత్ర బంగారుదే. ఆసనములు చాలా విలువైనవి. 61

శ్లో॥ యత్ర స్ఫటికకుడ్యేషు మహామరకతేషు చ ।
మణిప్రదీపా ఆభాంతి లలనారత్నసంయుతాః ॥ 62

ఆ భవనము మహామరకతములు పొదిగిన స్ఫటికపు గోడలతో, మణిదీపములతో, రత్నా భరణములు ధరించిన యువతులతో శోభిల్లుచున్నది. 62

శ్లో॥ ఉద్యానాని చ రమ్యాణి విచిత్రైరమరద్రుమైః ।
కూజద్విహంగమిథునైర్గాయ న్మత్తమధువ్రతైః ॥ 63

టీ:- యత్రేతి. యత్ర భవనోత్తమే. (62-63)

సుందరమైన ఉద్యానములు గలవు. వాటిలో దేవతావృక్షము లయందు పక్షిజంటలు సుమధురముగా కూయుచున్నవి. మత్తెక్కిన తుమ్మెదలు మధురముగా గానము చేయుచున్నవి. 63

శ్లో॥ వాప్యో వైడూర్యసోపానాః పద్మోత్పలకుముద్వతీః ।
హంస కారండవ కులైర్జుష్టాశ్చక్రాహ్వసారసైః ॥ 64

ఆ ఉద్యానవనమున వైడూర్యపు మెట్లు కలిగి, పద్మములు, నల్ల కలువలు, తెల్లకలువలు కలిగిన దిగుడు బావులు కలవు. హంసలు కారండవ పక్షులు, జక్కవ పక్షులు, బెగ్గురు పక్షులు చాలా ఉన్నవి. 64

శ్లో॥ ఉత్తానపాదో రాజర్షిః ప్రభావం తనయస్య తమ్ ।
శ్రుత్వా దృష్ట్వాద్భుతతమం ప్రపేదే విస్మయం పరమ్ ॥ 65

రాజర్షియైన ఉత్తానపాదుడు తన కుమారుడి యొక్క అద్భుతమైన అత్యాశ్చర్యమునుగొలిపే మహిమనువిని, చూచి గొప్పనైన విస్మయమును పొందెను. 65

టీ:- వాప్యఇతి. కుముద్వతీః కుముత్ కుముదపద్మాది తద్వత్యో వాప్యః. (64-65)

శ్లో॥ వీక్ష్యోఢవయసం పుత్రం ప్రకృతీనాం చ సమ్మతమ్ ।
అనురక్త ప్రజం రాజా ధ్రువం చక్రే భువః పతిమ్ ॥ 66

మహారాజు, ప్రాప్తయౌనుడైన ధ్రువుని చూచి, మంత్రులు మొదలగు రాజ్యాధికారులకు ఇష్టుడైన వాడుగా గ్రహించి, అతడియందు ప్రజలు అనురక్తులని గ్రహించి ధ్రువుని చక్రవర్తిగా ప్రకటించెను. 66

శ్లో॥ ఆత్మానం చ ప్రవయసమాకలయ్య విశాం పతిః ।
వనం విరక్తఃప్రాతిష్ఠద్విమృశన్నాత్మనో గతిమ్ ॥ 67

రాజు తనకు వయసుమీదపడిన సంగతిని గమనించి, విరక్తుడై, ఆత్మమార్గాన్వేషియై అడవికి బయలుదేరెను. (67)

టీ:- వీక్ష్యేతి. ఊఢవయసం ప్రాప్తయౌవనం. అనురక్తాః ప్రజా యస్మిన్ తం. (66-67)

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,
నవమో౽ ధ్యాయః

శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు
తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.

## దశమోఽధ్యాయః

శ్లో॥ దశమే భ్రాతృహంతౄణాం యక్షాణామకరోద్వధమ్ ।
ఏకఏవాలకాం గత్వేత్యస్య విక్రమ ఈర్యతే. ఇలయామితి ॥

## 10వ అధ్యాయము

ఈ పదవ అధ్యాయమున ధ్రువుడు తన తమ్ముడిని చంపిన యక్షులను వధించుట, ఒక్కడే అలకాపురికి వెళ్ళుట, అతని విక్రమము తెలుపబడుచున్నది.

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ప్రజాపతేర్దుహితరం శింశుమారస్య వై ధ్రువః ।
ఉపయేమే భ్రమిం నామతత్సుతౌ కల్పవత్సరౌ ॥ 1

మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

ధ్రువుడు శింశుమార ప్రజాపతి కుమార్తె భ్రమిని వివాహ-మాడినాడు. వారికి కల్పుడు, వత్సలుడు అను ఇద్దరు కుమారులు. 1

శ్లో॥ ఇలాయామపి భార్యాయాం వాయోః పుత్ర్యాం మహాబలః ।
పుత్రముత్కలనామానం యోషిద్రత్నమజీజనత్ ॥ 2

టీ;- యోషితాం రత్నమివ. అతిమనోహరం కన్యారత్నం చేతివా. (1-2)

వాయుదేవుడి కుమార్తె స్త్రీలలోనే రత్నమువలె అతిమనోహరమైన ఇలయను కన్యారత్నమును, మహాబలుడైన ధ్రువుడు వివాహము చేసుకొని, ఆమెయందు ఉత్కలుడను కుమారుడిని కనెను. 2

శ్లో॥ ఉత్తమస్త్వకృతో ద్వాహో మృగయాయాం బలీయసా ।
హతః పుణ్యజనేనాద్రౌ తన్మాతాస్య గతిం గతా ॥ 3

టీ;- ఉత్తమ ఇతి. యక్షేణ అద్రౌ హిమవతి. హతః. అజావితి పాఠే యుద్ధే. అస్య గతిం గతేత్యర్థః మృతేతి భావః. 3

ధ్రువుడి తమ్ముడు ఉత్తముడు వివాహము చేసుకొనలేదు. అతను వేటాడడానికి వెళ్ళినప్పుడు హిమవత్పర్వతమున బలవంతుడైన యక్షుడి చేతిలో చంపబడినాడు. (అద్రే అన్నచోట అజౌ అనికూడా చదువుతారు) అజౌ =యుద్ధమందు అని అర్థం చెప్పుకుంటే సరిపోతుంది. ఈ విషయము తెలిసి ఉత్తముని తల్లి సురుచి మరణించింది. 3

శ్లో॥ ధృవో భ్రాతృ వధం శ్రుత్వా కోపామర్షశుచార్పితః ।
జైత్రం స్యందనమాస్థాయ గతః పుణ్య జనాలయమ్ ॥ 4

టీ:- ధ్రువ ఇతి. కోపామర్ష శుచాం ద్వంద్వైక్యం తేన అర్పితః వ్యాప్తః జైత్రం జయహేతుం పుణ్యజనాలయం అలకాం. 4

ధ్రువుడు తమ్ముని మరణమును విని కోపము, అసహనము వలన కలిగిన దుఃఖముచే నిండి, జయప్రదమగు రథమునెక్కి అలకాపురికి వెళ్ళెను. 4

శ్లో॥ గత్వోదీచీం దిశం రాజా రుద్రానుచర సేవితామ్ ।
దదర్శ హిమవద్ద్రోణ్యాం పురీం గుహ్యక సంకులామ్ ॥ 5

టీ;- గత్వేతి. రుద్రానుచరా భూతాదయః. 5

ఉత్తర దిశలో వెళ్ళిన ధ్రువుడు, రుద్రభూతగణముచే సేవింపబడతూ, యక్షులచే నిండియున్న హిమవత్పర్వతాంతర్గత సీమలోగల అలకాపురిని చూచెను. 5

శ్లో॥ దధ్మౌ శంఖం బృహద్బాహుః ఖం దిశశ్చానునాదయన్ ।
యేనోద్విగ్నదృశః క్షత్తరుపదేవ్యోఽత్రసన్ భృశమ్ ॥ 6

ఓ విదురా! దీర్ఘబాహువైన ధ్రువుడు ఆకాశము, దిక్కులు మారుమ్రోగునట్లు శంఖనాదము చేసెను. ఆ నాదము విన్న యక్షస్త్రీలు మిక్కిలి భయపడి, అటునిటు చూచిరి. 6

శ్లో॥ తతో నిష్క్రమ్య బలిన ఉపదేవమహాభటాః ।
అసహంత స్తన్నినాదమభి పేతురుదాయుధాః ॥ 7

టీ;- దధ్మావితి. దధ్మౌ నాదితవాన్ యేన శంఖనాదేన. హే క్షత్తః. ఉపదేవ్యః యక్షస్త్రియః. (6-7)

బలవంతులైన యక్ష మహాభటులు ఆ శంఖనాదమును సహించలేక, ఆయుధములు ఎత్తి, బయటకు వచ్చి ధ్రువుడి దిక్కు పరిగెత్తిరి. 7

శ్లో॥ సతానాపతతో వీర ఉగ్రధన్వా మహారథః ।
ఏకైకం యుగపత్సర్వానహన్బాణైస్త్రిభిస్త్రిభిః ॥ 8

ఓ వీర విదురా! గొప్ప ధనస్సుగల మహారథుడైన ఆ ధ్రువుడు మీద వచ్చిపడ్డ యక్షసైన్యమును ఒక్కొకరిని మూడు బాణములచే సుమారు ఒకలక్షా ముప్పదివేల మందిని ఒకేమారు కొట్టెను. 8

శ్లో॥ తే వై లలాటలగ్నైస్తైరిషుభిస్సర్వ ఏవ హి ।
మత్వా నిరస్తమాత్మానమాశంసన్కర్మ తస్య తత్ ॥ 9

టీ;- స ఇతి. ఇత్యేవం సర్వాన్. త్రయోదశాయుతాని యక్షాన్. యుగపత్. అహన్ జఘాన. (8-9)

యక్షలందరూ లలాటముమీద తగులుకొన్న బాణములచే, పరాజితులమైతిమని తలచి అతడి యుద్ధకౌశల్యమును ప్రశంసించిరి. (9)

శ్లో॥ తే౽పి చాముమమృష్యంతః పాదస్పర్శమివోరగాః ।
శరైరవిధ్యన్యుగపద్ద్విగుణం ప్రచికీర్షవః ॥ 10

టీ;- త ఇతి. తే౽పి తత్కర్మ అసహమానాః అముం అవిధ్యన్. ద్విగుణం యథా భవతి. తథా షడ్భిః ప్రతికర్తుమిచ్ఛంతః. 10

ఆ యక్షులు గూడా తోకత్రొక్కిన పాములవలె సహించలేనివారై ఎదురుదాడిచేయాలని ఆరు ఆరు బాణములతో ఒకే మారు కొట్టిరి. (10)

శ్లో॥ తతః పరిఘనిస్త్రింశైః ప్రాసశూలపరశ్వధైః ।
శక్త్యృష్టి భిర్భుసుంఢీభిశ్చిత్ర వాజైశ్శరైరపి ॥ 11

అటు పిమ్మట గుదియలతో, కత్తులతో, ఈటెలతో, శూలముల తో,గండ్రగొడ్డల్లతో,చిల్లకోలలతో (ఈటెలలో విశేషము). భిశుండియను ఆయుధములతో విచిత్రమైన రెక్కలుగల బాణములచే.. (యుద్ధము చేసిరి)11

శ్లో॥ అభ్యవర్షన్ప్రకుపితాస్సహయం సహ సారథిమ్ ।
ఇచ్ఛంత స్తత్ప్రతీ కర్తుమయుతానాం త్రయోదశ ॥ 12

టీ;- తత ఇతి. చిత్రవాజైర్విచిత్రపక్షైః. (11-12)

ఒక లక్ష ముప్పదివేలమంది యక్షులు కోపించి, ప్రతీకారము చేయుటకు సారథిసహితమైన రథముగలిగిన ధ్రువునికి అభిముఖముగా బాణ వర్షమును కురిపించిరి. 12

శ్లో॥ ఔత్తానపాదిస్స తదా శస్త్రవర్షేణ భూరిణా ।
న చైవాదృశ్యతచ్ఛన్న ఆసారేణ యథా గిరిః ॥ 13

టీ;- ఔత్తానపాదిరితి. అసారేణ ధారాసంపాతేన. ఛన్నో గిరిరివ. నైవాదృశ్యత. 13

ధ్రువుడప్పుడు శస్త్రవర్షములచేత కప్పబడి, గొప్ప వర్షధారలచే కప్పివేయబడ్డ పర్వతము కనిపించని తీరుగా కనిపించలేదు. (బాణములచే నింపివేయబడెను) 13

శ్లో॥ హాహాకార స్తదైవాసీత్సిద్ధానాం దివి పశ్యతామ్ ।
హతోఽయం మానవస్సూర్యో మగ్నః పుణ్యజనార్ణవే ॥ 14

టీ:- హాహాకార ఇతి. సూర్యతుల్యః. 14

సిద్ధులు దివినుంచి చూచుచుండగా, హాహాకారము బయలుదేరెను. మనువంశమున పుట్టిన సూర్యుడు యక్షులనే సముద్రమున క్రుంగుచున్నాడని...(తలచిరి) 14

శ్లో॥ నదత్సు యాతుధానేషు జయకాశిష్వథో మృధే ।
ఉదతిష్ఠద్రథస్తస్య నీహారాదివ భాస్కరః ॥ 15

టీ:- న దత్స్వితి. యాతుధానేషు జయకాశిషు జితం జితమితి జయప్రకాశకేషు సత్సు. 15

యుద్ధమున యక్షులు విజయము ప్రకటించుకొని నాదము చేయుచుండగా, (వెంటనే) పొగమంచులో నుండి సూర్యుడు ఆవిర్భవించినట్లు ధ్రువుడి రథముపైకి వచ్చెను. 15

శ్లో॥ ధనుర్విష్ఫూర్జయన్నుగ్రం ద్విషతాం ఖేదముద్వహన్ ।
అస్త్రౌఘం వ్యధమద్బాణైర్ఘనానీకమివానిలః ॥ 16

టీ:- ధనురితి. వ్యధమత్ సంచూర్ణయామాస. 16

దివ్యమైన ధనస్సుతో టంకారధ్వనులను కలిగిస్తూ శత్రువులకు దుఃఖమును కలిగించుచూ, తన బాణములచే వారి అస్త్ర సమూహ-మును, దట్టమైన మేఘములను గాలి చెదరగొట్టినట్లుగా చెదరగొట్టెను. (16)

శ్లో॥ తస్య తే చాపనిర్ముక్తాః భిత్త్వా వర్మాణి రక్షసామ్ ।
కాయానా వివిశుస్తిగ్మాః గిరీనశనయో యథా ॥ 17

ధ్రువుని ధనస్సునుండి వెలువడిన వాడియైన బాణములు, పర్వతములయందు పిడుగులు ప్రవేశించినటుల యక్షుల కవచములను పగులగొట్టి శరీరమున ప్రవేశించెను. 17

శ్లో॥ భల్లైస్సంఛిద్యమానానాం శిరోభిశ్చారుకుండలైః ।
ఊరుభిర్హేమతాళా భైర్దోర్భిర్వలయ వల్గుభిః ॥ 18

టీ:- తస్యేతి. వర్మాణి కవచాని. (17-18)

శ్లో॥ హార కేయూర మకుటైరుష్ణీషైశ్చ మహాధనైః ।
ఆస్తృతాస్తా రణభువో రేజుర్వీర మనోహరాః ॥ 19

టీ:- హారేతి. శిరః ప్రముఖైరంగైరాస్త ృతాః. ప్రకీర్ణాః. రేజురితి ద్వయో రన్వయః. 19

అర్ధ చంద్రాకార బాణములచే తెగగొట్టబడిన, సుందరమైన కుండలములుగల తలలచే, బంగారు తాటిచెట్లవంటి తొడలచే, సుందరమైన కంకణములుగల బాహువులచే, హారములు, అంగములు, కిరీటములు, మిక్కిలి విలువ కలిగిన తలపాగలచే యుద్ధము జరిగిన స్థానము చెల్లాచెదరై వీరమనోహరములైనవి. 18, 19

శ్లో॥ హతావశిష్టా ఇతరే రణాజిరా
ద్రక్షోగణాః క్షత్రియవర్యసాయకైః ।
ప్రాయో వివృక్ణావయవా విదుద్రువు
ర్మృగేంద్ర విక్రీడిత యూథపా ఇవ ॥ 20

టీ:- హతేతి. ప్రాయః బాహుళ్యేన వివృక్ణాస్సంఛిన్నాః అవయవా యేషాం తే. 20

చంపబడగా మిగిలిన యక్షులు, ధ్రువుని బాణములచే చాలమటుకు అవయవములు తెగినవారై, శ్రేష్ఠమైన సింహముచే తరుమబడిన ఏనుగుల గుంపువలె యుద్ధరంగమునుండి పారిపోయిరి. (20)

శ్లో॥ అపశ్యమానస్స తదాతతాయినం
మహామృధే కంచన మానవోత్తమః ।
పురీం దిదృక్షన్నపి నావిశద్ద్విషాం న
మాయినాం వేద చికీర్షితం జనః ॥ 21

టీ:- అపశ్యమాన ఇతి. ఆతతాయినాం శస్త్రపాణిం. 21

శ్లో॥ ఇతి బ్రువం శ్చిత్రరథస్స్వసారథిం
యత్తః పరేషాం ప్రతియోగశంకితః ।
శుశ్రావ శబ్దం జలధేరివేరితం
నభస్వతో దిక్షు రజోన్వదృశ్యత ॥ 22

అప్పుడు మనువంశములో శ్రేష్ఠుడైన ధ్రువుడు, ఆ మహాయుద్ధమున ఆయుధమును ధరించిన ఒక్క శస్త్రధారిని కానక, శత్రువుల పట్టణమును చూడాలనే కోరిక ఉన్నప్పటికీ, ఆ పురములో ప్రవేశించలేదు. మాయావులైన వారు ఏమిచేయగోరుచున్నారో మానవుడు తెలుసుకోలేడు కదా! అని రంగురంగుల రథముగల ధ్రువుడు తన సారథితో చెప్పుచూ, శత్రువులైన యక్షులు మరల ప్రయత్నము చేయుదురని శంకించుచుండగా, సముద్ర ఘోషవంటి శబ్దము వినెను. వాయువులచే దిక్కులు నిండిన దూళిని చూచెను. (21, 22)

టీ:- ఇతీతి. ఇతి బ్రువన్ ఇత్యత్రాపి న మాయినామిత్యా దేరనుషంగః చిత్రరథః ధ్రువః యత్తః యత్నవాన్. ప్రతియోగః పునరోగ్యః తస్మాత్ శంకితః నభస్వతః వాయోర్వ్తోః. 22

శ్లో॥ క్షణేన చ్ఛురితం వ్యోమ ఘనానీకేతన సర్వతః ।
విస్ఫురత్తటితా దిక్షు త్రాసయంత్స్తనయిత్నునా ॥ 23

టీ:- క్షణేనేతి. విస్ఫుర్యంతః తటితో యస్మిన్ తేన త్రాసయంతః స్తనయిత్నవః. ఆశనయః యస్మిన్. 23

అన్ని దిక్కులలో దట్టమైన మేఘములచే, క్షణములో ఆకాశము కప్పివేయబడెను. ఆ మేఘములలో మెరుపులు ప్రకాశించగా, పిడుగులు భయమును కలిగించుచుండెను. 23

శ్లో॥ వవృషూ రుధిరౌఘాసృక్పూయవిణ్మూత్ర మేదసః ।
నిపేతుర్గగనాదస్య కబంధాన్యగ్రతోఽనఘ ॥ 24

టీ:- వవృషురితి.వవృషుః నిపేతురిత్యర్థః. న సృజతి శరీరమితి అసృగిహ శ్లేష్మాదిమేదసః మేదాంసి. పుంస్త్వమార్షం. అస్యాగ్రతో నిపేతుః (24)

పాపరహితుడవైన ఓ విదురా! ఆ మేఘము రక్తధారలు, శ్లేష్మము, చీము, మల మూత్రములు, కొవ్వు వర్షించెను. అసృక్ అనగా శరీరమును ఇది సృజించదు కనుక అసృక్ శ్లేష్మ మేదాంసి అని నపుంసకమున ఉండవలసిన ప్రయోగము. మేదసః అని పుంలింగమున ఉండుట, ఆర్ష ప్రయోగము. 24

శ్లో॥ తతః ఖేఽదృశ్యత గిరిర్నిపేతుస్సర్వతో భువమ్ ।
గదా పరిఘ నిస్త్రింశముసలాస్సాశ్మవర్షిణః ॥ 25

టీ:- తతఇతి.సాశ్మ వర్షిణః అశ్మసహితం యద్వర్షం తద్వంతః.25

అటు పిమ్మట ఆకాశమున పర్వతము కనబడినది. అన్ని దిక్కులలో రాళ్ళవర్షముతోపాటు గదలు, గుదియలు, రాళ్ళు, రోకళ్ళు పడినవి. 25

శ్లో॥ అహయోఽశని నిశ్వాసా వమంతోఽగ్నిం రుషాక్షిభిః ।
అభ్యధావన్గజా మత్తా సింహ వ్యాఘ్రాశ్చ యూధశః ॥ 26

పాములు, పిడుగులవండి నిట్టూర్పులు విడుచుచూ, కోపపు కన్నుల నుండి అగ్నిని కురిపించుచున్నవి. మదమెక్కిన ఏనుగులు, సింహములు, పెద్దపులులు గుంపులుగుంపులుగా ధ్రువుడికభి-ముఖముగా పరిగెత్తుకొని వచ్చుచున్నవి. 26

శ్లో॥ సముద్ర ఊర్మిభిర్భీమః ప్లావయన్ సర్వతో భువం ।
ఆససాద మహాహ్రాదః కల్పాంత ఇవ భీషణః ॥ 27

టీ:- ఆహోయ ఇతి. అశని వన్నిశ్వాసో యేషాం. (26-27)

ప్రళయకాలపు సముద్రమువలె పెద్దపెద్ద భయంకరమైన అలలతో అన్ని దిక్కుల నుండి భూమిని ముంచుతూ పెద్ద ధ్వని చేయుచు సముద్రము సమీపించెను. 27

శ్లో॥ ఏవం విధాన్యనేకాని త్రాసనాని మనస్వినాం ।
ససృజుస్తిగ్మ గతయ ఆసుర్యా మాయయాసురాః ॥ 28

టీ:- ఏవమితి. త్రాసనాని భయంకరాణి తిగ్మా క్రూరా గతిర్యేషాం. అసుర రాక్షసాది శబ్దైరదూరాంతరత్వేన యక్షా ఏవోచ్యం తే. 28

క్రూరమైన ప్రవృత్తిగల అసురులు వారి వారి ఆసుర మాయచే, అధైర్యవంతులను భయపెట్టే, ఈ విధములైన అనేక మాయలను సృజించిరి. (అసురులన్న, రాక్షసులన్న పెద్దభేదములేదు కనుక వారిని యక్షులనే అందురు). 28

శ్లో॥ ధ్రువే ప్రయుక్తామసురైస్తాం మాయామతిదుస్తరాం ।
నిశమ్య తస్య మునయశ్శమాశంసన్ సమాగతాః ॥ 29

టీ:- ధ్రువ ఇతి. తస్య శం కల్యాణం. ఆశంసన్ ప్రార్థితవంతః. 29

ధ్రువుడి యందు యక్షులు చేసిన దాటరాని మాయా ప్రయోగమును తెలుసుకొని మునులు అతడికి మంచి జరగాలని కోరుకొని, అచ్చటకు వచ్చి ప్రార్థించిరి. 29

మునయ ఊచు

శ్లో॥ ఔత్తానపాదే భగవాంస్తవశార్‌ఙ్గధన్వా
దేవః క్షిణోత్వవనతార్తిహరో విపక్షాన్ ।
యన్నామధేయమభిధాయ నిశమ్య చాద్ధా
లోకోఽఞ్జసా తరతి దుస్తరమంగ మృత్యుం ॥ 30

టీ:- ఔత్తానపాద ఇతి. తవ విపక్షాన్ శత్రూన్. నాశయతు. అద్ధా సాక్షాత్. అంజసా సుఖేనైవ మృత్యుం తరతి. 30

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,
దశమోఽధ్యాయః

మునులనుచున్నారు.

ఓహో ధ్రువా! శిరస్సువంచి నమస్కరించిన వారికి దుఃఖము నశింపజేసేవాడు, శార్‌ఙ్గమనే ధనుస్సుచేత ధరించినవాడు భగవంతుడు నీ శత్రు పక్షమును క్షీణింపచేయుగాక! ఎవరి నామము ఉచ్చరించి, విని (సాక్షాత్) దాటరాని సంసారమను మృత్యువును సుఖముగా దాటవచ్చునో... ( ఆయన రక్షించుగాక!)30

శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు
పదవ అధ్యాయము సమాప్తము.

## ఏకాదశోఽధ్యాయః

శ్లో॥ ఏకాదశే తు యక్షాణాం క్షయం దృష్ట్వా మనుస్స్వయమ్ ।
ఆగత్య వారయామాస ధ్రువం తత్త్వోపదేశతః ॥

## 11వ అధ్యాయము

ఈ పదకొండవ అధ్యాయములో యక్షుల యొక్క క్షయమును చూచి స్వయముగా మనువు ధ్రువుడికి తత్త్వోపదేశముచేసి యుద్ధము నుండి వారించుట చెప్పబడుచున్నది.

### మైత్రేయ ఉవాచ

శ్లో॥ నిశమ్య గదతామేవమృషీణాం ధనుషి ధ్రువః ।
సందధేఽస్త్రముపస్పృశ్యయన్నారాయణ నిర్మితమ్ ॥ 1

### మైత్రేయ మహర్షి పలుకుచున్నాడు.

మహర్షుల యొక్క పలుకులను ఉపదేశమువలె విని ధ్రువుడు ఆచమనముచేసి నారాయణ నిర్మితమైన నారాయణాస్త్రమును ధనుస్సున అనుసంధానము చేసెను. 1

శ్లో॥ సంధీయమాన ఏతస్మిన్మాయా గుహ్యక నిర్మితాః ।
క్షిప్రం వినేశుర్విదురక్లేశా జ్ఞానోదయే యథా ॥ 2

ఓ విదురా! ధ్రువుడు నారాయణాస్త్రమును సంధించగానే, జ్ఞానముదయించగానే అవిద్య, రాగ, క్లేశములు ఏ విధముగా తొలగిపోతాయో ఆ విధముగా యక్షులచే నిర్మితమైన మాయలు తొలగిపోయినవి. 2

టీ:- నిశమ్యేతి. ఏవం గదతాం వచనం. ఉపదేశమివ నిశమ్య. ఉపస్పృశ్య ఆచమ్య. యన్నారాయణ నిర్మితం నారాయణాస్త్రం తత్సందధే. (1-2)

శ్లో॥ తస్యార్షమస్త్రం ధనుషి ప్రయుంజత
స్సువర్ణపుంఖాః కలహంసవాససః ।
వినిస్సృతా ఆవివిశుర్ద్విషద్బలం
యథా వనం భీమరవాశ్శిఖండినః ॥ 3

ఋషియైన నారాయణుని నుండి ఉద్భూతమైన, బంగారు మూలము కలిగి, రాజహంసల రెక్కల వంటి పక్షములు కలిగిన ఆ నారాయణాస్త్రమును ధనుస్సుయందు అనుసంధానముచేసి విడువగా, వెలుబడ్డ బాణములు, భయంకరముగా కేకారవములు చేస్తూ అడవిలో ప్రవేశించిన నెమళ్ళవలె శత్రుబలమున ప్రవేశించినవి. 3

టీ:- కించ. తస్యేతి. తస్య ఆర్షం ఋషేర్నారాయణాదుద్భూతమస్త్రం. ప్రయుంజతః సందధతస్సతః సువర్ణమయాః పుంఖాః మూలప్రాంతా యేషాం. కలహంసానాం వాసాంసి పక్షాః యేషాం తే శరాః వినిస్సృతా ఇతి ద్రష్టవ్యం ఉపరిష్టాచ్ఛిలీముఖగ్రహణాత్. 3

శ్లో॥ తైస్తిగ్మధారైః ప్రధనే శిలీముఖై
రితస్తతః పుణ్యజనా ఉపద్రుతాః
తమభ్యధావన్కుపితా ఉదాయుధా
స్సుపర్ణమున్నద్ధఫణా ఇవాహయః ॥ 4

టీ:- తైరితి. ప్రధనే యుద్ధే ఉన్నద్ధాః ఉచ్ఛ్రితాః ఫణాః యేషాం తే సర్పాః. 4

వాడి అంచులుగల ధ్రువుడి బాణములు యుద్ధమందు యక్షులకు తాకగా, వారు కోపించి ఆయుధములెత్తి, పడగలెత్తిన సర్పములు గరుడిని చుట్టుముట్టినట్టు అతడిని చుట్టుముట్టిరి. 4

శ్లో॥ సతాన్పృషత్కైరభిధావతో మృధే
నికృత్త బాహూరుశిరోధరోదరాన్ ।
నినాయ లోకం పరమర్కమండలం
వ్రజంతి నిర్భిద్య యమూర్ధ్వరేతసః ॥ 5

టీ:- స ఇతి. పృషత్కైర్బాణైః. నికృత్తాః బాహ్వాదయో యేషాం తాన్ పరలోకం నినాయ. కథంభూతాః ఊర్ధ్వరేతసస్సన్న్యాసినః. అర్క మండలం నిర్భిద్య యం వ్రజంతి తం. 5

ఆ ధ్రువుడు యుద్ధమునందు పైపైకి వచ్చుచున్న యక్షుల తొడలు, బాహువులు, శిరస్సులు, ఉదరములు తెగగొట్టి, ఊర్ధ్వ రేతస్కులైన సన్యాసులు సూర్యమండలమును భేదించి ఏ లోకములకు వెళ్ళుదురో ఆ లోకమునకు పంపెను. 5

శ్లో॥ తాన్ హన్యమానానభివీక్ష్య గుహ్యకా
నవాగసశ్చిత్ర రథేన భూరిశః ।
ఔత్తానపాదిం కృపయా పితామహో
మనుర్జగాదోపగతస్సహర్షిభిః ॥ 6

టీ:- తానితి. అనాగసః నిరపరాధాన్. 6

చిత్రమైన రథము కలిగిన ధ్రువుడు నిరపరాధులైన యక్షులను చంపడము చూచి, దయగలిగిన మనువు మహర్షులతోగూడి అచ్చటకు వచ్చి ధ్రువునితో ఇట్లనెను. 6

మనురువాచ

శ్లో॥ అలం వత్సాతిరోషేణ తమోద్వారేణ పాప్మనా ।
యేన పుణ్యజనా నేతానవధీస్త్వమనాగసః ॥ 7

మనువు పలుకుచున్నాడు.

నాయనా ధ్రువా! నరకమునకు ద్వారము పాపాత్మకమైన అతి కోపము. ఆ కోపముచేత నిరపరాధులైన పుణ్యవంతుల చంపినావు. ఇక కోపము చాలు. 7

శ్లో॥ నాస్మత్కులోచితం తాత కర్మైతత్సద్విగర్హితమ్ ।
వధో యదుపదేవానామారబ్ధస్తేఽకృతైనసామ్ ॥ 8

టీ:- అలమితి. తమసః నరకస్య. ద్వారేణ. యేన రోషేణ. (7-8)

నాయనా! ఏ పాపమెరుగని యక్షులను సంహరించడం ప్రారంభించినావు. అది మహాపురుషులచే నిందింపబడే పని. ఇది మన వంశానికి తగనిది. 8

శ్లో॥ నన్వేకస్యాపరాధేన తత్సంగాద్బహవోహతాః ।
భ్రాతుర్వధాభి తప్తేన త్వయాంగ భ్రాతృ వత్సల ॥ 9

టీ:- నను మద్భ్రాతృహంతారః కథమకృతైనసస్తత్రాహ-నన్వితి. 9

(తాతయ్యా! నా తమ్ముడిని చంపిన వీరు ఏ విధముగా పాపము చేయని వారు అవుతారు అని అంటావేమో.) ఓయీ భ్రాతృవత్సలా! ఎవడో ఒకడు నీ తమ్ముడిని చంపి అపరాధము చేసినాడు. నీ తమ్ముడిని చంపినాడని కోపముచే తమభాదచే చాలామంది చనిపోయినారు. 9

శ్లో॥ నాయం మార్గో హి సాధూనాం హృషీకేశానువర్తినామ్ ।
యదాత్మానం పరాగ్గృహ్య పశువద్భూతవైశసమ్ ॥ 10

వారు అపరాధము చేసినప్పడికీ, నీకు ఈ పని యోగ్యమైనది కాదు. ఎందుకనగా బాహ్యమైన దేహాదులయందు ఆత్మబుద్ధి కలిగి, పశువులవలె ప్రాణులను హింసించడం, ఇంద్రియములను నియంత్రించి, భగవానుడిని అనుసరించే సాధుజనుల మార్గము కాదు. (10)

శ్లో॥ సర్వభూతాత్మభావేన భూతావాసం హరిం భవాన్ ।
ఆరాధ్యాప దురారాధ్యం విష్ణోస్తత్పరమం పదమ్ ॥ 11

టీ:- సత్యప్యపరాధే తవైతదుచితం న భవతీత్యాహ-నేతి.పరాగ్గృహ్య పరాగ్భూతం దేహం ఆత్మానం గృహీత్వా. పశవో యథా దేహాభిమానా దన్యోన్యం ఘ్నంతి. తథాభూతానాం వైశసం హింసేతి యత్. (10-11)

నీవు బాల్యములో సాధుజనుడవై, సర్వభూతములయందు ఆత్మభావముచేత, సర్వభూతములకు ఆధారభూతమై దురారాధ్యుడైన హరిని ధ్యానించి, విష్ణుభగవానుడి సర్వోత్కృష్టమైన స్థానమును పొందినావు. ఇప్పుడు సాధుత్వమునకు విరుద్ధంగా ఇలా ఎందుకు చేసినావు? 11

శ్లో॥ సత్వం హరేరనుధ్యాతస్తత్పుంసామపి సమ్మతః ।
కథం త్వవద్యం కృతవాననుశిక్షన్ సతాం వ్రతమ్ ॥ 12

టీ:- యస్త్వం బాల్యే సాధుః స ఇదానీం కథమన్యధా కృతవానిత్యాహ-ద్వాభ్యాం స ఇతి. అనుధ్యాతః హృదిస్థితః. తత్పుంసాం హరిదాసానామపి. సాధుత్వేన సమ్మతః. 12

నీవు బాల్యమందే సదాచరణ ద్వారా శ్రీహరి హృదయమందు నిలిచియున్నావు. శ్రీహరి దాసులకు కూడా సమ్మతుడవైనవాడవు. నారదుడిద్వారా సత్పురుషుల నియమ నిష్ఠలను నేర్చుకొనికూడా ఈ నింద్యమైన పనిని ఎందుకు చేసినావు? 12

శ్లో॥ తితీక్షయా కరుణయా మైత్ర్యా చాఖిలజంతుషు ।
సమత్వేన చ సర్వాత్మా భగవాన్ సంప్రసీదతి ॥ 13

టీ:- సతాం వ్రతమేవహా-తితిక్షయేతి. మహత్సు తితిక్షయా. నీచేషు కరుణయా. సమేషు మైత్ర్యా. అఖిలేషు జంతుషు సమత్వేన చ. 13

సత్పురుషుల ఆచరణలు చెప్పుచున్నాడు. పెద్దలపట్ల ఓర్పుచే, చిన్నవారియందు కరుణచే, సములయందు స్నేహముచే, అఖిల ప్రాణులయందు సమబుద్ధి ఉన్నవానికి సర్వాత్మకుడైన భగవంతుడు చక్కగా ప్రసన్నుడు అవుతాడు. 13

శ్లో॥ సంప్రసన్నే భగవతి పురుషః ప్రాకృతైర్గుణైః ।
విముక్తో జీవనిర్ముక్తో బ్రహ్మనిర్వాణమృచ్ఛతి ॥ 14

టీ:- తతః కృతార్థో భవతీత్యాహ - సంప్రసన్న ఇతి. సంప్రసన్నేసతి. గుణైర్విముక్తః. అతఏవ తత్కార్యేణ. జీవేన లింగశరీరేణ నిర్ముక్తస్సన్. నిర్వాణం సుఖాత్మకం బ్రహ్మ ప్రాప్నోతి. 14

భగవంతుడు ప్రసన్నుడైతే పురుషుడు రజః సత్వ తమో గుణముల నుండి ముక్తుడై, తత్కార్యమైన లింగశరీరము నుండి విముక్తుడై, సుఖాత్మకమైన బ్రహ్మభావమును పొందుతాడు. 14

శ్లో॥ భూతైః పదంభిరారబ్ధైర్యోషిత్పురుష ఏవ చ ।
తయోర్వ్యవాయాత్సంభూతిర్యోషిత్పురుషయోరిహ ॥ 15

టీ:- పూర్వం భ్రాతృహంతృత్వ మంగీకత్యోక్తం. ఇదానీంనాత్మనో భ్రాతృ పుత్రాది సంబంధః న చాన్యోన్యం హంతృత్వాదిక మపీత్యాహ - భూతైరితి. భూతైః పంచభిః. ఆరబ్ధైః దేహాద్యాకారేణ పరిణతైః

ఇంతవరకు నీ తమ్ముడిని చంపినారని యుద్ధము చేయడాన్ని గూర్చి చర్చించి ఇప్పుడు అసలు ఆత్మకు అన్నా తమ్ముడు అను సంబంధమేలేదు. అదేలేనప్పుడు ఒకరినొకరు చంపడమనేదేలేదు. అని చెప్పుచున్నాడు. భూమ్యాది పంచభూతముల పరిణామముచే స్త్రీదేహము, పురుష దేహము అని వ్యవహరించబడుచున్నవి. ఆ స్త్రీ, పుందేహ మైథునముచే వేరొక స్త్రీ పురుష దేహముల యొక్క జన్మ

.యోషిత్పురుషశ్చేతి ప్రసిద్ధం తయోః వ్యవాయాౌత్ మైథునాత్. సంభూతిః అన్యయోః యోషిత్పురుషయోః ఇహ సంసారేభవతి. 15

సంసారములు ఏర్పడుచున్నవి. 15

శ్లో॥ ఏవం ప్రవర్తతే సర్గః స్థితిస్సంయమ ఏవ చ ।
గుణవ్యతికరాద్రాజన్మాయయా పరమాత్మనః ॥ 16

టీ:- ఏవమితి. ఏవం తావత్సర్గః ప్రవర్తతే. ఏవం పాలకాకారేణ పరిణతైర్భూతైరేవ స్థితిః. హంతృదేహాకారపరిణతైః సంయమస్సంహారశ్చ. న చ పరమాత్మనో మాయాగుణాత్మనాం వ్యతికరాత్సంబంధాద్భవతి. న తు స్వతః. 16

పంచభూత పరిమాణాత్మకమైన స్త్రీ పురుషదేహ మైథునముచేత దేహసృష్టి. ఈ విధముగానే తల్లిదండ్రుల ఆకారముగా పరిణమించిన పంచభూతములవల్ల స్థితి. దొంగలు, పులులు, సర్పాలు మొదలగు సంహార దేహాద్యాకారముగా పరిణమించిన పంచభూతములచే సంహారము అయితే సత్వ రజస్తమో గుణముల పరిణామము స్వతంత్రముగానా? అంటే కాదు. పరమాత్ముడి మాయ ద్వారా ఇది జరుగును. దీని ద్వారా సాంఖ్యమత నిరాకరణము. (విశేష విషయములు బ్రహ్మసూత్రాంతర్గత ఈక్షత్యధికరణమున చూడవచ్చును) (16)

శ్లో॥ నిమిత్త మాత్రం తత్రాసీన్నిర్గుణః పురుషర్షభః ।
వ్యక్తావ్యక్తమిదం విశ్వం యత్ర భ్రమతి లోహవత్ ॥ 17

టీ:- నను జడానాం దేహానాం గుణానాం వా కథం సర్గాది హేతుత్వం? తత్రాహ-నిమిత్తమాత్రమితి. నిమిత్తమాత్రం పురుషర్షభః ఈశ్వరః. యత్ర యస్మిన్నిమిత్తే సతి. కార్యకారణాత్మకం విశ్వం. భ్రమతి

జడాత్మకమైన శరీరములకుకాని, లేదా వాటికి కారణమైన గుణములకు కాని సృష్ట్యాది కారణము ఎట్లు? అనగా సృష్ట్యాదుల యందు నిమిత్తమాత్రమై నిర్గుణుడైన ఈశ్వరుడు కలడు. ఏ పరమాత్మ నిమిత్తుడైయుండగా ఈ కార్యకారణాత్మకమైన ఏ విధముగా అయస్కాంతము నిమిత్తముగా ఇనుము కదలాడుచున్నదో అలా జగత్తు పరివర్తనము చెందుతుంది. (కదలికలు లేని ఇనుము కదిలినట్టుగా

పరివర్తతే యథా అయస్కాంతే నిమిత్తే సతి. లోహం పరివర్తతే తద్వత్. (17)

శ్లో॥ స ఖల్విదం భగవాన్కలశక్త్యా
గుణప్రవాహేణ విభక్తవీర్యః ।
కరోత్యకర్తేవ నిహంత్యహంతా చేష్టా
విభూమ్నః ఖలుదుర్విభావ్యా ॥18

టీ:- నను స చేన్నిమిత్తం. తర్హి తస్యా విశేషాద్యుగపదేవ. సర్గాది త్రయం భవేదత ఆహ-స ఇతి. కాలశక్త్యా. క్రమేణ గుణానాం ప్రవాహః క్షోభః తేన. విభక్తం సృష్ట్యాదివిషయం. వీర్యం శక్తిర్యస్య సః నను కాలోఽపి గుణాన్ యుగపదేవ క్షోభయతు తత్రాహ. చేష్టా కాలశక్తిః . దుర్విభావ్యా అచింత్యా. 18

శ్లో॥ సోఽనంతోఽంతకరః కాలోఽనాదిరాదికృదవ్యయః ।
జనం జనేన జనయన్మారయన్మృత్యునాంతకమ్ ॥ 19

జడాత్మకమైన జగత్తు చేతనాత్మకమవుతుంది. నిర్గుణ బ్రహ్మ నిమిత్తముగా) 17

పరమాత్మ నిమిత్తముగా పరివర్తనము చెందినప్పుడు ఒకేమారు సృష్టి, స్థితి, లయములు జరగాలికదా! అనగా, సృష్ట్యాది నిమిత్తమైనది కాలశక్తి.అనగా పరమాత్మశక్తి, ఆ శక్తి ద్వారా సత్వాది గుణములలో క్రమముగా కదలిక, ఆ కదలికలో భగవచ్ఛక్తి విభాగము చేయబడినది. సత్వాది శక్తిగా, శక్తిమంతులలో భేదము కనుక ఆ భగవానుడు అకర్తయైనప్పటికీ విశ్వమును సృజించుచున్నాడు. స్థితి, లయములు చేయుచున్నాడు. ఆ కాలశక్తియే కారణమైనప్పుడు కాలము చేతనే ఒకేమారు సృష్ట్యాదులు జరగని అనగా సత్వాదిగుణములలో కదలిక ఒకేమారు జరగకుండా అనగా మహాత్ముడైన భగవంతుడిచేష్ట, కాలశక్తి నిశ్చయముగా అచింత్యమైనది. (అందులకు జరగవలసిన పద్ధతులలోనే జరుగుతుంది).. 18

మరి తల్లి దండ్రులు కంటున్నారు. రాజాదులు పాలిస్తున్నారు. చోరాదులు సంహరింపబడుతున్నారు. ఈశ్వరుడు కాదు కదా! అనగా పిత్రాదుల ద్వారా పుత్రాదుల పుట్టిస్తూ ఆదికర్తగా, మృత్యుహేతువై

టీ:- నను పిత్రాదిస్సృజతి పాలయతి. రాజాదిః నిహంతి చోరాన్. నత్వీశ్వరః తత్రాహ-సఇతి జనేన పిత్రాదినా. జనం పుత్రాదిం జనయన్ జనకః ఆదికృత్. అంతకం చోరాదికం. తన్మృత్యు హేతునా మారయన్. అంతకరః. స్వయమనంతః అనాదిశ్చ. అవ్యయః అక్షిణ శక్తిః అయంభావః. పిత్రాదయో అన్యత ఉత్పత్త్యాదిమంతః. న స్వాతంత్ర్యేణ కారణం. కింతీశ్వర ఏవ తన్నియంతా. సర్వకారణమితి. (19)

చోరాదుల సంహరిస్తు అంతకరుడైతున్నాడు. పాలకాకారమున జనులను పాలిస్తు పాలకుడైనాడు. స్వయముగా అతడు అనంతుడు,ఆనాధి,అక్షీణశక్తి కల వాడు. పిత్రాదులు వేరేవిధముగా పరంపరగా ఉత్పాదులకుకారణమే కాని స్వాతంత్రముగా కారణము కాదు. ఈశ్వరుడేనియామకుడు. అతడే సర్వమునకు కారణము. 19

శ్లో॥ న వై స్వపక్షోఽస్య విపక్ష ఏవ వా
పరస్య మృత్యోర్విశతస్సమం ప్రజాః ।
తం ధావమానమనుధావంత్యనీశా
యథా రజాంస్యనిలం భూతసంఘాః ॥ 20

టీ:- న చైవం కుర్వతోఽపి వైషమ్య ప్రసక్తిః వైషమ్యాభావాదిత్యాహ. పక్షపాతాదిత్యాహ-ద్వాభ్యాం. నేతి. మృత్యురూపస్య సమం యథా భవతి తథా. ప్రజాః కర్మభూతాః విశతస్తస్య. సామ్యేషు భూతేషు. ఫలవైషమ్యం. తత్తత్కర్మ వశాదితి. సదృష్టాంతమాహ. తంధావంత మనుధావంత్యనీశాః కర్మా ధీనాః భూతసంఘాః. ధావంతి. అనిలం ధావంత మనురజాంసీవ తత్ర యథా రజసాం. తమఃప్రకాశజలాగ్న్యాది ప్రవేశాదిపి. నానిలస్య వైషమ్యాదేవమీశ్వర స్యాపీతి భావః. 20

ఈ విధముగా చేసినప్పటికి ఈశ్వరున్ని భేదముగా చూడడమన్న ప్రసక్తిలేదు ఎందుకనగా పక్షపాత బుద్ధి లేదు కనుక. మృత్యు స్వరూపమైన కాలరూపుడై వారి వారి కర్మానుసారముగా ప్రాణుల విషయములో సమముగా ప్రవర్తిస్తున్నాడు. ఆయనకు నాపక్షము, శత్రుపక్షము అన్న భేదములేదు. అతడు సమంగా ప్రవర్తించినప్పుడు ఫలభేదము ఎందుకు కనబడుతుంది? అనగా అది వారి కర్మను అనుసరించి అని దృష్టాంత పురస్సరముగా చెప్పుచున్నాడు. అతడు పరిగెత్తుతుండగా(అనగా కాలము) అతడిననుసరించి కర్మాధీనములైన భూతసంఘములు పరుగెత్తుచున్నవి. గాలి వెళుతున్నప్పుడు గాలినను సరించి మట్టిరేణువులవలె, ఆ మట్టిరేణువులు చీకటి, వెలుగు, నీరు, అగ్ని మొదలగువాటిలో ప్రవేశించినప్పటికి గాలికి విశమ భావములేదు. ఈ విధముగానే ఈశ్వరునకు వైశమ్యము లేదు. 20

శ్లో॥ ఆయుషోఽపచయం జంతోస్తథైవోపచయం విభుః ।
ఉభాభ్యాం రహితస్స్వస్థో దుస్థస్య విదధాతసౌ ॥ 21

టీ:- ఆయుష ఇతి. అపచయం అకాలమృత్యుం. ఉపచయం కాల మృత్యుం. యద్వా. అపచయం మశకాదౌ. ఉపచయం దేవాదౌ. స్వయం స్వస్థత్వాదుపచయాపచయాభ్యాం రహితోఽసౌ విభుః దుస్థస్య కర్మాదీనస్య. విదధాతి కరోతి. 21

ఈశ్వరుడు సర్వవ్యాపకుడు. ఉపచయ, అపచయ రహితుడు. స్వస్వరూపముయందు ఉండువాడు. ఈ ఈశ్వరుడు కర్మాధీనుడైన జీవుడికి ఆయుస్సు యొక్క అకాలమృత్యువును పరిపూర్ణ ఆయుస్సును (కాలమృత్యువును) అథవా దేహాది మశకాది అపచయము, దేవాది ఉపచయ సృష్టి మరియు లయములు అపచయములను కలిగించు-చున్నాడు. 21

శ్లో॥ కేచిత్కర్మ వదంత్యేనం స్వభావమపరే నృప ।
ఏకే కాలం పరే దైవం పుంసః కాముతాపరే ॥ 22

టీ:- ఏవంభూతశ్చేశ్వరస్సర్వవాదినాం సంమతః. వివాదాస్తు నామమాత్ర ఇత్యాహ-కేచిదితి. పుంసః కామం. వాత్స్యాయనాదయః శ్రుతిశ్చ. కామోఽకార్షీత్కామః కరోతి నాహం కరోమి కామః కర్తా నాహం కర్తా కామః కారయితా నాహం కారయితేత్యాది. 22

ఓ రాజా! జడకర్మఫలప్రదుడైనవాడు ఈశ్వరుడు సర్వసమంతుడు. వివాదము కేవల నామమాత్రముచేతనే, కలుగు-చున్నది. కర్మమీమాంసకులు కర్మయని? లోకాయతికులు స్వభావం. సంస్కారము అని; పౌరాణికులు కాలమని; జ్యోతిష్కులు గ్రహాది రూపమునగల దైవమని; పురుషుడి కామమే ఈశ్వరుడని, వాత్స్యాయన, భరతాదులు; మృతి, కామోకార్షీన్నమోనమ కామో కార్షిత్ కామః కరోతి నాహం కరోమి, కామ కర్తా నాహం కర్తా కామః కారయితా నాహం కారయితా ఏషతే కామ కామాయస్వాహా (తైత్తరీయ ఆరణ్యకం 10-61) ఓ దేవతలారా! నేను పూర్వము చేసిన పాపములన్నీ మకరధ్వజుడే చేసినాడు. నా కర్తృత్వములేదు అతడే కర్త ఎందుకనగా సర్వజగములను అతడి వశములో ఉంచుకొన్నాడు. మనుష్యులు అస్వతంత్రులు కావున, నేను కారయితనుగూడా కాను. ఆ కాముడు చేసిన పాపము నివృత్తర్థ్యం కమనీయవిగ్రహా ఇదిగో ఆహుతి. 22

శ్లో॥ అవ్యక్తస్యాప్రమేయస్య నానాశక్త్యుదయస్య చ ।
న వై చికీర్షితం తాత కో వేదాద్ధా స్వసంభవమ్ ॥ 23

టీ:- నను కర్మాదీనాం జడత్వాత్ స్వరూపతో భిన్నత్వాచ్చ కథమైక-మత్యం తత్రాహ-అవ్యక్తస్యేతి. అవ్యక్తస్య నిర్గుణస్య అత ఏవా ప్రమేయస్య. తథాపి సత్త్వే హేతుః. నానా శక్తీనాం మహదాదీనాముదయః యస్మాత్. చికీర్షితమేవ తావత్కోఽపి న వేద. అథ స్వస్య సంభవో యస్మాత్తం. ఈశ్వరం కోవేద.న కోఽపివేద. అద్ధేతిపాఠే సాక్షాత్. అతస్తత్త్వజ్ఞానాభావాత్. విశేషాంశే వివాద ఇత్యర్థః. తథా చ శ్రుతిః. “కో అద్ధావేద క ఇహ ప్రవోచత్కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః అర్వాగ్దేవా అస్య విసర్జనాయ. అథా కోవేద యత ఆ బభూవే”త్యాది. 23

మరి కర్మాదులకు జడత్వాదులచేత స్వరూపమువల్లగూడా భేదము కలుగుచుండగా ఎట్లు ఏకత్వము అనగా (కర్మజడమని నిరూపితము. ఆ జడాత్మకమైన కర్మలలోగూడా వాటివాటి స్వరూపమునుబట్టి భేదము గలదు.) జడకర్మఫలప్రదుడు ఈశ్వరుడు అని అనుకొన్నాము. నాయనా నిర్గుణుడైనట్టివాడు అందుకే ప్రమాణ గోచరుడు కాడు. అయినప్పటికి గలడడానికి కారణమేమనగా, మహదాది శక్తులు ఎవడి నుండి పుట్టుచున్నవో అట్టివాడు చేయ ఇచ్ఛయనుట మాత్రమే. నిజానికి ఎవ్వడు తెలియదు. తనే ఎక్కడ నుండి పుట్టినాడో? అట్టి వాడిని తను ఏమి తెలుసుకుంటాడు. ఎవ్వడు తెలుసుకోలేడు. ‘కోవేదాద్ధస్య సంభవమ్’ అని పాఠం ఉంటే అద్ధాఅన్నప్పుడు సాక్షాత్ అని అర్థం చెప్పుకోవాలి. యథార్థ జ్ఞానము లేకుండుటవల్ల విశేష అంశములో వివాదమేర్పడుతుంది. దీనినిగూర్చే యజుర్వేద బ్రాహ్మణం. 2కాండ, 8ప్రశ్న-9అనువాకం ‘కోఅద్ధావేదిక ఇహప్రవోచత్ । కుత ఆజాత్తా కుత ఇయంవిసృష్టిః । ఆర్వాక్‌దేవాఅస్య విసర్జనాయ । అథాకోవేద యతా బభూవ. ఇచ్చట కొంతమంది వేదాంతాన్ని విడిచి వారి వారి బుద్ధి బలముచే వేరు వేరుగా ఊహిస్తారు. కణాద, గౌతమాదులు పరమాణువులే మూలకారణమని, కపిలుడు మొదలగు వారు స్వతంత్రము అచేతనము ప్రధానము జగత్తుకు మూలకారణమని; మాధ్యందినులు శూన్యము నుండియే జగదుత్పత్తి

యని, లోకాయతికులేమో జగత్తునకు కారణమేలేదు స్వభావముగానే ఇట్లుంటుందని అందురు. వీళ్ళంతా భ్రాంతిలో పడినవారే. సాక్షాత్తుగా జగత్కారణమును ఏ పురుషుడు తెలుసుకుంటాడు? తెలుసుకోకుండా, జగత్కారణమును స్వయముగా దర్శించకుండా జగత్కారణ స్వరూప -మిట్టిదని చెప్పడానికి ఎవరికి చేతనౌతుంది? ఇక్కడ చెప్పదలచిన విషయమేమంటే ఈ విధమైన సృష్టి ఏ ఉపాదాన కారణము నుండి సంపూర్ణముగా ఉత్పన్నమైనది. ఏ నిమిత్తకారణము నుండి ఉత్పన్నమైనది? ఈ సృష్టికి నిమిత్తోపాదానముల గూర్చి చెప్పాలి. అది చెప్పడానికి సాధ్యంకాదు. చెప్పడానికి ఎందుకు సాధ్యంకాదు? అనగా చెప్పుచున్నాడు. దేవతలు దీనిని తెలిసికొందురా? లేక మనుష్యులకు తెలియునా? దేవతలుగూడా తెలుసుకొనలేరు ఎందుకనగా జగత్తు పుట్టిన తరువాత వివిధ సృష్టి జరిగిన పిమ్మట దేవతలు ఉన్నారు. సృష్టికి పూర్వములేరు. దేవతలే దీనిని తెలుసుకోలేరంటే వారి పరిస్థితే ఇట్లా ఉండగా వేరే మనుష్యాదులు ఏమి తెలుసుకోగలరు? దేవతలు, మనుష్యులు సృష్టికి పూర్వము లేరు కనుక, సృష్టికి పూర్వావస్థను ప్రత్యక్షముగా చూడలేదు. పోనీ అనుమాన ప్రమాణముద్వారా తెలుసుకొందామా అంటే అనుమానమునకు దృష్టాంతము కావాలి. అవి లేవు కనుక అనుమానప్రయోగము చేయరాదు. కావున చాలా గంభీరమైన పరమార్థతత్త్వము కేవలము వేదము చేత మాత్రమే తెలియనైనది. 23

శ్లో॥ న చైతే పుత్రిక భ్రాతృహంతారో ధనదానుగాః ।
విసర్గాదానయోస్తాత పుంసో దైవం హి కారణమ్ ॥ 24

టీ:- ఈశ్వరవాదస్య ప్రకృతోపయోగమాహ-నేతి. న చైతే భ్రాతృహంతారః. ఉక్తమేవ హేతు మనుస్మారయతి-విసర్గాదానయోర్మృత్యు జన్మనోః దైవం ఈశ్వర ఏవ కారణం. యద్వా విసర్గః సృష్టిః. ఆదానం సంహారః. తయోః దైవం ఈశ్వర ఏవ కారణం. 24

ఈశ్వరవాదము యొక్క ప్రకృత ప్రయోజనము చెప్పుచున్నాడు.

పుత్రుడికి సుఖము ఎవడినుండి కలుగుతుందో అట్టివాడు పుత్రకుడు, మనుమడు. ఓ పౌత్రా! నీ తమ్ముడిని చంపినది ఈ యక్షులు కారు జన్మ మరణములకు అథవా సృష్టి సంహారములకు కారణం. పురుషుడు ఈశ్వరుడే. 24

శ్లో॥ స ఏవ విశ్వం సృజతి స ఏవావతిహంతి చ ।
తథాపి హ్యనహంకారాన్నాజ్యతే గుణకర్మభిః ॥ 25

టీ:- తథాపి నిర్లేపత్వమాహ-స ఇతి. 25

అయినప్పటికి నిర్లేపమును చెప్పుచున్నాడు. అతడే సృష్టిని చేయుచున్నాడు. అతడే రక్షించుచున్నాడు. అతడే సంహరించుచున్నాడు. అయినప్పటికి నేను కర్తనను అభిమానము లేదు కనుక సత్వ రజస్తమో గుణములచేగాని, తజ్జనిత అదృష్టములైన పుణ్య పాపములకు కాని సంబద్ధుడు కాడు. 25

శ్లో॥ ఏష భూతాని భూతాత్మా భూతేశో భూతభావనః ।
స్వశక్త్యా మాయయా యుక్తఃసృజత్యత్తి చ పాతి చ ॥ 26

టీ:- అనహంకారత్వేహేతుమాహ-ఏష ఇతి. 26

తన అనహంకారమునకు కారణము చెప్పుచున్నాడు.

ఈ భగవానుడు సర్వనియంత. సర్వపాలకుడు, సర్వాత్మ స్వరూపుడు. భేదదృష్టిరహితుడు అగుచు స్వశక్తిస్వరూప మాయచే గూడినవాడై స్థావర జంగాత్మకమైన జగత్తును సృష్టి స్థితి లయములు చేయుచున్నాడు. 26

శ్లో॥ తమేవ మృత్యుమమృతం తాత దైవం
సర్వాత్మనోపేహి జగత్పరాయణం ।
యస్మై బలిం విశ్వసృజో హరంతి గావో
యథా వై నసి దామయంత్రితాః ॥ 27

టీ:- సత్యమీశ్వర ఏవ కర్తా. తథాప్యహంకారాది మత్తయా న తుక్తుంశక్యమితిచేత్తత ఆహ - చతుర్భిః. తమితి. మృత్యుమ భక్తానామ్భక్తానాం త్వ మృతం ఉపేహి శరణం గచ్ఛత మే వేత్యవధారణే హేతుః. యస్మై నసి నాసికాయాం దామభిర్బద్ధాః గావ ఇతి. విశ్వసృజో **ఉ** పి నామభిః యంత్రి తా బద్ధాస్సంతః బలిం హరంతి తత్కారితం కర్మ కుర్వంతీత్యర్థః. 27

సత్యమే ఈశ్వరుడే కర్త ఐనప్పటికి అహంకారాదుల విడువ లేకున్నాను అని అనగా, తనకు విముఖులుగా ఉన్నవారికి మృత్యు రూపమై, స్వభక్తులకు అమృతరూపమై జన్మ మరణాదుల నుండి దూరముచేయువాడు. ఈ జగత్తుకు నియామకుడై జగత్తునకు గొప్ప ఆధారమైన అట్టి భగవంతుడినే సర్వాత్మకుడిగా తదేకాగ్రచిత్తుడవై శరణుపొందుము. ముక్కుత్రాడు వేసిన ఎద్దు ఏ విధముగా స్వామి కార్యమును చెప్పినట్టు చేయునో అట్లే బ్రహ్మాదులు గూడా నామముల చేత బద్ధులై వారి వారి అధికారమున ఉంటూ సర్వాత్మకుని ఆజ్ఞను పాలించుచుదురు. 27

శ్లో॥ యః పంచవర్షో జననీం త్వం విహాయ
మాతుస్సపత్న్యా వచసాభిన్నమర్మా ।
వనం గతస్తం తపసా ప్రత్యగక్షమారాధ్య
లేభే మూర్ధ్ని పదం త్రిలోక్యాః ॥ 28

టీ:- తదారాధనం చ తవ సుకరమేవేత్యాహ-య ఇతి. యః పంచ వర్షస్సన్ త్వం యమారాధ్య త్రిలోక్యా మూర్ధ్ని పదం స్థానం లేభే

అయిదు సంవత్సరముల వయస్సులోనే సవతి తల్లి యొక్క వాక్కుచే హృదయము గాయపడి, తల్లిని విడిచి, వనమునకు వెళ్ళి తపస్సుచేత పరమాత్మయందు దృష్టి నిలిపి, ఆరాధించి త్రిలోకముల పైకంటే పైస్థానమును పొందితివి. ఆ స్వరూపమును ఇప్పుడు వెతుకుము. 28

లబ్ధవానసి. ఇదానీం తమేవాన్విచ్ఛ అవలోకయేత్యుత్తరేణాన్వయః. ప్రత్యంచి అక్షాణి ఇంద్రియాణి యస్మిన్ తం క్రియా విశేషణం. 28

శ్లో॥ త్వమేవమంగాత్మని ముక్తవిగ్రహే
వ్యపాశ్రితం నిర్గుణమేకమక్షరమ్ ।
ఆత్మాన మన్విచ్ఛ విముక్త ఆత్మదృగ్య
స్మిన్నిదం భేదమసత్ప్రతీయతే ॥ 29

టీ:- హరిం ధ్యాయంతం ప్రత్యాహ-తమితి. అంగ ధ్రువ. ముక్తవిరోధే ఆత్మని మనసి వ్యపాశ్రిత మవస్థితం ఆత్మదృక్ ప్రత్యగ్దృష్టిస్సన్ అన్విచ్ఛ అవలోకయ అన్వేషణం కుర్విత్యర్థః. ఇదం భేదం అయం భేదో యస్మిన్ తత్. ఇదం భేదం విశ్వమసదేవ యస్మిన్ ప్రతీయతే. 29

శ్లో॥ త్వం ప్రత్యగాత్మని తదా భగవత్యనంత
ఆనందమాత్ర ఉపపన్న సమస్తశక్తౌ ।
భక్తిం విధాయ పరమాం శనకైరవిద్యా
గ్రంథిం విభేత్స్యసి మమాహమితి ప్రరూఢం ॥ 30

టీ:- తదన్వేషణ ఫలమాహ-త్వమితి. తదా అన్వేషణకాల ఏవ. 30

హరిని ధ్యానిస్తున్న వాడిని గూర్చి ఇటుల అనుచున్నాడు.

ఓ ధ్రువా! పరమాత్మ స్వరూపమైన అధిష్ఠానమునందు, దృశ్యమానమైన భేదాత్మక ప్రపంచము అసత్తుగానే కానవచ్చును. అటువంటి ప్రపంచమునుండి మనస్సును విరోధము లేకుండా మరల్చి (విడదీసి) దృష్టిని అంతర్ముఖమొందించి, నిర్గుణుడు, అద్వితీయుడు, నాశరహితుడు, నిత్యముక్తుడు, ఆత్మస్వరూపుడైన శ్రీహరిని అన్వేషించుము. 29

భగవదన్వేషణమువల్ల వచ్చే ఫలితమును గూర్చి చెపుతూ.

ప్రత్యగాత్మయైనట్టి, దేశకాలవస్తు అపరిచ్ఛిన్నమైనట్టి, ఆనంద-మాత్రస్వరూపుడు సమస్త శక్తులుగల భగవంతుడి యందు ఉత్కృష్టమైన భక్తినితో, గట్టిగా వేయబడిన అహంకార, మమకారములను అజ్ఞాన కృతమైన బంధనమును నీవు తెగకొట్టుకోగలవు. 30

శ్లో॥ సంయచ్ఛరోషం భద్రం తే ప్రతీపం శ్రేయసాం పరమ్ ।
శ్రుతేన భూయసా రాజన్నగదేన యథామయమ్ ॥ 31

టీ:- ఉపదేశసారమాహ-ద్వాభ్యాం. సంయచ్ఛేతి. ప్రతీపం ప్రతి కూలం అగదేన ఔషధేన. యథా రోగం నియచ్ఛతి. 31

ఉపదేశసారమును చెప్పుచున్నాడు.

ఓ రాజా! శ్రేయస్సుకు మిక్కిలి ప్రతికూలమైనది రోషము. ఔషధము వల్ల రోగమును ఏ విధంగా నిలువరించుదుమో, ఆ విధముగా బహు శ్రుతుడవైన నీవు రోషమును నిలువరించుము. నీకు మంగళము కలుగుగాక! 31

శ్లో॥ యేనోపసృష్టాత్పురుషాల్లోక ఉద్విజతే భృశమ్ ।
న బుధస్తద్వశం గచ్ఛేదిచ్ఛన్న భయమాత్మనః ॥ 32

ఎవరు కోపముతో నిండి ఉందురో వారిని చూచి జగత్తు మిక్కిలి ఆందోళనము చెందుతుంది. తనకు మేలు జరగాలని అనుకున్న వివేకి దాని (కోపము) ఆధీనము కాగూడదు. 32

శ్లో॥ హేళనం గిరిశ భ్రాతుర్ధనదస్య త్వయాకృతమ్ ।
యజ్జఘ్ని వాన్పుణ్యజనాన్భ్రాతృఘ్నానత్య మర్షితః ॥ 33

టీ:- యేన రోషేణ ఉపసృష్టాత్ వ్యాప్తాత్. (32-33)

నీవు పరమశివుడి సోదరుడైన కుబేరుడిని అవమానపరిచితివి. యక్షులు నీ సోదరుడిని చంపినారను కోపముతో పుణ్యజనులైన వారిని సంహరించితివి. 33

శ్లో॥ తం ప్రసాదయ వత్సాశు సన్నత్యా ప్రశ్రయోక్తిభిః ।
న యావన్మహతాం తేజః కులం నోఽభి భవిష్యతి ॥ 34

ఓ వత్సా! మహనీయుల తేజస్సు మన వంశమును వినాశము చేయకమునుపే, వెంటనే చక్కగా నమస్కరించి వినయ వాక్కులచే ఆ కుబేరుడిని ప్రసన్నుని చేసుకొనుము. 34

శ్లో॥ ఏవం స్వాయంభువః పౌత్రమనుశాస్య మనుర్ధ్రువమ్ ।
తేనాభివందితస్సాకమృషిభిస్స్వపురం యయౌ ॥ 35

తన మనుమడైన ధ్రువుడిని ఈ విధముగా ఆదేశించి స్వాయంభువమనువు ఆతనిచే నమస్కరింపబడి, ఋషి మండల సహితుడై తన పురమునకు వెళ్ళినాడు. 35

టీ:- అన్యచ్చ త్వయా కార్యమిత్యాహ. ద్వాభ్యాం-హేళనమితి. యత్ యతః పుణ్యజనాన్ జఘ్నివాన్ ఘాతితవాన్. (34-35)

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,**
**ఏకాదశోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు**
**పదకొండవ అధ్యాయము సమాప్తము.**

## ద్వాదశోఽధ్యాయః

శ్లో॥ ద్వాదశే ధనదేనాభినందితః పురమాగతః ।
యజ్ఞైరిష్ట్వా హరేః స్థానమారురోహేతి కీర్త్యతే ॥

## 12వ అధ్యాయము

ఈ పన్నెండవఅధ్యాయమున ధ్రువుడు కుబేరుడిచే అభినందితుడై పట్టణమునకు తిరిగివచ్చి యజ్ఞములచే శ్రీహరిని సేవించి శ్రీహరి స్థానమును పొందుట కీర్తింపబడెను.

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ధ్రువం నివృత్తం ప్రతిబుధ్య వైశసా
దపేతమన్యుం భగవాన్ ధనేశ్వరః ।
తత్రాగతశ్చారణ యక్షకిన్నరైః
స్సంస్తూయమానోఽభ్యవత్ కృతాంజలిః ॥ 1

టీ:- ధ్రువమితి. వైశసాత్ వధాత్ నివృత్తం ధ్రువం జ్ఞాత్వా. 1

మైత్రేయుడు ఇట్లు పలికెను.

ధ్రువునికి కోపము తొలిగి వధను చేయడం మానినాడని, తెలుసుకొని భగవాన్ కుబేరుడు చారణ, యక్ష, కిన్నెరులతో సహా అక్కడకు వచ్చి వారిచే స్తుతింపబడుచుండతూ, చేతులు జోడించి నమస్కరించిన అతనిని (ధ్రువుని) చూచి ఈ విధముగా పలికెను. 1

కుబేర ఉవాచ

శ్లో॥ భో భో క్షత్రియ దాయాద పరితుష్టోఽస్మితేఽనఘ ।
యస్త్వం పితామహాదేశాద్వైరం దుస్త్యజమత్యజః ॥ 2

టీ:- భో భో ఇతి. క్షత్రియ దాయాద క్షత్రియ పుత్ర. అత్యజః త్యక్తవానపి. 2

కుబేరుడు ఇలా పలికెను.

ఓ క్షత్రియకుమారా! నీ విషయమున చాలా సంతోషించితిని. ఎందుకనగా? మీ తాతగారు ఆదేశించిన మాత్రముననే విడవడానికి సాధ్యముకాని వైర భావన వదిలి పెట్టినావు. 2

శ్లో॥ న భవనావధీద్యక్షాన్న యక్షా భ్రాతరం తవ ।
కాల ఏవహి భూతానాం ప్రభురప్యయభావయోః ॥ 3

టీ:- న చ వైరస్య కారణమస్తీత్యాహ - నేతి. అప్యయభావయోః మృత్యు జన్మనోః. 3

వైరమునకు కారణమేమీలేదు! మీ తమ్ముడిని యక్షులు చంపలేదు. నీవు యక్షుల చంపలేదు. సర్వ ప్రాణుల జనన మరణములకు కారణము కాలమే. 3

శ్లో॥ అహం త్వమిత్యపార్థధీరజ్ఞానాత్పురుషస్య హి ।
స్వాప్నీ వా భాత్యతద్ధ్యానాద్యయా బంధ విపర్యయౌ ॥ 4

టీ:- కథంతర్హి అసాహ్యంహంతేత్యాదిబుద్ధిసత్రాహ-అహమితి. ఆభాతి ప్రకాశతేజాయత ఇత్యర్థః. అతః ధ్యానాత్. దేహాత్మానుసంధానాత్. యయా ధియా. బంధః కర్మసంబంధః. విపర్యయః దుఃఖాదిః. 4

మరి నేను చంపినాను మొదలగు బుద్ధి ఎందుకు వస్తుంది అనగా, నేను నీవు అనే అవాస్తవమైన బుద్ధి పురుషులకు అజ్ఞానము వలన కలుగుతుంది. ఏ బుద్ధిచే బంధము, దుఃఖాదులు కలుగుచున్నవో అవి దేహానుసంధానమువలన కలుగుచున్నవి. (దేహముయందు ఆత్మ బుద్ధి ఉండడం వలన) ఏవిధముగానైతే స్వప్నముయందు కనబడుచున్నవి అసత్యములో అట్లే స్వదేహమునందు నేనను పరదేహముయందు నీవు అను జ్ఞానము అజ్ఞుడైన పురుషులకు కలుగుటకూడా మిథ్యనే అవుతుంది. 4

శ్లో॥ తద్గచ్ఛ ధ్రువభద్రం తే భగవంతమధోక్షజమ్ ।
సర్వభూతాత్మ భావేన సర్వభూతాత్మ విగ్రహమ్ ॥ 5

శ్లో॥ భజస్వ భజనీయాంఘ్రిమభవాయ భవచ్ఛిదమ్ ।

ఓ ధ్రువా! కావున ఇంటికి వెళ్ళు. వెళ్ళి భగవంతుడైన అధోక్షజుడిని, సకల భూతముల స్వరూపమే శరీరముగా గలవాడిని, భజనీయమైన పాదములు కలవచాడిని, సంసారనివర్తుకిడిని, సత్వరజస్థమోగణము లనే శక్తిచేత యుక్తుడైనవాడిని, యదార్థముగా

యుక్తం విరహితంశక్త్యా గుణమయ్యాత్మమాయయా ॥ 6

టీ:- తత్తస్మాద్గచ్ఛ. గత్వా చ భగవంతం భజస్వేత్యుత్తరేణాన్వయః. సర్వభూతాత్మకో విగ్రహో యస్య. (5-6)

శ్లో॥ వృణీహి కామం నృప యన్మనో గతం
మత్తస్త్వమౌత్తానపదేఽ విశంకితః ।
వరం వరార్హోఽంబుజనాభ పాదయో
రనంతరం త్వాం వయమంగ శుశ్రుమ ॥ 7

టీ:- వృణీహీతి. కామం అసంకోచేన. అవిశంకితః అనంతరం అతినికంటం. 7

కూడుకొని యున్నవాడా? లేదు. ఆత్మమాయచేత కూడినవాడు. కావున యదార్థమునకు మాయా విరహితుడు. (అనగా సృష్టికికారణము సత్మాదిగుణవిశిష్టుడైన పరమాత్మ. సృష్టి యదార్థము కాదు. మరి ఆత్మ మాయచేత సృజించినట్లు కనబడుచున్నాడు. సృష్టి, మిథ్యా అప్పుడు మాయగూడా లేదు. తత్వః నిర్గుణమంటే సృష్టికాలమున సగుణుడై, సృష్టిమిథ్యా జ్ఞానమున నిర్గునుడై అని). సంసారనివృత్తి కొరకు సర్వభూతములయందు సర్వాత్మనే భజించు, సేవించు. ఆత్మ మాయాశక్తిచేత యుక్తుడైనప్పుడు గుణమయమైన రూపము లేనప్పుడు నిర్గుణ రూపము. (5-6)

ఓ ధ్రువా! నిర్భయుడవై సంకోచములేకుండా నీ మనస్సునగల కోరికను కోరుకో! నీవు వరము కోరుటకు అర్హుడవు ఎందుకనగా, పద్మనాభుడి పాదములకు అతి దగ్గరగా చేరినావని నీ గూర్చి మేము వినియున్నాము. 7

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ స రాజరాజేన వరాయ చోదితో
ధ్రువో మహాభాగవతో మహామతిః ।
హరౌ స వవ్రేఽచలితాం స్మృతిం యయా
తరత్యయత్నేన దురత్యయం తమః ॥ 8

టీ:- స ఇతి. సః వరాయ చోదిత ఇత్యనువాదరూపం పృథగ్వాక్యం అతస్స వవ్ర ఇతి తచ్ఛబ్దస్యాపౌనరుక్త్యమ్. (8-9)

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

రాజరాజైన కుబేరుడిచేత వరము కోరుకొమ్మని ప్రేరితుడైన మహాభాగవతోత్తముడు, మహామతియైన ఆ ధ్రువుడు విఘ్నములచేత కదలించడానికి సాధ్యముకాని శ్రీహరి విషయకమైన స్మృతిని కోరెను. ఏ స్మృతి చేత వేరే ఏ మార్గముచేత గూడా దాటడానికి, తొలగించడానికి సాధ్యంకాదో ఆత్మ విషయకమైన అజ్ఞానమును సునాయాసంగా సులభంగా తొల గించకొనవచ్చునో అట్టి స్మృతిని కోరెను. రెండుమార్లు సః-అని వచ్చినది పునరుక్తి దోషంకదా అన్నప్పుడు వేరే వాక్యము చేయడం ద్వారా ఆ దోషంలేదు. 8

శ్లో॥ తస్య ప్రీతేన మనసా తాం దత్త్వైలబిలస్తతః ।
పశ్యతోఽన్తర్దధే సోఽపి స్వపురం ప్రత్యపద్యత ॥ 9

ఇలబిలా పుత్రుడైన కుబేరుడు సంతోషించిన మనస్సుగలవాడై నిరంతర భగవత్స్మృతి ఉండేట్టుగా వరమునిచ్చి అంతర్ధానమైనాడు. ధ్రువుడు స్వపురమునకు తిరిగి వచ్చినాడు. 9

శ్లో॥ అథాయజత యజ్ఞేశం క్రతుభిర్భూరిదక్షిణైః ।
ద్రవ్యక్రియా దేవతానాం కర్మసాధ్యం ఫలప్రదమ్ ॥ 10

టీ:- అథేతి. ద్రవ్యక్రియాదేవతానాం కర్మసాధ్యం ఫలరూపం కర్మఫలప్రదం చేత్యర్థః. 10

(ధ్రువుడు వెళ్ళి) కర్మలచే కర్మసాధ్యమైన ఫలము భగవంతుడే. అతడే కర్మఫలప్రదుడు. అట్టి యజ్ఞేశుడిని ధ్రువుడు యజ్ఞములచేత, గొప్ప దక్షిణలచేత, పురోడాశాది ద్రవ్యములచేత, ఆవాహనాది క్రియల చేత, ఇంద్రాది దేవతల పూజలచేత, ఆరాధించెను. 10

శ్లో॥ సర్వాత్మన్యచ్యుతే సర్వే తీవ్రౌఘాం భక్తిముద్వహన్ ।
దదర్శాత్మని భూతేషు తమేవావస్థితం విభుమ్ ॥ 11

సర్వము యొక్క స్వరూపమైనట్టి, సర్వోపాధులతో సంబంధము లేనట్టి, అచ్యుతునియందు కాలవ్యవధాన రహితమైన భక్తిని పొందిన వాడై, తన అంతఃకరణములో, సర్వభూతములలో నిలిచియున్న ఆ పరమాత్మనే, అనగా సర్వవ్యాపకుడైన శ్రీహరిని దర్శించెను. 11

శ్లో॥ త్వమేవ శీల సంపన్నం బ్రహ్మణ్యం దీనవత్సలమ్ ।
గోప్తారం ధర్మసేతూనాం మేనిరే పితరం ప్రజాః ॥ 12

టీ:- సర్వాత్మనీతి. సర్వాత్మని అసర్వే సర్వోపాధి వివర్జితే. (11-12)

మంచిశీలముతో గూడినవాడును, వేదవేత్తలయందు భక్తిగల వాడును, దీనులయందు వాత్సల్యముగలవాడును, ధర్మము యొక్కమర్యాదను కాపాడువాడును అగు ధ్రువుని ప్రజలు కన్న తండ్రి వలె తలచిరి. 12

శ్లో॥ షడ్వింశద్వర్షసాహస్రం శశాస క్షితిమండలమ్ ।
భోగైః పుణ్యక్షయం కుర్వన్న భోగైరశుభక్షయమ్ ॥ 13

టీ:- షడితి. ఆభోగైః యజ్ఞానుష్ఠానైః. 13

ఆతడు ముప్పదిఆరువేల సంవత్సరములు ఈ భూమిని పరిపాలించినాడు జీవునికి పుణ్య పాపములు రెండూ బంధములే కావున (అందుకొరకే ఉపనిషత్తులు'పుణ్యపాపే విధూయ' అన్నవి.) ఐశ్వర్యమును అనుభవించుచూ పుణ్యమును క్షీణింపచేసుకొని, ప్రత్యవాయాదులు రాకుండా ప్రాయశ్చిత్త కర్మస్వరూపమైన యజ్ఞ యాగాదులు చేస్తూ పాపమును క్షీణింపచేసుకొన్నాడు. 13

శ్లో॥ ఏవం బహుసవం కాలం మహాత్మా వికలేంద్రియః ।
త్రివర్గౌపయికం నీత్వా పుత్రాయాదాన్నృపాసనమ్ ॥ 14

ఈ విధముగా మహాత్ముడైన ధ్రువుడు ఇంద్రియనిగ్రహము కలిగి ధర్మార్థ కామ సాధకమైన అనేక సంవత్సరముల కాలమును

టీ:- ఏవమితి. బహవస్స్వాః యాగాః సంవత్సరావా యస్మిన్ తం కాలం త్రివర్గసాధకం నీత్వా అవికలాని సంయతాని ఇంద్రియాణి యస్య. 14

శ్లో॥ మన్యమాన ఇదం విశ్వం మాయారచితమాత్మని ।
అవిద్యారచిత స్వప్న గంధర్వనగరోపమమ్ ॥ 15

టీ:- మన్యమాన ఇతి. ఇదం దేహాది భగవాన్మాయయా ఆత్మని స్వస్మిన్ రచితం మన్యమానః అత్రావిద్యాసృష్టిం దృష్టాంతయతి-అవిద్యారచితేతి. (15)

శ్లో॥ ఆత్మస్త్ర్యపత్య సుహృదోబలమృద్ధ కోశ
మంతఃపురం పరివిహార భువశ్చ రమ్యాః ।
భూమండలం జలధి మేఖలమాకలయ్య
కాలోపసృష్టమితి సప్రయయౌ విశాలామ్ ॥ 16

టీ:- ఆత్మేతి. ఆత్మా దేహః ఆత్మాదిమాయికమపి పునః కాలేనోపసృష్టం అనిత్యం ఆకలయ్య విచింత్య విశాలాం బదరికాశ్రమం. 16

యజ్ఞస్వరూపములుగా గడిపి రాజసింహాసనమును పుత్రుడికి ఇచ్చెను. (14)

ఏ విధముగానైతే స్వప్న గంధర్వనగరములు అవిద్యారచితములో అదే విధముగా ఈ దేహాదులు భగవన్మాయచేత తన యందు అనగా ఆత్మయందు కల్పితములు అనగా అధ్యస్తమైనదని (ధ్రువుడు) దర్శించేవాడు. 15

దేహము, భార్య, సంతానము, మిత్రుడు, సైన్యము, సంపదతో నిండిన ధనాగారము, అంతఃపురము చుట్టున్న అందమైన విహార భూములు, సముద్రపర్యంతముకల భూమండలము ఇవన్నిగూడా కాలము చేతగ్రస్తమగునని తెలుసుకొని బదరికాశ్రమమునకు వెళ్ళెను. ( సర్వము మాయా కల్పితమని తెలుసు, పోనీ మాయాకల్పితమై ఎప్పటికి ఉండునా అంటే ఉండదు అది గూడా చెదిరిపోతుంది). 16

శ్లో॥ తస్యాం విశుద్ధకరణ శ్శివవార్విగాహ్య
బద్ధ్వాసనం జితమరున్మనసా హృతాక్షః ।
స్థూలే దధార భగవత్ప్రతిరూప ఏత
ద్ధ్యాయం సదవ్యవహితో వ్యసృజత్సమాధౌ ॥ 17

టీ:- తత్ర తత్కృతమష్టాంగయోగమాహ-తస్యామితి. తస్యాం శివం వాః శుద్ధోదకం విగాహ్య ప్రవిశ్యేత్యనేన స్నానాది నియమా ఉక్తాః. విశుద్ధకరణ ఇతి శమ దమాదయో యమాః. ఆసనాదీని స్ఫుట మేవోక్తాని జితః మరుత్ప్రాణః యేన. అహృతాని అక్షాణి ఇంద్రియాణి యేన సః భగవతః ప్రతినిధి భూతే స్థూలే విరాడ్రూపే ఏతన్మనో దధార ధ్యాయన్ అవ్యవహితః ధ్యాతృ ధ్యేయ భేద శూన్యస్సన్. సమాధౌస్థితః తతః స్థూలం వ్యసృజత్. 17

శ్లో॥ భక్తిం హరౌ భగవతి ప్రవహన్నజస్ర
మానందబాష్పకలయా ముహురర్ద్యమానః ।
విక్లిద్యమానహృదయః పులకాంచితాంగో
నాత్మానమస్మరదసావితి ముక్త లింగః ॥ 18

టీ:- భక్తిమితి. ఏవం అజస్రం నిత్యం హరౌ భక్తిం ప్రకర్షేణ వహన్

**ధ్రువరాజు అష్టాంగ యోగమును చెప్పుచున్నాడు.**

ఆ బదరికాశ్రమమున, పవిత్రమైన నదీజలమున స్నానముచేసి దీని ద్వారా స్నానాది నియమములు చెప్పబడినవి. పరిశుద్ధమైన అంతఃకరణముగలవాడై అని శమాది నియమములు చెప్పబడ్డవి. ఆసనమును బంధించి ఆసనమును గూర్చి చెప్పబడ్డవి, జయింపబడిన వాయుసంచారము గలవాడై, ఉపసంహరింపబడ్డ ఇంద్రియములు గలవాడై, భగవంతుడికి ప్రతినిధి భూతమైన, స్థూలమైన విరాడ్రూ రూపము యందు అష్టాంగయోగ అనుష్ఠానాదిపూర్వకమైన మనస్సును నిలిపెను. ఈ విధముగా ధ్యానిస్తూ ధ్యాతృ (ధ్యానించువాడు) ధ్యానింపబడు రూపము అన్నభేదరహితుడై సమాధిస్థితిని పొంది ఆ విరాడ్రూరూపమును విడిచివేసెను. (ధ్యాన, ధ్యాతృ, ధ్యేయములు త్రిపుటి వీటిని దాటడమే భేదరహితి స్థితి) 17

ఈ విధముగా నిత్యము శ్రీహరియందు భక్తి కలిగిన ధ్రువునికి నేను అన్న భావన స్మరణ లేకుండా పోయెను ఎందుకనగా, శరీరాభి-మానరహితుడు కావడంచేత, ఆనందాత్మకమైన కన్నీటి ధారలచే పలుమార్లు పరవశుడై (తడిసిన) ద్రవించిన హృదయముగలవాడై, రోమాంచితములచే వ్యాప్తమైన అంగములుగల వాడవడము వలన ఇది సాధ్యపడింది. 18

అసౌ ధ్రువోఽహమితి. ఆత్మానం నాస్మరత్. న సస్మార యతో ముక్తలింగః శరీరాభిమానరహితః. తత్ర హేతవః ఆనందబాష్పకళయా బిందుప్రవాహేణ అభిభూయమానః. విక్లిద్యమానం ద్రవద్ధృదయం యస్య సః పులకైర్వ్యాప్తాంగః. (18-19)

శ్లో॥ స దదర్శ విమానాగ్ర్యం నభసోఽవతరద్ధ్రువమ్ ।
విభ్రాజయద్దశదిశో రాకాపతిమివోదితమ్ ॥ 19

ఆకాశము నుండి దిగుచున్న. పది దిక్కులను ప్రకాశింపచేయుచున్న, పూర్ణచంద్రుడివలె ఉదయించిన, శ్రేష్ఠమైన విమానమును ధ్రువుడు చూచెను. 19

శ్లో॥ తత్రానుదేవప్రవరౌ చతుర్భుజౌ
శ్యామౌ కిశోరావరుణాంబుజేక్షణౌ ।
స్థితావవష్టభ్య గదాం సువాససౌ
కిరీట హారాంగదచారు కుండలౌ ॥ 20

అనంతరము చతుర్భుజులు, నీలమేఘశ్యాములు, ఎర్ర తామర కమలములవంటి నేత్రములుగల వారును, కిరీటములు, హారములు, భుజకీర్తులు ధరించిన సుందరమైన కుండలములుగల ఇద్దరు దేవతా శ్రేష్ఠులను దర్శించెను. 20

టీ:- తత్రేతి. అను అనంతరం దేవప్రవరౌ దదర్శేత్యనుషంగః. గదామవష్టభ్య స్థితౌ. కిరీటాదిభిస్సహితే చారుణి కుండలే యయోః. 20

శ్లో॥ విజ్ఞాయతావుత్తమగాయ కింకరా
వభ్యుత్థితస్సాధ్వసవిస్మృత క్రమః ।
ననామ నామాని గృణన్మధుద్విషః
పార్షత్ప్రధానావితి సంహతాంజలిః ॥ 21

వచ్చినవారిద్దరు పుణ్యశ్లోకుడి కింకరులు. మధుద్విషుడైన మాధవుడి పార్షత్ప్రధానులు అని తెలిసి సంభ్రమములో పూజాక్రమమును మరిచి భగవన్నామమును జపిస్తూ దోసలి యొగ్గినవాడై నమస్కరించెను. 21

శ్లో॥ తం కృష్ణపాదాభినివిష్టచేతసం
బద్ధాంజలిం ప్రశ్రయ నమ్ర కంధరమ్ ।
సునందనందావుపసృత్య సస్మితం
ప్రీత్యోచతుః పుష్కరనాభసమ్మతౌ ॥ 22

టీ:- విజ్ఞాయేతి. ఉత్తమగాయః పుణ్యశ్లోకః. తస్య కింకరావితి విజ్ఞాయ మధుద్విషః పార్షత్ర్పధానావితి హేతోః సాధ్వసేన సంభ్రమేణ విస్మృత పూజాక్రమః. కేవలం తస్య నామాని గృణన్ననామ. (21-22)

చేతులుజోడించి వినయముగా శిరస్సువంచిన, శ్రీహరి పాదముల యందు మనస్సు నిలిపిన, ఆ ధ్రువునితో పద్మనాభుడిచేత శ్రేష్ఠులుగా సమ్మతింపబడిన సునందుడు, నందుడు అనువారు చిరునవ్వులు చిందిస్తూ ఈ విధముగా చెప్పిరి. 22

**సునందనందావూచతు**

శ్లో॥ భోభో రాజన్ సుభద్రం తేవచోనోఽవహితశ్శృణు ।
యః పంచవర్ష సప్తసా భవాన్ దేవమతీతృపత్ ॥ 23

టీ:- భోభో ఇతి. సుభద్రం త ఇతి శరీరస్యైవ విష్ణుపదారోహాభిప్రాయం అతీతృపత్ తర్పితవాన్. 23

**సునందనందులు పలుకుచున్నారు.**

ఓ రాజా! నీకు మంగళములు కలుగుగాక, మా మాటలను సావధానచిత్తుడవై వినుము.(ఇచ్చట సుభద్రం అని సంబోధనము ఈ శరీరముచేతనే విష్ణులోకము చేరు అభిప్రాయము) నీవు ఐదు సంవత్సరలప్పుడే తపస్సుచేత శ్రీహరిదేవుడిని తృప్తిపరిచితివి. 23

శ్లో॥ తస్యాఖిలజగద్ధాతురావాం దేవస్యశార్ఙ్గిణః ।
పార్షదావిహసంప్రాప్తౌ నేతుం త్వాం భగవత్పదమ్ ॥ 24

టీ:- తస్యేతి. ఆవాం తస్య పార్షదౌ. 24

అఖిలలోకములను ధరించు దేవుడైన, శార్ఙ్గ ధనుస్సును ధరించువాని పార్షదులమగు మేము నిన్ను భగవత్పదమునకు తీసుకువెళ్ళుటకు వచ్చితిమి. 24

శ్లో॥ సుదుర్జయం విష్ణుపదం జితం త్వయా
యాత్సూరయోఽప్రాప్య విచక్షతే పరమ్ ।
ఆతిష్ఠతచ్చంద్ర వాకరాదయో
గ్రహర్క్ష తారాః పరియంతి దక్షిణమ్ ॥ 25

ఎందుకు సుదుర్జయత్వమో కారణము చెప్పుచున్నాడు. జయించడానికి సాధ్యంకాని విష్ణుపదమును నీవు గెలిచినావు. సప్తఋషులుగూడా ఏ స్థానమును చేరలేక కిందుండి చూచుచున్నారో సూర్యచంద్రులు, గ్రహనక్షత్రములు ప్రదక్షిణములు చేయుచున్నవో ఆ స్థానమును అధిష్ఠించుము. 25

శ్లో॥ అనాస్థితం తే పితృభిరన్యైరప్యంగ కర్హిచిత్ ।
ఆతిష్ఠజగతాం వంద్యం తద్విష్ణోః పరమం పదం ॥ 26

మీ పూర్వీకులుగాని, ఇతరులుగాని ఏ సమయములోగూడా పొందనిది, జగత్తుచే నమస్కారార్హమైన ఆ విష్ణు పరమపదమును అధిష్ఠించుము. 26

టీ:- సుదుర్జయమితి. సుదుర్జయత్వేహేతుః సూరయస్సప్తర్షయోఽపి యత్పదమప్రాప్య కేవలమధః స్థితాః పశ్యంతి యచ్చ చంద్రాదయః ప్రదక్షిణం యథా భవతి తథా ఏవం పరిక్రామంతి తదాతిష్ఠ అధితిష్ఠ. (25-26)

శ్లో॥ ఏతద్విమాన ప్రవర్తముత్తమశ్లోకమౌళినా ।
ఉపస్థాపిత మాయుష్మన్నధిరోఢుం త్వమర్హసి ॥ 27

పవిత్రమైన కీర్తిమంతులలో ఉత్తముడగు శ్రీహరిచే శ్రేష్ఠమైన ఈ విమానము పంపబడినది. ఆయుష్మంతుడా! ఈ విమానము నెక్కుటకు నీవు అర్హుడవు. ఆయుష్మంతుడా అని అనడం సశరీరముగా యానమున కూర్చో అని అభిప్రాయము. 27

టీ:- ఏతదితి. ఆయుష్మన్నిత్యపి సశరీరయానాభిప్రాయమేవ. 27

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ నిశమ్య వైకుంఠ నియోజ్య ముఖ్య
యోర్మధుచ్యుతాం వాచమురుక్రమ ప్రియః ।
కృతాభిషేకః కృతనిత్యమంగళో
మునీన్ప్రణమ్యాశిష మభ్యవాచయత్ ॥ 28

టీ:- నిశమ్యేతి. మధుచ్యోతతి స్రవతీతి మధుచ్యుత్ తాం పాఠాంతరే మధుచ్యుతం యస్యాం తామమృతస్రావిణీమిత్యర్థః. కృతం నిత్యం కర్మ మంగళం అలంకరణం చ యేనసః. అభ్యవాచ తత్. వాచయామాస. 28

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

ఉరుక్రముడైన శ్రీహరికి ప్రియుడైన ధ్రువుడు వైకుంఠలోక ముఖ్యులైన నందసునందుల తేనె లొలికే వాక్కులను విని, నదీ స్నానమును ముగించుకొని మంగళప్రదమైన అలంకారమును చేసికొని, అనగా త్రిపుండాదులు ధరించి. నిత్య కర్మానుష్ఠానమును ఆచరించి మునులకు నమస్కరించి ఆశీస్సులు పొందెను. 28

శ్లో॥ పరిత్యాభ్యర్చ్య ధిష్ణ్యాగ్రం పార్షదావభివంద్య చ ।
ఇయేష తదధిష్ఠాతుం బిభ్రద్రూపం హిరణ్మయం ॥ 29

టీ:- పరిత్యేతి. తదేవ రూపం హిరణ్మయం జ్యోతిర్మయం బిభ్రత్సన్. ఇయేష ఐచ్ఛత్. (29-30)

ఆ దివ్య విమానమునకు ప్రదక్షిణములుచేసి, పార్షదులను గౌరవించి, నమస్కరించి విశేషకాంతి కలిగిన దేహము గలవాడై ఆ విమానమునధిష్ఠించుటకు సిద్ధమాయెను. (ఎప్పుడైతే ధ్రువుడు విమానము ఎక్కుటకు సిద్ధపడ్డాడో అప్పుడు మృత్యువువచ్చి నమస్కరించి అన్నది. ఓ మహారాజా!నన్ను అంగీక రించుము. ధ్రువుడన్నాడు. ఓ మృత్యువా! నీకు స్వాగతం, ఒక్క క్షణం కూర్చో, ఈ విధముగా చెప్పి మనస్సున విష్ణుస్మరణ చేస్తూ మృత్యువు శిరస్సున పాదము నుంచి శ్రేష్ఠమైన విమానమునధిరోహించెను. (బిభ్రద్రూపం హిరణ్మయం మృత్యోర్మూర్ధ్ని పదం అనుపదములు వేదాంత పూర్వమీమాంసా శాస్త్రములకు సమన్వయం అవుతుంది) 29

శ్లో॥ తదా దుందుభయో నేదుర్మృదంగ పణ వాదయః ।
గంధర్వముఖ్యాః ప్రజగుః పేతుః కుసుమవృష్టయః ॥ 30

అప్పుడు భేరీలు, మద్దెలు, తప్పెటలు, మ్రోగినవి. గంధర్వ ముఖ్యులు గొప్పగా పాడినారు. పుష్ప వృష్టిని కురిపించినారు. 30

శ్లో॥ స చ స్వర్లోకమారోక్ష్న్ సునీతిం జననీం ధ్రువః ।
అన్వస్మరదగం హిత్వా చ దీనాం యాస్యే త్రివిష్టపమ్ ॥ 31

టీ:- స ఇతి. దీనాం హిత్వా కథం అగం దుర్గమం త్రివిష్టపం యాస్యామీత్యస్మరత్. 31

తను స్వర్గానికి వెళుతూ ధ్రువుడు మనస్సులో తల్లిని స్మరించుకొని దీనురాలైన మాయమ్మను విడిచినేనెట్లు దుర్గమమైన స్వర్గమునకు వెళ్ళుచున్నాను అని అనుకొన్నాడు. 31

శ్లో॥ ఇతి వ్యవస్థితం తస్య వ్యవసీయ సురోత్తమౌ ।
దర్శయామాసతుర్దేవం దేవయానేన గచ్ఛతమ్ ॥ 32

ఈ విధముగా ధ్రువుడి అభిప్రాయమును సురోత్తములు పార్షదులు తెలుసుకొని దేవవిమానములో స్వర్గానికి వెలుతున్న సునీతిని చూపిరి. 32

శ్లో॥ తత్ర తత్ర ప్రశంసద్భిః పథి వైమానికైస్సురైః ।
అవకీర్యమాణో దదృశే కుసుమైః క్రమశో గ్రహాన్ ॥ 33

టీ:- ఇతీతి. వ్యవసితమభిప్రాయం వ్యవసీయ జ్ఞాత్వా దేవయానేన దేవానాం మార్గేణ విమానేనేతి వా. (32-33)

అక్కడక్కడ మార్గ మధ్యమమున విమానములో వెళుతున్న దేవతలు ఆయనను ప్రశంసిస్తూ పుష్పవృష్టి కురిపిస్తుండగా, క్రమముగా గ్రహములను చూచెను. 33

శ్లో॥ త్రిలోకీందేవయానేనసోఽతి వ్రజ్య మునీనపి ।
పరస్తాద్యద్ధ్రువగతిః విష్ణోః పరమథాధ్యగాత్ ॥ 34

టీ:- త్రిలోకీమితి. మునీన్ సప్త ఋషీనపి తతః పరస్తాత్ శ్రీవిష్ణోర్యత్పదం తదధ్యగాత్. ధ్రువా గతిర్యస్య. 34

ఆ దేవమార్గమున విమానములో మూడులోకములను చూచి, సప్తఋషులనుదాటి, ఆపైన నిశ్చయమైన స్థితిగలిగిన (శాశ్వతమైన) విష్ణుపదమును పొందెను. 34

శ్లో॥ యద్భ్రాజమానం స్వరుచైవ సర్వతో
లోకాస్త్రయో హ్యనువిభ్రాజంత ఏతే ।
యన్నావ్రజన్ జంతుషు యే ననుగ్రహా
వ్రజంతి భద్రాణి చరంతి యేఽనిశమ్ ॥ 35

టీ:- యదితి. యత్ భ్రాజమానం మమ యస్య రుచాలోకాః విభ్రాజంతే. యే అనుగ్రహాః నిష్కృపాః తే. యత్ నావ్రజన్. న గతవంతః. 35

(ఎప్పుడు)మూడులోకములు ఏ లోకపు స్వయం ప్రకాశకాంతిచే ప్రకాశించుచున్నవో, భగవత్కృప లేనివారు ఏ స్థానమును పొందలేరో! నిరంతర దైవకార్యములను, మంగళ కార్యములను చేయువారు ఏ స్థానమును వెళ్ళుదురో! (ఆ లోకమును చూచెను)35

శ్లో॥ శాంతాస్సమదృశశ్శుద్ధాస్సర్వభూతానురంజనాః ।
యాంత్యంజసాచ్యుతపదమచ్యుత ప్రియభాంధవాః ॥ 36

టీ:- శాంతా ఇతి. అచ్యుతః ప్రియయో బాంధవో యేషాంతే. 36-37

సమదర్శులు, శాంతులు, శుద్ధులు, సర్వప్రాణులను ఆనంద-పరుచువారు, అచ్యుతుడే ఎవరికి ప్రియమైన బంధువో, అట్టివారు నాశరహిత ఏ స్థానమును పొందుదురో! (దానిని చూచెను) 36

శ్లో॥ ఇత్యుత్తానపదః పుత్రో ధ్రువః కృష్ణ పరాయణః ।
అభూత్త్రయాణాం లోకానాం చూడామణిరివామలః ॥ 37

ఈ విధముగా ఉత్తానుపాదుడి పుత్రుడైన ధ్రువుడు విష్ణుభక్తి పరాయణుడై, దోషరహితుడై మూడులోకములకు శిరోభూషణుడైనాడు. (37)

శ్లో॥ గంభీరవేగోఽనిమిషం జ్యోతిషాం చక్రమాహితమ్ ।
యస్మిన్ భ్రమతి కౌరవ్యమేధ్యామివ గవాం గణః ॥ 38

టీ:- గంభీరేతి. అనిమిషం అనలసంజ్యోతిషాం చక్రం. యస్మిన్ అహితం అర్పితం సత్. భ్రమతి మేధ్యాం ఆహితః గంభీర వేగః గవాం గణ ఇవ. 38

ఓ కురుశ్రేష్ఠా! జ్యోతిశ్చక్రము నిరంతరము, అలసటలేకుండా రాటమునకు కట్టిన ఎద్దుల సమూహము యొక్క గంభీరగమనమువలె ఏ ధ్రువలోకముచుట్టూ తిరుగుచున్నదో, అట్టి ధ్రువపదమును పొందినాడు. 38

శ్లో॥ మహిమానం విలోక్యాస్య నారదో భగవానృషిః ।
ఆతోద్యం వితుదం శ్లోకాన్ సత్రేఽగాయత్ప్రచేతసామ్ ॥ 39

టీ:- మహిమానమితి. ఆతోద్యం వీణాం వితుదన్వాదయన్ ప్రచేతసాం సత్రే బ్రహ్మసత్రే భగవన్మాహాత్మ్య ప్రసంగేన ధ్రువమహిమప్రతిపాదపరూన్ త్రీన్ శ్లోకానగాయత్. 39

ప్రచేతసుల సత్రయాగమున, భగవాన్ నారదమహర్షి వీణను మీటుతూ మూడు శ్లోకములను గానము చేసెను. 39

నారద ఉవాచ

శ్లో॥ నూనం సునీతేః పతిదేవతాయా
స్తపః ప్రభావస్య సుతస్య తాం గతిం ।
దృష్ట్వాభ్యుపాయనపి వేదవాదినో
నైవాధిగంతుం ప్రభవంతి కిం నృపాః ॥ 40

టీ:- తానాహ-నూనమితి. పతిరేవదేవతా యస్యాస్తస్యాస్సుతస్య యస్తపః ప్రభావః తస్య తాం గతిం ఫలమధిగంతుం వేదవాదినో వేద వాదశీలాః బ్రహ్మర్షయోఽపి నైవ ప్రభవంతి. అభ్యుపాయాన్ భగవద్ధర్మాన్ దృష్ట్వాపి. కింపునర్నృపాః. 40

నారదుడు ఈ విధముగా పలికెను

పతియే దేవుడని కొలిచే, ఆ పతిభక్తి పరాయణయైన సునీతి కుమారుడు తపః ప్రభావముచేత ఏ గతిని పొందినాడో దానిని వేదవాదులైన మహర్షులు, భగవద్ధర్మములను చూచినప్పటికీ, పొందడానికి సమర్థులు కారు. ఇక రాజులను అడిగేదేముంది. ఇది నిశ్చయము. 40

శ్లో॥ యః పంచవర్షో గురుదారవాక్శరై
ర్భిన్నేన యాతో హృదయేన దూయతా ।
వనం మదాదేశకరో జితం విభుం
జిగాయ తద్భక్తగుణైః పరాజితం ॥ 41

టీ:- తపః ప్రభావం తాం గతిం చ విశినష్టి-ద్వాభ్యాం.య ఇతి. గురుదారాః పితృపత్నీ సురుచిః తస్యాః వాక్శరైర్భిన్నేన అతఏవ దూయతా హృదయేన వనం యాతస్సన్ అజితమపి యో జిగాయ వశీకృతవాన్. 41

నారదులవారు తపఃప్రభావమును, దాని ద్వారా లభించిన ఉత్తమగతిని చెప్పుచున్నారు. ఐదుసంవత్సరముల పిల్లవాడు సాపత్ని మాతయైన సురుచి వాగ్బాణములచే గాయపడిన హృదయవేదనతో, నా ఆదేశ ప్రకారము వనానికి వెళ్ళి, తొందరగా వశీకృతుడుకాని భగవంతుని తన భక్తిగుణములచే వశీకృతునిగా చేసుకొనెను. 41

శ్లో॥ యః క్షత్రబంధుర్భువి తస్యాధిరూఢ
మన్వారురుక్షేదపి వర్షపూగైః ।
షట్పంచవర్షో యదహోభిరల్పైః
ప్రసాద్య వైకుంఠమవాపతత్పదమ్ ॥ 42

టీ:- య ఇతి. తస్యాధిరూఢం తేన ప్రాప్తం పదంయో భువి క్షత్రబంధుః క్షత్రియో భవేత్. సః తమనువర్షసమూహైరపి ఆరోఢు మిచ్ఛేదపి కిం. తత్సంకల్పోఽప్యశక్యః. దూరత ఆరోహణమిత్యర్థః. కథం భూతం పదం షడ్వా పంచవా వర్షాణి యస్య సః. అల్పైరేవాహోభిః వైకుంఠం ప్రసాద్య యత్తస్య పదమవాపతత్. 42

ధ్రువుడు పొందిన స్థానమును భూమిమీదగల ఏ క్షత్రియుడు గూడా ఎన్ని ఏళ్ళకైనా పొందగోరునా? ఆ పదమును పొందడం అట్లాఉంచండి, అసలు సంకల్పము చేయడమే అశక్యము. (పొందడం మాట దేవుడెరుగు) ఐదారు సంవత్సరాల అతి తక్కువ వయస్సులో భగవంతుడిని ప్రసన్నుని చేసుకొని నాశరహితమైన పరమపదమును పొందినాడు. 42

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఏతత్తేఽభిహితం సర్వం యత్పృష్టోఽహమిహత్వయా ।
ధ్రువస్యోద్దామయశసశ్చరితం సమ్మతం సతాం ॥ 43

టీ:- ఏతదితిఉద్దామముత్కృష్టం యశో యస్య. 43

మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

విదురా! నీవడిగిన విధముగా సజ్జనులకు ప్రియమైన ధ్రువుని ఉత్కృష్టమైన కీర్తికి సంబంధించిన సర్వస్వమును ఈ పవిత్ర స్థలమున నీకు చెప్పితిని. 43

శ్లో॥ ధన్యం యశస్యమాయుష్యం పుణ్యం స్వస్త్యయనం మహత్ ।
స్వర్గ్యం ధ్రౌవ్యం సౌమనస్యం ప్రశస్యమఘమర్షణం ॥ 44

ఈ చరిత్రము సంపదనిచ్చునది. కీర్తి కలిగించునది. పుణ్యప్రదము, ఆయురభివృద్ధిని కలిగించునది, మంగళప్రదమైనది,

టీ:- ధన్యమితి. ధన్యం ధనాదేర్నిమిత్తం ధ్రౌవ్యం ధ్రువస్థానప్రాపకం. ప్రశస్యం ప్రశంసార్హం. అఘమర్షణం పాపనాశనం యస్య. 44

స్వర్గప్రాపకము, ధ్రువస్థానమునకు చేర్చునది. దైవత్వమును సిద్ధింపచేయునది, ప్రశంసింపదగునది, పాపనాశకమైనది. 44

శ్లో॥ శ్రుత్వైతచ్ఛ్రద్ధయా భీక్షణమచ్యుత ప్రియచేష్టితమ్ ।
భవేద్భక్తిర్భగవతి యయా స్యాత్క్లేశసంక్షయః ॥ 45

టీ:- శ్రుత్వేతి. అచ్యుతప్రియస్య ధ్రువస్య చేష్టితం శ్రుత్వా యో వర్తతే తస్య భ క్తిర్భయేత్. 45

అచ్యుత ప్రియుడైన ధ్రువుడి ఈ చరిత్రమును పలుమార్లు శ్రద్ధగా ఎవరు వింటారో వారికి చరిత్ర శ్రవణమువల్ల సమస్త దుఃఖములు నశించి, వారికి భగవంతుని యందు భక్తి కలుగును. 45

శ్లో॥ మహత్త్వ మిచ్ఛతాం తీర్థం శ్రోతుశ్శీలాదయో గుణాః ।
యత్ర తేజస్తదిచ్ఛూనాం మనో యత్ర మనస్వినామ్ ॥ 46

టీ:- మహత్త్వమితి. తీర్థం మహత్త్వప్రాప్తి స్థానం. గుణాః యత్ర భవంతి. 46

గొప్పనైన ధ్రువుని చరిత్ర విన్నచో, గొప్పదనము పొందాలి అన్న కోరిక కలవారికి ఆ గొప్పదనము, సచ్ఛీలము మొదలగు గుణాలు; తేజస్సు కావలెనను వారికి తేజస్సు; అభిమానవంతులకు సమ్మానమును లభించును. 46

శ్లో॥ ప్రయతః కీర్తయేత్ప్రాతస్సమవాయేద్వి జన్మనామ్ ।
సాయం చ పుణ్యశ్లోకస్య ధ్రువస్య చరితం మహత్ ॥ 47

పుణ్యశ్లోకుడైన ధ్రువుడి గొప్పచరిత్రను వేదవిదుల సభలో ప్రాతః సాయంకాలములయందు ఏకాగ్రచిత్తులై కీర్తించవలెను. 47

శ్లో॥ పౌర్ణమాస్యాం సినీవాల్యాం ద్వాదశ్యాం శ్రవణేఽథవా ।
దినక్షయే వ్యతీపాతే సంక్రమేఽర్కదినేఽపి వా ॥ 48

టీ:- ప్రయత ఇతి. సమవాయే సత్సభాయాం. (47-48)

పూర్ణిమ, అమావాస్య, ద్వాదశి, శ్రవణానక్షత్రము, తిథిక్షయము, వ్యతీపాతము, సంక్రమణము, ఆదివారము రోజులలో, ఎప్పుడైనా కీర్తించవచ్చు. (సినీవాలి అనగా దృష్టేందుకలా అమావాస్య, సినివాలి ఒక చంద్రకళ కనిపిస్తూ అమావాస్య ఉండాలి. అనగా చతుర్దశీ యుక్త అమావాస్య; దినక్షయమనగా ఒకే రోజు మూడు తిథులు కలవడం. అవమాయని సంజ్ఞ). 48

శ్లో॥ శ్రావయేచ్ఛ్రద్దధానానాం తీర్థపాదపదాశ్రయః ।
నేచ్ఛంస్తత్రాత్మనాత్మానం సంతుష్ట ఇతి సిధ్యతి ॥ 49

టీ:- శ్రావయేదితి. నేచ్ఛన్ నిష్కామః తత్ర శ్రవణే ఆత్మనైవాత్మానం ప్రతి సంతుష్టో భవతీతి హేతోస్సిద్ధిం ప్రాప్నోతి. 49

ఎవరి పాదములనుండి గంగ పుట్టినదో అట్టి శ్రీహరి పాదములనాశ్రయించి, శ్రద్ధావంతులకు కథ వినిపించవలెను. నిష్కాముడై వినిపించినప్పుడు తనచేత తనే సంతిష్టుడౌతూ (అనగా నిష్కాముడై శ్రద్ధగల శ్రోత వింటే కథకుడికి ఆనందము) సిద్ధిని పొందుతాడు. 49

శ్లో॥ జ్ఞానమజ్ఞాతతత్త్వాయ యో దద్యాత్సత్పథేఽమృతం ।
కృపాళోర్దీననాథస్య దేవా స్తస్యానుగృహ్ణతే ॥ 50

టీ:- జ్ఞానమితి. కించ. సత్పథే భగవన్మార్గే అమృతరూపం జ్ఞానం యో దద్యాత్. 50

ఏ వక్తనైతే తెలియని వారికి భగవన్మార్గమున అమృతరూపమైన జ్ఞానసాధనమైన ధ్రువచరిత్ర కథను చెపుతాడో దీనులను ఉద్ధరించ వలెనను దయ కలిగిన ఆ వక్తను దేవతలు అనుగ్రహించెదరు. 50

శ్లో॥ ఇదం మయాతేఽభిహితం కురూద్వహ
ధ్రువస్య విఖ్యాత విశుద్ధకర్మణః ।
హిత్వార్భకః క్రీడనకాని మాతుర్గృహం
చ విష్ణుం శరణం యో జగామ ॥ 51

టీ:- ఇదమితి. ధ్రువస్య చరితం మయాభిహితం మాతుర్గృహం చ హిత్వా త్యక్త్వా. 51

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,**
**ద్వాదశోఽ ధ్యాయః**

ఓ విదురా! ధ్రువుడు చిన్నపిల్లవాడైననూ తల్లిని, ఇల్లును, ఆటపాటలను విడిచి, విష్ణువునే శరణువేడినాడు. అట్టి శుద్ధమైన ఆచరణ కలిగిన ధ్రువుని చరిత్రను నీకు వినిపించినాను. 52

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు**
**పన్నెండవ అధ్యాయము సమాప్తము.**

## త్రయోదశోఽధ్యాయః

శ్లో॥ ఏవం పంచభిరధ్యాయైర్ధ్రువచర్యానువర్ణితా ।
అథైకాదశభిశ్చిత్రం పృథుచారిత్రముచ్యతే ॥
తత్ర తయోదశే వక్తుం పృథోర్జన్మ ధ్రువాన్వయే ।
అంగో వేన పితా పుత్ర క్రౌర్యాద్గత ఇతీర్యతే ॥

## 13వ అధ్యాయము

ఈ విధముగా ఐదు అధ్యాయములయందు ధ్రువచరిత్రము వర్ణింపబడినది. పదకొండు అధ్యాయములచేత చిత్రమైన పృథుచరిత్ర వర్ణింపబడుచున్నది. ధ్రువుని వంశమున పుట్టిన పృథుచక్రవర్తి జన్మ పదమూడవ అధ్యాయమున చెప్పడానికి సిద్ధమవుతూ, వేనుడి తండ్రియైన అంగుడు, పుత్రుడి క్రూరమైన చేష్టలను చూచి అడవులకు వెళ్ళిపోవడం చెప్పబడుచున్నది.

**శ్రీసూత ఉవాచ**

శ్లో॥ నిశమ్య కౌషారవిణోపవర్ణితం
ధ్రువస్య వైకుంఠ పదాధిరోహణమ్ ।
ప్రరూఢ భావో భగవత్యధోక్షజే
ప్రష్టుం పునస్తం విదిరః ప్రచక్రమే ॥ 1

టీ:- నిశమ్యేతి. ప్రరూఢః భావో భక్తిర్యస్య సః. 1

**సూతుడు ఈ విధముగా పలికెను.**

మైత్రేయమహర్షిచేత వర్ణింపబడిన ధ్రువుడి వైకుంఠ పదస్థాన ఆరోహణమును విని, భగవానుడియందు, దృఢమైన భక్తిగలిగి, విదురుడు ఆ మహర్షిని మళ్ళీ అడగడానికి ఉపక్రమించినాడు. 1

**విదుర ఉవాచ**

శ్లో॥ కేతే ప్రచేతసో నామ కస్యాపత్యాని సువ్రత ।
కస్యాన్వవాయే ప్రఖ్యాతాః కుత్ర వా సత్రమాసత. ॥ 2

టీ:- కఇతి. అన్వవాయే వంశే. 2

**విదురుడు ఈ విధముగా పలికెను.**

గొప్పవ్రత నిష్ఠగల ఓ మహర్షీ! ఎవరా ప్రచేతసులు? ఎవరి కుమారులు? ఎవరి వంశమున పుట్టి కీర్తిగాంచినారు? ఎక్కడ సత్రయాగము చేసినారు? (నారదులవారు ప్రచేతసుల సభలో ధ్రువచరిత్ర గానము చేసినారని చెప్పినారు గదా! దానిని గూర్చి ప్రశ్న ఇది పూర్వప్రకృత పరామర్శ). 2

శ్లో॥ మన్యే మహాభాగవతం నారదం దేవదర్శనం ।
యేన ప్రోక్తః క్రియాయోగః పరిచర్యావిధిర్హరేః ॥ 3

టీ:- నారదేన ప్రచేతసాం వర్ణితాః కథాః ప్రష్టుం తన్మహిమానమాహ - ద్వాభ్యాం. మన్య ఇతి. దేవస్య విష్ణోర్దర్శనం యస్య సః హరేః పరిచర్యా ప్రకారః క్రియాయోగః పాంచరాత్రే యేన ప్రోక్తః. 3

నారదుడిచేత ప్రచేతసుల సత్రములో వర్ణింపబడిన కథలను అడగడానికి ఆయన గొప్పదనమును కీర్తిస్తున్నాడు. పాంచరాత్ర ఆగమమున శ్రీహరిపరిచర్యావిధిని గూర్చిన క్రియాయోగమును చెప్పిన, దైవమును దర్శించిన మహాభాగవతునిగా నారదుని తలచుచున్నాను. 3

శ్లో॥ స్వధర్మశీలైః పురుషైర్భగవాన్ యజ్ఞపూరుషః ।
ఇజ్యమానో భక్తిమతా నారదేనేరితః కిల ॥ 4

స్వధర్మశీలులైన, ప్రచేతసుల చేత యజ్ఞముల ద్వారా ఆరాధింపబడే యజ్ఞపురుషుడైన భగవంతుడు, భక్తిగల నారదుడిచేత స్తోత్రము చేయబడ్డాడు గదా! 4

శ్లో॥ యస్తా దేవర్షిణా తత్రవర్ణితా భగవత్కథాః ।
మహ్యం శుశ్రూషవే బ్రహ్మన్ కార్త్స్న్యేనా చష్టుమర్హసి. ॥ 5

టీ:- స్వేతి. స్వధర్మశీలైః ప్రచేతోభిః. (4-5)

ఓ మహర్షీ! ప్రచేతసుల యజ్ఞమున దేవర్షిచేత వర్ణితములైన భగవత్కథలను నేను సంపూర్ణముగా వినగోరుచున్నాను. కావున నాకు సంపూర్ణముగా చెప్పండి. 5

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ ధ్రువస్యచోత్కలః పుత్రః పితరి ప్రస్థితే వనమ్ ।
సార్వభౌమశ్రియం నైచ్ఛదధి రాజాసనం పితుః ॥ 6

టీ:- ధ్రువస్య వంశే తే జాతా ఇతి వక్తుం ధ్రువస్య వంశ మనుక్రామతి. ధ్రువస్యేత్యాదినా. పితుః. సార్వభౌమ శ్రియం నైచ్ఛత్. అధిరాజాసనం చ. 6

**మైత్రేయుడు ఈ విధముగా చెప్పుచున్నాడు.**

ధ్రువుని వంశమున పుట్టినవారు అని చెప్పడానికి ధ్రువ వంశమును వర్ణిస్తున్నాడు. ధ్రువుడు అడవులకు వెళ్ళిన పిమ్మట ఆయన కుమారుడైన ఉత్కలుడు తండ్రిగారి సార్వభౌమ సంపదలనుకాని, ఆ రాజ సింహాసనమునుగాని కోరలేదు. 6

శ్లో॥ స జన్మనా ప్రశాంతాత్మా నిస్సంగస్సమదర్శనః ।
దదర్శ లోకే వితతమాత్మానం లోకమాత్మని ॥ 7

టీ:- అనిచ్ఛాయాం హేతుమాహ-చతుర్భిః. స ఇతి. 7

**కోరికలేకుండటకు కారణము చెప్పినాడు.**

అతడు పుట్టుకతోనే శాంతచిత్తుడు, వేటియందు ఆసక్తి లేని -వాడు. అన్నిటియందు ఆ పరమాత్మను దర్శించువాడు. ఈ లోకమున సర్వత్ర వ్యాప్తిచెందినది ఆత్మయని, లోకమంతయూ పరమాత్మచే వ్యాపించినదిగా దర్శించినాడు. 7

శ్లో॥ ఆత్మానాం బ్రహ్మనిర్వాణం ప్రత్యస్తమితవిగ్రహమ్ ।
అవబోధరసైకాత్మ్యమానందమనుసంతతమ్ ॥ 8

టీ:- ఆత్మానమితి. ఆత్మానం స్వరూపభూతం బ్రహ్మ అవరుంధానః ఆప్నువన్ జానన్. ఆత్మనోఽన్యదృత్ తన్నైక్షత. స్వయం తు సర్వస్మాదన్యస్సన్. కథంభూతం బ్రహ్మనిర్వాణం శాంతం. ప్రత్యస్తమితః శాంతః విగ్రహః భేదో యస్మిన్. అవబోధరసేన ఐకాత్మ్యం యస్య. 8

శ్లో॥ అవ్యవచ్ఛిన్న యోగాగ్ని దగ్ధ కర్మమలాశయః ।
స్వరూపమవరుంధానో నాత్మనోఽన్యం తదైక్షత ॥ 9

టీ:- అవ్యవచ్ఛినేతి. కథంభూతః అవ్యవచ్ఛిన్నో యో యోగః స ఏవాగ్నిస్తేన దగ్ధః కర్మమలః ఆశయో వాసనా యస్య. 9

తనను స్వరూపభూతమైన (అనగా యథార్థ స్వరూపమును) ఆత్మగానే, బ్రహ్మగానే తెలుసుకొని దీనికి భిన్నంగా చూడలేదు. తను అన్నింటి కంటే వేరవుతూ గూడా తను తలచిన బ్రహ్మ ఎట్టిది? శాంతమైనది, తొలగిపోయిన భేదముగలది.(అనగా దేనియందు భేదజ్ఞానమేలేదో) తెలియుట అను రసముచే (రసోవైసః) ఒకే ఆత్మ అను స్థితికలది. ఆనంద స్వరూపము గలిగి సర్వవ్యాపకమైనది. సర్వత్రబ్రహ్మనే అను సంధానము చేయడం నిరంతరం అనేదే యోగము. ఆ యోగమనే అగ్నిచేత కర్మవాసనలనే మాలిన్యమును కడగవేయబడినవాడు. ఆత్మకంటే వేరుగా మరేమీ చూడలేదు. (8-9)

శ్లో॥ జడాంధ బధిరోన్మత్త ముకాకృతిరతన్మతిః ।
లక్షితః పథి బాలానాం ప్రశాంతార్చిరివానలః ॥ 10

టీ:- జడేతి. జడాదీనామివాకృతిర్యస్య స తథాభూతో లక్షితః. అతన్మతిః న తేషామివ మతిర్యస్య సర్వజ్ఞత్వాత్. ప్రశాంతాని అర్చీంషి జ్వాలాః యస్య అనలస్య తద్వత్ స్థితిః. 10

మార్గమున పిల్లలకు (అనగా అజ్ఞానులకు) మూర్ఖుడు, గుడ్డివాడు, చెవిటివాడు, పిచ్చివాడు, మూగవాడు వారివలె కనబడే వాడుగాని, నిజముగానే పిచ్చి, మూగ మొదలగునవి లేవు. సర్వజ్ఞుడతడు. జనమునకట్లు కనబడే అతడు, ఎగసిపడే జ్వాలలులేని అగ్నివలె శాంతుడు. 10

శ్లో॥ మత్వా తం జడమున్మత్తం కులవృద్ధాస్సమంత్రిణః ।
వత్సరం భూపతిం చక్రుర్యవీయాంసం భ్రమేస్సుతమ్ ॥ 11

టీ:- మత్వేతి. యవీయాంసం ఉత్కలాత్కనిష్ఠం. 11

కులవృద్ధులైన మంత్రులు ఉత్కలుడిని పిచ్చివాడు, మూర్ఖుడని భావించి ఉత్కలుడి కంటే చిన్నవాడైన భ్రమిపుత్రుడు వత్సరుడిని రాజును చేసిరి. 11

శ్లో॥ సర్వర్ధిర్వత్సరస్వేష్టా భార్యాసూత షడాత్మజాన్ ।
పుష్పార్ణం చంద్రకేతుం చ ఇష్టమూర్జం వసుంజయం ॥ 12

వత్సరుడు తన ప్రియభార్యయైన స్వర్వర్ధి యందు పుష్పార్ణుడు, తిగ్మకేతువు, ఇషుడు, ఊర్జుడు, వసువు, జయుడు అను ఆరుగురు కుమారులగనెను. 12

శ్లో॥ పుష్పార్ణస్య ప్రభా భార్యా దోషా చ ద్వే బభూవతుః ।
ప్రాతర్మధ్యందినం సాయమితిహ్యాసన్ప్రభాసుతాః ॥ 13

టీ:- సర్వేతి. ఇష్టా ప్రియా భార్యా. (12-13)

పుష్పార్ణునకు ఇద్దరు భార్యలు. వారు ప్రభా, దోషా. ప్రభయందు ముగ్గురు కుమారులు కలిగిరి. ప్రాతఃకాలము, మధ్యందినము, సాయము. 13

శ్లో॥ ప్రదోషో నిశథో వ్యుష్టిరితి దోషాసుతా స్త్రయః ।
వ్యుష్టిస్సుతం పుష్కరిణ్యాం సర్వతేజసమాదధే ॥ 14

టీ:- ప్రదోష ఇతి. నిశథః నిశీథః. 14

శ్లో॥ స చక్షుస్సుతమాకూత్యాం మనుం పత్న్యా మవాప హ ।
మనోరసూత మహషీ విరజాన్నడ్వలా సుతాన్ ॥ 15

శ్లో॥ పురుం కుత్సం త్రితం ద్యుమ్నం సత్యవంతమృతం వ్రతమ్ ।
అగ్నిష్టోమమతీరాత్రం సుద్యుమ్నం శిబిముల్ముకమ్ ॥ 16

శ్లో॥ ఉల్ముకో౽జనయత్పుత్రాన్పుష్కరిణ్యాం షడుత్తమాన్ ।
అంగం సుమనసం ఖ్యాతిం క్రతుమంగిరసం గయమ్ ॥ 17

శ్లో॥ సునీథాంగస్య యా పత్నీ సుషువే వేనముల్బణమ్ ।
యద్దౌశ్శీల్యాత్స రాజర్షిర్నిర్విణ్ణో నిరగాత్పురాత్ ॥ 18

టీ:- స ఇతి. ససర్వ తేజాః చక్షుస్సంజ్ఞం మనుం సుతమవాప మనోర్మహీ నడ్వలా. విరజాన్ శుద్ధాన్. పురు ప్రముఖాన్ ద్వాదశ సుతానసూత. (15-18)

దోషాయను రెండవ భార్యయందు ప్రదోషుడు, నిశీథుడు, వ్యుష్టుడు అను ముగ్గురు కుమారులగనెను. వ్యుష్టుడు పుష్కరిణీయందు సర్వతేజుడు అను కుమారునిగనెను. 14

ఆ సర్వతేజుడు ఆకూతి యను పత్నియందు చక్షు అనుపేరుగల మనువును కనెను. ఆ మనువు తన పట్ట మహిషియైన నడ్వలయందు పురువు, కుత్సుడు, త్రితుడు, ద్యుమ్నుడు, సత్యవంతుడు, ఋతుడు, వ్రతుడు, అగ్నిష్టోముడు, అతీరాత్రుడు, సుద్యుమ్నుడు, శిబి, ఉల్ముకుడు అను శుద్ధులైన పురుష ప్రముఖులను కనెను. (15-16)

ఉల్ముకుడు పుష్కరిణియందు అంగుడు, సుమనుడు, ఖ్యాతి, క్రతువు, అంగిరసుడు, గయుడు అను ఆరుగురు ఉత్తములైన కుమారులగనెను. 17

అంగుడు సునీథాయను తన పత్నియందు భయంకరుడగు వేనుడనే వాడిని కనెను. అంగుడు కుమారుని దుష్టమైన శీలముల వలన (నడవడి కవలన) విరక్తుడై రాజర్షియై నగరమును విడిచి వెళ్ళినాడు. 18

శ్లో॥ యమంగ శేపుః కుపితా వాగ్వజ్రా మునయః కిల ।
గతాసోస్తస్య భూయస్తే మమంథుర్దక్షిణం కరమ్ ॥ 19

టీ:- యమితి. అంగ విదుర వాగేవ వజ్రం యేషాం తే. 19

ఓయీ విదురా! మహర్షులకు వాక్కే వజ్రము కదా! కోపించిన మహర్షులు వేనుని శపించిరి. ప్రాణము పోయిన ఆ వేనుని కుడిచేతిని మరలా వారే మథించిరి. 19

శ్లో॥ అరాజకే తదా లోకేదస్యుభిః పీడితాః ప్రజాః ।
జాతో నారాయణాంం శేన పృథురాద్యః క్షితీశ్వరః ॥ 20

టీ:- మథనే హేతుః. అరాచక ఇతి. ఆద్యః పురగ్రామా దీనాం తేన రచితత్వాత్. 20

మథనమునకు కారణమేమనగా రాజులేని లోకమున దొంగలు ప్రవేశించి ప్రజలను పీడించగా, ఋషులు వేనుని కుడిచేతిని మథించిరి. అప్పుడు నారాయాణాంశచే జన్మించిన పృథు చక్రవర్తి మొదటి భూపతిగా అవతరించెను. (పూర్వము ఇంతమంది రాజులు పరిపాలించగా ఇతడు ఆద్యుడు ఎట్లనగా ఇచ్చట ఆద్యుడనగా పురగ్రామాదుల వ్యవస్థనేర్పరచిన మొదటి రాజు ఇతడే). 20

**విదుర ఉవాచ**

శ్లో॥ తస్య శీలనిధేస్సాధోర్బ్రహ్మణ్యస్య మహాత్మనః ।
రాజ్ఞః కథమభూద్దుష్టా ప్రజా యద్విమనా యయౌ ॥ 21

టీ:- తస్యేతి. యత్ యస్యాః ప్రజాయా హేతోః. విమనాస్సన్ యయౌ. 21

**విదురుడు అడిగెను.**

మంచి శీలముకలిగి, పరోపకారియై, బ్రాహ్మణులయందు భక్తి కలిగిన, మహాత్ముడైన ఆ అంగ మహారాజుకు ఏ కారణముగా దుష్టసంతానము కలిగెను. 21

శ్లో॥ కించాంహో వేన ఉద్దిశ్య బ్రహ్మదండమయూయజన్ ।
దండవ్రతధరే రాజ్ఞి మునయో ధర్మవికోవిదాః ॥ 22

టీ:- కించేతి కించ. అంహః అపరాధం వేనే ఉద్దిశ్య ఆలక్ష్య. 22

ధర్మ కోవిదులైన మునులు ప్రజలను శాసించుటయనే వ్రతము కలిగిన వేనరాజుయందు ఏ అపరాధమును చూచి బ్రాహ్మణశాపము అనే దండమును ప్రయోగించినారు. 22

శ్లో॥ నావధ్యేయః ప్రజాపాలః ప్రజాభిరఘవానపి ।
యదసౌ లోకపాలానాం బిభర్త్యోజస్స్వతేజసా ॥ 23

టీ:- యతః అయమధర్మ ఇత్యాహ-నేతి. నావధ్యేయః అవజ్ఞేయోఽపి న భవతి. 23

ఎందువలన ఇది అధర్మము అనగా ఇట్లనుచున్నాడు. పాపవంతుడైనప్పటికి ప్రజలచే ప్రజాపాలకుడు చంపబడరాదు. ఎందు కనగా రాసు తన తేజస్సు ద్వారా లోకపాలకుల శక్తిని ధరించును. 23

శ్లో॥ ఏతదాఖ్యాహి మే బ్రహ్మంత్సునీథాత్మజచేష్టితమ్ ।
శ్రద్దధానాయ భక్తాయత్వం పరావరవిత్తమః ॥ 24

టీ:- ఏతదితి. పరావరవిదాం మధ్యే అతిశ్రేష్ఠః. 24

ఓ బ్రహ్మన్! నీవు కారణాత్మనా, కార్యాత్మనాగల సర్వవ్యాపకమైన పరమాత్మను తెలిసిన వారిలో అతిశ్రేష్ఠుడవు. శ్రద్ధగలిగిన, భక్తుడనైన నాకు సునీథా పుత్రుడగు వేనుని చేష్టలను వినిపింపుము. 24

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ అంగోఽశ్వమేధం రాజర్షి రాజహార మహాక్రతుం ।
నాజగ్ముర్దేవతాస్తస్మిన్నాహూతా బ్రహ్మవాదిభిః ॥ 25

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

పుత్రుడు లేనివాడు కామ్య కర్మల ద్వారా బలవంతముగా పుత్ర సంతానము పొందిన అది సుఖానికి ఉపయోగపడదు అని తెలుపుతూ

టీ:- అథాపి పుత్రః కామ్య కర్మణా బలాదాపాదితో౽పి న సుఖాయ భవేదితి ద్యోతయన్నంగస్య పుత్రోత్పత్తిక్రమమాహ-అంగ ఇత్యాదినా. (25-26)

అంగుడికి పుత్రోత్పత్తి క్రమమును తెలిపెను. అంగుడు అశ్వమేధము అను శ్రేష్ఠమైన మహా యాగమును చేసెను. బ్రహ్మవాదులైన బ్రాహ్మణోత్తములు, మంత్రములచే పిలిచిప్పటికీ, ఆ యజ్ఞమునకు దేవతలు రాలేదు. 25

శ్లో॥ త ఊచుర్విస్మితాస్తత్ర యజమానమథర్త్విజః ।
హవీంషి హూయమానాని న తే గృహ్ణంతి దేవతాః ॥ 26

ఆశ్చర్యపోయిన ఋత్విక్కులు యజమానితో ఇట్లనిరి. మేము ఏ ఆహుతిని ఇచ్చిననూ దేవతలు స్వీకరించడం లేదు. 26

శ్లో॥ రాజన్ హవీంష్యదుష్టాని శ్రద్ధయాసాదితాని తే ।
ఛందాంస్య యాతయామాని యోజితాని ధృతవ్రతైః ॥ 27

ఓ రాజా! ఈ యజ్ఞమున దోషరహితమైన హవిస్సులు శ్రద్ధగా సమర్పింపబడినవి. దృఢమైన వ్రతముగల ఋత్విక్కులు, తొలగిపోని సామర్థ్యముగల మంత్రములను యజ్ఞమున ప్రయోగించిరి 27

శ్లో॥ న విదామేహ దేవానాం హేళనం వయమణ్వపి ।
యన్న గృహ్ణంతి భాగాంత్స్వాన్ యే దేవాః కర్మసాక్షిణః ॥ 28

టీ:- రాజన్నితి. అయాతయామాని ఆగత వీర్యాణి. (27-28)

ఈ యజ్ఞమందు దేవతలపట్ల జరిగిన అపరాధమును అణువంతగూడా మేము తెలియలేకుండా ఉన్నాము. ఏ దేవతలు వైదిక కర్మ సాక్షులో వారు, వారికి చెందవలసిన హవిర్భాగములను ఎందుకో స్వీకరించుటలేదు. 28

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ అంగో ద్విజ వచ(శ్రుత్వా యజమానస్సుదుర్మనాః ।
తత్(ప్రష్టుం వ్యసృజద్వా చం సదస్యాం స్తదనుజ్ఞయా ॥ 29

టీ:- అంగ ఇతి. యజ్ఞే గృహీత మౌనోఽపి వాచం వ్యసృజత్ (ప్రాయుక్తం. 29

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

అంగుడు ఋత్విక్కుల మాటలు విని, దుఃఖితమైన మనస్సు గలవాడై, ఋత్విక్కుల అనుమతితో ఆ కారణమును (దేవతలు ఆహుతి తీసుకొనకపోవడానికి) సభాసదుల నడగడానికి యజ్ఞమున స్వీకరించిన మౌనవ్రతమును విడచి ఇట్లనెను. 29

శ్లో॥ నాగచ్ఛంత్యాహూతా దేవా న గృహ్ణంతి గ్రహానిహ ।
సదసస్పతయో బ్రూత కిమవద్యం మయా కృతమ్ ॥ 30

టీ:- నేతి. ఆహుతాః ఆహూతాః. గ్రహాన్ సోమపాత్రాణి ఇహ యజ్ఞేన గృహ్ణంతి. సదసస్పతయస్సదస్యాః. 30

ఓ సభాసదులారా! ఈ యజ్ఞమున పిలిచినప్పటికీ దేవతలు రావడం లేదు. సోమపాత్రలను స్వీకరించడంలేదు. నేను ఏ దోషము చేసినానో ? (చెప్పండి) 30

**సదసస్పతయ ఊచు**

శ్లో॥ నరదేవేహ భవతో నాఘం తావన్మాక్ స్థితమ్ ।
అస్త్యేకం ప్రాక్తనమఘం యది హేదృక్త్వమప్రజః ॥ 31

టీ:- నరదేవేతి. ఇహ యజ్ఞే జన్మ నివా తావత్. మనాక్ ఈషదపి అఘం న స్థితం. కథంచిత్ జాతస్యాప్యఘస్య సద్య ఏవ ప్రాయశ్చిత్తైః క్షాళనాత్. కింతుం ప్రాక్తనమేకమఘుమస్తి యత్ యస్మాత్. ఈదృగ్గుణాధికోఽపి త్వం ప్రజారహితః. 31

**సదసస్పతయ ఊచు**

ఓ రాజా ఈ జన్మలో నీకు కొంచెమైనను దోషములేదు. ఒకవేళ ఏమైనా పాపములు కలిగితే వెంటనే అగ్నిముఖము చేసి ప్రాయశ్చిత్తము ద్వారా తొలగించుకొన్నావు. కానీ పూర్వజన్మలో ఒక పాపము గలదు. ఆ కారణముగా నీవు ఇన్ని సద్గుణములు కలిగిగూడా ప్రజారహితుడవు. (సంతానము లేనివాడవు) 31

శ్లో॥ తథా సాధయ భద్రం త ఆత్మానం సుప్రజం నృప ।
ఇష్టస్తే పుత్ర కామస్య పుత్రం దాస్యతి యజ్ఞ భుక్ ॥ 32

టీ:- తథేతి. అతః యథా దేవాః విగృహ్ణంతి తథా ఆత్మానం సుప్రజ సంసాధయ. కథం సాధనీయం తదాహుః - ఇష్ట ఇతి. 32

దేవతలు ఏ విధంగా హవిస్సును గ్రహిస్తారో, ఆ అర్హతను ((సత్పుత్రుడిని) పొందుము. (నీకు పుత్రుడు కలిగినట్లయితే దేవతలు హవిస్సులు గ్రహిస్తారు) పుత్రుడిని ఎట్లా సాధించాలి? అనగా మేము చెప్పినట్టుచేసి చక్కటి సంతానమును సాధించుము. నీకు మంగళము జరుగును. పుత్రుడి యందు కోరికగల నీకు, యజ్ఞములోని హవిర్భాగమును స్వీకరించే భగవానుడు, యజ్ఞముచే ఆరాధింపబడిన -వాడై పుత్రుని ఈయగలడు. 32

శ్లో॥ తథా స్వభాగధేయాని గ్రహిష్యంతి దివౌకసః ।
యద్యజ్ఞపురుషస్సాక్షాదపత్యాయ హరిర్వృతః ॥ 33

టీ:- తథేతి. తథాసతి స్వభాగాన్ గ్రహిష్యంతి యతః శ్రీహరిః సాక్షాత్ వృతస్స్యాత్. అతస్తేన సహ సర్వే దేవాః ఆగమిష్యంతీత్యర్థః. 33

యజ్ఞపురుషుడైన సాక్షాత్ శ్రీహరియే సంతానము కొరకు నీచే ఆహ్వానింపబడినచో సర్వదేవతలుగూడా వారి వారి హవిర్భాగములను స్వీకరించెదరు. 33

శ్లో॥ తాంస్తాన్కామాన్ హరిర్దద్యాద్యాన్యాన్కామయతే నరః ।
ఆరాధితో యథైవైషస్తథా పుంసాం ఫలోదయః ॥ 34

టీ:- నన్వతి తుచ్ఛాన్ కామాన్ శ్రీహరిః కథం దద్యాత్తత్రాహ - తాంస్తానితి. 34

మరి అంతపెద్ద దేవుడు, ముక్తిదాత, అతి తుచ్ఛములైన కోరికలు తీరుస్తాడా!అనగా శ్రీహరి ఎవరు ఏది కోరితే అది ఇస్తాడు. ఏ విధంగా ఆయన ఆరాధింపబడుతాడో ఆ విధంగా మానవులకు ఫల ఉత్పత్తి జరుగుతుంది. 34

శ్లో॥ ఇతి వ్యవసితా విప్రాస్తస్య రాజ్ఞః ప్రజాతయే ।
పురోడాశం నిరవపన్ శిపివిష్టాయ విష్ణవే ॥ 35

టీ:- ఇతీతి. ప్రజాతయే పుత్రోత్పత్తయే. శిపిషు పశుషు యజ్ఞరూపేణ విశతి ప్రతితిష్టతీతి తథా. తథా చ శ్రుతిః. యజ్ఞో వై విష్ణుః. పశవశ్శిపిః. యజ్ఞ ఏవ పశుషు ప్రతితిష్టతీతి. 35

ఈ విధముగా నిశ్చయించుకొన్న బ్రాహ్మణులు ఆ రాజునకు పుత్రోత్పత్తి కొరకు శిపివిష్టుడైన విష్ణువునుద్దేశించి పురోడాశద్రవ్యముతో హోమము చేసిరి. (శ్రుతి) శిపివిష్ట శబ్దమునకు పశువులయందు యజ్ఞరూపముగా ప్రవేశించిన అని అర్థము . కృష్ణ యజుః సంహితా, 2-5-5, యజుః బ్రాహ్మణం. 1-3-8. యజ్ఞో వై విష్ణుః పశవః శిపిః యజ్ఞ ఏవ పశుషు ప్రతితిష్ఠతి. శిపివిష్టలో విష్ట శబ్దము విష్ణు పర్యాయమగుచు ఫలవ్యాపియైన యజ్ఞమును సూచించుచున్నది. శిపి శబ్దము పశువాచీ యజ్ఞమున పశువులయందు ప్రవేశించుట అని అర్థము. 35

శ్లో॥ తస్మాత్పురుష ఉత్తస్థౌ హేమమాల్యోఽమలాంబరః ।
హిరణ్మయేన పాత్రేణ సిద్ధమాదాయ పాయసమ్ ॥ 36

టీ:- తస్మాదితి. యోగ్యతయా అగ్నేః. 36

యోగ్యమైన ఆ అగ్నినుండి బంగారుమాల, శుభ్రమైనవస్త్రములు ధరించి, బంగారు పాత్రలో పక్వమైన పాయసమును తీసుకొని పైకి వచ్చెను. 36

శ్లో॥ స విప్రానుమతో రాజా గృహీత్వాంజలి నౌదనమ్ ।
అవఘ్రాయ ముదా యుక్తః ప్రాదాత్పత్న్యా ఉదారధీః ॥ 37

టీ:- స ఇతి. పత్న్యై ప్రాదాత్. 37

విశాల హృదయుడగు ఆ రాజు బ్రాహ్మణుల అనుమతితో ఆ పాయసమును అంజలితో గ్రహించి, వాసనచూచి సంతోషముగా తన పత్నికి ఇచ్చెను. 37

శ్లో॥ సా తత్పుంసవనం రాజ్ఞీ ప్రాశ్య వై పత్యురాదధే ।
గర్భం కాలం ఉపావృత్తే కుమారం సుషువేऽప్రజాః ॥ 38

టీ:- సేతి. పుమాంసం సూతే అనేనేతి. తథా తత్ ప్రాశ్య పత్యుస్సకాశాత్ గర్భం ఆదధే అప్రజా సతీ. 38

సంతానములేని ఆ మహారాజ్ఞి, పురుష సంతానము కలిగించే పాయసమును భక్షించి, భర్తనుండి గర్భమును పొంది, కొంతకాలమైన పిమ్మట కుమారుడిని ప్రసవించినది. 38

శ్లో॥ స బాల ఏవ పురుషో మాతామహమనువ్రతః ।
అధర్మాంశోద్భవం మృత్యుం తేనాభవదధార్మికః ॥ 39

టీ:- స ఇతి. మాతామహం మృత్యుం మృత్యోర్హి పుత్రీ సునీథా. 39

ఆ పుత్రుడు పిల్లవాడుగా ఉన్నప్పుడే అధర్మ అంశమున పుట్టిన మాతామహుడైన మృత్యువుననుసరించెను. మృత్యువు కుమార్తె సునీథా ఆ కారణముచేత ఈ పిల్లవాడుకూడా అధార్మికుడాయెను. 39

శ్లో॥ సశరాసన ముద్యమ్య మృగయుర్వన గోచరః ।
హంత్యసాధుర్మృగాన్ దీనాన్వేనోऽసా విత్యరౌజ్జనః ॥ 40

టీ:- స ఇతి. మృగయుర్లుబ్ధకస్సన్ తం దృష్ట్వా వేనోऽసావగచ్ఛతీతి జనస్సర్వోऽపి అరౌత్. చుక్రోశ. 40

అతడు వనమున ప్రవేశించి వేటగాడై, సాధువులు, జనులు, దీనముగా నుండే మృగములను ధనుస్సునెత్తి చంపుతుండగా అతడిని చూచి వేనుడు వచ్చుచున్నాడని ఆక్రోశించిరి. 40

శ్లో॥ ఆక్రీడే క్రీడతో బాలాన్వయస్యానతిదారుణః ।
ప్రసహ్యా నిరనుక్రోశః పశుమారమమారయత్ ॥ 41

టీ:- ఆక్రీడఇతి. ఆక్రీడేక్రీడాస్థానే. బాలాన్ పశూనివ అమారయత్. (41)

ఆటలాడే స్థలమున సమాన వయస్కులైన బాలురు ఆడుకుంటుంటే వెళ్ళి, దయలేనివాడై పశువులను సంహరించినట్లు దారుణముగా సంహరించెను. 41

శ్లో॥ స విచక్ష్య ఖలం పుత్రం శాసనైర్వివిధైర్నృపః ।
యదానశాసితుం కల్యో భృశమాసీత్సు దుర్మనాః ॥ 42

మూర్ఖుడైన పుత్రుని చూచి, వివిధములైన శిక్షలచే అదుపులో పెట్టడానికి ప్రయత్నించిననూ రాజు సమర్థుడు కాలేదు. చాలా దుఃఖమును పొందినాడు. 42

టీ:- సమితి. విచక్ష్య దృష్ట్వా. 42

శ్లో॥ ప్రాయేణాభ్యర్చితో దేవో యేఽప్రజా గృహమేధినః ।
కదపత్యకృతం దుఃఖం యేన విందంతి దుర్భరమ్ ॥ 43

దుఃఖిత మనస్కుడైన అతని దుర్మార్గుడైన పుత్ర నిందను గూర్చి ఇట్లు చెప్పుచున్నాడు. సామాన్యముగా సంతానములేని గృహస్థులు భగవంతుడిని ప్రార్థిస్తారు. కానీ దుర్మార్గమైన సంతానముచే భరించరాని దుఃఖము ఉంటుందని తెలియనివారే సంతానమును కోరుతారు. 43

టీ:- దుర్మనసస్తస్య కుపుత్ర నిందావాక్యాన్యాహ-త్రిభిః. ప్రాయేణేతి. అప్రజసః యేతైరభ్యర్చితః. అత్ర హేతుః కుత్సితైరపత్యైస్సంభృతం ధారయితుమశక్యం దుఃఖం యేన విందంతి. 43

శ్లో॥ యతః పాపీయసీ కీర్తిరధర్మశ్చ మహాన్నృణామ్ ।
యతో విరోధస్సర్వేషాం యత ఆధిరనంతకః ॥ 44

చెడు సంతానముతో మానవులకు చెడ్డపేరు, అధర్మము, అందరితో విరోధము. మానసికమైన దుఃఖము కలుగును. 44

టీ:- యత ఇతి. సర్వేషాం సర్వైస్సహ యతః అధిః మానసీవ్యధా. (44)

శ్లో॥ కస్త్వం ప్రజాపదేశం వై మోహబంధనమాత్మనః ।
పండితో బహుమన్యేత యదార్థాః క్లేశదాగృహాః ॥ 45

టీ:- కఇతి. తం ప్రజాపదేశం పుత్రనామమాత్రమపి ఆత్మనో మోహనం బంధనం యథార్థాః యన్నిమిత్తాః క్లేశదాః గృహాభవంతి. (45)

ఎవరి మూలకముగా గృహములు దుఃఖవంతములో అట్టివాడు పేరునకు మాత్రమే పుత్రుడనబడువాడు. మోహముచేతనే తనకు బంధము. పండితుడైనవాడు ఈ యథార్థమును గ్రహించవలెను. (45)

శ్లో॥ కదపత్యం పరం మన్యే సదపత్యాచ్ఛుచాం పదాత్ ।
నిర్విద్యేత గృహాన్మర్త్యో యత్క్లేశనివహా గృహాః ॥ 46

టీ:- ఇదానీం నిర్వేదహేతుత్వేన కుత్సితమేవాపత్యమభినందతి - కదపత్యమితి. శుచాం పదాత్ శోకానాం స్థానాత్. పరత్వేఽపి హేతుః - నిర్విద్యేతేతి. తత్కుతః యత్ యతః కదపత్యాత్. గృహాః క్లేశనివహా భవంతి. 46

ఇప్పుడు నిర్వేద కారణంగా దుష్ట సంతానమును మెచ్చుకుంటు -న్నాడు. దుఃఖమునకు స్థానమైన మంచి సంతానమున కంటే చెడు సంతానమే శ్రేష్ఠమని అనుకొంటాను. చెడు సంతానము కారణముగా దుఃఖదాయకములైన గృహదుల యందు విరక్తిగలిగి ఇల్లు నుండి బయటకు వెళుతాడు. (మంచి సంతానమును కలిగితే వారికి ఏ కొంచెము ఇబ్బంది కలిగినా తనకే దుఃఖం. ఆ మంచి సంతానమును చూచి దశరథుడివలె మోహంతో ఇల్లు విడువలేదు, వైరాగ్యంరాదు. వాడి నడవడిక అట్లా ఆకర్షిస్తుంది. చెడ్డవాడికి ఏమిచేయాలి అనిపించదు ఎంత కనబడకుంటే అంత మనఃశాంతి). (45-46)

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ ఏవం సనిర్విణ్ణమనా నృపో గృహా
న్నిశీథ ఉత్థాయ మహోదయోదయాత్ ।
అలబ్ధనిద్రోఽనుపలక్షితో నృభి
ర్హిత్వా గతో వేనసువం ప్రసుప్తామ్ ॥ 47

టీ:- ఏవమితి. మహతా ముదయానాం విభూతీనాముదయో యస్మిన్ తస్మాద్గృహాత్ గతః యా వేనం సూతే స్మ తాం. 47

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

ఈ విధముగా విరక్త మనస్కుడైన రాజు నిద్రలేనివాడై , అర్థరాత్రి లేచి, నిద్రిస్తున్న వేనుని తల్లిని, గొప్ప సంపదలున్న ఇంటిని విడిచి జనులకు కనబడకుండా (జనులచే గుర్తింపబడకుండా) వెళ్ళెను. 47

శ్లో॥ విజ్ఞాయ నిర్విద్య పతిం గతం ప్రజాః
పురోహితామాత్య సుహృద్గణాదయః ।
విచిక్యురుర్వ్యా మతిశోక కాతరా
యథా నిగూఢం పురుషం కుయోగినః ॥ 48

టీ:- విజ్ఞాయేతి. ప్రజాః పురోహితాదయశ్చ విచిక్యుః అన్వేషితవంతః తం తు తత్రైవ సంతమపి నాపశ్యన్నితి దృష్టాంతేనాహ-యథేతి. 48

దుఃఖితుడై రాజు ఇల్లు విడిచి వెళ్ళినాడని ప్రజలు, పురోహితుడు మంత్రులు, స్నేహితులు, అత్యంత దుఃఖితులై (భూమిమీద) వెతికిరి. ఏ విధముగానైతే కుయోగులు తమలోనేయున్న నిగూఢ ఆత్మతత్త్వ -మును తెలుసుకోలేరో ఆ విధముగా అక్కడే ఉన్న రాజును వారు తెలుసుకోలేక పోయిరి. 48

శ్లో॥ అలక్షయంతః పదవీం ప్రజాపతేర్హ్వా
తోద్యమాః ప్రత్యుపసృత్య తే పురీమ్ ।
ఋషీంత్స మేతానభివంద్య సాస్రవో
న్యవేదయన్ భారతభర్తృ విప్లవమ్ ॥ 49

టీ:- అలక్షయంత ఇతి. సాస్రవః రుదంతః భర్తుర్విప్లవం నాశం ఆదర్శన మిత్యర్థః. 49

ఓ విదురా! రాజు జాడను కానజాలక ప్రయత్నము నిష్ఫలమై తిరిగి పట్టణమునకు వచ్చి ఒకచోట గూడియున్న మహర్షులను గూర్చి నమస్కరించి కంటనీరు కారుచుండగా తమరాజు కనబడకపోవుటను గూర్చి నివేదించిరి. 49

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,
త్రయోదశోఽ ధ్యాయః

శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు
పదమూడవ అధ్యాయము సమాప్తము.

## చతుర్దశో౽ధ్యాయః

శ్లో॥ చతుర్దశేతు దుష్పుత్ర భయాదంగే గతే ద్విజైః ।
అభిషిక్తస్య వేనస్య రోషాత్తైర్వధ ఉచ్యతే ॥

## 14వ అధ్యాయము

ఈ పధ్నాల్గవ అధ్యాయమునదుర్మార్గుడైన కుమారుడి భయానికి అంగుడు వెళ్ళిపోగా అభిషిక్తుడైన వేనుడు కోపయుక్తులైన ఋషులచే వధింపబడడం చెప్పబడుతుంది.

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ భృగ్వాదయస్తు మునయో లోకానాం క్షేమదర్శినః ।
గోప్తర్యసతి వైన్యాణాం పశ్యంతః పశుసామ్యతామ్ ॥ 1

టీ:- భృగ్వాదయ ఇతి. క్షేమదర్శినః క్షేమచింతకాః పశుసమాన రూపతాం పశ్యంతః. 1

**మైత్రేయమహర్షి ఈ విధముగా పలికెను.**

లోకములకు క్షేమమును నిరంతరము చింతిచువారైన భృగ్వాది మహర్షులు రాజు కనబడకపోగా ప్రజలు పశు సమానులు కావడం చూచుచున్నవారై... 1

శ్లో॥ వీరమాతరమాహూయ సునీథాం బ్రహ్మవాదినః ।
ప్రకృత్య సమ్మతం వేనమభ్యషించన్పతిం భువః ॥ 2

టీ:- వీరమాతరమితి. అమాత్యాదీనాం ప్రకృతీనామసమ్మతమితి పాఠాంతరే ప్రకృత్యాస్వరూపేణ అసమ్మతం. 2

బ్రహ్మవేత్తలైన మహర్షులు వేదవాదులు వీరమాతయైన సునీథను పిలిచి, మంత్ర్యాదులకు సమ్మతుడు కాని వేనుని భూమికి రాజుగా అభిషించిరి. ప్రకృత్యాసంమతం అని పాఠమున్నచో స్వభావము చేత సమ్మతుడు, అంగీకార్యుడు కాని అని అర్థము చెప్పవచ్చును. 2

శ్లో॥ శ్రుత్వా నృపాసనగతం వేనమత్యుగ్ర శాసనమ్ ।
నిలిల్యుర్దస్యవస్సద్యస్సర్పత్రస్తా ఇవాఖవః ॥ 3

టీ:- శ్రుత్వేతి. చోరా నిలిల్యుః విలీనాః బభూవుః. 3

అతికఠినమైన శాసనము చేయు వేనుడు రాజసింహాసనముపై కూర్చున్నాడని వినగానే వెంటనే దొంగలంతా పాములకు భయపడిన ఎలుకలవలె కనబడకుండా పోయిరి. 3

శ్లో॥ స ఆరూఢ నృపస్థాన ఉన్నద్ధోష్టవిభూతిభిః ।
అవమేనే మహాభాగాంత్సబ్ధస్సంభావితస్సతః ॥ 4

ఆ వేనుడు రాజసింహాసనమునధిష్టించి, లోకపాలుర ఐశ్వర్యముచేత పట్టవశముకానివాడై, గర్వితుడై, తనను తానే పొగడుకుంటూ మహాత్ములనే అవమానపరిచెను. 4

శ్లో॥ ఏవం మదాంధ ఉత్సిక్తో నిరంకుశ ఇవ ద్విపః ।
పర్యటన్రథమాస్థాయ కంపయన్నివ రోదసీ ॥ 5

ఈ విధముగా రాజసింహాసనాధిష్టుతుడు కావడం వలన కలిగిన గర్వముచే గుడ్డివాడై, లోకనియమమును, వేదనియమములను, విడిచి అంకుశములేని ఏనుగువలె రథమునెక్కి భూమ్యాకాశాదులను వణికింపచేస్తూ, పర్యటిస్తుండెను. 5

శ్లో॥ న యష్టవ్యం న దాతవ్యం న హోతవ్యం ద్విజాః క్వచిత్ ।
ఇతి న్యవారయద్ధర్మం భేరిఘోషేణ సర్వతః ॥ 6

(పర్యటిస్తూ) ఎక్కడగూడా బ్రాహ్మణులు యజ్ఞము చేయరాదు, దానములు చేయరాదు, హోమములు చేయరాదు అంటూ సర్వత్రా భేరీతో చాటింపుచేసి ధర్మమునడ్డుకొనెను. 6

టీ:- స ఇతి. ఆరూఢం నృపస్థానం రాజాసనం యేన స. అష్ట విభూతి భిర్లోకపాలైశ్వర్యైః. (4-6)

శ్లో॥ వేనస్యావేక్ష్య మునయో దుర్వృత్తస్య విచేష్టితమ్ ।
విమృశ్య లోకవ్యసనం కృపయోచుశ్చ సత్రిణః ॥ 7

చెడుస్వభావము కలిగిన వేనుడి చేష్టలనుచూచి, జనులయొక్క కష్టముల విచారించిన మునులు ఒకచోట కలిసినవారై దయతో పలికిరి. (7)

టీ:- వేనస్యేతి. సత్రిణః మిళింతాస్సంతః. 7

శ్లో॥ అహో ఉభయతః ప్రాప్తం లోకస్య వ్యసనం మహత్ ।
దారుణ్య భయతో దీప్త ఇవ తస్కర పాలయోః ॥ 8

టీ:- అహో ఇతి. మూలతాశ్చగ్రతశ్చ దీప్తే జ్వలితే కాష్ఠే తన్మధ్య వర్తినాం పిపీలికాదీనాం యథా ఉభయతో వ్యసనం. ఏవం తస్కరేభ్యః పాలకాశ్చ దుఃఖం ప్రాప్తమిత్యర్థః. 8

అయ్యో! జనులకు రెండు వైపులనుండి గొప్పనైన దుఃఖము ప్రాప్తించినది. మొదలు, చివర రెండు స్థలములలో కట్టెకు నిప్పంటు -కున్నప్పుడు మధ్యనున్న చీమలు మొదలగు వాటికి అటు వెళ్ళినా, ఇటు వెళ్ళినా దుఃఖము ప్రాప్తించునట్లు, జనులకు అటు దొంగలనుండి ఇటు పాలకులనుండి దుఃఖము ప్రాప్తించినది. 8

శ్లో॥ అరాజకభయాదేష కృతో రాజా తదర్హణః ।
తతోఽప్యాసీద్భయంత్యద్య కథం స్యాత్స్వస్తి దేహినామ్ ॥ 9

టీ:- తదేవాహుః - అరాజకేతి. అతదర్హణః. రాజ్యానర్హః. 9

(వేనుడు) రాజ్యమునకు అనర్హుడైనప్పటికీ లోకము అరాజకమవుతుందనే భయముతో రాజుగా చేయబడినాడు. ఇప్పుడు అంతకంటే ఎక్కువ భయము కలిగినది. జనులకు మంచి ఎట్లు జరుగుతుంది.? 9

శ్లో॥ అహేర్యథా పయః పోషః పోషకస్యాప్యనర్థభృత్ ।
వేనః ప్రకృత్యైవ ఖలస్సునీథా గర్భసంభవః ॥ 10

టీ:- అస్మాకమప్యనిష్టం జాతమిత్యాహుః - అహేరితి. అహేర్యథా పయః పోషః క్షీరేణ పోషణం పోషకస్యాప్యనర్థం బిభర్తి పుష్ణాతీతి తథా. తదేవాహుర్వేన ఇతి. 10

మనందరికీ అనిష్టము కలిగినది. పాముకు పాలుపోసి పెంచినచో, అది పాలు పోసినవారికే అనర్థము కలిగిస్తుంది. సునీథా గర్భమున జన్మించిన వేనుడు స్వభావముచేతనే దుష్టుడు కదా! 10

శ్లో॥ నిరూపితః ప్రజాపాలస్స జిఘాంసతి వై ప్రజాః ।
తథాపి సాంత్వయేమాముం నాస్మాంస్తత్పాతకం స్పృశేత్ ॥11

టీ:- నిరూపిత ఇతి. నిరూపితః నియుక్తః అస్మాభిః సాంత్వయేమ ఉపపత్తిభిః ప్రార్థయిష్యామహే. తస్య పాతకం. 11

ప్రజాపాలకుడిగా మనచేతనే నియుక్తుడైనాడు. ప్రజలను హింసించుచున్నాడు. అయినప్పటికీ అతడిని ఉపపత్తులచే (యుక్తులచే) ప్రార్థిద్దాం. అట్లైనచో మనలను వీని పాపము అంటదు. 11

శ్లో॥ తద్విద్వద్భిరసద్వృత్తో వేనోఽస్మాభిః కృతో నృపః ।
సాంత్వితో యదినో వాచం న గ్రహీష్యత్యధర్మకృత్ ॥ 12

టీ:- తదతి. స్వస్య తత్పాతక స్పర్శే హేతుః. తత్పాతకిత్వం విద్వద్భిర్జానద్భిః. గూఢః మన్యుర్యేషాం తే సామభిః ప్రియోక్తిభిః. (12-14)

శ్లో॥ లోకధిక్కార సందగ్ధం దహిష్యామ స్వతేజసా ।
ఏవమధ్యవసాయైనం మునయో గూఢమన్యవః ।
ఉపవ్రజ్యా బ్రువన్వేనం సాంత్వయిత్వాథ సామభిః ॥ 13

విద్వాంసులమైన (మంచి, చెడు తెలిసిన) మనము వేనుడు దుర్మార్గుడని తెలిసీ రాజుగా చేసినాము. అందుచేత ఆ పాపము మనకు అంటుకుంటుంది. కావున మంచిగా చెప్పి చూద్దాము అధార్మికుడైన వేనుడు, సహనముచే చెప్పే మన మంచి మాటలు గ్రహించడు. అప్పుడు జన తిరస్కారాగ్నిచే కాలిన వేనుడిని మన తేజస్సుచే కాల్చివేద్దాం. ఈ విధముగా నిర్ణయించుకొని, అవ్యక్తమైన కోపముగల ఋషులు వెళ్ళి, ప్రియమైన మాటలతో వేనుడికి ఇలా నచ్చచెప్పిరి. 12, 13

**మునయ ఊచు**

శ్లో॥ నృపవర్య నిబోధైతద్యత్తే విజ్ఞాపయామ భోః ।
ఆయుః శ్రీ బల కీర్తీనాం తవ తాత వివర్ధనమ్ ॥ 14

**ఋషులు ఇట్లనుచున్నారు.**

ఓ రాజశ్రేష్ఠా! ఏది విజ్ఞాపనము చేస్తున్నామో అది నీకు ఆయుష్షును, ధనమును, బలమును, కీర్తిని పెంచుతుంది. కావున వినుము. 14

శ్లో॥ ధర్మ ఆచరితః పుంసాం వాఙ్మనః కాయవృత్తిభిః ।
లోకాన్విశోకాన్వితరత్యథానంత్యమసంగినామ్ ॥ 15

టీ:- ధర్మ ఇతి. అసంగినాం నిష్కామానాం ఆనంత్యం మోక్షమపి వితరతి. 15

నాయనా! వాక్కు, మనస్సు, దేహము, బుద్ధి వీటిచేత ఎవరు ధర్మాచరణ చేస్తారో అట్టి జనులను వారి ధర్మాచరణమే శోక -రహితులనగా చేస్తుంది. అంతేకాదు నిష్కామముగా ధర్మమును ఆచరించినచో మోక్షముగూడా ప్రాప్తిస్తుంది. 15

శ్లో॥ న తే మావినశద్వీర ప్రజానాం క్షేమలక్షణః ।
యస్మిన్వినష్టే నృపతిరైశ్వర్యాదవరోహతి ॥ 16

టీ:- స ఇతి. మావినశత్ న నశ్యతు. 16

ఓ వీరా! చూచువారికి (ప్రజలందరికి) క్షేమము కలిగించేది ధర్మము. ఆ ధర్మము నీయందు నశించకుండా ఉండుగాక! ధర్మము నశించిపోతే రాజు సకలైశ్వర్యములనుండి తొలగిపోతాడు. (దిగజారి పోతాడు). 16

శ్లో॥ రాజన్యోఽసాధ్వమాత్యేభ్యశ్చోరాదిభ్యః ప్రజాన్నృప ।
రక్షన్ యథా బలిం గృహ్ణన్నిహ ప్రేత్య చ మోదతే ॥ 17

హే రాజన్! ప్రజలను రాజు చెడుమంత్రుల నుండి, దొంగల నుండి రక్షిస్తూ శాస్త్రవిహితమైన పన్నులు స్వీకరిస్తూ ఉంటే ఈ లోకములో మరియు మరణించిన పిమ్మట పరలోకమున కూడా సుఖ పడతాడు. 17

శ్లో॥ యస్య రాష్ట్రే పురే చైవ భగవాన్ యజ్ఞపూరుషః ।
ఇజ్యతే స్వేన ధర్మేణ జనైర్వర్ణాశ్రమాత్మకైః ॥ 18

ఎవరి రాష్ట్రములోగాని, పురమునగాని యజ్ఞపురుషుడు వర్ణధర్మ, ఆశ్రమ ధర్మములనతిక్రమించకుండా వారివారి ధర్మప్రకారం జనులచే ఆరాధింపబడుతాడో... 18

శ్లో॥ తస్య రాజ్ఞో మహాభాగ భగవాన్ భూతభావనః ।
పరితుష్యతి విశ్వాత్మా తిష్ఠతోనిజశాసనే ॥ 19

ఆ రాజు విషయమై భగవంతుడు, సర్వప్రాణులయందు క్షేమమును తలిచే విశ్వాత్మకుడు, తన శాసనముయందు నిలుచున్న తీరును గూర్చి సంతోషించును. 19

శ్లో॥ తస్మింస్తుష్టే కిమప్రాప్యం జగతామీశ్వరేశ్వరే ।
లోకాస్సపాలా హ్యేతస్మై హరంతి బలిమాదృతాః ॥ 20

టీ:- రాజన్య ఇతి. అసాధవో యే అమాత్యాః తేభ్యః యథా యథా శాస్త్రం. (17-20)

ఆ భగవానుడే సంతోషించిన పొందరానిదేదీలేదు, జగదీశ్వరుల కీశ్వరుడతడు. లోకపాలకులతోగూడి ప్రాణులు ఆ పరమాత్మకు ఆదర పూర్వకముగా ఆహారమును (బలిని) సమర్పించుకొనుచున్నారు. 20

శ్లో॥ తం సర్వలోకామరయజ్ఞ సంగ్రహం
త్రయీమయం ద్రవ్యమయం తపోమయమ్ ।
యజ్ఞైర్విచిత్రైర్యజతో భవాయ తే
రాజన్ స్వదేశాన్ననురోద్ధుమర్హసి ॥ 21

టీ:- తమితి. సర్వాన్ లోకాన్ తత్పాలకానమరాంశ్చ. తత్ప్రాపకాన్ యజ్ఞాంశ్చ సంగృహ్ణాతి నియచ్ఛతీతి తథా తం విచిత్రైః ద్రవ్యయజ్ఞాదిభిః భవాయ సమృద్ధయే. యజతః నః జనాన్ స్వదేశాన్ తద్వాసినో జనాన్ అనురోద్ధుమనువర్తితుం. 21

సర్వలోకములను, లోకపాలకులైన దేవతలను, అమరత్వ ప్రాప్తికి కారణమైన యజ్ఞములను నియంత్రించునట్టి వేదమయుడు, యథార్థ రూపముననున్న తపోమయుడును అయిన ఆ పరమాత్మను విచిత్రములైన ద్రవ్యయజ్ఞాదులచేత నీ యొక్క సమృద్ధి కొరకు పూజిస్తూ నీ స్వదేశవాసులైన జనులను దీనియందు ప్రవర్తింప చేయుటకు అర్హుడవు. 21

శ్లో॥ యజ్ఞేన యుష్మద్విషయే ద్విజాతిభి
ర్వితాయమానేన సురాః కళా హరేః ।
స్విష్టాః ప్రతుష్టాః ప్రదిశంతి వాంఛితం
తద్ధేళనం నార్హసి వీర చేష్టితుమ్ ॥ 22

టీ:- యజ్ఞేనేతి. యుష్మద్విషయే త్వద్దేశే. హరేః కళాః అంశాః సురాః తేషాం సురాణాం హేళనం అవజ్ఞాం. 22

ఓ వీరా! నీ దేశమున బ్రాహ్మణులచే నిర్వహింపబడే యజ్ఞము చేత శ్రీహరిఅంశలైన దేవతలుచక్కగా ఆరాధింపబడినవారై, సంతుష్టులై కోరిన వాటినిఅనుగ్రహించగలరు. ఆ దేవతలను అవమానపరచడం, తిరస్కరించడం చేయరాదు. 22

వేన ఉవాచ

శ్లో॥ బాలిశా బత యూయం వో అధర్మే ధర్మమానివః ।
యే వృత్తిదం పతిం హిత్వా జారం పతిముపాసతే ॥ 23

వేనుడు అనెను.

అయ్యో! మీరు అజ్ఞులు, మూర్ఖులు. అధర్మముయందు ధర్మమనే అభిమానము పెట్టుకొన్నారు. అన్నపానాదులుచూచే నన్ను విడిచి, భర్తను విడచి విటునిసేవించే స్త్రీ మాదిరిగా విష్ణువును ఉపాసించు -చున్నారు. 23

శ్లో॥ అవజానంతి తే మూఢా నృపరూపిణమీశ్వరమ్ ।
నాను విందంతి తే భద్రమిహ లోకే పరత్ర చ ॥ 24

మూఢులై, రాజు రూపంలో ఉన్న ఈశ్వరుడిని అవమానించు చున్నారు. మీరు ఈలోకంలో, పరలోకంలోగూడా మంగళములను పొందరు. 24

టీ:- బాలిశా ఇతి. బాలిశాః అజ్ఞాః. వృత్తిదం అన్నాదిప్రదం మాం హిత్వా. (23-24)

శ్లో॥ కో యజ్ఞపురుషో నామ యత్ర వో భక్తిరీదృశీ ।
భర్తృస్నేహ విదూరాణాం యథా జారే కుయోషితామ్ ॥ 25

భర్తయందు ప్రేమలేని నిందిత స్త్రీలకు పరపురుషుడియందు ఏ విధంగా ప్రేముంటుందో అట్లా మీకు యజ్ఞపురుషుడియందు అతి ఉత్కటమైన ప్రేమ ఉన్నది. నాకంటే వేరైనవాడు, యజ్ఞపురుషుడు, యజ్ఞాధిష్ఠాతా విష్ణువనేవాడు ప్రసిద్ధుడై ఒకడున్నాడా? లేనేలేదు. 25

శ్లో॥ విష్ణుర్విరించో గిరిశ ఇంద్రో వాయుర్యమో రవిః ।
పర్జన్యో ధనదస్సోమః క్షితిరగ్ని రపాం పతిః ॥ 26

విష్ణువు, బ్రహ్మ, శివుడు, ఇంద్రుడు, వాయువు, యముడు, సూర్యుడు, మేఘుడు, కుబేరుడు, చంద్రుడు, భూమి, అగ్ని, వరుణుడు...26

టీ:- క ఇతి. భర్తుః స్నేహో విదూరోయాసాం తాసాం. (25-26)

శ్లో॥ ఏతే చాన్యే చ విబుధాః ప్రభవో వరశాపయోః ।
దేహే భవంతి నృపతేస్సర్వదేవమయో నృపః ॥ 27

అంతేగాక ఇతర దేవతలు వర శాపములయందు సమర్థులు అయినవారు రాజు దేహమున యుందురు. కావున రాజే ఈశ్వరుడు. ఇతరులంతా రాజుయొక్క అంశలు అని భావము. 27

టీ:- ఏత ఇతి. దేహే భవంతి నృపతేః. అతో నృపతిరేవేశ్వరః ఇతరే తదంశా ఇతి భావః. 27

శ్లో॥ తస్మాన్మాం కర్మభిర్విప్రా యజధ్వం గతమత్సరాః ।
బలిం చ మహ్యంహరత మత్తోఽన్యః కోఽగ్రభుక్పుమాన్ ॥28

ఓ బ్రాహ్మణులారా! మీ లోని మాత్సర్యమును వదిలి కర్మలచే నన్నే ఆరాధించండి. నాకే బలులు (ఆహారము) సమర్పించండి. నాకంటే ఆరాధింప బడేవాడు ఇంకెవ్వడున్నాడు? 28

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఇత్థం విపర్యయ మతిః పాపీయానుత్పథం గతః ।
అనునీయమానస్తద్యాచ్ఞాం స చక్రే భ్రష్టమంగళః ॥ 29

టీ:- తస్మాదితి.బలిం స్వామిభాగాం అగ్రభూగారాధ్యః. (28-29)

మైత్రేయమహర్షి చెప్పుచున్నాడు.

ఈ విధముగా భ్రాంతి చెందిన బుద్ధిగలవాడు, తప్పుదారిన పోయిన పాపవంతుడు, పుణ్యము నశించినవాడైన వేనుడు మునులు ఎంత నచ్చచెప్పినప్పటికీ వారి కోర్కెను మన్నించలేదు. 29

శ్లో॥ ఇతితే సత్కృతాస్తేన ద్విజాః పండితమానినా ।
భగ్నాయాం భవ్యయాచ్ఞాయాం తస్మై విదుర చుక్రుధుః ॥ 30

ఓ విదురా! పండితుడుకానప్పటికీ పండితుడనని అభిమానపడే వాడు పండితమాని. అట్టి వేనునిచే అవమానింపబడిన ఋషులు, వారి గొప్ప కోరిక భగ్నముకగా వారు వేనునిపై కోపగించినారు. 30

శ్లో॥ హన్యతాం హన్యతామేష పాపః ప్రకృతిదారుణః ।
జీవన్ జగదసావాశు కురుతే భస్మసాద్ధ్రువమ్ ॥ 31

స్వభావముచేతనే క్రూరుడైన ఈ పాపి సంహరింపబడుగాక! ఇతడు బ్రతికియున్నచో నిశ్చయముగా జగత్తును తొందరగా భస్మము చేయగలడు. 31

శ్లో॥ నాయమర్హత్యసద్వృత్తో నరదేవ వరాసనమ్ ।
యో హి యజ్ఞపతిం విష్ణుం వినిందత్యనపత్రపః ॥ 32

టీ:- ఇతీతి తేనే అసత్కృతాః భవ్యా యాం యాచ్ఞాయాం భగ్నాయాం సత్యాం. (30-32)

దుష్టప్రవృత్తిగల ఇతడు శ్రేష్ఠమైన రాజసింహాసనమున కూర్చుండుటకు యోగ్యుడు కాడు. యజ్ఞాధిష్ఠాతా, యజ్ఞపతియైన విష్ణుభగవానుడిని సిగ్గులేనివాడై నిందించుచున్నాడు. 32

శ్లో॥ కో వైనం పరిచక్షీత వేనమేకమృతేఽశుభమ్ ।
ప్రాప్త ఈదృశమైశ్వర్యం యదనుగ్రహభాగ్జనః ॥ 33

టీ:- క ఇతి. పరిచక్షీత వినిందేత. అశుభం వేనం వినా. కృతఘ్నతామాహుః.యదనుగ్రహవిషయస్సన్ ఈదృశమైశ్వర్యం యః ప్రాప్తః. 33

శ్లో॥ ఇత్థం వ్యవసితా హంతుమృషయో రూఢమన్యవః ।
నిజఘ్నుర్హుంకృతైర్వేనం హతమచ్యుత నిందయా ॥ 34

టీ:- ఇత్థమితి. పూర్వం యే గూఢమన్యవస్త ఇదానీం రూఢమన్యవః హుంకృతైర్హుంకారైః. 34

శ్లో॥ ఋషిభిః స్వాశ్రమపదం గతే పుత్ర కళేబరమ్ ।
సునీథా పాలయామాస విద్యాయోగేన శోచతీ ॥ 35

టీ:- ఋషిభిరితి. స్వాశ్రమపదం ప్రతి ఋషిభిర్గతే గమనే కృతే. విద్యాయోగేన మంత్ర సహితయా యుక్త్యా. 35

ఇట్టి ఐశ్వర్యమును ఎవ్వడి అనుగ్రహమునకు భాక్కుడై పొందుచున్నాడో అట్టి వారెవ్వరూ భగవంతుడిని నిందించెదరు? ఒక్క అశుభుడైన వేనుడు మాత్రమే భగవన్నింద చేయును. 33

అచ్యుతుని నిందచే మొదలే మృతప్రాయుడైన వేనుని పూర్వము గూఢముగా ఉన్న కోపముగల మహర్షులు ఇప్పుడు ప్రకటితకోపులై , గతంలో అనుకున్నరీతిలో 'హుం' కరించగా వేనుడు మరణించెను. 34

ఋషులు వారి ఆశ్రమములకు వెళ్ళగా, సునీథ దుఃఖిస్తూ, పుత్రుడి శరీరమును మంత్రసహితమైన ఓషధులు కలిపిన నూనెలో ఉంచి కాపాడెను. 35

శ్లో॥ ఏకదా మునయస్తేతు సరస్వత్సలిలాప్లుతాః ।
హుత్వాగ్నీం సత్కథాశ్చక్రురుపవిష్టాస్సరిత్తటే ॥ 36

టీ:- ఏకదేతి. పుంవద్భావ ఆర్షః. సరస్వత్యాస్సలితే ఆప్లుతా ఇత్యర్థః (36)

ఒకనాడు మునులంతా సరస్వతీనదిలో స్నానముచేసి, అగ్నిహోత్రములనాచరించి, నదీ తీరమున కూర్చొని విష్ణు కథలను చెప్పుకొనుచుండిరి. 36

శ్లో॥ వీక్ష్యోత్థితాన్మహోత్పాతానాహుర్లోక భయంకరాన్ ।
అప్యభద్రమనాథాయా దస్యుభ్యో న భవేద్భువః ॥ 37

టీ:- వీక్ష్యేతి. తదా తూత్పాతాన్వీక్ష్య భువః. అభద్రం న భవేది త్యాహుశ్చ. 37

జనులకు భయమునగొల్పే పెద్ద చెడు శకునములు కలుగగా, ఒక్కసారి బయటపడిన వాటిని చూచి, రాజులేని రాజ్యమున దొంగలు లేకుండా ఉన్న భూమి ఒక్క అంగుళముకూడా లేదుకదా! అనుకొనిరి. 37

శ్లో॥ ఏవం మృశంత ఋషయో ధావతాం సర్వతోదిశమ్ ।
పాంసుస్సముత్థితో భూరిశ్చోరాణామభిలుంపతామ్ ॥ 38

టీ:- ఏవమితి. ఏవం మృశంత ఋషయః స్థితాః తథా ధావతాం చోరాణాం భూరిః పాంసుః సముత్థితః. 38

ఈ విధముగా ఋషులు చర్చిస్తూనే ఉన్నారు. ఇంతలో దోపిడి చేయుచూ అన్ని దిక్కుల పరిగెత్తుతూ ఉన్న దొంగల వైపు నుండి మిక్కిలి దుమ్ము లేచింది. 38

శ్లో॥ తదుపద్రవమాజ్ఞాయ లోకస్య వసు లుంపతామ్ ।
భర్తర్యుపరతే తస్మిన్నన్యోన్యం చ జిఘాంసతామ్ ॥ 39

టీ:- తదితి. తత్తదా లోకస్య వసుధనం లుంపతాం జిఘాంసతాం హంతుమిచ్ఛతాం చ ఉపద్రవమాజ్ఞాయ. 39

వారు (ఋషులు) రాజు చనిపోయిన పిమ్మట లోకములో ధనమును దొంగతనము చేస్తున్నవారిని మరియు ఆ దొంగలు ఒకరినొకరు చంపుకొనుటను చూచిరి. 39

శ్లో॥ చోరప్రాయం జనపదం హీనసత్త్వమరాజకమ్ ।
లోకాన్నావారయన్ శక్తా అపి తద్దోష దర్శినః ॥ 40

టీ:- చోరప్రాయమితి. తథా చోరప్రాయమరాజకం హీనసత్త్వం చ జనపదమాజ్ఞాయ శక్తా అపి వారణే దోషదర్శినో మునయః లుంపతో లోకాన్నావారయన్నిత్యన్వయః. 40

రాజులేని రాజ్యము దొంగలతో నిండినది. ధైర్యములేని జనులను దోచుకుంటున్న దొంగలను వారించే శక్తి ఉన్నప్పటికీ మునుల వారిని నిలువరించలేదు. 40

శ్లో॥ బ్రాహ్మణస్సమదృక్ఛాంతో దీనానాం సముపేక్షకః ।
స్రవతే బ్రహ్మతస్యాపి భిన్న భాండాత్పయో యథా ॥ 41

టీ:- బ్రాహ్మణఇతి. శక్తానాం క్షత్రియాణామవారణే దోషఇతి కిమువక్తవ్యమ్. సమదృగపి శాంతోఽపి బ్రాహ్మణోఽపి యది దీనానాం సముపేక్షకో భవేత్ తర్హి తస్యాపి బ్రహ్మతపస్స్రవతే గచ్ఛతి. 41

శక్తి కలిగియుండికూడా జనుల దుఃఖమును నివారించకుంటే క్షత్రీయునికే దోషమనగా, అలాకాదు. సర్వత్ర బ్రహ్మను దర్శిస్తూ శాంతుడై, బ్రాహ్మణుడై, అతను ఒకవేళ దీన జనులను ఉపేక్షించినచో, పాలతో నిండిన పాలకుండకు చిల్లిపడినప్పుడు పాలు కారిపోయినట్లుగా ఆ బ్రాహ్మణుడి తపస్సు నశించిపోతుంది. 41

శ్లో॥ నాంగస్య వంశో రాజర్షేరేష సంస్థాతు మర్హతి ।
అమోఘవీర్యాహి నృపా వంశేఽస్మిన్ కేశవాశ్రయాః ॥ 42

శ్లో॥ వినిశ్చిత్యైవ మృషయో విపన్నస్య మహీపతేః ।
మమంథురూరుం తరసా తత్రాసీద్బాహుకోనరః ॥ 43

టీ:- వినిశ్చితేతి. అత ఉపేక్షాదోషపరిహారాయ నాంగస్యేత్యాది వినిశ్చిత్య. మహీపతేరూరుం తరసా మమంథురిత్యన్వయః. సంస్థాతుం నాశం గంతుం. యద్వా-ఋషయ ఏవ లుంపతః లోకాన్ నావారయన్ కథంభూతాః హుంకారైరేవ వేనం నివారయితుం శక్తా అపి, తత్కిమర్థం తన్నివారణే తన్మరణాదిదోషదర్శినఃన చోదా సత చోరోప్రదవేఽపి నోపే క్షాయాం తపోహాని ప్రసంగాత్. న చాన్యం తన్నివారకం రాజా నమకుర్వన్. అంగవంశోచ్ఛేదస్యానర్థత్వాత్. అతో వేనస్యైవ దేహం మమంథురితి యోజ్యం. బాహుకో నామ వామనకః జాతః. 42,43

కావున ఉపేక్షాదోషపరిహారము, రాజర్షి అంగుడి వంశము నాశము పొందడానికి వీలులేదు. కేశవుడిని ఆరాధించిన రాజర్షులు, అమోఘశక్తి సంపన్నులు ఎందరో ఈ వంశమున పుట్టినారు. లేదా ఋషులే దొంగిలించే వారిని నివారించలేదు. ఎట్టి ఋషులు? వేనుడిని హుంకార మాత్రముచేత చంపగలిగిన శక్తి గలవారై గూడా, వీరిని గూడా హుంకారముచేత చంప శక్తి గలవారే కాని వేనుడి మాదిరి వీరంతా చావగూడదని మరి ఔదాసీన్యమా? వీరందరినీ చావనియ్యి అని అంటే కాదు, చంపుట దోషము. చోరులు పెరిగినప్పుడు దీనులు దుఃఖిస్తే వీరి తపస్సుకు హాని. పోని వేరే రాజునెవరినైనా నియుక్తుల చేద్దామా అంటే అంగవంశ ఉచ్ఛేదము జరుగలేదు. ఇంత ఆలోచించి మరణించిన మహారాజు యొక్క తొడను వేగముగ మథనము చేసిరి. (చిలికిరి). అక్కడ పొట్టివాడు ఒకడు పుట్టెను. (42-43)

శ్లో॥ కాక కృష్ణోతి హ్రస్వాంగో హ్రస్వబాహుర్మహాహనుః ।
హ్రస్వపాన్నిమ్న నాసాగ్రో రక్తాక్షస్తామ్ర మూర్ధజః ॥ 44

అతడు కాకివలె నల్లగా, మిక్కిలి పొట్టి శరీరము, పొట్టి చేతులు, కపోలము పెద్దగా, పొట్టి కాళ్లు, చప్పిడి ముక్కుకొన, ఎఱ్ఱని కన్నులు, రాగిజుట్టు గలవాడుగా ఉన్నాడు. 44

శ్లో॥ తం తు తేవనతం దీనం కింకరోమీతి వాదినమ్ ।
నిషీదేత్య బ్రువంస్తాత ననిషాదస్తతోఽభవత్ ॥ 45

అతడు తలదించుకొని దీనముగా నాయనా! నేనేమి చేయాలి? అని అడుగగా కూర్చొనుము అని పలికిరి. అందువలన అతడు నిషాదుడయ్యెను. 45

టీ:- తమేవాహ-కాకేతి. కాక ఇవ కృష్ణః మహత్యౌ హనూ కపోల ప్రాంతౌ యస్య. హ్రస్వౌ పాదౌ యస్య. (44-45)

శ్లో॥ తస్య వంశ్యాస్తునైషాదా గిరి కాననోగోచరాః ।
యేనాహరజ్జాయమానో వేనకల్మషముల్బణమ్ ॥ 46

అతను పుట్టుతూనే వేనశరీర సంబంధమైన భయంకరమైన పాపమును భరించువాడాయెను. అతడి వంశస్తులు నిషాదులని పేరు పొందినారు. వారు గుట్టలు, పర్వతాలు, అడవులే ఆశ్రయముగా గలవారు. 46

టీ:- తస్యేతి. గిరేః కాననం గోచరః ఆశ్రయః. న తు పురాది ప్రవేశో యేషాం తే. తత్ర హేతుః యేన కారణేన అసావహరత్. తతస్తస్య వంశ్యాః తథాభూతాః. 46

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే, చతుర్దశోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు పధ్నాల్గవ అధ్యాయము సమాప్తము.**

## పంచదశోఽధ్యాయః

శ్లో॥ తతః పంచదశే విప్రైర్మథనాద్వేనబాహుతః ।
జాతస్య తు పృథోరుక్తమభిషేకార్హణాదికమ్ ॥

శ్లో॥ అథ తస్య పునర్విప్రైరపుత్రస్య మహీపతేః ।
బాహుభ్యాం మథ్యమానాభ్యాం మిథునం సమపద్యత ॥ 1

శ్లో॥ తద్దృష్ట్వా మిథునం జాతమృషయో బ్రహ్మవాదినః ।
ఊచుః పరమసంతుష్టా విదిత్వా భగవత్కళామ్ ॥ 2

ఋషయ ఊచుః

శ్లో॥ ఏషవిష్ణోర్భగవతః కళా భువనపాలినీ ।
ఇయం చ లక్ష్మ్యాస్సంభూతిః పురుషస్యానపాయినీ ॥ 3

టీ:- ఊచురిత్యత్ర కిమూచురిత్యత ఆహ-చతుర్భిః. ఏష ఇతి. లక్ష్మ్యాస్సంభూతిః కళా. (1-3)

శ్లో॥ అయం తు ప్రథమో రాజ్ఞాం పుమాన్ప్రథయతా యశః ।
పృథుర్నామ మహారాజో భవిష్యతి పృథుశ్రవాః ॥ 4

టీ:- అయమితి. అత్ర యః పుమాన్ స తు మహారాజో భవిష్యతి. 4

## 15వ అధ్యాయము

ఈ పదిహేనవ అధ్యాయమున వేనుడి బాహువు చిలకడం వలన పుట్టిన పృథు అభిషేకము మొదలగునవి చెప్పబడినవి.

తరువాత తిరిగి బ్రాహ్మణులచే సంతానములేని మహారాజు (వేనుడు) బాహువులను మథించగా వాటినుండి జంట పుట్టెను. 1

ఆ పుట్టిన జంటనుచూచి బ్రహ్మవాదులైన (వేదవాదులైన) ఋషులు చాలా సంతోషపడి భగవదంశనేయని తెలుసుకొని ఇట్లనిరి. 2

ఋషులు పలికిరి.

ఇతడు భువనములను పాలించే భగవంతుడైన విష్ణువు అంశ. ఈమెగూడ శ్రీహరిని విడిచిపెట్టని లక్ష్మీదేవి (అనపాయిని) అంశ. 3

ఈ ఇద్దరిలో పురుషుడు రాజులలో మొదటివాడు కాగలడు. పృథుమహారాజను పేరుతో అతని కీర్తిని విస్తరించగలదు. 4

శ్లో॥ ఇయం చ దేవీ సుదతీ గుణ భూషణ భూషణా ।
అర్చిర్నామ వరారోహా పృథమేవావరుంధతే ॥ 5

టీ:- ఇయమితి. సుదతీ శోభనదంతా గుణానాం భూషణానాం చ భూషణరూపా అవరుంధతే భర్తృత్వేన భజంతీ భవిష్యతి. 5

ఈమెనేమో మంచి దంతములు గలది, సద్గుణములకే అలంకారమైనదగు ఈ సుందరి పృథువునే భర్తగా భజిస్తూ, 'అర్చి' అను పేరు గలది కాగలదు. 5

శ్లో॥ ఏష సాక్షాద్ధరేరంశో జాతో లోకరిరక్షయా ।
ఇయం చ తత్పరా హి శ్రీరనుజజ్ఞేఽనపాయినీ ॥ 6

టీ:- ఏష ఇతి. అత్ర హేతుః లోకస్య రిరక్షయా రక్షణేచ్ఛయా. 6

సాక్షాత్తు శ్రీహరి అంశావతారమైన ఈతడు లోకములను కాపాడవలెనని పుట్టినాడు. ఈమె విష్ణువుయందే పరాయణము గలిగి, విడిచిపెట్టనిదై, ఆయనను అనుసరించి మహాలక్ష్మి అంశావతారమై జన్మించెను. 6

**మైత్రేయ ఉవాచ.**

శ్లో॥ ప్రశంసంతి స్మతం విప్రా గంధర్వ ప్రవరా జగుః ।
ముముచుస్సుమనోధారాస్సిద్ధా నృత్యంతి స్వస్త్రియః ॥ 7

**మైత్రేయుడు పలికెను.**

ఆ పృథువును బ్రాహ్మణులు ప్రశంసించిరి. అప్పుడు గంధర్వ శ్రేష్ఠులు గానము చేసిరి. సిద్ధులు, దేవతలు పుష్ప వర్షమును కురిపించిరి. అప్సరసలు నృత్యము చేసిరి. 7

శ్లో॥ శంఖతూర్య మృదంగాద్యా నేదుర్దుందుభయో దివి ।
తత్ర సర్వ ఉపాజగ్ముర్దేవర్షి పితృణాం గణాః ॥ 8

టీ:- ప్రశంసంతీతి. స్వస్త్రియః అప్సరసః నృత్యంతి స్మ. (7-8)

శంఖములు, తూర్యములు, మృదంగములు, దుందుభులు (ఢక్కావంటిది) స్వర్గమున మ్రోగినవి. అక్కడక్కడ దేవతలు, ఋషులు, పితరులు గుంపులుగా విచ్చేసి నిల్చిరి. 8

శ్లో॥ బ్రహ్మ జగద్గురుర్దేవ ఉపసృత్య సురేశ్వరైః ।
వైన్యస్యదక్షిణే హస్తే దృష్ట్వాచిహ్నం గదాభృతః ॥ 9

టీ:- బ్రహ్మేతి. దేవైస్సహ ఉపసృత్య ఆగత్య వైన్యస్య పృథోః చిహ్నం రేఖాత్మకం చక్రం. 9

సురేశ్వర సహితముగా దేవతలతో జగద్గురువు బ్రహ్మదేవుడు అక్కడకు విచ్చేసి పృథువు కుడి హస్తమున గదాధారియొక్క చక్రాకారమున గల రేఖలను చూచెను. 9

శ్లో॥ పాదాయోర రవిందం చ వైన్యం మేనే హరేః కళామ్ ।
యస్యాప్రతిహతం చక్రమంశస్సపరమేష్ఠినః ॥ 10

టీ:- పాదయోరితి. అప్రతిహతంరేఖాంతరై రభిన్నం చక్రం యస్య చిహ్నం స పరమేశ్వరస్యాంశః. 10

పాదముయందు పద్మమును రేఖాంతరములచే వేరుకాని చక్రము మొదలగు చిహ్నములు గలవు, కనుక అతడు పరమేశ్వరుని అంశయే అని వారు తలచిరి. 10

శ్లో॥ తస్యాభిషేక ఆరబ్ధే బ్రాహ్మణైర్బ్రహ్మవాదిభిః ।
అభిషేచనికాన్యస్మా ఆజహ్రుస్సర్వతో జనాః ॥ 11

అన్ని దిక్కుల నుండి జనులు అభిషేకసాధనములను తీసుకొని వచ్చిరి. వేదవాదులైన బ్రాహ్మణులు ఇతడికి అభిషేకము ప్రారంభించిరి. (11)

శ్లో॥ సరిత్సముద్రా గిరియో నగా గావః ఖగా మృగాః ।
ద్యౌః క్షితిస్సర్వభూతాని సమజహ్రురూపాయనమ్ ॥ 12

నదులు, సముద్రములు, పర్వతములు, నాగములు, ఆవులు, పక్షులు, మృగములు, ద్యులోకము, భూమి మొదలగు సర్వభూతములు బహుమతులను తీసుకొని వచ్చిరి. 12

శ్లో॥ సోఽభిషిక్తో మహారాజస్సువాసాస్సాధ్వలంకృతః ।
పత్న్యార్చిషాలంకృతయా విరేజేగ్నిరివాపరః ॥ 13

అలంకరింపబడిన ధర్మపత్ని అర్చి సహితుడై మంచి వస్త్రములచే చక్కగా అలంకరింపబడిన పృథు మహారాజు అభిషిక్తుడై రెండవ అగ్నివలె వెలిగినాడు. 13

టీ:- తస్యేతి. అభిషేచనికాని అభిషేకసాధనాని. (11-13)

శ్లో॥ తస్మై జహార ధనదో హైమం వీరవరాసనమ్ ।
వరుణస్సలిల స్రావమాతపత్రం శశిప్రభమ్ ॥ 14

ఓ విదురా! అతడికి కుబేరుడు శ్రేష్ఠమైన బంగారు సింహాసనమును; వరుణుడు నీటి ధారలుగల, చంద్రుడివలె ప్రకాశిస్తున్న ఛత్రమును ఇచ్చిరి. 14

టీ:- తస్మా ఇతి. హే వీర విదుర వరమాసనం. సలిలస్య స్రావో యస్మాత్తత్. 14

శ్లో॥ వాయుశ్చ వాలవ్యజనే ధర్మః కీర్తిమయీం స్రజమ్ ।
ఇంద్రః కిరీటముత్కృష్టం దండం సంయమనం యమః ॥15

వాయువు రెండు వింజామరలను; ధర్మము కీర్తిమంతమైన దండను; ఇంద్రుడు గొప్పనైన కిరీటమును; యముడు శత్రువులను వశపరచుకొనే దండమును బహుకరించిరి.. 15

టీ:- వాయురితి. ద్వే వాలవ్యజనే. 15

శ్లో॥ బ్రహ్మా బ్రహ్మమయం వర్మ భారతీహారముత్తమమ్ ।
హరిస్సుదర్శనం చక్రం తత్పత్న్యవ్యాహతాం శ్రియమ్ ॥ 16

బ్రహ్మదేవుడు వేదమయమైన కవచమును, సరస్వతి మంచి హారమును, శ్రీహరి సుదర్శన చక్రమును, మహాలక్ష్మీ దేవి తరిగిపోని సంపదను ఒసంగిరి. 16

టీ:- బ్రహ్మేతి. బ్రహ్మమయం వేదమయం వర్మ కవచం తత్పత్నీ శ్రీః శ్రియం సంపదం. 16

శ్లో॥ దశ చంద్రమసిం రుద్రశ్శతచంద్రం తథాంబికా ।
సోమోఽమృతమయానశ్వాంస్త్వష్టారూపాశ్రయం రథమ్ ॥ 17

టీ:- దశేతి. దశ చంద్రాకారాణి బింబాని కోశే యస్య తమసిం ఖడ్గం శతచంద్రం చర్మరూపాశ్రయమతిసుందరం. 17

రుద్రుడు పది చంద్రబింబములు గల కోశముతోగల మంచి ఖడ్గమును, నూరు చంద్రబింబముల రూపము గల డాలును; చంద్రుడు మరణములేని మంచి గుఱ్ఱములను, త్వష్ట సుందరమైన బంగారు రథమును ప్రసాదించిరి. 17

శ్లో॥ అగ్ని రాజగవం చాపం సూర్యో రశ్మిమయానిషూన్ ।
భూః పాదుకే యోగమయ్యౌద్యౌః పుష్పబలిమన్వహమ్ ॥ 18

టీ:- అగ్నిరితి. అజస్య గోశ్చ శృంగాభ్యాం నిర్మితం చాపం యోగమయ్యౌ పాదస్పర్శ మాత్రేణ అభీష్టదేశప్రాపకే. 18

అగ్ని దేవుడు మేక మరియు గోవుల కొమ్ములచే నిర్మితమైన చాపమును, సూర్యుడు కాంతి మయములు (కిరణములు) అయిన బాణములను, భూదేవి పాదస్పర్శచేతనే ఎక్కడకు వెళ్లాలంటే అక్కడకి చేర్చే పాదుకలును, స్వర్గాధిష్ఠాన దేవత (వాడిపోని నిత్యమైన) పుష్పమాలను ఇచ్చిరి. 18

శ్లో॥ నాట్యం సుగీతావాదిత్ర మంతర్ధానం చ ఖేచరాః ।
ఋషయశ్చాశిషస్సత్యాస్సముద్రశ్శంఖ మాత్మజమ్ ॥ 19

టీ:- నాట్యమితి. నాట్యాది కౌశలం ఖేచరాః ఆత్మజం స్వప్రభవం. 19

ఖేచరులు నాట్యాదులయందు కౌశల్యమును, అంతార్ధానము చెందే శక్తిని; సముద్రుడు తనలో పుట్టిన శంఖమును; ఋషులు సత్యములు ఫలించే ఆశీస్సులను ప్రసాదించిరి. 19

శ్లో॥ సింధవః పరత్వా నద్యో రథవీధీర్మహాత్మనః ।
సూతోऽథ మాగధో వందీ తం స్తోతుముపతస్థిరే ॥ 20

టీ:- సింధవ ఇతి. తం స్తోతుముపస్థితాః. 20

సముద్రములు, పర్వతములు, నదులు, రథమార్గములను, మహాత్ముడైన పృథువునకు బహూకరించినవి. సూతుడు, మాగధుడు, వంది స్తోత్రము చేయుటకు ఉపక్రమించిరి. 20

శ్లో॥ స్తావకాంస్తానభిప్రేత్య పృథుర్వైన్యః ప్రతాపవాన్ ।
మేఘ నిర్హ్రాదయా వాచా ప్రహసన్నిదమబ్రవీత్ ॥ 21

టీ:- స్తావకానితి. స్తావకాన్ స్తోతుముద్యతాన్ అభిప్రేత్యజ్ఞాత్వా. 21

ప్రతాపవంతుడైన వేనపుత్రుడు పృథు చక్రవర్తి వంద్యాదులు స్తోత్రము చేయడానికి సిద్ధమవుతున్నారని తెలుసుకొని చిన్నగా నవ్వుతూ మేఘ గంభీరమైన వాక్కుచే ఇట్లనెను. 21

**పృథురువాచ**

శ్లో॥ భో సూత హే మాగధ సౌమ్యవందిన్
లోకేऽధునా స్పష్టగుణస్య మేస్యాత్ ।
కిమాశ్రయో యః స్తవ ఏష యోజ్యతాం
మామయ్యభూవన్వితథా గిరోవః ॥ 22

టీ:- భో ఇతి. లోకే స్పష్టగుణస్య సతో మే స్తుతిస్స్యాత్. అధునా కిమాశ్రయో మే స్తవో యోజ్యతాం అతో వః గిరః అధునామయి వితథాః వ్యర్థాః మాభూవన్. యద్వా లోకే అధూనా అస్పష్టగుణస్య మే కిమాశ్రయః స్తవస్స్యాత్. అత ఏష క్రియమాణః స్తవః. మే మదస్యస్య యోజ్యతాం నతు మయి వితథాభిధానాభిపత్తేరిత్యర్థః. 22

**పృథువు పలికెను.**

ఓ సూతా! ఓ మగధా! సౌమ్యుడైన వందీ లోకమున నా గుణములు స్పష్టమైన పిమ్మట స్తుతించిన సరియగును, కాని ఇప్పుడు ఇంకా నా గుణములు ఏమీ స్పష్టము కాలేదు. ఇప్పుడు ఈ స్తోత్రమును ఎక్కడ సమన్వయము చెయ్యవలె. అందుకొరకు మీరు చేసే స్తుతి నా యందు అబద్ధములు కాకుండుగాక. లేదా లోకమున నా గుణములు స్పష్టమైతే ఏ స్పష్టమైన గుణమును గూర్చి ఈ స్తోత్రము చేయబడుచున్నది? అందుకొరకు మీరు చేస్తున్న స్తుతి వేరొక గుణవంతుడికి వినియోగించండి. నాకు వ్యర్థమైన పేరు రాగూడదు. 22

శ్లో॥ తస్మాత్పరోక్షేఽస్మదుపష్టుతాన్యలం
కరిష్యథ స్తోత్రమపీచ్యవాచః ।
సత్యుత్తమశ్లోక గుణానువాదే
జుగుప్సితం న స్తవయంతి సభ్యాః ॥ 23

టీ:- తస్మాదితి. తస్మాత్పరోక్షే కాలాంతరే స్పష్టేషు గుణేషు సత్సు అస్మాకముపష్టుతాని ప్రశస్తాని యశాంసి ప్రతిస్తోత్రం అలమత్యర్థం కరిష్యథ హే అపీచ్యవాచః మధురగిరః ననుసభ్యైః ప్రేరితా వయం త్వామేవ స్తుమ ఇతి చేత్తత్రాహ. ఉత్తమశ్లోకస్య గుణానువాదే కార్యేసతి జుగుప్సితం అర్వాచీనం న స్తావయంతి. 23

ఓ మధురవాక్కులుగల వంద్యాదులారా! కాలాంతరమున నా గుణములు స్పష్టమైన పిమ్మట నా కీర్తిని అప్పుడు స్తోత్రము చేయండి. అలాకాదని సభ్యుల ప్రేరణచే మిమ్ము మేము స్తుతిస్తామంటే ఉత్తమ శ్లోకుడైన భగవంతుని గుణకీర్తనముండగా నూతనముగా వచ్చిన జుగిప్సితముడనైన నన్ను స్తుతించవద్దు. 23

శ్లో॥ మహద్గుణానాత్మని కర్తుమీశః
కస్తావకై స్తావయతే సతోఽపి ।
తేఽస్యాభవిష్యన్నితి విప్రలబ్ధో
జనాపహాసం కురుమతిర్నవేద ॥ 24

టీ:- నను సంభావితైరేవ గుణైరాత్మానం జనః స్తావయతీతి చేత్తత్రాహ - మహదితి. మహతాం గుణానాత్మని సంస్తావయితుం శక్తోఽపి అసతో గుణాన్ సంభావనామాత్రేణ కః స్తావయతే. యద్వా ఆదావేవ సతోఽపి కః స్తావయతే. స్వత ఏవ ప్రఖ్యాతిసిద్ధేః అన్యస్తు మిథ్యాగుణస్తు

తనలో ఉన్న గుణములనే స్తుతింపచేసుకుంటాడు అని అంటే మహనీయుల గుణములు తాను పొందదానికి శక్తుడైగూడా ఇప్పుడు లేని గుణములను ఊహించుకొని ఎవడు స్తుతింపబడుతాడు? లేదా మొదలే ఉన్నవి విశేషములంటే స్వతహాగానే ప్రఖ్యాతులుగా వాటిని స్తుతించే అవసరమే లేదు. లేనివాడైతే లేని గుణములను స్తుతించి శ్లాఘించిన వాడు మందుడు (తెలివిలేని వాడు). ఒకవేళ ఇతడు శాస్త్రాభ్యాసము చేస్తే విద్యాది గుణములు అబ్బేవి అని స్తోత్ర కాలమున వివిధ విద్యాభ్యాసాది క్రియలు లేనిచో నిందింపబడినవాడై అపహాస్యము పాలుకాడా? 24

శ్లాఘీ మంద ఇత్యాహ–తఇతి. యద్యయం శాస్త్రాభ్యాసాధికమకరిష్యత్. తర్హస్య తే విద్యాదయో గుణా అభవిష్యన్నితి క్రియాతిపత్త్యా విప్రలబ్ధః జనానామవహాసం న వేద. 24

శ్లో॥ ప్రభవో హ్యాత్మనః ఖ్యాతిం జుగుప్సంత్యతి విశ్రుతాః ।
హ్రీమంతః పరమోదారాః పౌరుషం వా విగర్హితం ॥ 25

టీ:- ప్రభవ ఇతి. కించ.ప్రభవోఽపి విశ్రుతా అపి హ్రీమంతః జుగు ప్సంతి పౌరుషం వేతి దృష్టాంతః.యథా అతిస్తుతౌ క్రియామాణాయాం విగర్హితం బ్రాహ్మణవధాది పౌరుషం నిందంతి.తథా ఉచితామపి స్తుతిం న సహంత ఇత్యర్థః. 25

వినయము గలవారు విశాల హృదయము గలవారు, ప్రఖ్యాతి గాంచినవారు సమర్థులే అయినను తన స్తుతిని, నిందించబడిన పరాక్రమము వలె ఏవగింతురు కదా! (ఏ విధముగానైతే) అతిగా స్తుతించినపుడు బ్రాహ్మణవధాదులను గొప్పతనముగా చెప్పుకుంటే జనము నిందిస్తారు అట్లే ఆ పౌరుషము నిజమైనప్పటికి జనులు సహించరు. 25

శ్లో॥ వయం త్వవిదితా లోకేసూతాద్యాపి వరీ మభిః ।
కర్మభిః కథమాత్మానం గోపయిష్యామబాలవత్ ॥ 26

టీ:- వయమితి. వరీమభిరితి దీర్ఘ ఆర్షః. భవితృప్రధానశ్చాయం నిర్దేశః. వరిష్ఠైః కర్మభిరవిదితా ఇత్యర్థః. 26

ఓ సూతా! ఇప్పటివరకైతే ఎట్టి గొప్పపని చేసి లోకమునకు తెలుపలేదు. కనుక నా విషయము తెలియకుండా నన్ను ఏ విధముగా స్తుతిస్తారు. నేను ఏ విధముగా స్తుతి చేయించుకోగలను? 26

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే, పంచదశోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు పదిహేనవ అధ్యాయము సమాప్తము.**

## షోడశోఽధ్యాయః

శ్లో॥ షోడశే సర్వలోకేశైస్సత్కృతం భార్యయా యుతమ్ ।
మునిప్రయుక్తాస్సూతాద్యాః స్తువంతి స్మేతి వర్ణ్యతే ॥

## 16వ అధ్యాయము

ఈ పదహారవ అధ్యాయమున భార్యా సహితుడై, సర్వ లోకేశలచే సత్కృుడైన పృథువును మునులచే నియుక్తులైన వందిమాగధులు స్తుతించిరి.

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ ఇతి బ్రువాణం నృపతిం గాయకా మునిచోదితాః ।
తుష్టువుస్తుష్టమనసస్తద్వాగమృతసేవయా ॥ 1

టీ:- ఇతీతి. గాయకాస్సూతాదయః. 1

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

ఈ విధముగా పలుకుచున్న రాజును ఆయన వాగమృతమును సేవించి సంతుష్ట మనస్కులైన సూతాదులు మునులచే ప్రేరితులై స్తుతించిరి. 1

శ్లో॥ నాలం వయం తే మహిమానువర్ణనే
యో దేవవర్యోఽవత తారమాయయా ।
వేనాంగ జాతస్య చ పౌరుషాణి తే
వాచస్పతీనామపి బభ్రముర్ధియః ॥ 2

టీ:- నేతి. నాలం సమర్థాః యో భవాన్ అవతారేష్వప్యస్యాధిక్య మాహుః వేనస్యాంగాజ్జాతస్య తే పౌరుషాణి ప్రతి అవితర్క్యతయా బ్రహ్మాదీనామపి ధియో బభ్రముః కుతః పునర్వయం తద్వర్ణనే సమర్థాః భవేమ. 2

నీ మహిమను వర్ణించుటయందు మేము సమర్థులముగాము! నీవు దేవతలలో శ్రేష్ఠుడవు. నీ మాయాశక్తిచే అవతారమును పొందినావు. అవతారాలలోకెల్లా ఈ అవతారమునకు ఆధిక్యమును చెప్పిరి. వేనుడి అంగము నుండి పుట్టిన నీ పౌరుషమును గూర్చి ఏ మాత్రము వితర్కించుటకు వీలులేకుండుటచే బ్రహ్మాదులకు గూడా బుద్ధులు భ్రమించినవి వారి స్థితియే అట్లుండగా మేమెంతవారము? నిన్ను వర్ణించుటయందు సమర్థులముగాము. 2

శ్లో॥ అథాప్యుదార శ్రవసః పృథోర్హ రేః
కలావతారస్య కథామృతా దృతాః ।
యథోపదేశం మునిభిః ప్రచోదితాః
శ్లాఘ్యాని కర్మాణి వయం వితన్మ హే ॥ 3

ఉన్నది ఉన్నట్లుగా వర్ణించుటకు అశక్తులమైనప్పటికీ గొప్ప కీర్తి కలిగిన శ్రీహరి అంశావతారమైన పృథు చక్రవర్తి యొక్క కథామృతము ఆధారము కలిగినవారమై మునులచే చేయబడిన ఉపదేశము, యోగబలముచే మా హృదయములయందు ప్రకాశించగా దానిని అతిక్రమించకుండా కొనియాడదగిన కర్మలను విస్తారముగా వర్ణించెదము. 3

శ్లో॥ ఏష ధర్మభృతాం శ్రేష్ఠో లోకం ధర్మేఽనువర్తయన్ ।
గోప్తా చ ధర్మసేతూనాం శాస్తా తత్పరి పంథినామ్ ॥ 4

ఈ పృథువు ధర్మాచరణ చేయువారిలో శ్రేష్ఠుడును, జనులను ధర్మముయందు ప్రవర్తింప చేయుచున్నవాడై ధర్మమును వారధిగా చేసుకొన్న వారికి రక్షకుడును, ధర్మమునకు విఘాతము కలిగించు వారలకు శాసించువాడునై యున్నాడు. 4

టీ:- అథాపీతి. ఆథాపియథావద్వర్ణయితుమశక్తా అపి కథామృతే సాదరాః మునిభిరుపదేశం యథా భవతి తథా యోగబలేన హృది ప్రకాశనం తదుపదేశమనుతిక్రమ్య వితన్మహే విస్తారయామః. (3-4)

శ్లో॥ ఏష వై లోకపాలానాం బిభర్త్యేక స్తనౌతనూః ।
కాలే కాలేయథాభాగం లోకయోరుభయోర్హితమ్ ॥ 5

ఈ చక్రవర్తి తన దేహమునందు లోకపాలురమూర్తులను ఆయా సమయములయందు ధరించుచున్నాడు. యోగ్యతను అతిక్రమించ కుండా పాలించుచు, పోషించుచు, జనులను రంజింపచేయుచు, మంచి కార్యములచేత, యజ్ఞాది కర్మలచేత స్వర్గమునకు హితమును, వర్షాదులచే భూలోకమునకు హితము చేకూర్చుచున్నాడు. 5

టీ:- ఏష ఇతి. తనౌ స్వదేహే లోకపాలానాం తనూర్మూర్తీః కాలేకాలే బిభర్తి. యథాభాగం పాలన పోషణానురంజనాది కార్యానుసారేణ యజ్ఞా దిప్రవర్తనేన స్వర్గస్య హితం వృష్ట్యాదినా చ భూలోకస్య హితం యథా భవతి తథా. 5

శ్లో॥ వసుకాల ఉపాదత్తే కాలే చాయం విముంచతి ।
సమస్సర్వేషు భూతేషు ప్రావర్షత్సూర్యవద్విభుః ॥ 6

టీ:- వస్వితి. సూర్యాదితనుధారణమేవాహాష్టభిః. వసు ధనం కరాదాన కాలే ఉపాదత్తే దుర్భిక్షాదికాలే విముంచతి చ. అష్టౌ మాసాన్ సూర్యోయథా వసు జలమాదత్తే. విముంచతి వర్షాసు తద్వత్. 6

శ్లో॥ తితిక్షత్యక్రమం వైన్య ఉపర్యాక్రమతామపి ।
భూతానాం కరుణశ్శశ్వదార్తానాం క్షితివృత్తిమాన్ ॥ 7

టీ:- తితిక్షతీతి. మస్తకే పాదేనాక్రమతామపి ఆర్తానాం భూతానామతి క్రమం సహిష్యతేక్షితేర్వృత్తిః. సర్వసహనం సావృత్తిర్యస్యాస్తి సతథా. 7

శ్లో॥ దేవేవర్షత్యసౌ దేవో నరదేవ వపుర్హరిః ।
కృఛ్రప్రాణాః ప్రజా హ్యేష రక్షిష్యత్యంజసేంద్రవత్ ॥ 8

టీ:- దేవ ఇతి. దేవే అవర్షతి సతి ఏష కృఛ్రం గతాః ప్రాణాః యాసాం తాః ప్రజాః స్వయం వృష్టిం కృత్వా రక్షిష్యతి తత్ర హేతుః. అసౌ నరదేవవపుర్హరిరితి. 8

సూర్యాది దేహములను పొందడము గూర్చి ఎనిమిది శ్లోకములలో చెప్పుచున్నాడు. సర్వప్రాణులయందు సమదృష్టి కలిగి కప్పము తీసుకొనే సమయముననుసరించి దానిని పరిగ్రహించును. ఏ విధముగానైతే సూర్యుడు ఎనిమిది మాసములు నీటిని గ్రహించి వర్షాకాలములో విడుచునో ఆ విధముగానే దుర్భిక్షం ఏర్పడినపుడు ఈ ద్రవ్యాదులను వినియోగించేవాడు 6

దయాళువైన పృథువు తలయందు పాదమును మోపినప్పటికీ (ఎంత భారమైననూ) దీనుల, సర్వభూతముల అదుపు తప్పుటను (బాధ్యతలను) సహించగలడు. దీనుల యందు క్షితివృత్తి గలవాడు అనగా భూమివలె (భూమి వృత్తి సర్వమును సహించుట) సర్వమును సహించుటనే వృత్తిగా కలవాడు. 7

ఇంద్రుడు వర్షించనపుడు, స్వయముగా తానే (వెంటనే) వర్షింపజేసి (అనావృష్టిలో) సంకటములో పడిన ప్రజలను రక్షించ గలడు. కారణమేమనగా అతడు రాజు రూపమున గల శ్రీహరియే కదా! 8

శ్లో॥ ఆప్యాయయత్యసౌ లోకం వదనామృత మూర్తినా ।
సానురాగావ లోకేన విశదస్మిత చారుణా ॥ 9

టీ:- ఆప్యాయయతీతి. వదనమేవ అమృతమూర్తిశ్చంద్రః తేన సానురాగః అవలోకో యస్మిన్ విశదంస్మితం తేన చారుణా. అత్ర క్వచిద్వర్తమాననిర్దేశః వర్తమానసామిప్యే వర్తమానవద్వేతి. భూతనిర్దేశశ్చ ఆశంసాయాం భూతవచ్చేతి ద్రష్టవ్యః. 9

ఈతని స్వచ్ఛమైన, అందమైన చిరునవ్వులు చిందే ముఖమే అమృతమూర్తి అనగా చంద్రుడు. అట్టి చంద్రుడివంటి ముఖము గలిగి, ప్రేమతో కూడిన చూపులచే లోకమును తృప్తి పరచగలడు. ఇక్కడ కొంత వర్తమాన కాలప్రయోగములు చేసియున్నారు. వాటన్నింటిని భవిష్యదర్థమును చెప్పుకొన వలెను. ఎందుకనగా "వర్తమాన నిర్దేశో" వర్తమాన సామీప్యే వర్తమాన వద్వా "వర్తమాన సమీపమున గల ధాతువునకు భవిష్యదర్థమునే చెప్పుకొన వలెను." కొన్ని స్థలముల యందు "ఆశం, సాయాం, భూత వచ్చ" ఆ శపించుట యందు భూతకాల నిర్దేశము చేయబడును. 9

శ్లో॥ అవ్యక్తవర్త్మైష నిగూఢకార్యో
గంభీరమేధా ఉపగుప్తవిత్తః ।
అనంతమాహాత్మ్యగుణైకధామా పృథుః
ప్రచేతా ఇవ సంవృతాత్మా ॥ 10

టీ:- అవ్యక్తేతి. వ్యక్తం అజ్ఞాతం వర్త్మ ప్రవేశనిర్గమయోర్మార్గో యస్య. నిగూఢం నిష్పత్తేః పూర్వమవిజ్ఞాతం కార్యం యస్య. గంభీరా మేధా యస్య. తచ్చ కార్యం గంభీరం కిమర్థమేతత్కృతమితి అన్యైరవిజ్ఞాతాభి ప్రాయం విధత్త ఇత్యర్థః. ఉపగుప్తం సురక్షితం విత్తం యస్య. అనంత

ప్రవేశనిర్గమ (వెళ్ళు) మార్గము ఎవరికి తెలియదు. ఉత్పత్తికి పూర్వం ఎవరికి తెలియని కార్యము గలవాడు. ఆ కార్యము గంభీరము అనగా ఎందుకు ఈ పని చేసినారని వేరువారికి తెలియని అభిప్రాయమును విధించును. సురక్షితమైన విత్తము గలవాడు. అనంతమైన మాహ్మాత్మ్యము కలిగి, సమస్త గుణములకు నిలయముగా గలవాడు సంయమనము గల మూర్తి పృథువు. వరుణుడి వలె నిగూఢమైన ఆలోచన గలవాడు. ఈ లక్షణములు వరుణునకుగూడా అన్వయించుకోవచ్చు. 10

మాహాత్మ్యశ్చాసౌ గుణానామేకం ధామ విష్ణుర్యస్మిన్. సః. అనంతమాహాత్మ్యోపేతా గుణా ఏవ ధామ స్థానం యస్యేతి వా. సంవృతాత్మా సంయత మూర్తిః సముద్ర చరత్వేన వరుణస్యాప్యేతే గుణా ద్రష్టవ్యాః. 10

శ్లో॥ దురాసదో దుర్విషహ ఆపన్నోఽపి విదూరవత్ ।
నైవాభి భవితుం శక్యో వేనారణ్యుత్థితోఽనలః ॥ 11

టీ:- దురాసదా ఇతి దురాసదః శత్రోర్మనసాపి ప్రాప్తుమశక్యః దుర్విషహః శత్రుభిస్సోఢుమశక్యః విదూరవత్ పౌరుషేణాభిభవితుమశక్యః వేన ఏవారణిః తస్మాదుత్థితః. 11

శత్రువునకు మనస్సుచే గూడా ఊహించుటకు శక్యము కానివాడు శత్రువులచే సహించుటకు శక్యము కానివాడు. దగ్గరగా ఉన్నప్పటికి దూరముగా ఉన్నవానివలె పౌరుషముచే తిరస్కరించుటకు శక్యము కానివాడు. వేనును అరణ నుండి పుట్టినఅగ్ని పృథుచక్రవర్తి. (11)

శ్లో॥ అంతర్బహిశ్చ భూతానాం పశ్యన్ కర్మాణి చారణైః ।
ఉదాసీన ఇవాధ్యక్షో వాయురాత్మేవ దేహినామ్ ॥ 12

టీ:- అంతరతి. చారుణైర్గుప్తభృత్యైః పశ్యన్నపి. స్వస్తుతినిందాదిషూదాసీన ఇవ వర్తిష్యతే. యథా దేహినామధ్యక్షః అధికృతః ఆత్మభూతః వాయుస్సూత్రాత్మా తద్వత్. 12

ప్రాణులకు అధ్యక్షుడైన వికారరహితుడైన ఆత్మభూతుడైన సూత్రాత్మ వలె, జనుల లోపల బయట గూఢచారులచేత చూస్తున్నప్పటికి స్తుతి, నిందాదులయందు ఔదాసీన్యము కలిగి ఉంటాడు. 12

శ్లో॥ నాదండ్యం దండయత్యేష సుతమాత్మద్విషామపి ।
దండయత్యాత్మజమపి దండ్యం ధర్మపథే స్థితః ॥ 13

టీ:- నేతి. ఆత్మాద్విషాం సుతమపి. సుతగ్రహణం స్వాత్మజసామ్యార్థం ధర్మపథే యమస్య వృత్తే స్థితః. 13

ఈ పృథు చక్రవర్తి యమధర్మరాజువలె, యముడి వృత్తియందు కూర్చొని ధర్మ నిర్ణయమందు కూర్చున్నప్పుడు శిక్షార్హుడు కానప్పుడు శత్రు పుత్రుడైన శిక్షించేవాడు కాడు. శిక్షార్హుడైనప్పుడు తన కుమారుడైననూ శిక్షించేవాడు అవుతాడు. 13

శ్లో॥ అస్యాప్రతిహతం చక్రం పృథోరామానసాచలాత్ ।
వర్తతే భగవానర్కో యావత్తపతి గోగణైః ॥ 14

టీ:- అస్యేతి. చక్రమాజ్ఞా సేనావా రథస్య వా చక్రం మానసాచల మభి వ్యాప్య ప్రవర్తతే కియత్పర్యంతమిత్యత ఆహ - అర్కో రశ్మిగణైర్యా వత్తపతి తావత్. 14

ఈ పృథు చక్రవర్తి ఎదురులేని చక్రం అనగా ఆజ్ఞ, లేదా సేన లేదా ఈయన రథచక్రం. మానస పర్వతము వరకు ప్రవర్తిస్తుంది. భగవంతుడైన భాస్కరుడు తన కిరణములచేత ఎంత వరకు తపించుచున్నాడో అంతవరకు ప్రవర్తిల్లును. 14

శ్లో॥ రంజయిష్యతి యల్లోకమయమాత్మ విచేష్టితైః ।
అథాముమాహూరాజానం మనోరంజనకైః ప్రజాః ॥ 15

ఇతని పనులచే రంజింపబడుతున్న జనులు ఆ మనోరంజన మూలకముగా ఇతడిని 'రాజని' అంటారు. 15

శ్లో॥ దృఢవ్రతస్సత్యసంధో బ్రహ్మణ్యో వృద్ధసేవకః ।
శరణ్యస్సర్వభూతానాం మానదో దీనవత్సలః ॥ 16

టీ:- రంజయిష్యతీతి. యత్ యస్మాద్రంజయిష్యతి అథ తస్మాత్ మనోరంజనకైర్వేతుభిరముం రాజానమాహుః. మనోరంజనకైరితి చేష్టిత విశేషణం వా. (15-16)

దృఢమైన నిష్ఠగలవాడు, సత్యమునకు కట్టుబడిన వాడు, బ్రాహ్మణ భక్తిగలవాడు, వృద్ధులకు సేవచేసేవాడు, సర్వ భూతములను రక్షించువాడు, దీనులయందు ప్రేమ గలవాడు, మర్యాద నిచ్చువాడు కాగలడు. 16

శ్లో॥ మాతృ భక్తిః పరస్త్రీషు పత్న్యామర్ధమివాత్మనః ।
ప్రజాసు పితృవత్స్నిగ్ధః కింకరో బ్రహ్మవాదినామ్ ॥ 17

టీ:- మాతృభక్తిరితి. మాతరీవ భక్తిర్భజనం యస్య ఆత్మనః దేహస్య అర్ధమివ పత్న్యాం ప్రీతిమాన్. 17

పరస్త్రీలయందు తల్లియందువలె భక్తి కలవాడుగా; పత్నిపట్ల తన శరీర సగ భాగమువలె ప్రేమతో; ప్రజల పట్ల తండ్రివలె ప్రేమ చూపుతూ, బ్రహ్మవేత్తలకు సేవకుడుగా ఉంటాడు. (17)

శ్లో॥ దేహినామాత్మవత్ప్రేష్ఠస్సుహృదాం నందివర్ధనః ।
ముక్తసంగ ప్రసంగోఽయం దండపాణిరసాధుషు ॥ 18

టీ:- దేహినామితి. నందిం సుఖం వర్ధయతీతి నందివర్ధనః ముక్తసంగేషు ప్రకృష్టస్సంగో యస్య. దండపాణిరివేత్యపరాధానుపేక్షణ ముచ్యతే. నాదండ్యమిత్యత్ర తు పక్షపాతాభావ ఉక్తః. 18

ఇతడు ప్రాణులకు ఆత్మవలె చాలా ప్రియమైన వాడు. మిత్రులకు సుఖమును అధికముగా పెంపొందింపచేయువాడు. ప్రపంచాసక్తి విడచిన వారియందు గొప్పనైన ఆసక్తి కలవాడు, దుష్టుల పట్ల యముడే. 18

శ్లో॥ అయం తు సాక్షాద్భగవాంస్త్ర్యధీశః
కూటస్థ ఆత్మా కలయావతీర్ణః ।
యస్మిన్నవిద్యారచితం నిరర్థకం
పశ్యంతి నానాత్వమపి ప్రతీతమ్ ॥ 19

టీ:- అయమితి. అయం సాక్షాద్భగవాన్ షడ్గుణైశ్వర్య సంపన్న ఏవ. అయంత్వితి తు శబ్దేనేహ నిరుపమత్వం దర్శయతి-కోఽసావాత్మాత మాహ. యస్మిన్ ప్రతీతమపి నానాత్వమర్థశూన్యం పశ్యంతి. 19

ఈయన నిరుపముడు. సాక్షాత్ షడ్గుణములతో గూడిన భగవానుడు. గుణ త్రయములకు అధిపతి, నిర్వికారుడు, శక్తియుతుడై అవతరించినవాడు. ఆత్మ స్వరూపుడు, ఆత్మ యనగా నేమి? దేనియందు (అనగా ఆత్మయందు) అర్థశూన్యమై, అవిద్యా కల్పితమై, ప్రతీతి కలుగుచున్నప్పటికీ భేద పదార్థము అర్థశూన్యముగా చూడబడునో అది ఆత్మ 19

శ్లో॥ అయం భువో మండలమోదయాద్రే
ర్గోప్త్రైకవీరో నరదేవనాథః ।
ఆస్థాయ జైత్రం రథమాత్తచాపః
పర్యస్యతే దక్షిణతోయథార్కః ॥ 20

టీ:- అయమితి. ఉదయాద్రేః తత్పర్యంతం గోప్తా గోపయిష్యతి. తదర్థం పర్యస్యతే పర్యటిష్యతి ప్రదక్షిణీకరిష్యతీత్యర్థః. 20

ఈ నరదేవనాథుడు సాటిలేని వీరుడు. ఈ భూమిని ఉదయాద్రి పర్యంతమును రక్షించగలడు. జయమునిచ్చే రథమునెక్కి ఎత్తిన ధనుర్బాణములు గలవాడై సూర్యుడి మాదిరిగా భూమండలము చుట్టూ ప్రదక్షిణము చేయును. 20

శ్లో॥ తస్మై నృపాలాః కిల తత్ర తత్ర
బలిం హరిష్యంతి సలోకపాలాః ।
మన్యంత ఏషాం స్త్రియ ఆదిరాజం
చక్రాయుధం తదశ్య ఉచ్చరంత్యః ॥ 21

టీ:- తస్మా ఇతి. తస్మై తథాప్రదక్షిణం కుర్వతే. మన్యంతే జ్ఞాస్యంతి. తస్య యశః. ఉచ్చరంత్యః ఉదాహరంత్యః కీర్తయంత్యః. 21

ఈ పృథుచక్రవర్తికి లోకపాల సహితులైన రాజులు అక్కడక్కడ కప్పమును సమర్పించగలరు. ఆ రాజపత్నులు ఈయన ప్రదక్షిణము చేయుచుండగా ఆయన (వ్యవసాయవ్యవస్థను ఏర్పరచిన మొదటిరాజు గావున ఆదిరాజు) యశస్సును, కీర్తిస్తూ సాక్షాత్తు చక్రాయుధుడైన శ్రీహరియే అని తెలిసికొందురు. 21

శ్లో॥ అయం మహీం గాం దుదుహేఽధిరాజః
ప్రజాపతిర్వృత్తికరః ప్రజానామ్ ।
యో లీలయాద్రీన్ స్వశరాసకోట్యా
భిందన్ సమాంగామకరోద్యథేంద్రః ॥ 22

టీ:- అయమితి. ఇంద్ర ఇవాద్రీన్ భిందన్. 22

ప్రజలకు ప్రభువైన ఈ రాజరాజు గోరూపిణియైన భూమిని పితికెను. ప్రజలకు జీవికను కల్పించినవాడాయెను. ఇంద్రునివలె పర్వతములను తన ధనుఃకోటిచే భేదించి లీలగా భూమిని సమముగా చేయును. 22

శ్లో॥ విస్ఫూర్జయన్నాజగవం ధనుస్స్వయం
యదాచరత్ క్ష్మామవిషహ్యమాజౌ ।
తదా నిలిల్యుర్దిశిదిశ్యసంతో
లాంగూలముద్యమ్య యథా మృగేంద్రః ॥ 23

టీ:- విస్ఫూర్జయన్నితి. లాంగూల్యముద్యమ్య మృగేంద్రో యథా చరతి. తథా ధనుర్విస్ఫూర్జయన్ యదా క్ష్మామచరత్. 23

తోకనెత్తి ఏ విధముగా సింహరాజు సంచరించుచుండునో అదే విధముగా ధనుస్సును టంకారమును చేయుచు భూమిని సంచరించెను. ఆ సమయమున యుద్ధమునందు దుష్టులు పరి పరి దిక్కులలో దాగుకొనిరి. 23

శ్లో॥ ఏషోఽశ్వమేధాన్ శతనూజహార
సరస్వతీ ప్రాదురభావి యత్ర ।
ఆహార్షీద్యస్య హయం పురందర
శ్శతక్రతుశ్చరమే వర్తమానే ॥ 24

ఎక్కడనైతే సరస్వతీ నది ప్రాదుర్భవించెనో అక్కడ ఈతడు నూరు అశ్వమేధములను చేసెను. నూరు యజ్ఞములు చేసిన ఇంద్రుడు నూరవ యజ్ఞము చేయుచుండగా ఇతని గుఱ్ఱమును దొంగిలించెను. 24

శ్లో॥ ఏషస్స్వపద్మోపవనే సమేత్య
సనత్కుమారం భగవంత మేకమ్ ।
ఆరాధ్యభక్త్యా లభతామలం తత్
జ్ఞానం యతో బ్రహ్మపరం వ్రజంతి ॥ 25

టీ:- ఏష ఇతి. యత్ర సరస్వతీ. ప్రాదురభావి ప్రాదుర్భూతా. కర్మ కర్తరి చిణ్. తత్ర ఆహార్షీత్. (24-25)

ఈతడు తన గృహోపవనమున ఏకాంతముననుండు పూజ్యుడైన సనత్కుమారుడిని కలిసి, భక్తితో ఆరాధించి, శుద్ధమగు జ్ఞానమును అనగా దేనివల్ల పరబ్రహ్మాను తెలుసుకొనగలరో, అట్టి జ్ఞానమును పొందును. 25

శ్లో॥ తత్ర తత్ర గిరిస్తాస్తా ఇతి విశ్రుత విక్రమః ।
శ్రోష్యత్యాత్మాశ్రయా గాథాః పృథుః పృథుపరాక్రమః ॥ 26

టీ:- తత్రేతి. విశ్రుతః విక్రయో యస్య సః. గాథాః ప్రబంధాన్. 26

విశ్రుతమైన పరాక్రమము కలిగి లోకప్రఖ్యాతిగన్న, విక్రమము గల పృథువు అక్కడక్కడ తనకు (పృథువునకు), విష్ణ్వంశకు సంబంధించిన ప్రబంధములను (గాథలను) వినగలడు. 26

శ్లో॥ దిశో విజిత్యా ప్రతిరుద్ధ చక్ర
స్స్వతేజసోత్పాటిత లోకశల్యః ।
సురాసురేంద్రైరనుగీయమాన
మహానుభావో భవితా పతిర్భువః ॥ 27

టీ:- దిశ ఇతి. ఉపగీయమానో మహాననుభావో యస్య సః. 27

అన్ని దిక్కులను జయించి తిరుగులేని శాసనముగలవాడై తన తేజస్సుతో జనుల దుఃఖమును క్షణమున తొలగించగలడు. దేవతలచే, రాక్షసులచే గొప్పగా గానము చేయబడుచున్న మహానుభావుడుగా ఇతడు కాగలడు. 27

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,**
**షోడశోఽ ధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు**
**పదహారవ అధ్యాయము సమాప్తము.**

## సప్తదశోఽధ్యాయః

శ్లో॥ తతస్సప్తదశే లోకే క్షుధః ప్రశమయన్పృథుః ।
గ్రస్తబీజాం మహీం హంతుం యత్తో భీత్యా తయా స్తుతః ॥

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ ఏవం స భగవాన్ వైన్యః ఖ్యాపితో గుణకర్మభిః ।
ఛందయామాస తాన్ కామైః ప్రతిపూజ్యాభినంద్య చ ॥ 1

టీ:- ఏవమితి. ఛందయామాస తోషితవాన్. 1

శ్లో॥ బ్రాహ్మణ ప్రముఖాన్ వర్ణాన్ భృత్యామాత్య పురోధసః ।
పౌరాన్ జానపదాన్ శ్రేణీః ప్రకృతీస్సమపూజయత్ ॥ 2

టీ:- బ్రాహ్మణేతి. భృత్యానమాత్యాన్ పురోధసః. పురోహితాంశ్చ శ్రేణీః తైలికతాంబూలికాదీన్ పౌరవిశేషాన్ ప్రకృతీః నియోగినః. 2

**విదుర ఉవాచ**

శ్లో॥ కస్మాద్దధార గోరూపం ధరణీ బహురూపిణీ ।
యాం దుదోహ పృథుస్తత్రకో వత్సో దోహనం చ కిమ్ ॥ 3

టీ:- కస్మాదితి. దోహనం పాత్రం. 3

## 17వ అధ్యాయము

ఈ పదిహేడవ అధ్యాయమున జనుల ఆకలిని చల్లార్చడానికి పృథుచక్రవర్తి ఆహారమును తనలో దాచుకొన్న భూమిని చంపడానికి వెళ్ళగా భయపడి భూమి స్తుతించడం చెప్పబడినది.

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

ఈ విధముగా భగవాన్ పృథుచక్రవర్తి గుణకర్మలచే స్తుతింపబడి, స్తుతించిన వారిని అభినందించి కోరికలను తీర్చి సత్కరించి సంతోష-పెట్టెను. 1

సేవకులను, మంత్రులను, బ్రాహ్మణ శ్రేష్ఠులను, బ్రాహ్మణులు మొదలుగాగల వర్ణములను, పురోహితులను, పౌరులను, పల్లెజనమును తిలకమును దిద్దేవారిని, తాంబూలములనందించేవారిని, రాజ్యమున ఉద్యోగములయందు నియోగింపబడినవారిని చక్కగా పూజించెను. (సత్కరించెను). 2

**విదురుడు ఈ విధముగా పలికెను.**

బహురూపములుగల భూమాత ఎందువలన గో రూపమును ధరించెను? పృథువు గోవును పితికినప్పుడు, లేగదూడ ఎవరు? పాత్ర ఏది? 3

శ్లో॥ ప్రకృత్యా విషమా దేవీ కృతా తేన సమా కథమ్ ।
తస్యమేధ్యం హయం దేవః కస్య హేతో రపాహరత్ ॥ 4

టీ:- ప్రకృత్యేతి. మేధ్యం యజ్ఞార్హం. 4

స్వభావముచేత ఎగుడు దిగుడుగాగల భూమి ఏ విధముగా సమానము చేయబడినది? పృథువు యజ్ఞార్హమైన గుఱ్ఱమును ఇంద్రుడు ఏ కారణము చేత దొంగిలించినాడు? 4

శ్లో॥ సనత్కుమారాద్భగవతో బ్రహ్మన్ బ్రహ్మవిదుత్తమాత్ ।
లబ్ధ్వా జ్ఞానం సవిజ్ఞానం రాజర్షిః కాం గతిం గతః ॥ 5

టీ:- సనత్కుమారాదితి స విజ్ఞానం అపరోక్షజ్ఞానసహితం. 5

ఓ మహాత్మా! భగవానుడైన బ్రహ్మవేత్తలలో శ్రేష్ఠుడైన సనత్కుమారుడి నుండి అపరోక్షజ్ఞాన సహితమైన బ్రహ్మజ్ఞానమును పొంది పృథువు ఏ స్థితిని పొందినాడు? 5

శ్లో॥ యచ్చాన్యదపి కృష్ణస్య బ్రహ్మన్ భగవతః ప్రభోః ।
శ్రవస్సుశ్రవసః పుణ్యం పూర్వదేహ కథాశ్రయమ్ ॥ 6

టీ:- యచ్చేతి. పూర్వదేహః పృథ్వవతారః తత్కథాశ్రయం శ్రవో యశః సుష్ఠు శోభనం శ్రవో యస్య. 6

ఓ ప్రభూ! మంచి యశస్సు కలిగిన కృష్ణ భగవానుడి అంశయగు పృథు అవతార కథాశ్రయము పవిత్రమయినది. కీర్తికరము మరియు ఇంకా ఇతర విషయములనుగూడా నీవు చెప్పవలసినది. 6

శ్లో॥ భక్తాయ మేఽనురక్తాయ తవ చాధోక్షజస్య చ ।
వక్తుమర్హసి యో దుహ్యద్వైన్యరూపేణ గామిమామ్ ॥ 7

మీకు శ్రీహరికి కూడా భక్తుడను, అనురక్తుడనైన నాకు ఏ కృష్ణ భగవానుడు పృథు అవతారమున ఈ భూమిని పితికెనో దానిని చెప్పుటకు సమర్థులు మీరే. 7

**శ్రీసూత ఉవాచ**

శ్లో॥ చోదితో విదురేణైవం వాసుదేవకథాం ప్రతి ।
ప్రశస్య తం ప్రీతమనా మైత్రేయః ప్రత్యభాషత ॥ 8

టీ:- భక్తాయేతి. అదుహ్యత్ దుగ్ధవాన్. (7-8)

**సూతుడు ఈ విధముగా పలికెను.**

ఈ విధముగా విదురుడిచే వాసుదేవుడి కథను గూర్చి ప్రేరితుడై మైత్రేయుడు సంతుష్టాంతరంగుడై విదురుడిని మెచ్చుకొని ఈ విధముగా చెప్పెను. 8

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ యదాభిషిక్తః పృథురంగ విప్రై
రామంత్రితో జనతాయాశ్చ పాలః ।
ప్రజానిరన్నే క్షితిపృష్ఠ ఏత్య
క్షుత్క్షామదేహాః పతిమన్వవోచన్ ॥ 9

టీ:- యథేతి. జనతాయాస్త్వం పాలః పాలయితేత్యామంత్రితః. నియుక్తః తదా నిరన్నే క్షితితలే సతి క్షుధాక్షామాః క్షీణాః దేహాః యాసాం తాః ప్రజా ఏత్య పతిం పృథుమబ్రువన్. 9

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

ఓ విదురా! ఎప్పుడైతే బ్రాహ్మణులచేత ప్రజలకు నీవు పాలకుడవని నియుక్తుడై పృథువు అభిషేకింపబడినాడో అప్పుడు భూమి మీద అన్నము లేకపోవడం వలన, ఆకలి వలన క్షీణించిన దేహము కలిగిన ప్రజలు వచ్చి రాజును ఈ విధముగా అడిగిరి. 9

శ్లో॥ వయం రాజఞ్జాఠరేణాభితప్తా
యథాగ్నినా కోటరస్థేన వృక్షాః ।
త్వామద్య యాతాశ్శరణం శరణ్యం
యస్సాధితో వృత్తికరః పతిర్నః ॥ 10

ఓ రాజా! ఎండిన చెట్ల తొఱ్ఱల యందు గల నిప్పుచే, చెట్లు దహించబడినట్లుగా, మేము జఠరాగ్నిచే తపించిపోవుచున్నాము. మహర్షులచే మథనము ద్వారా సంపాదింపబడిన నీవు మాకు జీవికను కల్పించునట్టి ప్రభువువు, రక్షకుడవు. అట్టి నిన్ను మేము ఈ రోజు శరణు పొందుచున్నాము. (రక్షించమని ప్రార్థించుచున్నాము) 10

టీ:- వయమితి. జాఠరేణ అగ్నినా అభితప్తాః యస్సాధితః విప్రైః మథనేన సంపాదితః తం త్వాం శరణం యాతాః. 10

శ్లో॥ తన్నో భవానీహతురాతవేऽన్నం
క్షుధార్దితానాం నరదేవదేవ ।
యావన్న నంక్ష్యామహ ఉర్జితోర్జా
వార్తాపతి స్త్వం కిల లోకపాలః ॥ 11

టీ:- తదితి. తత్తస్మాత్ నః అస్మాకమన్నం రాతవే రాతుం దాతుం ఈహతు ఈహతాం యత్నం కరోతు ఉర్జితోర్జాస్త్యక్తాన్నాస్సత్యః వార్తాయాః జీవికాయాః పతిః. 11

ఓ రాజాధిరాజా! మేము ఆకలిచే పీడింపబడుచున్నాము. అన్నము లేక మేము ఎంతగానో బాధపడుచున్నాము. మా వినాశనము కన్నా ముందే నీవు మాకు అన్నము పెట్టడానికి ప్రయత్నము చేయుము. నీవు మా జీవికకు పతివి, ప్రజలను పాలించే రాజువు కదా! 11

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ పృథుం ప్రజానాం కరుణం నిశమ్య పరిదేవితమ్ ।
దీర్ఘం దధ్యౌ కురుశ్రేష్ఠ నిమిత్తం సోऽన్వపద్యత ॥ 12

టీ:- పృథురితి. పరిదేవితం విలాపం నిమిత్తం హేతుం అన్వపద్యత జ్ఞాతవాన్. 12

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

కురుశ్రేష్ఠ విదురా! ప్రజలయొక్క జాలిని గొలిపే ఆ విలాపమును విని పృథువు దీర్ఘముగా ఆలోచించెను. పృథివిపైన పంటలు లేకపోవడానికి కారణమును తెలుసుకొనెను. 12

శ్లో॥ ఇతి వ్యవసితో బుద్ధ్యా ప్రగృహీత శరాసనః ।
సందధే విశిఖం భూమేః క్రుద్ధస్త్రిపురహా యథా ॥ 13

టీ:- ఇతీతి. పృథివ్యా ఓషధి బీజాని గ్రస్తానీతి వ్యవసితః నిశ్చితాన్. 13

భూమిచేత ఓషధులు, బీజములు దొంగిలింపబడినవని నిశ్చయము చేసుకొని, ధనుస్సును స్వీకరించి, కోపించిన రుద్రుడు త్రిపురాసురులపైకి బాణమును సంధించినటుల, బాణమును సంధానము చేసెను .13

శ్లో॥ ప్రవేపమానా ధరణీ నిశామ్యోదాయుధం పృథుమ్ ।
గౌస్సత్యపాద్రవద్భీతా మృగీవ మృగయుద్రుతా ॥ 14

ఆయుధము ఎక్కుపెట్టిన పృథువును చూచి వణుకుచూ భూమి ఆవుగా మారి వేటగాడిని చూచి భయపడిన లేడివలె దూరముగా పారిపోయెను. 14

శ్లో॥ తామేవాన్వద్రవద్వైన్యః కుపితో౽త్యరుణేక్షణః ।
శరం ధనుషి సంధాయ యత్ర యత్ర పలాయతే ॥ 15

టీ:- ప్రవేపమానేతి. మృగయుణా ద్రుతాఅనుగతా మృగీవ. 14-15

పృథుమహారాజు కోపముతో ఎరుపెక్కిన కనుచూపులు కలిగి ధనుస్సునకు బాణమును సంధించి భూమి ఎక్కడెక్కడకు పారిపోతుందో ఆక్కడక్కడకు అనుసరించి పరిగెత్తెను. 15

శ్లో ॥ సాదిశో విదిశో దేవీ రోదసీ చాంతరం తయోః ।
ధావంతీ తత్ర తత్రైనం దదర్శానూద్యతాయుధమ్ ॥ 16

ఆ భూదేవి దిక్కుల, విదిక్కుల, స్వర్గ, భూలోకముల వాటిమధ్య అంతరిక్షమున పరిగెత్తుచూ అక్కడక్కడ ఆయుధమునెత్తి, వెనుక వచ్చుచున్న పృథువును దర్శించెను. 16

శ్లో॥ లోకేనావిందత త్రాణం వైన్యాన్మృత్యోరివ ప్రజాః ।
త్రస్తా తదా నివవృతే హృదయేన విదూయతా ॥ 17

మృత్యువునుండి ఏ విధముగా ప్రజలు రక్షణ పొందలేరో అదేవిధముగా పృథువునుండి రక్షించువారు భూమికి లేరు. కలత చెందిన హృదయముతో రక్షించువారు లేక వెనుతిరిగి వచ్చెను. 17

శ్లో॥ ఉవాచ చ మహాభాగ ధర్మజ్ఞాపన్న వత్సల
త్రాహి మామభిభూతానాం పాలనేఽవస్థితో భవాన్ ॥ 18

టీ:- నేతి. రోదసీ ద్యావాపృథివ్యౌ తయోరంతరమంతరిక్షం అను-పృష్ఠతః ఉద్యతమాయుధం యేన. (16-18)

శ్లో॥ సత్వం జిఘాంసనే కస్మాద్దీనామకృతకల్మషామ్ ।
అహనిష్యత్కథం యోషాం ధర్మజ్ఞ ఇతి యోమతః ॥ 19

శ్లో॥ ప్రహరంతి న వై స్త్రీషు కృతాగస్స్వపి జంతవః ।
కిముత త్వద్విధా రాజన్కరుణాదీనవత్సలాః ॥ 20

టీ:- స ఇతి. యో ధర్మజ్ఞ ఇతి మతః స భవాన్ యోషాం మాం కథం అహనిష్యత్ హనిష్యతి. (19-20)

శ్లో॥ మాం విపాట్యాజరాం నావం యత్ర విశ్వం ప్రతిష్ఠితమ్ ।
ఆత్మానం చ ప్రజాశ్చేమాః కథమంభసి ధాస్యసి ॥ 21

టీ:- మామితి. అజరాం దృఢాం నావం విపాట్య కథమంభసి ధాన్యసి ధారయిష్యసి. 21

భూమి మహాత్ముడగు పృథువుగూర్చి ఇలా పలికెను. ధర్మము నెరిగిన నీవు ఆపదలో ఉన్న వారియందు ప్రేమగలవాడవు, నీవు సర్వప్రాణులను కాపాడుటయందు నిష్ఠకల వాడవు. నీవు నన్ను గూడా రక్షించుము. 18

పాపరహితను, దీనురాలను, స్త్రీని అయిన నన్ను ధర్మజ్ఞుడవని పేరుగాంచిన నీవు ఎందుకు చంబూనితివి? 19

హే రాజా! తప్పుచేసినప్పటికినీ సాధారణ జంతు సమానులైన మూఢులైన మనుష్యులు గూడా స్త్రీలపై ఆయుధము ప్రయోగించరు. హే రాజన్! దీనులయందు దయగలిగి, ప్రేమగలిగిన నీవంటివారి విషయమున ఇంకా చెప్పేదేమున్నది. (మీరు స్త్రీని చంపనే చంపరు)20

నేననే (భూమి) దృఢమైన నావలో ఈ విశ్వమున్నది. ఈ నావను పగలగొట్టి నిన్ను, నీ ప్రజలను నీటియందు ఎట్లు ధరించగలవు? (రక్షించగలవు) 21

పృథురువాచ

శ్లో॥ వసుధే త్వాం వధిష్యామి మచ్ఛాసనపరాఙ్ముఖీమ్ ।
భాగం బర్హిషి యా వృఙ్క్తే న తనోషి చ యా వసు ॥ 22

టీ:- వసుధ ఇతి. బర్హిషి యజ్ఞే యా భవతీ దేవతారూపేణ భాగం వృఙ్క్తే భజతే వసుధాన్యాదికం. 22

శ్లో॥ యవసం జగ్ధ్యనుదినం నైవ దోగ్ధ్యౌధసం పయః ।
తస్యామేవం హి దుష్టాయాం దండో నాత్ర న శస్యతే ॥ 23

టీ:- యవసమితి. గో రూపేణ యవసం తృణం జగ్ధి ఆత్తీత్యర్థః. పయస్తు నైవ దోగ్ధి దుగ్ధం ప్రస్రవతి అత్రాస్మిన్నపరాధే. 23

శ్లో॥ తం ఖల్వోషధి బీజాని ప్రాక్సృష్టాని స్వయం భువా ।
న ముంచస్యాత్మరుద్ధాని మామవజ్ఞాయ మందధీః ॥ 24

టీ:- త్వమితి. ఆత్మని దేహే రుద్ధాని. 24

పృథువు ఈ విధముగా పలికెను.

ఐశ్వర్యమును ధరించే ఓభూమీ! నా శాసనమును నిర్లక్ష్యము చేసిన నిన్ను వధించగలను. నీవు యజ్ఞమున దేవతా రూపమున హవిర్భాగము గ్రహిస్తున్నావు. ధాన్యాదికములను ఇయ్యడంలేదు. 22

ప్రతిదినము గడ్డినేమో తింటున్నావు. పొదుగునిండా నింపుకున్న పాలను మాత్రం ఇవ్వడం లేదు. ఇట్టి దుష్టురాలవైన నీ యందు ఈ అపరాధమూలకమున శిక్షించుట యుక్తమే. (ఊధమనగా పొదుగు ఊధము యందు ఉత్పన్నమైనవి ఔధసం పాలు). 23

పూర్వము బ్రహ్మచేత సృష్టింపబడిన ఓషధుల బీజములను నీ దేహమందు నిలుపుకొని విడవడం లేదు. మందబుద్ధివై నన్ను తిరస్కరించితివి. 24

శ్లో॥ అమూషాం క్షుత్పరీతానామార్తానాం పరిదేవితమ్ ।
శమయిష్యామి మద్బాణైర్భిన్నా యా స్తవ మేదసా ॥ 25

టీ:- మద్వధే సర్వదా అన్నం న స్యాదితి చేదత ఆహ - అమూషాం ప్రజానాం మేదసా మాంసేన. 25

శ్లో॥ పుమాన్యోషిదుత క్లీబ ఆత్మసంభావితోऽధమః ।
భూతేషు నిరనుక్రోశో నృపాణాం తద్వధోऽవధః ॥ 26

టీ:- యదుక్తం యోషాం కథం హనిష్యసీతి తత్రాహ - పుమానితి. తస్య వధః అవధ ఏవ. 26

శ్లో॥ త్వాం స్తబ్ధాం దుర్మదాం నీత్వా మాయాగాం తిలశశ్శరైః ।
ఆత్మయోగ బలేనేమా ధారయిష్యామ్యహం ప్రజాః ॥ 27

టీ:- యచ్చోక్తం కథమంభసి ధాస్యసీతి తత్రాహ- త్వామితి. తిలశస్తిల ప్రమాణాని ఖండానీత్యేవం భూతామవస్థాం నీత్వా. 27

నిన్ను చంపడంవలన వీరికి అన్నమే దొరకదనుకుంటున్నా-వేమో! నా బాణములచే నిన్ను ముక్కలు చేసి, నీ మాంసముతో ఆకలిచే అలమటిస్తున్న ఈ దుఃఖితుల విలాపమును చల్లార్చగలను. 25

నీవన్నావు స్త్రీని ఎట్లా చంపుతానని. పురుషుడో, స్త్రీయో, నంపుంసకుడో ఎవరైతేనేమి ఎవరు తనను తాను గొప్పగా భావించు-కొంటాడో, సర్వప్రాణులయందు దయారహితుడై దుఃఖమును కలిగించేవాడో వాడు అధముడు. అట్టివారిని చంపడం రాజులకు దోషముకాదు. 26

నన్ను చంపి వీరందరిని నీటియందు ఎట్లు ధరిస్తావని అడిగినావు. పరపీడాకరమైన మదము కలిగి, వినయము లేనట్టి, కపట గోరూపమును ధరించిన నిన్ను నా బాణములచే నువ్వుగింజలంత ముక్కలుచేసి నా యొక్క యోగబలముచే నేను ఈ ప్రజలను నీటియందు గూడా ధరించగలను. 27

శ్లో॥ ఏవం మన్యుమయీం మూర్తిం కృతాంతమివ బిభ్రతమ్ ।
ప్రణతా ప్రాంజలిః ప్రాహ మహీ సంజాత వేపథుః ॥ 28

టీ:- ఏవమితి. మన్యుమయీం మూర్తింబిభ్రతమితి కృతాంతతుల్యత్వ ముచ్యతే. న తు కృతాంతస్య మన్యుమయీ మూర్తిరితి. 28

ఈ విధముగా కోప స్వరూపుడైన పృథువు యమునివలె కనిపించుచున్నాడు. (కాని యమునికి కోపమయమైన మూర్తి అని అర్థము చెప్పరాదు.) అట్టి మూర్తికి భూమి వణుకుతున్న దేహముతో నమస్కరిస్తూ చేతులు జోడించి ఈ విధముగా పలికెను. 28

మహ్యువాచ

శ్లో॥ నమః పరస్మై పురుషాయ మాయయా
విన్యస్తనానాతనవే గుణాత్మనే ।
నమస్స్వ్వ రూపానుభవేన నిర్ధుత
ద్రవ్యక్రియా కారక విభ్రమోర్మయే ॥ 29

టీ:- శ్లో."శుద్ధసత్వ తనుం దేవమకస్మాదతిదారుణమ్, వీక్ష్యమాణా పృథుం పృథ్వీతుష్టావకరుణోక్తిభిః. శ్లోకోఽయం శ్రీధరీయః. నమ ఇతి. మాయయా విన్యస్తా విరచితాః నానా ఘోరారితనవో యేన తస్మై గుణా త్మనే గుణమయత్వేన ప్రతీయమానాయ వస్తుతస్తు నిర్ధుతాః మాయయా నిరస్తాః ద్రవ్యక్రియాకారకేషు అధిభూతాధ్యాత్మాది దైవేషు విభ్రమః అహంకారః తన్నిమిత్తా ఊర్మయో రాగద్వేషాయశ్చ యస్మిన్ తస్మై. 29

భూమి ఈ విధముగా పలికెను.

శుద్ధసత్త్వ ప్రధానమైన దేహము కలిగిన పృథువు అకస్మాత్తుగా అతి దారుణమైన రూపుదాల్చగా, పృథువును చూస్తూ కారుణ్య పూరితమైన వాక్కులచే ఇలా స్తుతించెను. మాయచేత రచింపబడిన ఘోరాది నానా దేహములు కలిగిన, సత్త్వ రజస్తమోగుణ మయుడుగా ప్రతీతి కలిగిన, పరమపురుషుడికి వీటన్నింటికంటే వేరైన వాడికి నమస్కారము. ఎవరియందు యథార్థమునకు శరీర ఇంద్రియ దేవతలు, అశరీరేంద్రియ దేవతల యందు, వాటి సంసర్గము చేత కలిగిన మోహము అనగా వాటియందు నేను అను జ్ఞానము, దానిద్వారా రాగ, ద్వేష, కామ, క్రోధములు, ఆకలి, దప్పులు లేవో మరియు ఎవరి యందు ఇవన్నీ స్వరూప అనుభవముచే తొలిగినవో ఆయనకు నమస్కారము. 29

శ్లో॥ యేనాహమాత్మాయతనం వినిర్మితా
ధాత్రా యతోఽయం గుణసర్గ సంగ్రహః ।
స ఏవమాం హంతుముదాయుధస్స్వరా
డుపస్థితోఽన్యం శరణం కమాశ్రయే ॥ 30

టీ:- అహో సర్వజీవాశ్రయత్వేన సృష్టాం మా కథం హంతుం ప్రవర్తత ఇత్యాహ-యేనేతి. విధాత్రా ఆత్మనాం జీవానాం ఆయతనమహం వినిర్మితా యతః యస్యాం మయి గుణసర్గస్య చతుర్విధభూత గ్రామస్య సంగ్రహః ధారణం స్వరాట్ స్వతంత్రః. 30

అయ్యో! సర్వజీవులకు ఆశ్రయముగా సృష్టించిన నన్ను ఎందుకు చంపడానికి ఉద్యుక్తుడవుతున్నాడు? అని అంటూ బ్రహ్మదేవుడిచేత జీవులకు ఆశ్రయముగా నేను సృజింపబడ్డాను. నా యందు ఉద్భిజ్జ, స్వేదజ, జరాయుజ, అండజములనే నాలుగు విధముల సృష్టింప బడినవి. ఆ సృష్టించినవాడే స్వతంత్రుడైనవాడు. అట్టివాడే నేడు ఆయుధమునెత్తి చంప నిల్చుండగా వేరెవరిని శరణు వేడగలను. 30

శ్లో॥ య ఏత దాదావసృజచ్చరాచరం
స్వమాయయాత్మాశ్రయయాఽవితర్క్యయా ।
తయైవసోఽయం కిల గోప్తుముద్యతః
కథం ను మాం ధర్మపరో జిఘాంససి ॥ 31

టీ:- సృష్టి సంహారకర్తాహమేవేతి. చేత్ తథావి ప్రజాపాలనే ప్రవృత్తస్య మద్వధోఽనుచిత ఏవేత్యాహ- య ఇతి. ఆత్మాశ్రయయా జీవ విషయిణ్యా. 31

సృష్టి సంహారకుడను నేనే కదా అందుకొరకు నిన్ను సంహరించెదనందువో అయినప్పటికీ ఇప్పుడు నీవు ప్రజాపాలనము యందు ప్రవృత్తుడవయి చంపుట అనుచితమే అంటూ, పరమేశ్వరుడు ఈ చరాచరాత్మకమైన విశ్వమును సృజించెను. పరమేశ్వరుడు ఎట్లు సృజించినాడు? స్వమాయయా, తన మాయచేత. ఆ మాయ పరమేశ్వ-రుడిని ఆశ్రయించినది. జీవుడిని ఆవరించినది. అచింత్యమైనది, అనిర్వచనీయమైనది. ఆ మాయా శక్తిసహితుడై పృథు అవతారమును పొంది రక్షించుటకు సిద్ధమైనాడు కదా! అట్టి ధర్మపరుడు ఈ విశ్వమునకు ఆధారభూతను విశేషించి గోరూపధారిణిని అయిన నన్ను చంపడానికి ఇలా ఇష్టపడుచున్నాడు. 31

శ్లో॥ నూనంబతేశస్య సమీహితం జనై
స్త్వన్మాయయా దుర్జయయాఽకృతాత్మభిః ।
న లక్ష్యతే యస్త్వకరోదకారయ
ద్యోఽనేక ఏకః పరతస్స ఈశ్వరః ॥ 32

టీ:- అతో దుర్జ్ఞేయమీశ్వరచేష్టితమిత్యాహ- నూనమితి. అకృతాత్మభిః విక్షిప్తచిత్తైః యః ఈశ్వరః స్వతంత్రః అకరోత్ బ్రహ్మాణం పరత ఇతి తేన బ్రహ్మణా చరాచరమకారయత్ యశ్చ సత్వ ఏకః పరతః మాయయా తు అనేకః. 32

కనుక ఈశ్వరుని పని ఎవ్వరుగూడా తెలుసుకోలేరు అంటూ! ఇది నిశ్చయము, జయించడానికి సాధ్యముకాని భగవంతుని యొక్క మాయచేత చలింపబడిన చిత్తముగల జనులచే ఈశ్వరుడియొక్క పని తెలుసుకొనబడదు. ఈశ్వరుడు స్వతంత్రుడై మొదలు బ్రహ్మదేవుడిని సృజించెను, పిమ్మట ఆయన ద్వారా జగద్రచన చేయబడెను. నిజానికి ఆతడొక్కడే పరమేశ్వరుడు కాని మాయవలన అనేకులుగా భాసించును. (32)

శ్లో॥ సర్గాది యోఽస్యానురుణద్ధి శక్తి
ర్ద్రవ్య క్రియా కారకచేతనాత్మభిః ।
తస్మై సమున్నద్ధనిరుద్ధ శక్తయే
నమః పరస్మై పురుషాయ వేధసే ॥ 33

టీ:- తస్మాదచింత్య శక్తయే కేవలం నమ ఇత్యాహ - సర్గేతి. సర్గాది జన్మస్థితిభంగం. అస్య జగతః అనురుణద్ధి అనువర్తతే అనుకరోతి ద్రవ్యాణి మహాభూతాని క్రియాః ఇంద్రియాణి. కారకాః దేవాః. చేతనా బుద్ధిః. ఆత్మా అహంకారః. తైః స్వశక్తిరూపైస్సమున్నద్ధాః సముత్కటాః నిరుద్ధాః శక్తయో యస్య. 33

ఆ కారణమున అచింత్యమైన శక్తిగలవాడికి, కేవలుడికి నమస్కారము అంటూ మహాభూతములు, ఇంద్రియములు, ప్రకృతి ప్రవర్తకములైన దేవతలు, బుద్ధి, అహంకారము, ఈ తనవైన శక్తులచేత ఏ పరమాత్మ జగత్తు యొక్క సృష్టి, స్థితి, లయములను చేయుచున్నాడో అట్టి ప్రబలమైన, తన అధీనముగల సృష్ట్యాది విషయకములైన శక్తిగల పరమ పురుషుడికి నమస్కారము. 33

శ్లో॥ స వై భవానాత్మ వినిర్మితం జగద్భూ
తేంద్రియాంతఃకరణాత్మకం విభో ।
సంస్థాపయిష్యాన్నజ మాం రసాతలా
దభ్యుజ్జహా రాంభస ఆదిసూకరః ॥ 34

టీ:- ప్రాణినాం ధారణార్థం మాం రసాతలాదుద్ధృత్యేదానీం ప్రజా రక్షణే ప్రవృత్తస్య మద్వధో న యుక్త ఇతి సకారణమాహ – ద్వాభ్యాం. స ఇతి. హే అజ. యః సృష్టవాన్ స ఏవ భవాన్. స్వనిర్మితం చరాచరం జగత్ సమ్యక్ స్థాపయితుమిచ్ఛన్ ఆదిసూకరస్సన్. మామభ్యుజ్జహార. 34

శ్లో॥ అపాముపస్థేమయి నావ్యవస్థితాః
ప్రజా భవానద్య రిరక్షిషుః కిల ।
స వీరమూర్తిస్సమభూద్ధరాధరో
యోమాం పయస్యుగ్ర శరో జిఘాంససి ॥ 35

టీ:- అపామితి. సఏవ ధరాధరః వరాహః అద్య అపాముపస్థే ఉపరి మయి నావి ఆధారభూతాయామవస్థితాః ప్రజాః రక్షితుమిచ్ఛుః. వీరమూర్తిః పృథురూపః సమభూత్. య ఏవం భూతస్సత్వం పయసి నిమిత్తే మాం జిఘాంససీతి విచిత్రమిత్యర్థః. 35

ప్రాణులను నాపై ధరింపజేయుటకు నన్ను రసాతల లోకము నుండి యజ్ఞవరాహావతారముదాల్చి ఉద్ధరించి, ఇపుడు ప్రజలను రక్షించుటయందు ప్రవృత్తుడవై నన్ను చంపుట యుక్తము కాదు! అంటూ ఓ జనన రహితా! పరమాత్మా! పంచభూత, ఇంద్రియ, అంతఃకరణాత్మ -కమవై నీవే ఈ జగుత్తును నిర్మించినావు. నీచే నిర్మితమైన ఈ చరాచరాత్మకమైన జగత్తును చక్కగా స్థాపించుటకు నీటినుండి ఆది వరాహమూర్తివై నన్ను ఉద్ధరించినావు. 34

ఆతడే వరాహమూర్తి, ఈనాడు నీటియందు పడవవలె యున్న, నా యందు నిలిచి యున్న ప్రజలను కాపాడాలని కోరికతో వీరమూర్తి పృథువు ఆకారమును ధరించెను. ఇట్టి స్వరూపము గలిగిన నీవు ప్రజలకు అన్నాదులు కావాలని నన్ను సంహరించగోరుచున్నావే, ఇది చిత్రముగా యున్నది. 35

శ్లో॥ నూనం జనైరీహితమీశ్వరాణామ
స్మద్విధై స్తద్గుణ సర్గమాయయా ।
న జ్ఞాయతే మోహితచిత్తవర్త్మభిస్తేభ్యో
నమో వీర యశస్కరేభ్యః ॥ 36

టీ:- తస్మాదీశ్వరచేష్టితం దుర్విజ్ఞేయమితి. కైముతిక న్యాయేనోప సంహరితి – నూనమితి. తస్య ఈశ్వరస్య గుణసర్గరూపయా మాయయా మోహితం చిత్తమేవ వర్త్మ యేషాం మోహితాని చిత్త వర్త్మాని యేషామితి వా తైః జనైః ఈశ్వరాణాం హరిభక్తానామేవ తావదీహితం న జ్ఞాయతే కింపునస్తస్య పరమేశ్వరస్య చ అతః పరమేశ్వరాఏవ తేభ్యోఽపి నమ ఏవ కేవలం వీరాణాం జితేంద్రియాణాం యశః కుర్వంతి. ఏతేభ్యః యథా వీరాణాం యశో వర్ధేత తథా యుక్తం చేష్టతాం న తు యదేష్టమితి భావః. 36

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే, సప్తదశోఽ ధ్యాయః**

కావున ఈశ్వరచేష్ట తెలుసుకొనుటకు సాధ్యము కాదు. అంటూ కైముత్తికన్యాయముచే ఉపసంహరించుచున్నాడు. ఈశ్వరుడి త్రిగుణాత్మకమగు సృష్టిరూప మాయచే మోహితమైన చిత్తమే మార్గముగాగల మా వంటి జనులచే (ప్రతివారు చిత్తానికి వచ్చినట్టు చేస్తారు. ఆ చిత్తము మాయామోహితము) హరిభక్తుల చేష్టలనే తెలుసుకోలేము. పరమేశ్వరుడి చేష్టను ఏమి తెలిసికోగలము. అందులకు పరమేశ్వరుడికి వలె ఆ భక్తులకు కూడా కేవలము నమస్కారము మాత్రమే చేయగలము.వీరులకు అనగా జితేంద్రియులకు యశస్సును కలిగించే ఈశ్వరులకు నమస్కారము. పరమేశ్వరా! ఎట్లానైతే భక్తులకు యశస్సు పెరుగుతుందో అలాంటి చేష్టలు నీకు తగును కానీ నీ ఇష్టము వచ్చినట్టుగా వద్దు సుమా! 36

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు పదిహేడవ అధ్యాయము సమాప్తము.**

## అష్టాదశోఽధ్యాయః

శ్లో॥ ఆలోల తులసీమాలమారూఢవినతా సుతమ్ ।
జ్యోతిరిందీవరశ్యామమావిరస్తు మమాగ్రతః ॥
అష్టాదశే మహావాక్యాద్వత్స పాత్రాదిభేదతః ॥

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఇత్థం పృథుమభిష్టూయ రుషా ప్రస్ఫురితాధరమ్ ।
పునరాహావనీర్భీతాసం స్తభ్యాత్మానమాత్మనా ॥ 1

టీ:- పృథ్వాదిభిస్తు క్రమశస్సా దుగ్ధేతి నిరూప్యతే. 1

మహ్యువాచ

శ్లో॥ సన్నియచ్ఛాభి భో మన్యుం నిబోధ శ్రావితం చ మే ।
సర్వతస్సారమాదత్తే యథా మధుకరో బుధః ॥ 2

టీ:- సన్నియచ్ఛేతి. హే అభిభో ప్రభో యద్వా. భో దేవ. అభి అభయం యథా భవతి తథా. మన్యుసంనియచ్ఛ. శ్రావితం విజ్ఞాపితం న మద్వాక్యే అనాదరః కర్తవ్య ఇత్యాహ బుధో హి సర్వతస్సారమాదత్తే. 2

## 18వ అధ్యాయము

తులసీమాలచే నిండినవాడు (అలంకరింపబడి మనిగినవాడు) గరుత్మంతునిపై కూర్చున్నవాడు, నల్ల కులువలవలె శోభిల్లువాడు, నా ముందు నర్తించుగాక! నాకు ప్రత్యక్షమగుగాక! ఈ పద్దెనిమిదవ అధ్యాయమున భూమి మాటలను విని వత్స, పాత్రముల భేదముచే పృథువు మొదలుగా గలవారు వారికి కావలసిన ఆహారమును పితుక్కోవడం చెప్పబడినది.

మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

ఈ విధముగా కోపముచే వణుకుచున్న కింది పెదవిగల పృథువును స్తుతించి, తన మనస్సును బుద్ధిచేత నిలదొక్కుకొని భయపడుచూ భూమాత తిరిగి ఈ విధముగా అనెను. 1

భూదేవి పలుకుచున్నది.

ఓ ప్రభూ! ఓ దేవా! మాకు అభయము నిచ్చి, నీ కోపమును నిలువరించుకొనుము. (నా మాటలను) నా విజ్ఞాపనమును కొంత ఆలకించు. నా వాక్యముల యందు అనాదరణ వద్దు. తుమ్మెద సర్వపుష్పముల నుండి సారమును పరిగ్రహించు విధముగా పండితుడు అన్ని విషయముల నుండి సారమును గ్రహించును. 2

శ్లో॥ అస్మిన్ లోకేఽథవాముష్మిన్మునిభిస్తత్త్వదర్శిభిః ।
దృష్టా యోగాః ప్రయుక్తాశ్చ పుంసాం శ్రేయః ప్రసిద్ధయే ॥ 3

టీ:- మయి జీర్ణా ఓషధీః ఉపాయేన గృహాణేతి వక్తుం ఉపాయేన సర్వం సిధ్యతి నాన్యథేత్యాహ-త్రిభిః. అస్మిన్నితి. పుంసాం శ్రేయసః పురుషార్థస్య ప్రసిద్ధయే అస్మిన్ లోకే కృష్యాదయః అముష్మింశ్చ లోకే అగ్నిహోత్రాదయః. యోగాః ఉపాయాః. దృష్టాః ప్రయుక్తాః అనుష్ఠితాశ్చ. (3)

నా యందున్న జీర్ణమైన ఓషధులను ఉపాయముగా తీసుకొనుమని చెపుతూ ఉపాయముచేత సర్వము సిద్ధించునని, వేరే మార్గము లేదని అంటూ, మానవులకు ఈ లోకమున శ్రేయస్సు కలుగడానికి కృష్యాదులు (వ్యవసాయము), పరలోకమున సుఖమునకు అగ్నిహోత్రాదులు తత్వధర్ములైన మహర్షులచే ఉపాయములుగా బోధింపబడినవి, ఆచరణలో పెట్టబడినవి గూడా. 3

శ్లో॥ తానాతిష్ఠతి యస్సమ్య గుపాయాన్పూర్వదర్శితాన్ ।
అవరః శ్రద్ధయోపేత ఉపాయాన్విందతేఽంజసా ॥ 4

టీ:- తానితి. పూర్వైర్దర్శితాన్ అవరః అర్వాచీనః. 4

పూర్వులు ప్రదర్శించిన ఆ ఉపాయములను ఇప్పటివారు చక్కగా శ్రద్ధతో వాటిని పాటిస్తే తొందరగా ఫలమును పొందెదరు. 4

శ్లో॥ తానానాదృత్య యో విద్వానర్థానారభతే స్వయమ్ ।
తస్య వ్యభిచరంత్యార్థాః ప్రారబ్ధాశ్చ పునః పునః ॥ 5

టీ:- తానితి. అవిద్వాన్ విద్వానపి వా వ్యభిచరంతి న సిధ్యంతి. 5

తెలిసినవాడైనా, తెలియనివాడైనా పూర్వీకులు దర్శించిన మార్గమును విడిచిపెట్టి, అనాదరణచేసి తనే స్వయముగా కల్పించు -కొన్న ఉపాయములచే కార్యమును ప్రారంభించినచో ఎన్ని మార్లు ప్రారంభించినప్పటికీ (ఎన్ని ఉపాయములు పన్నినప్పటికీ) అవి ఫలవంతములు కావు. 5

శ్లో॥ పురా సృష్టాస్త్వోషధయో బ్రహ్మణా యా విశాంపతే ।
భుజ్యమానా మయా దృష్టా అసద్భిరధృతవ్రతైః ॥ 6

టీ:- సహేతుకముపాయమాహ - షడ్భిః. పురేతి. 6

భూదేవత, కారణపురస్సరముగా ఉపాయమును, గూర్చి చెప్పుతున్నది. ఓ రాజా! పూర్వము బ్రహ్మచే ఓషధులు సృజింపబడినవి. మంచి నడవడికలేని దుష్టులచే అవి అనుభవింపబడడం నేను కళ్ళారా చూచాను. 6

శ్లో॥ అపాలితానాదృతా చ భవద్భిర్లోకపాలకైః ।
చోరీభూతేఽథ లోకేఽహం యజ్ఞార్థేఽగ్రసమోషధీః ॥ 7

టీ:- అపాలితేతి. భవద్భిరితి రాజసామాన్యాభిప్రాయేణ అపాలితా చోరాద్యనివారణాత్ అనాదృతా చ యజ్ఞాది ప్రవర్తనాభావాత్. యజ్ఞార్థే అగ్రసంగిళితవత్యస్మి. అన్యథా అధృతవ్రతైః భుక్తాః న ప్రసవిష్యంతే తతశ్చ యజ్ఞాదయో న సిద్ధ్యేరన్నితి భావః. 7

లోకపాలకురైన అట్టి రాజులచేత (ఇచ్చట భవద్భిః అనగా సామాన్యముగా మీ పూర్వులైన వేనాది దుష్టరాజులచేత అని యర్థము) భూమి సక్రమంగా పరిపాలింపబడలేదు. చోరాది బాధలు తొలగించి నపుడే పరిపాలన. అదిలేదు. యజ్ఞాది ప్రవృత్తి గలిగినప్పుడే ఆదరణ, యజ్ఞాదులు లేవు, ఆదరణలేదు. దొంగలే రాజులుగా మారగా, రాబోయే యజ్ఞముల కొరకు ఓషధుల మింగితిని లేకున్న నియమాదులులేని ఈ రాజులు తింటే మళ్ళీ యజ్ఞాదులకు సమర్పించలేరని దాని ద్వారా యజ్ఞములు సిద్ధించవని నేను వాటిని నా యందు చేర్చుకొంటిని. 7

శ్లో॥ నూనం తా వీరుధః క్షీణా మయి కాలేన భూయసా ।
తత్ర దృష్టేన యోగేన భవానాదాతుమర్హతి ॥ 8

టీ:- నూనమితి. క్షీణాః జీర్ణాః. 8

నేను మింగి చాలాకాలమైనది కనుక నిశ్చయముగా నా యందు ఓషధులు జీర్ణమైనవి. నీవు పూర్వము సజ్జనులైన రాజులచే దర్శింపబడిన (అనుసరింపబడిన) ఉపాయముచే తిరిగి వాటిని పొందుము. 8

శ్లో॥ వత్సం కల్పయ మే వీర యేనాహం వత్సలా తవ ।
ధోక్ష్యే క్షీర మయాన్ కామాననురూపం చ దోహనమ్ ॥ 9

టీ:- వత్సమితి. వత్సం. దోహనం దోహనపాత్రం దోగ్ధారం చ ఉపకల్పయ ధోక్ష్యే ప్రపూరయిష్యామి. 9

ఓ వీరా! నీవు లేగదూడను కల్పించుకో, నీకు అనురూపమైన పాలు పితికే పాత్రనుకూడా కల్పించుకో, నేను లేగదూడను గలదానినై, మీరు పితికినచో కోరిన కోరికలను క్షీరరూపములో పూరించగలను. 9

శ్లో॥ దోగ్ధారం చ మహాబాహో భూతానాం భూతభావన ।
అన్నమీప్సితమూర్జస్వద్భగవాన్వాంఛతే యది ॥ 10

టీ:- దోగ్ధారమితి. భూతానామభీప్సితం అన్నం ఊర్జస్వత్ బలప్రదం. (10)

ప్రాణులయందు ప్రేమకలిగిన ఓ రాజా! భగవంతుడా ఒకవేళ నీవు ప్రాణులకు బలప్రదమైన అన్నము కావాలి అనుకుంటే పాలు పితుకు వాడిని గూడా కల్పించుము. 10

శ్లో॥ సమాం చ కురుమాం రాజన్ దేవ సృష్టం యథా పయః ।
అపర్తావపి భద్రం త ఉపావర్తేత మే విభో ॥ 11

ఓ రాజా ఎత్తు వంతులుగల దానినిగా ఉన్న నన్ను సమముగా చేయుము. వర్షఋతువు పోయిన తర్వాత గూడా వర్షించిన నీళ్ళు నాయందు ఉండునట్లుగా చేయుము. నీకు మంగళమగుగాక. 11

శ్లో॥ ఇతి ప్రియం హితం వాక్యం భువ ఆదాయ భూపతిః ।
వత్సం కృత్వా మనుం పాణావదుహత్సకలౌషధీః ॥ 12

టీ:- సమామితి. అపగతేఽపి వర్షర్తౌ యథా మే సర్వతోఽపి వర్తేత. (11-12)

ఈ విధముగా హితమును చేకూర్చే, ప్రియమైన మాటలు భూమినుండి భూపతి స్వీకరించి, స్వాయంభువ మనువును లేగదూడగా చేసి, తనచేతిలోనే సకలములైన (వడ్లు మొదలగు) ద్రవ్యమును పితుక్కొనెను. 12

శ్లో॥ తథాపరే చ సర్వత్ర సారమాదదతే బుధాః ।
తతోఽన్యే చ యథా కామం దుదుహుః పృథు భావితామ్॥ 13

టీ:- ప్రసంగాదర్థాంతరమాహ-యథా పృథుః ఏవం సర్వత్ర వాక్యే పరేఽపి సారమాపదదతే. తథేతి. ప్రస్తుతమమవర్తయతి. తత అన్యేచ ఋష్యాదయః పంచదశ దుదుహుః పృథునాభావితాంవశీకృతాం. 13

ప్రసక్తమైనది కనుక వేరే విషయములు గూడా చెప్పుచున్నాడు. వివేకవంతులైన ఇతరులు గూడా అంతటా సారమును స్వీకరించుచుందురు. అటుపిమ్మట పృథువు ద్వారా వశము చేసుకొన్న భూమిని పదిహేను మంది ఇతర ఋషులుగూడా వారి వారి అభీష్టము ననుసరించి పితుక్కొనిరి. 13

శ్లో॥ ఋషయో దుదుహుర్దేవీమింద్రియేష్వథ సత్తమ ।
వత్సం బృహస్పతిం కృత్వా పయశ్ఛందోమయం శుచి ॥ 14

టీ:- ఋషయ ఇతి. దేవీం పృథ్వీం వాఙ్మనః శ్రవణైర్వేద గ్రహణా దింద్రియాణాం పాత్రంత్వం. 14

సజ్జనులలో శ్రేష్ఠుడైన ఓ విదురా! ఋషులు బృహస్పతిని లేగదూడగా చేసి, భూదేవి నుండి ఇంద్రియములందు వేదరూపమైన పవిత్రమైన పాలను పితికిరి. వాక్ మనః శ్రవణేంద్రియముల ద్వారా వేదమును గ్రహించెదము కనుక ఇంద్రియములకు పాత్రత్వము. 14

శ్లో॥ వత్సం కృత్వా సురగణా ఇంద్రం సోమమదూదుహన్ ।
హిరణ్మయేన పాత్రేణ వీర్యమోజో బలం పయః ॥ 15

టీ:- వత్సవతి. సోమమమృతం. వీర్యం మనశ్శక్తిం ఓజ ఇంద్రియ శక్తిం బలం దేహశక్తిం చ తదేవ పయః. 15

దేవతలు ఇంద్రుడిని వత్సముగా చేసి, బంగారుపాత్రయందు సోమమనగా అమృతమును; వీర్యమనగా మనఃశక్తిని; ఓజం అనగా ఇంద్రియశక్తిని; బలమనగా దేహశక్తిని (ఇవ్వేపాలు వీటిని) పితుక్కొనిరి. 15

శ్లో॥ దైతేయా దానవా వత్సం ప్రహ్లాదమసురర్షభమ్ ।
విధాయ దుదుహుః క్షీరమయః పాత్రే సురాసవమ్ ॥ 16

టీ:- దైతేయా ఇతి. సురా. ఆసవం తాలాదిమద్యం. 16

దితికుమారులైన దానవులు అసుర శ్రేష్ఠుడగు ప్రహ్లాదుడిని లేగదూడగా చేసి ఇనుప పాత్రలో సురను, ఆసవమును పాలుగా పితుక్కొనిరి. సురయనగా బెల్లము మొదలగు ద్రవ్యములచే తయారు చేయు మత్తును కలిగించు పదార్థము. ఆసవమనగా తాటిచెట్టు, ఈతచెట్టు, కొబ్బరిచెట్టుల నుండి తీసి సాక్షార్తుగా అట్లానే పరిగ్రహించే (మార్పులు లేకుండా) మత్తెక్కించే ద్రవ పదార్థము . 16

శ్లో॥ గంధర్వాప్సరసోఽధుక్షన్పాత్రే పద్మమయే పయః ।
వత్సం విశ్వావసుం కృత్వా గాంధర్వం మధుసౌభగమ్ ॥ 17

టీ:- గంధర్వేతి. మధు వాఙ్మాధుర్యం సౌభగం సౌందర్యం తత్సహితం. 17

గంధర్వులు, అప్సరసలు విశ్వావసును వత్సముగా చేసి, పద్మరూపమైన పాత్రయందు గంధర్వులకు మహిమను కలిగించే వాక్మాధుర్యమును, సౌందర్య సహితమైన దానినికి పాలుగా పితికిరి. (17)

శ్లో॥ వత్సేన పితరోఽర్యమ్ణా కవ్యం క్షీరమధుక్షత ।
ఆమపాత్రే మహాభాగ శ్రద్ధయా శ్రాద్ధదేవతాః ॥ 18

టీ:- వత్సేనేతి. కవ్యం పితౄణామన్నం ఆమపాత్రే అపక్వే మృణ్మయే అధుక్షత దుదుహుః. 18

మహాత్ములు శ్రాద్ధ దేవతలైన పితరులు, అర్యముడిని వత్సముగా చేసి అపక్వమైన (కాలీకాలని) మట్టిపాత్రయందు పితరులకు అన్నమును (దీనినే కవ్యమందురు) పాలుగా పితికిరి. 18

శ్లో॥ ప్రకల్ప్య కపిలం వత్సం సిద్ధాస్సంకల్పనామయీమ్ ।
సిద్ధిం నభసి విద్యాం చ యే చ విద్యాధరాదయః ॥ 19

టీ:- ప్రకల్ప్యేతి. సంకల్పనామయీం అణిమాది సిద్ధిం యే విద్యాధరాదయః. తే చ తమేవ వత్సం పరికల్ప్య. నభస్యేవ పాత్రే ఖే చరత్వాది రూపాం విద్యాం దుదుహుః. 19

సిద్ధులు, కపిలుడిని వత్సముగా చేసి ఆకాశమనే పాత్రలో అణిమాదిసిద్ధులను, విద్యాధరులు కపిలుడినే దూడగా ఆకాశమునే పాత్రగా చేసి ఆకాశమున సంచరించు విద్యలను పాలుగా పితికిరి. 19

శ్లో॥ అన్యే చ మాయినో మాయామంతర్ధానాద్భుతాత్మనామ్ ।
మయం ప్రకల్ప్య వత్సత్వే దుదుహుర్ధారణామయీమ్ ॥ 20

టీ:- అన్యఇతి. అన్యే చ కింపురుషాదయః అంతర్ధానేన అద్భుతాత్మనాం సంబంధినీం మాయాం ధారణామయీం. సంకల్పమాత్ర ప్రభవాం. 20

మయుడిని దూడగా చేసి, ఆకాశమునే పాత్రగా చేసుకొని, కింపురుషాదులు అంతర్ధానముచే అద్భుతమైన స్వరూపము ఎవరికి కలదో అట్టివారు దానికి సంబంధించిన మాయను, సంకల్పమాత్రము చేతనే అచ్చట కన్పడే శక్తిని పాలుగా పితికిరి. 20

శ్లో॥ యక్ష రక్షాంసి భూతాని పిశాచాః పిశితాశనాః ।
భూతేశవత్సా దుదుహుః కపాలే క్షతజాసవమ్ ॥ 21

టీ:- యక్షేతి. భూతేశో రుద్రః స ఏవ వత్సో యేషాం తే క్షతజం రుధిరం తదేవాసవం. 21

యక్షులు, రాక్షసులు, భూతములు, మాంసభుక్కులైన పిశాచములు రుద్రుడిని దూడగా చేసి కపాల పాత్రయందు రక్తమనే మాదకద్రవ్యమును పితికిరి. 21

శ్లో॥ తథా హయో దందశూకాస్సర్పా నాగాశ్చ తక్షకమ్ ।
వత్సం విధాయ దుదుహుర్బిల పాత్రే విషం పయః ॥ 22

టీ:- తథేతి. అహయుః నిష్ఫణాః దందశూకా వృశ్చికాదయః సర్పాస్సఫణాః. త ఏవ కద్రూసంతతిజా నాగాః. బిలపాత్రేముఖే. 22

పిమ్మట నాగఫణులలేని (పడగలు లేని కట్లపాము మొదలగు వాటిని, వీటినే అహిః అందురు) పాములు, తేళ్ళు మొదలగునవి. ఫణులు కలిగిన సర్పములు (ఇవే కద్రువ సంతతిలో పుట్టిన నాగములు) తక్షకుడిని వత్సముగా చేసి వాటి ముఖముల యందు విషమనే పాలని పితికినవి. 22

శ్లో॥ పశవో యవసం క్షీరంవత్సం కృత్వాచ గోవృషమ్ ।
అరణ్యపాత్రే చాధుక్షన్ మృగేంద్రేణ చ దంష్ట్రిణః ॥ 23

టీ:- పశవ ఇతి. యవసం తృణం. గో వృషం రుద్రవాహనం వృషభం. మృగేంద్రేణేత్యుత్తరేణాన్వయః. 23

పశువులు శివవాహనమైన నందీశ్వరుడిని వత్సముగా చేసి అడవి అనే పాత్రలో గడ్డిని క్షీరముగా పితికినవి. కోరలచేత మాంసమును భక్షించు ప్రాణులు సింహమును వత్సముగా చేసి తమ శరీరమను పాత్రలో మాంసమును పితికినవి. పక్షులు గరుత్మంతుడిని లేగదూడగా చేసి వాటి శరీరమున కీటకములను ఫలాదులను పితికినవి. (23,24)

శ్లో॥ క్రవ్యాదాః ప్రాణినః క్రవ్యం దుదుహుస్స్వకళేబరే ।
సువర్ణ వత్సా విహగాశ్చరంచాచర మేవ చ ॥ 24

శ్లో॥ వటవత్సా వనస్పత్యః పృథగ్రోహమయం పయః ।
గిరయో హిమవద్వత్సా నానాధాతూన్ స్వసానుషు ॥ 25

టీ:- క్రవ్యాదా ఇతి. క్రవ్యం మాంసం చరం కీటాది. ఆచరం ఫలాది. (24-25)

వృక్షములు మఱ్ఱిచెట్టును వత్సముగా చేసి నానా రసములను, పాలను వాటి దేహముల యందు పితికినవి. పర్వతములు హిమవంతుని వత్సముగా చేసి కొండచరియలను పాత్రగా చేసి గైరికాది ధాతువులను పాలుగా పితికినవి. 25

శ్లో॥ సర్వే స్వ ముఖ్య వత్సేన స్వే స్వే పాత్రే పృథక్పయః ।
సర్వకామదుఘాం పృథ్వీం దుదుహుః పృథు భావితామ్ ॥26

టీ:- అనుక్తసంగ్రహార్థమాహ - సర్వ ఇతి. సర్వే స్వజాతౌ యో ముఖ్యః తేన వత్సేన. 26

సర్వప్రాణులు వాటి జాతియందు ఎవరు ముఖ్యులో వారిని వత్సముగా చేసి వారి వారి పాత్రలలో విడివిడిగా పాలను, పృథువుచేత వశము చేసికొనిరి. అన్ని కోరికలను గోరూప ధారిణియైన పృథివి నుండి పితికిరి. 26

శ్లో॥ ఏవం పృథ్వాదయః పృథ్వీమన్నాదాః స్వన్నమాత్మనః ।
దోహవత్సాది భేదేన క్షీర భేదం కురుద్వహ ॥ 27

టీ:- ఉపసంహరతి - ఏవమితి. స్వన్నం అభీష్టం అన్నం. తదేవ క్షీరభేదేనైవం దుదుహుః దోహః పాత్రం. 27

ఉపసంహరించుచున్నాడు. విదురా! ఈ విధముగా పృథువు మొదలగువారు ఆహార భక్షకులు, వారు కోరిన అన్నమును, పాత్ర, వత్సము మొదలగు భేదములచే క్షీర భేదమును పితికిరి. 27

శ్లో॥ తతో మహీపతిః ప్రీతః స్వకామదుఘాం పృథుః ।
దుహితృత్వే చకారేమాం ప్రేమ్ణా దుహితృ వత్సలః ॥ 28

టీ:- త ఇతి ఇమాం పృథ్వీం. 28

పిమ్మట అన్ని కోరికలను పాలరూపమున వర్షించిన భూమిని చూచి భూపతియైన పృథు చక్రవర్తి సంతుష్టుడై, ప్రేమచేత కూతురుగా చేసుకొని, ప్రేమను కురిపించెను. 28

శ్లో॥ చూర్ణయన్ స్వధనుః కోట్యా గిరి కూటాని రాజరాట్ ।
భూమండలమిదం వైన్యః ప్రాయశ్చక్రే సమం విభుః ॥ 29

పృథువు తన ధనుస్సు కొనలతో ఈ భూమండలమున గిరి పర్వతములను పిండిగా చేసి జీవజామంతటికి జీవికను కల్పించడం వలన రాజులకు రాజై చాలా సంవత్సరములు రాజ్యపాలన చేసెను. 29

శ్లో॥ అథాస్మిన్భగవాన్ వైన్యః ప్రజానాం వృత్తిదః పితా ।
నివాసాన్ కల్పయాంచక్రే తత్ర తత్ర యథార్హతః ॥ 30

పిమ్మట ఈ భూమండలముయందు భగవాన్ పృథువు ప్రజలకు వృత్తిని (జీవికను) కల్పించిన తండ్రియై, అవసరమైనచోట్ల అర్హతను అతిక్రమించకుండా నివాసములను కల్పించెను. 30

టీ:- చూర్ణయన్నితి. చూర్ణయన్ ధనుషోగ్రేణ గిరిశృంగాణి చూర్ణయన్. రాజరాట్ రాజ్ఞాం రాజా. (29-30)

శ్లో॥ గ్రామాన్ పురః పట్టణాని దుర్గాణి వివిధాని చ ।
ఘోషాన్వ్రజాన్ సశిబిరానాకరాన్ ఖేట ఖర్వటాన్ ॥ 31

గ్రామములను (అంగడివీధులులేని ఊరు గ్రామము) పురములను (అంగడి వీధులు గల ఊరు పురము) పట్టణములు (ఈ అంగడి వీధులే ఎక్కువగా ఉండేది పట్టణము) వివిధ దుర్గములను. దుర్గములు ఐదు రకాలని బృహస్పతి చెపుతాడు.

ఔదకం:- నీటిమధ్య నిర్మించిన దుర్గము
పార్వతం:- పర్వతమును తొలచి కట్టినది
వార్క్ష్యం:- చుట్టూ చాలా చెట్లు ఉంటూ మధ్యలో గలది
ఐరిణం:- ఊసర భూమియందు గలది
ధాన్వనం:- నీరులేని ప్రాంతమున గట్టినది.

గొల్లల నివాసములను, గోవుల నివాసస్థలములను, సైనికులుండు స్థలములను , సైనికులుండు స్థలములచే గూడిన బంగారము మొదలగునవి ఉండు స్థానములను, వ్యవసాయదారుల గృహములను, పర్వతప్రాంత గ్రామములను ఏర్పాటు చేసెను. 31

టీ:- గ్రామానితి. గ్రామాః అట్టాదిశూన్యాః పురః అట్టాదిమత్యః తాఏవ మహత్యః పట్టణాని దుర్గాణి వివిధాని యథాహ బృహస్పతిః.శ్లో. "ఔదకం పార్వతం వార్క్షమైరిణం ధాన్వనం తథే"తి. ఘోషాన్ ఆభీరాణాం నివాసాన్. వ్రజాన్ గవాం నివాసాన్ శిబిరం సేనానివేశ స్థానం తత్స హితాన్ ఆకరాన్ సువర్ణాద్యుత్పత్తిస్థానాని ఖేటాః కర్షక గ్రామాః ఖర్వటాః పర్వప్రాంతగ్రామాః. తాంశ్చ. (31-32)

శ్లో॥ ప్రాక్పృథోరిహ నైవైషా పురగ్రామాది కల్పనా ।
యథా సుఖం వసంతి స్మ తత్ర తత్రాకుతోభయాః ॥ 32

పృథుచక్రవర్తి కంటే పూర్వము పుర, గ్రామాదుల కల్పన లేకుండేది. జనులంతా అక్కడక్కడ (పృథువు ఏర్పాటు చేసిన పురాదులలో) ఏ భయములు లేనివారై సుఖముగా నివసించినారు. (32)

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే, అష్టాదశోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు పద్దెనిమిదవ అధ్యాయము సమాప్తము.**

## ఏకోనవింశోఽధ్యాయః

శ్లో॥ ఊనవింశేఽశ్వమేధాంగ హయాపహరణత్పృథోః ।
ఇంద్రం హంతుం ప్రవృత్తస్య ధాత్రా వారణముచ్యతే ॥

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ అథాదీక్షత రాజర్షిర్హయమేధ శతేన సః ।
బ్రహ్మావర్తే మనోః క్షేత్రే యత్ర ప్రాచీ సరస్వతీ ॥ 1

టీ:- అథేతి. హయమేధ శతేన నిమిత్తేన అదీక్షత దీక్షితోఽభూత్ శతాశ్వమేధ సంకల్పమకరోదిత్యర్థః. బ్రహ్మావర్తే దేవ వినిర్మితే దేశే. శ్లో. సరస్వతీ దృషద్వత్యోర్దేవనద్యోర్యదంతరమ్, తద్దేవ నిర్మితం దేశం బ్రహ్మావర్తం ప్రచక్షత ఇతి ప్రసిద్ధేః. 1

శ్లో॥ తదభిప్రేత్య భగవాన్ కర్మాతిశయమాత్మనః ।
శతక్రతుర్నమమృషే పృథోర్యజ్ఞ మహోత్సవమ్ ॥ 2

టీ:- తదితి. ఆత్మనః స్వస్య కర్మ అతిశేత ఇత్యతిశయం అభిప్రేక్ష్య జ్ఞాత్వా. తదితి తం. పృథోర్యజ్ఞమహోత్సవం. న మమృషే న సేహే. 2

## 19వ అధ్యాయము

ఈ పందొమ్మిదవ అధ్యాయమున అశ్వమేధ యజ్ఞమునకు అంగమగు గుఱ్ఱమును అపహరించుటవల్ల ఇంద్రుడిని చంపదలచిన పృథువును బ్రహ్మ వారించడం చెప్పబడుచున్నది.

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

తూర్పుగా సరస్వతీ నదీ ప్రవహించుచోట స్వాయంభువ మనువు పాలనలోని క్షేత్రమైన బ్రహ్మావర్తమున నూరు అశ్వమేధములను చేయుదునని సంకల్పించుకొని రాజు దీక్షను చేపట్టెను. సరస్వతీ, దృశద్వతీ, దేవనదుల మధ్యగల, దేవనిర్మితమెన ప్రదేశమును బ్రహ్మావర్తమందురు. 1

భగవంతుడైన ఇంద్రుడు నూరు యజ్ఞములు చేసినవాడు. పృథువు నూరు యజ్ఞములు చేసినచో తాను (ఇంద్రుడు) చేసిన కర్మలను అతిక్రమించి చేసిన వాడగునని (తనకంటే అధికుడగునని) తెలుసుకొని పృథుమహారాజు మహోత్సవమును (ఆధిక్యతను) సహించలేకపోయెను. (2)

శ్లో॥ యత్ర యజ్ఞపతిస్సాక్షాద్భగవాన్ హరిరీశ్వరః ।
అన్వభూయత సర్వాత్మా సర్వలోకగురుః ప్రభుః ॥ 3

ఆ అతిశయమునే చూపెట్టుచున్నాడు. ఆ యజ్ఞమున సాక్షాత్తు యజ్ఞపతి, లోకమునకు ఈశ్వరుడు, సర్వాత్మకుడు, సర్వలోకము లకు గురువు, ప్రభువగు శ్రీహరి ప్రత్యక్షముగా సాక్షాత్కరించెను. 3

శ్లో॥ అన్వితో బ్రహ్మశర్వాభ్యాం లోకపాలైస్సహానుగైః ।
ఉపగీయమానో గంధర్వైర్మునిభిశ్చాప్సరోగణైః ॥ 4

శ్రీహరి బ్రహ్మ, మహేశులచే కూడినవాడు, లోక పాలకులచే అనుయాయులచే గూడిన గంధర్వులచే, అప్సరోగణముచే మునలచే కీర్తింపబడుచున్నాడు. 4

టీ:- అతిశయమేవ దర్శయతి - యత్రేత్యాది సప్తభిః. యత్రేతి. సాక్షాదన్వభూయత ప్రత్యక్షేణాదృశ్యత. (3-4)

శ్లో॥ సిద్ధ విద్యాధరా దైత్యా దానవా గుహ్యకాదయః ।
సునంద నంద ప్రముఖాః పార్షద ప్రవరా హరేః ॥ 5

శ్లో॥ కపిలో నారదో దత్తో యోగీశాస్సనకాదయః ।
తమన్వీయుర్భాగవతా యే చ తత్సేవనోత్సుకః ॥ 6

సిద్ధులు, విద్యాధరులు, దైత్యులు, దానవులు, గుహ్యకాదులు, సునందనందులు, శ్రీహరిపార్షదులు, శ్రేష్ఠులు, ప్రముఖులు, కపిలుడు, నారదుడు, యోగీశ్వరుడైన దత్తుడు, సనకాదులు, భగవద్భక్తులు, భగవంతుడి సేవించాలని ఉత్సాహము కలిగినవారు ఆ శ్రీహరిని అనుసరించి వెళ్ళిరి. (5-6)

టీ:- సిద్ధేతి. సిద్ధాదయశ్చ తం హరిం అన్వీయురిత్యుత్తరేణాన్వయః (5-6)

శ్లో॥ యత్ర ఘర్మదుఘా భూమిస్సర్వకామదుఘా సతీ ।
దోగ్ధిస్మాభీప్సితానర్థాన్ యజమానస్య భారత ॥ 7

టీ:- యత్రేతి. ఘర్మదుఘాహ విర్దోగ్ధ్రీ సతీ. 7

ఓ భారతా! విదురా! ఆ యజ్ఞమున భూమి ధేనువు రూపమున హవిస్సును ఇచ్చుచూ అన్ని కోరికలను ప్రసవించునదగుచూ యజమాని యొక్క కోరిన కోర్కెలను ఇచ్చుచుండెడిది. 7

శ్లో॥ ఊహుస్సర్వసాన్నద్యః క్షీరదధ్యన్న గోరసాన్ ।
తరవో భూరివర్ష్మాణః ప్రాసూయత మధుచ్యుతః ॥ 8

టీ:- ఊహురితి. ఊహుర్వహంతి స్మ. సర్వరసాన్ ఇక్షుద్రాక్షాది రసాన్ క్షీరం చ. దధిచ అన్నం చ. పానకాది గోరసః. ఘృతం. తక్రం చ. తాంశ్చ. భూరీణి విస్తృతాని వర్ష్మాణి శరీరాణి యేషాం తే. ఫలాది ప్రాసూయంత. మధుచ్యుతః మధుస్రావిణస్సంతః. 8

చెఱుకు, ద్రాక్షాది రసములు పాలు, పెరుగు, అన్నము, పానకము, నెయ్యి, చల్ల, నదులై ప్రవహించుచున్నవి. పెద్దపెద్ద ఆకారములు గల చెట్లు ఫలములను ప్రసవించెను. ఆ ఫలములు తేనెలొలుకుచున్నవి. 8

శ్లో॥ సింధవో రత్ననికరాన్ గిరయోఽన్నం చతుర్విధమ్ ।
ఉపాయన ముపాజహ్రుస్సర్వే లోకాస్సపాలకాః ॥ 9

టీ:- సింధవ ఇతి. చతుర్విధం భక్ష్యం భోజ్యం చోష్యం లేహ్యం. 9

సముద్రములు రత్నరాశులను; పర్వతములు నాలుగు రకములైన ఆహారమును(భక్ష్యం= నమిలి మ్రింగేది. భోజ్యం = ఎక్కువ నమలకుండ తినదగినది. చోష్యం = జుర్రేది. లేహ్యం = నాకదగినది) సమర్పించినవి. పాలకులతో గూడినవారై అన్ని లోకములలోని ప్రజలు బహుమతులు సమర్పించిరి. 9

శ్లో॥ ఇతి చాధోక్షజేశస్య పృథో స్తత్పరమోదయమ్ ।
అసూయన్ భగవానింద్రః ప్రతిఘాతమచీకరత్ ॥ 10

టీ:- ఇతీతి. అధోక్షజః ఈశో నాథో యస్య. పరమ ఉదయోఽభివృద్ధి ర్యస్మింస్తత్కర్మ అసూయన్ అసహమానః. ప్రతిఘాతం విఘ్నం చకార్యేత్యర్థః. 10

అధోక్షజుడే నాథుడుగాగల ఆ పృథువు యొక్క గొప్ప అభివృద్ధిను చూచి, భగవానింద్రుడు అసూయపడి, ఓర్వలేక విఘ్నమును కలిగించెను. 10

శ్లో॥ చరమేణాశ్వమేధేన యజమానే యజుష్పతిమ్ ।
వైన్యే యజ్ఞపతిస్స ర్ధన్నపోహవాహ తిరోహితః ॥ 11

టీ:- చరమేణేతి. వైన్యే. యజుష్పతిం విష్ణుం యజమానే సతి స్పర్ధమాన ఇంద్రః. తిరోహితస్సన్నశ్వమపహృతవాన్. 11

పృథువు చివరిదైన అశ్వమేధములో యజఃపతియైన శ్రీహరిని ఆరాధించుచుండగా పృథువుపై విరోధము పెట్టుకొని ఇంద్రుడు యజ్ఞ పశువును కంటికి కనిపించకుండా దొంగిలించెను. 11

శ్లో॥ తమిత్రిర్భగనైక్షత్త్వరమాణం విహాయసా ।
ఆముక్తమివ పాషండం యోఽధర్మే ధర్మవిభ్రమః ॥ 12

ఆకాశ మార్గమున తొందరగా పరిగెత్తుతున్న పాఖండ వేషమును కవచమువలె ధరించినవాడగు ఇంద్రుడిని భగవాన్ అత్రిమహర్షి చూచెను. (అధర్మముయందు ఇది ధర్మమను భ్రాంతిని గొలుపువాడు పాఖండుడు) 12

శ్లో॥ అత్రిణా సూచితం హంతుం పృథుపుత్రో మహారథః ।
అన్వధావత తం క్రుద్ధస్తిష్ఠతిష్ఠేతి చాబ్రవీత్ ॥ 13

టీ:- తమితి. త్వరమాణం ధావంతం ఆముక్తం. ని."ఆముక్తః ప్రతిముక్తశ్చ పినద్ధశ్చాపినద్ధవత్, సన్నద్ధో వర్మితస్సజ్జ" ఇత్యమరః. పాషండం వేషం కవచమివ గృహీతవంతమిత్యర్థః. అధర్మే ధర్మవిభ్రమః ధర్మోఽయమితి భ్రాంతికరః యః తం. (12-13)

అత్రి మహర్షిచే ప్రేరితుడై పృథు కుమారుడైన మహారథుడు కోపించి నిలువుము నిలువుము అని నిలువరిసూ వెంట పరిగెత్తినాడు. (13)

శ్లో॥ తం తాదృశాకృతిం వీక్ష్య మేనే ధర్మశరీరిణమ్ ।
జటిలం భస్మనాచ్ఛన్నం తస్మై బాణం న ముంచతి ॥ 14

జడలు కలిగి, భస్మమును పూసికొనిన ఆ ఇంద్రుడి ఆకృతిని చూచి,మూర్తీభవించిన ధర్మముగా భావించి బాణమును విడువలేదు. 14

టీ:- తమితి. న ముంచతి స్మ. 14

శ్లో॥ వధాన్నివృత్తం తం భూయో హంతవే త్రిరచోదయత్ ।
జహి యజ్ఞహనం తాతమహేంద్రం విబుధాధమమ్ ॥ 15

వధ నుండి విరమించుకొన్న పృథు కుమారుడిని చూచి ఇంద్రుని చంపడానికై అత్రి ప్రేరేపించెను. నాయనా యజ్ఞమును చెడగొట్టిన దేవతలలో అధముడైన ఇంద్రుడిని చంపివేయుము. 15

శ్లో॥ ఏవం వైన్యసుతః ప్రోక్తస్త్వరమాణం విహాయసా ।
అన్వద్రవదభిక్రుద్ధో వారణం మృగరాడివ ॥ 16

అని ఈ విధముగా అత్రి ప్రేరితుడైన పృథు కుమారుడు చాలా కోపించిన వాడై ఆకాశములో త్వరగా వెళ్ళుచున్న ఇంద్రుడిని ఏనుగును మృగరాజు వెంబడించినట్టుగా వెంబడించెను. 16

టీ:- వధాదితి. హంతవే హంతుం యజ్ఞహనం యజ్ఞం హతవంతం. (15-16)

శ్లో॥ సోஉశ్వం రూపం చ తద్ధిత్వా తస్థావంతర్హి తః స్వరాట్ ।
వీరస్స్వపశుమాదాయ పితుర్యజ్ఞముపేయివాన్ ॥ 17

టీ:- స ఇతి. తస్మై హిత్వా తదర్ధముత్సృజ్య. 17

స్వర్గాధిపతియైన ఇంద్రుడు ఆ పాఖండ వేషమును, గుఱ్ఱమును గూడా విడిచి అంతర్ధానమాయెను. వీరకుమారుడు యజ్ఞపశువును తీసుకొని తండ్రి యజ్ఞ స్థలికి చేరుకొనెను. 17

శ్లో॥ తత్తస్య చాద్భుతం కర్మ విచక్ష్య పరమర్షయః ।
నామధేయం దదుస్తస్మై విజితాశ్వ ఇతి ప్రభో ॥ 18

టీ:- తదితి. విచక్ష్య దృష్ట్వా. 18

సమర్థుడవగు ఓ విదురా! ఆశ్చర్యకరము అయిన ఆయన ఆ పనిని చూచి పరమ ఋషులంతా విజితాశ్వుడని పేరుపెట్టిరి. 18

శ్లో॥ ఉపసృజ్య తమస్తీవ్రం జహారాశ్వం పునర్హరిః ।
చషాలయూపాత్తం ఛన్నో హిరణ్యరశనం విభుః ॥ 19

టీ:- ఉపసృజ్యేతి. ఉపసృజ్య సృష్ట్వా తేన సమ్యక్ ఛన్నస్సన్. చషాలే యూపాగ్రే నిక్షిప్తః రౌక్మ కటకః తద్యుక్తాత్ యూపాత్ హిరణ్యనిర్మితా రశనాయస్య రశనాయా దృఢత్వేన ఛేదాశక్త్యా రశనాసహితమేవోద్ధృత్య యూపాగ్రాన్నీతవానీత్యర్థః. విభుస్సమర్థః. (19-21)

గుఱ్ఱమును యూపస్తంభమునకు, చషాలము నుండి తీసిన బంగారు త్రాడుతో కట్టివేసినారు. (గుఱ్ఱమును కట్టివేయడానికి కఱ్ఱతో చేసిన, గుండ్రముగా యుండునది చషాలము) ఇంద్రుడు చిమ్మచీకటిని సృష్టించి ఆ చీకటిలో రహస్యముగా, ఆ చషాలమునుండి బంగారు త్రాడును తీయడం సాధ్యపడక త్రాడుతో చషాలముతో సహా మళ్ళీ గుఱ్ఱమును దొంగిలించినాడు. 19

శ్లో॥ అత్రిస్సందర్శయామాస త్వరమాణం విహాయసా ।
కపాల ఖట్వాంగధరం వీరో నైనమబాధత ॥ 20

తొందరగా ఆకాశమున కపాలము, ఖట్వాంగములను (అనగా మంచము యొక్క కోడువలెఉండు ఆయుధవిశేషము కాపాలికులకు ప్రసిద్ధమని "మహిమ్నంలో శ్రీ మధుసూదన సరస్వతీ") ధరించి వెళ్ళుతున్న ఇంద్రుడిని అత్రి మహర్షి చూపించెను. కాని సాధువని విజితాశ్వుడు బాధించలేదు. 20

శ్లో॥ అత్రిణా చోదితస్తస్మైసందధే విశిఖం రుషా ।
సోఽశ్వం రూపం చ తద్ధిత్వాతస్థావంతర్హితః స్వరాట్ ॥ 21

కాని అత్రిమహర్షిచే ప్రేరేపితుడై కోపముతో బాణమునెక్కు పెట్టగా ఆ రూపమును, గుఱ్ఱమును విడిచి ఇంద్రుడు అంతర్ధానము చెందెను. 21

శ్లో॥ వీరస్స్వాశ్వముపాదాయ పితుర్యజ్ఞమథావ్రజత్ ।
తదవద్యం హరేరూపం జగృహుర్జ్ఞాన దుర్బలాః ॥ 22

టీ:- వీరఇతి. అవ్యదం నిందితంరూపం మందప్రజ్ఞాఃజగృహుః. 22

వీరుడు గుఱ్ఱమును తీసుకొని తండ్రి చేయుచున్న యజ్ఞము వద్దకు వెళ్ళెను. ఇంద్రుడు విడిచిన నిందితమైన ఆ రూపమును బలహీనమైన జ్ఞానము కలవారు స్వీకరించిరి. 22

శ్లో॥ యాని రూపాణి జగృహ ఇంద్రో హయ జిహీర్షయా ।
తాని పాపస్య షండాని లింగం షండమిహోచ్యతే ॥ 23

టీ:- తదేవ పాషండనామ నిరుక్త్యా దర్శయతి. యానీతి. బహు వచనేన చ అన్యాన్యపి గృహీతానీత్యుక్తం. 23

ఇంతవరకు ఇంద్రుడు గుఱ్ఱమును దొంగలించాలని ఏ ఏ రూపములను స్వీకరించెనో అవన్ని కూడా పాఖండములే. పా యనగా పాపములు, ఖండమనగా వాటి గుర్తులు పాపచిహ్నములని అర్థము. 23

శ్లో॥ ఏవమింద్రే హరత్యశ్వం వైన్యయజ్ఞ జిఘాంసయా ।
తద్గృహీత విసృష్టేషు పాషండేషు మతిర్నృణామ్ ॥ 24

టీ:- తత్రప్రభృతి పాషండమార్గాః ప్రవృత్తా ఇత్యాహ-ఏవమితి. తేన గృహీతేషు పునర్విసృష్టేషు. 24

అప్పుడి నుండి పాఖండ మార్గములేర్పడినవని చెప్పుతూ!

పృథు చక్రవర్తి యజ్ఞమును భంగపరచాలని గుఱ్ఱమును దొంగిలించడానికి ఇంద్రుడు ఏ ఏ రూపములను స్వీకరించి విడిచినాడో ఆ పాఖండ రూపములందు (మానవులకు చిత్తము) స్వీకరించి విడచిన రూపములు, నగ్నులు, జైనులు; ఎఱ్ఱబట్ట ధరించినవారు, బౌద్ధులు ; ఆదిశబ్దము చేత మొదలగు వారనగా కాపాలికాదులు. నగ్నాదుల యందు ధర్మములే కనబడును కానీ ధర్మము కాదు. వారిమాటలు వింటునప్పుడు అనాలోచిత, రమణీయములై, హేతు యుక్తులయందు చాతుర్యము కలిగినవై యుండును. వారియందు సామాన్యముగా జనులు భ్రాంతి పొందుదురు. (24-25)

శ్లో॥ ధర్మ ఇత్యుప ధర్మేషు నగ్న రక్త పటాదిషు ।
ప్రాయేణ సజ్జతే భ్రాంత్యా పేశలేషు చ వాగ్మిషు ॥ 25

శ్లో॥ తదాభిజ్ఞాయ భగవాన్పృథుః పృథుపరాక్రమః ।
ఇంద్రాయ కుపితో భాణమాధత్తోద్యతకార్ముకః ॥ 26

టీ:- ధర్మ ఇతి. నగ్నాః జైనాః రక్తపటాః బౌద్ధాః ఆదిశబ్దేన కాపాలికాదయః తేషు ఉపధర్మేషు ధర్మ ఏవాయమితి సజ్జత ఇతి ద్వయోరేకాన్వయః. పేశలేషు ఆపాతతో రమ్యేషు వాగ్మిషు హేతూక్తిచతురేషు. (25-26)

విపులమైన పరాక్రమము కలిగిన భగవాన్ పృథు ఈ విషయము తెలుసుకొని విల్లు ఎత్తి ఇంద్రుడిపై బాణమునెక్కు పెట్టెను. 26

శ్లో॥ తమృత్విజశ్శక్రవధాభిసంధితం
విచక్ష్య దుష్ప్రేక్ష్యమసహ్యరంహసమ్ ।
నివారయామాసురహో మహామతే న
యజ్యతేఽత్రాన్యవధః ప్రచోదితాత్ ॥ 27

టీ:- తదితి. శక్రవధే అభిసంధితం కృతాభిప్రాయం. ప్రచోదితాత్పశోర్వధాదన్యస్య వధః తవ న యుజ్యతే. 27

ఇంద్రుడిని చంపాలనే అభిప్రాయము కలిగిన, చూడశక్యము కాని వేగముగల బాణమునెక్కుపెట్టిన ఆ పృథువును చూచి ఋత్విక్కులు అయ్యో! ఓ బుద్ధిమంతుడా! ఈ యజ్ఞదీక్షలో వేదముచేత విధింపబడిన పశు వధకంటే వేరు వధను చేయరాదు అని నివారించిరి. 27

శ్లో॥ వయం మరుత్వంతమిహార్థనాశకం
హ్వయామహే త్వచ్ఛ్రవసాహతత్విషమ్ ।
అయాతయామోపహుతై స్తమగ్నయే
ప్రసహ్య రాజన్ జుహవామ తేఽహితమ్ ॥ 28

టీ:- తద్వధం తు వయం కరిష్యామ ఇత్యాహుః. వయమితి. వయమిహ యజ్ఞే. అర్థం పశుం నాశయతీత్యర్థనాశకం యజ్ఞనాశకం త్వత్కీర్త్యైవ హత ప్రభమింద్రమాహ్వయామహే. కైః అయాతయామైః అగతీవీర్యైః ఉపహూతైః ఆహ్వానమంత్రైః అనంతరం తే తవ అహితం జుహువామ హోష్యామ. 28

ఆ ఇంద్రవధను మేము చేసెదము అంటూ ఇక్కడ యజ్ఞమును చెడగొట్టిన, నీ కీర్తి చేతనే తేజోహీనుడైన ఇంద్రుడిని ఆహ్వానించెదము. ఇంద్రుడిని ఎట్లు పిలిచెదరు? అనగా రాజా! శక్తి ఏమాత్రము తగ్గని ఆహ్వాన మంత్రములచే పిలిచి, నీకు చెడు చేయాలనుకొన్న ఇంద్రుడిని బలవంతముగా హోమము చేసెదము. 28

శ్లో॥ ఇత్యామంత్ర్య క్రతుపతిం విదురాస్యర్త్విజోరుషా ।
స్రుగ్ఘస్తాన్ జుహ్వతోఽభ్యేత్య స్వయంభూః ప్రత్యషేధత ॥ 29

టీ:- ఇతీతి. అస్య పృథోః స్రుక్ హస్తే యేషాం తాన్. 29

ఓ విదురా! ఈ విధముగా యజ్ఞ యజమానియైన పృథువును ఒప్పించి (పృథువుయొక్క) ఋత్విక్కులు కోపముతో సృక్కులు చేతిలో తీసుకొని హోమము చేయుచుండగా బ్రహ్మదేవుడు వచ్చి వారిని నివారించెను. 29

శ్లో॥ న వధ్యో భవతామింద్రో యద్యజ్ఞో భగవత్తనుః ।
యం జిఘాంసథ యజ్ఞేన యస్యేష్టాస్తనవస్సురాః ॥ 30

టీ:- నేతి యమింద్ర యజ్ఞేన జిఘాంసథ. యజ్ఞేన ఇష్టాస్సర్వేసురాః యస్య తనవః. సః ఇంద్రః. భవతామవధ్యః వధార్హో న భవతి. యత్. యస్మాత్. యజ్ఞో నామాయమింద్రః భగవతస్తనుః అవతారః. శ్లో. 'స యామాద్యైస్సురగణైరపాత్స్వాయంభువాంతర'మిత్యుక్తత్వాత్. 30

ఏ ఇంద్రుడిని యజ్ఞము ద్వారా చంపుతారు? యజ్ఞములద్వారా పూజితులైన సర్వదేవతలు ఎవరి యొక్క శరీరములో ఆ ఇంద్రుడు వధార్హుడు కాడు. ఏ కారణము చేతనైనా యజ్ఞుడను పేరుగల ఈ ఇంద్రుడు భగవంతుడి అవతారమే ఆకూతి యందు ఋచికి యజ్ఞుడు పుట్టినాడు. ఆ స్వాయంభువ మన్వంతరమును యమాది సుర గణములతో శ్రీహరి కాపాడెను. 30

శ్లో॥ తదిదం పశ్యత మహద్ధర్మవ్యతికరం ద్విజాః ।
ఇంద్రేణానుష్ఠితం రాజ్ఞః కర్మైతద్విజిఘాంసతా ॥ 31

టీ:- అతో బలీయసా తేన సఖ్యమేవ కర్తవ్యం. అన్యథా భూయః పాషండం ప్రక్ష్యతీత్యాశయేనాహ-తదితి. తదిదమింద్రేణానుష్ఠితం. మహదన్యాయ్యం. పశ్యత తత్కిమిత్యపేక్షాయమాహ. ధర్మస్య వ్యతికరం విపర్యయం. పాషండపథం. 31

ఓ బ్రాహ్మణోత్తములారా! రాజు యజ్ఞమును చెడగొట్టడానికి ఇంద్రునిచే చేయబడిన గొప్పతప్పును చూడండి, ఏమాతప్పు? ధర్మమునకు వ్యతిరేకమైన పాఖండ మార్గమును సృష్టించడమే. అందుకొరకు బలవంతుడైన ఇంద్రుడిచే స్నేహమే చేయాలి లేదా ఒకవేళ ఇంకా ఎన్నో ఇట్టి రూపాలను విడిచినాడనుకోండి అపుడు పాఖండ మతములు చాలా కాగలవు. 31

శ్లో॥ పృథుకీర్తేః పృథోర్భూయాత్తర్హ్యే కోన శతక్రతుః ।
అలం తే క్రతుభిస్స్విష్టైర్యద్భవాన్మోక్షధర్మవిత్ ॥ 32

టీ:- తర్హి కిమత్ర యుక్తమిత్యత ఆహ-పృథోరితి. ఏకేన ఊనం శతం యస్మిన్. తాదృశః క్రతుః ప్రయోగః పృథోర్భూయాత్. పృథురితి పాఠే ఏకోన శతం క్రతవో యస్య తాదృశోఽపి పృథుః. మహేంద్రాత్ పృథుకీర్తిర్భూయాదిత్యర్థః. తదేవం ఋత్విజః ప్రత్యుక్త్వా పృథుం ప్రత్యేవాహాలమితి. 32

మరి యుక్తమేమనగా విపులమైన కీర్తి కలిగిన పృథువునకు ఒకటి తగ్గి వందవ యజ్ఞము అగుగాక! లేదా పృథుః అన్న పాదం స్వీకరించిన ఒకటి తక్కువ వంద యజ్ఞములు ఎవరికో అతడు పృథువు. ఆ పృథువు ఇంద్రుడికన్నా విపులమైన కీర్తి కలవాడు అగుగాక! అని ఋత్విక్కులతో మాట్లాడి, పృథువుతో మాట్లాడుచున్నాడు. రాజా! నీచే చక్కగా చేయబడిన ఈ యజ్ఞములు చాలు. నీవు మోక్ష ధర్మమును తెలిసినవాడవు (అనగా నీకు ఈ కర్మల ద్వారా ప్రత్యేక ప్రయోజనము లేదు. మోక్షధర్మములను అనుష్ఠించుము అల్పఫల ప్రయోజన ములైన ఈ కర్మలు ఎందుకు?) 32

శ్లో॥ నైవాత్మనా మహేంద్రాయ రోషమాహర్తుమర్హసి ।
ఉభావపి హి భద్రంత ఉత్తమ శ్లోకవిగ్రహౌ ॥ 33

టీ:- నేతి. ఆత్మనైవ. ఆత్మనే ఇంద్రాయ రోషం కర్తుం నార్హసి తత్ర హేతుః ఉభావపీతి. 33

నీవే అయిన (నీ స్వరూపమే అగు) ఇంద్రుడియందు కోపము వలదు. కారణమేమన మీరిద్దరు కూడా పవిత్రమగు కీర్తి కలిగిన భగవానుడి అవతారములే, నీకు మంగళమగుగాక! 33

శ్లో॥ మాస్మిన్మహాభాగ కృథాస్మ ్సచింతా
న్నిశామయాస్మద్వచ ఆదృతాత్మ ।
యద్ధ్యాయతో దైవహతం తు కర్తుం
మనోఽతిరుష్టం విశతే తమోఽంధమ్ ॥ 34

టీ:- తథాపి క్రతుసమాప్తిరేవ ధ్యాయంతం ప్రత్యాహ–మాస్మిన్నితి. అస్మిన్ యజ్ఞవిఘ్నే చింతాం మాస్మకృథాః యత్ యస్మాత్ దైవహతం శౌర్యాది.కార్యం కర్తుం ధ్యాయతః. మనః న సునిశ్చితం భవతి.అతి రుష్టం సత్ అంధం తమః మోహం విశతి న తు శాంతిం లభతే. 34

అయినప్పటికి యజ్ఞ సమాప్తిని గూర్చి ఆలోచించుచున్న పృథువు ను గూర్చి అంటున్నాడు. మహారాజా! ఈ యజ్ఞము విఘ్నమైనదని చింతించకుము. ఆదరముతో గూడిన మనస్సుచే మా మాటలు వినుము! ఏలయనగా దైవముచే విఘ్నము కలిగింపబడిన పనిని చేయాలని ఆలోచించినచో నిశ్చయముగా మనస్సు క్రుద్ధమై మోహమున పడును. శాంతి లభించదు. 34

శ్లో॥ క్వతుర్విరమతామేష దేవేషు దురవగ్రహః ।
ధర్మ వ్యతికరో యత్ర పాషండైరింద్రనిర్మితైః ॥ 35

టీ:- క్రతురితి. అత ఏవ తవ క్రతుర్విరమతు. నను ఇంద్రః కిమితి న నివార్యతే అత ఆహ. యతః దేవేషు దురవగ్రహః దురాగ్రహో భవతీతి యత్ర క్రతౌ. 35

కావుననే నీ యజ్ఞము నిలుపుము, మరి ఇంద్రుడిని ఎందుకు నివారించడం లేదు? కారణమేమనగా దేవతలకు మొండి పట్టుదల ఉంటుంది. యజ్ఞము యందు ఇంద్రనిర్మితులైన పాఖండులచే ధర్మమునకు ముప్పు వాటిల్లును కదా! 35

శ్లో॥ ఏభిరింద్రోపసంసృష్టైః పాషండైర్హారిభిర్జనమ్ ।
హ్రియమాణం విచక్ష్వైనం యస్తే యజ్ఞధ్రుగశ్వముట్ ॥ 36

ఇంద్రుడి మొండిపట్టువల్ల జరుగుచున్న అనర్థమును చూడమంటూ ఏ ఇంద్రుడు నీ అశ్వమును దొంగలించెనో, నీ

టీ:- ఇంద్ర దురాగ్రహకృతం అనర్థం పశ్యేత్యాహ-ఏభిరితి. ఏభిరింద్రేణ ఉపసంసృష్టైః అధిష్ఠితైః హోరిభిశ్చిత్తాకర్షకైః యః ఇంద్రఃతే అశ్వం ముష్ణాతీతి తథా. యజ్ఞాయ ద్రుహతీతి తథా.తేన సంసృష్టైః. 36

యజ్ఞమునకు ద్రోహము చేయుచున్నాడో, ఆ ఇంద్రునిచే ధరింపబడి విడువబడిన పాపపు గుర్తులు గల చిత్తాకర్షములైన రూపములు వాటికి ఆకర్షితులైన జనమును చూడుము. 36

శ్లో॥ భవాన్పరిత్రాతుమిహావతీర్ణో
ధర్మం చ నానాసమయానురూపమ్ ।
వేనా పచారాదవ లుప్తమద్య
తద్దేహతో విష్ణుకలాసి వైన్య ॥ 37

టీ:- తతో మమ కిమితిచేత్తత్రాహ-ద్వాభ్యాం. భవానితి. సాంఖ్య యోగాది నానా సిద్ధాంతానురూపం ధర్మం. వేనస్యాన్యాయాలుప్తం పరిత్రాతుం తద్దేహాత్. విష్ణోః కళైవ త్వమవతీర్ణోఽసి. 37

జనులు ఆకర్షియులైతే నాకేమిటంటావేమో! నీవు జనులయొక్క సమయానురూపమైన అనగా సాంఖ్యయోగాది నానాసిద్ధాంతాను రూపమైన ధర్మమును పరిరక్షించడానికి ఇక్కడ అవతరించినావు. వేనుడి తప్పిదముల వల్ల ఆ ధర్మములు లుప్తమైనవి. వాటిని పరిరక్షించడానికి వేనుడి దేహమునుండి విష్ణుభగవానుడి అంశతోనే నీవు అవతరించినావు. 37

శ్లో॥ సత్వం విమృశ్యాస్య భవం ప్రజాపతే
స్సంకల్పనాం విశ్వసృజాం పిపిప్రుహి ।
ఐంద్రీం చ మాయాముపధర్మమాతరం
ప్రచండపాషండపథం ప్రభో జహి ॥ 38

టీ:- స ఇతి. అస్య విశ్వస్య భవం ఉద్భవం విచార్య యైరుత్పాదితోఽసి. తేషాం విశ్వసృజాం సంకల్పం వ్యవసితం పిపిప్రుహీత్యార్షప్రయోగః

ఓ మహారాజా! అట్టి నీవు ఈ జగత్తుయొక్క పుట్టుకను విచారించి, భృగ్వాది మహర్షులు వేనుని బాహువుల మథించుట ద్వారా పుట్టిన నీవు పుట్టుకకు వారు ఏమి సంకల్పించిరో దానిని పూరించుము. "పిపిపృహి" అనునది ఋషిప్రయోగం, (వ్యావహారిక సంస్కృతభాషలో నైతే "పిపృహి, పిపూర్థి" అనికాని ఉండాలి. "అస్తు") అతితీవ్రమైనది పాఖండ మార్గము. ఈ మార్గము అధర్మ జననియైన ఐంద్రీమాయా. ఆ మాయను జయించుము. 38

పూరయేత్యర్థః. ప్రచండో యః పాషండమార్గః. స ఏవ ఐంద్రీమాయా. ఉపధర్మ మాతా అధర్మ జననీ తాం జహి. 38

### మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఇత్థం సలోక గురుణా సమాదిష్టో విశాంపతిః ।
తథా చ కృత్వా వాత్సల్యం మఘోనా చాపి సందధే ॥ 39

టీ:- ఇత్థమితి. తథా కృత్వా యజ్ఞాగ్రహం త్యక్త్వా హిత్వా వాత్సల్యం స్నేహం చ కృత్వా. ఇంద్రేణ సహ సంధానం కృతవాన్. 39

### మైత్రేయుడు ఈ విధముగా పలికెను

ఈ విధముగా బ్రహ్మదేవుడిచేత ఆదేశింపబడినవాడై, రాజు ఆ విధముగానే యజ్ఞమును చేస్తాననే పట్టును విడిచి, ఇంద్రుడితో స్నేహమును చేసి సంధిని చేసుకొనెను. 39

శ్లో॥ కృతావభృథ్యస్నానాయ పృథవే భూరికర్మణే ।
వరం దదుస్తేవరదాయేతద్బర్హిషి తర్పితాః ॥ 40

వరములనిచ్చే దేవతలు ఈ యజ్ఞమందు హవిర్భాగములను స్వీకరించి తృప్తులై; చాలా సత్కర్మలనాచరించి అవభృథ సంబంధమైన స్నానమును చేసిన పృథువునకు వరములనిచ్చిరి. 40

శ్లో॥ విప్రాస్సత్యాశిషస్తుష్టాశ్రద్ధయా లబ్ధదక్షిణాః ।
ఆశిషో యయుజుః క్షత్తదిరాజాయ సత్కృతాః ॥ 41

టీ:- కృతేతి. కృతం అవభృథసంబంధి స్నానం యేన తస్మై.(40-41)

ఓ విదురా! అమోఘమైన ఆశీర్వచనములు గల ఆ బ్రాహ్మణులు శ్రద్ధగా దక్షిణలు పొంది, ఆదిరాజైన పృథువుచే సత్కృతులై ఆశీస్సుల నిచ్చిరి. 41

శ్లో॥ త్వయాదృతా మహాబాహో సర్వ ఏవ సమాగతాః ।
పూజితా దానమానాభ్యాం పితృదేవర్షి మానవాః ॥ 42

టీ:- తతస్తుష్టానాం వాక్యం త్వమేతి. 42

సంతుష్టులైన ఆ బ్రాహ్మణులు ఇట్లనిరి! గొప్ప బాహువులుగల ఓ మహారాజా! నీచే పిలువబడిన పితరులు, దేవతలు, మానవులు అందరూ వచ్చిరి. దానములచేత సత్కారములచేత పూజితులైరి. (అని సత్య వాక్యమును పలికిరి. సత్యా ఏతా ఆశిషస్సంతు) 42

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,
ఏకోనవింశోఽ ధ్యాయః

శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు
పంతొమ్మిదవ అధ్యాయము సమాప్తము.

## వింశోఽధ్యాయః

శ్లో॥ వింశే తు విష్ణునా సాక్షాత్ పృథోర్యజ్ఞేఽనుశాసనమ్ ।
వరదాన ప్రసంగేన ప్రీతిశ్చాన్యోన్యమీర్యతే ॥

## 20వ అధ్యాయము

ఈ ఇరవదవ అధ్యాయమున పృథువు యజ్ఞమందు విష్ణుభగవానుని ఆదేశము, వరదాన ప్రసంగమున, పృథు విష్ణువుల అన్యోన్య ప్రేమను గూర్చి చెప్పబడుచున్నది.

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ భగవానపి వైకుంఠస్సాకం మఘవతా విభుః ।
యజ్ఞైర్యజ్ఞపతిస్తుష్టో యజ్ఞభుక్తమభాషత ॥ 1

టీ:- భగవానితి. మఘవతా సాకం ఇంద్రేణ సహవర్తమానః. 1

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను**

విగతః కుంఠః నాశః = నాశములేనివాడు భగవానుడు. యజ్ఞమున హవిర్భాగములను స్వీకరించువాడు, యజ్ఞపతి, యజ్ఞములచే సంతుష్టి పొందినవాడు, ఇంద్రసహితుడై పృథువును గూర్చి ఇట్లు మాట్లాడెను. 1

**శ్రీభగవానువాచ**

శ్లో॥ ఏష తే కారిషద్భంగం హయమేధశతస్య హ ।
క్షమాపయత ఆత్మాన మముష్య క్షంతుమర్హసి ॥ 2

టీ:- ఏష ఇతి. ఆత్మానం తాం క్షమాపయతః క్షమాం కారయతః. అముష్య. 2

**భగవానుడు ఈవిధంగా పలికెను**

ఈ ఇంద్రుడు నీ నూరవ అశ్వమేధ యజ్ఞమును భంగపరచినాడు ఈతడు నిన్ను క్షమాపణను కోరుచున్నాడు. ఈతనిని క్షమించుటకు అర్హుడవై ఉన్నావు. 2

శ్లో॥ సుధియస్సాధవో లోకే నరదేవ నరోత్తమాః ।
నాభిద్రుహ్యంతి భూతేభ్యో యర్హి నాత్మా కళేబరమ్ ॥ 3

ఓ నరపతీ! మంచిబుద్ధి కలిగి సాధు స్వభావము కలిగిన నరోత్తములు ప్రాణులకు ద్రోహము చేయరు. ఏలననగా ఈ శరీరము ఆత్మకాదు కనుక, దేహాత్మ బుద్ధి లేదు కనుక. 3

శ్లో॥ పురుషా యది ముహ్యంతి త్వాదృశా దేవమాయయా ।
క్రమ ఏవ పరం జాతో దీర్ఘయా వృద్ధసేవయా ॥ 4

టీ:- సుధియ ఇతి. యర్హి యస్మాత్. కళేబరం ఆత్మాన భవతి. అతస్తదభి మానేన భూతాని నాభిద్రుహ్యంతి. (3-4)

నీవంటి వివేకులైనవారు గూడా దైవమాయచే ద్రోహాదుల యందు ప్రవర్తించినచో అప్పుడు వారు, బహుకాలము నుండి జ్ఞానుల సేవచేత చేసిన అభ్యాసమువలన శ్రమమాత్రమే మిగులును. 4

శ్లో॥ అతః కాయమిమం విద్వానవిద్యా కామకర్మభిః ।
ఆరబ్ధ ఇతినైవాస్మిన్ ప్రతిబుద్ధోఽనుషజ్జతే ॥ 5

టీ:- అత ఇతి. అవిద్యా స్వరూపాజ్ఞానం. తతః కామః తతః కర్మ. తైరారబ్ధఇతి. విద్వాన్ అత ఏవ ప్రతిబుద్ధః. ఆత్మజ్ఞః అస్మిన్నైవాను -షజ్జతే. 5

ఈ శరీరము అవిద్యా, కామకర్మలద్వారా ఆరంభింపబడినదని తెలిసినవాడు విద్వాంసుడు. ఆత్మజ్ఞుడైనవాడు ఈ దేహముయందే ఆసక్తి కలవాడై ఉండడు. అవిద్యయనగా తన యథార్థమైన ఆత్మ స్వరూపము తెలియకపోవుటే. అజ్ఞానము కలవాడికి కోరికలు ఉంటాయి. వాటికొరకు కర్మచేస్తాడు. కర్మ శరీరము ఉంటేనే చేయగలడు. శరీరగతమైన ఆ యా కర్మలను అనుసరించి ఆ యా దేహములు కలుగును. బీజాంకురములవలె కర్మ శరీరమునకు కారణము, శరీరము కర్మద్వారా వస్తుంది. 5

శ్లో॥ అసంసక్తశ్శరీరేఽస్మిన్నమునోత్పాదితే గృహే ।
అపత్యే ద్రవిణే వా పి కః కుర్యాన్మమతాం బుధః ॥ 6

టీ:- తథాపి పుత్రాదిష్వాసక్తస్య మమభూత ద్రోహేణ చ సంగో భవేత్తత్రాహ-అసంసక్త ఇతి. 6

అయినప్పటికీ పుత్ర కళత్రాది మమత్వముచేత, ప్రాణి హింస చేత ఆసక్తి కలుగవచ్చునని అంటున్నాడు. ఈ శరీరముయందు ఆసక్తి పెట్టుకోని విద్వాంసుడు ఎవ్వడు? ఈ శరీర సంబంధముద్వారా కలిగిన ఇల్లు, సంతానము, ధనము వీటియందు మమకారము కలిగి యుండును. 6

శ్లో॥ ఏకశ్శుద్ధస్స్వయం జోతిర్నిర్గుణోஉసౌ గుణాశ్రయః ।
సర్వగో సంవృతస్సాక్షీ నిరాత్మాత్మాత్మనః పరః ॥ 7

టీ:- ప్రతిబోధక్రమం వివృణ్వన్. దేహేஉనుషంగాభావమాహ ద్వాభ్యాం-ఏక ఇతి. అసావాత్మా అనాత్మనః. దేహాత్ పరః భిన్నః తత్ర నవధా వైలక్షణ్యేన భేదం సాధయతి-ఏక ఇతి. నవభిః పదైః. దేహోஉపి బాలాయువాదిభేదాద్యనేకః మలినశ్చ అనాత్మా జడశ్చ సగుణశ్చ. స్వ కారణభూత గుణాశ్రితశ్చ పరిచ్ఛిన్నశ్చ గృహాదిభిరావృతశ్చ. దృశ్యశ్చ. సాత్మాచ. ఆత్మా తు నైవం అతో భిన్నః. 7

ప్రతిబోధ క్రమమును వివరిస్తూ దేహముయందు అనాసక్తిని చెప్పుచున్నాడు, ఈ ఆత్మ దేహాదులకంటే భిన్నమైనది. దేహాదులకు ఆత్మకు తొమ్మిది విధములైన వైలక్ష్యణ్యముచే భేదమును చూపెట్టు చున్నాడు. ఆత్మ - 1. నిత్యము. 2. శుద్ధము 3. స్వయంప్రకాశము. 4. నిర్గుణము 5. గుణములకధిష్ఠానము 6. సర్వవ్యాపకము 7. ఆవరింపబడనది 8. సాక్షి 9. స్వగతభేదము లేనిది. (7)

శ్లో॥ య ఏవం సంతమాత్మానమాత్మ సం వేదపూరుషః ।
నాజ్యతే ప్రకృతి స్థోஉపి తద్గుణైస్స మయిస్థితః ॥ 8

టీ:- య ఇతి ఆత్మస్థం స్వస్మిన్ స్థితం ప్రకృతి స్థోஉపి స్వదేహ స్థోஉపి. తద్వికారైః న లిప్యతే యతస్సమయి బ్రహ్మణి స్థితః. 8

దేహములు - 1. బాల్య, యువాది భేదములచే అనేకములు. 2. మలినములు. 3. జడము. 4. సగుణము. 5. తనకు కారణమైన సత్త్వాది ఆశ్రయించనది. 6. పరిచ్ఛినమైనది. 7. గృహాదులచే ఆవరింపబడినది. 8. దృశ్యము. ఇవి శరీర వైలక్షణ్యములు. ఆత్మ వీటికంటే వేరైనది. ఏ వ్యక్తి అయితే తనయందుగల ఆత్మ ఇట్టిదని తెలిసికుంటాడో (అనగా సత్‌స్వరూపమని తెలిసికొంటాడో) దేహముయందు ఉన్నప్పటికి దేహగుణములైన సత్త్వాదులతో అంటడు. ఎందుకు అంటడు? అనగా అతడు బ్రహ్మయందు గలడు (బ్రహ్మజ్ఞాని) కనుక. 8

శ్లో॥ యస్స్వధర్మేణ మాం నిత్యం నిరాశీః శ్రద్ధయాన్వితః ।
భజతే శనకైస్తస్య మనో రాజన్ప్రసీదతి ॥ 9

టీ:- ఇయమవస్థా కస్యోత్పద్యత ఇత్యపేక్షాయమాహ-చతుర్భిః. 9

శ్లో॥ పరిత్యక్తగుణస్సమ్యగ్దర్శనో విశదాశయః ।
శాంతిం మే సమవస్థానం బ్రహ్మకైవల్యమశ్నుతే ॥ 10

టీ:- పరిత్యక్తేతి. యర్హి విశదాశయః ప్రసన్నమనాః. తదా పరిత్యక్త గుణస్సన్ సమ్యగ్దర్శనో భూత్వాశాంతి మశ్నుతే. శాంతిమేవాహ - మమ సమ్యగౌదాసీన్యేనావస్థానమేవ బ్రహ్మతదేవ కైవల్యమశ్నుతే. 10

శ్లో॥ ఉదాసీనమివాధ్యక్షం ద్రవ్యజ్ఞాన క్రియాత్మనామ్ ।
కూటస్థమిమమాత్మానం యో వేదాప్నోతి సోభవమ్ ॥ 11

టీ:- సమ్యగ్దర్శన మేవాహ - ఉదాసీనమితి. దేహజ్ఞాన కర్మేంద్రియ మనసా మధ్యక్షమివ స్థితమాత్మానం యో వేద. 11

మరి ఆత్మస్థితి ఎవరికి కలుగుతుంది? అనగా ఎవరైతే స్వవర్ణాశ్రమ ధర్మములచేత, కోరికలు లేనివాడై శ్రద్ధగలవాడై ఎల్లప్పుడూ నన్ను సేవిస్తాడో అతడికి మనస్సు నిదానముగా శుద్ధి అవుతుంది. 9

మనస్సు శుద్ధివల్ల కలిగే ప్రయోజనమేమి? అనగా ఎవరైతే ప్రసన్నమైన మనస్సు కలిగిఉంటారో అప్పుడు సత్త్వాదులయందు అహంత్వ, మమత్వాదులను విడిచిపెట్టి యథార్థ దర్శనము వలన అనగా ఆత్మ దర్శనము వలన శాంతిని పొందుతాడు. శాంతియనగా చక్కటి ఉదాసీన భావము కలిగి ఉండడమే. అదియే బ్రహ్మ, అదియే ఆత్మరూపమైన శాంతి. 10

సమ్యక్ దర్శనమునే వాఖ్యానిస్తున్నాడు. దేహము, జ్ఞానేంద్రియ -ములు, కర్మేంద్రియములు, మనస్సు వీటికి ద్రష్ట అయినప్పటికి ఈ ఆత్మను ఎవరైతే సాక్షి మాత్రుడని, నిర్వికారుడని తెలుసుకుంటారో వారే శుద్ధమైన, నాశరహితమైన బ్రహ్మత్వము పొందుతారు. 11

శ్లో॥ భిన్నస్య లింగస్య గుణప్రవాహో
ద్రవ్యక్రియాకారకచేతనాత్మనః ।
దృష్టాసు సంపత్సు విపత్సు సూరయో
న విక్రియంతే మయిబద్ధసౌహృదాః ॥ 12

టీ:- సంసారిణః కూటస్థత్వం కథమత ఆహ-భిన్నస్యేతి.భిన్నస్య లింగస్య దేహస్య గుణప్రవాహస్సంసారః. భిన్నత్వే హేతుః ద్రవ్యాద్యాత్మ కస్య తత్ర చేతనాచిదాభాసః అతః దృష్టాసు ప్రాప్తాసు సంపత్సు విపత్సుచ.హర్షశోకాదిభిర్న విక్రియంతే వికారం న ప్రాప్నువంతి. 12

శ్లో॥ సమస్సమానోత్తమమధ్యమాధమ
స్సుఖే చ దుఃఖే చ జితేంద్రియాశయః ।
మయోప క్లిప్తాఖిల లోకసంయుతో
విధత్స్వ విరాఖిలలోక రక్షణమ్ ॥ 13

టీ:- సమ ఇతి. త్వం చ సూరిః అతస్సుఖే చ దుఃఖే చ సమస్సన్. సమానాః ఉత్తమమధ్యమాధమాః యస్య జితానీంద్రియాణి ఆశయశ్చ యేన.స త్వమఖిలలోకరక్షణం విధత్స్వ. కథమేకేన మయారక్షణం కర్తుం శక్యం తత్రాహ-మయా ఈశ్వరేణ ఉపక్లృప్తాస్సంపాదితాః అఖిలలోకాః అమాత్యా దయః తైస్సంయుతః. 13

సంసారికి ఎట్లు నిర్వికారత్వము సిద్ధిస్తుంది? అనగా మహాభూతములు, ఇంద్రియములు, ఇంద్రియ అధిష్ఠాతృ దేవతలు చిదాభాస యుక్త అంతఃకరణము వీటి సముదాయ రూపమైన ఆత్మకంటే భిన్నమైన లింగ శరీరమునకే ఈ సంసారము. నాయందు దృఢమైన భక్తిగల విద్వాంసులు సంపదలు కనపడినప్పుడు ఆపదలు ఎదురైనప్పుడు ఎట్టి మార్పును పొందరు. (ఈ అంతఃకరణావచ్ఛిన్న చైతన్యమే జీవుడు) అంతఃకరణము ప్రధానముగా బుద్ధి. దీనియందు మమత్వము కలిగిఉండడమే జీవలక్షణము. దీనికి కారణము అవిద్య. ఇదిలేని కేవల ఆత్మకు సంసారము లేదు. (అజ్ఞానములేనివానికి సంసారములేదు) 12

నీవు పండితుడవు. అందుకొరకు సుఖముయందు, దుఃఖము యందు సమభావమును కలిగియుండుము. ఉత్తములయందు, మధ్యములయందు, అధములయందు భేదదృష్టి లేక సమానదృష్టి కలిగి యుండుము. జయింపబడిన ఇంద్రియములు, అంతఃకరణము గలిగిన వాడవై నీవు అఖిలలోక రక్షణమును కలిగించుము. నా యొక్కడిచేతనే రక్షించుట ఎలా సాధ్యమవుతుంది? అంటే నాచే నిర్మితమైన మంత్రులు మొదలగువారిచే కూడుకొని సాధ్యపడుతుంది. 13

శ్లో॥ శ్రేయః ప్రజాపాలనమేవ రాజ్ఞో
యత్సాంపరాయే సుకృతాత్ షష్ఠమంశమ్ ।
హర్తాన్యథాహృతపుణ్యః ప్రజానామ
రక్షితా కరహారోఽఘమత్తి యత్ ॥ 14

టీ:- నను రక్షణం దండాదిసాపేక్షం అతస్తపః అన్యద్వా పుణ్యం కరిష్యామీతి చేదత ఆహ-శ్రేయ ఇతి. యత్ యస్మాత్ సాంపరాయే పరలోకే. ప్రజాభిః కృతాత్ సుకృతాత్. షష్ఠమంశం హర్తా హరిష్యతి. అరక్షణే దోషమాహ. అన్యథా ప్రజాభిర్హృతం పుణ్యం యస్య సః. ప్రజానామఘమత్తి పాపంభుంక్తే. అన్యథేత్యస్య వివరణం. కరహారస్సన్ అరక్షితా చేత్. 14

ప్రజాపాలన చేయాలంటే ప్రజలను రక్షించాలంటే దండములేక సాధ్యపడదు. వీటియందే కాలము గడిపితే నాకు పుణ్యాదులెట్లు సాధ్యము? అని అంటానేమో. ప్రజలను పాలించు రాజునకు శ్రేయస్సును కలుగును. రాజు పరలోకమునకేగిన పిమ్మట ప్రజలచే చేయబడిన పుణ్య కర్మలలో ఆరవ భాగము రాజు పొందుతాడు. కాని ఎవరైతే కేవలము కప్పములు కట్టించుకొంటూ ప్రజలను రక్షించడో అప్పుడు రాజు యొక్క పూర్వపుణ్యము ప్రజలకు పోగా రాజు ప్రజల పాపమునే అనుభవించును. 14

శ్లో॥ ఏవం ద్విజాగ్ర్యాను మతానువృత్త
ధర్మ ప్రధానోఽన్యతమో వితాఽస్యాః ।
హ్రస్వేన కాలేన గృహోపయాతాన్
ద్రష్టాసి సిద్ధానురక్త లోకః ॥ 15

టీ:- ఏవం చ మోక్షోఽప్యనాయాసేన భవిష్యతీత్యాహ-ఏవమితి. ద్విజాగ్ర్యాణామనుమతః అనువృత్తశ్చ. పరంపరాప్రాప్తో యో ధర్మస్స ఏవ ప్రధానం అర్థకామౌ తు ప్రాసాంగికౌ యస్య అన్యతమః

ఈ విధముగా మోక్షము గూడా రాజునకు అనాయాసముగా కలుగును అని చెప్పుతూ! శాస్త్ర జ్ఞానము కలిగిన బ్రాహ్మణులచే సమ్మతింపబడి పరంపరగా ప్రాప్తించిన ధర్మమును అదే ప్రధానముగా కలిగి అనగా అర్థ, కామములు ప్రాసంగికముగా (ధర్మము కలిగినపుడు అర్థ కామములు అవశ్యముగా సంప్రాప్తించును.) ప్రాప్తించగా ధర్మాదులయందు అనాసక్తుడై లేక ధర్మ ప్రధాన, వన్యతమః అను పాఠమును స్వీకరించిన ధర్మము ప్రధానముగా కలిగి, అర్థకామముల

అతిశయేనాన్యః ధర్మాదిష్వనాసక్త ఇత్యర్థః. ఐక్యపద్యపాఠే తు ధర్మ ప్రధానావన్యతమౌ అర్థకామౌ యస్యేత్యర్థః. అస్యాః పృథివ్యాః అవితాసన్ అల్పేన కాలేన గృహానాగతాన్ సనకాదీన్ ద్రష్టాసి ద్రక్ష్యసి. అనురక్తః లోకో యస్మిన్. 15

యందు అనాసక్తుడై ఈ భూమిని రక్షిస్తూ జనులను రంజింపజేస్తూ ఉంటే కొద్ది కాలములోనే నీ ఇంటికి వచ్చిన, సిద్ధపురుషులైన సనకాదులను, దర్శించగలవు. 15

శ్లో॥ వరంచ మత్కంచన మానవేంద్ర
వృణీష్వ తేఽహం గుణశీల యంత్రితః ।
నాహం మఖైర్వై సులభ స్తపోభి
ర్యోగేన వా యత్సమచిత్తవర్తీ ॥ 16

టీ:- వరమితి. మత్ మత్తస్సకాశాత్ కంచిద్వరం వృణిష్వ యతః గుణాః శమదమాదయః. శీలం నిర్మత్సరత్వాదిస్వభావః తైరహం యంత్రితః వశీకృతః. తద్రహితైస్తు మఖాదిభిర్నాహం సులభః యత స్సమంచిత్తం యేషాం తేష్వేవ వర్తితుం శీలం యస్సోఽహం. (16-17)

ఓ మహారాజా! నానుండి ఏదైన వరం కోరుము. నీ గుణ శీలములకు వశుడైనవాడను, గుణములనగా శమ దమాదులు, నిర్మత్సరాది స్వభావము కలిగి యుండడమే. వీటికి వశుడైనట్లుగా గుణశీలము లేని యజ్ఞములకుగానీ, తపస్సులకుగానీ, యోగములకు గానీ వశుడను కాను. ఏలయనగా నేను చిత్తముయందు స్వభావము గలవారియందే ప్రవర్తించెదను. 16

మైత్రేయ ఉవాచ

శ్లో॥ స ఇత్థం లోకగురుణా విష్వక్సేనేన విశ్వజిత్ ।
అనుశాసిత ఆదేశం శిరసా జగృహే హరేః ॥ 17

మైత్రేయుడు ఈవిధంగా పలికెను.

ఈ విశ్వమును జయించిన పృథువు లోకమునకు సన్మార్గములను చూపెట్టి అంతటా వ్యాపించిన కాంతులుగల భగవానుడిచే శాసింపబడినవాడై శ్రీహరి ఆజ్ఞను శిరసావహించి, గౌరవముగా అంగీకరించెను. 17

శ్లో॥ స్పృశంతం పాదయోః ప్రేమ్ణా వ్రీడితం స్వేన కర్మణా ।
శతక్రతుం పరిష్వజ్య విద్వేషం విససర్జహ ॥ 18

టీ:- స్పృశంతమితి. క్షమాపయితుం పాదయోః స్పృశంతం. స్వేన కర్మణా అశ్వాపహరణేన వ్రీడితం. ప్రేమ్ణా పరిష్వజ్య. 18

ఇంద్రుడు గుఱ్ఱమును ఎత్తుకుపోవడం మొదలగు తాను చేసిన పనులకు సిగ్గుపడి క్షమించుమని పాదములనంటగా పృథువు ద్వేషమును విడిచి ప్రేమగా ఆలింగనము చేసుకొనెను. 18

శ్లో॥ భగవానపి విశ్వాత్మా పృథునోపహృతార్హణః ।
సముజ్జిహానయా భక్త్యా గృహీతచరణాంబుజః ॥ 19

శ్లో॥ ప్రస్థానాభిముఖోఽప్యేనమనుగ్రహవిలంబితః ।
పశ్యన్పద్మపలాశాక్షోన ప్రతస్థేసుహృత్సతామ్ ॥ 20

టీ:- భగవానితి. ప్రస్థానేతి. భగవాన్ ప్రస్థానాభిముఖోఽపి అనుగ్రహేణ విలంబితస్సన్ న ప్రతస్థే ప్రయాణం న కృతవానితి ద్వయోరన్వయః. కథం భూతః ఉపహృతమర్పితమర్హణం యస్మై. సముజ్జిహానయా సముద్గచ్ఛంత్యా వర్ధమానయా భక్త్యా. గృహీతే చరణాంబుజే యస్య. పద్మపలాశవదక్షిణీ యస్య తథాభూతస్సన్ ఏనం పృథుం పశ్యన్. (19-20)

ఈ విశ్వమునకు ఆత్మమయుమైన పరమాత్మ యందు ప్రతిక్షణము పెరుగుచున్న భక్తి గలవాడైన పృథువుచేత భక్తిగా స్వీకరించబడిన చరణములు గలవాడై, అర్ఘ్యపాద్యాదులు పొంది పద్మములవంటి కన్నులు గలిగి, సజ్జనులకు మిత్రుడైన భగవానుడు వెళ్ళడానికి సిద్ధమైనప్పటికీ పృథువు ననుగ్రహించుట వలన ఆలస్యము చేస్తూ, పృథువును చూస్తూ వెళ్ళలేకపోయెను. (రెండు శ్లోకములకు కలిపి అన్వయము) (19-20)

శ్లో॥ స ఆదిరాజో రచితాంజలిర్హరిం
విలోకితుం నాశకదశ్రులోచనః ।
న కించనో వాచ చ బాష్పవిక్లబో
హృదోపగూహ్యాముమధాదవస్థితః ॥ 21

టీ:- భగవతస్తత్కృపాతిరేకముక్త్వా తస్య భక్త్యుద్రేకమాహ-ద్వాభ్యాం. స ఇతి. బాష్ప విక్లబత్వేన తూష్ణీమవస్థితస్సన్. అముం శ్రీహరిం హృదా ఉపగూహ్య అధాత్ ధృతవాన్. 21

భగవంతుడికి భక్తుడియందుగల గొప్పనైన కృపను చెప్పి పృథువు యొక్క భక్త్యుద్రేకమును గూర్చి చెప్పుచున్నాడు. ఆ ఆదిరాజైన పృథుచక్రవర్తి చేతులు జోడించినవాడై కన్నులలో నీరు నిండగా భగవంతుడు ఎదురుగా ఉన్ననూ చూడలేకపోయినాడు. కన్నీటిచే వ్యాకులుడై ఏమీ మాట్లాడలేక కేవలము చేతులు జోడించి చూస్తూ హృదయముతో ఆయనను (చుట్టివేసెను) కౌగలించుకొనెను. 21

శ్లో॥ అథావమృజ్యాశ్రుకలాం విలోక
యన్నతృప్త దృగ్గోచరమాహ పూరుషమ్ ।
పదా స్పృశంతం క్షితిమంస ఉన్నతే
విన్యస్తహస్తాగ్రమురంగవిద్విషః ॥ 22

టీ:- అథేతి. అతృప్తయోః దృశోః గోచరం విషయభూతం పదా క్షితం స్పృశంతమితి. అయం భావః-న ఖలు దేవాః పదా భువం స్పృశంతి. అతః కృపాపరవశో నూనం హరిరాత్మానం విస్మృతవానివేతి. అత ఏవ స్ఖలన పరిహారాయ గరుడస్య ఉన్నతే స్కంధే విన్యస్తం హస్తాగ్రం యేన తం. 22

అటుపిమ్మట కన్నీటిని తుడుచుకొని, ఎంత చూచినా తృప్తిగాని భగవద్రూపమును చూస్తున్నాడు. ఆ రూపము ఈ విధముగా యున్నది. గరుడ వాహనముపై కూర్చొని పాదముచే భూమిని స్పృశిస్తూ ఎత్తైన గరుత్మంతుడిపై ఒకచేతిని ఉంచిన ఆ పూర్ణస్వరూపుడు ఆయనతో పృథువు ఈ విధముగా పలికెను. నిజానికి దేవతల పాదములు భూమిని స్పృశించవు. వారి పాదములచే భూమిని తాకరు. కానీ కృపాపర-వశుడైన శ్రీహరి తననుతాను మరచిపోయి భూమిమీద పాదమును మోపినాడు. గరుడిపైన చేయి ఎందుకు ఉంచినాడనగా ఆ కృపాపర-వశమున ఎక్కడ జారునోయని ఆ విధముగా చేయివేసి పట్టుకున్నాడు. (22)

పృథురువాచ

శ్లో॥ వరాన్విభో త్వద్వరదేశ్వరాద్బుధః
కథం వృణీతే గుణవిక్రియాత్మనామ్ ।
యే నారకాణామపి సంతి దేహినాం
తానీశ కైవల్యపతే వృణే న చ ॥ 23

టీ:- వరం వృణీష్వేతి యదుక్తం తదసహమాన ఆహ-వరానితి. హే విభో వరదానాం బ్రహ్మాదీనామీశ్వరాద్వరప్రదాత్. త్వత్ త్వత్తస్స కాశాత్ బుధః కథం వరాన్ వృణీత కీదృశాన్ గుణైర్విక్రియత ఇతి భోగ్యానితి వా. తథా చేద్బుధ ఏవ న భవతీత్యర్థః. జుగిప్సితత్వా దపీత్యాహ- య ఇతి. బుధ ఏవాహమతో న వృణ ఇతి సముచ్చయాయ చకారః. 23

పృథువు ఈవిధంగా పలికెను

భగవానుడు వరం కోరుకొమ్మనగా దానిని సహించలేక పృథువు ఈ విధముగా పలుకుచున్నాడు. ఓ సర్వవ్యాపకా! బ్రహ్మాది దేవతలకు ఈశ్వరుడవై వరములిచ్చే నీ నుండి వివేకవంతుడైనవాడు ఎవడునూ వరములు కోరడు. ఈ వరములన్ని గూడా గుణవికారమైన ఆహంకారమే. ఆత్మయనుకొనే బ్రహ్మాది దేవతలకు లేదా దేహాభి-మానము కలవారికి యోగ్యమైన విషయములు. ఆ దేహాభిమానము నరకమును పొందిన కుక్క, నక్క మొదలగు వాటినుండి అన్ని నరదేహములయందు గూడా గలుగును. (నరకము దేహాదులకు కల్గును) అక్కడగూడా విషయములు గలిగియుండును. ఓ కైవల్యపతీ! నేనుగూడా నీ కృపచేత వివేకినే. కావున జుగుప్సితములైన వరములను కోరను. 23

శ్లో॥ న కామయేనాథ తదప్యహం క్వచి
న్నయత్ర యుష్మచ్చరణాంబుజాసవః ।
మహత్తమాంతర్హృదయాన్ముఖచ్యుతో
విధత్స్వ కర్ణాయుతమేష మే వరః ॥ 24

టీ:- కైవల్య పత ఇతి. సంబోధనాత్. కైవల్యం వరిష్యతీతి మా శంకీరి

ఓ దేవా! కైవల్యపతీ అన్నానని కైవల్యమును కోరుకొంటున్నానని అనుకుంటావేమో! అదిగూడా నాకు వద్దు. మహనీయులైన వారి ముఖములనుండి వెలువడిన నీ పాదపాద్మములనుండి స్రవించిన మకరందమయమైన యశస్సు యొక్క శ్రవణాది సుఖములేని మోక్షము నాకెందుకు? అది నేను కోరను. మరియేమి నీకు కావలెను? అంటే ఓ దేవా! నీ కీర్తిని వినడానికి పదివేల చెవులను ఇమ్ము. నాకు ఇదియే వరము. 24

త్యాహ-నేతి. మహత్తమానామంతర్హృదయాత్ ముఖద్వారేణ నిర్గతః భగవత్పదాంబుజ మకరందః. యశః శ్రవణాది సుఖం యత్రనాస్తి తాదృశం చేత్ కైవల్యం తర్హి తత్క్వచిత్ కదాచిదపి న కామయే తర్హి కిం కామయసే తదాహ. యశశ్శ్రవణాయ కర్ణానామయుతం విధత్స్వ. నను త్వదన్యః కోఽప్యేవం న వృతవానితి చేత్కిమన్య చింతయేత్యాహ - ఏష మేవరః. 24

శ్లో॥ స ఉత్తమశ్లోకమహన్ముఖచ్యుతో
భవత్పదాంభోజసుధాకణానిలః ।
స్మృతిం పునర్విస్మృతతత్త్వ వర్త్మనాం
కుయోగినాం నో వితరత్యలం వరైః ॥ 25

టీ:- ననుతర్హి కైవల్యాభావే రాగద్వేషాద్యాకులానాం భక్తి సుఖమపి న స్యాదిత్యా శంక్యాహ-స ఇతి. భవత్పదాంభోజసుధాయాః కణో లేశః తత్సంబంధీ యః అనిలస్సఏవ దూరాదపి కించిద్యశః శ్రవణ మాత్రమిత్యర్థః. విస్మృతం తత్త్వవర్త్మ యైః . కుయోగిభిః. తేషామపి పునః స్మృతిమాత్మజ్ఞానం వితరతి. అతో న ఖలు భక్తానాం రాగాది సంభవః అతః నోఽస్మాకం సారగ్రాహిణాం అన్యైర్వరైరలం. భక్తావేవ మోక్షాదిసర్వసుఖాంతర్భావాదితి భావః. 25

మరి కైవల్యము లేకుంటే రాగ, ద్వేషాదులచే నిండిన వారికి భక్తిసుఖము గూడా కలుగదందువేమో అని అట్లు కాదు. ఓ ఉత్తమశ్లోకుడా! మహనీయుల ముఖమునుండి జాలువారిన నీ పాదపద్మముల అమృతము యొక్క ఒక చుక్కను తాకిన గాడ్పు చాలు అనగా దూరము నుండైనా ఏ కొద్ది ఈ యశః శ్రవణము చేసినచో మరచిన ఆత్మతత్వ మార్గముగల (చంచలాత్మకములైన) మాకు మళ్ళీ స్మృతిని కలిగించి ఆత్మజ్ఞానమును కలిగించుచున్నది. అందువలన భక్తులకు రాగాదులు కలుగవు. అందులకు సారగ్రాహునులమైన మాకు వేరే వరములు అక్కరలేదు. భక్తియందే మోక్షాది సర్వ సుఖము-లంతర్ధానములని భావము. 25

శ్లో॥ యశశ్శివం సుశ్రవ ఆర్య సంగమే
యదృచ్ఛయా చోపశృణోతి తేసకృత్ ।
కథంగుణజ్ఞో విరమేద్వృతే పశుం
శ్రీర్యత్ప్రవవ్రే గుణసంగ్రహేచ్ఛయా ॥ 26

టీ:- నను భక్తిః ముక్తి ఫలైవ అతః ఫలం విహాయ సాధనే భవతః కోఽయమాగ్రహ ఇత్యాశంక్యాహ - యశ ఇతి. హే సుశ్రవః మంగళ కీర్తే. శివం యశః. సతాం సంగమే యస్సకృదపి యదృచ్ఛయా ఉపశ్రుణోతి గుణజ్ఞశ్చేత్. సః పశుం వినా అన్యః కథం విరమేత్ గుణాతిశయం సూచయతి. శ్రీః యత్ యశ ఏవ ప్రకర్షేణ వవ్రే వృతవతీ గుణానాం సర్వపురుషార్థానాం సంగ్రహః స్వస్మిన్ సమాహారః తదిచ్ఛయా. 26

మరి భక్తి ద్వారా కలుగునది ముక్తి. అదియే ఫలము. కావున ఫలమును విడిచి సాధనముయందు అనగా భక్తియందు మాకు ఇంత పట్టుదల ఎందుకు? అని ఆశంకించి ఇట్లనుచున్నాడు. ఓ మంగళకీర్తీ! మహాత్ములు కలిసినపుడు సమావేశమున నీ యొక్క మంగళప్రదమైన కీర్తిని ఒక్కమారైనా అనుకోకుండా విన్నవాడు, గుణజ్ఞుడవుతాడు. ఒక్క పశుబుద్ధి కలవాడు తప్ప. వేరొకడు దీని నుండి ఎట్లు విరమించు -కొనును? దానిలోయున్న గుణాతిశయమును సూచించు చున్నాడు. లక్ష్మీదేవికూడా తనయందు పురుషార్థములను సంపాదించాలని కోరిక కలిగి నీ కీర్తిని శ్రవణము చేయాలని వరమును నీ నుండి మిక్కిలిగా గోరినది కదా! 26

శ్లో॥ అథాభజంత్వాఖిల పూరుషోత్తమం
గుణాలయం పద్మకరేవ లాలసః ।
అప్యావయో రేకపతిస్పృథోః కలి
ర్నస్యాత్కృత త్వచ్చరణైకతానయోః ॥ 27

టీ:- అతః లక్ష్మీరివాన్యవర పరిత్యాగేన త్వామేవాహం భజ ఇత్యాహ

కావున లక్ష్మీదేవి ఏ ఇతరులను వరించక నిన్నే వరించినటుల నేను నిన్నే భజిస్తాను అని అంటూ, ఓ ప్రభూ! అఖిల పురుషోత్తముడవైన (సర్వప్రాణులయందు అంతర్యామివై పరిపూర్ణ స్వరూపుడవైన) సమస్త గుణ నిలయుడవైన నిన్ను లక్ష్మీదేవివలె ఉత్సుకతో భజిస్తాను. హే దేవా! యజ్ఞకర్మ చేయడంద్వారా ఇంద్రుడితో విరోధము వచ్చినట్లుగా భక్తియందు కూడా శ్రీమహాలక్ష్మితో విరోధము రాదుకదా! ఒకే

– అథేతి లాలసః ఉత్సుకస్సన్. కర్మిణి క్రియమాణే యథా ఇంద్రేణ సహ కలిః ఏవం భక్త్తా వపి కిం లక్ష్మ్యా సహ కలహో న స్యాదితి వితర్కయతి. ఏకస్మిన్ పత్యౌ త్వయి విషయే మిథః స్పర్ధమానయో రావయోరపి కిం కలిర్నస్యాదితి కాక్వా వితర్కః. నను పర్యాయేణ సేవాయాం న స్యాత్? మైవం–కృతః త్వచ్చరణయోరేవ ఏక తానః మనోవిస్తారో యాభ్యాం తయోః. 27

శ్లో॥ జగజ్జనన్యాం జగదీశవైశసం
స్యాదేవ యత్కర్మణి నస్సమీహితమ్ ।
కరోషిఫల్గ్వప్యురు దీనవత్సలః
స్వ ఏవ ధిష్ణ్యే౽భిరతస్య కిం తయా ॥ 28

టీ:– భవతు కలహః తథాపి భజేయమేవేత్యాహ – జగదితి.జగజ్జ నన్యాం వైశసం విరోధః స్యాదేవ. తత్ర హేతుః.యస్యాః కర్మణి నస్సమీ హితం ఇచ్ఛా భవతి తథాపి ఇంద్రవిరోధే మత్పక్షపాత్ అత్రాపి తవ పక్షపాత ఏవ స్యాదిత్యాహ ఫల్గు తుచ్ఛమపి ఉరు బహు కరోషి యతో దీనేషు వత్సలః నను బ్రహ్మాదిభిరపి ప్రార్థితాం శ్రియం విహాయ త్వయి పక్షపాతఏవ కథం సాధ్యత ఆహ–స్వే స్వరూప ఏవ రతస్య. తయా కిం ప్రయోజనం తాం నాద్రియస ఇత్యర్థః. యతస్త్వదీనవత్సలః. 28

జగత్పతియందు ఇద్దరము భక్తి ప్రదర్శించడం ద్వారా మాకు స్పర్ధ కలుగవచ్చు అని ఒకవేళ నీ వంటావేమో! ఒకరు ఒక సమయములో వేరొకరు వేరే సమయములో ఉపాసించండి. సమస్య లేదని, కానీ నీ పాదములయందు ఇద్దరము నిరంతరము మనస్సు గలవారమే. అందులకు మాకిద్దరకు విరోధము కలుగకుండుగాక! 27

జగజ్జననితో విరోధము కలిగినప్పటికీ నిన్ను భజించెదము. ఎందుకనగా లక్ష్మీదేవియొక్క పనియందు (నిన్ను జయించుట యందు) నాకు కోరిక కలిగినది. ఇంద్రుడికి నాకు విరోధము కలిగినపుడు నీవు నా పక్షపాతము వహించినట్టుగా ఈ విషయములో గూడా నీవు నా పక్షమే వహించెదవు. దీనులయందు దయ కలిగిన నీవు మా భక్తి అల్పమైనప్పటికీ గొప్పదిగా స్వీకరించుచున్నావు. స్వస్వరూపము యందే రతి గలిగిన నీకు ఆమెతో పనియేమి? అనగా ఆమెను లెక్కపెట్టవని అర్థము. 28

శ్లో॥ భజంత్యథ త్వామత ఏవ సాధవో
వ్యుదస్త మాయాగుణ విభ్రమోదయమ్ ।
భవత్పదానుస్మరణాదృతే సతాం
నిమిత్తమన్యద్భగవన్న విద్మహే ॥ 29

టీ:- భజంతీతి. అత ఏవ సాధవః నిష్కామాః. అథ జ్ఞానానంతరమపి త్వామేవ భజంతి. కథంభూతం మాయాగుణానాం విభ్రమః విలాసః తస్య ఉదయః కార్యం సః నిరస్తః యస్మిన్ తం నను తే కిమర్థం భజంతి? తత్రాహ-భవత్పదానుస్మరణాద్వినా అన్యత్తేషాం నిమిత్తం ఫలం న విద్మహే. 29

నీవు దీనవత్సలుడవు. కనుకనే నిష్కాములై జ్ఞానము పొందిన వారు, జ్ఞానము పొందిన పిమ్మటగూడా నిన్ను భజించుచున్నారు. జ్ఞానులు ఎట్టి నిన్ను భజించుచున్నారు అనగా మాయా గుణముల విలాసమైన ఈ కార్య ప్రపంచము లేని శుద్ధమును. జ్ఞానులు కదా! వారు ఏఫలమును ఆశించి భజించుచున్నారో?అనగా నీ పాదస్మరణము చేయడమే ఫలితముగా, ఫలముగా భావించి భజించుచున్నారు. నిష్కాములైన వారికి వేరొక ఫలము కావాలని అనుకోను. 29

శ్లో॥ మన్యే గిరం తే జగతాం విమోహినీం
వరం వృణీష్వేతి భజంతమాత్థమామ్ ।
వాచానుతంత్ర్యా యది తే జనోఽసితః
కథం పునః కర్మ కరోతి మోహితః ॥ 30

టీ:- వరైః ప్రలోభనం చ కృపాళోస్తవానుచితమిత్యాశయేనాహ-మన్య ఇతి. ను అహో తే వాచా తంత్ర్యా యది జనోఽయమసితః అబద్ధస్స్యాత్ తర్హి పునః పునః ఫలైర్విమోహితస్సన్ కథం కర్మ కరోతి. 30

హే దేవా! వరములచే నన్ను ప్రలోభపెట్టడము అనుచితమే. నేననుకుంటున్నాను నీ వాక్కు జగత్తును మోహింపజేస్తుంది. భజించుచున్నవాడిని "వరంకోరుకో అనడం" ఎందుకనగా నీ వాక్కనే త్రాడుచే బద్ధుడే కాకుంటే, తిరిగి తిరిగి ఫలమునకు మోహితుడై ఎందుకు కర్మ చేయుచున్నాడు? 30

శ్లో॥ త్వన్మాయయాద్ధా జన ఈశఖండితో
యదన్యదాశాస్త ఋతాత్మనో బుధః ।
యథాచరేద్బాలహితం పితా స్వయం
తథా త్వమేవార్హసి నస్సమీహితుమ్ ॥ 31

ఇప్పటికే నీ మాయచేత, నీ నుండి దూరమైన వానిని మరల నీ నుండి దూరము కావడం వద్దు. కావున నీవు మేలు చేయాలని అని అంటూ! నీ యథార్థ స్వరూపము తెలియక అజ్ఞానియైనవాడు వేరే పశు పుత్రాదులను కోరుచున్నాడు. కానీ ఏ విధముగానైతే తండ్రి కుమారుడు కోరకున్ననూ పిల్లవాడి క్షేమమును స్వయముగా చేయు చున్నాడో, నీవుగూడా మేము ప్రార్థించకున్నా అజ్ఞానులమైన మాకు మేలుచేయుటకు సిద్ధపడియున్నావు. 31

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఇత్యాది రాజేన నుతస్స విశ్వదృక్త
మాహ రాజన్మయి భక్తిరస్తుతే ।
దిష్ట్యేదృశీధీర్మయి తే కృతా యయా
మాయాం మదీయాం తరతిస్మదుస్త్యజామ్ ॥ 32

మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

ఆదిరాజైన పృథువుచే ఈ విధముగా స్తుతింపబడి భగవంతుడు ఆ పృథువునుతో ఈ విధముగా అనుచున్నాడు. ఓ రాజా! నాయందు నీకు స్థిరమైన నిష్కామ భక్తి కలుగుగాక. ఇట్టి అలౌకికమైన ప్రేమ కలిగిన బుద్ధి నీకు నా యందు దైవకృపచే కలిగినది. నీకు మంగళమగుగాక! ఎట్టి బుద్ధిచే దుస్తరమైన నా మాయను దాటగలరో అది నీకు గలదు. 32

శ్లో॥ సత్వం కురు మయాదిష్టమప్రమత్తః ప్రజాపతే ।
మదాదేశకరో లోకస్సర్వమాప్నోతి శోభనమ్ ॥ 33

ఓ ప్రజాపాలకుడా! అందువలన జాగరుకుడవై నేను ఆదేశించినట్లుగా ప్రజాపాలనాదులను ఆచరిస్తూ సుఖివిగా. సాక్షాత్తు నా నుండి కాని వేదముద్వారా కాని నా ఆజ్ఞను పాలించినవాడు ఇహపరముల యందు సుఖమును పొందుతాడు. 33

టీ:- త్వదితి. త్వన్మాయయా ఖండితస్య త్వయా పునః ఖండనం న కర్తవ్యం కింతు హితం చేష్టితవ్యమిత్యాహ-త్వన్మాయయా ఋతాదాత్మనః త్వత్తః ఖండితః పృథక్కృతః. యద్యతః అన్యత్ పుత్రాదికమాశాస్తే. అతస్స్వయమవిజ్ఞాపిత ఏవ సమీహితుం చేష్టితుం అర్హసి యథా బాలహితం పితా స్వయమేవ కరోతి తద్వత్. (31-33)

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఇతి వైన్యస్య రాజర్షేరభినంద్యార్థవద్వచః ।
పూజితోఽనుగృహీత్వైనం గంతుం చక్రేఽచ్యుతోమతిమ్ ॥34

మైత్రేయుడు ఈ విధముగా పలికెను..

ఈ విధముగా పృథువుచే పూజింపబడిన భగవానుడు పురుషార్థ హేతువులైన రాజు యొక్క వాక్కులను అభినందించి, అనుగ్రహించి వెళ్ళడానికి సిద్ధమైనాడు. 34

శ్లో॥ దేవర్షి పితృగంధర్వ సిద్ధచారణ పన్నగాః ।
కిన్నరాప్సరసో మర్త్యాః ఖగా భూతాన్యనేకశః ॥ 35

టీ:- యజ్ఞేతి. వాక్చిత్తాంజలి భక్తిభిః సంపూజితాస్సంతః వైకుంఠాను గతాః పార్షదాశ్చ. (34-35)

శ్లో॥ యజ్ఞేశ్వరధియా రాజ్ఞా వాక్చితాంజలి భక్తిభిః ।
సభాజితా యయుస్సర్వే వైకుంఠానుగతాస్తతః ॥ 36

దేవతలు, ఋషులు, గంధర్వులు, సిద్ధచారణులు, కిన్నెరలు, పన్నగములు, అప్సరసలు,మానవులు,పక్షులు అనేక రకములైన ప్రాణులు. వైకుంఠమునుండి వచ్చిన పార్షదులంతా సాక్షాత్తు యజ్ఞేశ్వరుడైన పరమాత్ముడే అను బుద్ధి కలిగిన వాక్కుచేత, ద్రవ్యముచేత అంజలి ఘటించి భక్తితో పూజించగా గౌరవింపబడినవారందరూ వైకుంఠమునకు వెళ్ళిరి. 35,36

శ్లో॥ భగవానపి రాజర్షేస్సోపాధ్యాయస్య చాచ్యుతః ।
హరిన్నివ మనోఽముష్య స్వధామ ప్రత్యగాద్విభుః ॥ 37

టీ:- అదృష్టాయేతి. అదృష్టాయ లోచన పథమతిక్రాంతాయ సందర్శితః ఆత్మాయేన తస్మై. (36-38)

భగవంతుడుగూడా ఋత్విక్కులతో గూడి రాజర్షియైన పృథువు యొక్క మనస్సును హరించుచున్నవాని వలె వైకుంఠమునకు వెళ్ళెను. ఇక్కడ మనస్సును హరించడం కేవలము లోకోక్తి మాత్రమే. ఎందుకనగా త్రికాలములయందు పృథువు మనస్సు భగవదధీనమే. తన స్థలమునకు భగవానుడు వెళ్ళినాడనగా భగవత్స్థలం భక్తుడి హృదయమే (మనం ఏదైన వ్రతాదులు, యజ్ఞాది క్రియలు చేసి దేవతోద్వాసనం చేస్తున్నప్పుడు గచ్ఛ గచ్ఛ శ్లోకం చెబుతుంటాం. అక్కడ స్వస్థానం పరమేశ్వరా అని చెప్పినపుడు భగవంతుడిని మన ఇంటిలో నుండి వెళ్ళగొట్టడం కాకుండ శ్రీధరులు చెప్పినట్టుగా మన హృదయములోకి వెళ్ళడమే అని చెప్పుకుంటే స్వారస్యముంటుంది పూజ్య పూజక భేదేన పూజాకాలే ద్విధాస్థితః ఆత్మార్పణాను సంధానాదేకత్వం కలయ ప్రభో)37

శ్లో॥ అదృష్టాయ నమస్కృత్య నృపస్సందర్శితాత్మనే ।
వాసుదేవాయ దేవానాం దేవాయ స్వపురం యయౌ ॥ 38

పృథుమహారాజు తన కనుచూపుమేరదాటినట్టి, తన మాయా-మయ రూపమును చూపెట్టినట్టి, దేవాదిదేవుడైనట్టి, యథార్థమునకు అవ్యక్తుడైనట్టి శ్రీహరికి నమస్కరించి తన పట్టణమునకు వెళ్ళెను. (38)

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే, వింశోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు ఇరువదవ అధ్యాయము సమాప్తము.**

## ఏకవింశోఽధ్యాయః

శ్లో॥ ఏకవింశే తు పృథునా ప్రజానామనుశాసనమ్ ।
మహాసత్రే సురాదీనాం మహాసదసి వర్ణ్యతే ॥

మైత్రేయ ఉవాచ

శ్లో॥ మౌక్తికైః కుసుమైస్స్రగ్భిర్దుకూలైస్స్వర్ణతోరణైః ।
మహాసురభిభిర్ధూపైర్మండితం తత్ర తత్ర చ ॥ 1

టీ:- పురం యయా విత్యుక్తం తత్పురమనువర్ణయతి త్రిభిః. మౌక్తికైరితి. 1

శ్లో॥ చందనాగురుతోయార్ద్ర రథ్యాచత్వర మార్గవత్ ।
పుష్పాక్షత ఫలైస్తోక్మైర్లాజైరర్చిర్భిరర్చితమ్ ॥ 2

శ్లో॥ సంవృతం కదలీస్తంభైః పూగపోతైః పరిష్కృతమ్ ।
తరుపల్లవ మాలాభిస్సర్వతస్సర్వమలంకృతమ్ ॥ 3

టీ:- చందనేతి. చందనాగరుయుక్తైస్తోయైః ఆర్ద్రాః రథ్యాదయః తద్యుక్తం. తోక్మైః హరితయవైశ్చ అంకురైరితి వా. అర్చిర్భిర్దీపైః. (2-3)

## 21వ అధ్యాయము

ఈ ఇరువది ఒకటవ అధ్యాయమున మహాసత్రమున దేవతలతో నిండియున్న గొప్ప సదస్సునందు ప్రజలకు పృథువు మంచిని ఉపదేశించడం వర్ణింపబడుచున్నది.

మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

పృథువు పురమును ప్రవేశించెనని చెప్పెను. ఆ పురమును వర్ణించు చున్నాడు. ముత్యాలతోరణములచే, పూలమాలలచే, వస్త్రము-లచే, బంగారు తోరణములచే అక్కడక్కడ చక్కటి సువాసనలు వెదజల్లు ధూపములచే అలంకరింపబడిన (పట్టణమును ప్రవేశించెను). 1

చందనము, అగురు కలిపిన నీళ్ళచే తడిసిన (అనగా అలుకు జల్లిన) రథమార్గములు, కూడళ్ళు ఇతర మార్గములు గలిగినట్టి, పూలు, అక్షతలు, ఫలములు, ఆకుపచ్చ లేతయవలు లేదా చిగుళ్ళుతో గూడిన వరిపేలాలతో, దీపములతో అలంకరింపబడిన పట్టణములోకి ప్రవేశించెను. 2

పూలు, గెలలు గలిగియున్న అరటిచెట్లతో, లేత పోకచెట్లతో, లేత చిగుళ్ళ దండలతో అలంకరింపబడిన పట్టణములోకి ప్రవేశించెను (3)

శ్లో॥ ప్రజాస్తందీప బలిభిస్సంభృతాశేషమంగళైః ।
అభీయుర్మృష్ట కన్యాశ్చ మృష్టకుండల మండితాః ॥ 4

టీ:- ప్రజా ఇతి. సంభృతాని అశేషాణి మంగళాని దధ్యాదీని తైస్సహ అభిజగ్ముః. మృష్టాః ఉజ్జ్వలాః కనాశ్చ. 4

ఉజ్జ్వలమగు కుండలములనలంకరించుకొని గొప్పగా ప్రకాశించుచున్న కన్యలు, ఇతర జనులు దీపములతో, సమర్పణ వస్తువులతో అనగా పెరుగు, అక్షతలు మొదలగు వాటితో, లెక్కలేనన్ని మంగళ ద్రవ్యములను తీసుకొని బయలుదేరిరి. 4

శ్లో॥ శంఖ దుందుభి ఘోషేణ బ్రహ్మ ఘోషేణ చర్త్విజామ్ ।
వివేశ భవనం వీరస్తూయమానో గతస్మయః ॥ 5

టీ:- శంఖేతి. గతస్మయః నిరహంకారః. 5

వీరుడు, నిరహంకారుడగు పృథుమహారాజు శంఖ దుందుభులు మ్రోగుచుండగా ఋత్విక్కుల వేదమంత్ర ఘోషతో స్తుతింపబడుచూ తన భవనములోకి ప్రవేశించెను. 5

శ్లో॥ పూజితః పూజయామాస తత్ర తత్ర మహాయశాః ।
పౌరాన్ జానపదాంస్తాంస్తాన్ప్రీతః ప్రియవరప్రదః ॥ 6

టీ:- పూజిత ఇతి. ప్రియాన్ వరాన్ ప్రదదాతీతి. తథా. 6

గొప్ప కీర్తిగలవాడు, ఇష్టములైన వరములనిచ్చువాడగు పృథువు అక్కడక్కడ పూజితుడై సంతుష్టుడై ఆ ఆ పౌరులను పల్లె ప్రజలను పూజించెను. (గౌరవించెను). 6

శ్లో॥ స ఏవమాదీన్యనవద్య చేష్టితః కర్మాణి
భూయాంసి మహాన్మహత్తమః ।
కుర్వన్ శశాసావనిమండలం యశః
స్ఫీతం నిధాయా రురుహే పరంపదమ్ ॥ 7

టీ:- స ఇతి. గుణైర్మహాన్ అత ఏవ మహత్తమః పూజ్యతమః. 7

అనిందితమైన నడవడిక గలవాడై, అనేకములైన ఇట్టి కర్మలను చేస్తూ గొప్పనైన సద్గుణములు కలిగి పూజితులలో శ్రేష్ఠుడై ఈ భూమండలమును శాసించెను. సమృద్ధమైన కీర్తిని ఇక్కడ నిలిపి శ్రీహరి స్థానమును అధిరోహించెను. 7

**శ్రీసూత ఉవాచ**

శ్లో॥ తదాది రాజ్యస్య యశో విజృంభితం
గుణైరదోషైర్గుణవత్సభాసితమ్ ।
క్షత్తా మహాభాగవతస్సదస్పతే
కౌషారవిం ప్రాహ గుణం తమర్చయన్ ॥ 8

టీ:- తదితి. గుణైర్విజృంభితమూర్జితం గుణవద్భిస్సభాజితం సత్కృతం యశః గృణంతం అర్చయన్ ప్రాహ సదసస్పతే శౌనక. 8

**సూతుడు ఈ విధముగా పలికెను.**

సదసస్పతివైన ఓ శౌనకా! సర్వ సద్గుణములచే వర్ధిల్లి, గుణవంతులచే (ఆదరింపబడిన) సత్కరింపబడిన, ఆదిరాజైన పృథువు యొక్క కీర్తిని వర్ణించుచున్న మైత్రేయ మహర్షిని గొప్ప భగవద్భక్తుడైన విదురుడు పూజించుచూ ఈ విధముగా పలికెను. 8

**విదుర ఉవాచ**

శ్లో॥ సోఽభిషిక్తః పృథుర్విప్రైర్లబ్ధా శేషసురార్హణః ।
బిభ్రచ్చ వైష్ణవం తేజో బాహ్వోర్యాభ్యాం దుదోహ గామ్ ॥ 9

టీ:- స ఇతి. లబ్ధాని అశేషసురాణామర్హణాని యేన సః కిమకరోదితి శేషః. 9

**విదురుడు ఈ విధముగా పలికెను.**

మహర్షులచేత అభిషిక్తుడై, దేవతలచే అనేక బహుమతులు పొంది, విష్ణుతేజస్సును ధరించిన తన బాహువులచేత ఈ భూమినుండి సకల సంపదలను పితికిన గొప్పవాడు పృథుమహారాజు. 9

శ్లో॥ కోఽన్వస్య కీర్తిం న శ్రుణోత్యభిజ్ఞో
యద్వి క్రమోచ్ఛిష్ట మశేషభూపాః ।
లోకాస్సపాలా ఉపజీవంతి కామ
మద్యాపి తన్మేవద కర్మ శుద్ధమ్ ॥ 10

తనకు శ్రవణము చేయగల ఉత్సుకత గలదని మైత్రేయుడికి ఆవిష్కరింప చేయడానికి ఈ విధముగా ప్రార్థిస్తూ వివేకియైనవాడు ఎవ్వడు ఈ పృథువు యొక్క కీర్తిని వినడు? ఈనాటికి ఎవరి పృథ్వీ దోహనమను పరాక్రమఉచ్ఛిష్టమును పొంది లోకపాలకులు, అశేషమైన

టీ:- శ్రవణౌత్సుక్యమావిష్కుర్వన్ప్రార్థయతే-కోన్వితి. యస్య విక్రమః పృథివీదోహనం తస్య ఉచ్ఛిష్టతుల్యం కామం తత్తస్య కర్మ వద. 10

రాజలోకము జీవించుచున్నదో అట్టి పృథువు యొక్క శుద్ధమైన పదుపరి కర్మను నాకు తెలుపుము. 10

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ గంగాయమునయోర్నద్యోరంతరా క్షేత్రమావసన్ ।
ప్రారబ్ధనేవ బుభుజే భోగాన్ పుణ్యజిహాసయా ॥ 11

టీ:- గంగేతి. ప్రచీనకర్మభిః ప్రారబాహధన్ ప్రాప్తానేవ బుభుజే న తు భోగాంతరార్థం కర్మాణి కరోతి. తదపి భోగేన పుణ్యక్షపణేచ్ఛయా న తు సుఖానక్త్యేత్యర్థః. 11

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

గంగా, యమునా నదుల మధ్యలో గల క్షేత్రమును నివాసముగా పృథువు ఏర్పరచుకొని ప్రారబ్ధ కర్మ ఫలమునను భవించుచున్నాడు. పుణ్యమును వదులు కోరికతో అనగా కర్మ ద్వారా దేహము అనగా మళ్ళీ జననము, మళ్ళీ మరణం. పుణ్యముద్వారా ఉత్తమ జన్మ అది కూడా ప్రతిబంధకమే బంగారు సంకెళ్ళు వేసినా, ఇనుప సంకెళ్లు వేసిన సంకెళ్ల సంధియే కనుక ఇది తొలగాలంటే అనుభవము ద్వారా పూర్వ కర్మల ఫలితమును ఇప్పుడు అనుభవిస్తూ, మళ్ళీ భోగమునకు కర్మ చేయకుండా, ఇప్పుడు అనుభవిస్తున్న ఉత్తమ ప్రారబ్ధ ఫలమును గూడా సుఖాసక్తితో కాక కేవలము పుణ్యము కరిగిపోవాలని మాత్రమే అనుభవిస్తున్నాడు. 11

శ్లో॥ సర్వత్రాస్ఖలితాదేశస్సప్తద్వీపైకదండధృత్ ।
అన్యత్ర బ్రాహ్మణకులాదన్యత్రాచ్యుతగోత్రతః ॥ 12

టీ:- సర్వత్రేతి. అస్ఖలితః అప్రతిహతః ఆదేశః ఆజ్ఞా యస్య. సప్తసు

ఏడు ద్వీపములకు ఏకైక సమ్రాట్టుగా ఎదురులేని ఆజ్ఞతో శాసించుచున్నాడు. ఈ శాసనము అందరియందా? కాదు. తపో-నిష్ఠులైన సద్బ్రాహ్మణులను ఎవరికి అచ్యుతుడే గోత్రప్రవర్తక తుల్యుడై యున్నాడో అట్టి విష్ణు భక్తులను విడిచి ఇతరులయందు మాత్రమే. 12

ద్వీపేషు ఏక ఏవ దండం ధారయతీతి. తథా. కిం సర్వత్ర? నేత్యాహ – బ్రాహ్మణకులవ్యతిరేకేణ అచ్యుతగోత్రం ప్రవర్తన తుల్యం యేషాం వైష్ణవానాం తద్వ్యతిరేకేణ చ .12

శ్లో॥ ఏకదాసీన్మహాసత్ర దీక్షా తత్ర దివౌకసాం ।
సమాజో బ్రహ్మర్షీణాం చ దేవర్షీణాం చ సత్తమ ॥ 13

టీ:– ఏకదేతి. ఏకదా తస్య మహాసత్రదీక్షా ఆసీత్. తత్సత్రే దేవాదీనాం సమాజ ఆసీదిత్యర్థః. 13

ఓ విదురా! ఒకసారి అక్కడ మహా సత్రదీక్ష జరిగెను. ఆ సత్ర యాగమున దేవతలయొక్క, రాజర్షులయొక్క, బ్రహ్మర్షుల యొక్క సమూహముండెను. 13

శ్లో॥ తస్మిన్నర్హత్సు సర్వేషు స్వర్చితేషు యథార్హతః ।
ఉత్థితస్సదసో మధ్యే తారాణాముడురాడివ ॥ 14

టీ:– తస్మిన్నితి. తస్మిన్ పూజ్యేషు స్వర్చితేషు సత్సు. సదసః మధ్యే. ఉత్థితస్సన్ సమంతతస్సమైక్షతేతి షష్ఠేనాన్వయః. 14

ఆ యాగమందు వారివారి అర్హతను బట్టి పూజ్యులగు అందరిని సత్కరించగా ఆ సభామధ్యమంలో నక్షత్రములలో చంద్రుడు మాదిరి వెలిగి పోవుచున్న పృథువు లేచి సభను కలియచూచినాడు. 14

శ్లో॥ ప్రాంశుః పీనాయతభుజో గౌరః కంజాయతేక్షణః ।
సువాసస్సుముఖస్సౌమ్యః పీనాం సస్సుద్విజస్మితః ॥ 15

ఆ పృథువు పొడవైన బలసిన భుజములు కలిగినవాడు, పచ్చని వర్ణము గలవాడు, పద్మములవలె ఎర్రనైన కన్నులుగలవాడు, చక్కని ముక్కు గలవాడు, ప్రసన్నమగు ముఖముగలవాడు, సౌమ్యుడు,

టీ:- ప్రాంశురితి. ప్రాంశుః ఉన్నతః పీనౌ చ తావాయతౌ చ భుజౌ యస్య. కంజవదరుణే ఈక్షణే యస్య సః. శోభనా ద్విజాః స్మితం చ యస్యసః. 15

పుష్టిగానున్న భుజస్కంధములు గలవాడు, చక్కని పలువరుస, మరియు చిరునవ్వులు గలవాడు. 15

శ్లో॥ వ్యూఢావక్షా బృహచ్ఛ్రోణిర్వళివల్గుదళోదరః ।
ఆవర్తనాభిరోజస్వీ కాంచనోరురుదగ్రపాత్ ॥ 16

టీ:- వ్యూఢేతి. వ్యూఢం విస్తీర్ణం వక్షో యస్య వళిభిస్తిసృభిర్వల్గు సుందరం దళవత్ అశ్వత్థప్రతమివ ఉపరి విస్తృతం అధస్తాత్సంకుచిత ముదరం యస్య ఆవర్తవన్నిమ్నా నాభిర్యస్య. కాంచనవదుజ్జ్వలౌ ఊరు యస్య. ఉదగ్రౌ ఉన్నతాగ్రౌ పాదౌ యస్య. 16

ఆ రాజు విశాలమగు వక్షస్థలముగలవాడు, పెద్ద పిరుదులు గలవాడు, మూడు ముడుతలతో సుందరమైన, కిందకువంచి పట్టుకున్న రావిఆకువలె పైకి విస్తృతముగా కిందకి సన్నగా సుందరముగాగల కడుపుగలవాడు, నీళ్ళలో సుడివలె లోతైన గుండ్రటి నాభిగలిగినవాడు, శక్తిగలవాడు, బంగారమువలె ఉజ్వలమైన తొడలుగలవాడు, ఎత్తైన పాదముగలవాడు. 16

శ్లో॥ సూక్ష్మ వక్రాసితస్నిగ్ధమూర్ధజః కంబు కంధరః ।
మహాధనే దుకూలాగ్ర్యే పరివీయోపవీయ చ ॥ 17

టీ:- సూక్ష్మేతి. సూక్ష్మాశ్చ తే వక్రాశ్చ అసితా నీలాః స్నిగ్ధాశ్చ మూర్ధజాః యస్య కంబువత్త్రి రేఖాంకితా కంధరా యస్య పరివీయ ధృత్వా. ఉపవీయ ఉత్తరీయం కృత్వా. 17

పృథువు సన్నని ముంగురులు తిరిగిన నల్లనైన, మెత్తనైన చిక్కని వెంట్రుకలుగలవాడు, శంఖమువలె మూడు రేకులుగల మెడగలవాడు, చాల విలువైన శ్రేష్ఠములైన వస్త్రములు ధరించి, పైన ఉత్తరీయమును వేసుకొని ఉన్నాడు. 17

శ్లో॥ వ్యంజితాశేషగాత్ర శ్రీర్నియమేవ్యస్తభూషణః ।
కృష్ణాజినధరశ్శ్రీమాన్కుశపాణిః కృతోచితః ॥ 18

టీ:- వ్యంజితేతి. నియమే నిమిత్తే న్యస్తాని త్యక్తాని భూషణాని యేన సః. అత ఏవ తైరనావృతత్వాత్. వ్యంజితా అశేషగాత్రేషు శ్రీః స్వాభావికీ శోభా యేన. కృత్యాను చితాని కర్మాణి యేన. 18

ఆయన యజ్ఞదీక్షాకాలమున అలంకారములైన ఆభరణములను విడిచిన వాడు, కావున ఆభరణములచే కప్పబడని సర్వావయముల యందు స్వాభావికమైన శోభగలవాడు, కృష్ణమృగచర్మమును ధరించినవాడు, దర్భలను చేతియందు ధరించినవాడు, ఉచిత కర్మలను ఆచరించినవాడు. 18

శ్లో॥ శిశిర స్నిగ్ధతా రాక్షస్సమైక్షత సమంతతః ।
ఊచివానిదుమూర్వీశస్సదస్సంహర్ష యన్నివ ॥ 19

టీ:- శిశిరేతి. శిశిరే సంతాపహరేస్నిగ్ధే చ తారే యయోస్తే. అక్షిణీ యస్య. ఇదం వక్ష్యమాణం వాక్యముక్తవాన్. 19

పృథువు తాపమును తొలగించే నునుపైన కనుపాపలు గలిగిన కన్నులు గలవాడు. ఆ భూపతి అన్ని వైపుల చూసి సభను ఆనంద పరుస్తూ ఇట్లు పలికెను. 19

శ్లో॥ చారుచిత్ర పదం శ్లక్ష్ణం మృష్టం గూఢమవిక్లబమ్ ।
సర్వేషాముపకారార్థం తదా అనువదన్నివ ॥ 20

టీ:- చారుశ్రోత్ర ప్రియం. చిత్రాణి పదాని యస్మిన్. శ్లక్ష్ణం ప్రసన్నం. మృష్టం శుద్ధం గూఢం గంభీరార్థం. అవిక్లబం అవ్యాకులం. 20

ఆయన మాటలు వినడానికి సొంపైన అనుప్రాసాదులతో గూడిన ప్రశస్తమైన, శుద్ధమైన, గంభీరమైన అర్థముగలిగి తొందరపాటు లేకుండా అందరికి ఉపకారము జరగాలని తన అనుభవమును చెప్పుచున్నాడా అన్నట్లుండెను. 20

రాజోవాచ

శ్లో॥ సభ్యాః శ్రుణుత భద్రం వస్సాధవో య ఇహాగతాః ।
సత్సు జిజ్ఞాసుభిర్ధర్మ మావేద్య స్వమనీషితమ్ ॥ 21

టీ:- సభ్యా ఇతి. భాషణే హేతుః ధర్మం జిజ్ఞాసుభిః పుంభిః సత్సు స్వమనీషితం ఆవేద్యం వక్తవ్యం. అతః ప్రజానుశాసనమిషేణ జిజ్ఞాసైవ క్రియతే. న తు యుష్మాన్ ప్రతి ధర్మప్రచనమితి భావః. 21

రాజు పలుకుచున్నాడు.

రాజు భాషణ చేయడానికి కారణము చెప్పుచున్నాడు. ఇచ్చటకు వచ్చిన ఓ సాధుజనులైన సభ్యులారా! మీకు మంగళము కలుగుగాక! ధర్మవిచారణచేయు జనులు ఉండగా తన మనస్సులో నిర్ణయించుకొన్న విషయమును చెప్పాలి. ఓ సాధుజనులారా! మీకేదో ధర్మ ప్రవచనము చేయడంలేదు. నేను ప్రజలకు కర్తవ్యమును శాసించుట మిషగా పెట్టుకొని కేవలము ధర్మ విచారణ మాత్రమే చేయుచున్నానని భావము. (21)

శ్లో॥ అహం దండధరో ధాత్రా ప్రజానామిహ యోజితః ।
రక్షితా వృత్తిదః స్వేషు సేతుషు స్థాపితా పృథక్ ॥ 22

టీ:- ఇదానీం ప్రజాశ్శిక్షయిష్యన్ ప్రజాశిక్షణాదికం మమావశ్యక మిత్యాహ-త్రిభిః. అహమితి. పృథక్ స్వేషు సేతుషు స్థాపితా స్థాపయితా. 22

ఇపుడు ప్రజలను రక్షిస్తూ ప్రజలకు నేర్పడం నాకు అవశ్య కర్తవ్యబని చెబుతూ, నన్ను మహర్షులు ఈ సామ్రాజ్యమున ప్రజా పాలకుడిగా నియోగించిరి. నేను దుష్టులను శిక్షించువాడను, శిష్టులను రక్షిస్తూ ప్రజలకు జీవనాధారమును కల్పించి వారివారి వర్ణాశ్రమముల ప్రకారము ధర్మ మర్యాదలను విడివిడిగా స్థాపించువాడను. 22

శ్లో॥ తస్య మే తదనుష్ఠానాద్యానాహుర్బ్రహ్మవాదినః ।
లోకాస్స్యుః కామసందోహా యస్య తుష్యతి దిష్టదృక్ ॥ 23

ఎవనిచే పూర్వము చేసిన కర్మలకు సాక్షియైన ఈశ్వరుడు సంతోషించునో అట్టి వానికి వేదవాదులు ఏ పుణ్యలోకములను గూర్చి చెప్పిరో, ప్రజారక్షణమనే అనుష్ఠానముచే అట్టి లోకములు నాకు

టీ:- తస్యేతి. దిష్టదృక్ ప్రాక్కర్మసాక్షీ ఈశ్వరో యస్య తుష్యతి. తస్య వేద వాదినః యాన్ లోకానాహుః. ప్రజారక్షణాద్యనుష్ఠానాత్. తే లోకాః మేస్యుః. కథంభూతాః. కామానాం సమ్యగ్దోహః ప్రపూరణం యేషుతే. 23

వచ్చుగాక! ఏ లోకములయందు కోరిన కోరికలు పూరింపబడునో అది ప్రాప్తించుగాక! 23

శ్లో॥ య ఉద్ధరేత్కరం రాజా ప్రజా ధర్మేష్వశిక్షయన్ ।
ప్రజానాం శమలం భుంక్తే భగం స్వం చ జహాతి సః ॥ 24

టీ:- అన్యథాత్వనిష్టం స్యాదిత్యాహ-య ఇతి. శమలం పాపం. భగమైశ్వర్యం పుణ్యం వా. 24

ప్రజా రక్షణానుష్ఠానమును చేయని రాజునకు అనిష్టము జరుగునని ఇట్లు చెప్పుచున్నాడు. ప్రజలను ధర్మమార్గమున నడిపించకుండా కేవలము కప్పమును (టాక్స్ మాత్రమే) తీసుకొనునో అట్టి రాజు ప్రజల పాపమును పొంది తన ఐశ్వర్యమును పోగొట్టుకొనును. 24

శ్లో॥ తత్ప్రజాభర్తృ పిండార్థం స్వార్థమేవానుసూయవః ।
కురుతాధోక్షజధియస్తర్హి మేఽనుగ్రహః కృతః ॥ 25

టీ:- తదితి. తత్తతస్మాత్. హే ప్రజాః భర్తుర్మే పిండార్థం పిండదానవత్పరలోకహితార్థం స్వకార్య మేవ కురుత. ధర్మమేవానుతిష్ఠత. అధోక్షజే ధీర్యేషాం తాదృశాస్సత్యః. వాసుదేవార్పణదృష్ట్యేత్యర్థః. అనుగ్రహః కృతః భవేదితి శేషః. 25

ఈ కారణంగా ఓ ప్రజలారా! రాజైన నా పరలోక హితార్థము అసూయారహితులై (ఇతరుల గొప్పతనమును చూచి ఓర్చుకోలేని తనము అసూయ) మీ మీ ధర్మములను పాటించండి. అధోక్షజుడి యందు బుద్ధికలిగి ఉండండి. అనగా వాసుదేవుడికి అర్పణ దృష్టి కలిగి ఉండడమన్నమాట. ఇట్లు చేసినవారైతే నన్ను అనుగ్రహించిన వారవుతారు. 25

శ్లో॥ యూయం తదనుమోదధ్వం పితృదేవర్షయోఽమలాః ।
కర్తుశ్శాస్తురనుజ్ఞాతుస్తుల్యం యత్ప్రేత్య తత్ఫలమ్ ॥ 26

టీ:- యూయమితి. శాస్తుశ్శాసితుః. అనుజ్ఞాతురనుమోదితుశ్చ ప్రేత్య పరలోకే యత్ఫలం తత్తుల్యం. 26

శ్లో॥ అస్తి యజ్ఞపతిర్నామ కేషాంచిదర్హసత్తమాః ।
ఇహాముత్ర చ దృశ్యంతే జ్యోత్స్నావత్యః క్వచిద్భువః ॥ 27

టీ:- కర్మ కర్తవ్యమిత్యనుమోదామహే న తు వాసుదేవే. అర్పణీయ మితి. వేనాదిభిస్తదనంగీకారాదిత్యేవం వాదినః శనైస్సంబోధయన్నాహ. హే అర్హసత్తమాః యజ్ఞపతిర్నామ పరమేశ్వరః కేషాంచిన్మతేతావదస్తి తథాపి విప్రతి పత్తేర్న తత్సిద్ధిరిత్యాశంక్య జగద్వైచిత్ర్యాన్యథానుపపత్తిం ప్రయాణమితి. ఇహాముత్ర చ జోత్స్నావత్యః కాంతిమత్యో భువః భోగ భూమయః శరీరాణి చ. 27

ఓ పితరులారా! దేవతలారా! మహర్షులారా! నేను చెప్పిన మాటలను పవిత్రులగు మీరు అనుమోదించండి. చేసినవాడికి, నేర్పినవాడికి, అనుమోదించినవాడికి శరీరము విడిచిన పిమ్మట ఫలము ముగ్గురికి సమానముకదా! 26

కర్మచేయాలని అనుమోదిస్తాం కానీ ఈశ్వరార్పణను అనుమోదించం. ఎందుకనగా వేనాదులు ఈశ్వరుడిని ఒప్పలేదుకదా అంగారేమో! అనగా వారికి నిదానంగా బోధించడానికి ఈ విధంగా మాట్లాడుచున్నాడు. ఓ అర్హసత్తములారా! ఈశ్వరుడు యజ్ఞపతి అనుపేరు గలిగి కొందరి మతములో ఈశ్వరుడు ఉన్నాడు. కొందరి మతములో ఈశ్వరుడు లేడు. ఇక్కడ విప్రతిపత్తి ఏర్పడినది. విప్రతిపత్తి అనగా "విరుద్ధాప్రతిపత్తికి జ్ఞానం విప్రతిపత్తి" విరుద్ధమైన రెండు జ్ఞానములు కలిగి యుండడం ఈశ్వరుడు ఉన్నాడు, లేడు. ఎప్పుడు విప్రతిపత్తి కలదో అప్పుడు ఈశ్వరసిద్ధి కాదు. ఈశ్వరుడు ఉన్నాడు అనుదానికి ఈ హేతువుకాక వేరే హేతువు లేదు అని చెప్పడానికి "అన్యథాఽ అనుపపత్తి" అని అంటారు. ఈశ్వరుడు లేని జగత్తున విచిత్రమైన ప్రాణులు, మనుష్యులు, వివిధ స్వభావాదులు కలిగిన ఈ సృష్టి ఎంతమేధావికైనా (ఈశ్వరుడు లేకుండా) సాధ్యముకాదు. అందుకొరకు యజ్ఞపతియైన ఈశ్వరుడిని ఒప్పవలసినదే. ప్రత్యక్షముగా,

శ్లో॥ మనోరుత్తానపాదస్య ధ్రువస్యాపి మహీపతేః ।
ప్రియవ్రతస్య రాజర్షేరంగస్యాస్మత్పితుః పితుః ॥ 28

టీ:- క్వచిత్క్వచిద్ద్రశ్యంతే. నైతద్వైచిత్ర్యమీశ్వర స్వాభావే ఘటత ఇత్యర్థః. నన్విదం కర్మ వైచిత్ర్యాదేవ సేత్స్యతి. తథాపి విద్వదనుభవేన. ఈశ్వరసిద్ధిరిత్యాహ–త్రిభిః. మనోరితి. అస్మత్పితామహస్యాంగస్య. 28

శాస్త్రముద్వారా కాంతివంతమైన భోగభూములు, శరీరములు కానవచ్చుచున్నవి. అందుకే "జన్మాద్యధి కరణమున, మనసాప్యచింత్య రచనారూపస్య" అన్నారు. భగవత్పాదులు, ఈ రచన కర్మ చేయడం ద్వారా కలిగిన అపూర్వాదుల ద్వారానే జరుగును గదా! ఎందుకు ఈశ్వరుడిని ఒప్పాలని అనగా ఫలమత ఉపపత్తేః3–2–38 బ్ర.సూ. అను సూత్రమున భగవత్పాదులు ఇట్లు అంటున్నారు. "అపూర్వస్యః అచేతనస్య కాష్ఠ లోష్ట సమస్యచేతనేనా ప్రవర్తితస్య ప్రవృత్యనుపపత్తేః " ఎండిన కట్టె మట్టి చిప్పలవలె అచేతనమైన అపూర్వము చేతనమైన పరమేశ్వరుడు లేకుండా ఎట్లా ప్రవర్తింస్తుందయ్యా అందుకొరకు ఫలదాత ఈశ్వరుడే "ఇంకా స్వారస్యమైన విచారణ చేయాలంటే జగద్వ్యాపారవర్జంప్రకరణాదసం నిహితత్వాచ్ఛ" 4.4.17. బ్ర.సూ. మొదలగు స్థలములయందు భగవత్పాదుల ప్రసన్న గాంభీర్య విచారణను చూడవచ్చు. ఇతిశమ్. 27

మరి ఇవి కర్మవైచిత్ర్యము ద్వారా మాత్రమే నిర్ణయమా అనగా కాదు విద్వాంసుల అనుభవము గూడా ప్రమాణమే అంటూ స్వాయంభువమనువునకు ఉత్తానపాదునకు, ధ్రువమహారాజుకు, ప్రియవ్రతునకు మా తాతగారైన అంగమహారాజునకు...28

శ్లో॥ ఈదృశానామథాన్యేషామజస్య చ భవస్య చ ।
ప్రహ్లాదస్య బలేశ్చాపి కృత్యమస్తి గదాభృతా ॥ 29

టీ:- ఈదృశానామితి. కృత్యమస్తి అవశ్యం కర్మఫలదాత్రా భవితవ్య మితి తేషాం మతమితి భావః. 29

ఇట్టివారైన ఇంకా చాలామందికి బ్రహ్మదేవునకు, శివుడికి, ప్రహ్లాదునకు, బలికిగూడా అవశ్యము కలిగిన ఫలదాతృత్వము పరమేశ్వరుడికే సాధ్యమని వారి అభిప్రాయము. 29

శ్లో॥ దౌహిత్రాదీనృతే మృత్యోశ్శోచ్యాన్ ధర్మవిమోహితాన్ ।
వర్గస్వర్గాపవర్గాణాం ప్రాయేణైకాత్మ్యహేతునా ॥ 30

టీ:- దౌహిత్రాదీనితి. మృత్యోర్దౌహిత్రాదీనృతే వేనాదీన్ హిత్వా. ధర్మే విమోహితాన్ అతశ్శోచ్యాన్. నను కర్మైన ఫలం దాస్యతి విధ్యుద్దేశగతా దేవతా వా.కిం పరమేశ్వరేణ? తత్రాహ-వర్గేతి. వర్గోఽత్ర త్రివర్గః. స్వర్గః ధర్మస్య ఫలం అపవర్గో మోక్షః. తేషామైకాత్మ్యేన ఏకరూపేణ సర్వాను గతేన హేతునా. తత్రాపి ప్రాయేణ హేతునా అయం భావః న తావజ్జడస్య కర్మణః ఫలదాతృత్వం ఘటతే. న చ అర్వాగ్దేవతానాం స్వాతంత్ర్యం అంతర్యామిశ్రుతేః. న చ తథా కర్మసామ్యే ఫలతారతమ్యం క్వచిత్తదసిద్ధిశ్చ సంభనతి. అతస్స్వాతంత్ర్యేణ కర్తుమకర్తుమన్యథాకర్తుం సమర్థేన పరమేశ్వరేణ భావ్యమితి. 30

మృత్యువు మనుమడైన, ధర్మవిమోహితుడైన శోకింపవలసిన వేనుడివంటి వారిని విడిచి, వర్ణము, ధర్మార్థకామములు, స్వర్గము, ధర్మఫలము, అపవర్గము, మోక్షము, అన్యనిరపేక్ష స్వరూపము కలిగి యుండుట అను కారణములచే అవశ్యం ఫలదాతను సామాన్యముగా పైవారు అంగీకరించినారు. జడాత్మకమైన కర్మకు ఫలదాతృత్వం లేనప్పటికి ఈశ్వరేతరులైన దేవతలకు అనగాకర్మ అవాంతర దేవతలకు ఫలదాతృత్వమును కల్పించుమనగా వారుగూడా స్వతంత్రులు కాదు. ఎందుకనగా యఃపృథివ్యాంఅష్ఠన్. యం పృథివీ నవేద. పృథివీ దేవత గూడాఎవరిని తెలుసుకోలేకపోతుందో అతడు స్వతంత్రుడు, కావున అవాంతర దేవతలకు ఫలదాతృత్వము లేదు. ఈశ్వరుడైతే కర్మాను రూపమైన ఫలమునే ఇవ్వగలదు. కర్మ సమానముగా ఉన్నప్పుడు ఎక్కువ తక్కువలుచేసి, ఫలమీయడం లేదా ఫలమే ఈయకుండా పోవడం అనునవి జరుగవు. అందుకొరకు స్వతంత్రముగా చేయడానికి,

శ్లో॥ యత్పాదసేవాభిరుచిస్తపస్వినామ
శేషజన్మోపచితం మలం ధియః ।
సద్యః క్షిణోత్యన్వహో మేధతీ సతీ
యథా పదాంగుష్ఠ వినిస్సృతా సరిత్ ॥ 31

టీ:- కించ జీవానాం మోక్షదః పరమేశ్వర ఏవ నార్వేగ్దేవతాః తాసామపి జీవత్వావిశేషాదిత్యాశయేనాహ-త్రిభిః. యదితి. యస్య పాదయోస్సేవాయామభిరుచిః తపస్వినాం సంసారతప్తానాం అశేషైః జన్మభిరుపచితం సంవృద్ధం ధియః మలం సద్యః క్షపయతి తమేవ భజతేతి తృతీయేనాన్వయః. కథంభూతా అహన్యహని వర్ధమానాసతీ సాత్త్వికీ అవ్యభిచారిణీ భక్తిః. తత్పాదసంబంధస్యైవైష మహిమేతి సదృష్టాంతమాహ-యథేతి. 31

చేయకుండా ఉండడానికి వేరుమాదిరిగా చేయడానికి సమర్థుడైన పరమేశ్వరుడి అంగీకరించితీరాలి. 30

జీవులకు మోక్షమునిచ్చువాడు పరమేశ్వరుడే అవాంతర దేవతలకు జీవత్వము ఉండడం వలన వారు మోక్షమిచ్చువారు కారు. అనునది దృష్టిలో పెట్టుకొని చెప్పుచున్నాడు. తపస్సుచేయు వారికి ఎవరి పాదములను సేవించాలని అభిరుచి గలదో, ఏ పాదములు సంసారతప్తులైన వారికి అనేక జన్మములనుండి గలిగిన బుద్ధి మాలిన్యమును వెంటనే నశింపచేయుచున్నవో, ఆ పాదములను భజించండి. ఆ పాదమహిమ ఎట్టిదనగా ఆ పరమాత్మ కాలిబొటనవేలి నుండి వెలుబడిన గంగ పావనమైనట్లు, ఆయన పాదములను సేవించువారి సాత్వికమైన, అవ్యభిచారిణయైన భక్తి దినదిన ప్రవర్ధమాన మౌతుంది. 31

శ్లో॥ వినిర్ధుతా శేషమనోమలః పుమా
నసంగవిజ్ఞాన విశేష వీర్యవాన్ ।
యదంఘ్రిమూలే కృతకేతనః పున
ర్నసంసృతిం క్లేశవహం ప్రపద్యతే ॥ 32

టీ:- వినిర్ధుతేతి. వినిర్ధుతాః అశేషాః మనోమలాః యస్య. అసంగః వైరాగ్యం తేన విజ్ఞానస్య విశేషః సాక్షాత్కారః తదేవ వీర్యం యస్య. యస్యాంఘ్రిమూలే కృతాశ్రయస్సన్. 32

పూర్తిగా కడిగివేయబడిన మనోమాలిన్యము గలవాడు, వైరాగ్యముచే గూడిన ఆత్మసాక్షాత్కారమే బలముగా గలవాడు, ఏ పాదపద్మములను ఆశ్రయముగా చేసుకొనెనో అట్టివాడు దుఃఖాత్మకమైన సంసారమును తిరిగి పొందడు. 32

శ్లో॥ త్వమేవ యూయం భజతాత్మవృత్తి
భిర్మనోవచః కాయగుణైః స్వకర్మభిః ।
అమాయినః కామదుఘాంఘ్రి పంకజం
యథాధికారావసితార్థ సిద్ధయః ॥ 33

టీ:- తమితి. ఆత్మవృత్తిభిః అధ్యయనాధ్యాపనాదిభిః మనోవచః కాయానాం గుణైః. ధ్యాన స్తుతిపరిచర్యాభిః స్వకర్మభిః. అమాయినః నిష్కపటాస్సంతః నను బ్రహ్మాదిభిస్సేవ్యే కిమస్మద్భక్త్యా భవిష్యతి? తత్రాహ-యథా అధికారమేవ అవసితా నిశ్చితా సమాప్తా వా అర్థ సిద్ధిర్యేషాం. 33

అట్టి భగవంతుడి పాదపద్మములను భజించండి. మీరు అధ్యాపనాదులద్వారా, ధ్యానము, స్తుతి, సపర్యలద్వారా, స్వకర్మలచే నిష్కపటులై కోరిన కోరికలు తీర్చే బ్రహ్మాదులద్వారా సేవింపబడే ఆ పాదములను మా భక్తిచేత పూజింపగలమా, అనగా అర్థసిద్ధి ఫలము సిద్ధించుట అనునది "వారు అట్లా చేస్తున్నారు. నేను ఇంతచేస్తే నాకు ఫలిస్తుందా" అని అనుమానపడి అనధికార చేష్టలు చేయరాదు. వారివారి వర్ణ ఆశ్రమ నియమములను దాటకుండా ఉండి చేసినప్పుడు మాత్రమే ఫలించేట్టుగా నిశ్చయింపబడినవి అర్థసిద్ధులు. 33

శ్లో॥ అసావిహానేక గుణో గుణోఽధ్వరః
పృథగ్విధ ద్రవ్యగుణ క్రియోక్తిభిః ।
సంపద్యతేఽర్థాశయ లింగ నామభి
ర్విశుద్ధ విజ్ఞానఘనస్స్వరూపతః ॥ 34

టీ:- స్వకర్మభిర్యాగాదిభిర్భజతేత్యుక్తం తత్ర బ్రహ్మార్పణం బ్రహ్మహవిరితి న్యాయేన సర్వేషు యాగేషు తదంగకల్పేషు భగవద్దృష్ట్యా కర్మ కర్తవ్యం న భిన్నదృష్ట్యేతి వక్తుం తేషాం భగవద్రూపతామాహ- ద్వాభ్యాం. అసావితి. అసౌ భగవానేవ స్వరూపతః విశుద్ధ విజ్ఞాన ఘనోఽపి అగుణః నిర్విశేషగుణోఽపి సన్. ఇహ కర్మమార్గే అనేకగుణః నానా విశేషగుణవాన్ అధ్వరః యజ్ఞస్సంపద్యతే. "యజ్ఞో వై విష్ణు"రితి శ్రుతేః అనేకగుణత్వమేవాహ-పృథగ్విధాని యాని ద్రవ్యాదీని తైః తత్ర ద్రవ్యాణి వ్రీహ్యాదీని గుణాః శుక్లాదయః. క్రియాః అవఘాతాదయః. ఉక్తయః మంత్రాః. అర్థః యాగసాధ్య ఉపకారః. ఆశయస్సంకల్పః. లింగం పదార్థానాం శక్తిః నామ జ్యోతిష్టోమాది. తైశ్చాధ్వరస్సంపద్యతే. 34

స్వకర్మలచే యాగాదులచే భజింపబడువాడు భగవానుడని చెప్పబడినది. అక్కడ బ్రహ్మార్పణం బ్రహ్మహవిః అను న్యాయాను సారముగా అన్ని యాగములయందు, వాటి అంగముల యందు, వాటి ఫలములయందు, భగవద్దృష్టి కలిగి కర్మ చెయ్యాలి, భిన్నదృష్టిచేత (అనగా భగవంతుడికంటే కర్మాత్మక యజ్ఞము వేరను దృష్టి) చేయరాదని చెప్పడానికి భగవద్రూపమును చెప్పుచున్నాడు. భగవానుడు స్వరూపతః మాలిన్యము లేని విజ్ఞానఘనుడు అగుణుడు అనగా నిర్విశేషణుడు అయినప్పటికీ ఈ కర్మ మార్గమున అనేక విశేషణ విశిష్టుడు అగుచు యజ్ఞ స్వరూపమును పొందుచున్నాడు. యజ్ఞమే విష్ణువని కదా వేదం చెప్పుచున్నది. ఏవా అనేక గుణములనగా చెప్పుచున్నాడు. అనేకములైన ద్రవ్యాదులచే కూడుకొన్న వాటిచేత ఇచ్చట ద్రవ్యములు వడ్లు మొదలగునవి, గుణములు శుక్లాదులు క్రియలు = దంచడం మొదలగునవి, ఉక్తులు = మంత్రములు, అర్థము = అంగసాధ్య ఉపకారము, ఆశయము = సంకల్పము, లింగము = పదార్థముల యొక్క శక్తి, నామము = జ్యోతిష్టోమాదులు వీటి చేత యజ్ఞముగా సంపన్నమగుచున్నాడు. 34

శ్లో॥ ప్రధానకాలాశయ ధర్మసంగ్రహే
శరీర ఏష ప్రతిపద్య చేతనామ్ ।
క్రియాఫలత్వేన విభుర్విభావ్యతే
యథానలో దారుషు తద్గుణాత్మకః ॥ 35

టీ:- యాగతదంగానాం భగవద్రూపత్వముక్త్వాయాగఫలస్యాపి భగవద్రూపత్యామాహ-ప్రధానేతి. ఏష విభుః పరమానందోఽపి శరీరే చేతనాం విషయాకారాం బుద్ధిం ప్రతిపద్య తదభివ్యంగ్యానందరూపస్సన్. క్రియాఫలత్వేన ప్రతీయతే. "ఏతస్యైవానందస్యాన్యాని భూతాని మాత్రాముపజీవంతీ" తి శ్రుతేః. యథా అనలో దారుషు స్థితః తద్గుణాత్మకః దారుధర్మైర్దైర్ఘ్యవ క్రత్వాదిమాన్ తద్వత్. కథంభూతే శరీరే ప్రధానమవ్యక్తం. కాలః తత్క్షోభకః.ఆశయః వాసనా ధర్మోఽత్రాదృష్టం తైస్సంగృహ్యతే జన్యత ఇతి తథా తస్మిన్ దేహే. 35

యాగము వాటి అంగములకు భగవద్రూపమును చెప్పి యాగ ఫలమునకు గూడా భగవద్రూపమును చెప్పుచున్నాడు. ఈతడు విభుడు. పరమేశ్వరుడు పరమానంద స్వరూపుడైనప్పటికీ శరీరమున చేతనా అనగా సర్వవ్యాపకమైన ఆత్మచైతన్యం బుద్ధివృత్తిలో అభివ్యక్తమై ఆ బుద్ధివృత్తియే ఆత్మగా కనబడేట్లు చేస్తుంది. అదేచేతనా.. భగవత్తత 13-6-శంకరభాష్యం, ఆ చేతనాత్మక విషయాకారబుద్ధిని పొంది దానియందు అభివ్యక్తమై, ఆనంద రసరూపమును యజ్ఞక్రియకు ఫలరూపమును పొందుతుంది. ఇతర ప్రాణులంతా ఈ ఆనంద స్వరూపము యొక్క కొద్ది మాత్రముచేతనే జీవించుచున్నారు అని శ్రుతి. ఏ విధముగానైతే అంటుకున్న కట్టెయందు అగ్ని ఆ కట్టె పొడుగు, సన్నము, లావు మొదలుగు స్వరూపములు పొందుతుందో ఆ విధముగానే ఇక్కడగూడా ఏ విధమైన శరీరమున? ప్రధానము = అవ్యక్తము, కాలము = తత్క్షోభకములు, ఆశయములు ఆశయము వాసనలు ధర్మము, అదృష్టము వాటిచేత పుట్టినట్టి ఆ శరీరమున అభివ్యక్తమగును. 35

శ్లో॥ అహో మమామీ వితరంత్యనుగ్రహం
హరిం గురుం యజ్ఞ భూజామధీశ్వరమ్ ।
స్వధర్మ యోగేన యజంతి మామగా
నిరంతరం క్షోణితలే దృఢవ్రతాః ॥ 36

టీ:- తదేవ మత్ప్రవృత్తాన్ భగవద్భజనే ప్రవర్త్య స్వతః ప్రవృత్తానాం ప్రవృత్తిమభినందనేన దృఢయతి-అహో ఇతి. వితరంతి కుర్వంతి. 36

ఈ విధముగా భగవత్ భజనయందు ప్రవర్తించని వారిని ప్రవర్తింపచేసి స్వతహాగా ప్రవర్తించిన వారలను, వారి ప్రవృత్తిని అభినందిస్తూ దృఢముచేయుచున్నాడు. ఆహా! నావారైన వీరు ఈ భూమిపైన దృఢమైననిష్ఠగలవారై స్వవర్ణ ఆశ్రమ ధర్మములచేత నిరంతరము యజ్ఞ భుక్కులైన దేవతలకు అధీశ్వరుడైన లోకగురువు శ్రీహరిని ఆరాధిస్తూ నాకు అనుగ్రహమును పంచుచున్నారు. 36

శ్లో॥ మాజాతు తేజః ప్రభవేన్మహర్ధిభి
స్తితిక్షయా తపసా విద్యయా చ ।
దేదీప్య మానే జితదేవతానాం
కులే స్వయం రాజకులాద్ద్విజానామ్ ॥ 37

టీ:- ఇదానీం హరిభక్తి దార్ఢ్యాయ బ్రాహ్మణభక్తిం విధత్తే-అష్టభిః .మేతి. మహత్యశ్చ తాః బుద్ధయశ్చ. తాభిః యద్రాజకులస్య తేజః తస్మాత్సకాశాత్. ద్విజానాం కులే. జితా దేవతా యేషాం వైష్ణవానాం కులే మా జాతు ప్రభవేత్ కదాచిదపి తత్రప్రభావం న కుర్యాత్. కథం భూతే సమృద్ధిభిర్వినాపి స్వయమేవ తితిక్షాదిభిర్దేదీప్యమానే. 37

ఇప్పుడు హరి భక్తి దృఢము కొరకు బ్రాహ్మణ భక్తిని విధించుచున్నాడు. గొప్పనైన సంపదలచేత ఏ రాజకులము యొక్క తేజస్సు కలదో ఆ తేజస్సు, ధనము లేకున్నా స్వయముగా ఓర్పుచేత, తపస్సుచేత, విద్యచేత దేదీప్యమానముగా వెలుగొందుచున్న ఆ బ్రాహ్మణుల కులము యందు మరియు అజితుడైన విష్ణువునే దైవతముగా పూజించు భక్తులయందు ఎప్పుడుగూడా ప్రభావము చూపకుండును గాక. 37

శ్లో॥ బ్రహ్మణ్యదేవః పురుషః పురాతనో
నిత్యం హరిర్యచ్చరణాభివందనాత్ ।
అవాప లక్ష్మీ మనపాయినీం యశో
జగత్పవిత్రం మహత్తమాగ్రణీః ॥ 38

టీ:- బ్రాహ్మణానేవ స్తువన్నాహ-బ్రహ్మణ్యేతి. యచ్చరణాభివందనాత్ హరిః లక్ష్మీం యశశ్చావాప. యత్సేవయాచ ఈశ్వరః తుష్యతి తదేవ బ్రహ్మకులం నిషేవ్యతామితి ద్వయోరన్వయః. 38

బ్రాహ్మణులను స్తుతిస్తూ అంటున్నాడు. బ్రహ్మణ్యదేవుడు, పురుషుడు, పురాతనుడు అయిన హరి ఎవరి పాదములకు నమస్కరించి లక్ష్మీదేవిని, చెరగని జగత్పవిత్రమైన కీర్తిని పొందెనో, ఏ బ్రాహ్మణసేవ చేత ఈశ్వరుడు సంతోషిస్తాడో ఆ బ్రాహ్మణ కులమును సేవించుడని సమన్వయము. 38

శ్లో॥ యత్సేవయా శేషగుహాశయస్స్వరా
డ్విప్ర ప్రియస్తుష్యతి కామమీశ్వరః ।
తదేవ తద్ధర్మ పరైర్వినీతైస్స
ర్వాత్మనా బ్రహ్మకులం నిషేవ్యతామ్ ॥ 39

టీ:- యదితిః. తస్య హరేర్లోకసంగ్రహరూపో యోధర్మస్తత్పరైః. 39

బ్రాహ్మణుల సేవచేత సర్వప్రాణుల హృదయమున నివసించువాడు, స్వయంప్రకాశుడు, బ్రాహ్మణ ప్రియుడైన ఈశ్వరుడు ఎవరి సేవచే మిక్కిలి సంతోషించునో ఏ బ్రాహ్మణ కులమున శ్రీహరియొక్క లోక సంగ్రహ రూపమైన ధర్మము గలదో (లోకసంగ్రహమనగా జనులను చెడు మార్గములో ప్రవర్తించకుండా చూడడం. గీతశాంకర భాష్యం. 3-20) తత్పరులైనవారు సర్వ విధములుగా (పూజించ వలసినదే) సేవింపబడవలసినదే. 39

శ్లో॥ పుమాన్ లభేతానతి వేలమాత్మనః
ప్రసీదతోఽత్యంతశమం స్వతస్స్వయమ్ ।
యన్నిత్యసంబంధనిషేవయా తతః పరం
కిమత్రాస్తి ముఖం హవిర్భుజామ్ ॥ 40

టీ:- నను బ్రహ్మకులఏవ నిత్యంసేవ్యమానే సర్వదేవతా ముఖభూతేఽగ్నౌ యజ్ఞాద్యనుష్ఠానం న స్యాత్. న చ తేన వినా చిత్తశుద్ధిః న చ తయా వినా మోక్షస్స్యాదిత్యాశంక్యాహ–ద్వాభ్యాం. పుమానితి. యస్య బ్రహ్మకులస్య నిత్యసంబంధేన నిషేవయా పుమాన్ స్వయమేవ జ్ఞానా భ్యాసాదికం వినాపి అత్యంత శమం మోక్షం లభతే. కుతః యత్సేవయా స్వత ఏవ అనతివేలం శీఘ్రం ప్రసీదతః శుద్ధ్యతః ఆత్మనశ్చిత్తాత్ తతః పరం శ్రేష్ఠం దేవానాం కిం ముఖమస్తి. బ్రాహ్మణ సేవ యైవ యజ్ఞాదిఫలం జ్ఞానఫలం చ సర్వం భవతీత్యర్థః. 40

మరి బ్రాహ్మణ కులమునే ఎప్పుడూ సేవిస్తూ ఉంటే సర్వ దేవతల ముఖభూతమైన అగ్నియందు యజ్ఞానుష్ఠానము కుదరదు. యజ్ఞకర్మలు లేక చిత్తశుద్ధికాదు. చిత్తశుద్ధి లేనిదే మోక్షములేదు కదా అని ఆశంకించి ఇట్లు అంటున్నాడు. ఏ బ్రహ్మ కులముయొక్క సేవచేత, నిత్యసంపర్కముచేత పురుషుడు స్వయముగానే అనగా జ్ఞానాభ్యాసాదులు లేకుండా గూడా అత్యుత్తమ మైన మోక్షమును పొందగలడు. ఎందుకనగా బ్రాహ్మణసేవచేత అతి శీఘ్రముగా అతని యొక్క చిత్తము శుద్ధమగుటద్వారా! దానికంటే దేవతలకు శ్రేష్ఠమైన ముఖము గలదా ఏమి? బ్రాహ్మణ సేవచేతనే యజ్ఞాదిఫలం, జ్ఞానఫలం మొత్తము సిద్ధిస్తుంది అని అర్థము. 40

శ్లో॥ అశ్నాత్యనంతః ఖలుతత్త్వకోవిదైః
శ్రద్ధాహుతం యన్ముఖ ఇజ్యనామభిః ।
న వై తథా చేతనయా బహిష్కృతే
హుతాశనే పారమహంస్యపర్యగుః ॥ 41

హరికిగూడా ఆ బ్రహ్మకులమే గొప్పనైన ముఖము అని అంటూ పూజ్యులైన ఇంద్రాది దేవతల పేర్లు చెపుతూ ఏ బ్రహ్మవేత్తల ముఖమున శ్రద్ధగా ఆహుతిచ్చినప్పుడు హవిస్సును అనంతుడు ఏ విధముగా తింటాడో, ఆ విధముగా చైతన్యరహితమైన అగ్నియందు హుతమును తినడు. ఎవరిచేత వేసిన ఆహుతులను స్వీకరిస్తాడు? అనగా

టీ:- హరేరపితదేవపరం ముఖమిత్యాహ-అశ్నాతీతి. ఇజ్యానాం పూజ్యానాం ఇంద్రాదీనాం నామభిః ముస్య ముఖే శ్రద్ధయా హతం హవిః. అనంతో యథాశ్నాతి. తథా చేతనయా బహిష్కృతే రహితే హుతాశనే హుతం నాశ్నాతి కైర్హుతమశ్నాతి. తత్త్వకోవిదైః సర్వదేవమయ శ్చ్రుతన్యమూర్తిరనంత ఇతి తత్త్వవిద్భిః సర్వభోగస్య చిదవసానత్వం పశ్యద్భిరితి వా. కుత ఏవం భూతోఽసౌతత్రాహ- పారమహంస్యం యజ్జ్ఞానం తత్పరానర్హంతి అధికుర్వంతీతి. పారమ హంస్యవర్యాః ఉపనిషదః తాః గావో వాచోయస్మిన్, ఉపనిషద్భిః. జ్ఞాన ఘనత్వేనోక్త ఇత్యర్థః. యద్వా - పరమహంసానాం జ్ఞాననిష్ఠానాం గమ్య. పారమహంస్యః పరితః అయంతి గచ్ఛంతి గావః ఇంద్రియాణి యస్మాత్సపర్యగుః ఇంద్రియనియంతా స చాసౌ స చ పరమహంస్య పర్యగుః. జ్ఞానరూపస్సర్వాంతర్యామీచేత్యర్థః. 41

సర్వదేవమయుడు, చైతన్యమూర్తి, అనంతుడని, యదార్థము తెలిసిన వారిచేత మాత్రమే స్వీకరిస్తాడు. ఎందుకనగా పారమహంస్యమనగా ఉత్కృష్ట జ్ఞానము, తత్పరులు జ్ఞానులు. వారిని గూర్చి అర్హములైన వాక్కులు ఎవనియందు సమన్వయమో ఆతడే ఉపనిషత్తులచేత జ్ఞానఘనుడుగా చెప్పబడెను. లేదా జ్ఞాననిష్ఠులకు గమ్యము పారమహంస్యము ఎవనినుండి అన్నిచోట్లకు వెళ్ళనట్టి వాక్కులు గలవాడో అతడు పర్యగుడు అనగా ఇంద్రియములకు నియామకుడు అనగా జ్ఞానరూపుడు, సర్వాంతర్యామి అని అర్థము. 41

శ్లో॥ యద్బ్రహ్మ నిత్యం విరజం సనాతనం
శ్రద్ధాతపో మంగళ మౌనసంయమైః ।
సమాధినా బిభ్రదిహార్థదృష్టయే
యత్రేద మాదర్శ ఇవావభాసతే ॥ 42

టీ:- న కేవలం చేతనత్వేన హుతాశనాద్విశేషః కింతు వేదజ్ఞానాద

దోషములేనిది, సనాతనమైనది అగు వేదమును ఎల్లప్పుడు శ్రద్ధతో, తపఃపూర్వకముగా, మంగళ పూర్వకముగా ఆచరిస్తూ, (ప్రశస్తమైనది ఆచరిస్తూ, అప్రశస్తమైనది అనగా విలువలేనిది విడిచిపెడుతూ ఉండడమునే తత్వదర్శులైన మునులు మంగళమనిరి.) మౌనమును పాటిస్తూ మౌనమనగా అధ్యయనముకంటే వేరైన మాటలు మాట్లాడకుండా ఉండడం, సమాధి పూర్వకముగా అనగా చిత్తమును

పీత్యాహ– యదితి. యదిత్యవ్యయం. యే బ్రహ్మవేదం నిత్యం బిభ్రతి తేషామిత్యుత్తరేణాన్వయః. మంగళం నామ. శ్లో. "ప్రశస్తాచరణం నిత్యమప్రశస్తస్య వర్జనమ్, ఏతద్ధిమంగళం ప్రోక్తం మునిభి స్తత్త్వ దర్శిభిరి" తి. మౌనమధ్యయనవిరోధివార్తాత్యాగః. సమాధినా చిత్తైకాగ్ర్యేణ అర్థదృష్టయే వేదార్థమపి విచారయితుమిత్యర్థః. యత్ర వేదే ఇదం విశ్వం. 42

స్థిరము చేసుకొని అద్దముయందు ముఖము కనబడునట్లుగా ఏ వేదముయందు ఈ విశ్వము భాసించుచున్నదో అట్టి వేదార్థమును విచారించుచున్న, వేదమును ధరించుచున్న బ్రాహ్మణులు మంగళ–కరులు. 42

శ్లో॥ తేషామహం పాదసరోజరేణు
మార్యా వహేయాధి కిరీటమాయుః ।
యం నిత్యదా బిభ్రత ఆశు పాపం
నశ్యత్యముం సర్వగుణా భజంతి ॥ 43

టీ:– తేషామితి. హే ఆర్యాః యావజ్జీవం అధికిరీటం మకుటస్యోపరి వహేయేతి. ప్రార్థనాయాం. లిఙ్ యం రేణుం. 43

ఓ ఆర్యులారా! ఏ పాదరేణువులు ఎల్లప్పుడు ధరియించువాని పాపమును వెంటనే నశింపచేయునో, ఎవరి పాదధూళి సర్వసద్గుణములను కలిగించునో, అట్టివారి పాదపద్మములకంటిన మట్టి నేను నా ప్రాణములున్నంతవరకు నా కిరీటమందు ధరించెదను. 43

శ్లో॥ గుణాయనం శీలధనం కృతజ్ఞం
శ్రద్ధాశ్రయం సంవృణుతేనుసంపదః ।
ప్రసీదతు బ్రహ్మకులం గవాం చ
జనార్దనస్సానుచరశ్చ మహ్యమ్ ॥ 44

సద్గుణములు పొందినయెడల వాటి ప్రయోజనమును తెలుపుచున్నాడు. సద్గుణములు కలవాడిని సచ్ఛీలమే ధనముగా గలవాడిని, చేసిన ఉపకారము మరువనివాడిని, పెద్దలను సేవించువానిని, సర్వసంపదలు వరిస్తాయి. అనుచర సహితుడైన జనార్దనుడు బ్రాహ్మణకులము, గోవులకులము నాయందు ప్రసన్నులగుదురు గాక ! 44

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ ఇతి బ్రువాణం నృపతిం పిత్రు దేవద్విజాతయః ।
తుష్టువుర్హృష్టమనసస్సాధు వాదేన సాధవః ॥ 45

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

ఈ విధముగా పలుకుచున్న రాజును పితరులు, దేవతలు, బ్రాహ్మణులు, ఋత్విక్కులు, సాధుజనులు సంతోషముతో కూడిన మనస్సు గలవారై, మంచిమాటలతో స్తుతించిరి. 45

టీ:- గుణభజనస్య ఫలమాహ-గుణాయనం అన్వనుసంపదః సంవృణేతు సమ్యగ్భంజతే తస్మాత్ ప్రసీదుతు బ్రహ్మకులం గవాం కులం చ. (44-45)

శ్లో॥ పుత్రేణ జయతే లోకానితి సత్యవ్రతీ శ్రుతిః ।
బ్రహ్మదండహతః పాపో యద్వేనోఽత్యతరత్తమః ॥ 46

ఏ మంచిమాటలనగా చెప్పుచున్నాడు. పుత్రేణ లోకాన్ జయతి అని వేదము చెపుతుంది. పుత్రుడిచే పుణ్యలోకములు పొందుతాడు అను వేదవాక్కు నిజము. ఏలయన బ్రాహ్మణ శాపమునకు గురియైన వేనుడు పాపి అయినా కుమారుడైన పృథువు పుణ్యబలముచే నరకము నుండి విముక్తుడయినాడు. 46

శ్లో॥ హిరణ్యకశిపుశ్చాపి భగవన్నిందయా తమః ।
వివిక్షురత్యగాత్సూనోః ప్రహ్లాదస్యానుభావతః ॥ 47

అంతేకాదు, హిరణ్యకశిపువు భగవంతుడిని దూషించి నరకమును పొందుదునని ఆశంకగలవాడైననూ కుమారుడైన ప్రహ్లాదుడి ప్రభావముచే తరించెను. 47

శ్లో॥ వీరవర్యపతిః పృథ్వ్యాస్సమాస్సంజీవ శాశ్వతీః ।
యస్యేదృశ్యచ్యుతే భక్తిస్సర్వలోకైక భర్తరి ॥ 48

వీరులలో శ్రేష్ఠుడైనవాడా! పృథివికి తండ్రియైనవాడా! శాశ్వతకాలము జీవించుము. సర్వలోకములకు ఒకే ఒక ప్రభువైన భగవానుడి యందు నీకు ఇట్టి భక్తికలదు. 48

టీ:- సాధువాదమాహ-షడ్భిః పుత్రేణేతి. యత్ యతః వేనోఽపి తమః నరకం అత్యతరత్ అతితతార. (46-48)

శ్లో॥ అహో వయం హ్యద్య పవిత్రకీర్తే
త్వయైవ నాథేన ముకుందనాథాః ।
య ఉత్తమ శ్లోక తమస్య విష్ణోర్బ్ర
హ్మణ్య దేవస్య కథాం వ్యనక్తి ॥ 49

ఓ పవిత్రకీర్తీ! ఆహా! నీవు మాకు నాథుడవు. నీవు నాథుడవు కావడం వలన మేము ముకుందుడే నాథుడుగా గలవారమైనాము. ఉత్తమశ్లోకుడైన, బ్రహ్మణ్యదేవుడైన విష్ణువు యొక్క కథను నీవు వ్యక్తీకరించడమే దానికి కారణము. 49

టీ:- అహో ఇతి. ముకుందనాథాః స్మః త్వన్నాథత్వమేవ ముకుంద నాథత్వే పర్యవసితమిత్యర్థః. తత్ర హేతుః. య ఇతి. 49

శ్లో॥ నాత్యద్భుతమిదం నాథ తవజీవ్యానుసాధనమ్ ।
ప్రజానురాగో మహతాం ప్రకృతిః కరుణాత్మనామ్ ॥ 50

ఓ రాజా! ఇది పెద్ద ఆశ్చర్యముగొలుపనిదేమికాదు. నీ సేవకులకు చక్కటి అనుశాసనము, ప్రజలయందు అనురాగము. కరణాత్ములైన మహనీయులైన మీ స్వభావమే అంతా. 50

టీ:- నేతి. జీవ్యానాం సేవకానామనుశాసనం ప్రజాను అనురాగః ప్రకృతిః స్వభావః. 50

శ్లో॥ అద్య నస్తమసః పారస్త్వయోపాసాదితః ప్రభో ।
భ్రామ్యతాం నష్టదృష్టీనాం కర్మభిర్దైవ సంజ్ఞితైః ॥ 51

టీ:- అథ్యేతి. ఉపాసాదితః సమీపం ప్రాపితః. కర్మాభిర్భ్రామ్యతాం. 51

ఓ ప్రభూ! వివేకము నశించి ప్రారబ్ధ కర్మచేత తిప్పుబడుచున్న మమ్ము చీకటి సముద్రము నుండి ఒడ్డున వేసినావు. 51

శ్లో॥ నమో వివృద్ధ సత్త్వాయ పరుషాయ మహీయసే ।
యో బ్రహ్మ క్షత్రమావిశ్య బిభర్తీదం స్వతేజసా ॥ 52

టీ:- నమ ఇతి. ఈశ్వర దృష్ట్యా విప్రాదయోఽపి ప్రణమంతి. బ్రహ్మావిశ్య బ్రాహ్మణజాతిమధిష్ఠాయ. క్షత్రం క్షత్రియాన్ బిభర్తి క్షత్రం చావిశ్య బ్రహ్మబిభర్తి. తదుభయం చావిశ్య ఇదం విశ్వం బిభర్తి. 52

ఈశ్వరదృష్టి కలిగి బ్రాహ్మణులు కూడా నమస్కరించుచున్నారు. విశేషముగా వర్ధిల్లిన సత్వ స్వరూపమునకు సర్వోత్కృష్టుడైన పరమ పురుషునకు నమస్కారము. ఏరీతిగా బ్రాహ్మణజాతిని ఆశ్రయించి క్షత్రియ కులము. క్షత్రియ కులమునాశ్రయించి బ్రాహ్మణ కులము రక్షింపబడుచున్నదో, ఆ రెండు కులముల నాశ్రయించి ఈ విశ్వము రక్షింపబడుచున్నదో అట్టి పృథు చక్రవర్తికి నమస్కారము. 52

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,
ఏకవింశోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు
ఇరువది ఒకటవ అధ్యాయము సమాప్తము.

## ద్వావింశోऽధ్యాయః

శ్లో॥ ద్వావింశే తు పరం జ్ఞానం పృథవే హరిశాసనాత్ ॥

మైత్రేయ ఉవాచ

శ్లో॥ జనేషు ప్రగృణత్స్వేవం పృథుం పృథులవిక్రమమ్ ।
తత్రోపజగ్ముర్మునయశ్చత్వారస్సూర్యవర్చసః ॥ 1

టీ:- సనత్కుమారో భగవానుపాదిశది తీర్యతే. 1

శ్లో॥ తాంస్తు సిద్ధేశ్వరాన్రాజా వ్యోమ్నోऽవతరతోऽర్చిషా ।
లోకానపాపాన్ కుర్వంతస్సానుగోऽచష్ట లక్షితాన్ ॥ 2

టీ:- తానితి. అర్చిషా లక్షితాన్ సనకాదయ ఏత ఇతి జ్ఞాపితాన్. అచష్ట అపశ్యత్. 2

శ్లో॥ తద్దర్శనోద్గతాన్ ప్రాణాన్ ప్రత్యాదిత్సురివోత్థితః ।
స సదస్యానుగో వైన్య ఇంద్రియేశో గుణానివ ॥ 3

టీ:- తదితి. తేషాం దర్శనేనోద్గతాన్ ప్రాణాన్ ప్రాప్తుమిచ్ఛురివ. అయం భావః. శ్లో."ఊర్ధ్వం ప్రాణాహ్యుత్క్రమంతి యూనః స్థవిర

## 22 వ అధ్యాయము

ఈ ఇరువది రెండవ అధ్యాయమున శ్రీహరి ఆదేశానుసారము భగవానుడైన సనత్కుమారుడు పృథువునకు జ్ఞానమును ఉపదేశించుట కీర్తింపబడుచున్నది.

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

విపులమైన పరాక్రమముగల పృథువును జనులు ఈ విధముగా స్తుతిస్తూ ఉండగా సూర్యతేజస్సుగల నలుగురు సనకాది మునులు అచ్చటకు వచ్చిరి. 1

లోకములోని జనులను పాపరహితులను చేయుచున్న, ఆకాశమునుండి దిగివచ్చుచున్న వారి కాంతిని బట్టి వీరు సనకాదులని, సిద్ధేశ్వరులని గుర్తించి వారిని తన అనుచరగణ సహితుడై దర్శించెను. 2

వారి రాకతో, దర్శనముచేత, పోయిన ప్రాణములు మళ్ళీ వెనుకకు తెచ్చుకోవలెనను కోరిక కలవానివలె సదస్యులతో సహా లేచి నిల్చుండెను.

ఇది భావము:- స్మృతులు ఈ విధముగా చెప్పుచున్నవి. పెద్దలను దర్శించినపుడు వారికంటే చిన్నవారి ప్రాణములు అనగా పెద్దవారిని

ఆగతే, ప్రత్యుత్థానాభివాదాభ్యాం పునస్తాన్ ప్రతిపద్యత” ఇతిస్మృతేః. ప్రాణాస్తావత్తత్తేజసా క్షిప్తాః తాన్ ప్రత్యుద్గచ్ఛంతి. అతః స్వయమనుద్గచ్ఛతః ప్రాణహానిస్స్యాదితి భయాదివ ససంభ్రమం ప్రత్యుద్గమం చకారేతి. సహ సద్భైస్యరనుగైశ్చ వర్తమానః. ఇంద్రియేశో జీవః గుణాన్ గంధాదీన్ ప్రతియథోద్గచ్ఛతీత్యౌత్సుక్యే దృష్టాంతః. 3

దర్శించిన చిన్నవారి ప్రాణములు పైకెగిరిపోతవి. పెద్దవారిని చూడగానే లేచి నిలుచోవడం, పాదనమస్కారము చేయడం వలన మళ్ళీ ప్రాణములు శరీరమున ప్రవేశించును. ప్రాణములు ఆ తేజోవంతుల తేజస్సుచే ఆకర్షింపబడి, వారి వద్దకు వెళ్ళిపోతవి. కనుక స్వయముగా తానే లేచి వెళ్ళకుంటే ప్రాణహాని జరుగగలదేమోయను భయముగల వానివలె ససంభ్రమముగా ఎదురువెళ్ళుచున్నాడు. ఎంత ఉత్సుకతతో అంటే ఏ విధముగా జీవుడు గంధాది గుణములయందు ఎంత ఉత్సుకతతో ప్రవర్తిస్తాడో అంత వేగముగా యని తాత్పర్యము. 3

శ్లో॥ గౌరవాద్యంత్రితస్సభ్యః ప్రశ్రయానతకంధరః ।
విధివత్పూజయాంచక్రే గృహీతాద్యర్హణాసనాన్ ॥ 4

టీ:- గౌరవాదితి. యంత్రితో వశీకృతః గృహీత మధ్యర్హణ మర్ఘ్య మాసనం. చ యైః తాన్. 4

సత్పురుషుడైన పృథువు వారిపట్ల గౌరవముచే వశీకృతుడై , వినయముగా శిరస్సు వంచి, వంగిన శరీరము వాక్కు గలవాడై అర్ఘ్య ఆసనములు సమర్పించి, వారు స్వీకరించిన పిదప ఆ మునీశ్వరులను విధివిధానముగా పూజించెను. 4

శ్లో॥ తత్పాద శౌచ సలిలైర్మార్జితాలక బంధనః ।
తత్ర శీలవతాం వృత్తమా చరన్మాయన్నివ ॥ 5

టీ:- తదితి. మార్జితం క్షాళితమల కబంధనం కేశబంధనం యస్య మానయన్నివ స్వయం చచార. 5

వారి పాదములను కడిగి ఆ నీటిచే తన జుట్టు తడిసేట్టుగా శిరస్సుపై చల్లుకొనెను. అక్కడ శీలవంతులైనవారి నడవడిని అంగీకరించి ఆచరించెను. 5

శ్లో॥ హాటకాసన ఆసీనాన్ స్వధిష్ణ్యేష్వివ పావకాన్ ।
శ్రద్ధాసంయమ సంయుక్తః ప్రీతః ప్రాహ భవాగ్రజాన్ ॥ 6

టీ:- హాటకాసన ఇతి. భవస్యాప్యగ్రజత్వేన మాన్యాన్. 6

**పృథురువాచ**

శ్లో॥ అహో ఆచరితం కిం మే మంగళం మంగళాయనాః ।
యస్య వో దర్శనం హ్యాసీద్దుర్దర్శానాం చ యోగిభిః ॥ 7

శ్లో॥ కిం తస్య దుర్లభతరమిహలోకే పరత్ర చ ।
యస్య విప్రాః ప్రసీదంతి శివో విష్ణుశ్చ సానుగః ॥ 8

టీ:- ప్రీతః ప్రాహేత్యుక్తం తదేవ ప్రీతిపూర్వకం వచనమాహ-దశభిః అహో ఇతి. హే మంగళాయనాః మంగళమయనం యేషాం మయా కిం మంగళమాచరితం యస్య మే యోగిభిరపి దుర్దర్శానాం. (7-8)

శివుడిచేత గూడా "మా అన్నయ్యలు వీరని" గౌరవింపబడే సనకాదులు బంగారు సింహాసనములపై, వారివారి వేదులయందు (స్థానములలో) అగ్నివలె కూర్చున్నవారిని గూర్చి శ్రద్ధ, ఇంద్రియ నిగ్రహములతో కూడిన పృథువు సంతోషముతో ఈ విధముగా పలికెను. 6

**పృథువు ఈ విధముగా పలికెను.**

ప్రీతుడై ఇట్లు పలికెనని చెప్పబడెను. ఆ ప్రీతి పూర్వక వాక్కులను గూర్చి చెప్పుచున్నాడు.

మంగళములకు ఆశ్రయమైనవారలారా! ఆహా నేను ఏమి పుణ్యమును చేసుకొంటిని. ఏ సత్కర్మలను పూర్వము ఆచరించితిని. యోగులకుగూడా దర్శింపశక్యముకాని మీ దర్శనము నాకుకలిగినది. 7

అనుయాయులతో గూడిన శివుడు, విష్ణువు వేదవేత్తలైన బ్రాహ్మణులు ఎవరికి ప్రసన్నులౌతారో వారికి ఈ లోకమున, పరలోకమున దుర్లభమనునది లేనేలేదు. 8

శ్లో॥ నైవ లక్షయతే లోకో లోకాన్ పర్యటతోఽపి యాన్ ।
యథా సర్వదృశం సర్వ ఆత్మానం యేఽస్య హేతవః ॥ 9

టీ:- దుర్దర్శత్వమాహ-నైవేతి. సర్వదృశమాత్మానం. యథా సర్వే దృశ్యా న లక్షయంతే అస్య విశ్వస్య హేతవో మహదాదయో మన్వాదయో వా. యద్వా కథంభూతాన్ యే అస్య సర్వదృగాత్మదర్శనస్య హేతవస్తాన్. 9

దుర్దర్శత్వమును గూర్చి చెప్పుచున్నాడు. ఏ విధముగానైతే దృశ్య ప్రపంచము సర్వసాక్షియైన ఆత్మను దర్శించనట్టుగా! ఈ జగత్తుకు హేతువులైన మహదాదులను లేక మన్వాదులను లేదా ఆత్మ దర్శనమునకు హేతువులను దర్శించుట లేదో అలాగే లోకమున సంచరిస్తున్నా వారిని లోకము గుర్తించదుకదా! 9

శ్లో॥ అధనా అపి తే ధన్యాస్సాధవో గృహమేధినః ।
యద్గృహాహ్యర్హవర్యాంబు తృణ భూమీశ్వరావరాః ॥ 10

టీ:- అధనా ఇతి. యేషాం సాధూనాం గృహాః అర్హాణాం పూజ్యానాం వర్యాః వరణీయాః స్వీకారార్హాః అంబాదయో యేషు తాదృశాః అంబు చ తృణం చ భూమిశ్చ ఈశ్వరో గృహస్వామీ చ అవరా భృత్యాదయశ్చ. (10)

ఏ సాధుజనులయొక్క గృహములు పూజ్యులైన వారికి వరణీయములో అనగా ఎవరి ఇంటియందు నీరు, దర్భలు, కూర్చొనుటకు భూమి, అవసరాలు సమకూర్చే సేవకులు, గృహస్వామి, స్వీకార యోగ్యులో అట్టి సాధుజనులైనట్టి గృహస్థులు ధనము లేనప్పటికీ వారే ధన్యులు. 10

శ్లో॥ వ్యాళాలయ ద్రుమా ఏత్యేపరిక్తాఖిల సంపదః ।
యద్గృహా స్తీర్థపాదీయ పాదతీర్థ వివర్జితాః ॥ 11

టీ:- వ్యాళేతి. వ్యాళానామాలయా ద్రుమా ఏవ తే. అర్తికాః పూర్ణాః

ఎవరి ఇండ్లు విష్ణుభక్తుల పాదతీర్థములు లేనివో! (అనగా భగవద్భక్తుల కాళ్ళుకడిగిని నీరులేనివో) వారి ఇండ్లు తరగని సంపదలతో నిండియున్నప్పటికి పాములతో నిండియున్న చెట్లవంటివే. (11)

అఖిలాస్సంపదో యేషు. తాదృశా అపి యే గృహాః. తీర్థపాదీయా వైష్ణవా స్తేషాం పాదతీర్థేన వివర్జితాః. 11

శ్లో॥ స్వాగతం వో ద్విజశ్రేష్ఠా యద్వ్రతాని ముముక్షవః ।
చరంతి శ్రద్ధయా ధీరా బాలా ఏవ బృహంతి వై ॥ 12

టీ:- స్వాగతమితి. స్వాగతం భద్రమాగమనం జాతం. యద్యస్మాత్ బాలా ఏవ భవంతో బృహంతి వ్రతాని చరంతి. యద్వా యేషాం వో వ్రతాని అన్యే బాలాశ్చరంతి. 12

ఓ బ్రాహ్మణ శ్రేష్ఠులారా! మీకు స్వాగతము. మీ ఆగమనము మాకు మంగళములను కలిగించునది. బాలురవలె ఉన్నా ముముక్షువులై శ్రద్ధగా, ధైర్యముగా, గొప్పనైన పరివ్రాట్టులకు దీటైన, ఉచితమైన వ్రతములను ఆచరించుచున్నారు. లేదా! మీయొక్క ఆచరణను (అజ్ఞులైన) ముముక్షువులు సైతం అనుకరించి ఆచరించుచున్నారు. 12

శ్లో॥ కచ్చిన్నః కుశలాం నాథా ఇంద్రియార్థార్థవేదినామ్ ।
వ్యసనావాప ఏతస్మిన్పతితానాం స్వకర్మభిః ॥ 13

టీ:- కచ్చిదితి. ఇంద్రియార్థమేవార్థం పురుషార్థం యే విదంతి తేషాం నః వ్యసనాన్యుప్యంతే యస్మిన్ తస్మిన్ సంసారే. 13

ఓ ప్రభువులారా! విషయభోగములను మాత్రమే పురుషార్థములని భావించి, విపత్తులనే విత్తులుగా నాటే ఈ సంసారమున స్వకర్మలచే పడియున్న మాకు క్షేమము గలదా? 13

శ్లో॥ భవత్సు కుశలప్రశ్న ఆత్మారామేషు నేష్యతే ।
కుశలాకుశలా యత్ర న సంతి మతివృత్తయః ॥ 14

మరి లోకములో ఇంటికి వచ్చిన వారిని కుశలమడుగుతారు. బాగున్నారా? యని కాని ఇక్కడ మాకు క్షేమమున్నదా అని అడుగడు. అనగా! అయ్యా ఆత్మచేత రమించే మిమ్ములను కుశలమడగడం యుక్తం

టీ:- నన్వభ్యాగతానాం కుశలం పృచ్ఛ్యతే న త్వాత్మనస్త్రత్రాహ - భవత్స్వితి. 14

కాదు. ఎందుకంటే మీ అంతఃకరణమున కుశలము, అకుశలమనే వృత్తులు ఉండనే ఉండవు. 14

శ్లో॥ తదహంకృత విస్రంభసుహృదోఽత్ర తపస్వినామ్ ।
సంపృచ్ఛేభవ ఏతస్మిన్ క్షేమః కేనాంజసా భవేత్ ॥ 15

టీ:- తదితి. తత్తస్మాత్కృత విశ్వాసస్సన్ తపస్వినాం సుతపసాం సుహృదోయుష్మాన్ పృచ్ఛామి. 15

శోకముచే తాపము పొందినవారికి హితమును చేయు మిమ్ములను, మీ యందు విశ్వాసము కలిగి, ఈ సంసారమున దేనిచే తొందరగా భగవత్ప్రాప్తి కలుగునని అడుగుచున్నాడు. 15

శ్లో॥ వ్యక్తమాత్మవతామాత్మా భగవానాత్మభావనః ।
స్వానామనుగ్రహాయేమాం సిద్ధరూపీ చ రత్యజః ॥ 16

టీ:- న ఖల్వన్యయోగి తుల్యా యూయం కింతుసాక్షాద్భగవానేవే త్యాహ - వ్యక్తమితి. వ్యక్తం నిశ్చితం ఆత్మవతాం ఆత్మత్వేన ప్రకాశమానః ఆత్మానం భావయతి ప్రకాశయతీతి తథా. ఇమాం పృథివీం చరతి. 16

మీరు ఇతర యోగులవలె కాదు, సాక్షాత్తు భగవంతుడే! ధీరులైన వారి ఆత్మగా ప్రకాశిస్తూ, తనను తాను ప్రకాశింపచేసుకొనువాడు, తన భక్తుల అనుగ్రహించుటకు సిద్ధరూపుడై (మీ రూపములో) శ్రీనారాయణుడే ఈ భూమిపై సంచరించుచున్నాడు అని నిశ్చితమైనది. (16)

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ పృథోస్తత్సూక్తమాకర్ణ్యసారం సుష్ఠుమితం మధు ।
స్మయమాన ఇవ ప్రీత్యా కుమారః ప్రత్యువాచ హ ॥ 17

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

సారవంతమైన, గంభీరమైన అర్థము కలిగిన, తక్కువ అక్షరాలతో, వినసొంపుగా ఉన్న పృథువు మాటలను విని, చిరునవ్వుతో, ప్రేమగా సనత్కుమారుడు బదులు చెప్పెను. 17

**సనత్కుమార ఉవాచ**

శ్లో॥ సాధుపృష్టం మహారాజ సర్వభూతహితాత్మనా ।
భవతా విదుషా చాపి సాధూనాం గతిరీదృశీ ॥ 18

టీ:- పృథోరితి. సూక్తం శోభనం వచనం. సారం న్యాయం సుష్ఠు గంభీరార్థం. మితమల్పాక్షరం మధు శ్రోత్రప్రియం. ముఖప్రసత్యా స్మయామాన ఇవ ప్రతీయ మానః. (17-18)

**సనత్కుమారుడు ఈ విధముగా పలికెను.**

మహారాజా! నీకు తెలిసినప్పటికి సర్వప్రాణులకు హితము జరిగే అంశాన్ని చక్కగా ప్రశ్నించినావు. సాధుజనుల బుద్ధి, ఎల్లప్పుడూ ఇతరుల మేలునే కోరుతుంది కదా! 18

శ్లో॥ సంగమః ఖలు సాధూనాముభయేషాం చ సమ్మతః ।
యత్సంభాషణ సంప్రశ్నస్సర్వేషాం వితనోతి శమ్ ॥ 19

టీ:- స్వయమపి పృథోస్సంగమ మభినందంతి. సంగమ ఇతి. ఉభయేషాం వక్తౄణాం చ శ్రోతౄణాం చ యేషాం సంభాషణ సహిత స్సంప్రశ్నః సర్వేషాం శం సుఖం విస్తారయతి. 19

పృథువు యొక్క కలయిక తనకు గూడా సమ్మతమైనదని అభినందించుచున్నాడు. ఎవరి సంభాషణతో కూడిన యోగ్యమైన ప్రశ్న అందరికి గూడా క్షేమమును, సుఖమును కలిగించునో, విస్తరింపజేయునో అట్టి సాధుజనుల కలయిక ఇద్దరకుగూడా సమత్తమే. (19)

శ్లో॥ అస్త్యేవ రాజన్ భవతో మధుద్విషః
పాదారవిందస్య గుణానువాదనే ।
రతిస్సదాయా వితనోతి నైష్ఠికీ కామం
కషాయం మలమంతరాత్మనః ॥ 20

వారి కలయికను, ప్రశ్నను అభినందించి అడిగినదానికి జవాబుగ మోక్షసాధనమును చెప్పుచున్నాడు. ఓ రాజా! నీకు మధువైరియగు శ్రీహరి యొక్క పాదారవిందము యొక్క గుణముల అనువాదము ప్రశ్నద్వారా చెప్పుటయందు ప్రవర్తించగా వినుటయందు

టీ:- తదేవం సంగమం ప్రశ్నం చాభినంద్యానువాదముఖేనైవ మోక్షసాధనముపదిశతి-అస్త్యేవేతి. గుణానామనువాదనే ప్రశ్న ద్వారేణానువాదః ప్రవర్తతే శ్రవణ ఇత్యర్థః. ఆత్మనో మనసః అంతః అంతస్థం కామాత్మకం మలం విధునోతి. కషాయం ధాతురాగ వద నివర్త్యం. 20

పొందశక్యముకాని నిశ్చలమైన ప్రీతి గలిగియున్నది. ఆ శ్రవణము మనస్సునగల కోరికలనబడే మాలిన్యమును గైరిక, శిలాదులయందు గల రంగువలె తొలగింపరాని మనోవాసనలను సైతం తొలగించును. (20)

శ్లో॥ శాస్త్రేష్వియానేవ సునిశ్చితో నృణాం
క్షేమస్య సధ్ర్యగ్విమృశేషు హేతుః ।
అసంగ ఆత్మవ్యతిరిక్త ఆత్మన్ దృఢా
రతిర్బ్రహ్మణి నిర్గుణే చ యా ॥ 21

టీ:- చిత్తశుద్ధ్యైవ బహిర్వైరాగ్యమాత్మని రతిశ్చ భవతి.న చ తతోఽధికం సాధనమస్తి శాస్త్రేషు తయోరేవ మోక్షహేతుత్వ నిశ్చయాదిత్యాహ -శాస్త్రేష్వితి.సధ్ర్యక్విమృశేషు సమ్యక్ విచారవత్సు క్షేమస్య హేతురేతావానేవ సునిశ్చితః కోఽసౌ ఆత్మవ్యతిరిక్తే దేహాదౌ. అసంగో వైరాగ్యం ఆత్మని రతిశ్చ ఆత్మనో విశేషణం నిర్గుణే బ్రహ్మణీతి. 21

చిత్తశుద్ధి ద్వారా మాత్రమే బాహ్య వైరాగ్యము, ఆత్మయందు రతి కలుగుతుంది. దానికంటే ఇంకా ఎక్కువ సాధనము లేదు. శాస్త్రములయందు వైరాగ్య ఆత్మ రతులే మోక్ష హేతువులుగా నిశ్చయింప బడుటవలన, చక్కగా విచారించిన శాస్త్రములయందు క్షేమమునకు కారణము ఇంతమాత్రమే నిశ్చయింపబడినది. ఆత్మకంటే వేరైన దేహాదులయందు వైరాగ్యము, నిర్గుణ బ్రహ్మయైన ఆత్మయందు దృఢమైన ప్రీతి మాత్రమే మోక్షహేతువులు. 21

శ్లో॥ సా శ్రద్ధయా భగవద్ధర్మచర్యయా
జిజ్ఞాసయాధ్యాత్మిక యోగనిష్ఠయా ।
యోగేశ్వరోపాసనయా చ నిత్యం
పుణ్య శ్రవః కథయా పుణ్యయా చ ॥ 22

టీ:- నన్వేతదేవాతి దుర్లభమిత్యాశంక్యోత్తమాధికారిణః శ్రవణమాత్రేణ భవతి. అన్యస్య తు చిత్తశుద్ధ్యనుసారేణ సాధన తారతమ్యతో వర్ధమానయా భక్త్యేత్యభిప్రేత్యాహ-చతుర్భిః. సేతి. సా బ్రాహ్మణి రతి రసంగశ్చ శ్రద్ధాదిభిః స్యాదితి చతుర్థేనాన్వయః జిజ్ఞాసయా తత్తద్విశేష బుభుత్సయా పుణ్యశ్రవో యశో యస్య తస్య హరేః పుణ్యా యా కథా తయా చ. 22

మరి ఆ వైరాగ్యము కలగడమే అతి దుర్లభము అని ఆశంకించి, ఉత్తమాధికారికి శ్రవణమాత్రము చేతనే కలుగుతుంది. వేరే వారికి చిత్తశుద్ధిని అనుసరించి సాధనమున గల తారతమ్యము వలన పెరుగుచున్న భక్తిచేత కలుగుతుంది. అను అభిప్రాయము పొంది అనుచున్నాడు. ఆ బ్రహ్మయందు ప్రీతి మరియు వైరాగ్యము శ్రద్ధచేత భగవద్ధర్మములను ఆచరించుట, తత్తద్విశేషములను తెలుసుకోవాలను కోరికచేత అధ్యాత్మ యోగమందలి నిష్ఠచే, యోగులకు ప్రభువగు శ్రీహరి ఉపాసనచేత, ఎల్లప్పుడు పుణ్యప్రదమైన యశస్సు ఎవరికి గలదో అట్టి శ్రీహరి యొక్క పుణ్యకథా శ్రవణముచేత కలుగుతుంది .22

శ్లో॥ అర్థేంద్రియారామ సగోష్ఠ్య తృష్ణయా
తత్సమ్మతానామ పరిగ్రహేణ చ ।
వివిక్తరుచ్యా పరితోష ఆత్మన్వినా
హరేర్గుణ పియ్యూషపానాత్ ॥ 23

టీ:- అర్థేతి. అర్థారామా అర్థనిష్ఠాస్తామసాః. ఇంద్రియారామాః కామనిష్ఠా రాజసాః తైః సహ యా గోష్ఠి తస్యామతృష్ణయా. తేషాం చ యే సమ్మతా అర్థాః కామాశ్చ తేషామపరిగ్రహేణ వివిక్తే విజనే యా

అర్థారాములు అనగా అర్థముయందే నిష్ఠగలవారు తామసులు. ఇంద్రియారాములు అనగా కామనిష్ఠులు రాజసులు. వారిచే కలిసి ఉండాలనే ఆసక్తి లేకుండుటచే, రాజసతామసులకు ఏ అర్థ కామములు సమ్మతములో వాటిని పరిగ్రహించకుండా, వాటియందు అనాసక్తిచేత విజనము యందు ఆసక్తిచేత అనగా ఏకాంత వాసముచేత ఆత్మయందే ధ్యానముచేయు స్థితి కలుగగా ఆ బ్రహ్మ యందు ప్రీతి, కలుగును. ఒకవేళ శ్రీహరి గుణామృతపానుడే అయినాడో అతనికి ఏకాంత వాసము అక్కరలేదు. ధ్యానము యందే స్థితినీ పొందవలసిన అవసరము

రుచి స్తయా ఆత్మస్యేవ పరితోషే చ మతిః, స్యాత్ కింతు హరేర్గుణ పియ్యూష పానాద్వినా తస్మిన్ సతి వివిక్తే రుచిర్నకార్యా. న చాత్మని పరితోషః కార్య ఇత్యర్థః. 23

లేదు. వారికి భక్తి కరతలామలకమే. 23

శ్లో॥ అహింసయా పారమహంస్య చర్యయా
స్మృత్యా ముకుందాచరితాగ్ర్యసీధునా ।
యమైరకామైర్నియమైరనిందయా
నిరీహయా ద్వంద్వ తితిక్షయా చ ॥ 24

టీ:- అహింసయేతి. పారమహంస్యచర్యయా ఉపశమాదిప్రధానయా వృత్త్యా. స్మృత్యా ఆత్మహితానుసంధానేన ముకుందాచరితమేవాగ్ర్యం సింధుశ్రేష్ఠమమృతం తచ్చరిత స్మృతి సుఖేనేత్యర్థః. మార్గాంతరస్యా నిందయా నిరీహయా యోగక్షేమార్థక్రియారాహిత్యేన. ద్వంద్వ తితిక్షయా శీతోష్ణాది ద్వంద్వం సహనేనేతి. 24

శ్లో॥ హరేర్ముహుస్తత్పర కర్ణపూర
గుణాభి ధానేన విజృంభమాణయా ।
భక్త్యాహ్యసంగస్సదసత్యనాత్మని
స్యాన్నిర్గుణే బ్రహ్మణి చాంజసా రతిః ॥ 25

అహింసచే, ఉపశమాది ప్రధానమైనవృత్తిచే (పారమహంసవృత్తి) ఆత్మహితమును అనుసంధానము చేయుటచే ముకుందుని చరితమే శ్రేష్ఠమైన అమృతము. అనగా భగవచ్చరిత స్మృతి సుఖముచేత ఇతర మార్గములను అనగా ఇతర మతములను నిందించకుండుటచేత, కామనారహితమైన యమములు సత్యాదులచే నియమములు, స్నానాదులచేత, తన యోగక్షేమములకొరకు ఏ పనులు చేయుకుండుట చేత శీతోష్ణాది ద్వంద్వమును సహించుటచేత, వర్ధిల్లుచున్న శ్రీహరి భక్తిచే పలుమార్లు హరి భక్తుల కర్ణాలంకారములైన శ్రీహరి గుణ కీర్తనముచే కార్యకారణ రూపమైన ప్రపంచమున అనాసక్తి, నిర్గుణ బ్రహ్మయందు వెంటనే దృఢమైన ప్రీతి కలుగును. 24, 25

టీ:- కథయేత్యత్రోక్తమపి కథనం భక్తావంతరంగత్వేన పునరుచ్యతే. హరేరితి. తత్పరాః హరిభక్తాః తేషాం కర్ణపూరాః కర్ణాలంకారభూతా యే హరేః గుణాః తేషామభిధానేన సదసతీ. కార్య కారణ రూపే. 25

శ్లో॥ యదా రతిర్బ్రహ్మణి నైష్ఠికీపుమా
నాచార్యవాన్ జ్ఞాన విరాగరంహసా ।
దహత్య వీర్యం హృదయం జీవకోశం
పంచాత్మకం యోనిమినోత్థితోఽగ్నిః ॥ 26

టీ:- భవత్వన్యత్రాసంగ ఆత్మరతిశ్చ తతః కిమత ఆహ-యదేతి. యదా నిష్ఠాం ప్రాప్తా రతిర్భవతి తదా ఆచార్యవాన్ సన్ జ్ఞాన విరాగ రంహసా జ్ఞాన వైరాగ్యయోగేన అవీర్యం నిర్వాసనం సత్ జీవస్య కోశమావరకమహంకారం హృదయం పుమాన్ దహతి కథంభూతం పంచమహాభూత ప్రధానం. యద్వా అవిద్యాస్మిత రాగ ద్వేషాభి నివేశాః పంచ. తదాత్మకం. ఉత్థితః ప్రజ్వలితోఽగ్నిః యోని మరణిమేవ. యద్వా-యదా రతిరాచార్యాను గ్రహశ్చ తదా ఆత్మజ్ఞాన విరాగయోర్యోగేనోత్థితః సాక్షాత్కారః అవీర్యం పునః ప్రరోహక్షమం యథా న భవత్యేవం హృదయం దహతి. శేషం సమానమ్. 26

అయితే ఇతర స్థలముల (విషయములపట్ల) అనాసక్తి ఆత్మ యందు రతి దానివలన ఏమి లాభము? అనగా ఏ కాలమందు పరబ్రహ్మయందు నిశ్చలమైన ప్రేమకలుగునో అపుడు ఆచార్యుడు సహాయముగాగలవాడై జ్ఞాన, వైరాగ్య వేగముచేత నివసించుటకు వీలులేకుండా, తిరిగి పుట్టే సామర్థ్యము లేకుండా జీవుని యొక్క ఆవరకమైన హృదయము అనగా అహంకారాత్మకమైన లింగదేహము దహింపబడును. ఆ హృదయమెట్టిది? పంచమహాభూత ప్రధాన మైనట్టిది లేదా "అవిద్యా స్మితారాగ ద్వేషాభినివేశాత్మక పంచ అవిద్యా" వృత్త్యాత్మకమైనది. ఏ విధముగానైతే అరణియందు ప్రజ్వలితమైన అగ్ని అరణిని కాల్చినట్టు, లేదా ఎప్పుడైతే బ్రహ్మరతి ఆచార్యానుగ్రహము కలుగునో అపుడు జ్ఞాన విరాగముల యొక్క వేగముచేత సాక్షాత్కారము కలిగి మళ్ళీ అవిద్యాదులు మొలకలెత్తే సామర్థ్యము లేకుండా అగును ఆ విధముగా హృదయమును దహించును. మిగిలినది సమానమే. 26

శ్లో॥ దగ్ధాశయో ముక్తసమస్తతద్గుణో
నైవాత్మనో బహిరంతర్విచష్టే ।
పరాత్మనోర్యద్వ్యవధానం పురస్తా
త్స్వప్నే యథా పురుష స్తద్వినాశే ॥ 27

టీ:- తతః కిమత ఆహ-దగ్ధాశయ ఇతి. దగ్ధః. ఆశయో హృదయము పాధిరస్య అత ఏవ ముక్తాః సమస్తాస్తద్గుణాః కర్తృత్వాదయో యేన. ఆత్మనస్సకాశాద్బహిర్ఘటాది. అంతః సుఖదుఃఖాది. నైవ విచష్టే న పశ్యత్యేవ కుత ఇత్యపేక్షాయాం ద్రష్టృ దృశ్యప్రతీతేరంతఃకరణ హేతుత్వాదిత్యాహ. పరో దృశ్యః ఆత్మా ద్రష్టా తయోర్యద్వ్యవధానం భేదకం పూర్వమాసీత్, తస్య వినాశే సతి.యథా స్వప్నే రాజహ మిత్యారోపితం సైన్యాది ద్రష్టారం దృశ్యం సైన్యం చ స్వప్నావస్థానాశేన పశ్యతి తద్వత్. 27

శ్లో॥ ఆత్మానమింద్రియార్థం చ పరం యదుభయోరపి ।
సత్యాశయ ఉపాధౌ వై పుమాన్పశ్యతి నాన్యథా ॥ 28

టీ:- ద్రష్ట దృశ్య భేదప్రతీతేరంతఃకరణ హేతుత్వమన్వయ వ్యతిరేకా భ్యాముపపాదయతి-ఆత్మానమితి. ఆత్మానం ద్రష్టారం ఇంద్రియార్థం

తరువాత ఏమి అనగా చెప్పుచున్నాడు. పరబ్రహ్మకు, తనకు, జ్ఞానమునకు పూర్వమునందు ఏ భేదముండెనో ఆ భేదజ్ఞానము నశించగా, దహింపబడిన లింగ శరీరము కలవాడు అగును. (అనుభూతితో) అందుకొరకే దానియందుగల సమస్త గుణములు, కర్తృత్వాదులు విడిచిన సాధకుడు ఆత్మకంటే వేరుగా బయట, లోపల సుఖ దుఃఖాలను చూడడు. ఎందుకనగా ద్రష్ట, దృశ్యము అను ప్రతీతికి కారణము అంతఃకరణము ఇపుడు అదే నశించినది. పరము - దృశ్యము, ఆత్మ - ద్రష్ట వాటి రెండింటికి పూర్వము ఏ భేదముండెనో అది నశించగా, సుఖదుఃఖాదులు కూడా నశించును. ఏ విధముగానైతే స్వప్నమున రాజును నేననునది ఆరోపింపబడినది, సైన్యాది ద్రష్టనో అట్లానే దృశ్యము సైన్యముగూడా ఆరోపింపబడినది. స్వప్నము తొలిగిన వెంటనే సైన్యము రాజు రెండూ లేనివిగా తెలియునుగదా! 27

ద్రష్ట దృశ్య ప్రతీతికి కారణము అంతఃకరణము అని అన్వయ వ్యతిరేకములద్వారా ఉపపాదించుచున్నాడు. ద్రష్ట, దృశ్యము ఈ రెండింటి సంబంధమునకు హేతువహంకారము. అది అంతఃకరణము ఉంటేనే జాగ్రత్స్వప్నములు చూచుచుండును. సుషుప్తి యందు ద్రష్టత్వాదులు లేవు. దానిని ఈ విధముగా చెప్పుచున్నారు. దృశ్యమును

దృశ్యం ఉభయోస్తయోః పరం సంబంధహేతుమహంకారం చ ఆశయేఽంతఃకరణే సత్యేవ జాగ్రత్స్వప్నయోః పశ్యతి అన్యథా సుషుప్తౌ తదుక్తం. శ్లో."దృశ్యానురంజితం ద్రష్ట్ఱదృశ్యం ద్రష్ట్రనురంజితమ్, అహం వృత్త్యోభయం రక్తం తన్నాశే ద్వైతమాత్మన" ఇతి. 28

రంజింపచేయునది ద్రష్ట. దృశ్యము ద్రష్టను రంజింపజేయును. అహంకారముచేత దృశ్యద్రష్టలు రెండూ కూడా రంజింపబడును. అహంకార నాశనముచే ఆత్మకు అద్వైతము సిద్ధిస్తుంది. (ఆత్మ అనగా ఏమిటో బోధపడుతుంది) 28

శ్లో॥ నిమిత్తే సతి సర్వత్ర జలాదావపి పూరుషః ।
ఆత్మనశ్చ పరస్యాపి భిదాం పశ్యతి నాన్యథా ॥ 29

టీ:- ఏకస్మిన్నాత్మని దృశ్యాదిభేదప్రతీతిరౌపాధికీతి దృష్టాంతేన స్పష్టయతి -నిమిత్త ఇతి. లోకేఽపి చ సర్వత్ర జలదర్పణాదౌ భేదనిమిత్తే సత్యేవ ఆత్మనో బింబభూతస్య పరస్య ప్రతిబింబస్య చ భేదం పశ్యతి న తు జలాద్యభావే. 29

ఒకే ఆత్మయందు దృశ్యాది భేదప్రతీతి ఉపాధి నిమిత్తమే అని దృష్టాంత పురస్సరముగా స్పష్టపరచుచున్నాడు. లోకములో ఎక్కడైనాసరే జల, దర్పణములు వేరుగా ఉన్నవి గనుక బింబభూతమైన ఆత్మకు దానికి వేరుగాఉన్న ప్రతిబింబమునకు భేదమును చూచుచున్నాడు. జల, దర్పణాలే లేకుంటే భేద దర్శనమగునా! 29

శ్లో॥ ఇంద్రియైర్విషయాకృష్టైరాక్షిప్తం ధ్యాయతాం మనః ।
చేతనాం హరతేబుద్ధేః స్తంబస్తోయమివ హ్రదాత్ ॥ 30

టీ:- తదేవం చతుర్భిః అసంగాత్మరత్యోర్మోక్షహేతుత్వముక్తం ఇదానీమనాత్మరతేః సంసారహేతుత్వమాహ- ఇంద్రియైరితి. ధ్యాయతాం గుణారోపేణస్మరతాం పుంసామింద్రియాణి స్మృతైః

ఇంతవరకు ఆత్మరతి అనాసక్తి అనునవి మోక్షహేతువులని చెప్పడం జరిగినది. ఇపుడు అనాత్మ పదార్థములయందు ఆసక్తి సంసార హేతువని చెప్పుచున్నాడు. శబ్దాది విషయములను చింతించుచున్న వారికి, స్మరించుచున్న విషయములకు ఇంద్రియములు ఆకర్షింప బడుచున్నవి. ఇంద్రియములచే మనస్సు ఆకర్షింపబడుచున్నది. విషయముల యందు ఆసక్తిని పొందుచున్నది. ఆ మనస్సు బుద్ధికిగల

విషయైశ్చాకృష్యంతే. విషయాసక్తిం ప్రాప్యంతే. తైశ్చ మన ఆక్షిప్యతే తచ్చ బుద్ధేస్సకాశాత్ చేతనాం విచారసామర్థ్యం హరతి ఏతచ్చావివేకినా న లక్ష్యత ఇతి. దృష్టాంతేనాహ - తీరజః కుశాది స్తంబో యథా మూలైస్తోయం హ్రదాదపహరతి తద్వత్. 30

బుద్ధిధర్మమైన విచార సామర్థ్యమును హరించుచున్నది. ఇది అంతా కూడా అవివేకులు గ్రహించలేని దృష్టాంతముగా చూపుచున్నాడు.సరస్సు ఒడ్డునున్న దర్భ, గడ్డి, చిన్న గడ్డిపోచ వరకు వాటి వేర్లతో నీరును అపహరించుచున్న రీతిలో అట్లా మనస్సు యొక్క విచార సామర్థ్యమును అపహరించును. 30

శ్లో॥ భ్రశ్యత్యనుస్మృతిశ్చిత్తం జ్ఞానభ్రంశః స్మృతిక్షయే ।
తద్రోధం కవయః ప్రాహురాత్మాపహ్నవమాత్మనః ॥ 31

టీ:- భ్రశ్యతీతి. చిత్తం చేతనామనుతస్యామపహృతాయాం స్మృతిః పూర్వాపరానుసంధానం భ్రశ్యతి ఏవం తద్రోధం జ్ఞానభ్రంశం ఆత్మన ఏవ హేతోః ఆత్మనోఽపహ్నవం నాశం ప్రాహుః. 31

విచార సామర్థ్యము నశించుట వలన దానిననుసరించు పూర్వాపరాను సంధానాత్మకమైన స్మృతి నశించును. స్మృతి నశించగనే జ్ఞానము నశించును. ఆత్మ హేతువైన జ్ఞానము నశించగానే ఆత్మ నాశము జరుగును అనగా నిరుపాధికమైన ఆత్మ స్ఫూర్తి కలుగదని పెద్దలనుచున్నారు. 31

శ్లో॥ నాతః పరతరో లోకే పుసంస్స్వార్థ వ్యతిక్రమః ।
యదధ్యన్యస్య ప్రేయస్త్వమాత్మనః స్వవ్యతిక్రమాత్ ॥ 32

టీ:- ఏవంభూతో నాశో భవతు తతశ్చ కిమిత్యత ఆహ-నేతి యదధి యమకృత్య అన్యస్య విషయస్య ప్రియతమత్వం. శ్రు. "ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతీ" తి శ్రుతేః. తస్యాత్మనః స్వేనైవ యో వ్యతిక్రమోఽపహ్నవః తస్మాత్ యః స్వార్థనాశః అతః పరతరః స్వార్థనాశో నాస్తి. 32

ఆత్మనాశము అనగా ఆత్మ స్ఫూర్తి కలుగకుంటే ఏమౌతుంది? అనగా "దేనిని అనుసరించి ఇతర విషయమునకు ప్రియతమత్వమో ఆత్మ ప్రయోజనము కొరకు సర్వము ప్రియమౌతుంది" అని శ్రుతి. ఆ ఆత్మకు తనచేతనే నాశము అవుతుంటే అంతకంటే స్వార్థనాశము ఇంకొకటి లేదు. 32

శ్లో॥ అర్థేంద్రియార్థాభిధ్యానం సర్వార్థాపహ్నవో నృణామ్ ।
భ్రంశితో జ్ఞానవిజ్ఞానాద్యేనావిశతి ముఖ్యతామ్ ॥ 33

టీ:- కుత ఇత్యత ఆహ-అర్థేతి. విషయస్య అర్థస్యాభిధ్యానం ఇంద్రియార్థః కామస్తన్యాభిధ్యానం సర్వార్థనాశః జ్ఞానం విజ్ఞానం పరోక్షాపరోక్షం యేన ధ్యానేన ముఖ్యతాం స్థావరతాం. 33

ఎందుకనగా! మానవులకు ధనచింత ఇంద్రియార్థమైన కామాదుల చింత ఇవి రెండూ గూడా సర్వ ప్రయోజనములను, సర్వ పురుషార్థములను నశింపజేయును. పరోక్షజ్ఞాన, అపరోక్షజ్ఞానముల నుండి భ్రష్టుడై, ధన కామాదుల చింతలచే స్థావరముల జన్మను అనగా రాళ్ళు, వృక్షములు మొదలగు జన్మలను పొందును. 33

శ్లో॥ న కుర్యాత్కేనచిత్సంగం తమస్తీవ్రం తితీర్షుకః ।
ధర్మార్థకామమోక్షాణాం యదత్యం తవిఘాతుకమ్ ॥ 34

టీ:- అనాత్మరతేరనర్థహేతుత్వముక్తం సంగస్యాప్యాహ-నేతి. యద్వస్తు ధర్మాధీనాం విఘాతుకం తస్మిన్ సంగం తమస్సంసారం. 34

అనాత్మ వస్తువులయందు ప్రీతి అనర్థములకు కారణమ -వుతుంది అని చెప్పి ఆసక్తి గూడా అని అంటూ! ఈ తీవ్రమైన సంసారమును దాటాలి అనుకున్నవాడు. ఏ వస్తువు ధర్మార్థ కామ మోక్షములకు విఘాతము కలిగించునో దానియందు ఎప్పుడు గూడా ఆసక్తిని పెంచుకోరాదు. 34

శ్లో॥ తత్రాపి మోక్ష ఏవార్థ ఆత్యంతికతయేష్యతే ।
త్రైవర్గ్యోఽర్థో యతో నిత్యః కృతాంతభయసంయుతః ॥ 35

టీ:- తుల్యవన్నిర్దేశాత్పురుషార్థ సామ్యభ్రాంతిం. వారయతి - తత్రేతి. తత్రాపి కృతాంతః కాలః. 35

ధర్మార్థ కామమోక్షములును కలిపి సమానముగా నిర్దేశము చేయుటవల్ల మోక్షముగూడా త్రివర్గములతో సమానమనే భ్రాంతిని తొలగించడానికి ఈ విధముగా చెప్పుచున్నాడు. ఈ నాలిగింటిలో మోక్షమే సర్వోత్కృష్టమైనది. ఎందువలన అనగా ధర్మార్థకామములు ఎల్లప్పుడు కాలపురుషుడి భయమునకు లోబడి ఉండేవే. 35

శ్లో॥ పరేఽపరే చ యే భావాగుణవ్యతికరాదను ।
న తేషాం విద్యతే క్షేమ ఈశవిధ్వంసితాశేషమ్ ॥ 36

టీ:- భయాసంయుతత్వమేవాహ-పర ఇతి. పరే బ్రహ్మాదయః అపరే అస్మదాదయః. గుణక్షోభాదను పశ్చాద్భవంతి ఈశః కాలః తేన విధ్వంసితా ఆశిషో యేషాం. 36

ధర్మార్థాదులు ఏ విధముగా భయసంయుతములో చెప్పు-చున్నాడు. బ్రాహ్మాది దేవతలు కానీ, మానవాది ప్రాణులుగానీ, సత్త్వ రజస్తమో గుణపరిణామ మాత్రముచే పుట్టిరి. కాలపురుషుడు ఈ ప్రాణుల మనోరథములను విధ్వంసము చేయును. కావున ఈ ప్రాణులకు ఆత్యంతికమగు క్షేమము కలుగుట లేదు. 36

శ్లో॥ తత్త్వం నరేంద్రజగతామధితస్థుషాం చ
దేహేంద్రియాసు ధిషణాత్మభిరావృతానామ్ ।
యః క్షేత్రవిత్తపతయా హృది విష్వగావిః
ప్రత్యక్చకాస్తి భగవాన్ తమవేహి సోఽస్మి ॥ 37

టీ:- తత్త్వమితి. యస్మాదనాత్మరతినర్థహేతుః తత్తస్మాజ్జగతాం జంగమానాం తస్థుషాం స్థావరాణాం చ. దేహాదిభిరాత్మానాహంకారేణ చ. ఆవృత్తానాం హృది యశ్చకాస్తి ప్రకాశతే తమవేహి. కథం సోఽస్మీతి సోఽస్తీతిపాఠే స ఏవ ఏకోఽస్తి తతోఽన్యదసదిత్యర్థః. నను జీవో హృది చకాస్తి నాన్యస్తత్రాహ-క్షేత్రవిదం జీవం తపతి నియమయతీతి క్షేత్ర విత్తపః తస్య భావ స్తత్తా తయా.అంతర్యామిరూపేణ. యద్వా-క్షేత్రవిత్తే అహం మమతాస్పదేపాతీతి క్షేత్రవిత్తపః తేన రూపేణ జీవస్తు

ఓ నరేంద్రా! ఆత్మకంటే వేరైనవాటియందు ప్రీతి, అనర్థమునకు కారణమెందుకనగా సకల ప్రాణుల దేహము, ఇంద్రియములు, ప్రాణములు, బుద్ధి మరియు అహంకారముచే కప్పివేయబడిన స్థావర, జంగమముల ప్రాణుల హృదయమందు భగవానుడు క్షేత్రజ్ఞుడగు జీవుని నియమించు వాడుగా ప్రత్యక్షమగుచున్నవాడై సర్వసాక్షియై అంతటా ప్రకాశించుచున్న ఆ పరమాత్మను తెలుసుకో. ఏవిధముగా? ఆ పరమాత్మ నేనే అని "సోఽస్తి" అను పాఠమునసరించితే అర్థము ఈ విధముగా చెప్పాలి. అతడు ఒక్కడే యున్నాడు. అతడికంటే భిన్నమైనది అసత్తు మరి జీవుడు హృదయమున ప్రకాశించుచున్నాడు. అక్కడ వేరులేరన్నారు? భగవంతుడు "క్షేత్రవిత్తపథయా" "క్షేత్ర విదం జీవం, తపతినియామయతీతి, క్షేత్రవిత్తపః, తస్య భావస్తత్తా, తయా అంతర్యామిరూపేణ" జీవుడిని నియంత్రించేవాడు అంతర్యామియే

పారతంత్ర్యాన్నపాతి. నను కర్మ జీవం నియచ్ఛతి న ఆవిః ప్రత్యక్షః తర్హి బుద్ధిః న ప్రత్యక్ ప్రతిలోమం చ కాస్తి. బుద్ధిస్తు పరాగ్విషయాకారేణ. తర్హ్యహంకారః న విష్వక్. వ్యాప్తత్వేన. సతు పరిచ్ఛిన్నః ఏవంభూతో యోభగవాన్ తమవేహితి. 37

శ్లో॥ యస్మిన్నిదం సదసదాత్మతయా విభాతి
మాయావివేకవిధుతి స్రజి వాహిబుద్ధిః ।
తం నిత్యముక్తపరిశుద్ధ విబుద్ధతత్త్వం
ప్రత్యూఢ కర్మ కలిల ప్రకృతిం ప్రపద్యే ॥ 38

ఆ రూపములో ఉన్నాడని అర్థము. అహంతాస్పదము దేహము, మమతాస్పదము స్త్రీ, పుత్ర, ధనాదులు వాటిని రక్షించువాడి రూపమున గల దేవుడు రక్షించలేడా? అనగా అతడు పరతంత్రుడు కనుక రక్షించలేడు. మరి కర్మజీవుడిని నియంత్రిస్తుంది. కదా అనగా లేదు ఎందుకనగా అంతర్యామిరూపేణ ప్రత్యక్షమతడు, కర్మ అట్లాకాదు. మరి బుద్ధియే నియంత్రిస్తుంది అందాము అంటే కాదు. స్వబుద్ధి ప్రత్యక్షమైనప్పటికీ, పరబుద్ధి ప్రత్యక్షముకాదు. ఆత్మప్రత్యక్=బాహ్య విషయాపేక్షయా అంతః ప్రకాశము గలిగినదగుటవలన బుద్ధి బాహ్యావిషయాకారము మాత్రము పొందగలదు. మరి అహంకారమే సః అనునది కానిమ్ము కాదు. ఆత్మ సర్వవ్యాప్తము అనగా అన్ని చోట్లగలదు. అహంకారము అంతఃకరణ విచ్ఛిన్నమై ఉంటుంది. కనుక పరిచ్ఛిన్నము (కొంత స్థలమున మాత్రమే కలిగి ఉండును) కనుక అపరిచ్ఛిన్నుడు స్వయంప్రకాశుడు, ప్రత్యక్షముగాకలవాడు, అంతర్యామి, రక్షించువాడు అట్టివాడు భగవానుడు అని తెలుసుకోవాలి. 37

స్థావర జంగమాదుల హృదయమందు ప్రకాశించుచున్నాడు. అనగా వాటి అంతఃకరణము సత్వరజస్తమోగుణాత్మకము వాటి సంబంధముచేత త్రిగుణ మాలిన్యము అంటుతుంది కదా! అని ప్రసక్తమును నిరాకరిస్తూ ఉద్రిక్తమైన భక్తిచే ఆ పరమాత్మకు

టీ:- స్థావరజంగమాదీనాం హృది చకాస్తీత్యుక్తే తేషాం సత్త్వం తత్సం బంధాదీశ్వరస్య మాలిన్యం చ ప్రసక్తం నిరాకుర్వన్నుద్రిక్త భక్త్యా తం ప్రణమతి -యస్మిన్నితి. యస్మిన్నిదం విశ్వం సదసదాత్మతయా ఉత్కృష్ట నికృష్టభావేన కార్యకారణ భావేన వా. మాయైవ విభాతి. తం ప్రపద్యే. మాయాత్వే హేతుః- వివేకేన విధుతిః నిరాకృతిర్యస్య తత్. స్రజి వేతి వాశబ్దో దృష్టాంతే. నిత్య ముక్తం యతః పరిశుద్ధం తత్కుతః విబుద్ధం తత్త్వం సత్యం. అత ఏవ ప్రత్యూథా అభి భూతా. కర్మభిః కలిలా మలినా ప్రకృతిర్యేన తం. 38

శ్లో॥ యత్పాద పంకజ పలాశ విలాస భక్త్యా
కర్మాశయం గ్రథితముద్గ్రథయంతి సంతః ।
తద్వన్నరిక్తమతయో యతయోఽపి రుద్ధ
స్రోతో గుణాస్తమరణం భజ వాసుదేవమ్ ॥ 39

టీ:- తమవేహీతి జ్ఞానముదిష్టం తస్య జ్ఞానస్య దుష్కరత్వేవ జ్ఞానస్య దుష్కరత్వేన భక్తిముపదిశతి-ద్వాభ్యాం. యదితి. యస్య పాద పంకజయోః పలశాని అంగుళయః తేషాం విలాసః కాంతిః తస్య

నమస్కరించుచున్నాడు. ఏ పరమాత్మయందు ఈ విశ్వము భూత భౌతిక రూపమున లేదా ఉత్కృష్ట, నికృష్ట రూపమున మాయగానే వాసిస్తుందో, ఆ పరమాత్మకు నమస్కారము. మాయఅనడానికి హేతువు జగత్తు వివేక జ్ఞానముచే నిరాకరింప బడుచున్నది కనుక. ఏ విధముగా నిరాకరింపబడుచున్నదో దృష్టాంత ముఖమున చెపుచున్నాడు. మాల యందు అజ్ఞానజనితమైన పాము బుద్ధివలె, నిత్యముక్తము కావున పరిశుద్ధము, జ్ఞానస్వరూపవము సత్యముగాగల స్వరూపముగల పరమాత్మను శరణు వేడుచున్నాడు. కర్మ మాలిన్యముగలది ప్రకృతి; తిరస్కరింపబడిన ప్రకృతి గలవాడు పరమాత్మ. అనగా ప్రకృతి రహితుడైన పరమాత్మ శుద్ధాత్మ తత్వము దానికి నమస్కారము. 38

ఆ పరమాత్మను తెలుసుకో అని, పరమాత్మ జ్ఞానమును ఉపదేశించి, దానిని సంపాదించవడం దుష్కరము కావున భక్తిని ఉపదేశించుచున్నాడు. నిర్విషయయుక్తమైన మతిగలవారైన యోగులు ఇంద్రియ సముదాయమును నిరోధించిన వారే అయినప్పటికీ, కర్మలచేత ముడివేయబడిన అహంకారరూప హృదయ గ్రంథిని అంత తేలికగా విప్పలేకున్నారు. ఏ భగవానుని పాద పద్మాంగుళముల కాంతుల యందలి భక్తిచేత ఆ గ్రంథిని తేలికగా విప్పగలుగుతున్నారో ఆ వాసుదేవుని శరణువేడి భజింపుము. 39

భక్త్యాస్మృత్యా. కర్మాశయం అహంకార రూపం హృదయ గ్రంథిం కర్మభిరేవ గ్రథితం. రిక్తా నిర్విషయా మతిర్యేషాం. రుద్ధః ప్రత్యాహృతః స్రోతోగణ ఇంద్రియవర్గో యైః అరణం శరణం. 39

శ్లో॥ కృచ్ఛ్రోమహానిహ భవార్ణవమప్లవేశాః
షడ్వర్గ నక్రమ సుఖేన తితీర్షయంతి ।
తత్త్వం హరేర్భగవతో భజనీయమంఘ్రిం
కృత్వోడుపం వ్యసనముత్తరదుస్తరార్ణమ్ ॥ 40

మరి బ్రహ్మవిత్తైనవాడు (బ్రహ్మజ్ఞాని) బ్రహ్మను పొందుతాడని శ్రుతి. యతులు అహంకారగ్రంథిని ఎందుకు విచ్చుకోలేరనగా, ఆరు ఇంద్రియముల సమూహమనే మొసలిగల సంసారసాగరమును కఠినమైన యోగాది పద్ధతిలో తరించగోరుచున్నారు. తరింపజేసే ఈశ్వరుడులేని వారలకు ఈ తరించుటయందు పెద్ద దుఃఖము. కావున నీవు శ్రీహరి భజనీయమైన పాదమును పడవగా చేసుకొని తరింప శక్యము కాని సముద్రమువంటి సంసార దుఃఖమును తరించుము. ఆర్ణవమనుచోట అర్ణమని ఉన్నది. ఇది ఋషి ప్రయోగము కనుక తప్పులేదు. అర్ణమనగా ఉదకము దాటరాని ఉదకము వ్యసనము. 40

టీ:- నను. "బ్రహ్మవిదాప్నోతిపరమితి" శ్రుతేః కథం యతయో నోద్గ్రథయంతీత్యుచ్యతే? తత్రాహ-కృచ్ఛ్రఇతి. అప్లవేశాః ప్లవస్తరణ హేతుః ఈశో యేషాం తేన భవంతీతి తథా. మహానిహ తరణే కృచ్ఛ్రః క్లేశః తేఽపి అసుఖేన యోగాదినా ఇంద్రియషడ్వర్గ గ్రాహం భవార్ణవంతితీర్షంతి తత్తస్మాదుడుపం ప్లవం దుస్తరార్ణం దుస్తరార్ణవమిత్యర్థః. యద్వా అర్ణశబ్దే వకారాభావ ఆర్షః. దుస్తరోదకరూపం వ్యసనమిత్యర్థః40

మైత్రేయ ఉవాచ

శ్లో॥ స ఏవం బ్రహ్మపుత్రేణ కుమారేణాత్మ మేధసా ।
దర్శితాత్మగతిస్సమ్యక్ప్రశస్యో వాచ తం నృపః ॥ 41

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

ఈ విధముగా బ్రహ్మపుత్రుడైన బ్రహ్మవేత్తచే చూపబడిన (బోధించబడిని) ఆత్మతత్త్వముగలవాడై మహారాజు మునిని బాగుగా ప్రశంసించి ఇట్లు పలికెను. 41

టీ:- స ఇతి. ఆత్మ మేధసా బ్రహ్మవిదా దర్శితా ఆత్మనో గతిస్తత్త్వం యస్మై సః. 41

రాజో వాచ

శ్లో॥ కృతోమేఽనుగ్రహః పూర్వం హరిణార్తానుకంపినా ।
తమాపాదయితుం బ్రహ్మన్భగవన్ యూయమాగతాః ॥ 42

టీ:- కృత ఇతి. బ్రహ్మన్నితి సంబోధనం. ప్రాధాన్యేదేకస్య. యూయ మిత్యుక్తిః సర్వాన్ ప్రతి. 42

రాజు ఈ విధముగా పలికెను.

ఓ మహాత్మా! ఓ పూజ్యా! పూర్వము ఆపదలలో ఉన్నవారిపై దయనుచూపే శ్రీహరిచే అనుగ్రహము పొందితిని. దానిని సంపూర్ణము చేయుటకు మీరు వచ్చిరి. ఇచ్చట బ్రహ్మన్, భగవన్ అని ఏకవచన సంబోధనము ఒకరికి ప్రాధాన్యము కల్పించి, యూయమని నలుగురిని గూర్చి చెప్పినమాట. 42

శ్లో॥ నిష్పాదితంతు కార్త్స్న్యేన భగవద్భిర్ఘృణాళుభిః ।
సాధుచ్ఛిష్టం హి సర్వం మే ఆత్మనా సహ కిం దదే ॥ 43

టీ:- నిష్పాదితమితి. ఆత్మనా దేహేన సహ సర్వం రాజ్యాదికం మదీయం సాధూచ్ఛిష్టం సాధుభిః స్వీయం సన్మహ్యం ప్రసాదరూపేణ దత్తం అతస్తత్ర మమ స్వత్వాభావత్ గురుదక్షిణార్థం కిం దదే న హి పిత్రా దత్తం మోదకాది తస్మై దానరూపేణ ప్రత్యర్ప్యతే. 43

నా దేహముతో సహా రాజ్యము మొదలగు సర్వస్వమేదైనా నాదంటూ ఉంటే అంతా దయామయులైన పూజ్యులగు మీదే. మీరే మీది నాకు ప్రసాద రూపములో అనుగ్రహించారు. అందుచేత నాదంటూ ఏమి లేనప్పుడు గురుదక్షిణగా మీకు నేనేమివ్వగలను. తండ్రి ఇచ్చిన మోదకాదులను (లడ్డు మొదలగు వానిని) దాన రూపములో మళ్ళీ తండ్రికివ్వడు కదా! అనగా మీరు ఇచ్చినది నాకు గొప్పది. అది మీకే ఇస్తే ఎంగిలి పదార్థమిచ్చినట్లు అవుతుందిగదా! (43)

శ్లో॥ ప్రాణాదారాస్సుతా బ్రహ్మన్గృహాశ్చ సపరిచ్ఛదాః ।
రాజ్యం బలంమహీకోశమితి సర్వం నివేదితమ్ ॥ 44

టీ:- నివేదనం తు తదీయస్యైవ సమర్పణం యథా భృత్యో రాజ్ఞే సేవారూపేణ తాంబూలాదికమర్పయతి. తథా మమాపి సర్వం నివేదితం స్వీకురుతేత్యాహ-ప్రాణా ఇతి. 44

ఓ పూజ్యులారా! రాజుగారి తాంబూలములే అయినప్పటికి సేవకుడు రాజుగారికి తాంబూలము సేవా రూపములో ఎలా సమర్పిస్తాడో అట్లా నేను కూడా సర్వము సమర్పించుకొంటున్నానని అంటూ. నా ప్రాణములు, భార్యా, పుత్రులు, సమస్త సామగ్రితో కూడిన ఇల్లు, రాజ్యము, సైన్యము, భూమి, ధనాగారము సర్వము మీకే సమర్పితమైనది. 44

శ్లో॥ సేనాపత్యం చ రాజ్యం చ దండనేతృత్వమేవ చ ।
సర్వలోకాధిపత్యం చ వేదశాస్త్రవిదర్హతి ॥ 45

టీ:- ఆత్మనః స్వత్వాభావం ప్రపంచయతి - సేనాపత్యం చేతి ద్వాభ్యాం. 45

తనకు వేటిపైన సత్తాలేదనిచెప్పుచున్నాడు. సేనాధిపత్యమునకు, రాజ్యమునకు, దుష్టులను శిక్షించే అధికారమునకు, సర్వలోకములపై అధికారమునకు వేదశాస్త్రవేత్తనే అర్హుడై యున్నాడు. 45

శ్లో॥ స్వమేవ బ్రాహ్మణో భుఙ్క్తే స్వం వస్తే స్వం దదాతి చ ।
తస్యైవానుగ్రహేణాన్నం భుంజతే క్షత్రియాదయః ॥ 46

టీ:- స్వమితి. వస్తే పరిధత్తే. అన్నమాత్రం కేవలం భుజంతే న తు దానే స్వతంత్రాః. 46

వేదశాస్త్రవేత్త తన స్వంతమును మాత్రమే తినుచున్నాడు, తన స్వంత వస్త్రములు మాత్రమే కట్టుకొనుచున్నాడు. తన స్వంతమును మాత్రమే ఇచ్చుచున్నాడు. ఆ బ్రాహ్మణుడి అనుగ్రహము చేతనే క్షత్రియాదులు భోగించుచున్నారు. వస్త్రములు కట్టుకొనుచున్నారు. అన్నము తినుచున్నారు. కానీ ఇదివారి స్వంతము కాదు. దానము చేయుటకు స్వతంత్రులు కారు. 46

శ్లో॥ యైరీదృశీ భగవతో గతిరాత్మవాద
ఏకాంతతో నిగమిభిః ప్రతిపాదితా నః ।
తుష్యంత్వదభ్రకరుణాస్స్వకృతేన నిత్యం
కోనామ తత్ప్రతికరోతి వినోదపాత్రమ్ ॥ 47

టీ:- సత్యపి స్వత్వే సర్వస్వేనాపి న గురోః ప్రత్యుపకర్తుంశక్యమిత్యాహ - యైరితి. ఆత్మవాదే అధ్యాత్మవిచారే. ఏకాంతతః నిశ్చయేన. నిగమిభిః వేదవిద్భిః. తే నిత్యమనల్పకరుణాః స్వకృతేనైవ దీనోద్ధరణ కర్మణా తుష్యంతు. కోనామ తత్కృతముపకారం ప్రతి స్వయముప కరోతి. ఉదపాత్రమంజలిం వినా మయా అంజలిరేవ తేభ్యో బద్ధ ఇత్యర్థః. యద్వా వినోదపాత్రం అపహాసాస్పదం ప్రత్యుపకారే ప్రవృత్తో జనానామపహాసాస్పదం భవేదిత్యర్థః. 47

ఒకవేళ ఉన్నా తనతో సహా, తన ధనాదులను మొత్తము ఇచ్చినా గూడా గురువు చేసిన ఉపకారమునకు సరితూగమనుచూ నిశ్చయముగా వేదవేత్తలైన మీ యొక్క అధ్యాత్మ విచారముచే భగవంతుని తత్త్వము మాకు నిరూపించబడినది. మీరు ఎల్లప్పుడు అనల్ప కరుణామూర్తులు. మీ చేత చేయబడిన దీనుల నుద్ధరించు పనులచేతనే సంతోషించుడు. చేతులు జోడించి నమస్కారము చేయడం తప్ప ఎవరయ్యా! మీరు చేసిన ఉపకారమునకు ప్రత్యుపకారము చేయగల వాడు? అయ్యా చేతులు జోడించి మీకు నేను బద్ధుడను అని అర్థము. వినా, ఉదపాత్రమని కాక, వినోదపాత్రమని చెప్పకుంటే ఈ అర్థము, ఒకవేళ ప్రత్యుపకారము చేయదలచితే జనుల యందు హాస్యాస్పదుడ నౌతాను అని భావము. 47

మైత్రేయ ఉవాచ

శ్లో॥ త ఆత్మయోగపతయ ఆదిరాజేన పూజితాః ।
శీలం తదీయం శంసంతః ఖేऽభూవన్మిషతాం నృణామ్ ॥ 48

టీ:- త ఇతి. ఖేऽభూవన్ ఆకాశమార్గే గతాః. 48

మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

ఆత్మయోగమునయందు శ్రేష్ఠులైన ఆ మహర్షులు ఆదిరాజైన పృథువుచేత పూజింపబడి అతడి సచ్ఛీలమును ప్రశంసిస్తూ జనులు చూచుచుండగా ఆకాశ మార్గమున వెళ్ళిరి. 48

శ్లో॥ వైన్యోఽపి ధుర్యో మహతాం సంస్థిత్యాధ్యాత్మశిక్షయా ।
ఆప్తకామమివాత్మానం మేన ఆత్మన్యవస్థితః ॥ 49

టీ:- వైన్య ఇతి. ధుర్యో ముఖ్యః అధ్యాత్మ శిక్షయా సంస్థితిరేకాగ్రతా తయా ఆత్మవ్యవస్థితస్సన్ మేనే. 49

గొప్పవారిలో ముఖ్యుడైన పృథువు ఆత్మతత్త్వము యొక్క ఉపదేశముచే గలిగిన చిత్తైకాగ్రతో తన స్వరూపమున నిలిచియున్నవాడై తనను సమస్తమైన కోరికలు తీరినవానిగా తలచెను. 49

శ్లో॥ కర్మాణి చ యథా దేశం యథా కాలం యథా బలమ్ ।
యథోచితం యథావిత్తమకరోద్బ్రహ్మసాత్కృతమ్ ॥ 50

టీ:- కర్మాణీతి. బ్రహ్మసాత్కృతం బ్రహ్మణ్యర్పితం యథా భవతి. తథా. 50

కాలము నతిక్రమించకుండా, దేశము నతిక్రమించకుండా, బలము నతిక్రమించకుండా, ఔచిత్యము నతిక్రమించకుండా, విత్తము నతిక్రమించకుండా, ఏ విధముగా కర్మలు బ్రహ్మార్పితములగునో ఆ విధముగా (నిష్కామముగా) కర్మలనాచరించెను. 50

శ్లో॥ ఫలం బ్రహ్మణి సన్న్యస్య నిర్విషంగస్సమాహితః ।
కర్మాధ్యక్షం చ మన్వాన ఆత్మానం ప్రకృతేఃపరమ్ ॥ 51

కర్మఫలమును బ్రహ్మకు సమర్పించి కర్మలయందు అనాసక్తుడై, చిత్తైకాగ్రత కలిగి తనను ప్రకృతికంటే అతీతమగు కర్మ సాక్షిగా ఉదాసీనుడిగా తలచి కర్మలనాచరించెను. 51

శ్లో॥ గృహేషువర్తమానోఽపి ససామ్రాజ్యశ్రియాన్వితః ।
నాసజ్జతేంద్రియార్థేషు నిరహంమతిరర్కవత్ ॥ 52

సామ్రాజ్యలక్ష్మితో గూడి యున్నప్పటికీ ఇంటియందు ఉన్నప్పటికి అహంకారము లేనివాడై ఆ పృథువు, ఏ విధముగానైతే సూర్యుడు అన్నింటియందు తన కిరణములను ప్రసరింపచేసినప్పటికీ వాటి

ఓం నమో భగవతే వాసుదేవాయ ఓం నమో భగవతే వాసుదేవాయ

టీ:- ఫలమితి. నిర్విషంగః కర్మస్వనాసక్తః. కర్మాధ్యక్షం కర్మసాక్షిణ ముదాసీనం మన్వానో అకరోదితి పూర్వేణైవాన్వయః. నాసజ్జతేత్యుత్తరేణ వా. (51-52)

సంపర్కమును ఎలా పొందడో ఆ విధముగా ఇంద్రియార్థములైన భోగవస్తువులయందు ఆసక్తిని పొందలేదు. 52

శ్లో॥ ఏవమధ్యాత్మ యోగేన కర్మాణ్యనుసమాచరన్ ।
పుత్రానుత్పాదయామాస పంచార్చిష్యాత్మసంమతాన్ ॥ 53

ఈ విధముగా ఆత్మనిష్ఠగలవాడై శాస్త్రానుసారముగా కర్మల నాచరిస్తూ, భార్యయైన అర్చిషియందు తనకు తగియున్న విజితాశ్వుడు, ధూమ్రకేశుడు, హర్యశ్వుడు, ద్రవిణుడు, వృకుడు అను ఐదుగురు కుమారులగనెను. 53

శ్లో॥ విజితాశ్వం ధూమ్రకేశం హర్యశ్వం ద్రవిణం వృకమ్ ।
సర్వేషాం లోక పాలనాం దధారైకః పృథుర్గుణాన్ ॥ 54

అచ్యుతుని అవతారమైన పృథువు ఒక్కడే సర్వలోక పాలకుల గుణములను జగత్తునగల ప్రాణులను రక్షించుటకు ఆ యా కాలముల యందు ఆ యా గుణములను ధరించెను. 54

శ్లో॥ గోపీథాయ జగత్సృష్టేః కాలే స్వే స్వేఽచ్యుతాత్మకః ।
మనోవాఙ్మూర్తిభిస్సౌమ్యైర్గుణైస్సంరంజయన్ప్రజాః ॥ 55

టీ:- ఏవ ఇతి. అర్చిషి భార్యాయాం. (53-55)

తన మనస్సు, వాక్కు, వ్యాపారములచేత మనోహరమగు గుణములచేత ప్రజలను రంజింపచేయుచూ, ఓషధులకు రాజైన రెండవ చంద్రునివలె "రాజు" అను నామధేయమును పొందెను. (రాజు అనగా చంద్రుడు - చక్రవర్తి అను అర్థములుగలవు) 55

శ్లో॥ రాజేత్యధాన్నామధేయం సోమరాజ ఇవాపరః ।
సూర్యవద్విసృజన్గృహ్ణన్ప్రతపంశ్చ భువో వసు ॥ 56

టీ:- రాజేతి. సోమశ్చాసౌ రాజా చ స ఇవ భువో వసు ధనం గృహ్ణన్ విసృజంశ్చాసౌ సూర్యవత్. రాజ్ఞః ప్రతపనమాజ్ఞాకరణం. 56

శ్లో॥ దుర్ధర్షస్తేజసే వాగ్నిర్మహేంద్ర ఇవ దుర్జయః ।
తితిక్షయా ధరిత్రీవ ద్యౌరివాభీష్టదో నృణామ్ ॥ 57

టీ:- దుర్ధర్ష ఇతి. అగ్నిరివ దుర్ధర్షః ద్యౌస్స్వర్గ ఇవ. 57

శ్లో॥ వర్షతిస్మ యథా కామం పర్జన్య ఇవ తర్పయన్ ।
సముద్ర ఇవ దుర్బోధస్సత్వేనాచలరాడివ ॥ 58

పృథురాజు సూర్యుడు ఏ విధముగా ఎనిమిది మాసాలు బాగా తపిస్తూ జలమును స్వీకరించి, వర్షాకాలమున విడుస్తాడో ఆ విధముగానే సూర్యుడివలె తన ఆజ్ఞను ప్రవర్తింపచేస్తూ పన్నుల కాలములో పన్నులను స్వీకరించి, దుర్భిక్ష కాలమున పంచుతూ ఉంటాడు. అగ్నివలె తిరస్కరించుటకు సాధ్యముకాని తేజస్సు కలవాడు 56

ఇంద్రుడివలె జయించుటకు సాధ్యము కానివాడు. అపరాధమును సహించుటలో భూమివలె, మానవుల కోరికలు తీర్చుటలో స్వర్గమువంటివాడు 57

మేఘము ఏ విధముగా వర్షాకాలములో జలమును వర్షిస్తూ, జనమును తృప్తి పరుస్తుందో అట్లా ఎప్పుడైనా జనమునకు ఎంత జలము (ఏది) కావలెనో అంత వర్షిస్తూ (ఇస్తూ) జనమును తృప్తిపరచే వాడు కనుక రెండవ మేఘము అయినాడు. సముద్రము తెలియనట్లు ఇతని అభిప్రాయమిదని తెలియరాదు, స్థిరత్వమున మేరు పర్వతము వంటివాడు. 58

శ్లో॥ ధర్మరాడివ శిక్షాయామైశ్వర్యే మఘవానివ ।
కుబేర ఇవకోశాఢ్యో గుప్తార్థో వరుణో యథా ॥ 59

టీ:- వర్షతీతి. సముద్రోయథా గాంభీర్యేణైతావానితి న బుధ్యతే తథా అస్యాభిప్రాయతో దుర్బోధః. అచలరాట్ మేరురివ. (58-59)

శ్లో॥ మాతరిశ్వేవ సర్వాత్మా బలేన మహసౌజసా ।
అవిషయహ్యతయా దేవో భగవాన్ భూతరాడివ ॥ 60

టీ:- మాతరిశ్వేతి. సర్వాత్మా సర్వత్ర సంచారశక్తిః బలాదిభిః సర్వాత్మా మాతరిశ్వేన భూతరాట్ శ్రీరుద్రః. 60

శ్లో॥ కందర్ప ఇవ సౌందర్యే మనస్వీ మృగరాడివ ।
వాత్సల్యే మనువన్నృణాం ప్రభుత్వే భగవానజః ॥ 61

టీ:- కందర్ప ఇతి. అజో బ్రహ్మైవ. 61

దండించుట యందు పక్షపాత బుద్ధి లేకుండా ఉల్లంఘించుటకు సాధ్యముకాని శాసనముయందు, యమధర్మరాజు వంటివాడు. ఆశ్చర్యపరచుటయందు అనగా అద్భుతమందు హిమవత్పర్వతము వంటివాడు. కుబేరుడివలె ధనము గలవాడు, రహస్యముగా ధనాదులను కాపాడుటయందు వరుణుడు. 59

వాయువువలె శరీర బలముచే, మనోబలముచే, ఇంద్రియ బలముచే సర్వ ప్రాణులకు ఆధారభూతుడై పృథురాజు నిలిచాడు. సహింపసాధ్యముకాని తేజస్సు గలుగుటచే భూతరాట్ శివుడే.60

సౌందర్యమున మన్మథుడు, శరీరేంద్రియ బలమున సర్వ ప్రాణులను నియంత్రించువాడు, సింహమువలె వీరుడు, నిర్భయుడు, ఠీవి గలవాడు. వాత్సల్యముయందు మనుష్యులకు మనువంతటివాడు, పాలించుటయందు భగవాన్ బ్రహ్మదేవుడు. 61

శ్లో॥ బృహస్పతిర్బ్రహ్మవాద ఆత్మవత్త్వే స్వయం హరిః ।
భక్త్యా గో గురు విప్రేషు విష్వక్సేనానువర్తిషు ।
హ్రియా ప్రశ్రయ శీలాభ్యామాత్మతుల్యః పరోఽద్యమే ॥ 62

టీ:- బృహస్పతిరితి. ఆత్మవత్త్వే జితేంద్రియత్వే భక్త్యాదిభిః పరార్థోద్యమే చ ఆత్మనైవ తుల్యః నిరుపమః. 62

బ్రహ్మ విచారముయందు బృహస్పతి అంతవాడు. ఆత్మ తత్వముయందు సాక్షాత్తు శ్రీహరియే. గోవులు, బ్రాహ్మణులు, గురువులయందు, భగవద్భక్తులయందు భక్తిచే, బిడియముచేత, వినయముచేత, మంచి స్వభావముచేత మరియు ఇతరుల కొరకు ఉద్యమించుట యందు తనకుతానే సాటిగా రాజు శోభిల్లెను. 62

శ్లో॥ కీర్త్యోరుగీతయా పుంభిస్త్రైలోక్యే తత్ర తత్ర హ ।
ప్రవిష్టః కర్ణరంధ్రేషు స్త్రీణాం రామస్సతామివ ॥ 63

టీ:- కీర్త్యేతి. పుంభిః సత్పురుషైః రామః సీతాపతిర్యథాసతాం కర్ణరంధ్రేషు ప్రవిష్టః. 63

మూడు లోకములలో పృథువు కీర్తించబడుతుంటే ఆ కీర్తి సీతాపతియైన శ్రీరామచంద్రుని కీర్తివలె అందరి కర్ణ రంధ్రములలోకి ప్రవేశించెను. (వినసొంపుగా ఉండెను) 63

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,**
**ద్వావింశోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు**
**ఇరువది రెండవ అధ్యాయము సమాప్తము.**

## త్రయోవింశోஉధ్యాయః

శ్లో॥ త్రయోవింశే స భార్యస్య వనే నిత్యసమాధితః ।
విమానమధిరుహ్యాథ వైకుంఠగతిరీర్యతే ॥

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ దృష్ట్వాత్మానం ప్రవయసమేకదా వైన్య ఆత్మవాన్ ।
ఆత్మనా వర్ధితాశేషసానుసర్గః ప్రజాపతిః ॥ 1

టీ:- దృష్ట్వేతి. ప్రవయసం వృద్ధం దృష్ట్వా తపోవనమగాదితి తృతీయేనాన్వయః. స్వకృతోనుసర్గః అన్నాదిసర్గః పురగ్రామాదిసర్గశ్చ వర్ధితః అశేషః స్వానుసర్గో యేన. 1

శ్లో॥ జగతస్తస్థుషశ్చాపి వృత్తిదో ధర్మభృత్సతామ్ ।
నిష్పాదితే శ్వరాదేశో యదర్థమిహ జజ్ఞివాన్ ॥ 2

టీ:- జగత ఇతి. నిష్పాదితః ఈశ్వరాదేశ ప్రజాపాలనాదిర్యేన. జజ్ఞివాన్ జాతః. 2

శ్లో॥ ఆత్మజేష్వాత్మజాం న్యస్య విరహాద్రుదతీమివ ।
ప్రజాసు విమనస్స్వేకస్సదారోஉగాత్తపోవనమ్ ॥ 3

## 23వ అధ్యాయము

ఈ ఇరువది మూడవ అధ్యాయమున వనమున నిత్య సమాధి స్థితిలోగల, భార్యాసహితుడైన పృథువు విమానమెక్కి వైకుంఠమునకు వెళ్ళడం చెప్పబడుచున్నది.

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

చిత్తమును జయించినవాడు, అన్నసృష్టి, పుర గ్రామ నిర్మాణాది సృష్టి చేసిన ప్రజాపతి. ( ప్రజాపాలకుడు) కదిలే, కదలని సర్వ ప్రాణులకు జీవన మార్గమును చూపెట్టినవాడు. ధర్మరక్షకుడు, ఎందుకొరకు ఈ భూమిమీద అవతరించినాడో ఆ పనులన్నీ పూర్తి చేసినాడు. అనగా ప్రజాపాలననే ఈశ్వరాదేశమును సక్రమముగా నిర్వర్తించినవాడు పృథు చక్రవర్తి. ఒకనాడు వయస్సు మళ్ళి, వృద్ధుడనవుతున్నానని గ్రహించి, తన వియోగముచే ఏడ్చుచున్నదా అన్నట్లున్న, కూతురువలె స్వీకరించిన పృథ్విని తన కుమారులకు అప్పగించి, ప్రజలు చింతాతురులై ఉండగా ఏ సేవకులు లేనివాడై భార్యాసహితుడై తపోవనమునకు వెళ్ళెను.(1-3)

టీ:- ఆత్మజేష్వితి. ఆత్మజాం పృథ్వీం విమనస్సుచితాంతురాసు స దారః స భార్యః. 3

శ్లో॥ తత్రాప్యదాభ్య నియమో వైఘానససుసమ్మతే ।
ఆరబ్ధ ఉగ్రతపసి యథా స్వవిజయే పురా ॥ 4

టీ:- తత్రేతి. అద్యాభ్యాః విఘ్నైర్నాశయతుమశక్యాః నియమాః యస్య. వానప్రస్థానాం సుసంమతే ఉగ్రే తపసి ఆరబ్ధః ప్రవృత్తః కర్తరిక్తః స్వస్య ధరామండలస్య విజయే పూర్వం యథా మహతా యత్నేన ప్రవృత్తః తద్వత్. 4

ఆ తపోవనమునగూడా, విఘ్నములచే నశింపచేయడానికి సాధ్యముకాని నియమములు గలవాడై పూర్వము తన భూ విజయమున ఎంతగొప్ప ప్రయత్నముచే ప్రవర్తించెనో, అలానే వానప్రస్థులకు గూడా చక్కగా సమ్మతమైన, ఉగ్రమైన తపస్సున ప్రవృత్తుడయ్యెను. 4

శ్లో॥ కందమూల ఫలాహారస్తృణ పర్ణాశనః క్వచిత్ ।
అబ్భక్షః కతిచిన్మాసాన్ వాయుభక్షస్తతః పరమ్ ॥ 5

టీ:- ఉగ్రం తపో దర్శయతి-త్రిభిః. కందమూలైరితి. క్వచిత్ కదాచిత్. 5

ఉగ్రమైన తపస్సును దర్శింపచేయుచున్నాడు. ఒక్కొక్కప్పుడు కందమూల ఫలములే ఆహారము. ఒక్కొక్కప్పుడు ఎండుటాకులు మాత్రమే ఆహారము. కొన్ని పక్షములు నీరుమాత్రమే ఆహారము, కొన్ని రోజులు గాలి మాత్రమే భక్షించెను. 5

శ్లో॥ గ్రీష్మే పంచతపా వీరో వర్షాస్వాసారషాణ్మునిః ।
ఆకంఠమగ్నశ్శిశిర ఉదకే స్థండిలే శయః ॥ 6

వానప్రస్థుడైన వీరుడు పృథువు. నాలుగు దిక్కుల నాలుగు అగ్నులుపైన సూర్యుడు ఇలా పంచాగ్నులమధ్య, వర్షాకాలమున వానల ధారలకు తడుస్తూ వాటిని సహిస్తూ, శిశిర ఋతువున కంఠమువరకు నీటిలో దిగి తపస్సు చేస్తూ, రోజు భూమిమీద మాత్రమే పడుకుంటు ఉండేవాడు. 6

శ్లో॥ తితిక్షుర్యతవాగ్దాంత ఊర్ధ్వరేతా జితానిలః ।
ఆరిరాధయిషుః కృష్ణమచరత్తప ఉత్తమమ్ ॥ 7

పృథువు సహనము గలవాడు, నియంత్రితమైన వాక్కు గలవాడు అనగా మౌని, సర్వేంద్రియములను జయించినవాడు . పత్నీ సహితు-డైనప్పటికీ మైథున వర్జ్యము గలవాడు. ప్రాణములను వశీకరించు కొన్నవాడు. శ్రీకృష్ణుని ఆరాధించాలని కోరికగలవాడై ఉత్తమమైన తపస్సు నాచరించెను. 7

టీ:- గ్రీష్మ ఇతి. చతుర్థిక్షు చత్వారోఽగ్నయః ఉపరి సూర్య ఇతి పంచానాం తపతాం తపః సంతాపో యస్య పంచతపాః. అసారం సహత ఇతి అసార షాట్. శిశిరే ఋతౌ స్థండిలే శయః భూమిశయనః సర్వదా.(6-7)

శ్లో॥ తేన క్రమాను సిద్ధేన ధ్వస్తకర్మాఽమలాశయః ।
ప్రాణాయామైస్సన్నిరుద్ధషడ్వర్గశ్ఛిన్నబంధనః ॥ 8

ఆతడు మెల్లగా పరిపక్వమైన ఆ తపస్సుచే కర్మలు నష్టమైన వాడు. నిర్మలచిత్తుడు. ప్రాణాయామములచే నిరోధింపబడిన ఐదు జ్ఞానేంద్రియములు, మనస్సు గలవాడు, వాసనలు తొలగిపోయినవాడు. (8)

శ్లో॥ సనత్కుమారో భగవాన్ యదాహాధ్యాత్మికం పరమ్ ।
యోగం తేనైవ పురుషమభజత్పురుషర్షభః ॥ 9

పురుషులలో శ్రేష్ఠుడైన పృథువు పూజ్యుడగు భగవాన్ సనత్కుమారుడు శ్రేష్ఠమైన అధ్యాత్మికమగు, ఈశ్వరుని పొందేదుకు ఏ ఉపాయము (యోగమును) చెప్పెనో ఆ యోగము చేతనే పురుషోత్తముని సేవించెను. 9

శ్లో॥ భగవద్ధర్మిణస్సాధోః శ్రద్ధయా యతతస్సదా ।
భక్తిర్భగవతి బ్రహ్మణ్యనన్యవిషయాఽభవత్ ॥ 10

టీ:- తేనేతి. తేన తపసా క్రమానుసిద్ధేన శనైః ప్రాప్తేన. ధ్వస్తాని నిరస్తాని కర్మాణి యస్య అత ఏవ అమలః ఆశయో యస్య ఛిన్నాని బంధనాని వాసనా యస్య. (8-10)

భగవదారాధకుడై, సత్పురుషుడై, శ్రద్ధగా, అన్ని కాలముల యందు సేవచేయుచున్న పృథువునకు పరబ్రహ్మ స్వరూపుడైన భగవంతుడియందు అవ్యభిచరితమైన (చలించని) భక్తి కలిగెను. 10

శ్లో॥ తస్యానయా భగవతః పరికర్మశుద్ధ
సత్త్వాత్మనస్తదను సంస్మరణాను పూర్త్యా ।
జ్ఞానం విరక్తిమదభూన్నిశితేన యేన
చిచ్ఛేద సంశయపదం నిజ జీవకోశమ్ ॥ 11

టీ:- తస్యేతి. పరికర్మణా పరిచర్యయా శుద్ధసత్త్వః ఆత్మామనో యస్య తస్య జ్ఞానమభూత్. కీదృశం యేన నిజముపాధిం జీవకోశం హృదయగ్రంథిం సంశయానాం అసంభవాదీనాం పదమాశ్రయం చిచ్ఛేద కీదృశేన అనయా భక్త్యా నిశితేన. కథంభూతయా తస్య భగవతః సంస్మరణేనానుపూర్తిః సంపూర్తిః యస్యాః తయా నిశితేన. 11

పృథువు భగవంతుడి పరిచర్యచేత శుద్ధ సత్వముగల మనస్సు గల వాడాయెను. తద్వారా నిశితముగా నిరంతరము భగవంతుడి స్మరణచే వర్ధిల్లిన భక్తిచే గూడిన జ్ఞానము కలిగెను. ఆ జ్ఞానమెట్టిది అనగా జీవోపాధియైన హృదయగ్రంథిని, అసంభవవాదులకు ఆశ్రయమైన సంశయములను చేధించునది. 11

శ్లో॥ ఛిన్నాన్యధీరధిగతాత్మగతిర్నిరీహ
స్తత్తత్యజేఽఛ్చిన్నవదిదం వయునేన యేన ।
తావన్న యోగగతిభిర్యతిర ప్రమత్తో
యావద్గదాగ్రజకథాసురతిం న కుర్యాత్ ॥ 12

మరియు దేహాత్మ బుద్ధి తొలగినవాడు కనుక ఆత్మ తత్త్వము తెలిసినవాడు, పొందిన సిద్ధులయందు నిస్పృహుడు. ఏ జ్ఞానముచేత ఈ సంశయములు ఛేధింపబడ్డవో అది విడిచిపెట్టి నాడు అనగా ఆ ప్రయత్నమునుండి కూడా తొలిగిపోయినాడు. ఆయనకు యోగసిద్ధుల యందు నిస్పృహ యుక్తమే. ఎంతవరకు భగవానుడి యందు, భగవత్ కథలయందు రక్తుడగుతాడో అంతవరకు వాటియందు లోభము పుట్టదు. (సిద్ధులు ఆటంకము కాలేదు) 12

శ్లో॥ ఏవం సవీరప్రవరస్సంయోజ్యాత్మానమాత్మని ।
బ్రహ్మభూతో దృఢం కాలే తత్యాజ స్వకళేబరమ్ ॥ 13

వీరులలో ఉత్తముడగు ఆ పృథువు దృఢముగా బ్రహ్మాత్మైక్య అనుసంధానుడై, దేహ త్యాగకాలమున మనస్సును పరమాత్మయందు విలీనము చేసి ఆ దేహమును విడిచెను. 13

టీ:- ఛిన్నేతి. కించ ఛిన్నా అన్యధీర్దేహాత్మ బుద్ధిర్యస్య. యతోఽధి గతాత్మ గతిః అత ఏవ నిరీహః ప్రాప్తాసు సిద్ధిషు నిస్పృహః. యేన వయునేన జ్ఞానేన ఇదం సంశయపదం చిచ్ఛేద తత్ తత్యజే త్యక్తవాన్. తత్ప్రయత్నాదప్యుపరరామేత్యర్థః. తస్య యోగసిద్ధిష్వపి నిస్పృహత్వం యుక్తమేవేత్యాహ. తావన్న ప్రమత్తః కింతు ప్రమత్తో భవతి తస్య శ్రీకృష్ణకథారతత్వాన్నతాసు లోభో జాయత ఇత్యర్థః.(12 -13)

శ్లో॥ సంపీడ్య పాయుం పార్ష్ణిభ్యాం వాయుముత్సారయన్ శనైః ।
నాభ్యాం కోష్ఠేష్వవస్థాప్య హృదురః కంఠ శీర్షణి ॥ 14

టీ:- దేహత్యాగ ప్రకారమాహ-పంచభిః సంపీడ్యేతి. పాయుం గుదం సంపీడ్యేతి. ముక్తాసనం సూచితం.శ్లో. "సంపీడ్య సీవనం సూక్ష్మం గుల్ఫేనైవ తు మధ్యతః, సవ్యే దక్షిణగుల్ఫేన ముక్తాసనమితీరితమి"తి. మూలాధారాద్వాయుముత్సారయన్ ఊర్ధ్వం నయన్ నాభ్యామవస్థాప్య తతః కోష్ఠేష్వవస్థాప్య అయూాయుజదిత్యుత్తరేణాన్వయః. కోష్ఠాన్యేవాహ. హృదాదీనాం ద్వంద్వైక్యం. శీర్షం. భ్రూమధ్యం తస్మిన్. 14

శ్లో॥ ఉత్సర్పయన్నసూన్మూర్ధ్ని క్రమేణావేశ్య నిస్పృహః ।
వాయుం వాయౌక్షితౌ కాయం తేజస్తేజస్యయూాయుజత్ ॥ 15

టీ:- ఉత్సర్పయన్నితిః తం వాయుం. పాఠాంతరే. ఏవమసూన్ ప్రాణానుత్సర్పయన్ క్రమేణ మూర్ధ్ని బ్రహ్మరంధ్రే చావేశ్య తతో దేహారంభక పంచభూతాని సమష్టిభూతేషు విలాపితవాన్ తదాహ. వాయుం బాహ్యవాయౌ. అయూాయుజత్. ఏకీకృతవాన్. కాయం దేహగతం కఠినాం. శం క్షితౌ. 15

దేహత్యాగ ప్రకారమును తెలుపుచున్నాడు. మడిమలతో గుదస్థానమును గట్టిగా నొక్కిపట్టి తద్వారా వాయువును కదలకుండా ముద్రణము చేయడమే ముక్తాసనము. ప్రాణమును మూలాధారము నుండి మెల్లగా పైకి తీసుకవెళుతూ, నాభియందు అనగా మణిపూరక చక్రమందు నిలిపి అక్కడనుండి హృదయమున అనగా అనాహత చక్రమున నిలిపి, అక్కడనుండి ఉరస్సున అనగా కంఠమునకు కిందభాగమున విశుద్ధి చక్రమున నిలిపి, అక్కడినుండి కంఠముయందు ఆ విశుద్ధ చక్రమునకు పైన, అక్కడినుండి కనుబొమ్మల మధ్యయందు ఆజ్ఞాచక్రమందు నిలిపెను. ఈ విధముగా ప్రాణ స్థానములయందు నిలిపి ప్రాణములను పైకి తీసుకువెళ్ళి బ్రహ్మ రంధ్రముయందు ప్రవేశింపచేసి నిస్పృహుడై వాయువును, మహాభూత సమష్ట్యాత్మకము నందు కలిపివేసి వాటి రెండింటికి అభేదమును భావించెను. ఈ విధముగా కఠిన భాగమైన శరీర భాగమును భూమియందు; శరీర గతమైన తేజస్సును తేజస్సు యందు కలిపివేసెను. (14-15)

శ్లో॥ ఖాన్యాకాశే ద్రవం తోయే యథాస్థానం విభాగశః ।
క్షితిమంభసి తత్తేజస్యదో వాయౌ నభస్యముమ్ ॥ 16

టీ:- ఖానీతి. ఖాని ఇంద్రియచ్ఛిద్రాణి ద్రవాంశం తోయే. తదేవం దేహం ప్రవిలాప్య అద్వితీయాత్మప్రతిపత్త్యర్థం మహాభూతానామపి జయమాహ. క్షితిం అంభసి ఏకీకృతవాన్ తత్ అంభః అదస్తేజః అముం వాయుం. 16

ఇంద్రియములచే గూడిన ఆకాశమును, ఆకాశమున; శరీర గతమైన ద్రవాంశమును జలముయందు; ఈ విధముగా వాటి వాటి యోగ్యత ననుసరించి విడివిడిగా కలిపివేసెను. ఈ విధముగా దేహమును ప్రవిలాపనము చేసి అద్వితీయ ఆత్మ (ప్రతిపత్తికి) జ్ఞానమునకు, మహాభూతములయొక్క లయమును చెప్పుచున్నాడు. భూమిని నీటియందు ఒకటిగా చేసి ఆ నీటిని అగ్నియందు, అగ్నిని వాయువు యందు, వాయువును ఆకాశమున ఒకటిగా చేసెను. 16

శ్లో॥ ఇంద్రియేషు మనస్తాని తన్మాత్రేషు యథోద్భవమ్ ।
భూతాదినార్థాన్యుత్ క్షిప్య మహత్యాత్మని సందధే ॥ 17

టీ:- తదేవం తామసాహంకారకార్యస్యాకాశపర్యంతస్య. లయ ముక్త్వా సాత్త్వికరాజసాహంకారకార్యాణాం లయమాహ-ఇంద్రియేష్వితి. ఇంద్రియేషు మన ఇతి దేవానామప్యుపలక్షణం. సవికల్పకజ్ఞానే మనసః ఇంద్రియైరాకర్షణాత్తేషు లయాభిధానం న తు కార్యత్వాత్. తదుక్తం గీతాసు.శ్లో. "ఇంద్రియాణాం హి చరతాం యన్మనోను విధీయత" ఇతి.శ్లో. "ఇంద్రియైర్విషయా కృష్టైరాక్షిప్తంధ్యాయతాం మనః" ఇతి. ఇంద్రియేషు నభ ఇతి పాఠేఽప్యయమేవార్థః. భట్టాదీనాం మతే నభశ్చాక్షుషం. కేషాం చిన్మానసం ఆనుమానికత్వమతేఽపీంద్రియ

ఇంతవరకు తామసాహంకార కార్యమైన ఆకాశ పర్యంతము లయమును తెలిపి ఇపుడు సాత్త్వికాహంకార కార్య, రాజసాహంకార కార్యములైన వాటి లయమును తెలుపుచున్నాడు. ఇంద్రియముల యందు మనస్సు లయమగుచున్నది. తత్తద్దేవతల యొక్క లయమును గూడా గ్రహించాలి. ఇక్కడ ఒకటి గ్రహించాలి. కారణముయందు కార్యముయొక్క లయమా? కార్యము యందు కారణలయమా? అని ఆలోచించరాదు. ఇక్కడ కార్యకారణానుసారము లయము కాదు. సవికల్పక జ్ఞానముయందు మనస్సును ఇంద్రియములు ఆకర్షించును. కనుక ఇంద్రియములయందు మనస్సుయొక్క లయమును చెప్పడం జరిగినది. ఇంద్రియాధీనములో మనస్సు ఎలా ఉంటుందో గీతయందు ఈ విధముగా చెప్పబడినది. విషయములయందు ఇంద్రియములు

వ్యాపారోऽస్త్యైవ. నభో గుణశ్చ శబ్దః శ్రోత్రగ్రాహ్యః. అత ఇంద్రియ గ్రాహ్యత్వాదింద్రియేషు నభో విలాపితమితి. తానీంద్రియాణి యథోద్భవం ఉద్భవోऽత్ర ప్రవృత్తిలాభః స చ విషయాధీన ఇతి శ్రోత్రాదీనాం విషయేషు శబ్దాదిషు లయః. యద్వా తన్మాత్ర కార్యాణ్యేవేంద్రియాణి మనోऽప్యపంచీకృత పంచతన్మాత్రకార్యం. అహంకారాదికత్వాభిధానం తదధీనత్వవివక్షయేత్యవిరోధః. భూతాదినాహంకారేణ ప్రాగవశిష్ట నభస్సహితానీంద్రియాణి. ఉత్క్షిప్య పరతో నీత్వా. భూతాదౌ క్షిప్త్వా. తేన సహమహత్తత్త్వే. సందధ ఇత్యర్థః (17)

చరించుచున్నప్పుడు వాటిని అనుసరించి మనస్సు ప్రవర్తిస్తుంది. (భగవద్గీత 2-67) విషయములచే ఆకర్షింపబడిన ఇంద్రియములు మనస్సును లాగుచున్నవి. ఇంద్రియేషు నభః అను పాఠమును స్వీకరించిన ఇదే అర్థము, భాట్టమతమున ఆకాశము చాక్షుషము, కొంతమందికి నభస్సు మానసము, తార్కికుల మతమున గూడా శ్రోతేంద్రియముగా గ్రాహ్యము, ఆకాశము. ఆకాశము శబ్దగుణకము, శ్రోత్ర గ్రాహ్యము ఇంద్రియ గ్రాహ్యము కనుక ఇంద్రియములయందు ఆకాశము విలీనము చేయబడినది. ఆ ఇంద్రియములను ఎక్కడనుండి పుట్టినవో అక్కడ; అనగా ఇచ్చట ఉద్భవమనగా (వృత్తిలాభము) వృత్తి పుట్టడం, ఆ వృత్తి విషయము యొక్క అధీనమున ఉండును, కనుక శ్రోత్రాదులకు విషయములైన శబ్దాదులయందు లయము . ఇంద్రియములన్నీ గూడా తన్మాత్ర కార్యములే. మనస్సుగూడా అపంచీకృత తన్మాత్ర కార్యమే. దానికే అహంకారమని పేరు. దాని అధీనమున ఉండుటచేత విరోధము లేదు. పంచభూతములకు కారణమైన అహంకారముతో మిగిలిన ఆకాశ సహిత ఇంద్రియములను విలీనము చేసి మహత్తత్త్వముయందు అనుసంధానించెను. 17

శ్లో॥ తం సర్వగుణ విన్యాసం జీవేమాయామయే న్యధాత్ ।
తం చానుశయమాత్మస్థమసావనుశయీ పుమాన్ ॥ 18

టీ:- తమితి. సర్వేషాం గుణానాం కార్యాణాం విన్యాసః స్థితిః యస్మిన్. తం మహాంతం మాయామయే మాయోపాధిప్రధానే జీవే. తం చానుశయముపాధిం యః పూర్వమనుశాయీ పుమాన్ జీవః అసౌ పృథుః బ్రహ్మణి స్థితస్సన్ జహాదిత్యర్థః. 18

శ్లో॥ జ్ఞాన వైరాగ్య వీర్యేణ స్వరూపస్థో జహాత్ప్రభుః ।
అర్చిర్నామ మహారాజ్ఞీ తత్పత్న్యనుగతా వనమ్ ।
సుకుమార్యతదర్హా చ యత్పద్భ్యాం స్పర్శనం భువః ॥ 19

టీ:- వనప్రవేశమారభ్య రాజ్ఞ్యాః కథామాహ-చతుర్భిః. అర్చిర్నామేతి. అనుగతా అనుజగామ. అతదర్హేతి తదపి నార్హతి యా కిం పద్భ్యాం భువః స్పర్శనమితి. యత్. 19

సత్వరజస్తమో గుణముల కార్యములన్నింటికీ ఆశ్రయమైన మహతత్త్వమును, మాయోపాధి ప్రధానుడైన జీవునియందు విలీనము చేసెను. అనగా జీవోపాధియైన లింగశరీరముయందు విలీనము చేసెను. సర్వ దుఃఖ సుఖ కార్యములన్నీగూడా లింగశరీరము యందే పర్యవసానము. కానీ ఆత్మయందు కాదని నిశ్చయించుకొనెను. పూర్వము లింగశరీరముయందు అభిమానము కలిగిన పృథువు జ్ఞాన, వైరాగ్య ప్రభావము చేత బ్రహ్మయందు నిశ్చయము కలవాడై లింగ శరీరాభిమానమును విడిచిపెట్టెను. 18

వనప్రవేశమును మొదలుకొని రాజ్ఞి కథను చెప్పుచున్నాడు. ఏ మహారాజ్ఞి పాదము భూ స్పర్శనుగూడా సహించలేదో అలాంటి అత్యంత సుకుమారియైన ఆ మహారాజ్ఞి రాజుగారి వెంట అడవికి వెళ్ళెను. 19

శ్లో॥ అతీవ భర్తుర్వ్రతధర్మనిష్ఠయా
శుశ్రూషయా చార్ష దేహయాత్రయా ।
నావిందతార్తిం పరికర్శితాపి
సాప్రేయః కరస్పర్శమాన నిర్వృతిః ॥ 20

టీ:- అతీవేతి. భర్తుర్వ్రతం యద్భూమిశయనాది తస్మిన్ ధర్మే యా నిష్ఠా తయా ఋషీణామియమార్షీ దేహయాత్రా కందమూలాది వృత్తేస్తయా చ ఆర్తిం దుఃఖం న ప్రాప. తత్ర హేతుః ప్రేయసః కరణే స్పర్శనం మానశ్చ తాభ్యాం నిర్వృతిర్యస్యాః. 20

భర్తగారైన పృథువు నేలపైన పడుకోవడం, ఋషులు స్వీకరించే ఆహారమును (కందమూలములను) స్వీకరించడం చేస్తూ ఉంటే, అర్చిగూడా ఆ విధముగానే భర్తసేవచేస్తూ నియమములు పాటిస్తూ ఉంటే శరీరము శుష్కించి పోయినది. అయినప్పటికీ దుఃఖమును పొందలేదు ఎందుకనగా మహారాజు కరస్పర్శవల్ల మనస్సు దుఃఖము నుండి తొలగడమే కారణము. 20

శ్లో॥ దేహం విపన్నాఖిలచేతనాదికం
పత్యుః పృథివ్యా దయితస్య చాత్మనః ।
ఆలక్ష్య కించిచ్చ విలప్య సా సతీ
చితామథారోపయదద్రిసానుని ॥ 21

టీ:- దేహమితి. పృథివ్యాః పత్యుః దుహితృత్వం తు తస్యా దేవతారూపేణ. విపన్నం నష్టమఖిలం చేతనాదికం యస్మిన్. తథాభూతం దేహమాలక్ష్య తద్దేహం చితామారోపయత్. 21

పృథివీ పతియైన తన భర్త పృథువు యొక్క చేతనారహితమైన దేహమును చూచి కొంతసేపు దుఃఖించి ఆ పర్వత చరియలయందు చితిని పేర్చి దానిపై దేహమునుంచుటకు సిద్ధమయ్యెను. ఇంతవరకు పృథివిని కుమార్తెగా చెప్పి, ఇప్పుడు పృథివీపతిః అనుచున్నాడనగా జడాత్మకమైన మృదాత్మకమైన భాగమునకు పతి, తదభిమానదేవతయైన పృథివీ దేవతకు తండ్రి. 21

శ్లో॥ విధాయకృత్యం హ్రదినీ జలాప్లుతా
కృత్వోదకం భర్తురుదారకర్మణః ।
నత్వా దివిస్థాం స్త్రిదశాం స్త్రిః పరీత్య
వివేశ వహ్నిం ధ్యాయతీ భర్తృపాదమ్ ॥ 22

టీ:- విధాయేతి. కృత్యం తత్కాలోచితం విధాయ. హ్రదిన్యాః జలే ఆప్లుతా స్నాతా సతీ భర్తురుదకం దత్వా. దివి అంతరిక్షే స్థితా నత్వా వహ్నింత్రిః ప్రదక్షిణీకృత్య. 22

ఆ కాలమున చేయవలసిన పనులను చేసి అనగా దహన కర్మను చేసి, గొప్పనైన కర్మలు చేసిన ఆ రాజునుగూర్చి జలమున స్నానముచేసి, భర్తకు తర్పణములు విడిచి దేవలోక దేవతలకు నమస్కరించి, ఆ చితికి మూడు ప్రదక్షిణములు చేసి భర్త చరణములను ధ్యానిస్తూ ఆ అగ్ని యందు ప్రవేశించెను. 22

శ్లో॥ విలోక్యానుగతాం సాధ్వీం పృథుం వీరవరం పతిమ్ ।
తుష్టువుర్వరదా దేవైర్దేవపత్న్యస్సహస్రశః ॥ 23

టీ:- విలోక్యేతి. దేవైస్సహితాః. 23

వీరులలో శ్రేష్ఠుడైన, భర్తయైన పృథువును అనుసరించి వెళ్ళు -చున్న ఈ సాధ్విని చూచి, వారి పతులతో కూడుకొనిన వరములనిచ్చే దేవతాస్త్రీలు వేలకు వేలమంది ఆమెను మిక్కిలి ప్రశంసించిరి. 23

శ్లో॥ కుర్వంత్యః కుసుమాసారం తస్మిన్మందరసానుని ।
నదత్స్వమరతూర్యేషు గృణంతి స్మ పరస్పరమ్ ॥ 24

దేవదుందుభులు మ్రోగుచుండగా ఆ మందరపర్వత చరియల యందు పుష్పవృష్టిని కురిపించి ఒకరినితోకరు ఇట్లు మాట్లాడుకొనిరి. (24)

దేవ్య ఊచుః

శ్లో॥ అహో ఇయం వధూర్ధన్యా యా చైవం భూభుజాం పతిమ్ ।
సర్వాత్మనాపతిం భేజే యజ్ఞేశం శ్రీవధూరివ ॥ 25

దేవతాస్త్రీలు ఈ విధముగా పలికిరి.

ఆహా! ఈమె ధన్యురాలు! యజ్ఞేశ్వరుడైన శ్రీహరిని, మహాలక్ష్మీదేవి సేవించినటుల రాజాధిరాజైన పృథు చక్రవర్తిని మనోవాక్కాయములచే ఈమె సేవించినది. 25

శ్లో॥ సైషా నూనం వ్రజత్యూర్ధ్వమనువైన్యం పతిం సతీ ।
పశ్యతాస్మానతీత్యార్చిర్దుర్విభావ్యేన కర్మణా ॥ 26

ఓ దేవతాస్త్రీలారా! అటుచూడండి. సతీధర్మము లేనివారు ఆచరించుటకు వీలులేని కర్మనుచేసి ఆ అర్చి పుత్రుడగు పృథువును అనుసరించి మనలను దాటుకొని పైకి వెళ్ళుచున్నది. 26

టీ:- కుర్వంత్య ఇతి. గృణంతి స్మ అభాషంత. (24-26)

శ్లో॥ తేషాం దురాపం కింవాన్యన్మర్త్యానాం భగవత్పదమ్ ।
భువి లోలాయుషో యే వై నైష్కర్మ్యం సాధయంత్యుత ॥ 27

టీ:- తేషామితి. భగవాన్ పద్యతే గమ్యతేఽనేనేతి తథా. తన్నైష్కర్మ్యం జ్ఞానం. యే చంచలాయుషోఽపి సాధయంతి. తేషామన్యదేవాదిపదం కిం దుర్లభం న కించిదిత్యర్థః. 27

భగవంతుడిని పొందదానికి సాధనమైన నైష్కర్మ్యజ్ఞానమును అల్పాయుష్కులైనప్పటికీ, ఏ మానవులు సాధించుచున్నారో వారికి వేరే దేవతాది స్థానములు పొందదము ఏమి కష్టము? వారికేదీ దుర్లభము కాదని అర్థము. 27

శ్లో॥ స వంచితో బతాత్మధ్రుక్కృచ్ఛ్రేణ మహతాభువి ।
లబ్ధాపవర్గ్యం మానుష్యం విషయేషు విషజ్జతే ॥ 28

భక్తుడుకాని వానినిగూర్చి దుఃఖిస్తూ దేవతలు అంటున్నారు. అయ్యో! కష్టసాధ్యమైన మోక్షమును సంపాదించడానికి సాధనమైన

మనుష్య జన్మను పొందిగూడా విషయభోగములయందు మునిగి తనకుతానే ద్రోహము చేసుకొనుచున్నాడు. తనకుతానే మోసగించు-కొనుచున్నాడు కదా! 28

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ స్తువంతీషు సురస్త్రీషు పతిలోకం గతా వధూః ।
యం వా ఆత్మవిదాం ధుర్యోవైన్యః ప్రాపాచ్యుతాశ్రయమ్ ॥29

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

ఈ విధముగా దేవలోక స్త్రీలు స్తుతిస్తూ ఉండగా అర్చి, పతిలోకమును పొందెను. ఆత్మవేత్తలలో అగ్రేసరుడు శ్రీహరియందే మనస్సు గలిగిన వేన పుత్రుడైన పృథువు పొందిన స్థానమును పొందెను. 29

శ్లో॥ ఇత్థం భూతానుభావోఽసౌ పృథుస్సభగవత్తమః ।
కీర్తితం తస్య చరితముద్దామచరితస్య తే ॥ 30

మిక్కిలి ఐశ్వర్యము గలవాడు పృథువు, అలౌకిక అనుభవము గలవాడాయెను. శ్రేష్ఠమైన ఆయన చరిత్రమును నీ కొరకు కీర్తించితిని. (30)

శ్లో॥ య ఇదం సుమహత్పుణ్యం శ్రద్ధయాఽవహితః పఠేత్ ।
శ్రావయేచ్ఛృణుయాద్వాపి స పృథోః పదవీమియాత్ ॥ 31

ఎవరైతే సావధాన చిత్తుడై, గొప్పనైన పుణ్యమును కలిగించు పృథు చరిత్రమును చదివి వినిపించునో లేదా స్వయముగా శ్రవణము చేయునో అతడు గూడా పృథువు స్థానమును పొందును. 31

టీ:- స ఇతి. అవ్యక్తం శోచంతి. సవంచిత ఇతి.యత ఆత్మనే ద్రుహ్యతి అపవర్గ సాధనం మానుష్యం లబ్ధ్వాపి విషయేష్వాసక్తిం యాతి. 28-31

శ్లో॥ బ్రాహ్మణో బ్రహ్మవర్చస్వీ రాజన్యో జగతీపతిః ।
వైశ్యః పఠన్విట్పతిస్స్యాచ్ఛూద్ర ఉత్తమతామియాత్ ॥ 32

బ్రాహ్మణుడు దీనిని అధ్యయనము చేసినచో బ్రహ్మ వర్చస్వి యగును, రాజులు జగత్తునకు పతులగుదురు. వైశ్యులు, పశువులకు లేదా వైశ్యులకు నాయకులవుదురు. శూద్రులు శ్రవణము ద్వారా సజ్జనులలో శ్రేష్ఠులగుదురు. 32

శ్లో॥ త్రిః కృత్వమిదమాకర్ణ్య నరో నార్యథవాదృతా ।
అప్రజస్సుప్రజతమో నిర్ధనో ధనవత్తమః ।
అస్పష్ట కీర్తిస్సుయశా మూర్ఖో భవతి పండితః ॥ 33

సంతానము లేనివారు స్త్రీగానీ పురుషుడుగానీ శ్రద్ధగా ఈ ఆఖ్యానమును మూడు మార్లు వింటే పుత్రసంతానమును పొందుదురు. ధనము లేనివారు ధనికులగుదును. అప్రకటిత కీర్తిగలవాడు ప్రకటిత కీర్తిగలవాడగును. మూర్ఖుడు పండితుడగును. 33

శ్లో॥ ఇదం స్వస్త్యయనం పుంసామమంగళ్య నివారణమ్ ।
ధన్యం యశస్యమాయుష్యం స్వర్గ్యం కలిమలాపహమ్ ॥ 34

ఈ అఖ్యానము మానవులకు మంగళమును కలిగించును. దుఃఖములను దూరము చేయును. ధనమును కలిగించును. కీర్తిని, ఆయుస్సును, స్వర్గలోకమును కలిగించును. కలిదోషములను తొలగించును. 34

శ్లో॥ ధర్మార్థ కామ మోక్షాణాం సమ్యక్సిద్ధిమభీప్సుభిః ।
శ్రద్ధయైతదనుశ్రావ్యం చతుర్ణాం కారణం పరమ్ ॥ 35

కనుక ధర్మార్థకామమోక్షములు చక్కగాసిద్ధించాలని కోరికగల వారు ప్రతిరోజు ఇతరులకు వినిపించాలి, శ్రవణము చేయాలి, చదవాలి అని ఉపలక్షణము. పై పురుషార్థములు నాలుగు సిద్ధించుటకు గొప్పనైన, ముఖ్యమైన సాధనమిది. 35

శ్లో॥ సంగ్రామాభిముఖో రాజా శ్రుత్వైతదభియాతి యాన్ ।
బలిం తస్మై హరంత్యగ్రే రాజానః పృథవే యథా ॥ 36

టీ:- బ్రాహ్మణ ఇతి. విశాం పశ్వాదీనాం పతిః స్యాత్. (32-36)

ఈ అఖ్యానమును విని ఏ ఏ దేశాలకు రాజు విజయాభిముఖుడై వెళ్ళుతాడో, ఆ దేశపు రాజులు పూర్వము పృథు మహారాజునకు ఏ విధముగా సమర్పించుకున్నారో అదే విధముగా ఈ రాజునకు కూడా కప్పము మొదలగు బహుమతులు సమర్పించుకుంటారు. 36

శ్లో॥ ముక్తాన్యసంగో భగవత్యమలాం భక్తిముద్వహన్ ।
వైన్యస్య చరితం పుణ్యం శ్రుణుయాచ్ఛ్రావయేత్పఠేత్ ॥ 37

టీ:- బలిమితి. యద్యపి బహూని ఫలాని భవంతి. తథాపి ముక్తాన్య సంగ ఏవ శ్రవణాది కుర్యాత్. 37

ఎన్నో ఫలములు గలవుగానీ కర్మఫలము విడిచినవాడు కూడా భగవంతుడియందు నిర్మలమైన భక్తి గలవాడై పుణ్యప్రదమైన ఈ వేన చరిత్రమును వినిపించవలెను. పఠించవలెను. 37

శ్లో॥ వైచిత్రవీర్యాభిమతం మహన్మాహాత్మ్య సూచకమ్ ।
అస్మిన్కృతమతిర్మర్త్యః పార్థివీం గతి మాప్నుయాత్ ॥ 38

టీ:- వైన్యస్యేతి. మహతో భగవతో మాహాత్మ్యస్య. సూచకం పార్థివీం పృథుసంబంధినీం పార్థివామితి వా పాఠః. 38

ఓ విచిత్రవీర్యుడికి సంబంధించినవాడా! విదురా! భగవంతుని మహిమను సూచించే ఈ పృథు చరితము నాచే కీర్తించబడినది. దీనియందే బుద్ధి కలిగిన మానవుడు పృథువు పొందిన లోకమును పొందుదురు. లేదా కనీసం మహారాజగుదురు. 38

శ్లో॥ అనుదినమిదమాదరేణ శ్రుణ్వన్పృథు
చరితం ప్రథయంశ్చ ముక్తసంగః ।
భగవతి భవసింధుపోత పాదే స చ
నిపుణాం లభతే మతిం మనుష్యః ॥ 39

టీ:- అనుదినమితి. ప్రథయన్ కీర్తయన్ భవసింధౌ పోతౌ పాదౌ యస్య. 39

ఏ మనుష్యుడైతే ఫలాకాంక్ష రహితుడై రోజు ఆదరపూర్వకముగా ఈ పృథు చరితమును వింటూ, వినిపిస్తూ, విస్తరింపచేస్తూ ఉంటాడో ఆ వ్యక్తికి ఈ సంసారమనే సముద్రమును దాటడానికి ఏ భగవానుడి పాదమే పడవనో, అట్టే భగవానునిపట్ల సంసారమును తొలగించుట యందు సమర్థమైన ప్రేమను కలుగును, పొందును. 39

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,**
**త్రయోవింశోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు**
**ఇరువది మూడవ అధ్యాయము సమాప్తము.**

## చతుర్వింశోஉధ్యాయః

శ్లో॥ ఏకాదశభిరధ్యాయైః పృథోశ్చరితమీరితమ్ ।
ప్రచేతసామథాష్టాభిస్తన్మధ్యే పంచభిః పితుః ॥

చతుర్వింశే ప్రపౌత్రాత్తు పృథోః ప్రాచీనబర్హిణః ।
ప్రచేతసాం జనిస్తేభ్యో రుద్రగీతం చ వర్ణ్యతే ॥

## 24 వ అధ్యాయము

పదకొండు అధ్యాయములలో పృథు చరిత్ర చెప్పబడినది. ఎనిమిది అధ్యాయములచేత ప్రచేతసుల చరిత్ర, ఈ ఎనిమిది అధ్యాయములలో ఐదు అధ్యాయములచేత ప్రాచీనబర్హి చరితము, ఇరువది నాలుగవ అధ్యాయమున పృథువు యొక్క మునిమనుమడైన బర్హిష్మంతుడు, ఆయనకు ప్రచేతసుల ఉత్తత్తి వారికి రుద్రగీతమును వర్ణించబడినవి..

### మైత్రేయ ఉవాచ

శ్లో॥ విజితాశ్వోధిరాజోసీత్ప ృథోః పుత్రః పృథుశ్రవాః ।
యవీయోభ్యోஉదదాత్కాష్ఠా భ్రాతృభ్యో భ్రాతృవత్సలః ॥ 1

టీ:- విజితాశ్వ ఇతి. అధిరాజ ఆసీదిత్యర్థః. యవీయోభ్యః కనిష్ఠేభ్యః కాష్ఠాః దిశః. 1

### మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

విపులమైన కీర్తిగలిగిన పృథు కుమారుడు విజితాశ్వుడు చక్రవర్తిగా ఉండెను. తమ్ముళ్ళయందు వాత్సల్యము కలిగిన ఆ రాజు తమ్ముళ్ళకు నాలుగు దిక్కులయందు అధికారమును పంచిఇచ్చెను. 1

శ్లో॥ హర్యశ్వాయాదిశత్ప్రాచీం ధూమ్రకేశాయ దక్షిణామ్ ।
ప్రతీచీం వృకసంజ్ఞాయ తుర్యాం ద్రవిణసే విభుః ॥ 2

టీ:- హర్యశ్వాయేతి. తుర్యాం చతుర్థీం దిశం. 2

హర్యశ్వునకు తూర్పుదేశమును, ధూమ్రకేశునకు దక్షిణ దేశమును, వృకుడను వానికి పశ్చిమదేశమును, ద్రవిణునకు మిగిలిన ఉత్తరముదేశమును ఇచ్చెను. 2

శ్లో॥ అంతర్ధానగతిం శక్రాల్లబ్ధ్వాంతర్ధాన సంజ్ఞితః ।
అపత్య త్రయమాదత్త శిఖండిన్యాం సుసమ్మతమ్ ॥ 3

టీ:- అంతర్ధానేతి. శక్రాల్లబ్ధ్వా పృథోరశ్వమేధే అశ్వవిజయావసరే. 3

విజితాశ్వుడు పృథువు చేసిన అశ్వమేధ యజ్ఞమునందు అశ్వమును జయించు విషయమున ఇంద్రుని వలన అంతర్ధాన విద్యను పొంది అంతర్ధానుడను పేరుపొందెను. ఇతడు శిఖండియందు ఉత్తములైన ముగ్గురు కుమారులగనెను. 3

శ్లో॥ పావకః పవమానశ్చ శుచిరిత్యగ్నయః పురా ।
వసిష్ఠశాపాదుత్పన్నాః పునర్యోగ గతిం గతాః ॥ 4

టీ:- అపత్యత్రయ మేవాహ–పావక ఇతి. పురా యశ్శాపః తస్మాన్మనుష్యేషూత్పన్నాః సంతః యోగగతిం అగ్ని గతిం ప్రాప్తాః. 4

పూర్వము వసిష్ఠముని పావకుడు, పవమానుడు, శుచియను పేర్లుగల త్రేతాగ్నులను మనుష్యజన్మ పొందుమని శపించియుండెను. ఆ శాపమువల్ల వారు విజితాశ్వునకు కుమారులై పుట్టి, తిరిగి అగ్ని రూపమును పొందిరి. 4

శ్లో॥ అంతర్ధానో నభస్వత్యాం హవిర్ధానమవిందత ।
య ఇంద్రమశ్వహర్తారం విద్వానపి న జఘ్నివాన్ ॥ 5

టీ:- అంతర్ధాన ఇతి. నభస్వత్యాం అన్యస్యాం భార్యాయాం. అంతర్ధాన విశేషణంయ ఇతి. ఏతేన శక్రాదంతర్ధానగతిలాభే కారణముక్తం. 5

అంతర్ధానుడు నభస్వతీయను భార్యయందు హవిర్ధానుడనే కుమారుడిని కనెను. ఇంద్రుడు అశ్వమును దొంగిలించినాడని తెలిసి గూడా సంహరించక వదలి పెట్టుటవల్ల ఇంద్రుడినుండి అంతర్ధాన విద్యను పొందెను. 5

శ్లో॥ రాజ్ఞాం వృత్తింకరా దానదండశుల్కాదిదారుణామ్ ।
మన్యమానో దీర్ఘసత్ర వ్యాజేన విససర్జ హ ॥ 6

రాజరికమున పన్నును వేయుట, శిక్షించుట, అపరాధ రుసుమును వసూలు చేయుట మొదలగునవి క్రూరమైన కర్మలని

టీ:- రాజ్ఞామితి. సచాంతర్ధానో రాజ్ఞాం వృత్తిం. కరాదినాదిభి ర్ధారుణాం పరపీడాత్మికాం. మన్యమానో విససర్జ హ. 6

చింతించి పరపీడాత్మకములని తలపోసి అంతర్ధానుడు సత్రయాగమును సాకుగా పెట్టుకొని రాజ్యాధికారమును వదిలిపెట్టెను. 6

శ్లో॥ తత్రాపి హంసం పురుషం పరమాత్మానమాత్మదృక్ ।
యజం స్తల్లోకతామాపకుశలేన సమాధినా ॥ 7

తన సమస్త క్లేశములను తొలగించునది హంస. సత్ర-యాగమున, అంతర్ముఖుడగు అంతర్ధానుడు హంసరూపుడు, పరిపూర్ణ స్వరూపుడైన పరమాత్మను పూజిస్తూ, పుణ్యాత్మకమైన సమాధి ద్వారా ఆ పరమాత్మ సాక్షాత్కారమును పొందెను. 7

శ్లో॥ హవిర్ధానాద్ధవిర్ధానీ విదురాసూత షట్సుతాన్ ।
బర్హిష్మదంగయం శుక్లం కృష్ణం సత్యం జితవ్రతమ్ ॥ 8

ఓ విదురా! హవిర్ధానునకు హవిర్ధాని యందు బర్హిష్మంతుడు, గయుడు, శుకుడు, కృష్ణుడు, సత్యుడు, జితవ్రతడనే ఆరుగురు కుమారులు పుట్టిరి. 8

టీ:- తత్రేతి. హంతి స్వానాం క్లేశమితి హంసః తం పురుషం పూర్ణం. కుశలం పుణ్యం తద్రూపేణ సమాధినా. (7-8)

శ్లో॥ బర్హిష్మత్సుమహాబాహుర్హవిర్ధానిః ప్రజాపతిః ।
క్రియాకాండేషు నిష్ణాతో యోగేషు చ కురూద్వహ ॥ 9

ఓ కురువంశశ్రేష్ఠా విదురా! హవిర్ధానుని పుత్రుడైన బర్హిష్మంతుడు చక్కటి మహానుభావుడు. కర్మకాండయందు మరియు ప్రాణాయామాదులందు నిష్ణాతుడు. 9

టీ:- బర్హిష్మదితి. హవిర్ధానిః హవిర్ధానస్య పుత్రః యోగేషు చ ప్రాణాయామాదిషు. 9

శ్లో॥ యస్యేదం దేవయజనమనుయజ్ఞం వితన్వతః ।
ప్రాచీనాగ్రైః కుశైరాసీదాస్తృతం వసుధాతలమ్ ॥ 10

టీ:- క్రియాకాండనిష్ణాతత్వమాహ-యస్యేతి. ఇదం వసుధాతలం దేవయజనం యజ్ఞవాటం వితన్వతః. యత్రైకోయజ్ఞః కృతః తత్సమీప ఏవ యజ్ఞాంతరం కుర్వతస్తతః అత ఏవ ప్రాచీనబర్హిరిత్యుచ్యతే. 10

బర్హిష్మంతుడు ఈ భూమినంత యజ్ఞస్థలముగా చేసినాడు. ఒక యజ్ఞము చేసి దాని సమీపముననే మరియొక యజ్ఞము చేస్తూ, యజ్ఞకార్యాలలో తూర్పునకు దర్భలను పరుస్తూ భూమిని కప్పివేసినాడు కనుక ఆయనను ప్రాచీనబర్హి అని పిలువబడినాడు. 10

శ్లో॥ సాముద్రీం దేవదేవోక్తాముపయేమే శతధృతిమ్ ।
యాం వీక్ష్యచారుసర్వాంగీం కిశోరీం సుష్ఠ్వలంకృతామ్ ।
పరిక్రమంతీముద్వాహే చకమేఽగ్నిశ్శుకీమివ ॥ 11

టీ:- సాముద్రీమితి. సముద్రస్య కన్యాం. దేవదేవేన బ్రహ్మణా ఉపదిష్టాం శతధృతిం నామ కిశోరీం బాలాం. పరిక్రమంతీం ప్రదక్షిణం గచ్ఛతీం. శుకీమివేతి ఏవం హ్యాఖ్యాయతే. సప్తర్షీణాం సత్రే తద్భార్యాదర్శనేనాగ్నిః కామసంతప్తోఽభూత్. తం చ తద్భార్యాస్వాహా నామసప్తర్షిభార్యారూపధారిణీ సతీ రమయామాస. రమయిత్వా చ తద్రేతః శుకీరూపేణ శరస్తంబే నిధాయాగచ్ఛత్ తాం యథా సప్తర్షిభార్యా భ్రాంత్యాగ్నిః కామితవాన్ తద్వదితి. స్తుకీమివేతి పాఠే స్తోకస్తోక ఘృతధారామివేత్యర్థః. 11

బ్రహ్మచేత ఉపదిష్టుడైన బర్హిష్మంతుడు సముద్రుడి కుమార్తెయైన శతధృతిని వివాహమాడెను. చక్కగా అలంకరింపబడిన, సుందరమైన అవయవములు కలిగిన, యౌవనవతి అయిన ఆమె పెళ్ళిలో అగ్నికి ప్రదక్షిణము చేస్తుంటే, అగ్నిదేవుడు శుకిని కామించినట్టుగా, బర్హిష్మంతుడు శతధృతిని కామించినాడు. ఇచట శుకి యొక్క ఇతిహాసము వ్యాఖ్యానించబడుతుంది.

ఒకప్పుడు సప్తఋషులు సత్రయాగము చేస్తూ, ఆ యజ్ఞమున అగ్నికి ప్రదక్షిణము చేస్తుండగా ఋషిపత్నుల చూచి అగ్ని కామముచే తపించినాడు. ఇది గ్రహించి అగ్ని భార్యయైన స్వాహాదేవి సప్తఋషుల భార్యలరూపమును ధరించి అతడితో రమించెను. రమించి అగ్ని రేతస్సును చిలకరూపంలో దర్భలపైన ఉంచి వెళ్ళిపోయెను. అగ్ని రేతస్సును సముద్రుడు కాపాడి, దానినుండి జన్మించిన బాలికను

తన సంతానమువలె పెంచుకొనెను. ఆ బాలికనే శతధృతి.

"స్తుకీం" అన్న పాఠము స్వీకరించినట్లైతే "సన్నని నెయ్యి ధారను అగ్ని కామించినట్టుగా కామించెనని చెప్పుకోవాలి". 11

శ్లో॥ విబుధాసుర గంధర్వ ముని సిద్ధనరోరగాః ।
విజితా స్సూర్యయా దిక్షుః క్వణయంత్యైవనూపురైః ॥ 12

టీ:- విబుధా ఇతి. సూర్యయా నవోఢయైవ. విబుధాదయో విజితా అభిభూతాః తచ్చనూపురైః పాదౌ క్వణయంత్యైవ ధ్వనిమాత్రేణేత్యర్థః. (12)

ఆ క్రొత్త పెళ్ళికూతురు కాలియందలి ధ్వని అన్ని దిక్కులు ప్రసరించెను. ఆ ధ్వని మాత్రంచేత ఆమె దేవతలు, రాక్షసులు, గంధర్వులు, మహర్షులు, సిద్ధులు, మానవులు, నాగముల మనస్సును దోచినది. 12

శ్లో॥ ప్రాచీనబర్హిషః పుత్రాశ్శతధృత్యాం దశాభవన్ ।
తుల్యనామవ్రతాస్సర్వే ధర్మస్నాతాః ప్రచేతసః ॥ 13

టీ:- ప్రాచీనబర్హిష ఇతి. తుల్యం నామ వ్రతమాచారశ్చ యేషాం. ధర్మస్నాతాః ధర్మపారగాః. 13

ప్రాచీనబర్హికి శరధృతియందు సమానమైన పేరు, ఆచరణ కలిగిన పదిమంది కుమారులు కలిగిరి. వారిపేరు ప్రచేతసులు, ధార్మికులు. 13

శ్లో॥ పిత్రాదిష్టాః ప్రజాసర్గే తపసే వనమావిశన్ ।
దశవర్ష సహస్రాణి తపసార్చం స్తపస్పతిమ్ ॥ 14

వారంతా తండ్రి ఆజ్ఞానుసారము ప్రజాసృష్టి చేయడానికి తపస్సు కొరకు సముద్రమును ప్రవేశించి పదివేల సంవత్సరములు తపస్సుచే విష్ణువును ఆరాధించిరి. 14

శ్లో॥ యదుక్తం పథి దృష్టేన గిరిశేన ప్రసీదతా ।
తద్ధ్యాయంతో జపంతశ్చ పూజయంతశ్చ సంయతాః ॥ 15

శివభగవానుడు ప్రసన్నుడై, వారికి మార్గ మధ్యమమున ఏమి ఉపదేశించెనో దానిని ధ్యానిస్తూ, జపిస్తూ, జితేంద్రియులై పూజించు -చుండిరి. 15

**విదుర ఉవాచ**

శ్లో॥ ప్రచేతసాం గిరిత్రేణ యథాసీత్పతిసంగమః ।
యదభ్యాహహరః ప్రీతస్తన్నో బ్రహ్మన్వదార్థవత్ ॥ 16

టీ:- పిత్రేతి. తపసా తపసాం పతిం హరిం అర్చన్ అర్చయామాసుః. (14-16)

**విదురుడు ఈ విధముగా పలికెను.**

ఓ బ్రహ్మర్షీ! శంకరుడికి, ప్రచేతసులకు మార్గ మధ్యమున సమాగమము ఏ విధముగా జరిగెను. శంకరుడు వారికి ప్రసన్నుడై ఏమిచెప్పెనో దానిని అర్థవంతము గా మాకు తెలుపుము. 16

శ్లో॥ సంగమః ఖలు విప్రర్షే శివేనేహ శరీరిణామ్ ।
దుర్లభో మునయో దధ్యురసంగాద్యమభీప్సితమ్ ॥ 17

టీ:- సంగమ ఇతి. మునయోఽపి సంగత్యాగేనాప్తుమిష్టం యం దధ్యురేవ. కేవలం న తు ప్రాపుః తేన శివేన. 17

ఓ బ్రహ్మర్షీ! ప్రాణులకు శంకరుడితో సమాగమము ఈ లోకమునందు దుర్లభముగదా! మునులు ఆసక్తి విడచి, సంగత్యాగము చేసి కూడా అతడిని (పొందగోరిన వానిని) ధ్యానము నందు కేవలము దర్శించిరే తప్ప పొందలేకపోయిరి. అట్టి శివుడి సమాగమమును ప్రచేతసులు ఎట్లు పొందిరి. 17

శ్లో॥ ఆత్మారామోఽపి యస్త్వస్య లోకకల్పస్య రాధసే ।
శక్త్యాయుక్తో విచరతి ఘోరయా భగవాన్ హరః ॥ 18

అఘోర స్వరూపుడి ధ్యానము ఎందుకు చెయ్యాలి? అనగా ఆత్మారాముడైనప్పటికీ, ఆ పరమశివుడు లోకరచన సిద్ధించడానికి,

టీ:- నను మునీనాం కిం తద్ధ్యానేన ఘోరత్వాదిత్యాశంక్యాహ- ఆత్మారామ ఇతి. ఆత్మరామో లోకరచనాయాః రాధసే పాలనాయ. 18

దుష్టులకు భయము కలిగించడానికి వారు కలిగించే ఉపద్రవములను నశింపచేయడానికి భయమును పుట్టించే శక్తియుక్తుడై సంచరించు -చున్నాడు. 18

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ప్రచేతసః పితుర్వాక్యం శిరసాదాయ సాధవః ।
దిశం ప్రతీచీం ప్రయయుస్తపస్యాదృత చేతసః ॥ 19

టీ:- గుర్వాజ్ఞాకారిణాం శివదర్శనం సత్వ ఏవ భవతీత్యాశయేనాహ - ప్రచేతస ఇతి. 19

మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

తండ్రి ఆజ్ఞ పరిపాలించు వారికి శివ దర్శనము సహజముగానే అగును అనే ఆశయముచేత ఇట్లు చెప్పుచున్నాడు. సాధు జనులైన ప్రచేతసులు తండ్రి ఆజ్ఞను శిరసావహించి తపస్సుయందు ఆదరముతో కూడిన మనస్సు కలవారై పశ్చిమదిశకు వెళ్ళిరి. 19

శ్లో॥ సముద్రముపవిస్తీర్ణమపశ్యన్ సుమహత్సరః ।
మహన్మన ఇవ స్వచ్ఛం ప్రసన్నసలిలాశయమ్ ॥ 20

టీ:- సముద్రమితి. సముద్రముపసముద్రాత్కించిన్న్యూనం ఉపోఽధికే చేతి కర్మ ప్రవచనీయః ప్రసన్నాస్సలిలాశయా మత్స్యాదయో యస్మిన్. 20

వారు సముద్రమునకంటే కొంత చిన్నదైన, పెద్ద సరస్సును చూచిరి. ఆ సరస్సు చేపలు మొదలగు వాటిని గలిగి, రాగ ద్వేష రహితమైన మహాత్ముల మనస్సువలె ప్రసన్నమైనది, పరిశుభ్రమైనది. (20)

శ్లో॥ నీలరక్తోత్పలాంభోజకల్హారేందీవరా కరమ్ ।
హంససారస చక్రాంగ కారండవని కూజితమ్ ॥ 21

నలుపు, ఎరుపు కలిగిన రాత్రి వికసించే కలువలు, పగలు వికసించే పద్మములు, సంధ్యాకాలమున వికసించే ఎఱ్ఱ కలువలు

టీ:- నీలేతి. నీలోత్పలాదీనామాకరం జన్మస్థానం. ఉత్పలాంభోజ కల్హారాణి రాత్రిదినసంధ్యా వికాసీని ఇందీవరం నీలోత్పలం తస్య పునరుక్తిః ప్రాచుర్యజ్ఞాపనార్థం. హంసాదిభిర్నికూజితం. 21

శ్లో॥ మత్తభ్రమర సౌస్వర్యహృష్ట రోమలతాంఘ్రిపమ్ ।
పద్మకోశరజో దిక్షు విక్షిపత్పవనోత్సవమ్ ॥ 22

టీ:- మత్తేతి. మత్తానాం భ్రమరాణాం సౌస్వర్యేణ హృష్ట రోమాణో లతాంఘ్రిపాః యస్మిన్ పద్మకోశ రజః దిక్షు విక్షిపతా పవనేనోత్సవో యస్మిన్. 22

శ్లో॥ తత్ర గాంధర్వమాకర్ణ్య దివ్యమార్గమనోరహమ్ ।
విసిస్మ్యూ రాజపుత్రాస్తే మృదంగపణవాద్యను ॥ 23

టీ:- తత్రేతి. తత్ర మృదంగపణవాది వాద్యమనుపశ్చాత్. దివ్యైర్మార్గ భేదైర్మనోహరం గాంధర్వం గానమాకర్ణ్య విసిస్మ్యుః విస్మయం ప్రాప్తాః పాఠాంతరే మృదంగ పణవాది అవత్ రక్షత్ తేషాం ధ్వనిమతిరస్కృర్వదిత్యర్థః. 23

గలిగి, ఎక్కువగా నల్ల కలువలకు జన్మ స్థానమైనది ఈ సరోవరము. అంతేకాక హంసలు, బెగ్గురుపక్షులు, జక్కవపిట్టలు, కన్నెలేడు పక్షుల కూతలతో కూడిన సరస్సును చూచిరి. 21

మత్తెక్కిన తుమ్మెదల సుస్వర ధ్వనులచే, ఝుంకారములచే నిక్కబొడిచిన వెంట్రుకలా అనునట్లు గల చిగురుటాకుల తీగలు కలిగి చెట్ల పద్మకోశముల యందలి పుప్పొడిని దిక్కులకు వెదజల్లుచున్న గాలిచే ఉత్సవము కలిగిన ఆ సరస్సును చూచిరి. 22

రాజపుత్రులచట మృదంగము, మద్దెల మొదలగు వాద్యముల ధ్వనిని, విని పిమ్మట దివ్యములగు స్వరభేదములచే మనస్సును దోచుచున్న గాంధర్వ గానమువిని ఆశ్చర్యమును పొందిరి. "మృదంగ పణవాద్యవత్" అను పాఠాంతరముననుసరించిన, ఆ ధ్వనులచే తిరస్కరింపబడని గాంధర్వ గానమని చెప్పుకోవలెను. 23

శ్లో॥ తర్హ్యేవ సరసస్తస్మాన్నిష్క్రామంతం సహానుగమ్ ।
ఉపగీయమానమమర ప్రవరం విబుధానుగైః ॥ 24

అదే సమయమున ఆ సరస్సునుండి అనుచర గణముతో గంధర్వులు గానము చేయుచుండగా, కీర్తించుచుండగా, దేవతలలో శ్రేష్ఠుడు అని...( తరువాతి శ్లోకముతో అన్వయము) 24

టీ:- తర్హీతి. తే చ త్రిలోచనం వీక్ష్యజాతాశ్చర్యాః ప్రణేమురిత్యుత్తరేణాన్వయః. 24

శ్లో॥ తప్తహేమనికాయాభం శితికంఠం త్రిలోచనమ్ ।
ప్రసాద సుముఖం వీక్ష్య ప్రణేముర్జాతకౌతుకాః ॥ 25

కాల్చి వడబోసిన బంగారు వర్ణముగల దేహము, నల్లనైన కంఠము, మూడు నేత్రములు గలిగి, అనుగ్రహించుటకు సుముఖముగా ఉన్న ఆ పరమ శివుడిని చూచి ఉత్సాహముతో ఆయనకు నమస్కరించిరి. 25

శ్లో॥ సతాన్ ప్రపన్నాన్ గిరిశో భగవాన్ ధర్మవత్సలః ।
ధర్మజ్ఞాన్ శీలసంపన్నాన్ ప్రీతః ప్రీతానువాచ హ ॥ 26

దుఃఖములను తొలగించువాడు, ధర్మవత్సలుడు అయిన శివ భగవానుడు ప్రీతుడై, శీలసంపన్నులు, ధర్మజ్ఞులు, సంతుష్టులైన ఆ ప్రచేతసుల గూర్చి ఇట్లనెను. 26

టీ:- తప్తేతి. తప్యహేమరాశి సదృశకాన్తిం. శితిర్నీలః. కంఠో యస్య తం. (25-26)

### శ్రీరుద్రగీతా ప్రారంభః

### శ్రీ రుద్ర ఉవాచ

శ్లో॥ యూయం వేదిషదః పుత్రావిదితం వశ్చికీర్షితమ్ ।
అనుగ్రహాయ భద్రం న ఏవం మే దర్శనం కృతమ్ ॥ 27

టీ:- యూయమితి. వేదిషదః బర్హిషదశ్చికీర్షితం భగవదారాధనం విదితం. 27

శ్లో॥ యః పరం రంహససాక్షాత్త్రిగుణాజ్జీవ సంజ్ఞితాత్ ।
భగవంతం వాసుదేవం ప్రపన్నస్సప్రియో హి మే ॥ 28

టీ:- అనుగ్రహకారణమాహ - య ఇతి. యః సాక్షాద్వాసుదేవం ప్రపన్నః స హి మే ప్రియః. కథంభూతం రంహసః సూక్ష్మాత్. త్రిగుణాత్ప్రధానాత్. జీవ సంజ్ఞితాత్పురుషాచ్చ పరం ప్రకృతి పురుషయోర్నియంతార మిత్యర్థః. 28

శ్లో॥ స్వధర్మనిష్ఠశ్శత జన్మభిః పుమా
న్విరించతామేతి తతః పరం హిమామ్ ।
అవ్యాకృతం భాగవతోఽథ వైష్ణవః పదం
యథాహం విబుధాః కలాత్యయే ॥ 29

### శ్రీ రుద్రుడు ఈ విధముగా పలికెను.

మీరు బర్హిష్మంత మహారాజు పుత్రులు, మీరు చేయగోరు భగవదారాధనము గూర్చి నాకు తెలియును. మిమ్ముల అనుగ్రహించుటకు నా దర్శనమునిచ్చినాను మీకు మంగళమగుగాక! 27

మీ మీద నాకు ఇంతటి అనుగ్రహము కలుగుటకు కారణము ఏమో తెలియునా? ఎవరు సాక్షాత్తుగా వాసుదేవుడిని శరణు పొందుతారో వారు నాకు ప్రియులు. ఆ వాసుదేవుడెట్టివాడు? అతడు సూక్ష్మమైన, త్రిగుణాత్మకమైన ప్రధానముకంటే, జీవసంజ్ఞ కలిగిన పురుషుడి కంటే వేరైనవాడు. అనగా ప్రకృతి పురుషులకు నియామకుడని అర్థము. 28

ఆ స్థానము విశేష మహత్తు గలది. స్వధర్మముయందు నిష్ఠ గలవాడు, అనేక జన్మల పిమ్మట బ్రహ్మ స్థానమును పొందును. ఇంకా ఎక్కువ పుణ్యముండిన నన్ను పొందును. భాగవతుడు మాత్రం

టీ:- తత్కిం తస్య మహత్తమత్వాదిత్యాహ–స్వేతి. స్వధర్మనిష్ఠః పుమాన్ బహుజన్మభిః విరించతాం ప్రాప్నోతి తతోఽపి పుణ్యాతిశయేన మామేతి భాగవతస్తు అథ దేహాంతే. అవ్యాకృతం ప్రపంచాతీతం. వైష్ణవం పదమేతి. యథాహం రుద్రో భూత్వా అధికార ఇవ వర్తమానః విబుధా దేవాశ్చాధికారికాః.కలాత్యయే అధికారాంతే లింగభంగే సత్యేష్యంతి. (29)

దేహమును విడిచిన పిమ్మట అవ్యాకృతము, ప్రపంచాతీతమైన వైష్ణవ పదమును పొందును. ఏ విధముగానైతే నేను రుద్రుడనై ఈ అధికారము యందు ఇప్పుడు ఉంటూ, మరియు ఈ దేవతలు తత్తద్దేవత అధికార మందు ఉంటూ ఈ అధికార సమాప్తి సమయమున, లింగ శరీర భంగమై ఏ స్థానమును పొందుదురేమో. 29

శ్లో॥ అథ భాగవతా యూయం ప్రియాః స్థ భగవాన్ యథా ।
న మే భాగవతానాం చ ప్రేయానన్యోఽస్తికర్హిచిత్ ॥ 30

మీరు భాగవతులు కనుక నాకు భగవంతునివలె, మీరుగూడా అత్యంత ప్రియులు. నాకు భగవంతునికంటే ప్రియమైన వారెవ్వరూ లేరు. 30

టీ:- అథేతి. అథ భాగవతత్వాత్ యూయం మే ప్రియాః స్థ భవద్భిరపి మయి ప్రీతిః కార్యేత్యాశయేనాహ. మదన్యో భాగవతానాం చ ప్రేయన్నాస్తి. 30

శ్లో॥ ఇదం వివిక్తం జప్తవ్యం పవిత్రం మంగళం పరమ్ ।
నిశ్శ్రేయసకరం చాపి శ్రూయతాం యద్వదామి వః ॥ 31

నేను మీకు చెప్పుచున్నది శ్రద్ధగా విని, చెప్పినట్లు చేయండి. ఇది పవిత్రమైనది, మంగళ ప్రదమైనది, ఇది మోక్షమును గూడా ఇచ్చునది. అసంకీర్ణము కాకుండా అనగా నానా విషయములచే సంకరము కాకుండా శుద్ధముగా జపించండి. 31

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ ఇత్యనుక్రోశహృదయో భగవానాహ తాన్ శివః ।
బద్ధాంజలీన్రాజపుత్రాన్నారాయణపరో వచః ॥ 32

టీ:- ఇదమితి. అత ఇదం జప్తవ్యం శ్రూయతామితి వివిక్తమసంకీర్ణం యథా భవతి తథా. (31-32)

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

దయగల (శివ) హృదయముగల పరమశివుడు, చేతులను జోడించిన ఆ రాజపుత్రులకు నారాయణాత్మకమైన వాక్కులను ఉపదేశించెను. 32

**శ్రీరుద్ర ఉవాచ.**

శ్లో॥ జితం త ఆత్మవిద్ధర్య స్వస్తియే స్వస్తిరస్తు మే ।
భవతా రాధసారాద్ధం సర్వస్మా ఆత్మనే నమః ॥ 33

టీ:- శ్లో."సృష్ట్యాదౌ బ్రహ్మణా సృష్ట్వా పుత్రేభ్యః ప్రోక్తమిష్టదం, స్తోత్రం ప్రాహ ప్రచేతోభ్యః కృపయా భగవాన్ శివః." శ్రీధరీయోఽయం శ్లోకః జితమితి. తే జితం తవోత్కర్షః ఆత్మవిద్ధుర్యాణాం స్వస్తయే శోభన సత్తాయై స్వానందలాభయేత్యర్థః.అతో మే స్వస్తిః స్వానందసత్తాస్తు ననుమమోత్కర్షో మదర్థ ఏవ కిం న స్యాత్తత్రాహ. భవతా రాధసా స్వానంద రూపేణ రాద్ధం సిద్ధం త్వం నిరతిశయపరమానందరూపేణైవ నిత్యం స్థిత ఇత్యర్థః. అత ఏవం భూతాయాత్మనే తుభ్యం నమః సర్వస్మై సర్వరూపాయ చ. 33

**శ్రీ రుద్రుడు ఈ విధముగా పలికెను.**

ఆత్మవిదులలో శ్రేష్ఠులకు స్వానంద లాభము కలుగుటకు నీకు ఉత్కర్ష కలుగుగాక! జయము కలుగుగాక! నాకు కూడా ఆ ఆనంద స్థితి కలుగుగాక! నాకు, నారాయణునకు ఉత్కర్ష ఉండును గదా యనగా! నీవు పరమానంద రూపుడవు, ఎల్లప్పుడు పరమానంద స్వరూపముగనే యుందువు. అందరి కొరకు సర్వాత్ముడవు, సర్వస్వరూపుడవు అట్టివాడికి నమస్కారము. 33

శ్లో॥ నమః పంకజనాభాయ భూతసూక్ష్మేంద్రియాత్మనే ।
వాసుదేవాయ శాంతాయ కూటస్థాయ సర్వోచిషే ॥ 34

టీ:- సర్వరూపత్వం ప్రపంచయన్ ప్రణమతి-స్సార్ధైర్దశభిః. నమ ఇతి. పంకజంలోకాత్మకం పద్మం నాభౌ యస్య తస్మై కారణాత్మనే నమః కారణత్వాదేవ సృజ్యానాం ప్రాణినాం యే ఉపాదయః భూతాని స్థూలాని సూక్ష్మాణి తన్మాత్రాణి ఇంద్రియాణి చ తేషామాత్మనే నియంత్రే. అంతః కరణ చతుష్ట యాధిష్టాతృత్వేన ప్రణమతి - చతుర్భిః శ్లోకార్థైః వాసుదేవాయ చిత్తాధిష్ఠాత్రే. కూటస్థాయ నిర్వికారాయ చిత్తస్యైక రూపత్వాత్. 34

సర్వ రూపత్వమును ప్రతిపాదిస్తూ పదిన్నర శ్లోకాలలో పరమాత్మకు నమస్కరిస్తున్నాడు. పద్మమనే లోకము నాభియందుగల కారణాత్ముడికి నమస్కారము. కారణము కలిగియున్నాడు కనుకనే సృజింపడిన ప్రాణులకు భూతసూక్ష్మములు, తన్మాత్రలు, ఇంద్రియములు ఉపాధులలో ఆ ప్రాణులయొక్క నియంతకు నమస్కారము.

నాలుగున్నర శ్లోకములచే అంతఃకరణ చతుష్టయ అధిష్ఠాతగా గలవాడికి నమస్కరించుచున్నాడు. శాంతుడికి, కూటస్థుడికి, నిర్వికారుడికి, స్వయం ప్రకాశుడికి వాసుదేవుడు చిత్తధిష్ఠాతయైనవాడికి నమస్కారము. (34)

శ్లో॥ సంకర్షణాయ సూక్ష్మాయ దురంతాయాంతకాయ చ ।
నమో విశ్వప్రబోధాయ ప్రద్యుమ్నాయాంతరాత్మనే ॥ 35

టీ:- సంకర్షణాయేతి. సంకర్షణాయ అహంకారాధిష్ఠాత్రే సూక్ష్మాయ అవ్యక్తాయ. దురంతాయ అనంతాయ అంతకాయ ముఖాగ్నినాలోక దాహకాయ. విశ్వస్య ప్రకృష్టో బోధో యస్మాత్. అంతరాత్మనే బుద్ధ్యధిష్ఠాత్రే. 35

అవ్యక్తుడు, అనంతుడు, ముఖాగ్నిచేత లోకమును దహింప చేయువాడు, అహంకార అధిష్ఠాతయైన వాడికి, సకలప్రాణులకు ఉత్కృష్టమైన జ్ఞానము కలిగించువాడు, అంతరాత్మ, బుద్ధ్యష్ఠాతయైన ప్రద్యుమ్ననకు నమస్కారము. 35

శ్లో॥ నమో నమోఽనిరుద్ధాయ హృషీకేశేంద్రియాత్మనే ।
నమః పరమహంసాయ పూర్ణాయ నిభృతాత్మనే ॥ 36

టీ:- నమో నమ ఇతి. హృషీకాణామీశం యత్ ఇంద్రియం మనః తదాత్మనే. సూర్యరూపేణ ప్రణమతి పరమహంసాయ సూర్యాయ. పూర్ణాయ తేజసా విశ్వవ్యాపినే. నిభృతాత్మనే క్షయవృద్ధిశూన్యాయ. 36

చక్షురాది ఇంద్రియములకు నియామకమై ఏ ఇంద్రియములు గలవో మనస్సు, ఆ మనోరూప ఇంద్రియాత్మకు నమస్కారము, సూర్య రూప పరమాత్మకు నమస్కారము చేయుచున్నాడు. పరమహంసాయ– శ్రేష్ఠుడైన సూర్యునకు నమస్కారము విశ్వమును వ్యాపించిన పూర్ణమైన తేజమునకు క్షయ వృద్ధులు లేని పరమాత్మకు నమస్కారము. 36

శ్లో॥ స్వర్గాపవర్గద్వారాయ నిత్యం శుచిషదే నమః ।
నమో హిరణ్య వీర్యాయ చాతుర్హోత్రాయ తంతవే ॥ 37

టీ:- స్వర్గేతి. స్వర్గాపవర్గద్వారాయ చ. శుచిత్యంతఃకరణే సీదతి నిషీదతీతి శుచిషత్ తస్మై. "హగ్ంసశ్శుచిషది" తి శ్రుతేః. అగ్ని త్వమాహ. హిరణ్యం వీర్యం యస్య తస్మై అగ్నిరూపాయ. చాతుర్హోత్రం. కర్మ తస్మై తత్సాధనాయేత్యర్థః. కుతః తంతవే తద్విస్తారకాయ. 37

స్వర్గమోక్షములకు ద్వారభూతమైన వేదాత్మునకు, ఎల్లప్పుడు అంతకరణములయందు నివసించువాడికి, "హగ్ంసశ్శుచ్చిషత్ అని వేదము" అగ్నిరూపునకు చాతుర్హోత్రమను యజ్ఞమునకు, తత్సాధనా రూపునకు నమస్కారము. యజ్ఞ విస్తారునకు నమస్కారము. 37

శ్లో॥ నమ ఊర్జ ఇషే త్రయ్యాః పతయే యజ్ఞ రేతసే ।
తృప్తిదాయ చ జీవానాం సమస్సర్వరసాత్మనే ॥ 38

టీ:- నమ ఇతి. సోమత్వమాహ – ఊర్జే పితౄణామన్నాయ. ఇషే దేవానామన్నాయ యజ్ఞరేతసే సోమాయ సహి పితౄణాం దేవానాం

సోమత్వమును చెప్పుచున్నాడు. పితరులకు, దేవతలకు, ఆహార రూపమైనవాడు చంద్రుడు. యజ్ఞఫలరూపుడైన వాడుగూడా చంద్రుడే అతడికి నమస్కారము.

వేదపతియైన వాడికి నమస్కారము. సూర్య, అగ్ని, సోమరూప మున పరమాత్మకు తేజస్త్వమును చెప్పి, జలత్వమును తెలుపుచున్నాడు.

చాన్నం ఏవం రూపాయ త్రయ్యాః పతయే హరయే నమః. సూర్యాగ్ని సోమత్వేనైవ తేజస్త్వముక్తం. జలత్వమాహ. సర్వరసాత్మనే జల రూపాయ. 38

సర్వరసస్వరూపుడైన జలరూపునకు నమస్కారము. 38

శ్లో॥ సర్వసత్త్వాత్మ దేహాయ విశేషాయ స్థవీయసే ।
నమస్త్రైలోక్యపాలాయ సహ ఓజోబలాయ చ ॥ 39

టీ:- సర్వేతి. విశేషాయ పృథివీరూపాయ. సర్వేషాం సత్త్వానాం ప్రాణినాం యే ఆత్మనః తేషాం దేహాయ స్థవీయసే విరాడ్దేహాయ చ. త్రైలోక్యపాలాయ వాయవే. సహ ఆదిరూపాయ. ప్రాణరూపేణ త్రైలోక్యం పాలయతే సహ ఆదిధర్మాయ. 39

ఒక పదార్థజ్ఞానము కలగాలన్న శబ్దము ద్వారా అర్థజ్ఞానము కలుగుతుంది. ఈ శబ్దము ఎక్కడ ఉంటుంది. ఆకాశమున "శబ్దగుణ మాకాశం" తనయందు గల శబ్దముద్వారా పదార్థజ్ఞానమునకు కారణమైన ఆకాశరూపునకు నమస్కారము. 39

శ్లో॥ అర్థలింగాయ నభసే నమోఽంతర్బహిరాత్మనే ।
నమః పుణ్యాయ లోకాయ చాముష్మైభూరివర్చసే ॥ 40

టీ:- అర్థలింగాయేతి. నభసే ఆకాశాయ. అర్థానాం లింగాయ జ్ఞాపకాయ శబ్దగుణకత్వాత్. అంతర్బహిరాత్మనే అంతర్బహిర్వ్యవహారాలంబనాయ ఏవమాకాశాది మహాభూతరూపత్వ ముక్తం అముష్మై స్వర్గాయ భూరి వర్చసే. "ఏష వై జ్యోతిష్మంతం పుణ్యంలోకం యాతీ"తి శ్రుతేః. 40

ఆకాశము శబ్దగుణకమే కాకుండా అవకాశదాయిత్వము కూడా కలదు. అనగా లోపల, బయట అనే వ్యవహారమంతాగూడా ఆకాశమును ఆధారంగా చేసుకొనే చేస్తున్నాము. అట్టి ఆకాశ రూపుడికి నమస్కారము. ఈ విధముగా పరమాత్మకు , మహాభూతరూపమును చెప్పినట్టాయెను. పుణ్యము ద్వారా లభించు విశేష ప్రకాశముగల స్వర్గరూపలోకస్వరూపమునకు నమస్కారము. ఈ తేజోవంతమైన పుణ్యలోకమును పొందుచున్నాడు అని శ్రుతి. 40

శ్లో॥ ప్రవృత్తాయ నివృత్తాయ పితృదేవాయ కర్మణే ।
నమోఽధర్మవిపాకాయ మృత్యవే దుఃఖదాయినే ॥ 41

టీ:- ప్రవృత్తాయ నివృత్తాయ చ కర్మణే పితృదేవాయ యథాక్రమం పితృదేవప్రాప్తి ఫలాయ అధర్మఫలరూపాయ చ మృత్యవే. 41

శ్లో॥ సమస్త ఆశిషామీశమనవే కారణాత్మనే ।
నమో ధర్మాయ బృహతే కృష్ణాయాకుంఠమేధసే ॥ 42

టీ:- నమ ఇతి. హే ఈశ ఆశిషాం కారణాత్మనే సర్వకర్మఫలదాత్రే. మనవే సర్వజ్ఞాయ మంత్రాత్మకాయేతి వా. విష్ణుత్వేన ప్రణమతి - బృహతే ధర్మాయ పరమధర్మాత్మనే కృష్ణాయ. 42

శ్లో॥ పురుషాయ పురాణాయ సాంఖ్యయోగేశ్వరాయ తే ।
శక్తిత్రయ సమేతాయ మీఢుషేఽహంకృతాత్మనే ।
చేత ఆకృతిరూపాయ నమో వాచో విభూతయే ॥ 43

టీ:- పురుషాయేతి. రుద్రరూపేణ ప్రణమతి. మీఢూషే రుద్రాయ. అహంకృతమహంకారః తదాత్మనే స చ కర్తృకరణ కర్మశక్తి త్రయస

ప్రవృత్తి నివృత్యాత్మక కర్మ స్వరూపమునకు నమస్కారము. పితృదేవప్రాప్తి ఫలరూపునకు నమస్కారము. అధర్మ ఫలము దుఃఖము. ఆ దుఃఖరూపునకు, దుఃఖమును కలిగించు మృత్యురూపునకు (శ్రీహరికి) నమస్కారము. అనగా అధర్మము చేసినప్పుడు దుఃఖరూప ఫలితమునిచ్చువాడు అతడే. 41

ఓ ఈశా! సర్వకర్మ ఫలదాతకు నమస్కారము. సర్వజ్ఞునకు మత్రాత్మకునకు పరమధర్మ స్వరూపునకు మొక్కవోని మేధాశక్తి గలవానికి జ్ఞాన, కర్మ, యోగ ప్రవర్తకునకు (శ్రీకృష్ణునకు) అనాదిరూపుడైన పరిపూర్ణునకు నమాస్కారము. 42

రుద్రరూపుడైన పరమేశ్వరునికి నమస్కరించుచున్నాడు.

కర్తృశక్తి, కరణశక్తి, కర్మశక్తి మూడు శక్తులుగల అహంకారాత్మకుడైన, సుఖకరుడైన రుద్రునకు నమస్కారము.

బ్రహ్మరూపమున నమస్కరించుచున్నాడు.

"భూరితివ్యాహరత్" అనే శ్రుత్యాదులననుసరించి వాక్కునుండే వివిధములైన సృష్టిజరుగుచున్నది. వాక్కుప్రయోగించే జ్ఞానము, ఆ

మేతః. తస్మై బ్రహ్మత్వేన ప్రణమతి చేత ఇతి. చేతోఙ్జ్ఞానం. ఆకృతిః క్రియా. తద్రూపాయ. వాచో వివిధా భూతిః సృష్టిః యస్మాత్తస్మై. 43

క్రియా గలిగినట్టివాడు బ్రహ్మ, ఆ బ్రహ్మ స్వరూపునకు నమస్కారము. 43

శ్లో॥ దర్శనం నో దిదృక్షూణాం దేహి భాగవతార్చితమ్ ।
రూపం ప్రియతమం స్వానాం సర్వేంద్రియగుణాంజనమ్ ॥44

టీ:- ఏవం నమస్కృత్య దర్శనం ప్రార్థయతే–నవభిః. దర్శనమితి. భాగవతైః సత్కృతం దర్శనం దేహీత్యస్య వివరణం–రూపమిత్యాది ప్రదర్శయేత్యంతం. స్వానాం భక్తానాం ప్రియతమం రూపం ప్రదర్శయేతి నవమేనాన్వయః. సర్వేంద్రియాణాం యే గుణా విషయాః తేషా మంజనం వ్యంజకం సర్వేంద్రియ విషయవిషయిరూపమిత్యర్థః. సర్వేషామింద్రియాణి స్వగుణైరనక్తి రంజయతీతి వా. 44

భాగవతులచే ఆదరింపబడిన రూపదర్శనమును కలిగించుము. అది ఎట్టిది? అది తన భక్తులైన వారికి అత్యంత ప్రీతిపాత్ర మైనట్టిది. సర్వఇంద్రియముల యొక్క రూపాదులను వ్యక్తపరచునది. రంజింపజేయునది. సర్వ ఇంద్రియ విషయములైన శబ్దరూపాదుల జ్ఞానకారకుడు అని అర్థము. లేదా సర్వఇంద్రియములను ఏ రూపాదులు రంజింపచేయునో ఆ రూపమును దర్శింప చేయుము. 44

శ్లో॥ స్నిగ్ధ ప్రావృడ్ఘనశ్యామం సర్వసౌందర్యసంగ్రహమ్ ।
చార్వాయతచతుర్బాహుం సుజాతరుచిరాననమ్ ॥ 45

టీ:- స్నిగ్ధేతి. స్నిగ్ధః ప్రావృషి యోఘనః తద్వత్ శ్యామం. సర్వేషాం సౌదర్యాణాం సంగ్రహో యస్మిన్ చారవః ఆయతాశ్చత్వారో బాహవో యస్మిన్. సుజాతం యథోచిత సర్వావయవం రుచిరమాననం యస్మిన్ సుందరే భ్రువౌ యస్మిన్. 45

నీరునిండిన వర్షాకాలపు మేఘమువలె అందమైన, చిక్కనైన శ్యామలవర్ణము కలిగి, సర్వసౌందర్యములు ముద్దగట్టినట్టుగాగల, సుందరమైన దీర్ఘబాహువులు గలిగి, ఏ అవయవము ఏ విధముగా ఉంటే అందమో ఆ విధముగా అవయవములు గలిగిన ముఖము గలవాడు. 45

శ్లో॥ పద్మకోశపలాశాక్షం సుందరభ్రు సునాసికమ్ ।
సుద్విజం సుకపోలాస్యం సమకర్ణవిభూషణమ్ ॥ 46

టీ:- పద్మేతి. పద్మస్య కోశే మధ్యే యాని పలాశాని తద్వదక్షిణీ యస్మిన్ సుందరే భ్రువౌయస్మిన్. సుకపోలమాస్యం యస్మిన్. సమౌ కర్ణౌ విభూషణం యస్య. కుండలయోరగ్రే వక్ష్యమాణత్వాత్. 46

తామరరేకులవంటి కన్నులు గలిగి, సుందరమైన కనుబొమ్మలు, ముక్కు, పలువరుస, చెక్కిళ్ళు, ముఖము, శోభచేగూడిన చెవులు గలిగిన వాడు. 46

శ్లో॥ ప్రీతి ప్రహసితాపాంగమలకైరుపశోభితమ్ ।
లసత్పంక జకింజల్క దుకూలం మృష్టకుండలమ్ ॥ 47

టీ:- ప్రీతీతి. ప్రీత్యా ప్రహసితావ పాంగౌ యస్మిన్. 47

ఆయన ముఖము ప్రేమచేత చిరునవ్వులు చిందించుచున్నవా అన్నట్టుగల కడగన్నులు కలిగి ముంగురులచే శోభించుచున్నట్టియు; ప్రకాశించే పద్మమందలి పరాగము వంటి వస్త్రము గలిగి; ఉజ్వలమైన కుండలములు గలిగినట్టియు...47

శ్లో॥ స్ఫురత్కిరీట వలయ హార నూపుర మేఖలమ్ ।
శంఖ చక్ర గదా పద్మమాలామణ్యుత్తమర్ధిమత్ ॥ 48

టీ:- స్ఫురదతి. స్ఫురంతి కిరీటాదీని యస్మిన్. శంఖాదీనాముత్తమర్ధిః లక్ష్మీ. యద్వా ఏతైరుత్తమా బుద్ధిరుత్కర్షో యస్యాస్తి తత్ .48

కిరీటకంకణహారనూపురములు,మొలత్రాడుఎచ్చట ప్రకాశించు చున్నవో శంఖము, చక్రము, గదా. పద్మమాలా కౌస్తుభమణి మహాలక్ష్మి గలవాడైనట్టి లేదా వీటిచేత ఉత్తమమైన శోభ గలిగినట్టి...48

శ్లో॥ సింహస్కంధత్విషో బిభ్రత్సౌభగ గ్రీవ కౌస్తుభమ్ ।
శ్రియానపాయిన్యాక్షిప్త నికషాశ్మోరసోల్లసత్ ॥ 49

సింహము యొక్క భుజ స్కంధము యందు చుట్టుగా ప్రసరించుచున్న వెంట్రుకలచే ఏ కాంతిగలదో చుట్టూరుగా అట్టి కాంతి గల, కౌస్తుభమణిచే ప్రకాశించుచున్న అందమైన మెడగలవాడు, లేదా సింహమువలె భుజస్కంధములు గలిగి నట్టి “ త్విషః” అనునది

టీ:- సింహేతి. సౌభగ యుక్తా గ్రీవా యేన సింహస్య స్కంధే పరితః ప్రసరంతః కేసరా ఏవ త్విషః తాదృశీః సర్వతః త్విషోబిభ్రచ్ఛాసౌ సౌభగగ్రీవః కౌస్తుభో యస్మిన్ సింహస్యేవ యౌ స్కంధౌ తయోః త్విషః కుండలహారాదిదీప్తిర్బిభ్రతీతి. పృథగ్విశేషణం. సౌభగయుక్తా గ్రీవా యేన. స కౌస్తుభో యస్మిన్. శ్రియా హేతుభూతయా క్షిప్తస్తిరస్కృతః నికషాశ్మా స్వర్ణరేఖాంకితో నికషపాషాణో యేన. తాదృశేనోరసా ఉల్లసచ్ఛోభమానం. 49

ప్రత్యేకవిశేషణం. కుండలహారాదులచే ప్రకాశము గలిగిన అని ఎప్పుడు విడవని మహాలక్ష్మి చేత బంగారమును పరీక్షించు బంగారు రేఖగల రాతి (ఒరిపిడిరాయి) కాంతిని తిరస్కరించు కాంతిగల వక్షఃస్థలముచే ప్రకాశించుచున్నది. 49

శ్లో॥ పూర రేచక సంవిగ్నవళి వల్గుదళోదరమ్ ।
ప్రతిసంక్రామయద్విశ్వం నాభ్యావర్తగభీరయా ॥ 50

టీ:- పూరేతి. శ్వాసాచ్ఛ్వాసాభ్యాం సంవిగ్నాశ్చంచలా వళయస్తాభిర్వల్గు. దళవదశ్వత్థపత్ర సదృశముదరం యస్మిన్. ప్రతిసంక్రాయమత్ యతో వినిర్గతం తేనైవ ద్వారేణ పునః ప్రవేశయదివ. 50

శ్వాసోచ్ఛ్వాసములవలన కదలాడే రేఖలచే అందమైన రావి ఆకు వంటి ఉదరము కలిగినట్టి, సుడిగుండమువలె లోతైన నాభి, తన నుండి బయటకు వచ్చిన జగత్తును తిరిగి తన లోనికి తీసుకొనేందుకు సిద్ధముగా యున్నదా అన్నట్టు ప్రకాశించును. 50

శ్లో॥ శ్యామశ్రోణ్యధిరోచిష్ణు దుకూలస్వర్ణమేఖలమ్ ।
సమచార్వంఘ్రిజంఘోరునిమ్న జానుసుదర్శనమ్ ॥ 51

టీ:- శ్యామేతి. శ్యామశ్రోణ్యా అధికం రోచిష్ణు యత్పీతం దుకూలం. తత్ర స్వర్ణమయీ మేఖలా యస్మిన్. అంఘ్రీ చ జంఘే చ ఊరూ చ

శ్యామవర్ణముగల నడుముచేత ఎక్కువగా ప్రకాశించుచున్న పట్టుపీతాంబరము గలిగి, దానిపైనుండి బంగారు మొలత్రాడు గలిగి, సమముగా అందంగాగల పాదములు, పిక్కలు, తొడలు కలిగినట్టి ఎత్తుగాలేని మోకాళ్ళు గలిగినట్టి మంగళప్రదమైన దర్శనము ఎవరిదో అట్టి శ్రీహరి... 51

నిమ్నే అనున్నతే జానునీ చ. సమైశ్చారుభిరేతైః శోభనం దర్శనం యస్య సమాశ్చారవోఽంఘ్ర్యాదయో యస్మిన్ నిమ్నే జానునీ యస్మిన్ శోభనం దర్శనం యస్యేతి పదత్రయం వా. 51

శ్లో॥ పదాశరత్పద్మ పలాశ రోచిషా
నఖద్యుభిశ్చాంత రఘం విధున్వతా ।
ప్రదర్శయ స్వీయమపాస్తసాధ్వసం
పదం గురోర్మార్గ గురుస్తమోజుషామ్ ॥ 52

టీ:- పదేతి. పదా దీపస్థానీయేన. యద్వా ఏవం భూతేన పదో పలక్షితం రూపంశరణం ప్రదర్శయేత్యర్థః. శరది యత్పద్మం తస్య పలాశం తద్వద్రోచిర్యస్య తేన. నఖదీప్తిభిరంతర్భవమఘం అజ్ఞానం విధున్వతా స్వీయం రూపం పదం చరణం ప్రదర్శయ. అపాస్తం ప్రహ్లాదాదీనాం సాధ్వసం యేన తత్. హే గురో యతస్త్వమేవ తమో జుషామజ్ఞానాం మార్గ ప్రదర్శకో గురుః. 52

ఓ గురుదేవా! మా లోపల ఉన్న చీకటియనే పాపమును తొలగించే మరియు దీపస్థానీయమైన లేదా శరత్కాల పద్మపత్రము వంటి కాంతి కలిగినట్టి రూపమును ప్రదర్శించుము. శరణము నొసంగుము. కాలిగోటి కాంతులచే లోపలయున్న అజ్ఞానమనే చీకటిని తొలగించు నీ పాదములను చూపెట్టుము. ప్రహ్లాదాదులకు భయమును తొలగించిన నీ రూపమును దర్శింపచేయుము. ఓ గురుదేవా! నీవే అజ్ఞానమున గలమాకు మార్గ ప్రదర్శకుడవైన గురువు. 52

శ్లో॥ ఏతద్రూపమనుధ్యేయమాత్మశుద్ధిమభీప్సతామ్ ।
యద్భక్తియోగోఽభయదస్స్వధర్మమనుతిష్ఠతామ్ ॥ 53

అతి దుర్లభమైన దర్శనమును నేను ప్రార్థించినానని (స్తోతనే) ఈ విధముగా పలుకుచున్నాడు. అంతఃకరణ శుద్ధిని కోరువారు, ఈ రూపమును నిరంతరం ధ్యానిస్తూ ఉండాలి. ఇది ధ్యానార్హమే,

టీ:- అతిదుర్లభమిదం మయా ప్రార్థితమితి స్తోత్రైవాహ-ఏతదితి. ఏతద్రూపమనుధ్యేయం ధ్యానార్హమేవ నతు ప్రత్యక్షః ప్రాప్యమిత్యర్థః . (53)

ప్రత్యక్షముగా పొందునది కాదు. స్వధర్మమును అనుష్ఠించే వారలకు భక్తి అనే యోగము అభయమునిచ్చుచున్నది. 53

శ్లో॥ భవాన్ భక్తిమతాలభ్యో దుర్లభస్సర్వదేహినామ్ ।
స్వారాజ్యస్యాప్యభిమతో హ్యేకాంతేనాత్మ విద్గతిః ॥54

టీ:- తర్హి కింకేనాపి న ప్రాప్యతే? తత్రాహ - భవానితి. దుర్లభత్వమేవాహ-స్వర్గే రాజ్యం యస్య తస్యాప్యభిమతః స్ప ృహణీయః. కించ ఏకాంతేన యః ఆత్మవిత్ తస్యాపి గతిర్గమ్యః. 54

ఎవ్వరిచేతగూడా పొందుటకు సాధ్యముకానిదా! ఈ రూపం? నీవు కేవలము భక్తిగల వారలకు మాత్రమే లభించువాడవు. సామాన్య జనులకు దుర్లభుడవు. ఇంద్రుడు గూడా పొందగోరు రూపము గలవాడవు. సాలోక్యాది సుఖ నిరపేక్షుడైన ఆత్మవిత్తునకు గూడా పొందదగినవాడవు నీవే. 54

శ్లో॥ తం దురారాధ్యమారాధ్యసతామపి దురాపయా ।
ఏకాంతభక్త్యా కో వాంఛేత్పాదమూలం వినా బహిః ॥ 55

టీ:- అతస్త్వద్వ్యతిరేకేణ న కించాద్వాంఛామీత్యాహ-తమితి. తం త్వామేకాంతభక్త్యా ఆరాధ్య. బహిః స్వర్గాది సుఖం. 55

సత్పురుషులకుగూడా పొందశక్యముగాని, ఆరాధించుటకు శక్యముగానట్టి నిన్ను ఏకాంత భక్తిచే ఆరాధించి, నీ పాదమూలమును గాక స్వర్గాది సుఖములను ఎవరు కోరుదురు. అందుకొరకు నిన్ను తప్ప వేరే ఏదీ కోరరు. 55

శ్లో॥ యత్ర నిర్విష్టమరణం కృతాంతో నాభిమన్యతే ।
విశ్వం విధ్వంసయన్వీర్యశౌర్యవిస్ఫూర్జితభ్రువా ॥ 56

ఎందుకు ఏదీ కోరదనగా! ఎవరి పాదములను శరణు పొందినాడో అట్టి వాడిని చూచి యముడు, వీడు నా ఆధీనుడను అభిమానము పొందదు. గొప్ప ప్రభావము, వీర్యములచే కదల్చబడిన

టీ:- యత్రేతి. తత్ర హేతుః యత్ర పాదమూలే శరణం ప్రవిష్టం. కృతాంతః కాలో మమాయం పశ్య ఇతి నాభిమన్యతే అభిమానం న కరోతి. కిం కుర్వన్ వీర్యం ప్రభావః. శౌర్యముత్సాహః. తాభ్యాం విస్ఫూర్జి తయా క్షుభితయా భ్రువా విశ్వం విధ్వంసయన్నపి. 56

శ్లో|| క్షణార్ధేనాపి తులయే న స్వర్గం నా పునర్భవమ్ ।
భగవత్సంగిసంగస్య మర్త్యానాం కిముతాశిషః ॥ 57

టీ:- త్వత్పాదమూలే ప్రవిష్టస్య కృతాంతభయాభావః కియానయం లాభః. ఇతః త్వద్భక్తసంగ ఏవ సకలపురుషార్థశ్రేణిశిరసి వరీవర్తీత్యాహ– క్షణార్ధేనేతి. భవతస్తవ సంగినాం. సంగస్య క్షణార్ధేనాపి న స్వర్గం తులయే సమం న గణయామి. న చాపునర్భవం మోక్షం మర్త్యా నామాశిషో రాజ్యాద్యాః కిముత. 57

శ్లో|| అథానఘాంఘ్రేస్తవ కీర్తి తీర్థయో
రంతర్బహిస్స్నాన విధూత పాప్మనామ్ ।
భూతేష్వనుక్రోశసుసత్త్వశీలినాం
స్యాత్సంగమోఽనుగ్రహ ఏషనస్తవ ॥ 58

కనుబొమ్మలు గలిగి విశ్వమునంతను నశింపచేసినప్పటికీ... (తరువాతి శ్లోకముతో అన్వయము) 56

నీ పాదమూలము నాశ్రయించిన వాడికి యమభయము లేకుండుట గొప్ప లాభమా! అదెంత? ఎందుకంటే నీ భక్తులతో స్నేహమే సకల పురుషార్థముల శిరస్సున నాట్యము చేస్తుంది. ఓ పరమాత్మా! నీ యందు సంగముగల వారితో స్నేహము అరక్షణము చాలు. స్వర్గముకాని, మోక్షముగాని ఇక మానవులు పొందు రాజ్యాది సుఖములంటావా అవి ఎంత? 57

ఓ పరమాత్మా! ఆ కారణముగా పాపములను తొలగించు పాదములుగల నీ యశో చింతన ద్వారా అంతఃస్నానము నీ పాదముల జనిత గంగయందు బాహ్యస్నానముచేసి సకల పాపములనుండి విముక్తి పొందినవారు. అందులకే సర్వప్రాణులయందు దయ, కృప, రాగాది రహితమైన చిత్తము, శీలము (చక్కటి మార్గము), నడవడిక గలిగిన

టీ:- అథేతి. అథ అతో హేతోః అనఘౌ అఘహరౌ అంఘ్రీ యస్య తస్య తవ కీర్తిః యశః తీర్థం గంగా. తయోః క్రమేణాంతర్బహి స్స్నానాభ్యాం. విధూతః పాప్మా యేషాం అత ఏవ భూతేష్వనుక్రోషః కృపా తేన. సుశుద్ధం రాగాది రహితం సత్త్వం చిత్తం శీలం చార్జవాది విద్యతే యేషాం తేషాం సంగోఽస్మాకం స్యాత్. ఏష ఏవ న స్త్వదనుగ్రహః. 58

వారలచే నిరంతర సమాగమము మాకు కలుగుగాక! ఇదే మాపై నీ యొక్క నిజమైన అనుగ్రహము . 58

శ్లో॥ న యస్య సత్త్వం బహిరర్థవిభ్రమం
తమోగుహాయాం చ విశుద్ధమావిశత్ ।
యద్భక్తియోగానుగృహీతమంజసా
మునిర్విచష్టే నను తత్ర తే గతిమ్ ॥ 59

టీ:- తత్త్వజ్ఞానం చ త్వద్భక్తసంగాదేవ భవతీత్యాహ-నయస్యేతి. యేషాం సతాం భక్తియోగేనానుగృహీతం శుద్ధంసత్ యస్య సత్త్వం చిత్తం బాహ్యార్థవిక్షిప్తం న భవతి తమోరూపాయాం గుహాయాం చ నావిశత్. లయం న ప్రాప. తత్ర తదాస మునిః తే తవ గతిం తత్త్వం విచష్టేపశ్యతి. 59

తత్త్వజ్ఞానముగూడా నీ భక్తుల సమాగమము ద్వారానే ,స్నేహము ద్వారానే కలుగుతుంది అని చెప్పుచున్నాడు. ఏ సజ్జనుల స్నేహము చేత, వారుపదేశించు భక్తియోగం వల్ల శుద్ధమైన (అంతఃకరణము) చిత్తము బాహ్య విషయములయందు ఆసక్తమై యుండదో, అజ్ఞానమనే గుహయందు లయముకాదో ఆ కాలమున మననశీలుడైనవాడు నీయొక్క తత్త్వమును, స్వరూపస్థితిని దర్శించుచున్నాడు. 59

శ్లో॥ యత్రేదం వ్యజ్యతే విశ్వం విశ్వస్మిన్నవ భాతి యత్ ।
తత్త్వం బ్రహ్మపరంజ్యోతిరాకాశ ఇవ విస్తృతమ్ ॥ 60

టీ:- కీదృశం తత్త్వం తదాహ-యత్రేతి. 60

శ్లో॥ యో మాయయేదం పురురూపయా
సృజద్బిభర్తి భూయః క్షపయత్య విక్రియః ।
యద్భేద బుద్ధిస్సదివాత్మ దుస్థయా
తమాత్మతంత్రం భగవ్రప్రతీమహి ॥ 61

టీ:- జగత ఉపాదానత్వేన తత్త్వం లక్షితం. నిమిత్తత్వేనాపి తదేవ లక్షయ న్నాహ-య ఇతి.య ఇదం విశ్వం సదివ పరమార్థమివ మాయయా సృజత్. కథంభూతాయ యత్ యయా భేదబుద్ధిరన్యేషాం భవతి. తయా ఆత్మనిత్వయి. దుస్థయా స్వకార్యం కర్తుమసమర్థయా. తం త్వాం నిరస్తభేదం ప్రతీమహి జానీమః. 61

శ్లో॥ క్రియాకలాపైరిదమేవ యోగినః
శ్రద్ధాన్వితా స్సాధు యజంతి సిద్ధయే ।
భూతేంద్రియాంతఃకరణోపలక్షణం
వేదే చ తంత్రే చ త ఏవ కోవిదాః ॥ 62

ఎట్టిదాతత్త్వమనగా!

ఏ ఆత్మచైతన్యముయందు ఈ జగత్తు ప్రకటితమగుచున్నదో! ఈ విశ్వముయందు ఏ ఆత్మచైతన్యము ప్రకాశించుచున్నదో, ఆకాశము వలె విస్తరింపబడిన పరంజ్యోతియైన పరంబ్రహ్మవు అది నీవే! 60

జగదుపాదాన కారణముగా ఆ తత్త్వము లక్షితమై ఇప్పుడు నిమిత్త కారణముగాగూడా ఆ తత్వము అభిలక్షితమవుతుంది. ఓ వికారము లేని పరమేశ్వరా! నీవు మాయ ద్వారా ఈ జగత్తును సృజించుచున్నావు, పరిపాలించుచున్నావు, నశింపచేయుచున్నావు. ఈ విశ్వమును పరమార్థము వలె మాయచేత సృజించినావు. ఆ మాయ అనేక రూపాలను సృష్టించడమే కాదు, ఇతరులకు భేదములేని అద్వితీయమునందుగూడా భేదబుద్ధిని కలిగిస్తుంది. నీ యందు మాత్రము తన కార్యమైన భేదబుద్ధిని కలిగించుట యందు అసమర్థురాలు. నిన్ను భేదరహితుడిగా తెలుసుకొంటున్నాము. 61

నీవు భేదరహితమైన బ్రహ్మవే. అయినప్పటికి పూర్వము చెప్పిన సాకార రూపమును ఎవరు పూజిస్తారో వారే వేదములను, ఆగమములును, తెలిసినవారగుచున్నారు. వివిధ క్రియా కలాపములచేత ఏ కర్మ యోగులు నిన్ను పూజించుచున్నారో వారే

టీ:- యద్యపి త్వమేవ నిర్భేదంబ్రహ్మ. తథాపి ప్రాగుక్తం సాకారం తవ రూపం యే యజంతి. తఏవ వేదాగమతత్త్వజ్ఞా ఇత్యాహ- క్రియేతి. క్రియా కలాపైః స్వకర్మభిః. యేయోగినః పూజయంతి. తఏవ కోవిదాః న త్వేదనాదృత్య కేవలజ్ఞానే ప్రవృత్తాః. తంత్రే ఆగమే. కథంభూతమిదం. భూతేంద్రియాంతఃకరణైరస్వతంత్రైర్యదుపలక్ష్యతే. నియంతృ రూపం తత్. 62

కోవిదులు. ఈ సాకారాదు లను ఆదరించకుండా కేవలము జ్ఞానము యందే ప్రవర్తించు వారు కోవిదులు కారు. ఈ సాకార రూపం ఎట్టిదన అస్వతంత్రములైన పంచ భూతములు, ఇంద్రియములు, అంతః -కరణములు, వీటిచే ఉపలక్షితమై సర్వమును నియంత్రించే ఈ రూపము... (తరువాతి శ్లోకముతో అన్వయము) 62

శ్లో॥ త్వమేక ఆద్యః పురుషస్సుప్తశక్తి
స్తయా రజస్సత్త్వ తమో విభిద్యతే ।
మహానహం ఖం మరుదగ్ని వార్ధరా
స్సురర్షయో భూతగణా ఇదం యతః ॥ 63

టీ:- నన్వభిన్నే మయి భేదం కుర్వంతస్సంతః కథం కోవిదాః. న హి తైర్భేదః క్రియతే. కింతు త్వయైవ క్రీడార్థం చేతనాచేతనాత్మకో భేదః కృత ఇత్యాహ - త్వమితి. ఆద్యస్త్వమేక ఏవ. సుప్తా మాయాఖ్యా శక్తిర్యస్య. పశ్చాత్తయా శక్త్యా. రజస్సత్త్వతమసాం ద్వంద్వైక్యం యతో రజ ఆదిర్మహానహంకారః ఖం చ మరుదగ్నివార్ధరాశ్చ. వాః ఉదకం. సురాశ్చ ఋషయశ్చ భూతగణాశ్చ ఏవమిదం జగద్యతో భవతి తద్విభిద్యత ఇత్యన్వయః. 63

మరి అభిన్నమైన నాయందు భేదము కలిగించిన వారు ఏ విధముగా కోవిదులగుచున్నారు? వారు నీయందు భేదమును కల్పించలేదు, నీవే ఆడుకోవడానికి చేతనా, చేతనాత్మకమైన భేదమును సృజించినావు. నీవు ఒక్కడివే సర్వకారణుడవు. నీయందు నిద్రిస్తున్న మాయాశక్తి నీచే ప్రబుద్ధమైన పిమ్మట సత్వరజఃతమస్సులచేత మహదహంకార ఆకాశ, వాయు, అగ్ని, నీరు, భూమి, సురులు, ఋషులు, సకల ప్రాణుల సమూహము సృజింపబడినవి. ఈ విధమైన జగత్తు ఎక్కడనుండి పుట్టుచున్నదో ఆ రజస్సు మొదలగునవి నీకంటే వేరుగా అనిపించినను, వేరుగావు. 63

శ్లో॥ సృష్టం స్వశక్త్యేదమను ప్రవిష్ట
శ్చతుర్విధం పురమాత్మాంశకేన ।
అథో విదుస్తం పురుషం సంత మంత
ర్భుంక్తే హృషీకైర్మధు సారఘం యః ॥ 64

టీ:- ఏతదుపపాదయతి-సృష్టయతి. జరాయుజాండజస్వేదజోద్భిజ్జ రూపేణ చతుర్విధం స్వాంశేన ప్రవిష్టః అథో ఇతి హేతోః పురస్యాంత స్సంతమంశం చిదాభాసం పురి శయనాత్పురుషం విదుః. తర్హి కిమీశ్వర మేవ సంసారిణం విదుః. నేత్యాహ. సరఘాః మధుమక్షికాః తాభిః సృష్టం మధ్వివ క్షుల్లకం విషయసుఖం అవిద్యావృతస్సన్ యో భుంక్తే తం జీవం విదుః తథా చ. శ్రుతిః "తయోరన్యః పిప్పలం స్వాద్వత్త్య నశ్నన్నన్యో అభిచాకశీతీ" తి. నిర్ణీతం చ. సూ. "గుహాం ప్రవిష్టా వాత్మానౌ హితదర్శినాది" త్యత్ర. 64

దీనినే ఉపపాదించుచున్నాడు. ఓ పరమాత్మా! నీ శక్తిచేత నాలుగు రకములైన సృష్టిని చేసి దీనియందు నీ అంశచేత ప్రవేశించితివి. నాలుగు రకముల సృష్టి "జరాయుజ, అండజ, స్వేదజ, ఉద్భిజ్జములు" దీనిలో ప్రవేశించిన చిదాభాసాత్మకమైన సత్వదార్థములో (పురి) శయనించుట ద్వారా పురుషుడని అనిరి. దీనిలో ప్రవేశించడం వల్ల ఈశ్వరుడనే సంసారి అని తెలిసికొందురు కదా! అనగా కాదు. తేనెటీగలు అవి సృజించిన తేనెను అనుభవించుచున్నట్టుగా నీచమైన విషయ భోగములను, అజ్ఞానమావరించి ఎవరు భోగించుచుందురో అతడిని జీవుడందురు. ఉపనిషత్ భోక్తృత్వము జీవునకే అగుచున్నది. ద్వాసుపర్ణా----తయోరన్యః పిప్పలంస్వాద్వత్తి అనుష్నద్నన్యో అభిచాకపీతి ॥ ముండకం 3-3-1 భాష్యార్థః:- వారిద్దరిలో లింగోపాధిగల జీవుడు కర్మనిష్పన్నమైన సుఖదుఃఖ లక్షణాత్మకమైన అనేక విచిత్ర వేదనాస్వాద రూపమైన ఫలమును అవివేకియై ఆస్వాదించుచున్నాడు. జీవుడికంటే వేరైన నిత్యశుద్ధ బుద్ధ ముక్త స్వభావుడైన, సర్వజ్ఞుడైన సర్వసత్వోపాధియైన ఈశ్వరుడు కర్మఫలమును ఆస్వాదించుట లేదు. బ్రహ్మ సూత్రమున గుహాధికారణముగా గూడా హృదయాకాశమున జీవబ్రహ్మ లేయని నిర్ణయించినారు. "గుహాం ప్రవిష్టా వాత్మానేహితద్దర్శనాత్" ఈ శరీరమున హృదయాకాశమున జీవబ్రహ్మలు ప్రవేశించినవి. హృదయాకాశమున బుద్ధి జీవులా? లేదా

శ్లో॥ స ఏష లోకానతిచండవేగో
వికర్షసి త్వం ఖలు కాలయన్నః ।
భూతాని భూతైరనుమేయతత్త్వో
ఘనావలీర్వాయురివా విషహ్యః ॥ 65

టీ:- తవ తు సర్వనియంతుః కుతః సంసార ఇత్యాహ-స ఇతి. స్వశక్త్యేదం సృష్టవాన్. స ఏష త్వం ఖలు భూతైరేవ భూతాని. మేఘ పంక్తిర్వాయురివ కాలయన్ విచాలయన్ లోకాన్ వికర్షసి సంహరసి. అనుమేయతత్త్వః అలక్ష్యస్వరూపః. 65

జీవబ్రహ్మలా? అని సంశయము కలిగినప్పుడు జీవబ్రహ్మలే అని నిర్ణయం. ఎందుకనగా తద్దర్శనాత్=ఆత్మానౌహితావు భావపిచేతనౌ సమానస్వభావౌ । సంఖ్యా శ్రవణేచ సమానస్వభావేష్వేవలోకే ప్రతితిర్ద్రుశ్యతే, అస్యగీర్ద్వితీయోఽ నేష్టవ్య ఇత్యుక్తే గౌరవ ద్వితీయో ఽ న్విష్యతే, శానాశ్వః పురుషోవా ॥. ద్వాసుపర్ణా అని సంఖ్యచేత చెప్పినప్పుడు సమాన స్వభావం కలిగిన చేతనములనే చెప్పాలి. బుద్ధి జడము, జీవ బ్రహ్మలు చైతన్యము. లోకంలోగూడా ఎద్దుకు రెండవదానిని వెతకాలి అన్నప్పుడు రెండవదానిని ఎద్దునే వెతుకతారు తప్ప మనిషినో గుర్రాన్నో వెతకరు అని చెప్పినారు. 64

హే ప్రభూ! సర్వ నియామకుడవైన నీకు సంసారమెక్కడిది? అని ఈ విధముగా పలికెను. ఏ పరమాత్మవైన నీవు నీ శక్తి చేత ఈ జగత్తును సృష్టించినావో, ఆ నీవు ప్రచండమైన వేగముగల వాడవై గొప్ప వాయువు, మేఘములను కదల్చినట్లుల భూతములను భూతములచేత కదల్చుచూ ఈ లోకములను ఉపసంహరించుచున్నావు. నీవు అలక్ష్య స్వరూపుడవై... (తరువాతి శ్లోకముతో అన్వయము) 65

శ్లో॥ ప్రమత్తముచ్చైరితి కృత్యచింతయా
ప్రవృద్ధలోభం విషయేషు లాలసమ్ ।
త్వమ ప్రమత్తస్సహసాభిపద్య
సేక్షుల్లేలిహానోఽహిరివాఖుమంతకః ॥ 66

టీ:- వికర్షణ ప్రకారమాహ-ప్రమత్తమితి. ఇతికృత్యం ఏవమేవమిదం కర్తవ్యమితి చింతయా ఉచ్చైః ప్రమత్తం తత్ర హేతుః విషయేషు లాలసం అతికాముకం ప్రాప్తే విషయే ప్రవృద్ధలోభం. అంతఃకస్త్వమభిపద్యసే ఆక్రమసి క్షుధా లేలిహానః జిహ్వయౌష్ఠప్రాంతౌ స్పృశన్ సర్పో మూషకమివ. 66

శ్లో॥ కస్త్వత్పదాబ్జం విజహాతి పండితో
యస్తేఽవమానవ్యయమానకేతనః ।
విశంకయాస్మద్గురురర్చతి స్మ య
ద్వినోపపత్తిం మనవశ్చతుర్దశ ॥ 67

టీ:- క ఇతి. అతః కస్తవ పాదాబ్జం త్యజేత్. పండితశ్చేత్ కథంభూతః యస్తవావమానః అనాదరః తేన వ్యయనూనం కేతనం శరీరం యస్య సః. యదస్మాకం గురుః బ్రహ్మార్చతిస్మేతి. సర్వేషాం స్తోతౄణాం వాక్యం

సంహార ప్రకారమును చెప్పుచున్నాడు. ఈ పని ఇట్లు చెయ్యాలి, అట్లు చెయ్యాలని అనే చింతతో మిక్కిలి అజాగ్రత్తగా గలవాడిని, (విషయ భోగములపై అతికాముడైన వాడు అట్లా చింతిస్తాడు) ఒకవేళ విషయములు పొందినా వాటిని ఎన్నటికి విడువరాదను అతి లోభము కలిగిన వాడిని, ఆకలిచే నాలుకతో పెదవులను తడుపుకొనుచున్న పాము ఎలుకను ఆక్రమించినట్టుగా, సావధానుడవై కాలరూపుడవగు నీవు వాడిని ఆక్రమించుచున్నావు. 66

అందుచేత పండితుడైనవాడు ఎవడు నీ పాదాబ్జమును విడిచి పెట్టును? ఎట్టివాడు - నిన్ను అనాదరము చేయుటచేత ఈ శరీరము నాశమును పొందుతుందని వణుకుచున్న పండితుడు నీ పాదాబ్జమును ఎట్లు విడుచును? ఎప్పుడో ఈ శరీరము నశించునను శంకచే మా తండ్రిగారగు బ్రహ్మ నీ పాదాబ్జములను అర్చిస్తుండేవాడు. పద్నాలుగు మంది మనువులు దృఢ విశ్వాసముచేత నీ పాదపద్మముల నర్చిస్తుండేవారు. 67

విశంకయా వినా శంకయా వినోపపత్తిమితి దృఢవిశ్వాసేన మనవ శ్చతుర్దశార్చంతి స్మ. 67

శ్లో॥ అథ త్వమసి నో బ్రహ్మన్పరమాత్మన్విపశ్చితామ్ ।
విశ్వం రుద్రభయధ్వస్తమకుతశ్చిద్భయా గతిః ॥ 68

ఓ పరమాత్మా! సర్వవ్యాపకా! రుద్రుడి భయముచేత ఈ విశ్వము ధ్వంసమైనది. అందువలన వివేకవంతులమై మాకు దేనివలన గూడా భయము లేని స్థానము నీవై ఉన్నావు. (అన్ని భయములను తొలగించే నీవే మాకు గతి) 68

టీ:- ఉపసంహరతి-అథేతి. రుద్రభయేన ధ్వస్తం అతః న కుతశ్చిద్భయం యస్యాం తాదృశీ గతిరసి. (68-70)

శ్లో॥ ఇదం జపత భద్రం వో విస్రబ్ధా నృప నందనాః ।
స్వధర్మ మనుతిష్ఠంతో భగవత్యర్పితాశయాః ॥ 69

ఓ రాజకుమారులారా! పరిశుద్ధులై స్వధర్మమును అనుష్ఠించుచూ భగవదర్పిత హృదయులై దీనిని జపించండి. మీకు మంగళం కలుగు గాక! 69

శ్లో॥ తమేవాత్మానమాత్మస్థం సర్వభూతేష్వవస్థితమ్ ।
పూజయధ్వం గృణంతశ్చ ధ్యాయంతశ్చాసకృద్ధరిమ్ ॥ 70

సర్వప్రాణుల బుద్ధులయందుగల, ఆత్మస్వరూపుడైన ఆ శ్రీహరిని అనేకమార్లు కీర్తించుచూ ధ్యానించుచున్నవారలై పూజించండి. 70

శ్లో॥ యోగాదేశముపాసాద్య ధారయంతో మునివ్రతాః ।
సమాహితధియస్సర్వ ఏతదభ్యసతాదృతాః ॥ 71

యోగాదేశమను పేరు గలిగిన ఈ స్తోత్రమును పాఠరూపమున పొంది, (అందరూ) మననశీలురై, ఏకాగ్రత కలిగి, ఆదరపూర్వకముగా దీనిని అభ్యాస పూర్వకముగా అనగా అనేకమార్లు జపించండి. 71

టీ:- యోగేతి. యోగాదేశం నామైతత్. స్తోత్రముపాసాద్య పాఠతః ప్రాప్య మనసా ధారయంతః అభ్యాసేన జపత. 71

శ్లో॥ ఇదమాహ పురాస్మాకం భగవాన్విశ్వసృట్పతిః ।
భృగ్వాదీనామాత్మజానాం సిసృక్షుస్సంసిసృక్షతామ్ ॥ 72

టీ:- ఇదమితి. విశ్వసృజాం పతిర్బ్రహ్మా. 72

పూర్వము మాకు, ప్రజాపతులకు ప్రభువైన బ్రహ్మదేవుడు సృష్టిని చేయగోరినవాడై చక్కగా సృష్టిని చేయాలనుకున్న భృగ్వాదులైన పుత్రులమగు మాకు ఈ స్తోత్రమును చెప్పెను. 72

శ్లో॥ తే వయం చోదితాస్సర్వే ప్రజాసర్గే ప్రజేశ్వరాః ।
అనేన ధ్వస్తతమసస్సిసృక్ష్మ వివిధాః ప్రజాః ॥ 73

టీ:- త ఇతి. సిసృక్ష్మ సృష్టవంతః. 73

ప్రజాపతులమగు మేము, ప్రజాసృష్టియందు ఈ విధముగా ప్రేరితులమై ఈ స్తోత్రముచే అజ్ఞానము తొలిగిపోగా వివిధ రకములైన ప్రజలను సృజించితిమి. 73

శ్లో॥ అథేదం నిత్యయుక్తో యో జపన్నవహితః పుమాన్ ।
అచిరాచ్ఛ్రేయ ఆప్నోతి వాసుదేవపరాయణః ॥ 74

టీ:- అథేతి. యుక్తః ఏకాగ్రచిత్తః. 74

కావున వాసుదేవ పరాయణుడైనవాడు రోజూ ఏకాగ్రతతో, సావధానుడై ఈ స్తోత్రమును జపించిన తొందరలోనే శ్రేయస్సును పొందుచున్నాడు. 74

శ్లో॥ శ్రేయసామిహ సర్వేషాం జ్ఞానం నిశ్శ్రేయసం స్మృతమ్ ।
సుఖం తరతి దుష్పారం జ్ఞాననౌర్వ్యసనార్ణవమ్ ॥ 75

టీ:- శ్రేయసామితి. జ్ఞానమేవనౌర్యస్య. 75

అన్ని శ్రేయస్సులకంటే జ్ఞానము గొప్ప శ్రేయస్సు. దాటడానికి శక్యముకాని దుఃఖ సముద్రమును సుఖముగా దాటించగలదు. 75

శ్లో॥ య ఇదం ప్రయతో నిత్యం మద్గీతం భగవత్స్తవమ్ ।
అధీయానో దురారాధ్యం హరిమారాధయత్యసౌ ॥ 76

టీ:- య ఇతి. యః అధీయానో భవతి. 76

నాచే కీర్తింపబడిన ఈ భగవత్ స్తోత్రమును శ్రద్ధగా ఎవరు చదుచుతుంటాడో ఆతడు దురారాధ్యుడైన శ్రీహరిని ఆరాధించు-చున్నాడు. 76

శ్లో॥ విదంతే పురుషోఽముష్మాద్యద్యదిచ్ఛత్యసత్వరన్ ।
మద్గీతగీతాత్సు ప్రీతాచ్ఛ్రేయసా మేకవల్లభాత్ ॥ 77

టీ:- విందత ఇతి. అసావముష్మాద్ధరేః అసత్వరన్ స్థిరస్సన్మద్గీతం స్తోత్రంతేన గీతాత్ స్తుతాత్ ఏకఏవ వల్లభః ప్రియఆశ్రయోయస్తస్మాత్. 77

స్థిరుడై ఈ స్తోత్రమును పఠించినచో ఏకవల్లభుడైన అనగా ఒకే ఆశ్రయుడై యున్న శ్రీహరి నుండి ఏది కోరుతాడో దానిని పొందుతాడు. 77

శ్లో॥ య ఇదం కాల్య ఉత్థాయ ప్రాంజలిశ్శ్రద్ధయానిత్వ ।
శ్రుణుయాచ్ఛ్రావయేన్మర్త్యో ముచ్యతే కర్మబంధనైః ॥ 78

శ్రద్ధాసక్తులు కలిగి ఉషఃకాలమున, ఈ స్తోత్రమును, చేతులు జోడించి విన్నా, వినిపించిన ఆ మానవుడు కర్మ బంధములనుండి విముక్తి పొందుతాడు. 78

టీ:- య ఇతి. కాల్యే ఉషసి. 78

శ్లో॥ గీతం మయైతం నరదేవనందనాః
పరస్య పుంసః పరమాత్మనః స్తవమ్ ।
జపంత ఏకాగ్రధియస్తపో మహ
చ్చరధ్వమంతే తదవాప్స్యథేప్సితమ్ ॥ 79

ఓ రాజకుమారులారా! నాచే కీర్తింపబడిన ఈ స్తోత్రముచేత పరమపురుషుడైన పరమాత్మను ఏకాగ్రబుద్ధితో జపించండి. గొప్ప తపస్సును చేయండి. అనంతరము మీరు కోరిన వాటిని పొందండి. (79)

టీ:- గీతమితి. తపశ్చరధ్వం తపసోఽంతే ఈప్సితం ప్రాప్స్యథ. (79)

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,**
**చతుర్వింశోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు**
**ఇరువది నాల్గవ అధ్యాయము సమాప్తము.**

## పంచవింశోऽధ్యాయః

శ్లో॥ ప్రచేతస్సు తపస్యత్సు తత్ప్రిత్రే నారదో ఘృణీ ।
ప్రాచీనబర్హిషేऽధ్యాత్మం పరోక్షేణాహ పంచభిః ॥

పురంజనకథావ్యాజాత్పంచవింశే తు నారదః ।
ఆత్మనో బుద్ధిసంగేన వివిధామాహ సంసృతిమ్ ॥

## 25 వ అధ్యాయము

ప్రచేతసులు తపస్సు చేయుచుండగా కారుణ్య మూర్తియైన నారదుడు ప్రాచీనబర్హికి పరోక్షముగా అధ్యాత్మ విద్యను ఐదు అధ్యాయములతో భోధించెను. పురంజన కథను వ్యాజముగా పెట్టుకొని ఇరువది ఐదవ అధ్యాయమున నారదుడు ఆత్మకు బుద్ధి సంగముచేత కలుగు వివిధ రకములైన సంసార దుఃఖములను వర్ణించెను. ప్రచేతసులు తీవ్రమైన తపస్సు చేయుచుండగా నారదుడు పురంజన కథా సమూహమును (దుర్లక్షార్థవాక్య సముదాయమును) ప్రాచీన బర్హికి చెప్పినాడు.

### మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఇది సందిశ్య భగవాన్బార్హిషైరభిపూజితః ।
పశ్యతాం రాజపుత్రాణాం తత్రైవాంతర్దధే హరః ॥ 1

### మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

ఈ విధముగా భగవానుడుపదేశించి ప్రచేతసులచే పూజింపబడి, వారు చూచుచుండగానే అక్కడనే అంతర్ధానము పొందెను. 1

శ్లో॥ రుద్రగీతం భగవతః స్తోత్రం సర్వే ప్రచేతసః ।
జపంతస్తే తపస్తేపుర్వర్షాణామయుతం జలే ॥ 2

ప్రచేతసులు భగవత్ స్తోత్రమైన రుద్ర గీతమును జపిస్తూ పదివేల సంవత్సరములు నీటియందు తపస్సు చేసిరి. 2

టీ:- ప్రచేతస్సు తపస్తీవ్రం తప్యమానేషు నారదః. పురంజన కథా కూటం ప్రాహ ప్రాచీనబర్హిషే. (1-2)

శ్లో॥ ప్రాచీనబర్హిషం క్షత్తః కర్మస్వాసక్తచేతసమ్ ।
నారదోఽధ్యాత్మతత్త్వజ్ఞః కృపాళుః ప్రత్యబోధయత్ ॥ 3

టీ:- ప్రాచీనబర్హిషమితి. ప్రచేతస్సు తపశ్చరత్సు నారదః ప్రాచీనబర్హిషం బోధితవాన్ అతః ప్రచేతసాం కథామసమాప్యైవ తత్పితుర్వృత్తమాహ-ప్రాచీనబర్హిషమితి. 3

ప్రచేతసులు తపస్సు చేయుచున్న సమయముననే నారదుడు ప్రాచీనబర్హికి బోధించినాడు కనుక వారి కథను సమాప్తి చేయకుండగనే వారి తండ్రి చరిత్రను చెప్పుచున్నాడు.

ఓ విదురా! దయామయుడు, అధ్యాత్మతత్త్వము తెలిసినవాడగు నారదుడు కర్మలయందు ఆసక్తితో గూడిన మనస్సు గల ప్రాచీనబర్హికి భోధించెను. 3

శ్లో॥ శ్రేయస్త్వం కతమద్రాజన్కర్మణాత్మన ఈహసే ।
దుఃఖహానిస్సుఖావాప్తిః శ్రేయస్తన్నేహచేష్యతే ॥ 4

టీ:- శ్రేయ ఇతి. ధర్మాదిషు కథమత్ శ్రేయః ఫలం ఈహసే ఇచ్ఛసి. నను మోక్షదో స నేత్యాహ-దుఃఖహానిరితి. శేషదుఃఖ నివృత్తిర్నిరతిశయానందావాప్తిశ్చేతి యత్ తదుభయం మోక్షాఖ్యం శ్రేయః. ఇహ కర్మణి తదుభయం తేనేష్యతే విచారకైః. 4

ఓ రాజా! నీవు ఏ శ్రేయఃఫలమును (మోక్షమును) కోరుచున్నావో అది కర్మలచేత లభించదని చెప్పుచున్నాడు. వివేక విచారము చేయువారు దుఃఖహాని, సుఖప్రాప్తి అనునవి కర్మలచేత కలుగుననుటను అంగీకరించరు. 4

రాజోవాచ

శ్లో॥ న జానామి మహాభాగ పరం కర్మాపవిద్ధధీః ।
బ్రూహిమే విమలం జ్ఞానం యేన ముచ్యేయ కర్మభిః ॥ 5

టీ:- నేతి.పరం శ్రేయః మోక్షః కర్మభిరపవిద్ధా క్షిప్తాధీర్యస్య. 5

పరీక్షిన్మహారాజు ఈ విధముగా పలికెను.

ఓ మహాభాగా! కర్మలచేత విక్షిప్తమైన బుద్ధిగల నేను మోక్షమును తెలియలేకున్నాను. ఈ కర్మలనుండి ఏ విధముగా విముక్తి పొందగలనో అట్టి దోషరహితమైన జ్ఞానమును తెలుపుము. 5

శ్లో॥ గృహేషు కూటధర్మేషు పుత్రదారధనార్థధీః ।
న పరం విదంతే మూఢో భ్రామ్యన్ సంసారవర్త్మసు ॥ 6

ఇంటియందు, వ్యర్థమైన పనులయందు, పుత్రులు, భార్య, ధనము ఇవియే పరమ పురుషార్థమని భావించి మూర్ఖుడై సంసార మార్గమున తిరుగాడుచున్నవాడు మోక్షమును గూర్చి తెలియకున్నాడు. 6

టీ:- గృహేష్వితి. కించ గృహేషు స్థితః పుత్రాదిష్వేవ పురుషార్థ దీర్యస్య. 6

పురంజనోపాఖ్యానప్రారంభః

**శ్రీనారద ఉవాచ**

**నారదుడు ఈ విధముగా పలికెను.**

శ్లో॥ భో భో ప్రజాపతే రాజన్పశూన్పశ్యత్వయాధ్వరే ।
సంజ్ఞాపితాన్ జీవసంఘాన్ నిర్ఘృణేన సహస్రశః ॥ 7

టీ:- కర్మఫలేషు వైరాగ్యముత్పాద్య బ్రహ్మవిద్యాముపదేష్టుం యోగాను భావేన యజ్ఞపశూన్ ప్రత్యక్షం ప్రదర్శయన్నాహ- భోభో ఇతి. సంజ్ఞా పితాన్ మారితాన్. 7

కర్మఫలములయందు వైరాగ్యము కలిగించి బ్రహ్మ విద్యను ఉపదేశించడానికి తన యోగబలముచేత యజ్ఞపశువులను ప్రత్యక్షముగా చూపెట్టుచూ పలుకుచున్నాడు.

ఓ ప్రజాపతీ! రాజా! నీ యజ్ఞములయందు దయలేకుండా నీవు సంహరించిన వేలకువేల పశువులను చూడుము. 7

శ్లో॥ ఏతే త్వాం సంప్రతీక్షంతే స్మరంతో వైశసం తవ ।
సంపరేతమయః కూటైశ్ఛిందంత్యుత్థితమన్యవః ॥ 8

టీ:- ఏత ఇతి. ఏతే త్వాం సంపరేతం మృతం సంప్రతీక్షంతే వైశసం త్వత్కృతాం పీడాం స్మరంతః. తతశ్చాయఃకూటైః లోహయంత్రమయైః శృంగైః ఛిందంతి ఛేత్స్యంతి. 8

ఈ పశువులన్నిగూడా నీ చావునకు ఎదురుచూచుచున్నవి. నీవు కలిగించిన పీడను స్మరిస్తూ నీపైన కోపము గలిగి, ఇనుప కొమ్ములతో నిన్ను పొడవడానికి ఎదురు చూస్తాయి. 8

శ్లో॥ అత్ర తే కథయిష్యేఽముమితిహాసం పురాతనమ్ ।
పురంజనస్య చరితం నిబోధ గదతో మమ ॥ 9

టీ:- అత్రేతి. అత్రాస్మిన్ సంకటే విస్తారకమముమితిహాసం కథయిష్యామి. 9

ఇట్టి సంకట పరిస్థితులలో నిన్ను తరింపచేసే పురాతనమైన పురంజనుని ఈ కథను చెపుతాను. చెపుతున్న నా మాటలను విని తెలుసుకో. 9

శ్లో॥ ఆసీత్పురంజనో నామ రాజా రాజన్ బృహచ్ఛ్రవాః ।
తస్యా విజ్ఞాత నామాసీత్సఖా విజ్ఞాత చేష్టితః ॥ 10

టీ:- తత్ర జీవస్య విషయాసక్త్యా సంసారః స చేశ్వరానుగ్రహేణ నివర్తత ఇతి వక్తుం విపర్యయగృహీతస్య సాక్షాద్బోధయితుమశక్తేః రాజవృత్తాంతమేవాహ-ఆసీదితి. పురంజనాదీన్ స్వయమేవేతః పంచమేఽధ్యాయే వ్యాఖ్యాస్యతి. తథాపి సుఖగ్రహణాయ యథోపయోగం కించిద్వ్యాఖ్యాస్యామః. తత్ర స్వకర్మభిః పురం జనయతీతి పురంజనో జీవః విజ్ఞాతం నామ యస్య. నచ విజ్ఞాతం చేష్టితం యస్య స ఈశ్వరః తస్య సఖా. యద్వా విజ్ఞాతం చేష్టితం జీవప్రేరణాదిలక్షణం యస్య. జీవపారతంత్ర్యస్యానుభవసిద్ధత్వాత్. 10

జీవుడికి విషయాసక్తి గలగడం వల్ల సంసారము కలుగుతుంది. ఆ సంసారము ఈశ్వరానుగ్రహము వల్ల తొలుగుతుంది అని చెప్పడానికి, పొరబాటుగా అర్థం చేసుకొనేవాడికి సాక్షాత్తుగా విషయము చెప్పలేము కనుక రాజు చరిత్రను చెప్పుతున్నట్టుగా చెప్పాలి. పురంజనాదుల గురించి ఇక్కడనుండి ఐదు అధ్యాయములలో వివరించుతాడు. అయినప్పటికి సుఖంగా గ్రహించడం కొరకు ఉపయోగాన్ని పట్టి కొంచెంకొంచెం వివరిస్తాం. 10

శ్లో॥ సోఽన్వేషమాణశ్శరణం బభ్రామపృథివీం ప్రభుః ।
నానురూపం యథావిందదభూత్సవిమనా ఇవ ॥ 11

టీ:- స ఇతి. శరణం భోగాయతనందేహం. పృథివీం బ్రహ్మాండం. 11

ఓ రాజా! గొప్ప కీర్తి గల, పురంజనుడను పేరుగల రాజు ఉండెను. ఆతనికి తెలియబడని చేష్టలుగల అవిజ్ఞాతుడను మిత్రుడుండేవాడు. తన కర్మానుసారముగా శరీరమును పొందువాడు పురంజనుడు జీవుడు చేష్టలు లేనివాడు ఈశ్వరుడు జీవమిత్రుడు లేదా శ్లో. "తస్య విజ్ఞాత నామాసీత్" అని చెప్పిన జీవ ప్రేరణాది లక్షణం గలవాడు. జీవుడు పరతంత్రుడనేది అనుభవసిద్ధమే.

ఆ ప్రభువు నివాస స్థానమును వెతుకుచూ భూలోకమున తిరిగెను. ఆయనకు నచ్చిన స్థానము దొరకక మనస్సు చెదిరెను. ఇచ్చట శరణమనగా సుఖదుఃఖములకు ఆశ్రయమైన దేహమని, పృథివి అనగా బ్రహ్మాండమని అర్థము. 11

శ్లో॥ నసాధు మేనేతాస్సర్వాభూతలే యావతీః పురః ।
కామాన్కామయమానోఽసౌ తస్య తస్యోపపత్తయే ॥ 12

టీ:- నేతి. యావత్యః పురస్తాః తస్య తస్య కామస్యోపపత్తయే ప్రాప్తయే సాధు న మేనే గవాదిదేహేనామైహిక పారలౌకిక భోగయోగ్యత్వాభావాత్. తథా చ శ్రుతిః. "తాభ్యో గామానయత్తా అబ్రువన్నవైనోయమలమి"తి. "తాభ్యో శ్వమానయత్తా అబ్రువన్నవైనోయమలమితీ"తి. 12

ఎన్నో నివాస స్థానములను అనగా పురములను చూచినాడు. కాని ఏవిగూడా తానుకోరే భోగ్యవస్తువులను పొందడానికి అనుకూలంగా ఆయనకు కనిపించలేవు. అనగా ఆవు మొదలైన దేహములు ఇహలోక, పరలోక భోగములు భోగించేందుకు అనుకూలములు కావు అని శ్రుతి చెప్పుతుంది. "దేవతలకు గోవును, అశ్వమును మొ॥ దేహములు చూపెట్టినప్పుడు ఈ దేహములు మాకు వద్దనిరి. 12

శ్లో॥ స ఏకదా హిమవతోదక్షిణేష్వథ సానుషు ।
దదర్శ నవభిర్ద్వార్భిః పురం లక్షితలక్షణామ్ ॥ 13

టీ:- స ఇతి. హిమవతో దక్షిణేషు సానుషు కర్మక్షేత్రే భారతవర్షే పురం మనుష్యశరీరం. లక్షితాని దృష్టాని సర్వాణి లక్షణాని యస్యాం అంధ పంగుత్వాది దోషరహితామిత్యర్థః. 13

ఒకనాడు హిమత్పర్వత దక్షిణ దిక్కున తొమ్మిది ద్వారములచే, అన్ని లక్షణములచే లక్షితమైన నగరమును చూచెను. అనగా కర్మక్షేత్రమైన భారతదేశములో కుంటి, గుడ్డి మొదలగు దోషములు లేని మానవ దేహమును అన్ని లక్షణములు గలదానిని స్వీకరించినాడు. 13

శ్లో॥ ప్రాకారోపవనాట్టాలపరిఖైరక్షతోరణైః ।
స్వర్ణరూపాయసైశ్శృంగైః సంకులాం సర్వతోగృహైః ॥ 14

టీ:- తామనువర్ణయతి త్రిభిః-ప్రాకారేతి. అత్ర కించిత్సాదృశ్యమవలంబ్య కథా సౌందర్యాయ ప్రాకారాదీని వర్ణ్యంతే. పరిఖైరితి. పుంస్త్వమార్షం. అక్షాణి గవాక్షాః త్వగాదయః శరీరావయవాః ప్రాకారాదిపురావయవత్వేన నిరూప్యంతే స్వర్ణాదిశృంగైః శిఖరైర్యుక్తాయే గృహాస్తైః సంకులామితి ఆధారాది చక్రాణి గృహాః శృంగాణి చ. రాజసాదిస్వభావా వివక్షితాః. 14

ఆ నగరము ప్రాకారాలతో ఉపవనములతో, బురుజులు, కందములతో, కిటికీలతో, ద్వారములతో, బంగారు, వెండి, ఇనుప శిఖరములతో అనేక గృహములచే నిండి ఉండెను. ఇచ్చట కొంచెం కొంచెం సాదృశ్యమును స్వీకరించి కథా సౌందర్యము కొరకు ప్రాకారాదులను వర్ణించుచున్నారు. గవాక్షములనగా ఇంద్రియములే, ప్రాకారాదులనగా చర్మము మొదలగు శరీరావయవములే, గృహములు అనగా మూలాధార, స్వాధిష్టాన, మణిపూరక, అనాహత, విశుద్ధి, ఆజ్ఞాచక్రములే, శృంగములనగా రాజాసాది స్వభావములే. 14

శ్లో॥ నీల స్ఫటిక వైడూర్య ముక్తా మరకతారుణైః ।
క్లిప్త హర్మ్యస్థలీం దీప్తాం శ్రియా భోగవతీమివ ॥ 15

ఇంద్రనీల, స్ఫటిక, వైడూర్యములచే, ముత్యములు, పచ్చలు, కెంపులతో పొదగబడిన భవనముల కాంతిచే నాగుల పట్టణమైన

టీ:- నీలేతి. నీలాదిభిః క్లిప్తా హర్మ్యస్థలీ యస్యాం అరుణం మాణిక్యం స్థలీహృదయం నాడ్యో నీలాది భావేన నిరూప్యంతే. తత్తద్విషయవాసనా వా. భోగవతీం నాగానాం పురీమివ. 15

భోగవతివలె ప్రకాశించుచున్నది. హర్మ్య స్థలీ=హృదయమని, ఇంద్ర నీలాదులనగా శరీరంలోనినాడులే, లేదా ఆ యా విషయవాసనలే. 15

శ్లో॥ సభా చత్వరరథ్యాభిరా క్రీడాయతనాపణైః ।
చైత్యధ్వజపతాకాభిర్యుక్తాం విద్రుమవేదిభిః ॥ 16

టీ:- సభేతి. సభా సమాజస్థానం. చత్వరం చతుష్పథః. రథ్యాః రాజమార్గాః. ఆక్రీడాయతనం ద్యూతాదిస్థానం ఆపణో హట్టః చైత్యం. జనానాం విశ్రమస్థానం. ధ్వజేషు పతాకాః తాభిశ్చ యుక్తాం. అత్ర చ విషయయుక్త బుద్ధియోగేన జీవస్య దేహసంబంధం ఇతి వివక్షయా విషయవర్గం బాహ్యోపవనత్వేన రూప యతి. తద్విశేషాన్ ప్రక్చందనాదీన్ దివ్యద్రుమలతాది భావేనేతి శేషః కథాలంకారః. 16

సమాజము ఉండు స్థలము (సభ) లచేత, నాలుగు మార్గములు గల కూడళ్ళచేత, రాజమార్గములచేత, ద్యూతక్రీడలాడు స్థలములు, గలిగి విక్రయశాలలచే, జనవిశ్రాంతి స్థలములచే, ధ్వజములయందు జండాలచే, పగడపు మంటపములచే గూడిన పురమును చూచెను. 16

శ్లో॥ పుర్యాశ్చ బాహ్యోపవనే దివ్య ద్రుమ లతాకులే ।
నదద్విహంగాళికులకోలాహల జలాశయే ॥ 17

టీ:- పుర్యా ఇతి. బావ్యోపవనే ప్రమాదం దదర్శేతి చతుర్థేనాన్వయః . దివ్యద్రుమైః లతాదిభిశ్చాకులే వ్యాప్తే. నదతాం విహంగాళికులానాం కోలాహలో నాదో యేషు తే జలాశయా యస్మిన్. 17

ఇచ్చట జీవునకు దేహసంబంధము విషయనిష్ఠ బుద్ధియోగము ద్వారానే అని వివరించుటకు ఆ విషయ వర్గమును బాహ్య ఉపవన రూపముతో వ్యాఖ్యానించుచున్నాడు. ఆ పురమునకు బయట ఉన్న ఉపవనమున స్త్రీని చూచెనని నాలుగవ శ్లోకముతో అన్వయము. ఆ వనం ఎట్లా ఉంది అనగా దివ్యమైన పెద్దచెట్లకు పాకిన లతలను

శ్లో॥ హిమనిర్ఝరవిప్రుషత్కు సుమాకరవాయునా ।
చలత్ప్రవాళ విటపనలినీతటసంపది ॥ 18

టీ:- హిమేతి. హిమనిర్ఝరవిప్రుషో బిందవః. తద్వతా కుసుమా కర సంబంధినా వాయునా.చలంతః ప్రవాళాః విటపాః శాఖాశ్చ యేషాం తైః వృక్షైః. నలినీనాం సరసీనాం తటేషు సంపత్ సంవృద్ధిర్యస్మిన్. 18

శ్లో॥ నానారణ్య మృగవ్రాతైరనాబాధే మునివ్రతైః ।
ఆహుతాం మన్యతే పాంథో యత్ర కోకిలకూజితైః ॥ 19

టీ:- నానేతి. అనాబాధే తత్కృతభాదారహితే ముని వ్రతైరహిం స్రైరాత్మానమాహూతం మన్యతే యత్ర. 19

(ధ్వని చేయుచున్న) విచిత్ర శబ్దములు చేయుచూ ఆకాశ మార్గమున ఎగురు పక్షులు, తుమ్మెదల గుంపుల కోలాహలముచే గూడిన సరస్సులను గలిగి... 17

సరస్సుల ఒడ్డున, మంచు నుండి జారిన చల్లటి నీటి బిందువులు కలిగిన పుష్పములను స్పృజించిన వాయువు వెళ్ళి తాకగా కదలాడిన చిగురుటాకులు, కొమ్మలు, రెమ్మలు గల వృక్షసంపదను గలిగి...18

మరియు మునివ్రతమును అనగా అహింస గలిగి ఎవ్వరికి ఇబ్బందిని కలిగించని అరణ్యములయందు సంచరించు అనేక జంతు సమూహమును కలిగి, బాటసారులను ఆహ్వానించుచున్నవా అన్నట్టుగా గల కోకిల కూతలచే నిండిన ఉపవనము... 19

శ్లో॥ యదృచ్ఛయాగతాం తత్ర దదర్శ ప్రమదోత్తమామ్ ।
భృత్యైర్దశభిరాయాంతీమేకైక శతనాయకైః ॥ 20

టీ:- యదృచ్ఛయేతి. తత్ర ప్రమదోత్తమాం ప్రకర్షేణ పురుషం మదయంతీతి ప్రమదాః తాసాం మధ్యే ఉత్తమాం వివేకవతీం బుద్ధిం దదర్శ. యదృచ్ఛయా గతామితి తయోః సంబంధస్య దుర్నిరూపత్వం దర్శయతి–తామనువర్ణయతి సార్ధైశ్చతుర్భిః. దశభిర్జ్ఞానకర్మేంద్రియైః. ఏకైకం ప్రత్యేకం శతం అనంతా వృత్తయః తాసాం నాయకైః పతిభిస్సహ. పాఠాంతరే నాయికాః స్త్రియః యేషాం తైః. 20

శ్లో॥ పంచశీర్ష్ణాహినా గుప్తాం ప్రతిహారేణ సర్వతః ।
అన్వేషమాణామృషభమ ప్రౌఢాం కామరూపిణీమ్ ॥ 21

టీ:- పంచశీర్ష్ణేతి పంచశీర్షాణి వృత్తయో యస్య తేన అహినా ప్రాణేన ప్రతిహారేణ పాలకేన గుప్తాం ఋషభం భర్తారం. 21

అతి సుందరమైన ఒక స్త్రీ అనుకోనుండా ఆ వనములోకి ప్రవేశించెను. ఒక్కొక్కరు నూరు మందికి నాయకులైన పదిమంది సేవకులచే వచ్చుచ్చున్న ఆమెను రాజు చూచెను. ఆధ్యాత్మిక పక్షంలో స్త్రీ యనగా:- విషయ వివేకవతియైన బుద్ధిని అని, అనుకోనుండా వచ్చిన అని అనగా:–జీవునకు బుద్ధి సంబంధము నిరూపించ సాధ్యము కానిది అనగా అనాదియని సూచించుచున్నాడు. నాలుగున్నర శ్లోకములచే ఆ ప్రమదను వర్ణించుచున్నాడు. పదిమంది సేవకులనగా పంచజ్ఞానేంద్రియములు, పంచకర్మేంద్రియములని అర్థం. వారికి ఒక్కొక్కరికి వందమంది సేవకులు అనగా:–నూరు ("శతమనంతం భవతి" అని వేదం అనంతతార్థమున శతశబ్ద ప్రయోగం చేసినది). అనేక వృత్తులు గలిగిన అని అర్థం... 20

ద్వారపాలకుడైన ఐదుతలలు గల పాముచే అన్ని దిక్కులనుండి కాపాడబడుచూ, భర్త కొరకు అన్వేషించుచున్న ఒక అందమైన కన్యకను చూచెను. పంచ వృత్తులు గలిగిన ప్రాణమే ఐదుతలల పాము..21

శ్లో॥ సునాసాం సుదతీం బాలాం సుకపోలవరాననామ్ ।
సమవిన్యస్త కర్ణాభ్యాం బిభ్రతీం కుండలశ్రియమ్ ॥ 22

టీ:- సునాసామితి. గంధజ్ఞానాదిభిః పృథ్వ్యవయవైః సునాసత్వాది రూప్యతే. సమం విన్యస్తౌ రచితౌ కర్ణౌతాభ్యాం కుండల శోభాం దధతీం. (22)

శ్లో॥ పిశంగనీవీం సుశ్రోణీం శ్యామాం కనకమేఖలామ్ ।
పద్భ్యాం క్వణద్భ్యాం చలతీం నూపురైర్దేవతామివ ॥ 23

టీ:- పిశంగే పిశంగనీవీం పీతవస్త్రాం. "అన్నమయం హి సోమ్య మన ఇతి. యత్కృష్టం తదన్నస్యే'' త్యాదిశ్రుత్యనుసారేణ శ్యామామిత్యుక్తం. నూపురైః క్వణద్భ్యాం. నూపురైరితి పాదాంగులీయకా నామప్యుపలక్షణాద్బహువచనం. 23

గంధజ్ఞానాది బుద్ధ్యవయవములే సునాసాదులుగా నిరూపించు చున్నాడు. చక్కటి ముక్కు, చక్కటి పలువరుసలు, శ్రేష్ఠమైన ముఖము గలిగి, సమముగా ఉన్న చెవులకు మెరియుచున్న కుండలములను ధరించిన, పదహారు సంవత్సరములు గల ఆమెను చూచెను. 22

పచ్చని చీరను ధరించిన, చక్కటి కటి భాగముగల, శ్యామల వర్ణముగల, బంగారు ఒడ్యాణముగల, కాలి అందలతో, నూపురైః అని బహువచనము కాలి వేళ్ళ మట్టెలతో గూడాయని ఉపలక్షణం చక్కటి ధ్వనులు గలిగిన పాదములచే దేవతవలె నడుచుచున్న ఆమె శ్యామలము అనగా నలుపు. నలుపు ఎందుకనగా! ఛాందోగ్య ఉపనిషత్ 6 వ అధ్యాయము 5 వ ఖండంలో 1 వ మంత్రం "అన్నమశితం ---యోౖ ణిష్ఠస్తన్మనః" తిన్న అన్నము మూడు భాగములుగా మారి సూక్ష్మభాగము హృదయమును చేరి హితాఖ్య సూక్ష్మనాడుల యందు ప్రవేశించి, వాగాది కరణ సమూహమునకు స్థితిని కలిగిస్తూ మనస్సు అగుచున్నది. ఆ భాగము మనస్సుగా మారి మనస్సునకు బలమును కలిగించుచున్నది. ఈరుణి శ్వేతకేతువుతో "అన్నమయం హి సౌమ్యమనః 6-5-4 ఛాందోగ్యం-6-4-1 యదాదిత్యస్య-అని

ప్రారంభించి "యత్కృష్ణంతదన్నప్య" అనగా త్రివృత్కరణము చెందిన పిమ్మట కృష్ణ రూపము పృథివాత్మక అన్నముదని తెలుసుకో, దాని ద్వారా అత్రివృత్కృతమైన అన్నరూపమైన పృథివీ రూపము కృష్ణమని..23

శ్లో॥ స్తనౌ వ్యజింతకైశోరౌ సమవృత్తౌ నిరంతరౌ ।
వస్త్రాంతేన నిగూహంతీం వ్రీడయా గజగామినీమ్ ॥ 24

టీ:- స్తనావితి. వ్యజితం కైశోరం యౌవనోపక్రమో యాభ్యాం. నమౌ చ వృత్తౌచ వ స్త్రాంతేన నిగూహంతీం. 24

సమానముగా, గుండ్రముగా, నిండుగా ఉన్నటి ఆమె స్తనములు యౌవ్వనారంభమును ప్రకటించుచున్నవి. ఆ గజ గమన సిగ్గుపడుచూ వాటిని చీరకొంగుచే కప్పుకొనుచున్నది. 24

శ్లో॥ తామాహ లలితం వీరస్స్రవ్రీడస్మితశోభనామ్ ।
స్నిగ్ధేనాపాంగపుంఖేన స్పృష్టః ప్రేమ్ణాభ్రమద్భ్రువా ॥ 25

టీ:- తామితి. తామాహేతి తయోః సంవాదోక్తిస్సంబంధదార్ఢ్యాయ. అపాంగ ఏవ పుంఖో మూలప్రాంతో యస్య కటాక్షస్య బాణస్య. తేన స్పృష్టో విద్ధః. ప్రేమ్ణ ఉచ్చైర్భ్రమంతి భ్రూః ధనుఃస్థానీయా యస్మిన్ తేన. 25

ఆమెతో పలికెనని చెప్పడం సంబంధ దృఢత్వమునకే. ఎక్కువగా అటునిటు తిరగాడుచున్న కన్నుబొమ్మలు కలిగి ప్రేమచే పైకిసాగి వంకరలు తిరిగిన కనుబొమ్మలే ధనుస్సుకాగా, మృదువైన కొనగంటి కనుచూపులచే కొట్టబడి, వీరుడైన ఆ పురంజనుడు సిగ్గుతో గూడి చిరునవ్వులచే శోభించుచున్న ఆమెతో లలితముగా ఇట్లు పలికెను. (25)

శ్లో॥ కా త్వం కంజపలాశాక్షి కస్యాసీహ కుతస్సతి ।
ఇమాముపపురీం భీరు కిం చికీర్షసి శంసమే ॥ 26

టీ:- కేతి. కుతః స్థానాదిహాగతాసి. హే సతి పుర్యాః సమీపస్థా ఉపపురి యా భూః తామాలక్ష్య కిం కర్తుమిచ్ఛసీత్యర్థః. 26

ఓ కంజపలాశాక్షి, నీ వెవతవు? ఎవరిదానవు? ఎక్కడినుండి ఇచ్చటికి వచ్చినావు? పట్టణమునకు సమీపమున ఉన్న ఈ స్థలములో ఏమి చేయకోరుచున్నావు? నాకు చెప్పుము. 26

శ్లో॥ క ఏతేఽనుపథా ఏత ఏకాదశ మహాభటాః ।
ఏతా వా లలనాస్సుభ్రుకోఽయం తేఽహిః పురస్సరః ॥ 27

టీ:- క ఇతి. తే తవ యేఽనుపథాః అనువర్తిన ఏతే కే. ఏకాదశో మహాన్ భటో బృహద్బలత్వేన వక్ష్యమాణో యేషు దశసు తే బుద్ధేః మనసః పృథుగుపాదానాం బుద్ధిపరిచారకేంద్రియ సహాయతయా తత్పరిచారకత్వ వివక్షయా. ఏతాః లలనా ఇంద్రియవృత్తయః. 27

అందమైన కనుబొమ్మలుగలదానా! నిన్ననుసరించి నడుచుచున్న వీరంతా ఎవరు. పదకొండవ వాడు పెద్దబలము గలవాడు అగుచుండగా ఈ పదిమంది భటులు ఎవరు? ఈ యువతులెవరు? ఈ పట్టణమునందు ఈ పామెవరు?

మనస్సుకంటే బుద్ధిని వేరుచేయడం ఎందుకనగా బుద్ధి పరిచారకులైన ఇంద్రియముల సహకారమునకే వాటి పరిచారకత్వమని తెలుపుటకు. 27

శ్లో॥ త్వం హ్రీర్భవాన్యస్యథవాగ్రమా పతిం
విచిన్వతీ కిం మునివద్రహో వనే ।
త్వదంఘ్రికామాప్త సమస్త కామం క్వ
పద్మ కోశః పతితః కరాగ్రాత్ ॥ 28

నీవు మునివలె సంయమనమును పాటిస్తూ ధర్మమును వెతుకుచున్న లజ్జాదేవివా? శివుడిని వెతుకుచున్న భవానిదేవివా? లేదా బ్రహ్మను వెతుకుచున్న సరస్వతివా? లేదా విష్ణువును వెతుకుచున్న రమాదేవివా! ఎట్టి పతిని వెతుకుచున్నావనగా! నీచేత పాదములు పట్టబడినవాడు సకల కోరికలు తీరినవాడై ఉంటాడు. నీవు లక్ష్మివైఉంటే నీ చేతిలోని తామరపువ్వు జారిపోయినదా! 28

టీ:- త్వమితి. త్వం హ్రీః కిం పతిం ధర్మం విచిన్వతీ? అథవా భవానీపతిం శివం విచిన్వతీ? కిం వాక్ సరస్వతీ పతిం బ్రహ్మాణం? కిం రమావాపతిం విష్ణుం? మునిరివ సంయతా సతీకథంభూతం పతిం త్వదంఘ్రికామనయైవ ప్రాప్తాస్సమస్తాః కామాః యేన తం. 28

శ్లో॥ నాసాం వరోర్వన్యతమాసి భూస్పృక్
పురీమిమాం వీరవరేణసాకమ్ ।
అర్హస్యలంకర్తుమదభ్రకర్మణా
లోకం పరం శ్రీరివ యజ్ఞపుంసా ॥ 29

టీ:- నేతి. హే వరోరు. ఆసాం మధ్యే త్వమన్యతమాపి న భవసి. యతో భువి స్పృక్ న హి దేవతాభువం స్పృశంతి వీరవరేణ మయా. పరం వైకుంఠం. 29

శ్లో॥ యదేషమాపాంగ విఖండితేంద్రియం
సవ్రీడభావ స్మిత విభ్రమభ్రువా ।
త్వయోపసృష్టో భగవాన్మనోభవః
ప్రబాధతేఽథానుగృహాణ శోభనే ॥ 30

ఓ సుందరీ! నీవు దేవతాస్త్రీలలో ఒకతివి కావు. ఎందుకనగా నీ పాదములు భూమిని తాకుచున్నవి. దేవతల పాదములు భూమినంటవు. యజ్ఞపురుషుడైన శ్రీహరితో కూడిన లక్ష్మీ వైకుఠమునలంకరించినట్టుగా, వీరుడనైన నేను గొప్పకర్మలు చేయుటకు నాతోగూడి ఈ పురమునలంకరించుటకు నీవు తగియున్నావు, మరి నీవు కర్మరహితుడవు? నీతో ఎట్లు కలిసి ఉండాలి? అనగా నీ సంగముచేత. అకర్ముడనైనప్పటికీ సకర్ముడనౌతాను. 29

ఓ సుందరీ! సిగ్గుతో, చిరునగవులచే కదలాడుచున్న కనుబొమ్మలు గలిగిన నీ కడగంటి చూపుచేత నా మనస్సు విచలితమ్మైనది. నీచే ప్రేరితుడైన మన్మథుడు నన్ను మిక్కిలి బాధించుచున్నాడు. కనుక నీవు నన్ననుగ్రహించవలసినది. 30

టీ:- యదితి. యద్యస్మాత్త్వాపాంగేన విఖండిత మింద్రియం మనో యస్య తం. మా మాం మనోభవో బాధతే. అథ తస్మాదనుగృహాణ. సవ్రీడం యద్భావేన ప్రేమ్ణా స్మితం తేన విభ్రమంతీ యా భ్రూః తయా ఉపసృష్టః ప్రేరితః. 30

శ్లో॥ త్వదాననం సుభ్రు సుతార లోచనం
వ్యాలంబినీలాలక బృంద సంవృతమ్ ।
ఉన్నీయ మే దర్శయ వల్గువాచకం
యద్వ్రీడయానాభిముఖం శుచిస్మితే ॥ 31

స్వచ్ఛమైన చిరునవ్వులు గలదానా! అందమైన కనుగుడ్లుగల కన్నులదానా! పొడవైన వ్రేలాడుచున్న ముంగురులగుంపుతో గప్పబడుచూ, సుందరమైన, మధురమైన వాక్కులుగల, సిగ్గుతో నాకభిముఖముగా లేనట్టి, నీ ముఖమును నాకు దర్శింపచేయుము. 31

టీ:- త్వదితి. యద్వ్రీడయా సమ్ముఖం న భవతి తత్త్వదాననమున్నీయ మే దర్శయ. శోభనే భ్రువౌయస్మిన్. సుతారే శోభనకనీనికే లోచనే యస్మిన్. వ్యాలంబినో దీర్ఘాయే నీతా అలకాస్తేషాం బృందేన సంవృతం వల్గూని వాచకాని వాక్యాని యస్మిన్. 31

**శ్రీ నారదులవారు ఈ విధముగా పలికిరి.**

శ్లో॥ ఇత్థం పురంజనం నారీయాచమాన మధీరవత్ ।
అభ్యనందత తం వీరం హసంతీ వీరమోహితా ॥ 32

ఓ వీరా! ఈ విధముగా ధైర్యము కోల్పోయి, ఆమెను యాచించుచున్న పురంజనుని చూచి, ఆమెగూడా మోహితయై అతనితో ఈ విధముగా పలికెను. 32

టీ:- ఇత్థమితి. హే వీర. వీరం ప్రత్యగాత్మానం మోహయితుం శీలం యస్యాః సాపి తం దృష్ట్వా మోహితాసతీ తమాహ. 32

శ్లో॥ న విదామ వయం సమ్యక్కర్తారం పురుషర్షభ ।
ఆత్మనశ్చ పరస్యాపి గోత్రం నామ చ యత్కృతమ్ ॥ 33

టీ:- యత్పృష్టం కస్యాసీత్యనేన కస్య పుత్రీ గోత్రజేతి. కా త్వమితి చ కిం నామాసీతి చ? తత్రాహ-నేతి. ఆత్మనో మమ పరస్య తవాపి కర్తారం సమ్యక్ న విద్మః గోత్రం నామ చ యత్కృతం భవతి తం చ న విద్మః. 33

ఓ పురుషశ్రేష్ఠా! ఎవరి పుత్రివి? మీ గోత్రము ఏది? నీవెవరసలు? అని అడిగితివి కాని నీకు, నాకు ఇద్దరికీ ఈ గోత్రాదులేవి తెలియవు. 33

శ్లో॥ ఇహాద్య సంతమాత్మానం న విదామ తతః పరమ్ ।
యే నేయం నిర్మితా వీరపురీ శరణమాత్మనః ॥ 34

టీ:- తర్హి కిం వేత్సి? తదాహ - ఇహేతి. ఆత్మనో మమ శరణం ఇయం పురీ యేన నిర్మితా తం చ న విద్మః. 34

ఓ వీరా! ఇప్పుడిచ్చట నేనున్నాను, అంతవరకే నాకు తెలియును. నాకు ఈ నివాస స్థానమును నిర్మించి యిచ్చిన వాడిని గూర్చి తెలియదు. 34

శ్లో॥ ఏతే సఖాయస్సఖ్యో మే నరా నార్యశ్చ మానద ।
సుప్తాయాం మయిజాగర్తి నాగోఽయం పాలయన్పురీమ్ ॥35

టీ:- యత్పృష్టం క ఏతే అనుపథా ఇతి తత్రాహ - ఏత ఇతి. 35

న్ననను సరించువారు వీరెవరని అడిగితివి? ఈ స్త్రీలు, పురుషులు నా స్నేహితులు, స్నేహితురాళ్ళు. నేను నిద్రించినప్పుడు ఈ నగరమును, ఈ సర్పము కాపాడుచుండును. 35

శ్లో॥ దిష్ట్యాగతోఽసిభద్రంతే గ్రామ్యాన్ కామానభీప్ససి ।
ఉద్వహిష్యామి త్వాం స్వేహం స్వబంధుభిరరిందమ ॥ 36

టీ:- దిష్ట్యేతి. ఆస్తాంతావన్నామగోత్రాది. యదత్రాగతోఽసి. ఏతద్దిష్ట్యా భద్రం జాతం. గ్రామ్యాన్ ఇంద్రియ గ్రామార్థాన్ ఉద్వహిష్యామి సంపాదయిష్యామి. స్వబంధుభిస్సఖీభిశ్చ. 36

నామ గోత్ర విచారణ అట్లు ఉండనిగాక, నీవు ఇచ్చటకు వచ్చినావు, నీకు మంగళమగు గాక! నీవు ఇంద్రియ భోగములను కోరుచున్నావు. నేను నా స్నేహితులు, స్నేహితురాళ్ళచే వాటిన సమకూర్చెదను. 36

శ్లో॥ ఇమాం త్వమధితిష్ఠ స్వ పురీం నవముఖీం విభో ।
మయోపనీతాన్ గృహ్ణానః కామభోగాన్ శతం సమాః ॥ 37

టీ:- ఇమామితి. సమాః సంవత్సరాన్. మనుష్యదేహ ప్రవేశాచ్ఛత మిత్యుక్తం. 37

ఓ ప్రభూ! నీవు నాచే సమకూర్చబడిన కామభోగములను అనుభవిస్తూ నూరు సంవత్సరములు ఈ నగరమునధిష్ఠించుము. మనుష్యదేహ ప్రవేశము కనుక నూరు సంవత్సరములని చెప్పబడెను. (37)

శ్లో॥ కం ను త్వదన్యం రమయే హ్యరతిజ్ఞమకోవిదమ్ ।
అసాంపరాయాభిముఖమశ్వస్తనవిదం పశుమ్ ॥ 38

టీ:- సంసారిణో జీవస్య ప్రవృత్తిస్వభావత్వాత్. నివృత్తినిందాపూర్వకం తత్సంగమభినందతి-పంచభిః. కమితి. త్వత్తోఽన్యం కం ను రమయే. అరతిజ్ఞం నైష్ఠికం అకోవిదం అనిషిద్ధ సుఖత్యాగినం. సంపరాయో మృత్యుస్తదనభిముఖం పరలోకచింతాశూన్యం. అశ్వస్తనవిదం శ్వః ఇదం కర్తవ్యమితీహ లోకచింతాశూన్యం పశుతుల్యం. 38

బుద్ధికి ప్రవృత్తి స్వభావముగనుక నివృత్తి నిందాపూర్వకముగా జీవసంగమము అభినందించుచున్నది. ఓ ప్రభూ! నిన్నుగాక ఎవరిని నేను కోరెదను. రతి తెలియని వాడిని అనగా నైష్ఠికుడిని, విద్వాంసుడు కాని వాడిని అనగా నిషేధము లేని సుఖమునుగూడా విడిచినవాడిని, పరలోకము ఆలోచన లేనివాడిని అనగా పరలోక చింతారహితుడిని. రేపు ఇది చెయ్యాలి అన్న ప్రణాళిక లేని పశువును ఎవరు వరించెదరు? అనగా రేపు ఇది చెయ్యాలి అన్న లోకచింత లేని వాడిని. 38

శ్లో॥ ధర్మోహ్యత్రార్థ కామౌ చ ప్రజానందోఽమృతం యశః ।
లోకా విశోకా విరజా యాన్న కేవలినో విదుః ॥ 39

టీ:- ధర్మ ఇతి. అత్ర గార్హస్థ్యే ప్రజానందః పుత్రసుఖం అమృతం మోక్షః కేవలినో యతయః. 39

ఈ గృహస్థాశ్రమమున ధర్మార్థ కామములు, పుత్రసుఖము, మోక్షము, కీర్తి, దుఃఖరహితమైన శుద్ధ లోకములు లభించును. వీటిని గూర్చి యతులకేమి తెలియును? 39

శ్లో॥ పితృ దేవర్షి మర్త్యానాం భూతానామాత్మనశ్చ హ ।
క్షేమ్యం వదంతి శరణం భవేఽస్మిన్ యద్గృహాశ్రమః ॥ 40

టీ:- పితృదేవేతి. గృహాశ్రమ ఇతి. యదేతత్ క్షేమార్హం శరణ మాశ్రయం వదంతి. (40-41)

ఈ సంసారమున గృహస్థాశ్రమము పితృదేవతలకు, దేవతలకు, ఋషులకు, మానవులకు, తనకు, సర్వప్రాణులకు, క్షేమకరమైనది. యోగ్యమైనది, ఆశ్రయమైనదని చెప్పుచున్నారు. 40

శ్లో॥ కా నామ వీరవిఖ్యాతం వదాన్యం ప్రియదర్శనమ్ ।
న వృణీత పతిం ప్రాప్తం మాదృశీత్వాదృశం స్వయమ్ ॥ 41

ఓ వీరుడా! ఉదారునివి, విఖ్యాతి (పెద్దపేరు) పొందినవానివి, ప్రీతికరమైన దర్శనము గలవానివి, ప్రియుడివి అయిన నీవు పతిగా లభించినప్పుడు నా వంటి ఏ స్త్రీ వరించకుండా ఉండును?41

శ్లో॥ కస్యామనస్స్యాత్తవ భోగిభోగయోః
స్త్రియో న సజ్జేద్భుజయోర్మహాభుజ ।
యోఽనాథ వర్గాధిమలంఘృణోద్ధతః
స్మితావలోకేన చరస్యపోహితుమ్ ॥ 42

ఓ మహాభుజుడా! ఈ భూలోకమున పాము దేహము వంటి నీ భుజములపైన ఏ స్త్రీ మనస్సు, ఆసక్తి పొందకుండును? దయా పూర్వకముగా అతిశయించిన చిరునవ్వులచే కూడిన చూపులచే నీవు అనాథ వర్గముల అనగా దీనసముదాయము యొక్క మనోదుఃఖమును తొలగించుటకు సంచరించుచున్నావు. 42

టీ:- కస్యాః ఇతి. భోగిభోగయోః సర్పదేహాకారయోః తవ భుజయోః యన్న సజ్జతే ఏవం భూతం కస్యాః స్త్రియః మనస్స్యాత్ న కస్యా అపి యో భవాన్ అనాథవర్గాః దీనస్తోమా స్తేషామాధిం. అలమత్యర్థం. అపోహితుం సర్వత్ర చరసి. కేనాపోహితుం ఘృణయోద్ధతః అతిశయితో యః స్మితపూర్వకోఽవలోకస్తేన. 42

**నారద ఉవాచ**

శ్లో॥ ఇతి తౌ దంపతీ తత్ర సముద్రసమయం మిథః ।
తాం ప్రవిశ్య పురం రాజన్ముముదాతే శతం సమాః ॥ 43

టీ:- ఇతీతి. సముద్య సముదీర్యసమాః సంవత్సరాన్. 43

**నారదులవారు ఈ విధముగా పలికెను.**

ఓ రాజా! ఈ విధముగా ఆ దంపతులు ఉద్యానవనమున పరస్పరము చక్కగా ప్రతిజ్ఞలు చేసుకొని, ఆ పురములో ప్రవేశించి నూరు సంవత్సరములు ఆనందమును పొందిరి. 43

శ్లో॥ ఉపగీయమానో లలితం తత్ర తత్ర చ గాయకైః ।
క్రీడన్పరివృతః స్త్రీభిర్హ్రాదినీమావిశచ్ఛుచౌ ॥ 44

టీ:- తత్ర జాగ్రదవస్థాం సంక్షేపేణాహ-ఉపగీయమాన ఇతి. జాగ్రదవస్థాయాం తత్ర ప్రతీంద్రియవిషయం. గాయకైర్విషయ శబ్దాది భిరుపగీయమానస్సేవ్యమానః స్త్రీభిర్మనో వృత్తిభిస్సహ క్రీడన్. సుషుప్త్యవస్థామాహ. హ్రాదినీం హృదయాకాశం స్వాపస్థానం శుచౌ నిదాఘే. 44

జాగ్రదవస్థను సంక్షిప్తముగా చెప్పుచున్నాడు. అక్కడక్కడ గాయకులచేత కీర్తింపబడుచున్నవాడై స్త్రీలచేత చుట్టబడి వేసవిలో సరస్సులో ప్రవేశించెను. అనగా నిద్రకు స్థానమైన హృదయాకాశమును పొందెనని సుషుప్తిని గూర్చి చెప్పెను. 44

శ్లో॥ సప్తోపరికృతద్వారః పురస్తస్యాస్తు ద్వే అధః ।
పృథగ్విషయగత్యర్థం తస్యాయః కశ్చనేశ్వరః ॥ 45

టీ:- ఇదానీం నవద్వార పూర్వకం జాగ్రదవస్థాం ప్రపంచయతి - సప్తేతి. యావదధ్యాయసమాప్తి. తస్యాః పురః ఉపరి కృతాః ద్వారః సప్త. వృతా ఇతిపాఠే సంవృతాః.నేత్రే నాసికే శ్రోత్రే ముఖం చేతి సప్త అధో ద్వేద్వారౌ గుదలింగౌ. యః కశ్చనేతి. ఆత్మనః సమ్యగవిజ్ఞానాద నియత త్వాచ్చ. 45

ఇప్పుడు తొమ్మిది ద్వారముల ప్రదర్శన పూర్వకముగా జాగ్రదవస్థను వివరించుచున్నాడు. ఆ పురమునకు పైన ఏడు ద్వారములు విడిగా గలవు. అనగా నేత్రములు రెండు, నాసికా రంధ్రములు రెండు, చెవులు రెండు, ముఖము ఒక్కటి, క్రింద రెండు ద్వారములు అనగా మల, మూత్ర స్థానములు. ఇవి వేరువేరు స్థానములకు వెళ్ళుటకై నిర్దేశింపబడివి. ఈ పురమునకు ఏ ప్రభువైనా ఈ విధముగానే వెళ్ళుతాడు. అనగా ఏ జీవుడైనా ఈ విధముగానే వెళ్ళుతాడు. ఆత్మజ్ఞానము లేనివాడు ఇతడు మాత్రమే అనికాదు. 45

శ్లో॥ పంచ ద్వారస్తు పౌరస్త్యాదక్షిణైకా తథోత్తరా ।
పశ్చిమే ద్వే ఆమూషాంతే నామాని నృప వర్ణయే ॥ 46

టీ:- పంచేతి. తాసు పంచసు పంచద్వారః పౌరస్త్యాః పూర్వ దిగ్భవాః (46)

ఆ ఏడు ద్వారములలో ఐదు తూర్పునగలవు. ఒకటి దక్షిణమున ఒకటి ఉత్తరము, ఇక రెండు పడమర గలవు. నీ కొరకు వాటి పేర్లను చెప్పుచున్నాను. 46

శ్లో॥ ఖద్యోతావిర్ముఖీ చ ప్రాగ్ద్వారావేకత్ర నిర్మితే ।
విభ్రాజితం జనపదం యాతి తాభ్యాం ద్యుమత్సఖః ॥ 47

టీ:- ఖద్యోతవదల్ప ప్రకాశా. వామనేత్రరూపా. ఆవిః ప్రకటం ముఖం

ఖద్యోతము, ఆవిర్ముఖీ అను తూర్పు ద్వారములు తూర్పున ఒకేచోట నిర్మింపబడినవి. ద్యుమంతుని మిత్రుడు పురంజనుడు ఆ ద్వారములగుంటా విభ్రాజితమను దేశమును గూర్చి చెళ్ళుచున్నాడు. నక్షత్రము వలె తక్కువ వెలుతురు గలది ఎడమకన్ను కనుక దానికి

యస్యాస్సా. బహుప్రకాశా దక్షిణనేత్ర లక్షణా. "తస్మాద్ధక్షిణోఽర్ధ ఆత్మనో వీర్యావత్తర" ఇతి శ్రుతేః. స్వానుభవాశ్చ తత్ర ప్రకాశాధిక్యం. ఏకత్ర నిర్మితే సంలగ్నే విభ్రాజితం రూపం. ద్యుమత్సఖః చక్షుస్సహితః పురంజన ఇతి శేషః. 47

ఖదోత్యమని, ఎక్కువ ప్రకాశముగలది కుడికన్ను కనుక దానికి ఆవిర్ముఖీ యని పేరు. "తస్మాదక్షిణోఽర్ధ ఆత్మనో వీర్యావత్తరః, (యజు: బ్రా. 2 అష్టకం 1 వ ప్రశ్న 8 వ పదస) పురుషస్య దక్షిణభాగో అతిశయేన శక్తిమాన్" మానవుడికి కుడిభాగం విశేషించి మిక్కిలి శక్తి గలది. విభ్రాజితమనగా రూపము (విద్యారణ్యం). ద్యుమంతుడి సహితుడై యనగా చక్షుః సహితుడై. 47

శ్లో॥ నళినీ నాళినీ చ ప్రాగ్ద్వారావేకత్రనిర్మితే ।
అవధూతసఖస్తాభ్యాం విషయం యాతి సౌరభమ్ ॥ 48

టీ:- నళినీతి. నళనాళశబ్దౌ ఛిద్రవచనౌ. తద్వతీ నళినీ నాళినీ చ వామ దక్షిణనాసికే. అత్రాపి సంజ్ఞాభేదాదేవ కార్యన్యూనాధిక్యం పూర్వవత్. జ్ఞేయం. అవధూతో వాయ్వధిష్ఠితో ఘ్రాణః. సౌరభం గంధం. (48)

నళినీ నాళినీ అనే రెండు ద్వారములు తూర్పున ఒకేచోట నిర్మింపబడినవి. నలనాల శబ్దములు ఛ్ఛిద్రమను అర్థము గలిగిన వచనములు. కుడిఎడమల ముక్కు రంధ్రములు. ఇచ్చటగూడా సంజ్ఞా భేదము చేత నిర్ధారణ చేసుకొనవలెను. అల్పశక్తి, అధికశక్తి నాసికా రంధ్రములకు కుడిఎడమలగు పూర్వము మాదిరిగానే సమన్వయం చేసుకోవాలి. పురంజనుడు అవధూతుడను వాడితో ఈ ద్వారముల గుండా సౌరభమను దేశమునకు వెళ్ళును. అనగా ఘ్రాణ మూలకముగా గంధము నాఘ్రాణించునని అర్థము. 48

శ్లో॥ ముఖ్యా నామపురస్తాద్వాస్తయా పణబహూదనౌ ।
విషయౌ యాతి పురరాడ్రసజ్ఞవిపణాన్వితః ॥ 49

తూర్పునందు ముఖ్య అనే ప్రసిద్ధి పొందిన ద్వారము గలదు. పురాధిపతి రసజ్ఞుడు, విపణుడను వారితో గూడినవాడై ఈ ద్వారము గుండా ఆపణమను దేశమునకు బహూదనమనే దేశమునకు వెళ్ళును.

టీ:- ముఖ్యేతి. ముఖ్యా ప్రధానమాస్యం. ఆపణో భాషణం. బహుదనశ్చిత్రమన్నం బహోద్వ న ఇత్యస్యోక్తిః పరోక్షవాదత్వాయ. రసజ్ఞంరసనేంద్రియం విపణో వాగింద్రియం తాభ్యామన్వితః. 49

ముఖ్య అనగా ముఖము (నోరు) సర్వ ద్వారములలోకెల్ల ముఖ్యమైనది. సర్వద్వారములను బ్రతికించునది. ఆపణమనగా మాట్లాడటం, బహ్వదనమనే అసలు కాని బహూదనమని పరోక్షవాదము కనుక బహూదనమనగా చిత్రమైన అన్నము. రసజ్ఞుడనగా రసేంద్రియము. విపణమనగా వాగింద్రియము వాటితో కూడినవాడై.. 49

శ్లో॥ పితృహూర్నామ పుర్యాద్వార్దక్షిణేన పురంజనః ।
రాష్ట్రం దక్షిణ పాంచాలంయాతి శ్రుతధరాన్వితః ॥ 50

ఓ బర్హిష్మంత మహారాజా! నగరము యొక్క దక్షిణ దిక్కునందు పితృహూ అనే ద్వారముగలదు. పురంజనుడు శ్రుతధరుడను వాడితో గూడినవాడై ఆ ద్వారముగుండా దక్షిణపాంచాలమను దేశమునకు వెళ్ళెను. ఇచ్చట "దక్షిణే అని శ్లోక గీత పదమునకు తృతీయార్థము స్వీకరించరాదు. దక్షిణదిక్కు యందు అనే అర్థమున ఏనప్ పత్యయము గలిగిన తద్ధితము అని అన్వయము.

టీ:- పితృహూరితి. దక్షిణేనేతి చ న తృతీయా కింతు దక్షిణస్యాంది శీత్యస్మిన్నర్థే తద్ధిత ప్రత్యయాంతోఽయమవ్యయసంజ్ఞః. ఏవ ముత్తరేణేతి. అయమర్థః. పంచానాం విషయాణామన్యతోఽనవ గతానాం ప్రకాశ నాయాలమితి పంచాలంశాస్త్రం శ్రవణకాలే చ బలాధిక్యాద్దక్షిణః కర్ణః ప్రథమం ప్రవర్తతే శాస్త్రే చ ప్రథమం శ్రోతవ్యం కర్మకాండమిత్యేతావతా సామ్యేన ప్రవృత్త సంజ్ఞస్య కర్మకాండస్య దక్షిణకర్ణేన శ్రవణ మిష్యతే. తతస్తదర్థమనుష్ఠాయ పితృభిరాహూతః పితృలోకప్రాపకం పితృ యానం ప్రపద్యతే. తదనేన ప్రకారేణ పితౄణామాహ్వానమనేన భవతీతి పితృహూః దక్షిణ కర్ణః. ఏవం తద్వైపరీత్యేనోత్తరః కర్ణః దేవహూః తథా చ వ్యాఖ్యాస్యతి. శ్లో.

ఈ విధముగా ఉత్తరముయందు గూడా

భూత, భవిష్యత్ కాలములయందు గల విషయములను వేరే మార్గమున (శాస్త్రమును కాదని) తెలియలేరు. శాస్త్రము ద్వారానే తెలియగలము. పంచాలమనగా శాస్త్రము. శ్రవణ కాలమున బలము ఎక్కువగాగల కుడిచెవి మొదలు ప్రవర్తిస్తుంది. శాస్త్రమున మొదలు వినవలసినది కర్మకాండము కనుక కర్మకాండకు దక్షిణ కర్ణముచే శ్రవణము చెప్పబడుచున్నది. అందులకు కర్మకాండము చెప్పిన, కర్మను

"పితృహూః దక్షిణః కర్ణ ఉత్తరో దేవహూఃస్మృతః, ప్రవృత్తం చ నివృత్తం చ శాస్త్రం పంచాలసంజ్ఞికమ్. పితృయానం దేవయానం శ్రోత్రాచ్ఛ్రుతధరాద్వ్రజే" దితి. 50

అనుష్ఠించి పితరులచే పిలువబడి పితృలోకమును ప్రాప్తింపచేయు పితృయానమును పొందుచున్నారు. ఈ ప్రకారము పితరుల ఆహ్వానము దీనిద్వారా అగుచున్నది. కనుక "పితృహూ" కుడిచెవి. ఈ విధముగా ఈ కర్ణమునకు భిన్నంగా గలిగిన ఉత్తర కర్ణము "దేవహూ" (ముందు) భాగవతముననే ఈ విషయము ప్రతిపాదింపబడును. దేవయానము, పితృయానము శ్రోత్రము నుండి శ్రుతదేవుడినుండి లభించును. 50

శ్లో॥ దేవహూర్నామ పుర్యాద్వారుత్తరేణ పురంజనః ।
రాష్ట్రముత్తర పాంచాలం యాతి శ్రుతధరాన్వితః ॥ 51

టీ:- దేవహూరితి. ఏవం పుర్యాః ఉత్తరేణ ఉత్తరస్యాం దిశి దేవహూర్నామద్వాస్తయా పురంజనః శ్రుతధరాన్వితః ఉత్తర పాంచాలం యాతి. యద్యపి ప్రవృత్తి నివృత్త్యనవబోధినశ్శద్దాస్సంతి సంసారిణో జీవస్య శ్రోతవ్యాస్తథాపి శ్రోతవ్యానాం మధ్యే ప్రవృత్త్యవబోధి శాస్త్రాత్మక శబ్దస్యైవ శ్రోతవ్యత్వాభిప్రాయేణ దక్షిణ పాంచాల ముత్తరపాంచాల మిత్యుక్తం.ఏవం పూర్వత్రాపి యాతి సౌరభమిత్యాదిషు ద్రష్టవ్యం. 51

నగరము యొక్క ఉత్తర దిక్కున "దేవహూ" అనుపేరు గలిగిన ద్వారము గలదు. పురంజనుడు శ్రుతధరునితో గూడి ఉత్తర పాంచాలమనే దేశమును గూర్చి వెళ్ళును. 51

శ్లో॥ ఆసురీ నామపశ్చాద్వాస్తయా యాతి పురంజనః ।
గ్రామకం నామవిషయం లుబ్ధకేన సమన్వితః ॥ 52

పురంజనుడు దుర్మధునితోగూడి ఆసురియనే పశ్చిమ ద్వారము గుండా గ్రామకదేశమునకు వెళ్ళును. అనగా-అసురులనగా

టీ:- అసురీతి. అసురా ఇంద్రియారామాస్తేషా మియమాసురీ శిశ్నద్వాః గ్రామకం గ్రామస్థం జనానాం కం సుఖం వ్యవాయం దుర్మదేన గుహ్యేంద్రియేణ. 52

శ్లో॥ నిరృతిర్నామ పశ్చాద్వాస్తయాయాతి పురంజనః ।
వైశసం నామవిషయం లుబ్ధకేన సమన్వితః ॥ 53

టీ:- నిరృతిరితి. నిరృతిర్నామ గుదః మృత్యుద్వారత్వాత్. వైశసం మలవిసర్గం లుబ్ధకేన పాయునా తేనోత్క్రాంతస్య దుఃఖ ప్రాప్తేర్లుబ్ధక సామ్యం. 53

శ్లో॥ అంధావమీషాం పౌరాణాం నిర్వాక్పేశస్కరావుభౌ ।
అక్షణ్వతామధిపతిస్తాభ్యాం యాతి కరోతి చ ॥ 54

టీ:- అంధావితి. అమీషాం మధ్యే నిర్వాక్ పాదః పేశస్కృద్ధస్తః. తావుభావంధౌ. ఛిద్రాభావాత్ స్వతో జ్ఞానక్రియాశక్త్యభావాచ్చ. అక్షణ్వతామింద్రియవతాం దేవానామధిపతిః పురంజనః తగ్వింద్రియ స్యానుశక్తిః సర్వేష్వంతర్భావాత్. 54

ఇంద్రియస్థానములు వాటికి సంబంధించినది. మూత్రద్వారము అది గ్రామక దేశమనగా గ్రామమునగల జనమునకు సుఖమునిచ్చునది మైథునమని అర్థము, దుర్మధునితో అనగా గుహ్యేంద్రియముతో..52

పశ్చిమదిశయందుగల "నిరృతి" అను పేరు గలిగిన ద్వారముగుండా పురంజనుడు లుబ్ధకుడను వాడితో వైశసమను దేశమునకు వెళ్ళుచున్నాడు. నిరృతి అను ద్వారమనగా గుదస్థానము, అది మృత్యు ద్వారము కనుక, వైశసమనగా:-మలమును విడుచుట, లుబ్ధకుడితో అనగా గుదము, లుబ్ధకుడు దుఃఖమునకు ఏ విధముగా కారణము అగుతాడో మరణించుచున్నవాడికి దుఃఖమును కలిగించును కనుక లుబ్ధకునితో పోలిక. 53

ఈ నగర పౌరులలో నిర్వాక్ పేశస్కృతుడను ఇద్దరు గ్రుడ్డివారు కలరు. పురంజనుడు కన్నులు గల ఎందరికో ప్రభువైనప్పటికీ వారిద్దరిచేతనే నడుచును, పనులు చేయును. అనగా:-నిర్వాక్ అనగా పాదము, పేశస్కృత్ అనగా చేతులు. ఛిద్రములు లేవు కనుక వీరిద్దరు గ్రుడ్డివారు. స్వయముగా ఆలోచించి స్వయముగా పనిచేయలేరు కనుక కన్నులుగల వారికి అధిపతి అనగా దేహముగలవారికి అధిపతి పురంజనుడు. త్వగింద్రియమును గూర్చి చెప్పకపోవడము, సర్వము ఇంద్రియములయందు అంతర్ధానమగుట చేత.. 54

శ్లో॥ సయర్హ్యాంతః పురగతో విషూచీనసమన్వితః ।
మోహం ప్రసాదం హర్షం వా యాతి జాయాత్మజోద్భవమ్॥55

ఆ పురంజనుడు విషూచీనుడను వాడితోగూడి అంతః పురమునకు వెళ్ళి భార్యాపిల్లద్వారా కలిగే మోహమును మనః ప్రసన్నతను హర్షమునుగాని పొందుచున్నాడు. అనగా– అంతః –పురమనగా హృదయం, విషూచియను వాడితో యనగా మనస్సుతో– మోహ, ప్రసాద, హర్షములనగా–తమః సత్వరజో కార్యములని అర్థము, భార్యయనగా బుద్ధి, ఆత్మజులనగా – ఇంద్రియ పరిణామములే. 55

శ్లో॥ ఏవం కర్మసు సంయుక్తః కామాత్మా వంచితో బుధః ।
మహిషీ యద్యదీహేత తత్తదేవాన్వవర్తత ॥ 56

ఈ విధముగా కర్మలయందు ఆసక్తిగల పురంజనుడు అవివేకియై కోరికలయందు మనస్సు కలిగి భార్య ఏమేమి చేయునో వాటిని అనుకరించెను. 56

టీ:– స ఇతి. అంతఃపురం హృదయం గతః. విషూచీనం సర్వతో ముఖం మనః. మోహ ప్రసాదహర్షాస్తమత్సత్వరజః కార్యాణి. జాయా బుద్ధిః ఆత్మజాః ఇంద్రియ పరిణామాః తదుద్భవం. (55–56)

శ్లో॥ క్వచిత్పిబంత్యాం పిబతి మదిరాం మదవిహ్వలః ।
అశ్నంత్యాం క్వచిదశ్నాతి జక్షంత్యాం సహ జక్షతి ॥ 57

ఒకప్పుడు మదవిహ్వలుడై ఆమె మద్యమును త్రాగిన తానూ త్రాగును, ఆమె తినిన తను తినును, ఆమె నమిలిన అతడు నములును. 57

శ్లో॥ క్వచిద్గాయతి గాయంత్యాం రుదన్త్యాం రోదితి క్వచిత్ ।
క్వచిద్ధసంత్యాం హసతి జల్పంత్యామనుజల్పతి ॥ 58

ఆమె గానము చేసిన గానము చేయును. ఆమె ఏడ్చిన ఏడ్చును. ఆమె నవ్విన నవ్వును, మాట్లాడిన మాట్లాడును. 58

టీ:- క్వచిదితి. జక్షత్యాం భక్షయత్యాం. (57-58)

శ్లో॥ క్వచిద్ధావతి ధావంత్యాం తిష్ఠంత్యామనుతిష్ఠతి ।
అనుశేతే శయానాయామన్వాస్తే క్వచిదాసతీమ్ ॥ 59

ఆమె పరిగెత్తిన పరిగెత్తును, నిల్చున్న నిల్చొనును, పరుండిన పరుండును. ఆమె కూర్చొనిన కూర్చొనును. 59

శ్లో॥ క్వచిచ్ఛృణోతి శ్రుణ్వంత్యాం పశ్యంత్యామనుపశ్యతి ।
క్వచిజ్జిఘ్రతి జిఘ్రంత్యాం స్పృశంత్యాం స్పృశతి క్వచిత్ ॥60

ఆమె వింటే తాను వినును, చూచిన చూచును, వాసన చూచిన వాసన చూచును. ఆమె తాకిన తాకును. 60

శ్లో॥ కర్హిచిచ్ఛోచతీం జాయామనుశోచతి దీనవత్ ।
అనుహృష్యతి సంహృష్టాం ముదితామనుమోదతే ॥ 61

ఒకప్పుడు ఆమె దుఃఖించిన ఆమెను అనుసరించి తానుకూడా దీనుడివలె దుఃఖంచును. ఆమె హర్షించిన తాను హర్షించును. ఆమె ప్రసన్నురాలైన తాను ప్రసన్నుడగును. 61

టీ:- క్వచిదితి. ఆసతీం ఆసీనాం. (59-61)

శ్లో॥ విప్రలబ్ధో మహిష్యైవం సర్వప్రకృతివంచితః ।
నేచ్ఛన్ననుకరోత్యజ్ఞః క్లైబ్యాత్క్రీడామృగో యథా ॥ 62

టీ:- విప్రలబ్ధ ఇతి. సర్వా అసంగత్యాదిలక్షణా ప్రకృతిః స్వభావో వంచితో యస్య. సర్వయా ప్రకృత్యా వంచిత ఇతి వా. నేచ్ఛన్ అనిచ్ఛన్ క్లైబ్యాత్. 62

ఈ విధముగా భార్యచే ఎక్కువగా మోహింపచేయబడినవాడై అన్ని విధములుగా తన స్వరూపమునుండి వంచితుడై తనకు ఇచ్ఛ లేనప్పటికి, పరవశుడగుటచేత పెంపుడు కోతివలె ఆమెను అనుకరించే వాడు. సర్వ వస్తువులయందు ఆసక్తి గలిగి ఉండడము స్వభావముగా కలిగియుండుటచే దానిచేత వంచితుడు లేదా ఎల్లప్పుడు ప్రకృతిచేత వంచితుడు. సర్వ ప్రకృతి వంచితుడు అని అర్థము. 62

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,**
**పంచవింశోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు**
**ఇరువది ఐదవ అధ్యాయము సమాప్తము.**

## షడ్వింశోఽధ్యాయః

శ్లో॥ షడ్వింశే మృగయావ్యాజాత్ స్వప్నజాగరణోక్తిభిః ।
సద్బుద్ధిత్యాగయోగాభ్యాం సంసృతిస్స్వాప్రపంచ్యతే ॥

**శ్రీ నారద ఉవాచ**

శ్లో॥ ఏకదా సమహేష్వాసో రథం పంచాశ్వమాశుగమ్ ।
ద్వీషం ద్విచక్రమేకాక్షం త్రివేణుం పంచబంధురమ్ ॥ 1

టీ:- తదేవమాత్మన ఉపాధికృతాం సుషుప్తావస్థాం జాగ్రదవస్థాం చోక్త్వా ఇదానీం స్వప్నావస్థామాహ - దశభిః. ఏజదేతి. మహానిష్వాసో ధనుః. కర్తృత్వ భోక్తృత్వాభినివేశో యస్య సరథమారుహ్య పంచప్రస్థం వనమగాదితి తృతీయేనాన్వయః. రథం తదానీమేవ విధృతం స్వప్నదేహం. జాగ్రద్దేహస్య శతసంవత్సరోపభోగ్య పురత్వేనోక్తత్వాత్. పంచజ్ఞానేంద్రియాణ్యశ్వాః యస్య. ఆశుగం శీఘ్రగతిం ద్వే అహంతా మమతే. ఈషే దండికే యస్య. ద్వే పుణ్య పాపే చక్రే యస్య. ఏకం ప్రధానమక్షో యస్య. త్రయో గుణాః వేణవో ధ్వజా యస్య పంచప్రాణా బంధురాణి బంధనాని యస్య. 1

## 26 వ అధ్యాయము

ఈ ఇరువది ఆరవ అధ్యాయమున స్వప్నజాగ్రదవస్థలను చెప్పుచూ, సద్బుద్ధి త్యాగముచే, బుద్ధియోగముచే సంసార విస్తారమును చెప్పుచున్నాడు.

**నారదుడు ఈ విధముగా పలికెను.**

ఒకనాడు పురంజనుడు గొప్ప ధనుస్సు కలిగి, మంచివేగముగా పరిగెత్తు గుర్రములుగల, రెండు అడ్డకమ్మీలు గలిగినట్టి రెండు చక్రములుగల, ఒక ఇరుసుగల, మూడు ధ్వజములుగల, అయిదు కమ్మీలుగల, రథమునెక్కి పంచప్రస్థ వనమునకు వెళ్ళెనని మూడవ శ్లోకముచే అన్వయము.

ఆధ్యాత్మిపక్షమున:-ఆత్మకు జాగ్రదవస్థను, సుషుప్త్యవస్థను వ్యాఖ్యానించి ఇప్పుడు స్వప్నావస్థను వివరించుచున్నాడు. ఈ అవస్థా త్రయము ఉపాధికృతమే.

జీవుడు ధనుస్సనే కర్తృత్వ భోక్తృత్వములు కలిగి అప్పుడే ఎక్కిన రథమనగా స్వప్న దేహమును. పూర్వము జాగ్రద్దేహమును నూరు సంవత్సరములు అనుభవించే పట్టణమని చెప్పడంద్వారా స్వప్త దేహమని ఇప్పుడు ఈ వ్యాఖ్యానం. ఐదు జ్ఞానేంద్రియములే గుఱ్ఱములు, అహంతామమతలే అడ్డకడ్డీలు, పుణ్యపాపములే రెండు చక్రములు,

శ్లో॥ ఏకరశ్మ్యేక దమనమేకనీడం ద్వికూబరమ్ ।
పంచప్రహరణం సప్తవరూథం పంచవిక్రమమ్ ॥ 2

టీ:- ఏకేతి. ఏకం మనోరశ్మిః ప్రగ్రహో యస్య ఏకా బుద్ధిర్దమను స్సూతో యస్య. ఏకం హృదయం నీడం రథిన ఉపవేశస్థానం యస్మిన్. ద్వౌ శోక మోహౌ కూబరౌ యుగబంధనస్థానం యస్య. పంచశబ్దాదయో విషయాః ప్రహీయంతే ప్రక్షిప్యంతే యస్మిన్. అస్య వ్యాఖ్యానం భవిష్యతి పంచేంద్రియార్థ ప్రక్షేప ఇతి. సప్త ధాతవో వరూధాః రక్షార్థం చర్మధ్యావరణాని యస్య. పంచకర్మేంద్రియాణి, విక్రమాః గతి ప్రకారా యస్య. 2

శ్లో॥ హైమోపస్కరమారుహ్య స్వర్ణవర్మాక్షయేషుధిః ।
ఏకాదశ చమూనాథః పంచప్రస్థమగాద్వనమ్ ॥ 3

టీ:- హైమేతి. హైమోపసర్కం సౌవర్ణాభరణం. స్వర్ణం వర్మ కవచం. రజోగుణావృతః. అక్షయేషుధిర్నిషంగఃఅనంతవాసనాహంకారోపాధిః.

ప్రధానమే ఇరుసు. సత్వరజస్తమోగుణములే మూడు ధ్వజములు, పంచప్రాణములే ఐదు కట్టివేసే కమ్మీలు. 1

ఒక పగ్గము, ఒక సారథి, సారథి కూర్చును స్థలము, రెండు కాడినికట్టు స్థానములు, ఐదు ఆయుధములు, ఏడు కవచములు, ఐదు దారులు గలిగిన రథమునెక్కి పంచప్రస్థమునకు వెళ్ళెను.

ఆధ్యాత్మికపక్షమున - ఒక మనస్సే పగ్గము, బుద్ధియే సారథి, హృదయమే సారథి కూర్చొను స్థలము. శోకమోహములే కాణి, కట్టు రెండు స్థానములు. ఐదు శబ్దాది విషయములే ఆయుధములు, ఏడు శరీరములోని మజ్జావేదాది ధాతువులే కవచములు., కర్మేంద్రియములు ఐదు, ఐదు దారులు..2

బంగారు అలంకారములు గల రథమునెక్కి బంగారు కవచము గలవాడై తరగని బాణముల పొదిగలవాడై పదకొండు సేనానాయకులు గలవాడై పంచప్రస్థమను వనమునకు వెళ్ళెను.

ఆధ్యాత్మికపక్షమున - బంగారు కవచము గలవాడు అనగా రజోగుణముగలవాడై, తరగని బాణముల పొదిగలవాడనగా -అనేక

ఏకాదశో మనోరూపశ్చమూనాథః సేనాపతిర్యస్య. వాసనామయస్య మనసః ప్రగ్రహత్వాత్. సంకల్ప వికల్పాత్మకస్య బృహద్బలత్వేన. వక్ష్యమాణస్య చమూనాథత్వమితి భావః. పంచశబ్దాదయో విషయాః ప్రస్థాః సానవో యస్మిన్. తద్వనం భజనీయం దేశమగాత్. 3

జన్మల వాసనాహంకార ఉపాధియని. పదకొండవ సేనానాయకుడు అనగా మనస్సు సేనాపతి సంకల్పవికల్పాత్మకమైన మనస్సే, జ్ఞాన కర్మ భేదం చేత ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు కలిపి పదిమంది సైన్యమునకు, (పదకొండవది) మనస్సు సేనానాయకుడు వాసనామయమైన మనస్సునకు పగ్గముల స్థానము సంకల్ప వికల్పాత్మకమైన గొప్ప బలము కలిగిఉండడమే. పంచప్రస్థమనగా - శబ్దాది విషయములే సమ భూమిగాగల స్వప్న దర్శన స్థానమైన నాడీ దేశమును పొందెను. 3

శ్లో॥ చచార మృగయాం తత్ర దృప్త ఆత్తేషు కార్ముకః ।
విహాయ జాయామతదర్హాం మృగవ్యసనలాలసః ॥ 4

టీ:- చచారేతి. ఆత్తాః గృహీతాః. ఇషవో రాగద్వేషాదిరూపాః కార్ముకం చ భోగాద్యభినివేశరూపం యేన జాయాం వివేకవతీం బుద్ధిం విహాయ. అతదర్హాం త్యాగానార్హాం. త్యాగే హేతుః. మృగ్యంత ఇతి మృగాః విషయాః. తేషు వ్యసనం భోగాసక్తిః. తేన లాలసా అతిస్పృహా యస్య. (4)

వేటాడుటయందు తీవ్ర ఆసక్తి గలిగిన పురంజనుడు దర్పము గలవాడై విడిచిపెట్టగూడని భార్యను విడిచి, ధనుర్బాణములను ధరించి ఆ ఆడవియందు వేటాడెను.

పక్షాంతరము - జీవుడు ధనుర్బాణములనగా రాగాది దోషములు బాణములు; నేను కర్తను, బోక్తననే అభినివేశమే ధనుస్సు. దానిని పట్టుకొని భార్యను విడిచి యనగా:-వివేకాత్మకమైన బుద్ధిని విడిచి, విడవడానికి కారణం? మృగరూపముయందు ఆసక్తి అనగా- విషయములను భోగించాలనే ఆసక్తిచే అతిలాలసుడయ్యెను. 4

శ్లో॥ ఆసురీం వృత్తిమాశ్రిత్యఘోరాత్మా నిరనుగ్రహః ।
న్యహనన్నిశితైర్బాణైర్వనేషు వనగోచరాన్ ॥ 5

టీ:- ఆసురీమితి. బాణైః రాగాదిభిః. వనేషు భజనీయ దేశేషు వనగోచరాన్ భజనీయ విషయాన్. న్యహనత్ ఆత్మ సాత్కృతవాన్. కథాపేక్షే తు స్పష్టమేవ. 5

భయంకరమగు ఆకారముగలవాడై, దయలేనివాడై, క్రూరమైన ప్రవృత్తిని ఆశ్రయించి, వనమందు, వనమున సంచరించు ప్రాణులను పదనుగల బాణములచే చంపెను.

పక్షాంతరమున- అంతఃకరణ సంస్కార మూలకమున స్వప్నావస్థ యందు శబ్దాది విషయములను రాగాది కల్పితమైన ఆ యా ఇంద్రియ వృత్తులచే అనుభవించెను. 5

శ్లో॥ తీర్థేషు ప్రతిదృష్టేషు రాజామేధ్యాన్పశూన్వనే ।
యావదర్థమలం లుబ్ధో హన్యాదితి నియమ్యతే ॥ 6

టీ:- నన్వాసురీం వృత్తిమాశ్రిత్యేతి కిమితి మృగయా నింద్యతే. కథాపక్షే తావద్రాజ్ఞోవిహితైవ సా అథాత్మపక్షేఽపి జీవస్య విషయభోగో విహిత ఏవేత్యా శంక్యాహ - త్రిభిః. తీర్థేష్వితి. అయం భావః - నహి మృగయా విధీయతే రాగప్రాప్తత్వాత్. కింతు నియమ్యతే ప్రవృత్తిస్సంకోచ్యతే. నియమమేవ షడ్విధం దర్శయతి. యద్యలమత్యర్థం లుబ్ధో రాగాసక్తః హన్యాత్ తర్హి తీర్థేషుశ్రాద్ధాదిష్వేవ తత్రాపి ప్రతిదృష్టేషు ప్రఖ్యాతేష్వేవ న నిత్యశ్రాద్ధాదిషు తత్రాపి రాజైవ మేధ్యానేవ వన ఏవ యావదుపయోగ మేవేతి. ఏవం జీవస్యాపి విషయసేవా యావదుపయోగం న యథేష్టమితి నియమ ఏవేత్యర్థః. 6

ఇచ్చట అసుర ప్రవృత్తి కలిగి అని వేటాడడం నిందించినారే? కథాదృష్టితోని చూచినా రాజుకు వేట విధించినదే. ఆధ్యాత్మిక పక్షంలో చూచినా జీవుడికి విషయ భోగములు వివాహితములే అని ఆ శంకించి మూడు శ్లోకములచే వివరించుచున్నాడు.

శాస్త్రమున ఎచ్చటగూడా వేటాడడంకాని, జీవుడికి భోగములు గాని విధించలేదు. (విధిగా చెప్పబడలేదు) రాగాది ప్రాప్తమైనప్పుడు ఇష్టం వచ్చినట్టుగా ప్రవర్తించకుండా (శాస్త్రము) ప్రవృత్తిని సంకోచింప చేస్తుంది, నియమిస్తుంది. ఆ నియమ పద్ధతిని ఆరు విధములుగా చూపెడుచున్నాడు. ఒకవేళ రాజు అత్యంత అనురాగియై చంపాలను- కున్నప్పుడు శ్రద్ధాదులయందు మాత్రమే వేటాడాలి. అది ప్రఖ్యాతమైన శ్రాద్ధాదుల యందు మాత్రమే. నిత్య శ్రాద్ధాదులయందు పనికిరాదు. అది రాజు మాత్రమే వేటాడాలి. ఇతరులు వేటాడరాదు. అదికూడా

విహితములైన అనగా నిషిద్ధములు కాని వాటిని మాత్రమే. అది వనమున మాత్రమే, ఇంటికి తెచ్చి పెంచి చంపరాదు. అది ఎంతవరకు కర్మాదులకవసరమో అంత మాత్రమునకే ఎక్కువ చంపరాదు. జీవుడి విషయమునగూడా భోగము లనుభవించువచ్చు గదాయని యథేచ్ఛగా అనుభవించరాదు. విషయములను ఎంతవరకో అంతవరకే నియమము – అని అర్థము. 6

శ్లో॥ య ఏవం కర్మనియతం విద్వాన్ కుర్వీత మానవః ।
కర్మణా తేన రాజేంద్ర జ్ఞానేన న స లిప్యతే ॥ 7

టీ:– అతోఽనావశ్యకమిత్యాహ – య ఇతి. ఏవం నియంతం కర్మవిద్వాన్ తేనేత్యుపలక్షణం. తేనాన్యేన వా కర్మణా ఏవమనుష్ఠి తేన యత్ జ్ఞానం భవతి జ్ఞానేన హేతునా సోఽనుష్ఠాతా నలిప్యతే. 7

కావున ఆవశ్యకత్వము కాదని ఈ విధముగా చెప్పుచున్నాడు. ఈ విధముగా నిత్యకర్మను వివేకియై అనుష్ఠించడం వల్ల జ్ఞానము కలిగి, ఆ జ్ఞానకారణమున ఈ అనుష్ఠాత కర్మలేపమును పొందదు. (కర్మ బంధించదు) 7

శ్లో॥ అన్యథా కర్మ కుర్వాణిమానారూఢోఽనుబధ్యతే ।
గుణప్రవాహ పతితో నష్టప్రజ్ఞో వ్రజత్యధః ॥ 8

టీ:– అన్యథేతి. అన్యథా నియమోల్లంఘనేనఅంతఃకరణశుద్ధ్యభావాత్ కర్తృత్వాభిమానమారూఢః కర్మభిరనుబధ్యతే. తతశ్చ గుణప్రవాహే పతితోఽధో వ్రజతి. 8

ఈ విధముగా కాక ఈ నియమ ఉల్లంఘనము చేత అంతఃకరణ శుద్ధిలేనివాడై కర్తృత్వాభిమానము కలిగి, కర్మబద్ధుడైనచో, సత్వాది గుణ ప్రవాహమున పడిపోయి, వివేకహీనుడై అధోగతిని పొందును. (8)

శ్లో॥ తత్ర నిర్భిన్న గాత్రాణాం చిత్రవాజై శ్శిలీముఖైః ।
విప్లవోఽభూద్దుఃఖితానాం దుస్సహః కరుణాత్మనామ్ ॥ 9

ఆ అడవిలో రంగురంగుల రెక్కలుగల, కొనదేలిన బాణములచే అవయవములు ఛేదింపబడి, మృగములనాశమేర్పడెను. కరుణాత్ములైన వారికిది సహింపరానిది. 9

శ్లో॥ శశాన్వరాహాన్మహిషాన్గవయాన్ రురుశల్యకాన్ ।
మేధ్యానన్యానమేధ్యాంశ్చ వినిఘ్నన్ శ్రమమభ్యగాత్ ॥ 10

టీ:- ప్రాసంగికం పరిసమాప్య పునర్మృగయా మేవానువర్ణయతి - తత్రేతి. చిత్రా వాజాః పక్షాయేషాం తైః. విప్లవో నాశః కరుణాత్మనాం కృపాళూనాం దుస్సహః. (9-10)

పురంజనుడు కుందేళ్ళను, అడవిపందులను, అడవిదున్నలను, గవయ మృగములను, నల్లచారల దుప్పిలను, ఏదుపందులను, యజ్ఞార్హములైన ఇతర వివిధములైన ప్రాణులను సంహరించుచున్నవాడై అలసటను పొందెను. 10

శ్లో॥ తతస్తూరుపరిశ్రాంతో నివృత్తో గృహమేయివాన్ ।
కృతస్నానో చితాహారస్సంవివేశ గతక్లమః ॥ 11

టీ:- తదేవం స్వప్నావస్థా దర్శితా. ఇదానీం పునరపి వివేకవత్యా బుద్ధ్యా రమమాణస్య పుత్రాది సంపత్తిం ప్రపంచయిష్యన్ కథా సౌందర్యాయ తస్యాః ప్రణయ కుపితాయాః అనునయం ప్రస్తావసహితమాహ. యావదధ్యాయసమాప్తి. తత ఇతి. ఏయివాన్ ఆగతః కృతం స్నానముచితాహారశ్చ యేన. సంవివేశ శయ్యామాశ్రితః. (11-12)

ఇంతవరకు స్వప్నావస్థను గూర్చి చెప్పి ఇప్పుడు వివేకవతియైన బుద్ధిచే రమించుచున్న పురంజనుని పుత్రాది సంతతిని వివరించుచూ, కథా సౌందర్యము కొరకు అధ్యాయ పరిసమాప్తి పర్యంతం ప్రణయ కుపితయైన పురంజని అనునయమును ప్రస్తావిస్తున్నాడు. తర్వాత పురంజనుడు ఆకలిదప్పులచే అలసి వేటనుండి తిరిగి ఇంటికి వచ్చి స్నానముచేసి ఆహారమును స్వీకరించి శ్రమ తొలిగినవాడై శయ్యను పొందినాడు. (శయనించినాడు) 11

శ్లో॥ ఆత్మానమర్హయాంచక్రే ధూపాలేప స్రగాదిభిః ।
సాధ్వలంకృత సర్వాంగో మహిష్యామాదధే మనః ॥ 12

ధూపము, గంధ లేపనము, పుష్ప మాలాధారణముచేత తన నలంకరించుకొని; చక్కగా అలంకరింపబడ్డ సర్వావయవములు గలిగిన పురంజనిపై మనస్సుగలవాడయెను. 12

శ్లో॥ తృప్తోహృష్టస్సుదృప్తశ్చ కందర్పాకృష్టమానసః ।
న వ్యచష్టవరారోహాం గృహిణీం గృహమేధినీమ్ ॥ 13

టీ:- తృప్త ఇతి. కథంభూతః తుష్టః బాహ్యేచ్ఛారహితః హృష్టః సంతోషం ప్రాప్తః. అత ఏవ సుష్ఠు దృప్తః ఆత్మానమన్యం వా నజానాతి. సంతోషే కారణమాహ - కందర్పేతి. కం స్వరూపసుఖం దర్పయతి ప్రకటయతీతి కందర్పః స్వాపః. తేనాకృష్టం మానసం యస్య సః తథా గృహమేధినీం సాత్వికీం బుద్ధిం రాజస్యాం బుద్ధ్యాం వర్తమానో నాపశ్యత్. 13

తృప్తిచెంది సంతోషముతో మిక్కిలి గర్వించియున్న పురంజనుడు మన్మథుడిచే ఆవరించిన మనస్సుగలవాడై "రాజసీబుద్ధి గలవాడై" గృహమును చక్కదిద్దే గృహిణిని, సాత్వికీబుద్ధిని కనలేదు. (చూడలేదు) (13)

శ్లో॥ అంతఃపురస్త్రియోఽపృచ్ఛద్విమనా ఇవవేదిషన్ ।
అపివః కుశలం రామాస్సేశ్వరీణాం యథా పురా ॥ 14

టీ:- అంతఃపురేతి. హే వేదిషన్ ప్రాచీనబర్హిః అంతఃపురస్త్రియఃతత్సఖీః సేశ్వరీణాం స్వామినీ సహితానాం. యదాపురేత్యాది పృథగ్వాక్యం. 14

ఓ బర్హిష్మంత మహారాజా! చెడిన మనస్సుగల వానివలె అంతఃపురమందలి ఆమె సఖురాళ్ళను ఈ విధముగా అడిగెను. ఓ యువతులారా! మీ స్వామినీ సహిలైన మీరు పూర్వమువలె క్షేమముగా యున్నారా! 14

శ్లో॥ న తథైవ హిరోచంతే గృహేషు గృహసంపదః ।
యదిన స్యాద్గృహే మాతాపత్నీ వా పతి దేవతా ।
వ్యంగేరథ ఇవ ప్రాజ్ఞః కో నామాసీత దీనవత్ ॥ 15

టీ:- నేతి. వ్యంగే చక్రాది హీనే. 15

తల్లిగాని, పతియే దేవతగాగల ఇల్లాలుగాని లేని ఇంటిలో సంపదలు రుచింపవు. శిథిలమైన రథమును ప్రాజ్ఞుడధిరోహించనట్లు, వివేకియైనవాడు అటువంటి ఇంటిలో యుండడు. 15

శ్లో॥ క్వ వర్తతే సా లలనా మజ్జంతం వ్యసనార్ణవే ।
యామాముద్ధరతి ప్రాజ్ఞా భోధయంతీ పదేపదే ॥ 16

టీ:- క్వేతి. పదే పదే క్షణే క్షణే కర్తా భోక్తా సుఖదుఃఖయోరితి ప్రాజ్ఞామత్స్వరూపం దర్శయంతీ యామాముద్ధరితి. 16

కష్టసముద్రమున మునుగుచున్న నా వివేకశక్తిని అడుగడుగునా ఉద్దీపనము చేయుచూ నన్ను ఉద్ధరించుచున్న ఆ సుందరి ఎక్కడున్నది? (16)

**రామా ఊచుః**

శ్లో॥ నరనాథ న జానీమస్త్వత్ప్రియా యద్వ్యవస్యతి ।
భూతలే నిరవస్తారే శయానాం పశ్య శత్రుహన్ ॥ 17

టీ:- నరనాథేతి. నిరవస్తారే ఆస్తరణ రహితే. 17

**సఖురాళ్ళు ఇట్లు పలుకుచున్నారు.**

ఓ మహారాజా శత్రువులను సంహరించువాడా! నీ ప్రియురాలు ఏమి నిశ్చయించినదో మాకు తెలియదు. పరుచుకొనుటకు చాపగూడా లేకుండా భూమియందు పరుండియున్న ఆమెను చూడుము. 17

**నారద ఉవాచ**

శ్లో॥ పురంజనస్స్వమహిషీం నిరక్ష్యావధుతాం భువి ।
తత్సంగోన్మథితజ్ఞానో వైక్లబ్యం పరమం యయౌ ॥ 18

టీ:- పురంజన ఇతి. అవధుతాం త్యక్తదేహాదరాం తత్సంగేనోన్మథితం వ్యాకులం జ్ఞానం యస్య. 18

**నారదుడు ఈ విధముగా పలికెను.**

దేహముపై ఆదరమును విడిచి, నేలపై పడియున్న తన పట్టమహిషిని చూచిన పురంజనుడు ఆమె సంగము కొరకు వ్యాకులమైన జ్ఞానముచే (చిత్తముచే) మిక్కిలి ఆందోళన చెందెను. 18

శ్లో॥ సాంత్వయన్ శ్లక్ష్ణయా వాచాహృదయేన విదూయతా ।
ప్రేయస్యాః ప్రేమసంరంభ లింగమాత్మని చాధ్యగాత్ ॥ 19

టీ:- సాంత్వయన్నితి. ప్రేమసంరంభః ప్రణయకోపస్తస్య లింగం కుటిలదృష్ట్యాది ఆత్మని స్వస్మిన్ లబ్ధవాన్. 19

దుఃఖహృదయముగల పురంజనుడు, మధురమైన వచనములచే ఆమెను ఓదార్చుచూ, ప్రియురాలి ప్రణయ కోపమునకు కారణమైన వంకర చూపులకు కారణమును తెలిసికోలేకపోయెను. 19

శ్లో॥ అనునిన్యేఽథ శనకైర్వీరోఽనునయ కోవిదః ।
పస్పర్శపాదయుగళమాహ చోత్సంగలాలితాత్ ॥ 20

టీ:- అనునిన్య ఇతి. ఉత్సంగమంకమారోప్య లలితాం. 20

వీరుడు, అనునయించుటలో పండితుడైన పురంజనుడు మెల్లగా అనునయించెను. పాదద్వంద్వమును తాకెను. మరియు తొడపై కూర్చుండబెట్టుకొని లాలించుచూ పురంజనిని ఉద్దేశించి ఇట్లు పలికెను. 20

శ్లో॥ నూనం త్వకృతపుణ్యాస్తే భృత్యా యేష్వీశ్వరాశ్శుభే ।
కృతాగస్స్వాత్మసాత్కృత్వా శిక్షాదండం న యుంజతే ॥ 21

టీ:- నూనమితి. కృతమాగః అపరాధో యైస్తేషు. ఆత్మసాత్కృత్వా అస్మదధీనోఽయమితి మత్వా శిక్షార్థం దండం న కుర్వంతి. తే భృత్యాః మందభాగ్యాః. 21

ఓ శుభులారా! మిక్కిలి పుణ్యరహితులైన వారు, వారి భృత్యులు తప్పుచేసినప్పటికీ, పాపముగలవారైనప్పటికీ, వారిని నా అధీనమున గలవారని శిక్షించుటకు దండమును నిర్ణయించరో, ఆ భృత్యులు మందభాగ్యులు..21

శ్లో॥ పరమోఽనుగ్రహో దండోభృత్యేషు ప్రభుణార్పితః ।
బాలో న వేద తత్తన్వి బంధుకృత్యమమర్షణః ॥ 22

టీ:- పరమ ఇతి. యతః పరమోఽనుగ్రహో దండః. యస్తు దండితో విషీదతి. సోఽజ్ఞ ఇత్యాహ - బాల ఇతి. బంధుకృత్యం శిక్షాకరణం. అమర్షణః క్రోధీ. 22

ఈ సుందరీ! సేవకులు అపరాధము చేసినపుడు ప్రభువు శిక్షించుట గొప్పనైన అనుగ్రహము. దండింపబడినప్పుడు కోపము పొందువాడు అజ్ఞుడు; మూర్ఖుడై క్రోధమూలమున శిక్షాకారణమును తెలియకున్నాడు. 22

శ్లో॥ సా త్వం ముఖం సుదతి సుభ్ర్వనురాగ భార
వ్రీడావిడంబ విలసద్ధసితావలోకమ్ ।
నీలాలకాళిభిరుపస్కృతమున్నసం న
స్స్వానాం ప్రదర్శయ మనస్విని వల్గువాక్యమ్ ॥ 23

ఓ సుందరమైన పలువరుసలు గలదానా! ఓ అందమైన కనుబొమ్మలు గలదానా! ఓ మానవతీ! నీవు మాకు యజమానురాలవు. అందులకు మాకు నీవారలకు ముఖమును చూపుము. ఎట్టి ముఖమనగా! అధికమగు అనురాగము మరియు సిగ్గుచే మాంద్యమును పొంది, ప్రకాశించే చిరునవ్వుల చూపుగల, తుమ్మెదలవంటి నల్లని

టీ:- సేతి. హే సుదతి హే సుభ్రు హే మనస్విని సాత్వమస్మాకం స్వామినీ. అతః స్వానాం నః ముఖం ప్రదర్శయకీదృశం. అనురాగ భారేణ వ్రీడయా చ. యో విళంబః మంధరతా. తేన విలసన్ హసితావలోకో యస్మిన్ నీలాలకా ఏవాళయః. తైరుపస్కృతం భూషితం ఉచ్చనాసికం. వల్గువాక్యం యస్మిన్ తత్. 23

ముంగురులచే, అలంకరింపబడినట్టి; ఎత్తైన ముక్కుగల్గినట్టి, మధుర వాక్కులు గల ముఖము..23

శ్లో॥ తస్మిన్ దధే దమమహం తవ వీరపత్ని
యోఽన్యత్ర భూసురకులాత్కృత కిల్బిషస్తమ్ ।
పశ్యే న వీతభయమున్ముదితం త్రిలోక్యాం
క్రుద్ధస్య మే మురరిపోరితరత్ర దాసాత్ ॥ 24

టీ:- తస్మిన్నితి. హే వీరపత్ని వీరస్య మమ భార్యే. యస్తే కృతాపరాధ స్తస్మిన్. అహం బ్రాహ్మణకులాదన్యత్రఅన్యస్మిన్ మురరిపోర్దాసాత్ భగవద్భక్తాత్. ఇతరత్ర దుమం దధే. దండం కరోమి కింతు తం మిగతభయం. ఉచ్చైర్ముదితం చ. త్రిలోక్యామన్యత్ర లోకత్రయా ద్బహిరపి. న పశ్యామి. మద్భయాదేవ సోఽపి మరిష్యతీత్యర్థః. 24

ఓ వీరపత్నీ! నీయందు అపరాధము చేసినవాడు బ్రాహ్మణుడు గాని, విష్ణుభక్తుడుగాని కాకున్నచో అతడికి శిక్ష వేస్తాను. వాడు మూడు లోకములలోగాని, మూడు లోకములకు బయటగాని భయరహితుడై గొప్ప ఆనందముతో ఉండలేడు. నా భయముచేతనే వాడు చస్తాడు. 24

శ్లో॥ వక్త్రం న తే వితిలకం మలినం విహర్షం
సురంభభీమమవిమృష్టమపేతరాగమ్ ।
పశ్యేస్తనావపి శుచోపహతౌ సుజాతౌ
బింబాధరం విగతకుంకుమపంకరాగమ్ ॥ 25

టీ:- వక్త్రమితి. యం తే వక్త్రమితః పూర్వం కదాచిదపి వితిలకం న పశ్యామి సంరంభేణ కోపావేశేన భీమం భయంకరం. అవిమృష్టమ నుజ్జ్వలం. అపేతరాగం స్నేహశూన్యం తథా తే సుజాతౌ శోభనౌ స్తవావపి శఫకాశ్రుభిరుపహతౌ. న పశ్యామి తథా బింబఫలాకారమధరం చ విగతః కుంకుమ పంకరాగస్తాంబూలరాగో యస్మాత్తాదృశం న పశ్యామి. ఇదానీం కుత ఏవం జాతమితి శేషః. పాఠాంతరే. ఏవం భూతం ముఖం స్తనౌ చ పశ్యన్. శం న విందామిత్యన్వయః. విగతః కుంకుమపంకరాగో యాభ్యామితి స్తనయోర్విశేషణం వా. 25

పూర్వమెప్పుడుగూడా బొట్టులేని, మలినమైన, సంతోషము లేని, కోపముచేత భయాన్ని కల్గించునట్టి, కాంతిరహితమైన, ప్రేమ రహితమైన నీముఖమును చూడలేదు. అట్లే నీ సుందరమైన స్తనములు గూడా సౌందర్యమును కోల్పోవడం చూడలేదు. అట్లే దొండపండువలె, కుంకుమ ముద్దవలె, ఎరుపెక్కిన తాంబూల వర్ణములో లేని పెదవిని ఎప్పుడూ చూడలేదు. ఇప్పుడెందుకు ఈ విధముగా జరిగినది.

"పశ్యంస్తనావపి శుచోపహతే సుజాతే, విందామిశం విగత కుంకుమపంకరాగౌ" అని పాఠాంతరము ఉన్న యెడల అర్థము ఈ విధముగా చెప్పాలి. ఇటువంటి ముఖము (విచారవదనము) కలిగి, దుఃఖముచే తడసిన స్తనముల నుండి కుంకుమ తొలిగి పోయిన నిన్ను చూచి సుఖమును పొందలేకున్నాను. 25

శ్లో॥ తన్మే ప్రసీద సుహృదః కృతకిల్బిషస్య
స్వైరం గతస్య మృగయాం వ్యసనాతురస్య ।
కా దేవరం వశగతం కుసుమాస్త్రవేగ
విస్రస్తపౌంస్కముశతీ న భజేత కృత్యే ॥ 26

టీ:- తదితి. తత్తస్మాత్కృతం కిల్బిషం అపరాధో యేన తస్య. కిల్బిష మేవాహ. స్వైరం స్వాతంత్ర్యేణ. త్వామపృష్ట్వా మృగయాం గతస్య. దివోదేవః సాక్రీడాతాం రాతి. దదాతీతి దేవరః. కాంతః తం. కామవేగేన విస్రస్తం గతం. పౌంస్కం పౌరుషం ధైర్యం యస్య తం. ఉశతీ కామయమానా. కృత్యే కర్తుం యోగ్యే అర్థే. కా న భజేత్. 26

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,
షడ్వింశోऽధ్యాయః

నేను, నిన్ను అడగకుండా వేటకు వెళ్ళడమనే అపరాధమును చేసినాను. అందువలన ప్రేమ కలిగిన నీవు నాయెడల ప్రసన్నురాలవు కమ్ము. దేవనమనగా "క్రీడ" దానిని - దదాతి ఇచ్చువాడు దేవరుడు. కాంతుడు అని అర్థం. భర్తను సేవించే ఏ స్త్రీ, కామ వేగముచేత ధర్యము కోల్పోయిన భర్తను, యోగ్యమైన అర్థమందు, యోగ్యమైన దేశమున, కాలమున సేవించకుండును? 26

శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు
ఇరువది ఆరవ అధ్యాయము సమాప్తము.

## సప్తవింశోఽధ్యాయః

### శ్రీ నారద ఉవాచ

శ్లో॥ సప్తవింశే ప్రియా పుత్రాద్యాసక్తా విస్మృతాత్మనః ।
కాలకన్యాద్యుపాఖ్యానైర్జరా రోగాద్యుదీర్యతే ॥

తదేవం జీవస్యానునయాది కథాసౌందర్యేణాత్యంతముపాధి వశ్యత్వముక్త్వా. తన్నిమిత్తాం సంసారపరంపరాం నిరూపయితుమాహ – ఇత్థమితి. అత్ర చ ప్రతిపదం కథంచిదధ్యాత్మ పక్షేఽపి యోజయింతు శక్యమేవ. శ్రీనారదేన తు. జీవస్య స్త్రీపుంసవాసనాదార్ఢ్యేన. విచిత్రా సంసృతిర్భవతీత్యేతావదేవ కథాతాత్పర్యం దర్శితం. శ్లో. "క్వచిత్పుమాన్ క్వచిచ్చ స్త్రీ క్వచిన్నో భయమందధీః, దేవో మనుష్య స్తిర్యగ్వా యథా కర్మగుణం భవ" ఇతి వదతా తత్రాదౌ పుంస్త్వేన సంసృతిరధ్యాయ త్రయేణోక్తా.

## 27 వ అధ్యాయము

ఈ ఇరువది ఏడవ అధ్యాయమున భార్యా పుత్రాదులయందు ఆసక్తి చేత ఆత్మను మరచినవాడిని గూర్చి "కాలకన్యాది" ఉపాఖ్యానములచే ముసలితనము, రోగములను గూర్చి చెప్పుచున్నాడు.

ఈ విధముగా జీవుడిని బుజ్జగించే పద్ధతిలో సుందరమైన కథా పద్ధతిలో మిక్కిలి ఉపాధి వశ్యుడైన జీవుడిని చెప్పి, దాని నిమిత్తంగా వచ్చిన సంసార పరంపరను నిరూపించుటకు చెప్పుచున్నాడు. "ఇత్థమని" ఈ శ్లోకములలో ప్రతిపదమును ఆధ్యాత్మిక పక్షంలోకి ఏదోవిధముగా సమన్వయము చేయవచ్చును. శ్రీ నారదులవారేమో జీవుడికి స్త్రీ, పురుషుల వాసనా ధార్ఢ్యము నిమిత్తము గానే విచిత్రమైన సంసారము కలుగుతుందని ఇదియే కథా తాత్పర్యమని చూపినారు. (మూడు అధ్యాయములచేత) మొట్టమొదలుగా పుం రూపమున సంసార బంధమును చెప్పినారు. పిమ్మట ఒకటవ అధ్యాయమున స్త్రీ రూప సంసార బంధనమును, ప్రదర్శించి ఈశ్వర ప్రసాదము ద్వారా పొందబడిన జ్ఞానముచేత మోక్షమని చెప్పెను. ఆ విషయమునే ఏ విధముగా ఉపయోగించుకోవాలో ఆ పద్ధతిలో వ్యాఖ్యానించడం జరిగినదని పంచాధ్యాయి ఆరంభమని తెలియుచున్నది. ప్రతిపదమును ఆధ్యాత్మిక పరముగా వ్యాఖ్యానించడం సాధ్యంకాదని సాధ్యమైననూ

శ్లో॥ ఇత్థం పురంజనం సధ్ర్యగ్వశమానీయ విభ్రమైః ।
పురంజనీ మహారాజ్ఞీ రేమే రమయతీ పతిమ్ ॥ 1

టీ:- తతశ్చైకేనాధ్యాయేన స్త్రీత్వేన సంసృతిం ప్రదర్శ్య ఈశ్వర ప్రసాద లబ్ధజ్ఞానేన మోక్ష ఇత్యుక్తం. తతస్తదేవ యథోపయోగం వ్యాఖ్యాతమితి పంచమాధ్యాయార్థః ప్రతీయతే. ప్రతిపదమధ్యాత్మ యోజనా తు దుర్ఘటా నిష్ప్రయోజనా చేతి స్వప్రౌఢిప్రఖ్యాపనాదృత్య. యథోపయోగమేవ వ్యాఖ్యాస్యామః. సధ్ర్యక్ సమ్యక్ విలాసైః. 1

శ్లో॥ స రాజా మహిషీం రాజన్ సుస్నాతాం రుచిరాంబరామ్ ।
కృతస్వస్త్యయనాం తృప్తామభ్యనందదుపాగతామ్ ॥ 2

టీ:- స ఇతి. కృతం స్వస్త్య యనం మంగళం కుంకుమ సింధూరాది భిర్యస్యాః. 2

నిష్ప్రయోజనమని. ఒకవేళ వ్యాఖ్యానించినచో పాండిత్య ప్రదర్శనము చూపెట్టడమే తప్ప ఏ ప్రయోజనము లేదని, ఆ ప్రక్రియను ఒదిలిపెట్టి ఎక్కడ ఎంత ఉపయోగమో ఆ విధముగానే వ్యాఖ్యానించగలము.

నారదులవారు ప్రాచీనబర్హి మహారాజుతో ఈ విధముగా పలుకుచున్నారు. ఓ మహారాజా! ఈ విధముగా (పురంజనుని) భర్తను తన విలాసములచేత వశపరచుకొని పురంజని తాను రమిస్తూ రమింపచేసెను. 1

అందమైన ముఖము గలిగి, ఋతుస్నాతయై, కుంకుమ సింధూరాదులచే మంగళ స్వరూపిణియైన, సంతృప్తితో తన వద్దకు వచ్చిన పట్టమహిషిని ఆ మహారాజు అభినందించెను. 2

శ్లో॥ తయోపగూఢః పరిరబ్ధకంధరో
రహోనుమంత్రైరపకృష్ణచేతనః ।
న కాలరంహో బుబుధే దురత్యయం
దివానిశేతి ప్రమదాపరిగ్రహః ॥ 3

టీ:- తయేతి. ఉఫగూడః పరిరబ్ధః పరిరబ్ధా కంధరా తస్యా యేన. రహః ఏకాంతే అనుమంత్రైః అనుకూలైర్గుహ్యాభాషణైః అపకృష్ణా చేతనా వివేకో యస్య. కాలరంహః ఆయుర్వ్యయః ప్రమదైవ పరిగ్రహో జ్ఞానసాధనం యస్య. 3

శ్లో॥ శయాన ఉన్నద్ధమదో మహామనా
మహార్హతల్పే మహిషీభుజోపధిః ।
తామేవ వీరో ఽ నుమతవ్యవాయత
స్తమోభిభూతో న నిజం పరం యత్ ॥ 4

టీ:- శయాన ఇతి. మహార్హతల్పే ఉత్కృష్టశయ్యాయాం శయానః మహిష్యా భు ఉపధిరుపధానం ఉచ్ఛీర్షకం యస్య. అవిసర్గపాఠే శయన క్రియావిశేషణం. తాం మహిషీమేవ పరంపురుషార్థమమన్యత స తు యన్నిజం రూపం బ్రహ్మతత్ తమసా అజ్ఞానే నాభిభూతో యతః. 4

ఆమెచేత కౌగలింపబడినవాడై, ఆమె మెడచుట్టూచేతులు వేసి కౌగలించుకొని ఏకాంతమున, కామప్రేరణాను కూలమైన రహస్య భాషణములచే, వివేకము కోల్పోయి ఆమెయే జీవితధ్యేయమై "జ్ఞానసాధనముధ్యేయముగా పెట్టుకొనక" పగలు, రాత్రిళ్ళు గడుపుచూ, దాటడానికి శక్యముగాని ఆయుర్వ్యయమును తెలుసుకొనలేక పోయెను. 3

వీరుడైన పురంజనుడు అజ్ఞానముచేత ఆవృతుడై, (కప్పబడిన) మదగర్వితుడై, మిక్కిలి అభిమానము గలవాడై, తన పత్నీ భుజమునే తలగడగా పెట్టుకొని గొప్ప తల్పముపైన పరుండి ఆ పట్టమహిషియే, పరమ పురుషార్థముగా భావించి తన నిజరూపము పరబ్రహ్మాయని తెలియక పోయెను. 4

శ్లో॥ తయైవం రమమాణస్య కామ కశ్మల చేతసః ।
క్షణార్ధమివ రాజేంద్ర వ్యతిక్రాంతం నవం వయః ॥ 5

టీ:- తయేతి. నవం వయః పరిశుద్ధజ్ఞానానందస్వరూపం వ్యతిక్రాంతం గతప్రాయమాసీత్. 5

ఓ రాజా! కామముచే కలుషితమైన మనస్సు గలిగి, ఈ విధముగా ఆమెచే రమించుచున్న ఆ పురంజనునకు నూతనమైన వయస్సు (యవ్వనము) అర్ధ క్షణమువలె గడిచిపోయెను. 5

శ్లో॥ తస్యామజీజనత్పుత్రాన్ పురంజన్యాం పురంజనః ।
శతాన్యేకాదశ విరాడాయుషోఽర్ధమథాత్యగాత్ ॥ 6

టీ:- తస్యామితి. పుత్రాన్ ఇంద్రియపరిణామాన్. 6

శ్లో॥ దుహితౄర్దశోత్తరశతం పితృభాతృ యశస్కరీః ।
శీలౌదార్య గుణోపేతాః పౌరంజన్యః ప్రజాపతే ॥ 7

టీ:- దుహితౄరితి దుహితౄః తదనంతరబుద్ధివృత్తీః. పుత్రసంఖ్యా చ బాహుళ్యమాత్రవివక్షయా. దుహితృసంఖ్యా తు పుత్రేభ్యో న్యూనత్వేన గార్హస్థ్య సౌందర్యార్థం. విరాట్. సమ్రాట్. ఆయుషోఽర్ధశమిత్యాద్యపి కథా సౌందర్యార్థమేవ. పురంజన కన్యాత్వాత్పౌరంజన్యః హే ప్రజాపతే. 7

ఓ ప్రజాపతీ! ఆ పురంజని యందు ఈ సమ్రాట్ నూట పదకొండు మంది కుమారులను, నూట పదిమంది శీల ఔదార్య గుణములుగల కలిగి, తల్లిదండ్రులకు కీర్తి తెచ్చునట్టి పురంజన కన్యలు (పౌరంజనిలను) కనెను. ఈ లోపల సగమాయుస్సు గడచిపోయినది. ఇంద్రియ పరిణామములే పుత్రులు, బుద్ధివృత్తులే కన్యలు. కూతురుల -కన్న కుమారుల సంఖ్య ఎక్కువగా చెప్పడం గృహస్థ్య సౌందర్యార్థమే. అనగా ఎక్కువ మంది కుమారులుండుట గృహాలంకారణము, ఆయుస్సు సగము గడచెననుట కథా సౌందార్యార్థమే. (6-7)

శ్లో॥ స పాంచాలపతిః పుత్రాన్ పితృవంశ వివర్ధనాన్ ।
దారైస్సంయోజయామాస దుహితౄస్సదృశైర్వరైః ॥ 8

టీ:- స ఇతి. దారైః పరిణామానంతరం హితాహితచింతాభిః వరైరుచిత విషయభోగైః. 8

పంచాల దేశాధిపతియైన పురంజనుడు పితృవంశమును వృద్ధి చేసే పుత్రులను భార్యలతో (వధువులతో), కుమార్తెలను సదృశులైన వరులతో కలిపెను. ఇంద్రియ పరిణామములే పుత్రులని చెప్పుకున్నాం. భార్య లనగా హిత్యాహిత చింతనలే, బుద్ధి వృత్తులే కుమార్తెలని చెప్పుకున్నాం. ఇచ్చట వరులనగా అనుకూలమైన విషయ భోగములే అని అన్వయించుకొనవలెను. 8

శ్లో॥ పుత్రాణాం చాభవన్ పుత్రా ఏకైకస్యా శతంశతమ్ ।
యైర్వైపౌరంజనో వంశః పాంచాలేషు సమేధితః ॥ 9

టీ:- పుత్రాణామితి. పుత్రాణాం పుత్రాః కర్మాణి. పాంచాలేషు శబ్దాది విషయేషు. 9

ఆ పుత్రులకు ఒక్కొక్కరికి నూరు మంది కుమారులు గలిగిరి. పాంచాల దేశమునందు వారు పురంజన వంశమును వృద్ధి పొందించిరి. పుత్రులకు పుత్రులు కలగడమనగా కర్మలని అర్థం. పాంచాల దేశమందు వృద్ధి పొందిరి అనగా శబ్దాది విషయములయందు అని తాత్పర్యం. 9

శ్లో॥ తేషు తద్రిక్థహారేషు గృహకోశానుజీవిషు ।
నిరూఢేన మమత్వేన విషయేష్వన్వబధ్యత ॥ 10

టీ:- తేష్వేతి. తేషు పుత్రాదిషు తేషామపి యే రిక్థహరాః పుత్రాస్తేషు చ. (10-11)

కుమారులయందు, వారి కుమారులయందు (మనుమలు) ఇండ్లు, ధనము, పరిచారకుల యందు మిక్కిలి మమకారము పెంచుకొని భోగ్య పదార్థము యందు బద్ధుడాయెను. 10

శ్లో॥ ఈజే చ క్రతుభిర్ఘోరైర్దీక్షితః పశుమారకైః ।
దేవాన్ పితౄన్ భూతపతీన్నానాకామో భవాన్ యథా ॥ 11

సాత్త్విక, రాజసిక, తామసిక కామనలు కలిగి ఆ పురంజనుడు ఆ కోరికలు తీరడానికి పశుమారకములైన అనేక క్రతువులచే దేవతలను, పితరులను, భూతపతులను నీ వలె ఆరాధించెను. 11

శ్లో॥ యుక్తేష్వేవం ప్రమత్తస్య కుటుంబాసక్తచేతసః ।
ఆససాదస వై కాలో యోఽప్రియః ప్రియయోషితామ్ ॥ 12

టీ:- యుక్తేష్వితి. యుక్తేషు ఆత్మహితేషు కర్మసు. అనవహితస్య. యః కాలః అప్రియో భవతి. తేషాం. ప్రియాః యోషితో యేషాం తేషాం కామినామిత్యర్థః. స వై కాలః జరా సమయః. 12

ఈ విధముగా తనకు నిజముగా హితము చేయు కర్మలయందు శ్రద్ధలేనివాడై కేవలము సంసారముయందే ఆసక్తి గలవాడై యుండగా తనకు అత్యంత ప్రియులైన స్త్రీలకు ఏది ఇష్టముండదో ఆ ముసలితనము రానే వచ్చినది. 12

శ్లో॥ చండవేగ ఇతి ఖ్యాతో గంధర్వాదిపతిర్నృప ।
గంధర్వాస్తస్య బలినష్షష్ట్యుత్తరశతత్రయమ్ ॥ 13

టీ:- చండవేగ ఇతి. చండవేగః సంవత్సరేణావర్తమానేనోపలక్షితః. గంధర్వాః దివసాః. 13

ఓ రాజా! చండవేగుడను ఒక గంధర్వ రాజు గలడు. అతడు ప్రసిద్ధుడు. అతడికి బలశాలురైన మూడువందల అరవై మంది గంధర్వులు గలరు. చండవేగుడు సంవత్సరము; గంధర్వులు పగళ్ళు (13)

శ్లో॥ గంధర్వ్యస్తాదృశీరస్య మైథున్యశ్చ సితా సితాః ।
పరివృత్త్యా విలుంపంతి సర్వకామ వినిర్మితామ్ ॥ 14

తెలుపు, నలుపు గలిగిన గంధర్వస్త్రీలు ఆ గంధర్వులతో జతకట్టి యుండెదరు. అన్ని భోగములచే నిర్మితమైన నగరమును ఒకరి పిమ్మట

టీ:- గంధర్వ ఇతి. గంధర్వ్యో రాత్రయః తాదృశీః తాదృశ్యః. మైథున్యః దివసైరేవమిథునీభూయ స్థితాః సితాశ్చాసితాశ్చ శుక్ల కృష్ణపక్షీయాః పరిభ్రమణేనైవ సర్వైః కామైస్సహ వినిర్మితాం పురీం అపహరంతీ. 14

శ్లో॥ తే చండవేగానుచరాః పురంజనపురీం యథా ।
హర్తుమా రేభిరే తత్ర ప్రత్యషేధత్ప్రజాగరః ॥ 15

టీ:- త ఇతి. ప్రజాగరః ప్రాణః. 15

శ్లో॥ ససప్తభిశ్శతైరేకోవింశత్యా చ శతం సమాః ।
పురంజన పురాధ్యక్షో గంధర్వైర్యుయుధే బలీ ॥ 16

టీ:- స ఇతి. విశంత్యా చ సహ. 16

శ్లో॥ క్షీయమాణే స్వసంబంధ ఏకస్మిన్బహుభిర్యుధి ।
చింతాం పరాం జగామార్తస్సరాష్ట్రపురభాంధవః ॥ 17

టీ:- క్షీయమాణ ఇతి. స్వసంబంధే స్వసంబంధినీ ప్రాణే. 17

ఒకరు దోపిడి చేస్తున్నారు. అనగా - గంధర్వులనగా పగటి కాలమని చెప్పుచున్నారు. గంధర్వ స్త్రీలనగా రాత్రులు, కలసియనగా ఈ పగలు రాత్రులు; తెలుపు, నలుపు లనగా శుక్లపక్ష, కృష్ణపక్షముల యందని.. 14

ఆ చండవేగుని అనుచరులు పురంజనుని పురమును ఎప్పుడైతే అపహరించడం ప్రారంభించినారో, ప్రజాగరుడనే ఐదు తలల పాము అడ్డుపడెను. ఇచ్చట పాము అనగా ప్రాణమని అర్థము. 15

ఆ పురంజన పురమునకు అధ్యక్షుడైన ప్రజాగరుడు ఏడువందల ఇరువది మంది గంధర్వులచే నూరు సంవత్సరములు పోరాడినాడు. 16

తనకు సంబంధించిన ప్రజాగరుడను సర్పము చాలామందితో యుద్ధముచేసి అలసిపోవుచుండగా చూచి దేశమునకు, రాష్ట్రమునకు ప్రభువైన పురంజనుడు పీడను పొందినవాడై మిక్కిలి చింతను పొందెను. (ఇచ్చట సంబంధ ప్రాణమే సర్పము.) 17

శ్లో॥ స ఏవ పుర్యాం మధుభుక్పాంచాలేషు స్వపార్షదైః ।
ఉపానీతం బలిం గృహ్ణన్ స్త్రీజితో నావిదద్భయమ్ ॥ 18

టీ:- సఇతి.సఏవ మధుభుక్ క్షుద్రసుఖభోక్తా. స్వపార్షదైరింద్రియైః నావిదన్నాలోచితవాన్. 18

ఆ పురంజనుడు భార్యావశుడై ఆ పురముయందు మధువును గ్రోలుచూ పంచాల దేశములయందు తన అనుచరులచే తీసుకు రాబడిన కప్పమును స్వీకరిస్తు భయమును గూర్చి తెలుసుకోలేదు.

మధువును గ్రోలడమంటే అల్పమైన భోగములననుభవించుటే తన సేవకులనగా ఇంద్రియములే, తెలియకున్నాడంటే తన గూర్చి ఆలోచించకపోవడమే. 18

శ్లో॥ కాలస్య దుహితా కాచిత్త్రిలోకీం వరమిచ్ఛతీ ।
పర్యటత్తాం న బర్హిష్మన్ ప్రత్యనందత కశ్చన ॥ 19

టీ:- కాలస్యేతి. కాలస్య దుహితా జరా స్త్రీ తాం న ప్రత్యనందత్. నైచ్ఛత్. బర్హిష్మన్ హే ప్రాచీనబర్హిః. 19

ఓ బర్హిష్మంత మహారాజా! ఇంతలో కాలము యొక్క కుమార్తె యైన ఒకానొక స్త్రీ తనకు వరుడు కావాలని మూడు లోకాలు తిరుగుచుండగా ఎవ్వరుగూడా ఈమెను వరించలేదు. (కాలము యొక్క కన్యయనగా ముసలితనమే). 19

శ్లో॥ దుర్భగేనాత్మనా లోకే విశ్రుతా దుర్భగేతి సా ।
యా తుష్టా రాజ ఋషయే వృతాదాత్పూరవే వరమ్ ॥ 20

టీ:- దుర్భగేనేతి. పూరవే యయాతిపుత్రాయ తేన వృతాసతీ వరమదాత్. యయాతిః శుక్రశాపాజ్జరాం ప్రాప్య పుత్రనువాచ. ఇమాం

ఆమె చాలా దురదృష్టవంతురాలగుటచే లోకమున దుర్భగా యని ప్రఖ్యాతిని పొందినది. ఈ దుర్భగనే ఒకప్పుడు రాజర్షియైన పూరువు తనను వరించినందుకు రాజ్యాధికారమును కట్టపెట్టినది.

ఒకప్పుడు యయాతి మహారాజు శుక్రుడి శాపము వల్ల ముసలి తనమును పొంది, ఎవరైనా నా ముసలితనమును స్వీకరించండని,

గృహ్ణితేతి. తాం జేష్ఠశ్చత్వారోన జగృహుః. పూరుస్తు జగృహే. తతో యయాతిః తస్మై రాజ్యం దదావితి. జరైవాదాదిత్యుక్తం. (20-21)

తన ఐదుగురు కుమారులను అడిగినాడు. పెద్దవారైన నలుగురు అంగీకరించలేదు. అప్పుడు యయాతి, రాజ్యాధికారము ఉండకుండు గాక! అని వారిని శపించినాడు. చిన్నవాడైన పూరువు ముసలితనమును స్వీకరించుటకు అంగీకరించినాడు. అప్పుడు యయాతి సంతోషించి అతనికి రాజ్యాధికారమిచ్చినాడు. వృద్ధత్వ స్వీకరణ మూలముగా కలిగినది కనుక ముసలితనమే ఇచ్చినట్లైయ్యెను. 20

శ్లో॥ కదాచిదటమానా సా బ్రహ్మలోకాన్మహీం గతమ్ ।
వవ్రే బృహద్వ్రతం మాం తు జానతీ కామమోహితా ॥ 21

ఒకనాడు కామమోహితయై తిరుగాడుచూ బ్రహ్మలోకమునుండి భూలోకమునకు వచ్చుచున్న నన్ను (నారదుణ్ణి) నైష్ఠికుడని తెలిసి గూడా వరించినది. 21

శ్లో॥ ప్రత్యాఖ్యాతామయా సా తు కాలకన్యా విశాంపతే ।
మయి సంరభ్య విపులమదాచ్ఛాపంసు దుస్తరమ్ ।
స్థాతుమర్హసి నైకత్ర మద్యాచ్ఞావిముఖో మునే ॥ 22

నేను ఒప్పుకొనకపోవడం ద్వారా కోపించినదై ఓ మునీ! నా కోరికకు విముఖుడవైనావు కనుక నీవు ఒకచోట ఉండకుందువు గాకయని సహించరాని శాపము నిచ్చినది. 22

టీ:- ప్రత్యాఖ్యాతేతి. ప్రత్యాఖ్యాతవతీ మయి సంరభ్య క్రోధం కృత్వా. నైకత్రస్థాతుమర్హసీతి శాపమదాత్. 22

శ్లో॥ తతో విహతసంకల్పా కన్యకా యవనేశ్వరం ।
మయోపదిష్టమాసాద్య వవ్రే నామ్నాభయం పతిమ్ ॥ 23

టీ:- తత ఇతి. అథయో వ్యాధయశ్చ యవనాస్తేషామీశ్వరం భయనామానం వవ్రే. 23

పిమ్మట తన సంకల్పము ఫలించినిదై, నాచే సూచింపబడిన యవనేశ్వరుడైన భయమను పేరుగల వాడిని వరించినది. “శారీరక మానసిక రోగములే యవనములు వాటికీశ్వరుడు భయము అనువాడు”. 23

శ్లో॥ ఋషభం యవనానాం త్వాం వృణే వీరేప్సితం పతిమ్ ।
సంకల్పస్త్వయి భూతానాం కృతః కిల నరిష్యతి ॥ 24

టీ:- ఋషభమితి. హే వీరత్వామీప్సితం పతిం వృణే. నరిష్యతి న నశ్యతి. 24

ఓ వీరా! యవనులలో ఋషభము వంటి నిన్ను, నా మనస్సుకు నచ్చిన భర్తగా వర్ణించుచున్నాను. నీ యందు ప్రాణులచే చేయబడిన సంకల్పము విఫలము కాదుకదా. 24

శ్లో॥ ద్వావిమావనుశోచంతి బాలావసదవగ్రహౌ ।
యల్లోక వేదోపనతం దదాతి న తదిచ్ఛతి ॥ 25

టీ:- ద్వావితి. లోకతో వేదతశ్చ యద్దేయత్వేన గ్రాహ్యత్వేన చ. ఉపనతం ప్రాప్తం. తద్యాచ్యమానం యోన దదాతి యశ్చ దీయమానం నేచ్ఛతి న గృహ్ణాతి. ఇమౌ ద్వౌ కర్మభూతౌ అనుశోచంతి సంతః. 25

లోకమర్యాద, శాస్త్రబోధ చేత, ఇచ్చుటకు యోగ్యమై దానిని అడిగినప్పటికీ ఇవ్వనివాడు; స్వీకరించుటకు యోగ్యమైన దానిని ఇచ్చుచున్నా స్వీకరించనివాడు, బాలునివలె అజ్ఞుడని మహాత్ములు చెప్పెదరు. 25

శ్లో॥ అతో భజస్వ మాం భద్ర భజంత్యా మే దయాం కురు ।
ఏతావాన్పౌరుషోధర్మో యదార్తాననుకంపతే ॥ 26

టీ:- అత ఇతి. పురుషేణ కర్తవ్యో ధర్మః పౌరుషః. 26

అందువల్ల ఓ మంగళకరుడా! నిన్ను కోరుచున్న నన్ను స్వీకరించు. నాయందు దయచూపు. దీనులయందు దయను చూపడమే పురుషుడు చేయవలసిన (ఆచరించవలసిన) ధర్మము. దీనినే పౌరుషమందురు. 26

శ్లో॥ కాలకన్యోదిత వచో నిశమ్య యవనేశ్వరః ।
చికీర్షతీం దేవగుహ్యం సస్మితం తామభాషత ॥ 27

టీ:- కాలకన్యేతి. దేవగుహ్యం మరణం తద్ధి ప్రాణినాం వైరాగ్యాను దయాయ దేవైర్గోప్యతే. 27

కాలకన్య మాట్లాడిన మాటలను విని యవనేశ్వరుడు దేవతలచేత రహస్యముగా ఉంచబడిన దానిని చేయదలచి చిరునగవుతో కూడిన వాడై ఆమెతో ఇట్లు పలికెను. ఇక్కడ దేవగుహ్యమనగా "మరణమే" దానిని దేవతల ఎందుకు రహస్యముగా ఉంచుతారంటే ప్రాణులకు వైరాగ్యము కలగకుండా ఉండటానికి.. 27

శ్లో॥ మాయానిరూపితస్తుభ్యం పతిరాత్మసమాధినా ।
నాభినందతి లోకోఽయం త్వామభద్రామసత్తమామ్ ॥ 28

టీ:- మయేతి. తుభ్యం తవ ఆత్మసమాధినా జ్ఞానదృష్ట్యా యాచ్యమనోఽయం లోకః త్వాం నేచ్ఛతి. 28

ఓ కాలకన్యకా! ఏకాగ్ర చిత్తముతో ఆలోచించి నీకు భర్తను నిర్ణయించితిని. కావాలి కావాలి అనే ఈ లోకము, అమంగళప్రదమైన, సమ్మతము కాని నిన్ను మాత్రము కోరడంలేదు. 28

శ్లో॥ త్వమవ్యక్త గతిర్భుంక్ష్వ లోకం కర్మవినిర్మితమ్ ।
యా హి మే పృతనా యుక్తా ప్రజానాశం ప్రణేష్యతి ॥ 29

కర్మనిర్మితమైన ఈ లోకమును నీవనుభవించు. నీవెక్కడనుండి వచ్చినావో గూడా తెలియని మార్గము గలదానవు. నీవు ఈ సమస్త

టీ:- త్వమితి. అతో అవ్యక్తగతిః. కుతః ప్రాప్తేత్యలక్షితగతిస్సతీ. లోకమాక్రమ్య భుంక్ష్వ ఏవం సర్వోఽపి లోకస్తవ పతిర్గతిశ్చస్తాదిత్యర్థః. న చైవం త్వయా శంకనీయం మాం ప్రతికూలాం లోకో హనిష్యతీతి. యస్మాత్త్వమేవ ప్రజానాశం కరిష్యసీత్యాహ - యాహీతి. యా మదీయా యవనపృతనా తయా యుక్తా. 29

శ్లో॥ ప్రజ్వారోఽయం మమభ్రాతా త్వం చ మే భగినీ భవ ।
చరామ్యుభాభ్యాం లోకేఽస్మిన్న వ్యక్తో భీమసైనికః ॥ 30

టీ:- కించ ప్రజ్వార ఇతి. ప్రజ్వార ఇతి మారకో వైష్ణవో జ్వరః. మహేశ్వరస్య వ్యాధ్యంతః పాతిత్వాత్ భీమాః ఘోరాః సైనికా యస్య. 30

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే, సప్తవింశోఽ ధ్యాయః**

లోకమునకు పతి అవుతావు. ప్రతికూలురాలైన నన్ను ఈ లోకము చంపుతుందని నీవు శంకించరాదు. నా సైన్యముతో కూడిన దానవై నీవే సకల ప్రాణులను నశింపచేయగలవు. 29

ఈ ప్రజ్వారుడు నా తమ్ముడు. నీవు నాకు చెల్లెలివి కమ్ము. భయంకరమైన సైన్యమును కలిగి నేను ఎవ్వరికి తెలియబడని వాడనై ఈలోకమున మీ ఇద్దరితో సంచరించెదను. ప్రజ్వారమనగా మరణమును కలిగించు వైష్ణవ జ్వరము. మాహేశ్వర జ్వరము వ్యాధులను కలిగించును. 30

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు ఇరువది ఏడవ అధ్యాయము సమాప్తము.**

## అష్టావింశోఽధ్యాయః

శ్లో॥ అష్టావింశే తు వైదర్భ్యాఖ్యానేన స్త్రీ విచింతయా ।
స్త్రీత్వం ప్రాప్తస్య దైవేన కదాచిన్ముక్తిరుచ్యతే ॥

**శ్రీ నారద ఉవాచ**

శ్లో॥ సైనికాభయనామ్నో యే బర్హిష్మన్ దిష్టకారిణః ।
ప్రజ్వార కాలకన్యాభ్యాం విచేరురవనీమిమామ్ ॥ 1

టీ:- ఇదానీం పురంజనస్య పుందేహత్యాగ ప్రకారపూర్వకం స్త్రీత్వ ప్రకారమాహ - సైనికా ఇత్యాది. రాజసింహస్య వేశ్మనీత్యంతేన. దిష్టం దైవం కుర్వంతీతి తథా మృత్యోరాదేశకారిణ ఇతి వా. 1

శ్లో॥ త ఏకదా తు రభసాః పురంజనపురీం నృప ।
రురుధుర్భౌమభోగాఢ్యాం జరత్పన్నగా పాలితామ్ ॥ 2

టీ:- త ఇతి. ప్రారబ్ధకర్మక్షయే సైనికా వ్యాధయః రురుధుః. భౌమభోగాఢ్యాం ఖాదన పానాదినా స్థూలాం. యౌవన ఇతి శేషః. జరత్పన్నగేన జీర్ణప్రాణేన పాలితాం. 2

## 28 వ అధ్యాయము

ఈ ఇరువది ఎనిమిదవ అధ్యాయమున వైదార్భ్యాఖ్యానమున- స్త్రీ చింతనచేత స్త్రీత్వాన్ని పొందిన పురంజనుడు దైవ బలముచే ముక్తిని పొందుట తెలుపబడినది.

**నారుదుడు ఈ విధముగా పలికెను.**

ఓ బర్హిష్మంత మహారాజా! భయుడని ప్రసిద్ధికాంచిన ఆ యవన ప్రభువు, ప్రజ్వారుడు, కాలకన్యలతో సహితముగా సైనికులు, మృత్యువు ఆదేశముగలవారై ఈ భూమండలములో సంచరించిరి. 1

ఓ రాజా! భూమండలమందలి సంపదచే తులతూగుతున్న, ముసలిపాముచే కాపాడబడుచున్న అనగా జీర్ణప్రాణముచే ఉన్న పురంజన పురమును, వారు ఒకనాడు అత్యంత వేగముగా ముట్టడించిరి. 2

శ్లో॥ కాలకన్యాపి బుభుజే పురంజన పురం బలాత్ ।
యయాభిభూతః పురుషస్సద్యోనిస్సారతామియాత్ ॥ 3

టీ:- కాలేతి. యౌవనానంతరం జరా ప్రవివేశేత్యర్థః. 3

శ్లో॥ తయోప భుజ్యమానాం వై యవనాస్సర్వతోదిశమ్ ।
ద్వార్భిః ప్రవిశ్య సుభృశం ప్రార్ధయన్ సకలాంపురీమ్ ॥ 4

శ్లో॥ తస్యాం ప్రవిశ్యమానాయామభిమానీ పురంజనః ।
అవాపోరు విధాం స్తాంపాన్కుటుంబ మమతాకులః ॥ 5

టీ:- తయేతి. జరావ్యాప్తాం తనుం యవనాః వ్యాధయః. ద్వార్భిః చక్షురాదిభిః. రోగరూపేణ ప్రవిశ్య. (4-5)

శ్లో॥ కన్యోపగూఢో నష్టశ్రీః కృపణో విషయాత్మకః ।
నష్టప్రజ్ఞో హృతైశ్వర్యో గంధర్వ యవనైర్బలాత్ ॥ 6

టీ:- కన్యేతి. కన్యయా జరయోపగూఢస్సన్ తత్ప్రతిక్రియాం న లేభే ఇతి తృతీయేనాన్వయః. హృతైశ్వర్యః ఉత్థానాదిష్వశక్తః. 6

ఏ కాలకన్యచే ఆక్రమించబడినవాడు వెంటనే నిస్సత్తువను పొందుతాడో! ఆ కాలకన్య పురంజన పురమును బలవంతముగా అనుభవించెను. 3

ఆ కాలకన్యచే అనుభవించబడుచున్న ఈ పురమును యవనులు అన్ని దిక్కులనుండి, నేత్రాది ద్వారములగుండా, రోగాది రూపమున ప్రవేశించి తీవ్రముగా పీడించిరి. 4

ఆ పురము ఈ విధముగా పీడింపబడుచుండగా ఆ పురాభిమాని పురంజనుడు, కుటుంబము గలిగి దానియందు అభిమానముచే, మమకారముచే ఆందోళనము గలవాడై అనేక విధములైన తాపములను పొందెను. 5

కాలకన్యచే కౌగలింపబడిన (ముసలితనముచే) అతడి అందము నశించెను. దీనుడై విషయ భోగములయందు సంషక్తుడై వివేకము నశియించి, తొలగిన ఐశ్వర్యము గలిగి అనగా లేవడానికి గూడా సాధ్యముకాకుండా, గంధర్వులు యవనులచే బలాత్కారముగా ఆక్రమించబడి ప్రతిక్రియ చేయలేకపోయెను. 6

శ్లో॥ విశీర్ణాం స్వపురీం వీక్ష్య ప్రతికూలాననాదృతాన్ ।
పుత్ర పౌత్రానుగామాత్యాన్ జాయం చ గతసౌహృదాం ॥ 7

టీ:- విశీర్ణామితి. ప్రతికూలాన్ అనపేక్షిత విషయ ప్రాపణాన్ అనాదృతానారదమకుర్వాణాన్ స్వాధీనత్వాభావాత్. అనుగా ఇంద్రియాణి అమాత్యాః ఇంద్రియదేవతాః. గతసౌహృదాం అధ్యవసాయాభావాత్. 7

శిథిలమైన పురములో ఆదరములేక ప్రతికూలురైన పుత్ర పౌత్ర అనుచర, అమాత్య గణమును, ప్రేమలేని భార్యను చూచి- ప్రతికూలురనగా అవసరములేని విషయ భోగములను పొందడం- స్వాధీనములోని ఇంద్రియములు ఇంద్రియ దేవతలు - ప్రేమ లేని పత్నియనగా నిశ్చయము లేని మనస్సు అని అర్థం. 7

శ్లో॥ ఆత్మానం కన్యకాగ్రస్తం పాంచాలానరి దూషితాన్ ।
దురంత చింతమాపన్నో న లేభే తత్ప్రతిక్రియామ్ ॥ 8

టీ:- ఆత్మానమితి. అరిభిః విఘ్నాదిభిర్దూషితాన్. 8

కాలకన్యచే అనగా ముసలితనముచే ఆక్రమించబడిన తనను- శత్రువులచే పాడుచేయబడిన అనగా వ్యాధులచే దూషించబడిన- పాంచాల దేశమును అనగా విషయములను చూచి అంతులేని చింతను పొందినవాడై వాటికి ప్రతిక్రియ చేయలేకపోయెను. 8

శ్లో॥ కామానభిలషన్ దీనో యాతయామాంశ్చ కన్యయా ।
విగతాత్మగతిః స్నేహాత్పుత్రదారాంశ్చ లాలయన్ ॥9

టీ:- కామానితి. కాలకన్యయా హేతుభూతయా యాతయామాన్. నిస్సారానపి కామానభిలషన్. విగతా ఆత్మనో గతిః పారలౌకికీ ఐహికః పుత్రాదిస్నేహశ్చ యస్య స్నేహాదితి వా పాఠః. 9

కాలకన్య కారణముగ నిస్సారములైన భోగ్య వస్తువులను కోరుచు తొలగిపోయిన పరలోకగతిని, తొలగిపోయిన పుత్రభార్యాది ప్రేమలు గలవాడైనప్పటికీ - వారికి తనపట్ల ప్రేమ లేనప్పటికీ, తనే భార్యా పుత్రాదులను లాలించుచున్నాడు. 9

శ్లో॥ గంధర్వయవనాక్రాంతాం కాలకన్యోపమర్దితామ్ ।
హాతుం ప్రచక్రమే రాజా తాం పురీమని కామతః ॥ 10

ఆ రాజు గంధర్వ యవనులచే ఆక్రమింపబడి, కాలకన్యచే భగ్నము చేయబడిన పురమును, విడవాలని కోరికలేకున్ననూ, విడవడానికి సిద్ధమైనాడు. 10

శ్లో॥ భయనామ్నోఽగ్రజో భ్రాతా ప్రజ్వారః ప్రత్యుపస్థితః ।
దదాహ తాం పురీం కృత్స్నాం భ్రాతుః ప్రియచికీర్షయా ॥ 11

భయుడనివాడి పెద్దన్న ప్రజ్వారుడనువాడు ఆ పురమును చేరి తమ్మునకు సంతోషము కలిగించాలనే కోరికచేత దానిని సంపూర్ణముగా కాల్చివేసెను. 11

టీ:- గంధర్వేతి.స రాజా పురంజనో హాతుం ప్రచక్రమే ఉపక్రాంతవానితి ద్వయోరన్వయః.అనికామతః అనిచ్ఛయాపి. (10-11)

శ్లో॥ తస్యాం సందహ్యమానాయాం సపౌరస్సపరిచ్ఛదః ।
కౌటుంబికః కుటుంబిన్యా ఉపతప్యత సాన్వయః ॥ 12

ఆ పట్టణము కాలుచుండగా భృత్య వర్గసహితుడై పుత్రసహితుడై భార్యతోకూడి కుటుంబముచే ప్రకాశిస్తున్న పురంజనుడు మిక్కిలి తాపమును పొందెను. 12

టీ:- తస్యామితి. సపరిచ్ఛదః భృత్యవర్గ సహితః.కుటుంబేన దీవ్యతీతి కౌటుంబికః కుటుంబిన్యా సహితయా సంధిర్నాత్ర వివక్షితః. సాన్వయః పుత్రాది సహితః. 12

శ్లో॥ యవనోపరుద్ధాయతనో గ్రస్తాయాం కాలకన్యయా ।
పుర్యాం ప్రజ్వారసంస్పృష్టః పురపాలోఽన్వతప్యత ॥ 13

కాలకన్యచే ఆక్రమింపబడి, ప్రజ్వారుడిచే పీడింపబడి, యవనులచే ముట్టడించబడిన ఆ పురమును రక్షించే నాగము ప్రతిక్షణము తపించెను. 13

టీ:- యవనేతి. యవనైరుపరుద్ధాన్యాయతనాని యస్య సః. పురపాలః (13)

శ్లో॥ న శశాకోషితుం తత్ర పురుకృచ్ఛ్రోరువేపథుః ।
యాతుమైచ్ఛత్తతో వృక్షకోటరాదివ సోఽహిరాట్ ॥ 14

పెద్ద ఆపద కారణముగా వణుకుచున్న ఆ సర్పము పురమును రక్షించలేకపోయెను. నిప్పు అంటుకున్న చెట్టు రంధ్రమునుండి వెళ్ళునట్లు, ఆ పురము నుండి వెళ్ళిపోవాలని సంకల్పించెను. 14

టీ:- నేతి. పురు బహుకృచ్ఛ్రం తేన. ఉరుర్వేపథుర్యస్య. వృక్షకోటరాత్ సర్ప ఇవ. 14

శ్లో॥ శిథిలావయనో యర్హి గంధర్వైర్హృత పౌరుషః ।
యవనైర్బలిభీరాజన్నుపరుద్ధో రురోద హ ॥ 15

ఓ రాజా! గంధర్వులాక్రమించుటచేత అవయవములు శిథిల-ములై, పౌరుషము తొలిగి, శత్రువులైన యవనులచే నిలువరింపబడి ఏడ్చెను. అనగా కంఠములో కషాదుల అడ్డుపడగా గురగుర ధ్వనిని చేసెను. 15

టీ:- శిథిలేతి. కంఠే ఉపరుద్ధోరురోద ఘురుఘురు ధ్వనిం చకార. 15

శ్లో॥ దుహితౄః పుత్రపౌత్రాంశ్చ జామిజామాతృపార్షదాన్ ।
స్వత్వావశిష్టం యత్కించిద్గృహే కోశ పరిచ్ఛదమ్ ॥ 16

శ్లో॥ అహం మమేతి సాత్కృత్వా గృహేషు కుమతిర్గృహీ ।
దధ్యౌ ప్రమదయా దీనో విప్రయోగ ఉపస్థితే ॥ 17

భార్యతో వియోగమేర్పడగా నేను, నాదియని దేహగేహముల యందు బుద్ధికలిగి, కుమతియై, దీనుడై, పుత్రపౌత్రాదులను, కోడళ్ళను, అల్లుళ్ళను, సేవకులను, తనదంటు మిగిలిన ఏ కొంచెమో కలిగిన ఇల్లు, ధనము మొదలగు వాటిని ధ్యానించెను. (16-17)

శ్లో॥ లోకాంతరం గతవతి మయ్యనాథా కుటుంబినీ ।
వర్తిష్యతే కథం త్వేకా బాలకాననుశోచతీ ॥ 18

టీ:- దుహితౄరితి. దుహిత్రాదీన్ దధ్యావిత్యుత్తరేణాన్వయః. జామయోఽత్ర స్నుషాః స్వత్వమాత్రేణావశిష్టం భోగస్తు ప్రాగేవ క్షీణః (16-18)

ఆలోచన, ధ్యాన విధానము ఈ విధముగా నున్నది. నేను పరలోకమునకు వెళ్ళినచో నా భార్య అనాథ యగును. ఈ పిల్లలను గురించి దుఃఖిస్తూ ఎట్లు కాలమును గడుపునో గదా! 18

శ్లో॥ న మయ్యనాశితే భుంక్తేనాస్నాతే స్నాతి మత్పరా ।
మయి రుష్టే సుసంత్రస్తా భర్త్సితే యతవాగ్భయాత్ ॥ 19

టీ:- ధ్యానమేవాహ - నేతి. అనాశితే అభోజితే. భర్త్సితే భర్త్సనే కృతే యతవాగ్భవతి. 19

నేను తినకుండా తినదు, నేను స్నానమును చేయకుండా తాను స్నానముచేయదు. నేనుకోపిస్తే భయపడుతుంది. నేనరచి, బెదిరించగా భయము వల్ల వాక్కును నియంత్రించుకొంటుంది. 19

శ్లో॥ ప్రభోధయతి మావిజ్ఞం వ్యుషితే శోకకర్శితా ।
వర్తేతద్గృహమేధీయం వీరసూరపి నేష్యతి ॥ 20

టీ:- ప్రభోదయతీతి. అవిజ్ఞం అవివేకినం మాంవ్యుషితే దేశాంతరం గతే గృహమేధీయం వర్త్మ గృహధర్మం అపి కిం నేష్యతి అనువర్తయిష్యతి. యుక్తమేతత్. యతో వీరసూః పుత్రవతీ కింవా మద్విరహమసహమానా మరిష్యత్యేవేత్యర్థః. 20

ఏమీ తెలియని నన్ను మేల్కొలుపుతుంది. నేను దేశాంతరము వెళ్ళితే శోకముచే కృషించి పోతుంది. పుత్రవతి కనుక ఈ ఇంటి పనులైనా చేసుకుంటుందా! లేదా నా విరహమును భరించలేక మరణిస్తుందా! 20

శ్లో॥ కథం నుదారకా దీనా దారికా వా పరాయణాః ।
వర్తిష్యంతే మయి గతే భిన్న నావ ఇవోదధౌ ॥ 21

టీ:- కథమితి. న విద్యతే పరమయనమాశ్రయో యేషాం తే. అపరాయణాః పుత్రాః కన్యాశ్చ. యద్వా పరాశ్రయాః కన్యాః. భిన్నా నౌర్యేషాం. 21

నేను పోయిన పిమ్మట నా కుమారులు, కుమార్తెలు దీనులై ఏ దిక్కు, ఆధారము లేనివారై, సముద్రమధ్యమున పడవ పగలిన వారివలె ఏ విధముగా జీవించెదరో! 21

శ్లో॥ ఏవం కృపణయా బుద్ధ్యా శోచంతమత దర్హణమ్ ।
గృహీతుం కృతధీరేనం భయనామాభ్యపద్యత ॥ 22

టీ:- ఏవమితి.అతదర్హణం. వస్తుతస్తస్య బ్రహ్మత్వాత్. 22

ఈ విధముగా దీనమగు బుద్ధిచే దుఃఖించుచున్న, నిజానికి బ్రహ్మస్వరూపుడు కనుక దుఃఖించ వలసిన అవసరము లేని, పురంజనుని పట్టుకొనుటకు నిశ్చయించుకొని భయుడను యవన రాజు వచ్చి పడెను. 22

శ్లో॥ పశువద్యవనైరేవం నీయమానస్స్వకం క్షయమ్ ।
అన్వద్రవన్ననుపథాశ్శోచంతో భృశమాతురాః ॥ 23

టీ:- పశువదితి. ఏష యదా క్షయం స్థానం నీయమానః తదా. అనుపథాః ప్రాణాః ఇంద్రియాణి చ. తథా చ శ్రుతిః. "తముత్క్రాంతమ ప్రాణోఽనూత్క్రామతి ప్రాణమనూత్క్రాయంతం సర్వే ప్రాణా అనుత్క్రామం" తీతి. 23

ఈ పురంజనుడు యవనులచేత పశువునువలె తన వినాశ స్థానమునకు తీసుక వెళ్ళబడుచుండగా మిక్కిలి కలత చెందిన అతని అనుయాయులు అనగా "ప్రాణములు, ఇంద్రియములు" ఆయన వెంట వెళ్ళిరి. "తముత్క్రామంతం ప్రాణోఽనూత్క్రామతి ప్రాణమనూత్క్రామంతం. సర్వేప్రాణాః అనూత్క్రామంతి, సవిజ్ఞానో భవతి సవిజ్ఞానమే వాన్వవక్రామతి తం విద్యా కర్మణీ సమన్వార భేతే పూర్వప్రజ్ఞాచ" (4-4-4. బృహదారణ్యకోపనిషత్)

బృహదారణ్యకమున – జీవుడు ఈ శరీరావయములను విడచి వెళ్ళడాన్ని గూర్చి చెప్పుతూ – ఆ విడవడం ఎప్పుడు? ఏ విధముగా? అని సవిస్తరంగా వివరించడాన్ని ప్రారంభించి, ఈ బ్రాహ్మణమున ఆ యా ఇంద్రియ దేవతలు లేచిపోగా ఆ ఆ ఇంద్రియములు "హృదయమేవాఽవక్రామతి" హృదయమును చేరుతాయి. అని చెప్పి అనగా లింగశరీరముతో గూడి "హృదయస్యాగ్రంప్రద్యోతతే తేన ప్రద్యోతేనైష ఆత్మానిష్క్రామతీ" అని ఉపనిషత్. హృదయచ్ఛిద్రము యందు ఆత్మ ప్రకాశము కలిగినదై స్వప్త కాలమువలె చైతన్యావచ్ఛిన్న అంతఃకరణమే విజ్ఞానమయుడు. ఆ విజ్ఞానమయుడు అనగా లింగ శరీరోపాధి కలిగినవాడై ఈ స్థూల శరీరమును విడుచును. ఈ విజ్ఞాన మయుడు పరలోకమునకు వెళ్ళుచున్నప్పుడు సర్వాధికారములు కలిగిన అధికారి రాజు వెంట వెళ్ళినట్టు ప్రాణము వెళ్ళుతుంది. ఆ ప్రాణము వెళ్ళుచున్నప్పుడు వాగాది సర్వ ఇంద్రియములు ప్రాణమును అనుసరించి వెళ్ళుచున్నవి.

"శ్రీ శంకర భగవత్పాదభాష్యం:-తం విజ్ఞానాత్మానముత్క్రామంతం పరలోకాయ ప్రస్థితం పరలోకాయ ఉద్భూతాకూత మిత్యర్థః ప్రాణః సర్వాధికారస్థానీయో రాజ్ఞ ఇవ అనూత్క్రామతి. తం చ ప్రాణమ మాత్క్రామంతం, వాగాదయః సర్వేప్రాణాః అనూత్క్రామంతి". 23

శ్లో॥ పురీం విహాయాపగత ఉపరుద్ధో భుజంగమః ।
యదా తమేవానుపురీ విశీర్ణా ప్రకృతిం గతా ॥ 24

టీ:- పురీమితి. యవనైరుపరుద్ధోభుజంగమః యదా పురం విహాయాపగతః తదానీమేవ ప్రాణమనుపురీ విశీర్ణా ప్రకృతిం మహాభూతాని గతా పంచభూతేభ్యోమీ ఉత్పన్నాః పంచ భూతాత్మతాం గతేత్యర్థః. ప్రకృతిం మహాభూతాత్మతాం. 24

శత్రువులచే ముట్టడింపబడి ఆ సర్పము ఈ పట్టణమును విడిచి వెళ్ళిన వెంటనే ఆ పురము శిథిలమై పంచమహాభూత స్వరూపమును పొందినది. 24

శ్లో॥ వికృష్యమాణః ప్రసభం యవనేన బలీయసా ।
నావిందత్తమ ఆవిష్టస్సఖాయం సుహృదాం పురా ॥ 25

టీ:- వికృష్యమాణ ఇతి. నావిందత్ న సస్మార. పురా పూర్వం. సఖాయం సంతమీశ్వరం. 25

బలవంతుడైన ఆ యవనునిచేత బలవంతముగా లాగివేయ బడుచున్నవాడై, అజ్ఞానము చేత కప్పివేయబడినవాడై, పూర్వము తనకు సఖుడైనప్పుడికీ, హితము కలిగించిన ఈశ్వరుడిని స్మరించలేదు. 25

శ్లో॥ తం యజ్ఞపశవోఽనేన సంజ్ఞప్తా యేఽదయాళునా ।
కుఠారైశ్ఛిచ్ఛిదుః క్రుద్ధాః స్మరంతోఽమీవమస్య యత్ ॥ 26

టీ:- తమితి. అదయాళునా. కామ్యకర్మసు యే సంజ్ఞప్తా హతాః అమీవం పాపం క్రౌర్యం వా. 26

దయలేనివాడైన ఈ పురంజనుని చేత పూర్వము కామ్యకర్మల యందు ఏ పశువులు చంపబడినవో, ఆ పశువులు పరలోకమున పురంజనుని పాపమును లేదా క్రౌర్యమును స్మరించుకొన్నవై గొడ్డళ్ళచేత నరికినవి. (ఇచ్చట "కామ్యమర్మసు యే సంజ్ఞప్తాః" అన్న శ్రీధరస్వామి శ్రీ పంక్తిని అవలోకించిన ఛిన్న సంశయులు కాగలరు.) 26

శ్లో॥ అనంతపారే తమసి మగ్నో నష్ట స్మృతిస్సమాః ।
శాశ్వతీరనుభూయార్తిం ప్రమదాసంగదూషితః ॥ 27

టీ:- అనంతేతి. శాశ్వతీస్సమాః. ఆర్తిమనుభూయ. 27

అపారమైన అజ్ఞానమందు మునిగినవాడై, స్త్రీ సంగము చేత కలుషితుడైనవాడై, నశించిన స్మృతి గలవాడై చాలాకాలము దుఃఖమును అనుభవించిన పురంజనుడు... 27

శ్లో॥ తామేవ మనసా గృహ్ణన్బభూవ ప్రమదోత్తమా ।
అనంతరం విదర్భస్య రాజసింహస్య వేశ్మని ॥ 28

టీ:- తామితి. అంతకాలే తాంభార్యామేవ. మనసా గృహ్ణన్ స్మరన్. అనంతరం విదర్భస్యవేశ్మని. ప్రమదోత్తమా బభూవ. అతః పరమస్మిన్ప్రకరణే ఏతావదేవ ప్రకృతోపయోగి వివక్షితం. స్త్రీధ్యానేన స్త్రీత్వ ప్రాప్తావపి పతివ్రతాధ్యానేన పూర్వాదృష్టేన ధార్మికాద్విదర్భాజ్జన్మాభూత్. ధార్మిక సంగేన చ విశుద్ధస్య భాగవతేన మలయధ్వజేన సంగోऽభూత్ తతో విష్ణుభక్తిః తతో వైరాగ్యం. తతస్తమేవ భర్తృరూపం గురుం. పాతివ్రత్యధర్మేణ భజతో భగవత్ప్రసాద లబ్ధ జ్ఞానే మోక్ష ఇతి. అన్యత్తు కథాలంకారమాత్రం తథాపి కించిద్వృత్తిసామ్యేనేహ యోజయిష్యామః విదర్భస్య విశిష్టదర్భోపలక్షితస్య. కర్మ ఠస్య రాజసింహస్య. ధర్మేణ హి ప్రజాపరిపాలనేన. యజ్ఞాదినా చ క్షత్రియారాజం తే. తేషు శ్రేష్ఠస్య వేశ్మని. 28

చివరి కాలమున ఆ భార్యనే మనస్సున ధ్యానిస్తున్నవాడై పిమ్మట రాజసింహుడైన విదర్భుని గృహమున అందమైన స్త్రీగా జన్మించెను.

దీని పిమ్మట ఈ ప్రకరణమున ప్రకృతమున ఉపయోగి అయిన విషయమిది మాత్రమే.

చివరిదశయందు స్త్రీ చింతనముచేసి స్త్రీ జన్మము పొందినప్పటికీ పతివ్రత ధ్యానముచేత, పూర్వాదృష్టము చేత ధార్మికుడైన విదర్భుని ఇంట జన్మించెను. ధార్మికాసక్తి కలిగి ఉండడంచేత విశుద్ధుడైన తనకు భాగవతుడైన మలయధ్వజుని చేత స్నేహము కలిగెను. దానినుండి విష్ణుభక్తి తద్వారా వైరాగ్యము. పిమ్మట అతడినే (మలధ్వజుని) భర్తరూపుడైన గురువును పొంది, పాతివ్రత్య ధర్మముచే అతడిని సేవించి భగవదనుగ్రహము చేత పొందిన జ్ఞానము గలిగినవాడై మోక్షము పొందెను. మిగిలిన కథ అంతా అలంకారమాత్రమే, అయినప్పటికి శ్లోకాన్వయమును చేస్తూ వెళ్ళుతుంటాం.

విదర్భుడనగా విశిష్టమైన దర్భ కలవాడని అనగా కర్మఠుడని

శ్లో॥ ఉపయే మే వీర్యపణాం వైదర్భీం మలయధ్వజః ।
యుధి నిర్జిత్య రాజన్యాన్పాండ్యః పరపురంజయః ॥ 29

టీ:- ఉపయేమ ఇతి. మలయోపలక్షితే దక్షిణదేశే. ధ్వజ ఇవ దర్శనీయః స హి శ్రీవిష్ణుభక్తిప్రధానో ప్రదేశః తత్ర ముఖ్యః మహాభాగవత ఇత్యర్థః. పండా నిశ్చయబుద్ధిః. తామర్హతీతి పాండ్యః. స ఉపయేమే పురంజనో భాగవతసంగం ప్రాప్త ఇత్యర్థః. 29

శ్లో॥ తస్యాం సంజనయాం చక్ర ఆత్మజామసితేక్షణామ్ ।
యవీయసస్సప్త పుత్రాన్ సప్త ద్రవిడ భూభృతః ॥ 30

టీ:- తస్యామితి. ఆత్మజాం శ్రీకృష్ణ సేవారుచిం. తత్సంగేన భగవద్ధర్మే రుచిరభూదిత్యర్థః. అసితస్య శ్రీకృష్ణస్యేక్షణం యయా తాం. యవీయసః సప్తసుతాన్. శ్లో. "శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్,

- రాజనగా ధర్మముగా ప్రజాపాలన చేయుట చేత, యజ్ఞములు చేయుట చేత క్షత్రియులు ప్రకాశిస్తూ ఉంటారు. వారిలో శ్రేష్ఠుడైన వాని గృహము. 28

శత్రువులను జయించు పాండ్యరాజైన మలయధ్వజుడు యుద్ధము యందు ఇతర రాజులనోడించి వీర్యపణ అయిన వైదర్భిని వివాహమాడెను. మలయమనగా దక్షిణ దేశమని ధ్వజమనగా పతాకము వలె దర్శనీయమని తాత్పర్యము. శ్రీవిష్ణు భక్తులు ప్రధానము గాగల దేశమని వారిలో ముఖ్యుడు మహాభాగవతుడు. పండాయనగా నిశ్చయబుద్ధియని అర్థము. ఆ బుద్ధిని పొందడానికి అర్హుడు పాండ్యుడు. అతడువివాహమాడెను. పురంజనుడు భాగవత సంగమును పొందెను. (29)

అతడు ఆమెయందు ఒక కుమార్తెను అంతకంటే చిన్నవారైన ద్రవిడ దేశపు రాజులైన ఏడుగురు కుమారులను కనెను. పక్షాంతరమున ఇక్కడ కుమార్తెను పొందెననగా శ్రీకృష్ణ సేవాఅభిలాష కలిగెనని అర్థము. ఆ సంగముచేత భగవద్ధర్మముయందు అభిరుచి గలిగెను. ఆమె అసితేక్షణా అనగా ఏ సేవ, అభిలాష చేత ' కృష్ణుని చూపు పడుతుందో ఆ అభిరుచి పిమ్మట భక్తి కలుగుతుంది అదే ఆమె.

అర్చనం వందనం దాస్యమి" తి సప్తభక్తి ప్రకారాన్. సఖ్యాత్మనివేదనయో స్త్వంపదార్థజ్ఞానో త్తరకాలత్వాత్. తస్య చ భగవత్త్వేన భగవతైవోత్తరత్రో పదేక్ష్యనూణత్వాదిదానీమనుత్పత్తేః సప్తేత్యుక్తం. భగవద్ధర్మరుచ్యా తచ్ఛ్రవణకీర్తనాదికం జాతమిత్యర్థః. ద్రవిడభూమిపాలకాన్ ద్రవిడ భూమిర్హి శ్రవణాదిభక్తిభిరేవ సురక్షితాస్తీతి ప్రసిద్ధం. 30

పిమ్మట ఏడుగురనగా 1.శ్రవణం 2.కీర్తనం 3.స్మరణం 4.పాదసేవనం 5.అర్చనం 6.వందనం 7.దాస్యం, సఖ్యము. ఆత్మ నివేదమనునవి త్వం పదార్థ జ్ఞానాంతరము కలిగేవి, అవి భగవంతుడే ముందు ఉపదేశిస్తాడు. కావున ఇప్పుడు ఏడే అని చెప్పబడెను. భగవంతుడి ధర్మము యందు అభిరుచి పుట్టిన పిమ్మట శ్రవణాదులు పుట్టినావని అర్థము. ద్రవిడ భూమి శ్రవణాది భక్తిచేత దృఢంగా ఉంది అని అర్థం. (30)

శ్లో॥ ఏకైక స్యాభవంస్తేషాం రాజన్నర్బుదమర్బుదమ్ ।
భోక్ష్యతే యద్వంశధర్మైర్మహీ మన్వంతరం పరమ్ ॥ 31

టీ:- ఏకైకస్యేతి. అర్బుదమితి శ్రవణాదీనాం ప్రత్యేకమనేక ప్రకారాః అభవన్నిత్యర్థః. తదుక్తం. శ్లో. "భక్తియోగో బహువిధో మార్గైర్భామిని భావ్యత"ఇతి. యేషాం వంశధర్మైర్యతః ప్రవృత్తైః. సాంప్రదాయభేదైః. కృత్స్నామహీ మన్వంతరం. తతః పరంచ భోక్ష్యతే. అవిద్యా కామకర్మ భ్యోపి రక్షిష్యతే. 31

ఓ రాజా! వారికి ఒక్కొక్కరికి చాలా సంతానము కలిగెను. వారి వంశమున జన్మించి వారు మన్వంతరము దాటిన పిమ్మటగూడా ఈ భూమిని పాలించగలరు.

పక్షాంతరము –చాలా సంతానమనగా –భక్తి యోగము అనేక విధములుగాకలదని తెలిపెను. ఆ వంశధరులచేత మన్వంతరము పిమ్మటగూడా భూమిని పాలించగలరనగా వివిధములైన సంప్రదాయములచేత ఈ భూమి ఎల్లప్పుడు అవిద్యా కామ కర్మలచేత రక్షింపబడునని అర్థము. 31

శ్లో॥ అగస్త్యః ప్రాగ్దుహితరముపయేమే ధృతవ్రతామ్ ।
యస్యాం దృఢచ్యుతోజాత ఇధ్మవాహాత్మజో మునిః ॥ 32

టీ:- అగస్త్య ఇతి. అగస్త్యః అగాని నిష్క్రియాణి గాత్రాణి స్త్యాయతి సంఘాతయతీత్యగస్త్యో మనః. స ప్రాక్ ప్రథమం జాతాం దుహితరం. కృష్ణసేవారుచిముపయేమే. తస్యాః మనః కృష్ణే దృఢాం రతిం బబంధేత్యర్థః. ధృతాని శమదమాదీని వ్రతాని యయా తాం రతిం. దృఢేభ్యః సత్యలోకాదిభోగేభ్యోపి. చ్యుతస్తద్రహితః కృష్ణరతౌ సత్యామిహాముత్ర చ భోగ విరాగో జాత ఇత్యర్థః. స ఏవో పశమాత్మకత్వాన్మునిః కథంభూతః ఇధ్మవాహః ఆత్మజో యస్య సః. శ్రు.“తద్విజ్ఞానార్థం సద్గురుమేవాభిగచ్ఛేత్సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠ” మిత్యాది శ్రుతి ప్రసిద్ధా సమిద్వహనోపలక్షితా గురూపసత్తిః. వైరాగ్యాదభూదిత్యర్థః. న హ్యావిరక్తస్య గురూపసత్తిస్సంభవతి. కథాపేక్షే యథాశ్రుతమేవ. 32

వ్రతనిష్ఠగల, మలయధ్వజుని పెద్ద కుమార్తె అగస్త్యుని వివాహమాడెను. వారికి దృఢచ్యుతుడను కుమారుడు కలిగెను. దృఢచ్యుతునకు ఇధ్మవాహుడనువాడు కలిగెను.

అధ్యాత్మిక పక్షమున:-అగస్త్యుడనగా మనస్సు, కృష్ణసేవాభిరుచిని పొందెను. ఆయన మనస్సు దృఢమైన కృష్ణసేవారతిని పొందెను. దృఢవ్రతయనగా శమదమాది పూర్వకమైన కృష్ణరతి అని అర్థము. ధృడవ్రతమనగా సత్యలోకాది భోగరహితుడైన భగవానునియందు రతి ద్వారా ఇహలోక, పరలోక వైరాగ్యం వస్తున్నది. శమదమాదులు కలగడమే ఋషిత్వం. ఇధ్మవాహుడనగ ఇధ్మలు ధరించినవాడు. వైరాగ్యం వల్ల గురుసాన్నిధ్యమును పొందడమే. ముండకం 1-2-12 ----“తద్విజ్ఞానార్థం సగురుమేవాభిగచ్ఛేత్ సమిత్పాణిః శ్రోత్రియం బ్రహ్మనిష్ఠమ్” అని శ్రుతిలో చెప్పిన ప్రకారము సమిత్తులు పట్టుకొని వెళ్ళడం, గురువుల వద్దకు వెళ్ళడం - విరక్తుడు కాని వాడికి గురుసాన్నిధ్యము సంభవించదు. విరక్తుడైన వాడు బ్రహ్మ జ్ఞానమును గురువునుండి పొందాలి కనుక “గురుమేవఅభిగచ్ఛేత్” అని శ్రుతి.

శ్రీశంకరభగవత్పాద భాష్యం:-సః నిర్విణ్ణః బ్రాహ్మణః గురుమేవ ఆచార్యాం శమదమ దయాది సంపన్నం అభిగచ్ఛేత్. శాస్త్రజ్ఞోపి స్వాతంత్ర్యేణ బ్రహ్మ జ్ఞానాన్వేషణం నకుర్యాత్ ఇత్యేతత్ గురుమేవేత్యవధారణ ఫలమ్. వైరాగ్య సంపత్తి గల బ్రాహ్మణుడు

శ్లో॥ విభజ్య తవయేభ్యః క్ష్మాం రాజర్షిర్మలయధ్వజః ।
ఆరిరాధయిషుః కృష్ణం స జగామ కులాచలమ్ ॥ 33

టీ:- విభజ్యేతి. క్ష్మాం విభజ్య. తత్ర శ్రవణాదిభక్తి భేదం వ్యవస్థాప్య. 33

శ్లో॥ హిత్వా గృహాన్ సుతాన్భోగాన్వైదర్భీమదిరేక్షణా ।
అన్వగచ్ఛత పాండేశ్యం జ్యోత్స్నేవ రజనీకరమ్ ॥ 34

టీ:- ఇదానీం పురంజనస్య స్త్రీభావం ప్రాప్తస్య. సర్వతో విరక్తస్య. శ్లో. "పతిరేవ గురుః స్త్రీణామి"తి వచనాత్పతిసేవయా గురుశుశ్రూషా ప్రకారం దర్శయితుమాహ - హిత్వేత్యాదినా మనో దధ ఇత్యంతేన గ్రంథేన. మదయతీతి మదిరం ఈక్షణం యస్యాః. 34

శ్లో॥ తత్ర చంద్రమసా నామతామ్రపర్ణీ నవోదకా ।
తత్పుణ్య సలిలైర్నిత్యముభయత్రాత్మనో మృజన్ ॥ 35

శమదమదయాదులు గల గురువుని పొందాలి. ఎన్ని శాస్త్రాలు తెలిసినా స్వతంత్రంగా బ్రహ్మజ్ఞాన అన్వేషణం చేయరాదు. 32

రాజర్షి అయిన మలయధ్వజుడు భూమిని కొడుకులకు పంచియిచ్చి, కృష్ణుడిని ఆరాధించాలనే కోరికచే మలయ పర్వతముపైకి వెళ్ళెను. అద్యాపక్షే..శ్రవణాది భక్తి భేదమును వ్యవస్థచేసి..33

మత్తెక్కించే కన్నులుగల విదర్భ రాజపుత్రి (స్త్రీ భావమును పొందిన పురంజనుడు) అన్నిటినుండి విరక్తుడై, భోగములను, ఇండ్లను, కుమారులను విడిచి, వెన్నెల చంద్రుడిని వెంబడించినట్టు పాండ్యేషుడైన మలయధ్వజుని వెంటవెళ్ళెను. "పతియే స్త్రీలకు గురువు" అను శాస్త్ర వచన ప్రకారం పతిసేవయే గురుసేవ అని, ఇక్కడ నుండి 50వ శ్లోకమువరకు గురుసేవా ప్రకారమును దర్శింపచేయుచున్నాడు. 34

అక్కడ చంద్రవంశ తామ్రపర్ణనోదకమను పుణ్య నదుల పుణ్య జలములచే నిత్యము స్నానము చేస్తూ దేహమాలిన్యమును, మనో మాలిన్యమును కడిగివేస్తూ...35

టీ:- తత్రేతి. తత్ర చంద్రమసాద్యా నద్యః ప్రసిద్ధాః. తాసాం పుణ్యైః సలిలైః. ఉభయత్రాంతర్బహిశ్చాత్మనో మలం క్షాళయన్. తప ఆస్థిత ఇత్యుత్తరేణాన్వయః. 35

శ్లో॥ కందాష్టిభిర్మూలఫలైః పుష్పపర్ణైస్తృణోదకైః ।
వర్తమానశ్శనైర్గాత్రకర్శనం తప ఆస్థితః ॥ 36

దుంపలు, బీజాలు, విత్తులు, వ్రేళ్ళు, పండ్లు, పుష్పాలు, ఆకులు, గడ్డి, నీరు వీటిచేత శరీరమును నిలపెట్టుకొంటు మెల్లిగా శరీరమును కృషింపచేసే తపస్సును చేయుచుండెను. 36

శ్లో॥ శీతోష్ణవాత వర్షాణి క్షుత్పిపాసే ప్రియాప్రియే ।
సుఖదుఃఖే ఇతి ద్వంద్వాన్యజయత్సమదర్శనః ॥ 37

సర్వమునందు బ్రహ్మనుదర్శించే మలయధ్వజుడు శీతోష్ణములు గాలివర్షములు, ఆకలిదప్పులు, ఇష్టానిష్టములు, సుఖదుఃఖములు అనే ద్వంద్వములను జయించెను. 37

టీ:- కందేతి. అస్య తే భూమౌ క్షిప్యత ఇత్యష్టిర్బీజం. (36-37)

శ్లో॥ తపసా విద్యయా పక్వకషాయో నియమైర్యమైః ।
యుయుజే బ్రహ్మణాత్మానం విజితాక్షానిలాశయః ॥ 38

తపస్సుచేత, ఉపాసనచేత కామాది వాసనలు తొలగినవాడై యమనియమములచే ఇంద్రియములను, ప్రాణములను, చిత్తమును జయించి తనను బ్రహ్మగా భావించెను. 38

టీ:- తపసేతి. విద్యయా ఉపాసనయా పక్వకషాయః దగ్ధకామాది వాసనః. యుయుజే ఆత్మనో బ్రహ్మతాం భావయామాస. అక్షాణీంద్రియాణి. అనిలః ప్రాణః ఆశయః చిత్తం. విజితా అక్షాదయో యేన. 38

శ్లో॥ ఆస్తే స్థాణురివైకత్ర దివ్యం వర్షశతం స్థిరః ।
వాసుదేవే భగవతి నాన్యద్వేదోద్వహన్ రతిమ్ ॥ 39

టీ:- ఆస్తఇతి. ఆస్తే స్మ వర్షశతమితి జ్ఞానస్య దుస్సాధనతాం దర్శయతి. అత ఏవ హరౌ భక్తిం కృతవానిత్యాహ. వాసుదేవే రతిముద్వహన్ అన్య దేహాదికం న వేద. 39

జ్ఞానము సామాన్య సాధనముద్వారా సిద్ధించునదికాదు కనుక వంద దివ్య సంవత్సరములు తపస్సు చేసెను. శ్రీహరియందు భక్తి గలవాడై వాసుదేవుడి యందు ప్రేమను పెంచుకొని దేహాదులను మరిచెను. 39

శ్లో॥ సవ్యాపకతయాత్మానం వ్యతిరిక్తతయాత్మని ।
విద్వాన్ స్వప్న ఇవామర్శసాక్షిణం విరరామ హ ॥ 40

టీ:- స ఇతి. స ఏవం వర్తమానస్సన్. ఆత్మన్యాత్మానం. విద్వాన్ అన్యస్మాదుపరరామ కథం విద్వాన్. వ్యతిరిక్తతయా దేహాదివ్యతిరిక్తత్వేన. కుతః వ్యాపకతయా దేహాది ప్రకాశత్వేన నను దేహాద్యాకారావిమర్శ ఏవ ఏతత్ప్రకాశ ఇతి. న తు నిరాకారః ఆత్మా. అత ఆహ. ఆమర్షస్యాపి సాక్షిణం. అయం భావః అమర్శోనామాంతఃకరణవృత్తిః. సా చ జడత్వాదాత్మప్రకాశ్యైవేతి. యథా స్వప్నే మమేదం శిరశ్ఛిన్న మిత్యాది ప్రతీతౌ తద్వ్యతిరిక్తమాత్మానం వేత్తి తద్వత్. 40

అతడు జ్ఞానము గలవాడై దేహాదులయందు ఆత్మ బుద్ధిని వదలెను. ఆత్మ దేహాదులను ప్రకాశింపచేయుచున్నది కనుక దేహాదుల కంటే వేరైనది, మరి దేహాదులను ప్రకాశింప చేయునది అంతఃకరణము కదా? అనగా కాదు అంతఃకరణమునకు గూడా సాక్షి ఆత్మ. అంతఃకరణ వృత్తి జడము, స్వయం ప్రకాశము కాదు. అదిగూడా ఆత్మచేతనే ప్రకాశిస్తుంది. మనకు స్వప్నమున శరీరా అంతఃకరణముల కంటే ఆత్మ భిన్నమని తెలుస్తుంది. ఏ విధముగా యనగా నా ఈ శిరస్సుతొలగించిరి అని కలగన్నప్పుడు నా శిరస్సు తొలిగినదని ఎవరు దర్శించుచున్నాడో అతడు కార్యకారణాత్మకమైన అంతఃకరణము కంటే వేరైన వాడే అని ఈ విధముగా దేహాదులయందు ఆత్మబుద్ధిని వదిలివేసెను. 40

శ్లో॥ సాక్షాద్భగవతోక్తేన గురుణా హరిణా నృప ।
విశుద్ధ జ్ఞానదీపేన స్ఫురతా విశ్వతో ముఖమ్ ॥ 41

టీ:- కేన విద్వాన్?తత్రాహ -సాక్షాదితి. సాక్షాద్ధరిరేవ యో గురుస్తేనోక్తేన సర్వతో ముఖం యథా తథా స్ఫురతా.అనవచ్ఛిన్నేన జ్ఞానేన. 41

సాక్షాత్తు శ్రీహరియే గురువై చెప్పిననూ అన్ని విధములుగా విచ్ఛిత్తి గాని విశుద్ధమైన జ్ఞాన దీపము చేత ప్రకాశిస్తూ..41

శ్లో॥ పరే బ్రహ్మణి చాత్మానం పరం బ్రహ్మ తథాత్మని ।
వీక్ష్యమాణో విహాయేక్షా మస్మాదుపరరామ హ ॥ 42

టీ:- తదేవాహ - పర ఇతి. శ్లో.“బ్రహ్మైవాహం న సంసారీ”తి బ్రహ్మణ్యాత్మని ఈక్ష్యణే శోకాది నివృత్తిః అహమేవ బ్రహ్మేత్యాత్మని బ్రహ్మణ ఈక్షణే బ్రహ్మపారో క్ష్యనివృత్తిః. అతోవ్యతిహారేణేక్షమాణ అస్మాత్సంసారాదుపరరామ. నన్వేవమపి జీవస్య కుతో బ్రహ్మతాపత్తిః ఈక్షణస్యైవ. వ్యవధాయ కత్వాదిత్యాశంక్యాహ - ఈక్షాం విహాయ యద్దగ్ధేంధనానలవత్తస్యాః స్వయమేవోపశాంతిరితి భావః. (42-43)

బ్రహ్మనే నేను, సంసారిని కాను అని దర్శించడం వల్ల శోకాదులు తొలుగును. నేనే బ్రహ్మను అను జ్ఞానము కలగడం వల్ల బ్రహ్మ నాకంటే వేరను అజ్ఞానము తొలిగిపోతుంది. ఈ విధముగా దర్శించడం వల్ల ఈ సంసారమునుండి ఉపరమించెను. స్థూల, సూక్ష్మ దేహాదులనుండి ఉపరమించినాడు కాని ఈ ఉపరతికి కారణాభూతమైన జ్ఞానశక్తి ఒకటుంటుంది కాదా? అనగా ఏ విధముగానైతే కట్టెలు రెండు అంటుకున్నప్పుడు కాలికాలి అగ్ని ఆరిపోయినట్టుగా స్వయముగా ఈ జ్ఞానముగూడా శాంతిస్తుంది. 42

శ్లో॥ పతిం పరమధర్మజ్ఞా వైదర్భీ మలయధ్వజమ్ ।
ప్రేమ్ణాపర్యచరద్ధిత్వా భోగాన్ సా పతిదేవతా ॥ 43

విదర్భ రాజకుమారి పరమ ధార్మికుడైన మలయధ్వజుడిని, పతియే పరమేశ్వరునిగా భావించి భోగములనన్ని విడిచి ప్రేమగా పరిచర్య చేసెను. 43

శ్లో॥ చీరవాసా వ్రతక్షామా వేణీభూత శిరోరుహా ।
బభావుపపతిం శాంతశిఖాశాంతమివానలమ్ ॥ 44

టీ:- చీరేతి. ఉపపతిం పత్యుః కించిన్మాత్రం న్యూనా. తత్సమానా సతీ బభావిత్యర్థః. సూ. "ఉపో౽ధికే చే"తి కర్మ ప్రవచనీయః. తద్యోగే ద్వితీయా. శాంతామంగారావస్థ మనలం నిర్ధూమా శాంతా శుద్ధా జ్వాలా యథా భవతి తద్వత్. 44

ఆమె నారచీరలు కట్టుకొని, నియమ నిష్ఠలచే దేహము కృషించగా, జడలుకట్టిన వెంట్రుకలు గలదై, పొగలేని అగ్నిజ్వాల సమీపమున, దానికంటే కొంత చిన్నదైన పొగలేని అగ్ని జ్వాలవలె, పతి సమీపమున ప్రకాశిస్తూ ఉన్నది. 44

శ్లో॥ అజానతీ ప్రియతమం యథోపరతమంగనా ।
సుస్థిరాసనమాసాద్య యథాపూర్వముపాచరత్ ॥ 45

టీ:- అజానతీతి. తదానీమపి సుస్థిర మాసనం యస్య. అత ఏవాజానతీ పత్యుః కించిన్మాత్రమౌదాసీన్యం యథా తథా. యథా పూర్వమసేవత. 45

ప్రియతముడైన పతి స్థిరమైన ఆసనము కలిగి ఉండడంచేత ప్రాణములు విడిచినాడని తెలియక పూర్వము వలెనే సేవించెను. 45

శ్లో॥ యదా నోపలభేతాంఘ్రావూష్మాణం పత్యురర్చతీ ।
ఆసీత్సంవిగ్నహృదయా యూథభ్రష్టామృగీ యథా ॥ 46

టీ:- యదేతి. పత్యురంఘ్రిమర్చయంతీ యదా తస్మిన్నంఘ్రావూష్మాణం నాపశ్యత్. 46

ఎప్పుడైతే ఆమె భర్త పాదములను పూజించుచున్నదో అప్పుడు భర్త పాదములయందు వేడి తగలలేదు. వెంటనే, గుంపునుండి విడివడిన లేడి వలె ఆమె హృదయము ఆందోళన చెందెను. 46

శ్లో॥ ఆత్మానం శోచతీ దీనమబంధుం విక్లభాశ్రుభిః ।
స్తనావాసిచ్యవిపినే సుస్వరం ప్రరురోద హ ॥ 47

టీ:- ఆత్మానమితి. అబంధుం పతిరహితం అశ్రుభిరాసిచ్య. 47

భర్తలేని తన దైన్యమునకు చాలా దుఃఖించెను. దుఃఖము వలన ఆమె స్తనములు తడసిపోయెను. ఆ అడవియందు సుస్వరముగా రోదించెను. 47

శ్లో॥ ఉత్తిష్ఠోత్తిష్ఠ రాజర్ష ఇమాముదధిమేఖలామ్ ।
దస్యుభ్యః క్షత్రబంధుభ్యో బిభ్యతీం పాతుమర్హసి ॥ 48

టీ:- ఉత్తిష్ఠేతి. క్షత్రబంధుభ్యః అధార్మిక క్షత్రియేభ్యోపి. 48

ఓ రాజర్షీ! లెమ్ములెమ్ము, సముద్రమే ఒడ్యాణముగా గలిగి అధార్మికులైన క్షత్రియులనుండి, దొంగలనుండి భయపడుచున్న ఈ భుమిని నీవే రక్షించయోగ్యుడవు. 48

శ్లో॥ ఏవం విలపతీ బాలావిపినేఽనుగతా పతిమ్ ।
పతితా పాదయోర్భర్తురుదత్యశ్రూణ్యవర్తయత్ ॥ 49

టీ:- ఏవమితి. అవర్తయత్ ప్రవర్తయామాస. 49

భర్తతోబాటు అడవికి వెళ్ళిన వైదర్భి ఈ విధముగా భర్త పాదములపై పడి ఏడుస్తూ కన్నీరును కార్చెను. 49

శ్లో॥ చితిందారుమయీాం ఛిత్వా తస్యాం పత్యుః కళేబరమ్ ।
ఆదీప్య చానుమరణే విలపంతీమనోదధే ॥ 50

టీ:- చితిమితి. తస్యాం తస్యాం నిధాయ అగ్నిదానేనాదీప్య చ. 50

కట్టెలతో కూడిన చితిని పేర్చి దానిపై భర్త శరీరమును ఉంచి దానినంటించి తానుకూడా భర్తతోబాటు మరణించుటకు మనస్సున నిర్ణయించుకొనెను. 50

శ్లో॥ తత్ర పూర్వతరః కశ్చిత్సఖా బ్రాహ్మణ ఆత్మవాన్ ।
సాంత్వయన్ వల్గునా సామ్నా తామాహ రుదతీం ప్రభో ॥ 51

టీ:- తత్రేతి. పూర్వతరః అనాదిరీశ్వరః కశ్చిత్సఖా. "ద్వా సుపర్ణా సయుజావి"తి శ్రుతేః. సామ్నా ప్రియవాక్యేన సంబోధయన్. 51

ఓ ప్రభూ! ఆ సమయమున-చాలా పూర్వ కాలమున మిత్రుడైన ఆత్మజ్ఞాని అయిన బ్రాహ్మణుడు, మనోహరమైన ప్రియవాక్యములతో ఏడుస్తున్న ఆమెను ఓదారుస్తూ ఈ విధముగా పలికెను. పూర్వతరుడనగా అనాది ఈశ్వరుడే జీవునకు మిత్రుడు. "ద్వాసుపర్ణాసయుజా సఖాయౌ" (ముండకం 3-1-1). 51

శ్లో॥ కా త్వం కస్యాసి కో వాయం శయానో యస్య శోచసి ।
జానాసి కిం సఖాయం మాం యేనాగ్రే విచచర్థహ ॥ 52

టీ:- కేతి. యస్య యం శోచసి. అగ్రే సృష్టేః పూర్వం. విచచర్థ మయి స్థితత్వేన వివిధం సఖ్యసుఖం అనుభూతవత్యసి. 52

ఎవరు నీవు. ఎవరికి సంబంధించిన దానవు. ఈ పడుకొని యున్న వాడెవరు. ఎవరిని గూర్చి ఏడుస్తున్నావు. నేను నీ స్నేహితుడను జ్ఞాపకము వచ్చినానా! సృష్టికి పూర్వము. నేనుండడము వలన సఖ్యసుఖముననుభవించి యున్నావు. 52

శ్లో॥ అపి స్మరసి చాత్మానమవిజ్ఞాతసఖం సఖే ।
హిత్వా మాం పదమన్విచ్ఛన్భౌమభోగరతో గతః ॥ 53

మన ఇద్దరం స్నేహితులమని, కలిసి తిరిగినామని నాకు తెలియదంటావేమో! ఒకవేళ నేను మీకు తెలియక పోవచ్చును,

టీ:- అపీతి. యద్యపి మాం న జానాసి తథాప్యాత్మానం త్వామవిజ్ఞాతసఖం అవిజ్ఞాతః కశ్చిన్మే సఖా ఆసీదిత్యేవం కింస్మరసి. సఖ ఇతి పుంస్త్వనిర్దేశః ప్రాక్తనపుంస్త్వస్మరణాయ సఖ్యం స్మారయన్ స్వవియోగకృతమనర్థమాహ - సార్ధైః షడ్భిః. పదం స్థానం. 53

అయినప్పటికీ, నీకు జ్ఞాపకము రాని ఒక మిత్రుడుండేవాడని జ్ఞాపకము వచ్చుచున్నదా. సఖుడని పుంస్త్వ నిర్దేశము పూర్వజన్మ పుంస్త్వమును స్మరించుటకు, స్నేహమును జ్ఞాపకము చేస్తూ నన్ను విడవడం వలన కలిగిన అనర్థములను గూర్చి చెప్పుచున్నాడు. నీవు నా స్థానమును విడిచి భూలోకము యందలి భోగములయందు రతుడవై వెళ్ళినావు. 53

శ్లో॥ హంసావహం చ త్వం చార్యే సఖాయౌ మానసాయనౌ ।
అభూతామంతరా ఓకస్సహస్రపరివత్సరాన్ ॥ 54

టీ:- హంసావితి. హంసౌ శుద్ధౌ. మానసం హృదయ మయనం యయోః. కథాపక్షే మానససరసి స్థితౌ పక్షిణావభూతాం జాతౌ ఓకో గృహం అంతరావినైవ. వా శబ్ద ఏవార్థే. సహస్రపరివత్సరాన్ మహాప్రళయో యావత్. 54

ఓ ఆర్యా! నేను, నీవు ఇద్దరం హంసలం. మనం మిత్రులం. మనకు ఇల్లు అనేది లేకుండగనే వేల సంవత్సరములు మానస సరోవరమును ఆధారముగా చేసికొనియుంటిమి.

ఆధ్యాత్మిక పక్షమున:-మనం హంసలం అనగా శుద్ధులము, మానసం=హృదయమే ఆధారముగా చేసుకొని అనేక సంవత్సరములు అనగా మహా ప్రళయము వరకు.. 54

శ్లో॥ సత్వం విహాయ మాబంధో గతో గ్రామ్యమతిర్మహీమ్ ।
విచరన్పదమద్రాక్షీః కయాచిన్నిర్మితం స్త్రియా ॥ 55

టీ:- స ఇతి. హే బంధో గ్రామ్యే స్వైరే సుఖే మతిర్యస్య. స్త్రియా మాయయా. 55

ఓ బంధుడా! నీవు ఇంద్రియ భోగములయందు బుద్ధి కలిగి నన్ను విడిచి భూమియందు సంచరించుచూ, ఒకానొక స్త్రీచేత నిర్మితమైన నివాస స్థానమును చూచితివి. స్త్రీ యనగా మాయ. 55

శ్లో॥ పంచారామం నవద్వారమేకపాలం త్రికోష్ఠకమ్ ।
షట్కులం పంచవిపణం పంచప్రకృతి స్త్రీధవమ్ ॥ 56

టీ:- పంచరామమితి. పంచశబ్దాదయః ఆరామాః ఉపవనాని యస్మిన్. నవ ద్వారాణి ప్రాణచ్ఛిద్రా యస్మిన్. ఏకః ప్రాణః పాలో యస్మిన్. త్రీణి పృథివ్యప్తేజాంసి కోష్ఠాని ప్రాకారా యస్మిన్ షట్ జ్ఞానేంద్రియ మనాంసి కులాని అభీష్ట విషయ సమర్పకా వణిజో యస్మిన్. పంచవిపణా అట్టాః కరధ్మంద్రియాణి యస్మిన్. పంచభూతాని ప్రకృతిః ఉపాదాన కారణం యస్య. స్త్రీ బుద్ధి రేవ ధవః పతిః స్వామినీ యస్మిన్. 56

అయిదు ఉద్యానవనములు, తొమ్మిది ద్వారములు, మూడు ప్రాకారములు, అయిదు బజారులు గల ఆ నివాస స్థలమున ఒక కాపలాదారు, ఆర్గురు వ్యాపారస్థులు ఉండేవారు. ఐదు ద్రవ్యములచే నిర్మితమైన ఆ భవనమునకు యజమానురాలు ఒక స్త్రీ. ఐదు శబ్దాదులే ఉపవనములు, తొమ్మిది ప్రాణచ్ఛిద్రములు ఒక పరిపాలకుడే ప్రాణము; మూడు కోష్ఠములనగా పృథివి, నీరు, తేజములే ప్రాకారము; ఆర్గురువ్యాపారస్థులనగాఐదు జ్ఞానేంద్రియములు మనస్సు; కోరిన విషయంభోగములను సమర్పించే వారు ఐదు అంగళ్ళు; కర్మేంద్రియములు ఐదు భూతములే; ప్రకృతి=మూల కారణము, స్త్రీ యనగా బుద్ధియే స్వామినిగా గలది ఈ దేహం.. 56

శ్లో॥ పంచేంద్రియార్థా ఆరామాద్వార్వోః ప్రాణాదయః ప్రభో ।
తేజోభిన్నాని కోష్టాని కులమింద్రియసంగ్రహః ॥ 57

టీ:- స్వయమేవేమం శ్లోకం వ్యాచష్టే. పంచేంద్రియార్థా ఇతి. షట్కుల మితి. షట్ పంచ ఏకపాలమితి చ స్పష్టత్వాన్న వ్యాఖ్యాతమ్. 57

స్వయముగా పై శ్లోకమును తానే వివరించుచు షట్కులం, ఏకపాలమనునవి స్పష్టముగా అర్థమవుచున్నవి కనుక వివరించలేదు. (57)

శ్లో॥ విపణస్తు క్రియాశక్తిర్భూతప్రకృతిరవ్యయా ।
శక్త్యధీశః పుమానత్ర ప్రవిష్టోనావబుధ్యతే ॥ 58

క్రియలను చేసే శక్తి గల కర్మేంద్రియ వర్గమే బజారు. పంచ భూతములే ఉపాదానముగా గలది. స్త్రీ ధవమను దానికి వ్యాఖ్యానము-

టీ:- విపణ ఇతి. భూతాన్యేవ అవ్యయా ప్రకృతిరుపాదానం యస్య. స్త్రీదవమిత్యస్య వ్యాఖ్యాతం. శక్తిరధీశో యస్య. తద్వశస్సన్నిత్యర్థః. 58

శక్త్యధీశుడనునది అనగా శక్తి యొక్క వశుడై - ఈ దేహమునందు ప్రవేశించిన పురుషుడు తెలియలేకుండా ఉన్నాడు. 58

శ్లో॥ తస్మిం స్త్వం రామయాస్ప్రృష్టో రమమాణో శ్రుతస్మృతిః ।
తత్సంగాదీదృశీం ప్రాప్తోదశాం పాపయసీం ప్రభో ॥ 59

ఓ ప్రభూ! ఆ పురముయందు బుద్ధియనే స్త్రీ చేత పరాజితుడవై రమించుచూ, బ్రహ్మ విషయ చింతన లేనివాడవై ఆమెయందు ఆసక్తి చేత ఈ దుఃఖాత్మకమైన దశను పొందితివి. 59

టీ:- తస్మిన్నితి. సృష్టః అభిభూతః.అతో న విద్యతే శ్రుతే బ్రహ్మత్వేస్మృతిర్యస్య. 59

శ్లో॥ న త్వం విదర్భదుహితా నాయం వీరసుహృత్తవ ।
న పతిస్త్వం పురంజన్యారుద్ధో నవ ముఖే యయా ॥ 60

త్వం పదార్థమును ఉపదేశించుచున్నాడు. నీవు నిజానికి విదర్భ రాజపుత్రికవు కావు. ఈ వీరుడు నీ భర్త కాదు. నీవు పురంజని భర్తవు కావు. ఈ తొమ్మిది ద్వారములు గల పురమందు మాయా శక్తిచేత బంధింపబడ్డావు. 60

టీ:- తత్త్వమపదిశతి చతుర్భిః. నేతి. సుహృత్పతిః నవద్వారే పురే యయా రుద్ధోసి తస్యాః. 60

శ్లో॥ మాయాహ్యేషా మయా సృష్టాయత్పుమాంసం స్త్రియంసతీమ్
మన్యసే నోభయం యద్వా హంసౌ పశ్యాథనౌ గతిమ్ ॥ 61

పూర్వజన్మయందు పురుషుడిగా, ఈ జన్మయందు శ్రేష్ఠమైన స్త్రీగా ఏ మాయ ద్వారా అనుకొంటున్నావో ఆ మాయా నాచేత సృజింపబడినది. నిజానికి స్త్రీ, పుం రూపములు యథార్థముగా రెండుకావు. మనమిద్దరము పరిశుద్ధులము, మన ఇద్దరియొక్క స్వరూపమును తెలుపుతాను చూడు. 61

టీ:- మాయేతి. పుమాంసం పూర్వజన్మని యదమన్యథాః ఇదానీం చ సతీంశ్రేష్ఠాం స్త్రియం యన్మన్యసే. ఏషామాయా. యత ఉభయమపి

వస్తుతో నాస్తి. యస్మాదావాం హంసౌ శుద్ధౌ. నౌ అవయోః. వక్ష్యమాణాం గతిం స్వరూపం పశ్య. 61

శ్లో॥ అహం భవాన్నచాన్యస్త్వంత్వమేవాహం విచక్ష్వ భో ।
న నౌపశ్యంతి కవయశ్ఛిద్రం జాతు మనాగపి ॥ 62

టీ:- తత్త్వంపదార్థయోశ్చిదంశేనైక్యమాహ - అహమితి. అహమేవ భవాన్. ఉపచారం వారయతి న చాన్య ఇతి వ్యతిహారోపదేశః. ఉక్తాభిప్రాయః. ఛిద్రమంతరం. 62

తత్త్వం పదార్థములకు చిదంశచేత ఐక్యమును చెప్పుచున్నాడు. నేను నీవే, నీవు వేరుకావు, నీవే నేను అని తెలుసుకో! జ్ఞానులు మనలో ఏ కొంచెము గూడా భేదమును చూడరు. 62

శ్లో॥ యథా పురుషమాత్మానమేక మాదర్శచక్షుషోః ।
ద్విధాభూతమవేక్షేత తథైవాంతరమావయోః ॥ 63

టీ:- తర్హి కథమావయోరజ్ఞత్వసర్వజ్ఞత్వాదిధర్మభేదస్తత్రాహ - యథేతి. ఆత్మానం దేహం. ఆదర్శే నిర్మలం మహాంతం స్థిరం చావేక్షేత పరస్య చక్షుషి చ తద్విపరీతం విద్యావిద్యోపాధికృతో ధర్మభేద ఇత్యర్థః. 63

మనమిద్దరం ఒకటే అయిన యెడల నేనజ్ఞుడను, నీవు సర్వజ్ఞుడవను ధర్మ భేదము ఎందుకు కలిగెను?

అనగా ఒక దేహమును ఒక అద్దంలో చూచినప్పుడు స్థిరంగా నిలకడగా, నిర్మలంగా కనబడుతుంది. అదే దేహము ఎదురుగా ఉన్న ఒక వ్యక్తి కంటిలో చూచినపుడు భిన్నంగా, అస్థిరంగా, మలినంగా కనబడుతుంది. కారణం జ్ఞాన, అజ్ఞానములనే ఉపాధి భేదం చేత ధర్మాధర్మ భేదం కనబడుతుంది అని అర్థం. 63

శ్లో॥ ఏవం సమానసో హంసో హంసేన ప్రతిబోధితః ।
స్వస్థస్తద్వ్యభిచారేణ నష్టామాప పునఃస్మృతిమ్ ॥ 64

టీ:- ఏవమితి. తద్వ్యభిచారేణ ఈశ్వరవియోగేన. 64

ఈ ప్రకారము ఆ మానస హంస క్షేత్రజ్ఞుడు పరమాత్మచే భోదితుడై, తనను తాను తెలిసికొని (చాలాకాలము ధ్యానించి) ఇంతకాలం ఈశ్వర వియోగము ద్వారా, విషయాభిలాష బుద్ధిచేత నష్టపోయిన స్మృతిగలవాడైన తాను "అహంబ్రహ్మాస్మి" నేను బ్రహ్మనను జ్ఞానమును తిరిగి పొందెను. 64

శ్లో॥ బర్హిష్మన్నేత దధ్యాత్మం పారోక్షేణ ప్రదర్శితమ్ ।
యత్పరోక్షప్రియోదేవోభగవాన్విశ్వభావనః ॥ 65

టీ:- కథామాత్రమితి. బుద్ధిం వారయతి. బర్హిష్మన్నితి. పారోక్షేణ రాజకథామిషేణ తత్ర హేతుః యద్యస్మాత్. 65

కేవలం కథా బుద్ధిని వారించుచున్నాడు. ఓ బర్హిష్మంత మహారాజా! రాజు కథా అనేది నిమిత్తంగా పెట్టుకొని ఆత్మకథ ప్రదర్శింపబడినది ఎందుకనగా విశ్వభావనుడైన శ్రీమన్నారాయణుడు పరోక్షప్రియుడు. "పరోక్షప్రియాఇవహిదేవాః" సాక్షాత్తుగా ఆత్మజ్ఞానము బోధించిన మనస్సునకు ఎక్కుదని భావము. 65

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,**
**అష్టావింశోఽధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు**
**ఇరువది ఎనిమిదవ అధ్యాయము సమాప్తము.**

## ఏకోనత్రింశోஉధ్యాయః

శ్లో॥ ఊనత్రింశే పరోక్షార్థ వ్యాఖ్యానేనోపసంహృతమ్ ।
స్త్రీ సంగతో భవస్త్వీశ సంగాన్ముక్తిరుదీర్యతే ॥

**ప్రాచీనబర్హి ఉవాచ**

శ్లో॥ భగవంస్తే వచోஉస్మాభిర్న సమ్యగవగమ్యతే ।
కవయస్తద్విజానంతి న వయం కర్మమోహితాః ॥ 1

టీ:- భగవన్నితి. కవయః అధ్యాత్మవిదః. 1

**శ్రీ నారద ఉవాచ**

శ్లో॥ పురుషం పురంజనం విద్యాద్యద్వ్యనక్త్యాత్మనః పరమ్ ।
ఏక ద్వి త్రి చతుష్పాదం బహుపాదమపాదకమ్ ॥ 2

టీ:- పురుషమితి. వ్యనక్తి లింపతి. చేతనీకరోతీత్యర్థః. యద్వా వ్యనక్తి ప్రకటయతి. తతశ్చ. స్వకర్మణా పురం జనయతీతి పురంజనపదం వ్యాఖ్యాతం భవతి ఏకద్వ్యాదయః పాదా యస్య. 2

## 29 వ అధ్యాయము

ఈ ఇరవై తొమ్మిదవ అధ్యాయమున - పరోక్షార్థ వివరణచే ఉపసంహరింపబడినది. స్త్రీ సంగముద్వారా సంసారము, పరమేశ్వరుడి యందు ఆసక్తి చేత ముక్తియని సుస్పష్టము చేయబడినది.

**ప్రాచీనబర్హి ఈ విధముగా పలికెను.**

ఓ పూజ్యుడా! మీ వాక్కులు మాకు సరిగ్గా అవగతము కావడం లేదు. అధ్యాత్మవిదులు దానిని తెలుసుకోగలరు. కర్మమోహితులమైన మేము తెలసుకొనలేము. 1

**నారదుడు ఈ విధముగా పలికెను.**

పురంజనుని జీవుడిగా తెలుసుకో. ఏలయనగా తను ఒకటి, రెండు, మూడు, నాలుగు లేక అనేక పాదములు లేక పాదరహితుడిగా ఈ దేహమును చేతనవంతము చేయుచున్నాడు. లేదా వ్యక్తపరచుచున్నాడు. కర్మానుసారముగా ఈ దేహమును పుట్టించుకొనుచున్నాడు. 2

శ్లో॥ యో విజ్ఞాతా హృతస్తస్య పురుషస్య సఖేశ్వరః ।
యన్న విజ్ఞాయతే పుంభిర్నామభిర్వాక్రియాగుణైః ॥ 3

టీ:- య ఇతి. అవిజ్ఞాత శబ్దేన ఆహృతః వ్యాహృతః ఉక్తో యః స ఈశ్వరః అవిజ్ఞాతనామ నిరుక్తిః. యద్యస్మాత్పుంభిర్నామాది యోగేన న విజ్ఞాయతే. 3

ఆ జీవునకు మిత్రుడైన వాడు అవిజ్ఞాతుడని పిలువబడు చున్నాడు. ఆ విధముగా పిలువబడువాడు ఈశ్వరుడు. అవిజ్ఞాతుడనగా పేర్లచే గాని, క్రియలచే గాని, గుణములచే గాని ఎవడు తెలియబడ కున్నాడో అతడు..3

శ్లో॥ యదా జిఘృక్షన్పురుషః కార్త్స్న్యేన ప్రకృతేర్గుణాన్ ।
నవద్వారం ద్విహస్తాంఘ్రిం తత్రామన్యత సాధ్వితి ॥ 4

టీ:- యదేతి. తత్ర తేషు పురేషు మధ్యే. 4

ఎప్పుడైతే జీవుడు సంపూర్ణముగా ప్రకృతి గుణములైన సత్వాదులను ఆస్వాదించదలచినాడో అప్పుడు ఆ యా శరీరములలో, తొమ్మిది ద్వారములు, కాళ్ళు, చేతులు గల మనుష్య దేహము బాగుంది అని అనుకొనెను. 4

శ్లో॥ బుద్ధిం తు ప్రమదాం వింద్యాన్మమాహమితి యత్కృతమ్ ।
యామధిష్ఠాయ దేహేఽస్మిన్పుమాన్భుంక్తేఽక్షిభిర్గుణాన్ ॥ 5

టీ:- బుద్ధమితి. అక్షిభిరింద్రియైః. 5

ఆ సుందర స్త్రీని బుద్ధిగా తెలుసుకో, ఏ బుద్ధిచేత జీవుడు నేను, నాది అను అభిమానము కలిగియున్నాడో ఏ బుద్ధిని అధిష్టానముగా చేసుకొని ఈ దేహమున ఇంద్రియములచేత గుణ కార్యములను భోగించుచున్నాడో... 5

శ్లో॥ సఖాయ ఇంద్రియగుణా జ్ఞానం కర్మ చ యత్కృతమ్ ।
సఖ్యస్తద్వృత్తయః ప్రాణః పంచవృత్తిర్యథోరగః ॥ 6

టీ:- సఖాయఇతి.పంచవృత్తిత్వాత్పంచశిరాః సర్పఇవ ప్రాణః. 6

ఏ ఇంద్రియములచేత జ్ఞానము పొంది, కర్మ చేయబడినదో ఆ ఇంద్రియములు మిత్రులు. ఆ ఇంద్రియ వృత్తులు మిత్రురాళ్ళు. పంచప్రాణ వృత్తులచే గూడిన ప్రాణమే ఐదుతలల పాము. 6

శ్లో॥ బృహద్బలం మనోవిద్యాదుభయేంద్రియనాయకమ్ ।
పాంచాలాః పంచవిషయా యన్మధ్యే నవ ఖం పురమ్ ॥ 7

టీ:- ఏకాదశ భట ఇత్యనేనైకాదశో మహాభటో నాయక ఇత్యుక్తం సందర్శయతి బృహదితి. బృహద్బలం యస్య తన్మనః నవఖాని ద్వారాణి యస్య. 7

పదకొండవబలముకలిగిన భటుడే మనస్సు. పంచజ్ఞానేంద్రియ, పంచకర్మేంద్రియములకు నాయకుడు. శబ్ద స్పర్శాది ఐదు విషయ భోగములు పంచాల దేశము. ఈ ఇంద్రియముల మధ్యలో తొమ్మిది ద్వారములుగల పురమే దేహము. 7

శ్లో॥ అక్షిణీ నాసికే కర్ణౌ ముఖం శిశ్న గుదావితి ।
ద్వే ద్వే ద్వారౌ బహిర్యాతి యస్తదింద్రియసంయుతః ॥ 8

టీ:- ద్యుమత్సఖ ఇత్యాదేరర్థం సంక్షేపేణాహ - అక్షిణీ ఇతి. యస్తదింద్రియసంయుతః స ఆత్మా తాభిః. ద్వార్భిర్బహిర్యాతీతి. 8

ఒకేచోట రెండేసి ద్వారములు గలవని చెప్పబడినవి. అవి రెండు కన్నులు, రెండు ముక్కు రంధ్రములు, రెండు చెవులు, నోరు, మల మూత్రద్వారములు. జీవుడు ఈ ఇంద్రియములచే గూడినవాడై ఈ ద్వారములద్వారా బయటికి వెళ్ళుచున్నాడు. 8

శ్లో॥ అక్షిణీ నాసికే చాస్యమితి పంచపురస్కృతాః ।
దక్షిణా దక్షిణః కర్ణ ఉత్తరాచోత్తరః స్మృతః ।
పశ్చిమే ఇత్యథో ద్వారౌ గుణశిశ్నావిహోదితౌ ॥ 9

టీ:- అక్షిణీ ఇతి. పురః పూర్వభాగే కృతాః. 9

రెండు కన్నులు, ముక్కు రంధ్రములు రెండు, నోరు ఈ ఐదు ద్వారములు తూర్పునందు నిర్మింపబడినవి. కుడిచెవి దక్షిణ దిశ ద్వారము, ఎడమ చెవి ఎడమ దిశ ద్వారము. 9

శ్లో॥ ఖద్యోతావిర్ముఖీ చాత్ర నేత్రే ఏకత్ర నిర్మితే ।
రూపం విభ్రాజితం తాభ్యాం విచష్టే చక్షుషేశ్వరః ॥ 10

టీ:- ఖద్యోతేతి. నేత్రే ఇతి. రూపమితి. చక్షుషేతి. ఖద్యోతాదీనాం వ్యాఖ్యానం. శేషోఽనువాదః ఈశ్వరః పురంజనః. 10

ఈ దేహమున క్రిందనుండు జననేంద్రియ, మలవిసర్జనేంద్రియ ములే పశ్చిమ దిక్కున రెండు ద్వారములని చెప్పబడుచున్నది. ఈ పురమున ఖద్యోత, ఆవిర్ముఖమను రెండు ఒకేచోట నిర్మిత నేత్రములు, రెండు ద్వారములు రూపమే విభ్రాజిత దేశము. ఈ పురమునకు ప్రభువు పురంజనుడు. నేత్రేంద్రియమను ద్వారముగుండా రూపమును దర్శించినాడు. 10

శ్లో॥ నళినీ నాళినీ నాసే గంధస్సౌరభముచ్యతే ।
ఘ్రాణోఽవధూతో ముఖ్యాస్యం విపణోవాగ్రసవిద్రసః ॥ 11

టీ:- నళినీతి.నాసే ఇతి వ్యాఖ్యా. అవధునోతీత్యవధూతో వాయుః. తదాత్మకేనోచ్ఛ్వాసేన స హైకస్థానత్వాత్. ఘ్రాణోఽవధూతః. ఆస్యమితి వ్యాఖ్యా. రసజ్ఞవిపణాన్విత ఇత్యత్రరసజ్ఞశబ్దనిర్దిష్టస్య, రసవిదిత్యనువాదః రస ఇతి వ్యాఖ్యా. రసనేంద్రియమిత్యర్థః. విపణో వాగ్రసవిద్రస ఇత్యేవ పాఠః. ఆర్షత్వాన్నదోషోఽక్షరాధిక్యం. 11

నళినీ, నాళినీ అనే ద్వారములు ముక్కు పుటములు, స్సౌరభమనగా గంధమని, అవధూతుడనగా విడవబడు గాలి, వాయు స్వరూపమైన ఉచ్ఛ్వాస చేత కలిసి ఉండునది. కనుక ఘ్రాణేంద్రియము అవధూతుడు మిత్రుడు. ముఖ్యమనే ద్వారము నోరు. వాగింద్రియమే విపణుడు. రసవిత్ అనగా రసేంద్రియము, రసజ్ఞుడనే మిత్రుడు. 11

శ్లో॥ ఆపణో వ్యవహారోఽత్ర చిత్రమంధో బహూదనమ్ ।
పితృహూర్దక్షిణః కర్ణ ఉత్తరోదైవహూః స్మృతః ॥ 12

ఈ పరోక్ష కథనమునయందు సంభాషించడమే ఆపణుడనే మిత్రుడు. రకరకముల అన్నమే బహూదన దేశము. కుడిచెవి పితృహూ అనే ద్వారము, ఎడమ చెవి దేవహూ అనే ద్వారముగా చెప్పబడినది. 12

శ్లో॥ ప్రవృత్తం చ నివృత్తం చ శాస్త్రం పాంచాలసంజ్ఞితమ్ ।
పితృయానం దేవయానం శ్రోత్రాచ్ఛ్రుతధరాద్వ్రజేత్ ॥ 13

ప్రవృత్తి నివృత్యాకమైన కర్మకాండ, జ్ఞానకాండలను తెలుపు శాస్త్రమును దక్షిణ, ఉత్తర పాంచాల దేశములని చెప్పబడెను. శ్రుతధరుడనే చెవి ద్వారా పితృయాన, దేవయానములను వెళ్ళును. 13

టీ:- అంధః అన్నం. (12-13)

శ్లో॥ ఆసురీ మేఢ్రమర్వాగ్ద్వార్వ్యవాయో గ్రామిణాం రతిః ।
ఉపస్థో దుర్మదః ప్రోక్తో నిర్‌ఋతిర్గుద ఉచ్యతే ॥ 14

ఆసురి అనే ద్వారమనగా క్రింద నుండు జననేంద్రియము. దానిగుండా గ్రామకమను దేశమునకు వెళ్ళును అనగా విషయలాలసు -లకు ప్రీతి స్థానమే యువతీ సంగమమే, స్త్రీ యోనియే దర్మదనుడను మిత్రుడుగా, గుద స్థానము నిఋరుతిగా చెప్పబడినది. 14

టీ:- గ్రామకమిత్య స్యానువాదః. గ్రామిణాంరతిరితి తస్య వ్యాఖ్యావ్యవాయ ఇతి. (14-5)

శ్లో॥ వైశసం నరకం పాయుర్లుబ్ధకో౽ంధౌ తు మే శ్రుణు ।
హస్తపాదౌ పుమాంస్తాభ్యాం యుక్తో యాతి కరోతి చ ॥ 15

వైశసదేశమనగా నరకమని, విసర్జనేంద్రియమే లుబ్ధకుడుగా తెలుసుకో. ఇంకా నా మాటలు విను. గుడ్డివాళ్ళు అనువారు కాళ్ళు, చేతులే మానవుడు కాళ్ళతో నడుచును. చేతులచే కర్మ చేయును. 15

శ్లో॥ అంతఃపురం తు హృదయం విషూచిర్మన ఉచ్యతే ।
తత్ర మోహం ప్రసాదం వా హర్షం ప్రాప్నోతి తద్గుణైః ॥ 16

టీ:- విషూచీన పదార్థానువాదో విషూచిరితి. తద్గుణైర్మనో గుణైః తమస్సత్త్వరజోభిః. 16

హృదయమే అంతఃపురము. దానిలోని విషూచీనుడను ప్రధాన సేవకుడు మనస్సు, మనోగుణములైన తమస్సుచే మోహమును, సత్త్వముచే ప్రసన్నతను, రజోగుణముచే హర్షమును పొందుచున్నాడు. (16)

శ్లో॥ యథా యథా విక్రియతే గుణాక్తో వికరోతి వా ।
తథా తథోపద్రష్టాత్మా తద్వృత్తీరనుకార్యతే ॥ 17

టీ:- మహిషీయద్యధీహేతేత్యాదేరర్థం సంగృహ్యాహ - యథేతి. యథా యథా బుద్ధిః స్వప్నే విక్రియతే జాగ్రతి వికరోతి వా ఇంద్రియాణి పరిణామయతి. తస్యాగుణైరక్తోలిప్తః.ఆత్మా తథా తథా తస్యాః వృత్తీః. దర్శన స్పర్శనాద్యాః. కేవలముపద్రష్టైవ సన్. బలాదనుకార్యతే. 17

శ్లో॥ దేహోరథస్త్వింద్రియాశ్వః సంవత్సరరయోఽగతిః ।
ద్వి కర్మ చక్రస్త్రిగుణధ్వజః పంచాసుబంధురః ॥ 18

టీ:- ఆశుగమిత్యేతద్వ్యాచష్టే - దేహ ఇతి. సంవత్సరస్యేవా ప్రతిహతో రయో వేగః న ప్రతీతో యస్య సః. సంవత్సరరయః వస్తుతస్తు అగతిః స్వప్న శరీరాదేర్బుద్ధావేవ వృత్తిత్వేన దేశాంతరగత్యభావాత్. పాఠాంతరే. సంవత్సరశ్చ తత్కృతం వయశ్చ తాభ్యాం గతిర్యస్యేతి. ద్విషమిత్యస్య వ్యాఖ్యా ద్విచక్రమిత్యస్య వ్యాఖ్యాద్వికర్మచక్రు ఇతి. త్రిగుణ ధ్వజ ఇతి త్రివేణు పదవ్యాఖ్యా. 18

మహిషీయద్యదహేతతత్తదేవాన్వవర్తత (4-25-56 శ్లో) అను వాటి అర్థమును సంగ్రహించి చెప్పుచున్నాడు. బుద్ధి ఏ ఏ విధముగా స్వప్నమున వికారమును పొందుచుండునో జాగరిత అవస్థయందు ఇంద్రియములను వికారము పొందింపచేయునో ఆ బుద్ధి గుణములైన సత్వరజస్తమోగుణములచే పూయబడి అనగా ఆత్మయందు ఆరోపింపబడి, ఆత్మ వాటిచే పూయబడినట్లగును. ఆ కారణమున కేవల సాక్షియే అయినప్పటికి ఆ యా విధములుగా బుద్ధివృత్తులైన స్పర్శన దర్శనాదులను అనుకరింపచేయబడుచున్నది. 17

ఇరువది ఆరవ అధ్యాయములోని 1 వ శ్లోక వ్యాఖ్యానము చేయుచున్నాడు. ఆశుగం అని మొదలుకొని, వాటిని నారదుడు, వివరించుచున్నాడు. దేహమే రథము. ఐదు ఇంద్రియములే గుఱ్ఱములు సంవత్సరకాల వేగమే మార్గము. నిజమునకు దీనికి గమనము లేదు. ఎందుకనగా స్వప్న శరీరము బుద్ధియందే వివరింపబడుచుండును కనుక. వేరే ప్రాంతమునకు వెళ్ళుటకు వీలులేదు. సంవత్సర వయోగతిః అను పాఠమును పరిగ్రహించిన సంవత్సరము, దానినుండి కలిగిన వయస్సు ద్వారా గమనము దేనికో ఆ రథము అనగా దేహము, 26 వ అధ్యాయమున 1 వ శ్లోకమున ద్వేషం అను పదమునకు నారదులు వ్యాఖ్యానము చేయలేదు. ఆ రథమునకు రెండు చక్రములు అనగా

శ్లో॥ మనోరశ్మిర్బుద్ధిసూతో హృన్నీడో ద్వంద్వకూబరః ।
పంచేంద్రియార్థ ప్రక్షేపస్సప్తధాతువరూధకః ॥ 19

టీ:- పంచప్రహరణమిత్యేతద్వ్యాచష్టే. పంచేంద్రియార్థ ప్రక్షేప ఇతి. (19)

శ్లో॥ ఆసురీ విక్రమో బాహ్యో మృగతృష్ణాం ప్రధావతి ।
ఏకదశేంద్రియచమూః పంచసూనా వినోదకృత్ ।
సంవత్సరశ్చండవేగః కాలో యేనోపలక్షితః ॥ 20

టీ:- పంచేంద్రియైః సూనా హింసా తయా విషయసేవాం కరోతీతి పంచసూనా వినోదకృత్. అనేన చచార మృగయాం తత్రేత్యాది వ్యాఖ్యాతం. 20

పుణ్యపాపకర్మలే. సత్వరజస్తమో గుణములే జండా కర్రలుగా గలది. పంచప్రాణ వృత్తులే ప్రాణాపాన వ్యానోదాన సమానములే కమ్మీలు. 18

ఇరువది ఆరవ అధ్యాయములోని రెండవ శ్లోక వ్యాఖ్యానము చేయుచున్నాడు. ఈ దేహమనే రథమునకు మనస్సే కళ్ళెము; బుద్ధియే సారథి; హృదయమే రథ సారథి కూర్చుండు స్థలము; సుఖదుఃఖ ద్వంద్వములే కాడిని కట్టుస్థానము; పంచేంద్రియ విషయములే దానిలోని ఆయుధములు (శబ్దస్పర్శాదులు) చర్మము, మూలుగు, మాంసము, వీర్యము, క్రొవ్వు, రక్తము, ఎముకలు అనే సప్త ధాతువులే దానిని రక్షించే ఆవరణములు. 19

దేహములోని అయిదు కర్మేంద్రియములే దేహము అనే రథము యొక్క అయిదు రకముల బయటకు కనబడే నడక, పదకొండు ఇంద్రియములే సైన్యము గాగల జీవుడు. అయిదు ఇంద్రియములచేత హింసతో కూడిన వేటవలె అధర్మ మార్గమున విషయ భోగములను అనుభవించుచు ఎండమావులవెంట పరిగెత్తుచున్నాడు. సంవత్సరము ప్రచండమైన వేగము గలది. దేనిచేత కాలము కొలవబడుచున్నదో ఆ కాలమునకు పగళ్ళు గంధర్వులనియు, రాత్రులు గంధర్వస్త్రీలని

శ్లో॥ తస్యాహానీహ గంధర్వా గంధర్వ్యో రాత్రయః స్మృతాః ।
హరంత్యాహుః పరీవృత్త్యా షష్ట్యుత్తరశతత్రయమ్ ॥ 21

టీ:- పరిక్రాంత్యా పరిభ్రమణేన. 21

చెప్పబడినది. మూడువందల అరవై రోజులు పరిభ్రమించుటచేత ఆయుర్దాయమును హరించుచున్నారు. 20, 21

శ్లో॥ కాలకన్యా జరా సాక్షాల్లోకస్తాం నాభినందతి ।
స్వసారం జగృహే మృత్యుః క్షయాయ యవనేశ్వరః ॥ 22

టీ:- భగినీత్వేన జగృహే లోకానాం క్షయాయ. 22

కాలకన్య యనగా సాక్షాత్తుగా ముసలితనమే. లోకమున ఎవ్వరు గూడా దానిని మెచ్చుకోరు. మృత్యువే యవనేశ్వరుడు, లోకమును నశింపచేయుటకు ముసలితనమును చెల్లెలుగా స్వీకరించెను. 22

శ్లో॥ ఆధయో వ్యాధయస్తస్యసైనికా యవనాశ్చరాః ।
భూతోపసర్గా శురయః ప్రజ్వారో ద్వివిధో జ్వరః ॥ 23

టీ:- చరాస్సంచారిణః భూతానాముపసర్గే పీడాయామాశు శీఘ్ర మృత్యు హేతుః రయో వేగో యస్యేతి ప్రజ్వార ఇతి. ప్రజ్వరశబ్దస్య వ్యాఖ్యా. పాఠాంతరే భూతలే భూతకృతా ఉపసర్గే అరయః అనేన చ అరిభిః రుద్ధ ఇతి పదం వ్యాఖ్యాతం. ద్వివిధః శీతోష్ణభేదేన ప్రవేశభేదాత్. (23)

ఆ యవనునకు మానసిక, శారీరక రోగములు పాదచారులగు సైనికులు. ప్రాణులను పీడించుటయందు మృత్యు కారణమైన అతి వేగము గలవాడు ప్రజ్వారుడు. "భూతోపసర్గాహ్యరయః" అను పాఠమునుసరించిన ప్రాణికి సంబంధించిన రోగములే శత్రువులు. దీనిద్వారా సైనికులచే రోగములచే బంధింపబడినవాడు అని అర్థం. ఆ ప్రజ్వారుడు రెండు రకముల జ్వరము గలవాడు. శీతోష్ణరూపేణ, ప్రవేశ నిర్గమ భేదం చేత..23

శ్లో॥ ఏవం బహువిధైర్దుఃఖైర్దైవభూతాత్మసంభవైః ।
క్లిశ్యమానశ్శతం వర్షాన్ దేహీ దేహే తమోవృతః ॥ 24

టీ:- ఏవంపరోక్షత్వేన ఉక్తమర్థం వ్యాఖ్యాయ సర్వకథాతాత్పర్యమాహ -ఏవమిత్యాది విరమక్రమేణేత్యంతేన. ఏవమితి.అధిదైవికాదిభిర్దుఃఖైః క్లిష్యమానో మమాహమితి. దేహే శతం వర్షాణి శేతే వర్తతిఇతి ద్వయోరన్వయః. 24

ఈ విధముగా పరోక్షముగా చెప్పిన దాని అర్థమును వివరించి సంపూర్ణ కథా తాత్పర్యమును చెప్పుచున్నాడు. ఈ విధముగా అనేకములైన ఆధిదైవిక, ఆధిభౌతిక, ఆధ్యాత్మిక దుఃఖములచే పీడింపబడుచు ఈ దేహమున మమ అహం అని నూరు సంవత్సరములు అజ్ఞానముచే కప్పబడుచున్నాడు జీవుడు. 24

శ్లో॥ ప్రాణేంద్రియ మనోధర్మా నాత్మన్యధ్యస్య నిర్గుణే ।
శేతే కామలవాన్ ధ్యాయన్మమాహమితి కర్మకృత్ ॥ 25

టీ:- ప్రాణేతి. అశనాపిపాసాదీన్ ప్రాణధర్మాన్ అంధత్వాదీనింద్రియ ధర్మాన్ కామాదీన్ మనోధర్మాంశ్చ నిర్గుణేఽప్యాత్మన్యధ్యస్య కామలవాన్ విషయసుఖలేశాన్. ధ్యాయన్ కర్మకృత్. 25

ఆకలిదప్పులు అను ప్రాణ ధర్మములను, గ్రుడ్డితనము మొదలగు ఇంద్రి ధర్మములను, కామక్రోధాది మనో ధర్మములను నిర్గుణుడైనప్పటికీ, ఆత్మయందు ఆరోపించి విషయ సుఖలేశములను చింతిస్తూ నాది, నేను అంటూ కర్మలుచేస్తూ, దేహమందు ఉంటున్నాడు. 25

శ్లో॥ యదాత్మానమవిజ్ఞాయ భగవతం పరం గురుమ్ ।
పురుషస్తు విషజ్జేతగుణేషు ప్రకృతేః స్వదృక్ ॥ 26

టీ:- తతః కిమిత ఆహ-ద్వాభ్యాం. యదేతి. స్వదృక్ స్వప్రకాశ స్వభానోఽపి. 26

స్వయం ప్రకాశుడే అయినప్పటికి తనను తాను తెలిసికొనక గురువులకు గురువగు భగవంతునిగా ప్రకృతి గుణములయందు విశేష ఆసక్తి కలిగియుండును. 26

శ్లో॥ గుణాభిమానీ స తదా కర్మాణి కురుతే వశః ।
శుక్లం కృష్ణం లోహితం వా యథా కర్మాభిజాయతే ॥ 27

టీ:- గుణేతి. శుక్లం. సాత్త్వికం కృష్ణం తామసం. లోహితం రాజసం యథా కర్మ తథా జాయతే. 27

గుణములయందు అభిమానము గలిగినప్పుడు అస్వతంత్రుడై కర్మలను చేయుచుండును. సాత్విక, తామసిక, రాజసములు తను అచరించినచో సాత్వికాది కర్మానుసారము మళ్ళీ జన్మ వచ్చును. 27

శ్లో॥ శుక్లాత్ప్రకాశ భూయిష్ఠాన్ లోకాన్ప్రాప్నోతి కర్హిచిత్ ।
దుఃఖోదర్కాన్క్రియా యాసాం స్తమశ్శోకోత్కటాన్క్వచిత్ ॥ 28

టీ:- తదేవాహ-ద్వాభ్యాం శుక్లాదితి. ప్రకాశో భూయిష్ఠో యేషు దుఃఖముదర్కముత్తరఫలం యేషు క్రియయా ఆయాసో యేషు తాన్. లోహితాన్ తమశ్శోకావుత్కటౌ యేషు తాన్. కృష్ణాదితి. జ్ఞేయం. 28

ఒకానొక కాలమందు సాత్విక కర్మవల్ల విశేష ప్రకాశముగల లోకములను, మరొక్కప్పుడు రాజసకర్మ వల్ల దుఃఖము ఉత్తర ఫలముగా అనగా కర్మ పిమ్మట దుఃఖము కలిగే లోకములను, వేరొకప్పుడు తామసిక కర్మల వల్ల మిక్కిలి అజ్ఞానము, శోకము గల లోకములను పొందుచున్నాడు. 28

శ్లో॥ క్వచిత్పుమాన్క్వచిచ్చ స్త్రీ క్వచిన్నో భయమందధీః ।
దేవో మనుష్యస్తిర్యగ్వా యథాకర్మగుణం భవః ॥ 29

టీ:- క్వచిదితి. నో భయం నపుంసకం యథా కర్మగుణం కర్మగుణా వనతిక్రమ్య. 29

అజ్ఞానముచే నిండిన ఆ జీవుడు కర్మ గుణములను అనుసరించి ఒకప్పుడు పురుషుడిగా, ఒకప్పుడు స్త్రీగా, ఒకప్పుడు నపుంసకుడిగా, ఒకప్పుడు దేవతగా, మనుష్యుడిగా, పశువుగా జన్మించుచున్నాడు. 29

శ్లో॥ క్షుత్పరితో యథా దీనస్సారమేయో గృహం గృహమ్ ।
చరన్విందతియద్దిష్టం దండమోదనమేవ వా ॥ 30

టీ:- తేషు దైవవశేన సుఖదుఃఖే ప్రాప్నోతీతి సదృష్టాంతమాహ-ద్వాభ్యాం. క్షుదితి. క్షుధా పరీతోవ్యాప్తః. సారమేయః శ్వాదండం దండేన తాడనం. 30

ఆ దేహములయందు దైవ వశమున సుఖదుఃఖములను పొందుచున్నాడని దృష్టాంతపురస్సరముగా చెప్పుచున్నాడు. ఏ విధముగానైతే కుక్క ఆకలిగొని, దీనముగా ఇల్లిల్లు తిరుగుచు దైవ వశమున దొరికితే అన్నము లేదా దెబ్బలు తింటుందో.. 30

శ్లో॥ ఏవం కామాశయో జీవ ఉచ్చనీచ పథా భ్రమన్ ।
ఉపర్యధో వా మధ్యే వా యాతి దిష్టం ప్రియా ప్రియమ్ ॥ 31

టీ:- ఏవమితి. కామవ్యాప్త ఆశయో యస్య. 31

అదే విధముగా జీవుడు కోరికలచే నిండిన మనస్సు గలవాడై ఉత్తమ, అథమ మార్గములయందు సంచరించుచూ (అనగా స్వర్గము యందో, నరకముయందో, మనుష్య లోకముననో) దైవ వశమున సుఖదుఃఖములను పొందుచున్నాడు. 31

శ్లో॥ దుఃఖేష్వేకతరేణాపి దైవభూతాత్మహేతుషు ।
జీవస్య న వ్యవచ్ఛేదస్స్యాచ్చేత్తత్తత్ప్రతిక్రియా ॥ 32

టీ:- నను తర్హి సుఖస్య సంభవాత్ దుఃఖస్య ప్రతీకారసంభవాన్నైకాంతతో హేయత్వం తత్రాహ-దుఃఖేష్వితి. దుఃఖస్య ప్రతీకారస్తావన్నాస్తి స్యాచ్చేత్తస్య తస్య ప్రతిక్రియా. తథాపి త్రివిధేషు మధ్యే. ఏకతరేణాపి దుఃఖేన వ్యవచ్ఛేదో వియోగో నాస్తి. 32

సుఖమును పొందుచు, దుఃఖమును తొలిగించుకొను ఉపాయములు ఉన్నవి. అనగా కర్మలద్వారా దుఃఖమును తొలిగించుకొనగలము గాన సంపూర్ణముగా కర్మలకు హేయత్వము చెప్పవలసిన అవసరము లేదనగా చెప్పుచున్నాడు. దుఃఖమునకు ప్రతీకారము లేనేలేదు. ఉన్నప్పటికి దుఃఖ ప్రతిక్రియ, ఆధ్యాత్మిక, ఆదిభౌతిక, ఆదిదైవికములైన దుఃఖములలో ఏదో ఒక దుఃఖమునుండి వియోగము లేదు. అనగా ఏదో ఒక దుఃఖమునను భవించుచుండును. (దుఃఖము

ఎంత, ఏమిటి? దుఃఖమున్నదా? దృష్టము కాదు కనుక దుఃఖము కలుగు వరకుగూడా దానికి సంబంధించిన జ్ఞానము లేకపోవడం ద్వారా దానికి ప్రతీకారము చేసుకొనలేము లేదా ఆ ప్రతిక్రియలుగూడా ఆయాసాది దుఃఖ రూపములే). 32

శ్లో॥ యథా హి పురుషో భారం శిరసా గురుముద్వహన్ ।
తం స్కంధేన స ఆదత్తే తథా సర్వాః ప్రతిక్రియాః ॥ 33

టీ:- ప్రతిక్రియాణామపి దుఃఖస్వరూపత్వాదితి సదృష్టాంతమహ- యథాహీతి. 33

మనము దుఃఖ నివృత్తికి చేయు ప్రతిక్రియలు అన్ని గూడా దుఃఖరూపములే అని దృష్టాంతపురస్సరముగా చెప్పుచున్నాడు.

ఒక వ్యక్తి శిరస్సుపైన భారమును మోయుచు కొద్ది సమయమున దానిని భుజముపైకి మార్చుకొనును. దానిద్వార భారము తగ్గినట్టు భావించినను కొద్ది సమయమున మళ్ళీ శిరస్సుకు మార్చుకొనును. అనగా దుఃఖమునకు చేయు ప్రతిక్రియలుగూడా అట్టివే. దుఃఖము సంపూర్ణగా తొలగిపోదు. 33

శ్లో॥ నైకాంతతః ప్రతీకారః కర్మణాం కర్మకేవలమ్ ।
ద్వయం హ్యవిద్యోపసృతం స్వప్నే స్వప్న ఇవానఘ ॥ 34

టీ:- దుఃఖస్య మూలభూతాని తు కర్మాణి. ప్రతిక్రియాదికర్మభిర్నైవ నివర్తంత ఇత్యాహ నేతి. నైకాంతతః అత్యంతః సవాసనం. కేవలం జ్ఞానరహితం. అవిద్యయా ఉపసృతం ప్రాప్తం. అతో విరోధాన్న

దుఃఖమునకు మూలము కర్మలు. ఆ కర్మ ప్రతిక్రియాది కర్మల చేత తొలగదను విషయమును వివరించుచున్నాడు.

జ్ఞానరహితమై కేవలం కర్మ ద్వారా కర్మ తొలగదు. ఎందుకనగా నివారింపబడవలసిన కర్మ నివారించే ప్రతీకార కర్మ రెండు గూడా అవిద్యా జనితములే. ఒకడు కలలో కలను పొందుచున్నాడు. రెండవ కలను అనుభవించుచున్నప్పుడు తాను మేల్కొనట్టు భావించినప్పుడు

నివర్త్యనివర్తకత్వమితి భావః. అత్ర దృష్టాంతః. స్వప్నే దృష్టః స్వప్నః ప్రబోధం వినా యథా తం స్వప్నం అత్యంతం న పత్రికరోతీత్యర్థః. 34

మాత్రమే నేను స్వప్నమును పొందితిని అను జ్ఞానము ఉండదు. కాని కలలో లేచి. నేను స్వప్నమును పొందితిని అనుకొను (కాలపు) లేవడం ఉందే అదిగూడా స్వప్నరూపమే కనుక, ముఖ్య స్వప్నము నుండి మేల్కొల్పుటకు కారణము కాదు. 34

శ్లో॥ అర్థే హ్యవిద్యమానేఽపి సంసృతిర్న నివర్తతే ।
మనసా లింగరూపేణ స్వప్నే విచరతో యథా ॥ 35

టీ:- నను తర్హి అజ్ఞానవిలసితత్వేన సంసృతి హేతోర్దేహాదేరప్య సత్యత్వాత్కిం తర్హి తన్నివర్తన ప్రయాసేన? తత్రాహ-అర్థేహీతి. లింగరూపేణ ఉపాధిభూతేన. 35

మరి ఇది అంతా అజ్ఞాన మూలకమే అని అన్నప్పుడు సంసార కారణమైన దేహాదులు గూడా అసత్యములే కదా, అసత్యములైన వాటి నివారణమునకు ఎందుకింత ప్రయాస అనుభవించాలి? అనగా మనస్సును ఉపాధిగా చేసుకొని జీవుడు స్వప్నమున (అసత్యమైనప్పటికి) ఏ విధముగా సంచరించుచున్నాడో, అనగా స్వప్నమున నిజమునకు పులులు, సింహములు లేనప్పటికి ఉన్నట్టుగా స్వప్నము వచ్చినప్పుడు భయాదులు ఏ విధముగా తొలిగిపోవో అదే విధముగా ఈ సంసారమున దుఃఖ కారణమైన పదార్థములు మిథ్యయే అయినను దానివలన కలుగు సంసార దుఃఖము మాత్రము తొలగదు. 35

శ్లో॥ అథాత్మనోఽర్థభూతస్య యతోఽనర్థ పరంపరా ।
సంసృతి స్తద్వ్యవచ్ఛేదో భక్త్యా పరమయాగురౌ ॥ 36

టీ:- తదేవం సంసృతి ప్రకారముక్త్వా తన్నివృత్తిప్రకారమాహ-అథేతి.

ఇంతవరకు సంసారమునకు కారణమును సంసార స్వరూపమును చెప్పి ఆ సంసార దుఃఖ నివృత్తి ప్రకారమును తెలుపు చున్నాడు. అందువల్ల పురుషుడిచేత అర్థింపబడవలసిన యథార్థ తత్త్వమైన ఆత్మను తెలుసుకోకపోవడం వల్ల, అనగా అజ్ఞానము వలన

అథ తస్మాత్పురుషార్థభూతస్యైవాత్మనః. యతో జ్ఞానాత్. మనసో వా, అనర్థపరంపరా సంసృతిర్భవతి తస్య వ్యవచ్ఛేదో గురురూపే వాసుదేవేభక్త్యైవ. 36

మనస్సునకు అనర్థ పరంపరా రూపమైన సంసారము కలుగుతుంది. గురురూపుడైన వాసుదేవుడియందు గొప్పనైన భక్తి చేతనే అది నివారింపబడుతుంది. 36

శ్లో॥ వాసుదేవే భగవతి భక్తియోగస్సమాహితః ।
సధ్రీచీనేన వైరాగ్యం జ్ఞానం చ జనయిష్యతి ॥ 37

టీ:- నను సంసృతి నివృత్తిః వైరాగ్యపూర్వకాత్ జ్ఞానదేవ న తు భక్త్యా. శ్రు. "తరతి శోకమాత్మని" దిత్యాది శ్రుతేస్తత్రాహ-వాసుదేవఇతి. సధ్రీచీనేన సమీచీనేన ప్రకారేణ. 37

మరి సంసార నివృత్తి వైరాగ్య పూర్వకమైన జ్ఞానము ద్వారానే విముక్తి కానీ, భక్తి చేత కాదు. ఆత్మను తెలుసుకొన్నవాడు సమసామునుండి విముక్తి పొందుతాడు అని అనేక శ్రుతులు తెలుపు-చున్నవి గదా! అనగా వైరాగ్య పూర్వక జ్ఞానము ద్వారానే ముక్తి కానీ, భగవంతుడైన వాసుదేవునియందు ఏకాగ్రతతో కూడిన చక్కటి భక్తి కలిగియున్నచో ఆ భక్తి వైరాగ్య పూర్వక యథార్థ జ్ఞానమును కలిగించును. 37

శ్లో॥ సోఽచిరాదేవ రాజర్షే స్యాదచ్యుత కథాశ్రయః ।
శ్రుణ్వతః శ్రద్దధానస్య నిత్యదా స్యాదధీయతః ॥ 38

టీ:- నన్వసౌ మహాఫలో భక్తియోగః కథం స్యాత్తత ఆహ-స ఇతి. హే రాజర్షే, స తు అచ్యుతస్య కథామాశ్రిత్య వర్తమానో చిరాత్స్యాత్ కస్య స్యాత్తదాహ-శ్రుణ్వతః. అధీయానస్య చ. 38

మరి గొప్ప ఫలమైన భక్తి యోగము ఏ విధముగా కలుగుతుంది? అనగా అచ్యుతుడి కథలను ఆలంబనముగా చేసుకొనిచో ఆ భక్తి యోగము శీఘ్రముగా కలుగుతుంది. ఎవరికి కలుగుతుంది? అనగా ఓ రాజర్షీ! రోజు శ్రవణము చేస్తూ, అధ్యయనము చేస్తూ, శ్రద్ధ కలిగిన వాడికి కలుగుతుంది. 38

శ్లో॥ యత్ర భాగవతా రాజన్ సాధవో విశదాశయాః ।
భగవద్గుణానుకథన శ్రవణవ్యగ్రచేతసః ॥ 39

టీ:- నను సా కథా కుత్ర స్యాత్తదాహ - యత్రేతి. భగవతో గుణానుకథనే శ్రవణే చ. వ్యగ్రం సత్వరం చేతో యేషాం తే. 39

ఎక్కడ భక్తియోగము శీఘ్రముగా కలుగును? ఓ రాజా! ఎక్కడైతే భాగవతులు, సాధుజనులు, స్వచ్ఛమైన హృదయము గలవారు భగవంతుడి గుణములు చెప్పుటయందు, వినుటయందు తొందరపడే మనస్సులు గలవారు గలరో అక్కడ భక్తియోగము శీఘ్రముగా కలుగుతుంది. 39

శ్లో॥ తస్మిన్మహన్ముఖరితా మధుభిచ్చరిత్ర
పియ్యూష శేషసరితః పరితః స్రవంతి ।
తాయే పిబంత్యవితృషో నృప గాఢ కర్ణై
స్తాన్నస్పృశంత్యశన తృడ్భయ శోక మోహాః ॥ 40

టీ:- నను సాధుసంగం వినా స్వయమేవ హరికథా చింతనాదినా భక్తిర్భవేదేవేత్యాశంక్యాహ-ద్వాభ్యాం. తస్మిన్నితి. తస్మిన్ స్థానే. మహద్భిర్ముఖరితాః కీర్తితాః మధుభిదశ్చరిత్ర మేవ పియూష్యం తదేవ శిష్యత ఇతి శేషో యాసు. అసారాంశరహితశుద్ధామృతవాహిన్య ఇత్యర్థః అవితృషః అలంబుద్ధిశూన్యాస్సంతః. గాఢైః సావధానైః కర్ణైః ఏతాస్సరితః పిబంతి సేవంతే. అశనశబ్దేన క్షుల్లక్ష్యతే. అశనాదయస్తాన్న స్పృశంతి. భక్తిరసికాన్ న బాధంత ఇత్యర్థః. 40

మరి సాధు సంగము లేకుండగనే స్వయముగా హరికథా చింతన ద్వారా భగవద్భక్తి కలుగుతుంది కదా? అని ఆశంకించి చెప్పుచున్నాడు. ఆ స్థానము చుట్టూ (సాధుసంగమము) మహనీయుల చేత కీర్తింపబడిన మధువైరి చరిత్రమును అమృతపు శేషము అనగా అసారమను అంశమే లేనిది అనగా శుద్ధామృత ప్రవాహపు నదులు స్రవించుచున్నవి. ఓ రాజా! ఎవరైతే చాలు అనే బుద్ధిలేని వారగుచు, ఏకాగ్రత కలిగి, కర్ణరంధ్రములచే భగవత్కథనుసేవిస్తారో అట్టి భక్తి రసికులను ఆకలి, దప్పి, భయము, దుఃఖము, వ్యామోహము మొదలగునవి బాధించవు. 40

శ్లో॥ ఏతైరుపద్రుతో నిత్యం జీవలోకః స్వభావజైః ।
న కరోతి హరేర్నూనం కథామృతనిధౌ రతిమ్ ॥ 41

టీ:- సత్సంగమంతరేణ స్వయమేవ కథాచింతనాదావాలస్యాదినా రసావేశాభావాచ్చ క్షుత్పిపాసాద్యభిభూతస్య భక్తిర్నసంభవతీత్యాహ- ఏతైరితి. స్వభావజైః అప్రమాణకైః దేహప్రయుక్తైర్వా ఏతైరశనాదిభిః నిత్యముపద్రుతోఽయం జీవలోకః. అమృతంనిధీయతేఽస్మిన్నితి అమృతనిధిః శ్రీహరేః కథైవామృతనిధిః తస్మిన్ రతిం న కరోతి నూనం నిశ్చితం. 41

సత్సంగము లేకుండా స్వయముగా చేయు కథా చింతనాదుల యందు అలస్యాది (సోమరితనము మొ॥) దోషములచేత భక్తి రస ప్రవేశము లేకుండుట చేత ఆకలిదప్పులు కలిగి, భక్తి కలుగదని చెప్పుచున్నాడు. స్వభావమునుండి పుట్టిన ఈ ఆకలి మొదలగు వాటిచేత పీడింపబడే ఈ జీవ సమూహము నిశ్చయముగా భగవత్కథామృతనిధి యందు ప్రేమను కలిగియుండదు. 41

శ్లో॥ ప్రజాపతి పతిస్సాక్షాద్భగవాన్గిరిశో మనుః ।
దక్షాదయః ప్రజాధ్యక్షానైష్ఠికాస్సనకాదయః ॥ 42

టీ:- భగవదనుగ్రహ మంతరేణ తు న కస్యాపి విజ్ఞానసంభవ ఇతి కైముత్యన్యాయేనాహ-చతుర్భిః. ప్రజాపతీతి. ప్రజాపతి పతిః బ్రహ్మా. 42

భగవదనుగ్రము లేకుండా ఎవ్వరికీ జ్ఞానము కలుగదు. బ్రహ్మాదులకే కలుగలేదు. ఇక వేరే వారినేమడిగేది అని వారిని గూర్చి చెప్పుచున్నాడు. (ఇదియే "కైముత్యన్యాయంకిముత") బ్రహ్మ; సాక్షాత్తు శివుడు; మనువు; దక్షాదులు; ప్రజాధ్యక్షులు, సనకాది నైష్ఠికులు. (తరువాతి శ్లోకముతో అన్వయము) 42

శ్లో॥ మరీచిరత్ర్యంగిరసౌ పులస్త్యః పులహః క్రతుః ।
భృగుర్వసిష్ఠఇత్యేతే మదంతా బ్రహ్మావాదినః ॥ 43

టీ:- మరీచిరితి. మదంతాః అహం నారదోఽంతే యేషాంతే. 43

మరీచి, అత్రి, అంగీరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, భృగువు, వసిష్ఠుడు నా వరకు (నారదుడి వరకు) గల బ్రహ్మావాదులు. (తరువాతి శ్లోకముతో అన్వయము) 43

శ్లో॥ అద్యాపి వాచస్పతయస్తపో విద్యా సమాధిభిః ।
పశ్యంతోఽపి న పశ్యంతి పశ్యంతం పరమేశ్వరమ్ ॥ 44

టీ:- అద్యేతి. వాచాంపతయోఽపి. తపో విద్యా సమాధిభిరుపాయైః పశ్యంతో విచిన్వంతోఽపి. పశ్యంతం సర్వసాక్షిణం న పశ్యంతి. 44

ఈనాటికి గూడా వాక్కులకధిపతులు, తపో విద్యా సమాధి ఉపాయములచేత వెతుకుతున్నప్పడికి సర్వసాక్షియైన పరమేశ్వరుడిని చూపలేకున్నారు. 44

శ్లో॥ శబ్దబ్రహ్మణి దుష్పారే చరంత ఉరువిస్తరే ।
మంత్రలింగైర్వ్యవచ్ఛిన్నం భజంతో న విదుః పరమ్ ॥ 45

టీ:- కుత ఇత్యత ఆహ-శబ్దబ్రహ్మణీతి. శబ్దబ్రహ్మణి వేదే ఊరుర్విస్తరో యస్య. అర్థతోఽపి సారశూన్యే తస్మిన్ వర్తమానాః. మంత్రాణాం లింగైర్వజ్రహస్తత్వాదిగుణయుక్త వివిధదేవతాభిధానసామర్థ్యైః పరిచ్ఛిన్న మేవేంద్రాదిదేవతారూపం. తత్తత్కర్మాభిమానాత్ తత్తద్రూపేణ భజంతః పరమేశ్వరం న విదుః. 45

శబ్దరూపమునగాని, అర్థదృష్టితోచూచినగాని సమాప్తి అంటూ లేని విధముగా సంచరించుచున్నవారై వజ్ర హస్తత్వాది గుణయుక్తములైన వివిధ దేవతలను గూర్చి చెప్పే సామర్థ్యము గల మ్రంతలింగములచే పరిచ్ఛిన్నమైన ఇంద్రియ రూపములను మాత్రమే, ఆ యా కర్మలకు అనుగుణముగా సేవించుచూ పరమేశ్వరుడిని తెలుసుకోకున్నారు. 45

శ్లో॥ యదాయమనుగృహ్ణాతి భగవానాత్మభావితః ।
స జహాతి మతిం లోకే వేదే చ పరినిష్ఠితామ్ ॥ 46

టీ:- తర్హ్యన్యః కోనామ కర్మాద్యాగ్రహం హిత్వా. పరమేశ్వరమేవ

అట్లైన వేరెవ్వడు కర్మాదులయందు బుద్ధిని విడచి పరమేశ్వరుడినే సేవిస్తాడు? అనగా! భగవంతుడు ఎవరిని అనుగ్రహిస్తాడో వాడు. భగవంతుడు ఎవ్వడిని అనుగ్రహిస్తాడు? ఎవ్వడు తన హృదయములో భవంతుని ఆరాధించునో అతనిని అనుగ్రహిస్తాడు. ఆ విధముగా

భజేదత ఆహ-యదేతి. యం యదా అనుగృహ్ణాతి. అనుగ్రహే హేతుః -ఆత్మని భావితస్సన్ స తదాలోకే లోకవ్యవహారే చ. వేదే వైదికమార్గే. పరినిష్ఠితాం మతిం త్యజతి. 46

అనుగ్రహింపబడినవాడు లోక వ్యవహారమందుగాని, వేదమందు (అనగా కర్మ మార్గముయందుగాని) దృఢమైన ఆసక్తి గల బుద్ధిని విడిచిపెట్టును. 46

శ్లో॥ తస్మాత్కర్మసు బర్హిష్మన్నజ్ఞానాదర్థకాశిషు ।
మార్థదృష్టిం కృథాః శ్రోత్రస్పర్శేష్వస్పృష్ట వస్తుషు ॥ 47

టీ:- తస్మాదితి. అర్థకాశిషు పరమార్థత్వేన ప్రకాశమానేషు పురుషార్థబుద్ధిం మాకృథాః ప్రరోచనాయ కేవలం శ్రోత్రప్రియేషు. తత్త్వతస్తు న స్పృష్టం పరమార్థభూతం వస్తు యైస్తేషు. 47

కావున ఓ బర్హిష్మంతమహారాజా! పరమార్థముగా కనిపించు కర్మలయందు, అజ్ఞానముచే పురుషార్థ బుద్ధిని పెట్టుకోకు. చెవులకు మాత్రం వినడానికి ఇంపుగా ఉంటు పరమార్థమును తాకలేనట్టి కర్మల యందు పురుషార్థ దృష్టి వలదు. 47

శ్లో॥ స్వం లోకం న విదుస్తే వై యత్ర దేవో జనార్దనః ।
ఆహుర్ధూమ్రధియో వేదం సకర్మక మతద్విదః ॥ 48

టీ:- నను వేదేన స్వర్గాదిసాధనత్వేనోక్తాని కర్మాణీతి వేదవాదినో వదంతి. కథమస్పృష్టవస్తుష్విత్యుచ్యతే. తత్రాహ-స్వమితి. యే ధూమ్రధియో మలినబుద్ధియః. స కర్మకం కర్మ పరం వేదమాహుః. తే అతద్విదః అవేదజ్ఞాః యతస్తే స్వం స్వరూప భూతం లోకమాత్మ తత్త్వం. వేదతాత్పర్యగోచరం న విదుః యత్ర దేవోఽస్తి. 48

మరి వేదవాదులు వేదము స్వర్గాది సాధనములైన కర్మమును గూర్చే చెప్పుతుందని అంటున్నారు గదా! పరమాత్మతత్త్వము స్పృశింపరానిదని అని అంటున్నామే? అని అనగా? అవును మలిన బుద్ధి గలవారు, వేదమునకు కర్మలయందే పరమ తాత్పర్యమును చెపుతారు. నిజానికి వారు వేదము తెలియని వారే. ఎందుకంటే వారికి వేదతాత్పర్య గోచరమైన ఆత్మతత్త్వము తెలియదు. ఎచ్చట స్వయంప్రకాశుడైన పరమాత్మ గలడో అతడాత్మయని...48

శ్లో॥ ఆస్తీర్య దర్భైః ప్రాగగ్రైః కార్త్స్న్యేన క్షితిమండలమ్ ।
స్తబ్ధోబృహద్వధాన్మానీ కర్మ నావైషి యత్పరం ।
తత్కర్మ హరితోషం యత్సా విద్యా తన్మతిర్యయా ॥ 49

టీ:- త్వంతు మహామూర్ఖ ఇత్యాహ–ఆస్తీర్యేతి. బృహద్వధాత్. బహు పశువధాత్ మానీ మహాయజ్వాహమిత్యహంకారీ. అతః స్తబ్ధః అవినీతస్సన్ కర్మ నావైషి పరం ఆత్మతత్త్వజ్ఞానోపాయభూతం విద్యాస్వరూపం యత్తచ్చ న వేత్సి. నారదః స్వయం కృపయా, తదుభయం నిరూపయతి–తదితి. హరిం తోషయతీతి. హరి తోషం యత్. తదేవ కర్మ. యయా తస్మిన్ హరౌ మతిర్భవతి. సైవ విద్యా మహాఫలత్వాత్. 49

ఓ బర్హిష్మంత మహారాజా! నీవు మాత్రం మహా మూర్ఖుడవై యున్నావు. మొత్తము భూమినిండా ప్రాగగ్రములుగా (తూర్పునకు కొసలుపరిచి) దర్భలను పరిచినావు. అనేక యజ్ఞముల యందు చాలా పశువులను వధించినావు. దాని ద్వారా నేను యజ్వననే అహంకారము గలిగి యున్నావు. అవినీతుడవైనావు. సర్వోత్తమమైన కర్మ ఏదియో నీకు తెలియదు. గొప్పనైన విద్య ఏదియోగూడా నీకు తెలియదు అని నారదుడు దయతో ఆ రెండును నిరూపించుచున్నాడు. "శ్రీహరిని సంతోష పరచునదే కర్మ", దేనిద్వారా శ్రీహరియందు బుద్ధి కలుగుతుందో అదే విద్యా మహాఫలము కనుక..49

శ్లో॥ హరిర్దేహభృతామాత్మా స్వయం ప్రకృతిరీశ్వరః ।
తత్పాదమూలం శరణం యతః క్షేమో నృణామిహ ॥ 50

టీ:- కుత ఇత్యపేక్షాయాం హరేః పరమఫలత్వం దర్శయన్నాహ–ద్వాభ్యాం హరిరితి. హరిర్దేహ భృతామాత్మా ఈశ్వరశ్చ, తత్ర హేతుః స్వయం స్వాతంత్ర్యేణ ప్రకృతిః కారణం అతస్తత్పాదమూలమేవ శరణం ఆశ్రయః యతః యస్మిన్. 50

మహాఫలము ఎందుకనగా? శ్రీహరి యొక్క మహా ఫలమును దర్శింపచేయుచూ చెప్పుచున్నాడు. శ్రీహరి ప్రాణులకు ఆత్మ మరియు ఈశ్వరుడు. జగత్తునకు కారణభూతుడు. అందుచేత ఆయన పాదమూలమే ఆశ్రయము. దేనియందు మానవులకు క్షేమము జరుగునో.. (తరువాతి శ్లోకముతో అన్వయము) 50

శ్లో॥ సోఽయం ప్రియతమశ్చాస్య యతో న భయమణ్వపి ।
ఇతి వేద స వై విద్వాన్ యో విద్వాన్ స గురుర్హరిః ॥ 51

టీ:- న చ తద్భజనే అన్యభజన ఇవ దుఃఖ భయం చేత్యాహ-స ఇతి. అస్య పుంసః సోఽయం శ్రీహరిః ప్రియతమః. స వై ఆత్మత్వాత్ రాజాదిస్తు ద్రవ్యాధ్యుపాధినా ప్రియః. యతః. శ్రీహరిచరణశరణస్య అణ్వపి న భయం. అతస్తత్పాదమూలం శరణమిత్యనేన సంబంధ్యతే. ఇదానీమేవం విధం స్తౌతి-ఇతి యో వేద స ఏవ విద్వాన్ స గురుఃస ఏవ హరిశ్చ. 51

శ్లో॥ ప్రశ్న ఏవం హి సంఛిన్నో భవతః పురుషర్షభ ।
అత్రమే వదతో గుహ్యం నిశామయ సునిశ్చితమ్ ॥ 52

టీ:- ఉక్తముపసంహరతి-ప్రశ్న ఇతి. ఏవం భవతః ప్రశ్నః సంఛిన్నః పరిహృతః తదేవమాత్మనో బంధమోక్షప్రకారేకథారూపేణ కథితేఽపి. నాతినిర్విణ్ణచిత్తం. పుత్రాగమనం. ప్రతీక్షమాణం సంతం. తత్క్షణమేవ మహాభయకంపిత సకలగాత్రం గృహాన్నిర్వాసయితుం. హరిణరూపక మాహ - అత్రేతి. వదతో మే వచః శ్రుణు. 52

ఆ శ్రీహరిని భజించుట వల్ల, ఇతరులను భజించుటచేత కలుగు దుఃఖము, భయము కలుగదని చెప్పుచున్నాడు.

ఆ శ్రీహరియే సర్వులకు ప్రియతమమైన ఆత్మయని ఆ శ్రీహరిని చరణములను శరణువేడిన వారికి ఏ కొంచెముగూడా భయము లేదని, ఎవరు తెలుసుకుంటాడో అతడే విద్వాంసుడు, అతడే గురువు, అతడు సాక్షాత్తు శ్రీహరియే. 51

**నారదుడు ఈ విధముగా పలికెను.**

చెప్పిన విషయమును ఉపసంహరించుచున్నాడు. ఓ పురుష శ్రేష్ఠుడా! నీ ప్రశ్న పరిహరింపబడినది అని, ఈ విధముగా తనకు అనగా జీవునకు కథా రూపమున బంధ మోక్ష ప్రకారము తెలిపినప్పటికీ సంపూర్ణముగా మోక్షచిత్తుడుగాక, గొప్ప భయముచే శరీరమంతా వణుకుచుండగా (వెళ్ళిన) తన కుమారుడు ఇంకారాలేదని ఎదురు చూచుచున్న రాజును చూచిన నారదుడు (రాజు) ఇంటియందు మోహమును విడిచి ఇల్లు విడుచుటకుగాను జింక రూపముగా భయమును దర్శింపచేయుచూ, నిశ్చయమైన, రహస్యమైన నా వాక్కుల వినుము అని చెబుతున్నాడు. 52

శ్లో॥ క్షుద్రం చరం సుమనసాం శరణే మిథిత్వా
రక్తం షడంఘ్రిగణసామసు లుబ్ధకర్ణమ్ ।
అగ్రే వృకానసుతృపో విగణయ్య యాతం
పృష్ఠే మృగం మృగయలుబ్ధక బాణభిన్నమ్ ॥ 53

టీ:– క్షుద్రమితి. క్షుద్రమల్పం చరతీతి తథా తం అలుక్. సుమనసాం పుష్పాణాం. శరణే ఆశ్రమే వాటికాయాం. మిథిత్వా మిథః పరస్పరం స్త్రియా సహమిళిత్వా. తత్రైవర్తకమాస్తకం. షడంఘ్రయో భ్రమరాస్తేషాం. గణేస్తేషాం సామసు గీతేషు. లుబ్ధౌకర్ణౌ యస్య తం. పరేషామసుభి హృతైః స్వీయానసూంస్తర్పయంతీత్యసుతృపః తానవిగణయ్య అగణయిత్వా లుబ్ధకస్య బాణేన భిన్నం మృగం మృగయ అన్వేషయ. 53

ఒక మగలేడి చిన్నిచిన్ని గడ్డి పరకలు కొరుకుచు పుష్పవాటికిక వద్దకు వచ్చి అచ్చట ఆడలేడితో రహస్యముగా విహరిస్తూ తుమ్మెద గానములయందు ఆసక్తి గలదై చెవులప్పగించి ముందున్న ఇతర ప్రాణులను హింసించు తోడేళ్ళను పరిగణించకుండా వెళ్ళుచుండగా ఇంతలో వెనుక నుండి కిరాతుడి బాణముతో చీల్చబడిన లేడిని గూర్చి గమనించుము. 53

శ్లో॥ సుమనస్సమానధర్మాణాం స్త్రీణాం శరణ ఆశ్రయే పుష్పమధు గంధవత్ క్షుద్రతమం కామ్యకర్మవిపాకం కామసుఖలవం జిహ్వోపస్థాది విచిన్వంతం మిథునీభూయ రక్తం తదభినివేశితమానసం షడంఘ్రి గణసామగీత వదతి మనోహర వనితా జనాలావేష్వతితరాం ప్రలోభిత కర్ణం అగ్రే వృకయూథవదాత్మన అయుర్హ్వరతోఽహోరాత్రాదికాన్ కాల విశేషానవిగణయ్య గృహేషు విహరంతం పృష్ఠతః పరోక్షమను ప్రవృత్తో లుబ్ధకః కృతాంత ఆత్తశరోఽయమిహ పరావిధ్యతీతి

శ్లోకమును ప్రకృతార్థమున సమన్వయ పరచుచు చెప్పుచున్నాడు ఓ రాజా! పువ్వులతో సమాన ధర్మముగల యువతులకు అశ్రయమగు ఇంటియందు పూలలోని తేనె వాసనలవలె అత్యంత అల్పమైనట్టి కామ్య కర్మల ఫలరూపమైన జిహ్వ (జ్ఞానేంద్రియము) మొదలగు వాటిచే పొందబడే కామసుఖ లేశమును వెతుకుచు స్త్రీలతో జతకట్టే వారియందు మనస్సు గలవాడై, తుమ్మెదలగుంపు సుస్వర గానము వలె అతిమనోహరములైన స్త్రీల మాటలయందు అతిశయించిన

తమిమమాత్మానమహో రాజన్నిర్భిన్న హృదయం ద్రష్టుమర్హసీతి యథామృగయుహతం మృగమితి. 54

టీ:- శ్లోకం ప్రస్తుతే యోజయన్ వ్యాచష్టే. సమనోభిః సమానో ధర్మః పరిణామః విరసత్వం యాసాం స్త్రీణాం. మిథిత్వేత్యస్య వ్యాఖ్యా మిథునీభూయ స్త్రీభిః సహేతి శేషః. రక్తమిత్యస్య వ్యాఖ్యాతా స్వభినివేశితం మనో యేన. అసుతృప ఇత్యస్య వ్యాఖ్యా. ఆయుర్హరత ఇతి. యాంత మిత్యస్య వ్యాఖ్యా విహరంతమితి. అంతర్నాడికాయాం గూఢేన శరేణ పరావిధ్యతి దూరాదేవ తాడయతి. 54

శ్లో॥ సత్వం విచక్ష్య మృగచేష్టితమాత్మనోఽంత
శ్చిత్తం నియచ్ఛహృది కర్ణధునీం చ చిత్తే ।
జహ్యాంగనాశ్రమమసత్తమయూథగాథం
ప్రీణీహి హంసశరణం విరమక్రమేణ ॥ 55

టీ:- ఉపదేశసారమాహ - సత్వమితి. విచక్ష్య విచార్య. అంతర్హృది చిత్తం కర్ణయోః ధునీం నదీమివ. బహిర్వృత్తం శ్రౌతస్మార్తాదిరూపం

లాలసగల చెవులుగల, ఎదుట తోడేళ్ళ గుంపు వలె ఆయుస్సును హరించి వేయుచున్న అహోరాత్రములైన కాల లవలేశములను లెక్కచేయక ఇంటియందు రమించుచున్న, ఎవని వెనుకనే కనపడకుండా అనుసరించి వచ్చుచున్న కిరాతుడగు యముడు హృదయమును బాణములతో దూరము నుండియే కొట్టుచున్నాడో అట్టి నిన్ను ఈ కథలో బాణముచే పగలకొట్ట బడిన హృదయము గలవాడిగా తెలుసుకో. మిథిత్వా అన్న పదమునకు స్త్రీలచే కలసియని, రక్తమన్న పదమునకు వారియందు మనస్సు గలవాడై అని, అసృతృప అన్న పదమునకు ఆయుస్సును హరించుచున్న యని, యాన్తం అన్న పదమునకు విహరించుచున్న యని అర్థం చెప్పుకోవాలి. 54

**ఉపదేశ సారమును చెప్పుచున్నాడు.**

అట్టి నీవు ఆ లేడి వంటి చేష్టలు గలవాడివిగా విచారించుకొని నీ బుద్ధియందు మనస్సును, నదీవలె చెవియొక్క బాహ్య ప్రవృత్తిని చిత్తముయందు నియంత్రించుము. ఒక్క చెవినే కాదు సర్వేంద్రియము లనుగూడా నియంత్రించమని ఉపలక్షణం. ఇదే క్రమములో అతి కాముకులైన సమూహము యొక్క వార్తలుగల గృహాశ్రమమును గూడా విడువుము. జీవులకు ఆశ్రయుడగు ఈశ్వరుడిని ప్రసన్నుడను చేసికొనుము. ఈ ప్రకారముగా సర్వమునుండి విముక్తుడవు కమ్ము. 55

కర్మచ చిత్తే నియచ్ఛ. ఏతచ్చ సర్వేంద్రియోపలక్షణార్థం. అంగనాశ్రమం గృహాశ్రమం చ జహి. కీదృశం అసత్తమానాం, అతికాముకానాం. యాని యూథాని తేషాం. గాథా వార్తా యస్మిన్. హంసానాం జీవానాం పరమహంసానాం వా. శరణమీశ్వరం. ప్రీణీహి ప్రీణయ. తస్మిన్ స్నేహేన విశ్వాస లక్షణాం భక్తిం కుర్విత్యర్థః. ఏవం క్రమేణ సర్వతో విరమ. 55

**రాజోవాచ**

శ్లో॥ శ్రుతమన్వీక్షితం బ్రహ్మన్భగవాన్యదభాషత ।
నైతజ్జానంత్యుపాధ్యాయాః కిం న బ్రూయుర్విదుర్యది ॥ 56

టీ:- అర్థాంతరం ప్రష్టుం పూర్వోక్తమర్థమనువదతి - శ్రుతమితి. శ్రుతమన్వీక్షితం విచారితం చ. హే బ్రహ్మన్ నారద. ఏతత్త్వదుక్త మాత్మతత్త్వం ఉపాధ్యాయాః యే మమ కర్మోపదేష్టారః. ఆచార్యాస్తే న జానంతి. 56

**ప్రాచీనబర్హి పలుకుచున్నాడు.**

అర్థాంతరమును గూర్చి అడుగుటకు పూర్వోక్తమైన అర్థమును అనువదించుచున్నాడు. ఓ నారదా! మీరు ఇంతవరకు చెప్పిన, నేను విని, విచారించిన ఆత్మతత్త్వమును నాకు కర్మను ఉపదేశించిన ఉపాధ్యాయులు (ఆచార్యులు) తెలియలేకున్నారు. (తెలిసినచో నాకు చెప్పక పోదురా!) 56

శ్లో॥ సంశయోఽత్రతు మే విప్ర సంఛిన్నస్తత్కృతో మహాన్ ।
ఋషయోఽపి విముహ్యంతి యత్ర నేంద్రియవృత్తయః ॥ 57

ఓ బ్రాహ్మణశ్రేష్ఠా! ఉపాధ్యాయులచే బోధించిన దానికి విరోధముగా మీరు ఆత్మతత్త్వము బోధించడం వలన ఆత్మతత్త్వమందు జీవబ్రహ్మైక్యము, ప్రపంచ మిథ్యాత్వము సంభావ్యములు కావు అను

టీ:- సంశయ ఇతి. అతస్త్వత్కృతః ఉపాధ్యాయకృతః. తద్వాక్యవిరోధే నాత్మతత్త్వే అసంభావనారూపో మహాన్ సంశయః. సంచ్ఛిన్నస్త్వయా. అత్ర తు కశ్చిత్సంశయో వర్తతే. యతేంద్రియవృత్తీనామ ప్రవృత్తే ర్ముహ్యంతి. 57

గొప్ప సంశయము తొలిగి పోయినది. ఇక్కడ కొంచెం సంశయము గలదు? ఋషులు గూడా ఈ ఆత్మతత్త్వమందు మోహమున పడుదురు. ఎందుకనగా! ఈ ఆత్మ ఇంద్రియ గోచరముగాదు కనుక; ఆత్మకు ఇంద్రియ ప్రవృత్తి లేదు. 57

శ్లో॥ కర్మాణ్యారభతే యేన పుమానిహ విహాయ తమ్ ।
అముత్రాన్యేన దేహేన జుష్టాన్యసకృదశ్నుతే ॥ 58

టీ:- సంశయమాహ - ద్వాభ్యాం. కర్మాణీతి. కర్మాణి యేన దేహేన కరోతి. తమత్రైవవిహాయ అముత్రలోకాంతరే కర్మోపస్థాపి తేనాన్యేన దేహేన. జుష్టాని ఉపభుక్తాని జీవోఽశ్నుతే ప్రాప్నోతి. 58

రెండు శ్లోకములచే సంశయమును తెలుపుచున్నాడు.

కర్మలు ఏ దేహముచేత చేస్తాడో ఈ దేహమును ఇక్కడనే విడిచి లోకాంతరమున కర్మ జనితమైన వేరే దేహము చేత జీవుడు కర్మ ఫలితములను అనుభవించుచున్నాడు. 58

శ్లో॥ ఇతి వేదవిదాం వాదః శ్రూయతే తత్ర తత్ర హ ।
కర్మ చ క్రియతే ప్రోక్తం పరోక్షం న ప్రకాశతే ॥ 59

టీ:- ఇతీతి. ఇతి వాదః శ్రూయతే. శ్లో."ప్రాప్యపుణ్యగతాం లోకాని" తి. శ్లో. "శరీరజైః కర్మదోషైర్యాతి స్తావరతాంనర" ఇతి.త్వయా చోక్తం. శ్లో. "శాశ్వతీరనుభూయార్తిమి"తి. ఏతశ్చకర్త ౄభోక్త ౄదేహ భేదేన కృతనాశాకృతాభ్యాగమప్రసంగాన్న సంగచ్ఛత ఇతి భావః.

వేదము "పుణ్యలోకములను పొంది" అని చెప్పుతుందని వేదవాదులు చెపుతూ "శరీరముద్వారా చేసిన కర్మ దోషముల మూలకముగా" రాళ్ళు, చెట్లు మొదలగు దేహములను పొందుతాడని చెబుతారు. కర్మ చేసిన దేహము వేరు, ఫలముననుభవించు దేహము వేరు. కర్మ చేసిన దేహమునకు శిక్ష లేదు, కర్మ చేయని దేహమునకు శిక్ష ఇది కుదరదు కదా!

రెండవ సంశయము కర్మ జనితములు గదా సుఖదుఃఖములు?

సంశయాంతరమాహ – ప్రోక్తం వేదోక్తం కర్మక్రియతే జనైః తచ్చానంతర రక్షణ ఏవ పరోక్షం అదృశ్యం సన్న ప్రకాశతే అతః కర్మణో నష్టత్వాత్తద్భోగోఽపి దుర్ఘట ఇతి భావః. 59

వేదోక్తమైన కర్మ పూర్తి అయిన మరుక్షణముననే అదృశ్యమౌతుంది. ఆ కర్మనే నశించగా ఆ కర్మ ఫలమును ఎట్లుస్తుంది? ఫలము రావడము దుర్ఘటనమే! 59

**శ్రీనారద ఉవాచ**

శ్లో॥ యేనైవారభ్యతే కర్మ తేనైవాముత్ర తత్పుమాన్ ।
భుంక్తే హ్యవ్యవధానే న లింగేన మనసా స్వకమ్ ॥60

టీ:– ప్రథమస్యోత్తరమాహ–యేనైవేతి. లింగశరీరస్య మనః ప్రధానత్వాత్ మనసా లింగేనేతి సామానాధికరణ్యం. యేనైవ లింగేన పుమాన్ కర్మారభతే. తేనైవ అవ్యవధానేన కర్తృభోక్తృదేహవిచ్ఛేదం వినా అముత్ర తత్. స్వం కర్మ భుంక్తే. స్థూలదేహనాశేఽసి మనః ప్రధానస్య లింగదేహస్యా నాశాన్నోక్తదోషప్రసంగః ఇత్యర్థః. 60

మొదటి ప్రశ్నకు ఉత్తరం చెప్పుచున్న నారదుడు ఇట్లు పలుకుచున్నాడు. ఇహలోకమున ఏ దేహముతో చేసినాడో అదే దానితో పరలోకమున ఫలితమనుభవిస్తాడు. ఎట్లనగా

స్థూలదేహము నశించినప్పటికి కర్తృ, భోక్తృ దేహ విచ్ఛేదము లేకుండా మనః ప్రధానముగా గలిగిన లింగదేహము నశించదు కనుక నీవన్న దోషము లేదు. 60

శ్లో॥ శయానమిమముత్సృజ్య శ్వసంతం పురుషో యథా ।
కర్మాత్మనాహితం భుంక్తే తాదృశేనేతరేణ వా ॥ 61

టీ:– లింగదేహవిశిష్టస్య భోక్తృత్వం స్వప్నదృష్టాంతేన స్పష్టయతి– శయానమితి. శయాన మిమం జాగ్రద్దేహం శ్వసంతం జీవం ఉత్సృజ్య

లింగదేహముతోకూడిన భోక్తృత్వమును స్వప్న దృష్టాంతముచే స్పష్టపరుస్తున్నాడు. ప్రాణములతో కూడి నిద్రించుచున్న ఈ దేహమును విడిచి, దానిపై అభిమానమును విడిచి మనస్సున వాసనా రూపమున ఉన్న కర్మలను ఏ విధముగా అనుభవించుచున్నాడో అట్లే స్వర్గాదులలో కర్మానుసారముగా ఇచ్చట విడిచిన దేహము వంటి దేహమును పొంది

తదభిమానం త్యక్త్వా. ఆత్మని మనసి. సంస్కార రూపేణా హితం కర్మ. యథా భుంక్తే. తాదృశేన శయానదేహసదృశేన. కర్మోపస్థాపితేన దేహేనాన్యేన వా పశ్వాదిదేహేన తథా లోకాంతరేఽపీతి భావః. 61

శ్లో॥ మమేతి మనసా యద్యదసావహమితి బ్రువన్ ।
గృహ్ణీయాత్తత్పుమాన్రాద్ధం కర్మ యేన పునర్భవః ॥62

టీ:- నను భవతు నామ లింగవిశిష్టస్య అనేన దృష్టాంతేన భోక్తృత్వం కర్త ృత్వం తు దానప్రతిగ్రహాదిషు స్థూలదేహవిశిష్టస్యైవ దృశ్యతే తత్రాహ-మమేతి. మమైతే పుత్రాదయః. అసావహం బ్రాహ్మణ ఇతి బ్రువన్. మనసా యద్యద్దేహం గృహ్ణీయాత్. తతో దేహాద్రాద్ధం సిద్ధం కర్మ. పుమాన్ గృహ్ణీయాత్. యేన కర్మణా ఏవ మహంకారగృహీతేన పునర్భవో భవతి. అన్యథా జన్మానుపపత్తేః. అతోఽభిమాతుర్మనో విశిష్టస్యైవ కర్తృత్వం. అభిమానివిషయస్య దేహస్య పుత్రాదిదేహవత్. ద్వారమాత్రమితి భావః. 62

లేదా పశ్వాది దేహము పొంది లోకాంతరమున సుఖదుఃఖాదులను అనుభవించుచున్నాడు. తాత్పర్యమేమనగా స్థూల దేహము పోయినా సూక్ష్మదేహముచే సుఖదుఃఖములను అనుభవించుచున్నాడు. 61

లింగవిశిష్టస్థానముచే స్వప్నదృష్టాంతము ద్వారా భోక్తృత్వము కలిగితే కలుగనిగాక! కర్తృత్వము మాత్రము దాన ప్రతిగ్రహాదుల యందు స్థూల దేహముతో కూడిన జీవుడికే కనబడుతుంది కదా! వీరు నా పుత్రులు, నేను బ్రాహ్మణుడను అని అనుకొనుచూ మనస్సు చేత ఏ యే దేహమును స్వీకరించునో ఆ దేహము చేతనే కర్మ చేయును. నేను చేయుచున్నాను అనే అహంకార కర్మచే మళ్ళీ జన్మ వచ్చుచున్నది. లేకున్న జన్మనేలేకుండేది అనగా "పునర్జన్మ అనునదే ఉండకుండేది" కావున దేహాభిమానం కలవాడికి కర్తృత్వము మనో విశిష్టమైన దానికే. అనగా మనస్సుతో కూడిన దేహాదుల ద్వారానే కర్త ృత్వము. కేవల దేహమునకు కర్తృత్వము లేదు. అభిమాన విషయమైన దేహము పుత్రాది దేహములవలె సహకారికమే. (62)

శ్లో॥ యథానుమీయతే చిత్తముభయైరింద్రియైర్హితైః ।
ఏవం ప్రాగ్దేహజం కర్మ లక్ష్యతే చిత్తవృత్తిభిః ॥ 63

టీ:- యదుక్తం కర్మణో నష్టత్వాన్నాముత్ర భోగ ఇతి తత్రాహ-యథేతి. ఉభయైః జ్ఞానకర్మరూపైః ఇంద్రియాణామిహితైః కదాచిత్కర్మప్రవృత్తిభి శ్చిత్తమనుమీయతే. సత్యపి సర్వేంద్రియవిషయ సంబంధే. యుగపత్. జ్ఞానానుత్పత్తేః. తదుక్తమక్షపాదేన. సూ. "యుగపత్. జ్ఞానానుత్పత్తిర్మ నసోలింగమి"తి. ఏవం చిత్తవృత్తిభిరపి పూర్వదేహజం కర్మ లక్ష్యతే. తాసామపి యుగపదనుత్పత్తేః. 63

చేసిన కర్మ చూస్తూ ఉండగా ఇక్కడనే నశించి పోవుచున్నది. కనుక పరలోకమున భోగమనునదే లేదని దానికి చెప్పుచున్నాడు.

జ్ఞానేంద్రియ, కర్మేంద్రియ ప్రవృత్తులను బట్టి వాటిని ప్రేరేపించు మనస్సు అనునది ఒకటి గలదు అని అనుమాన ప్రయోగము ద్వారా నిర్ధారించవచ్చును. ఎందుకనగా సర్వఇంద్రియములకు విషయ సంబంధముఉన్నప్పటికి అన్ని జ్ఞానము లొక్కమారు కలుగవు ఎందుకు? "అనగా" ఒక వస్తువును చూచినపుడు ఇది పుస్తకము, ఇది విగ్రహము అనుజ్ఞానము మనకు కలుగుతుందంటే ఆ వస్తువునకు నేత్రేంద్రియ మునకు సంయోగముకలిగినప్పుడు కాని మనమాలోచించిన అన్ని ఇంద్రియములకు అన్ని విషయముల సంయోగము కలిగిననూ మనకు ఏదో ఒక జ్ఞానము మాత్రమే కలుగుతుంది. కారణం? దీనికి వేరొక కారణంతరమును అనుమాన ప్రమాణము వల్ల తెలుసుకోవాలి. దానినే అక్షసాద సూత్రమున "అన్ని జ్ఞానములొక్కమారు కలుగడం లేదు. దీనిద్వారా మనస్సును కారణాంతరము తెలియుచున్నది". అని సూత్ర భావము. (అనుమాన ప్రయోగము.) జ్ఞానకర్మేంద్రియవృత్తయః, కారణాంతరజన్యాః, తదితర కారణ సద్భావేపియుగపదనుత్పద్య మానత్వాత్ కారణాంతరం వినాయుగ పదనుత్పద్యమాన ఘతాదివత్ అను ప్రయోగం చేత కారణాంతరమైన మనస్సు సాధింపబడుచున్నది. ఆ విధముగానే ఇప్పుడు ఈ శరీరమునకు పూర్వజన్మ కృత కర్మ

శ్లో॥ నానుభూతం క్వచానేన దేహేనాదృష్టమశ్రుతమ్ ।
కదాచిదుపలభ్యేతయ ద్రూపం యాదృగాత్మని ॥ 64

టీ:- ఇతో౽పి కర్మలక్ష్యత ఇత్యాహ-ద్వాభ్యాం. నానుభూతమితి. అనేన వర్తమానేన దేహేన. క్వ చ కుత్రచిదపి. యన్నానుభూతం అనుపభుక్తం. అదృష్టం చాశ్రుతం చ. యద్రూపం యదాత్మకం యాదృక్ యత్ప్రకారం చ. తత్కదాచిత్ స్వప్నమనోరథాదిషు. ఆత్మని మనసి ఉపలభ్యతే. 64

కారణమని అనుమాన ప్రయోగము వల్ల సాధించాలి. ఒకవ్యక్తి మనస్సులోని విచిత్రములైన ఆలోచనలనుబట్టి ఈ వ్యక్తి దేహము పుట్టుటకు పూర్వము ఇతడియందు కర్మ వాసనలను గలవు. (అని చెప్పవచ్చు) చిత్తవృత్యయః విచిత్రకారణజన్యాః విచిత్ర కార్యత్వాత్ చిత్రపటవత్, విచిత్రకారణాంతర అసంభవేనతథాభూతాప్రాక్జన్మకర్మ సిద్ధిః. ఒక రంగురంగుల బట్ట కలదు. దానికి రంగు రంగుల దారములను కారణముగా స్వీకరించాలి. లేకున్న వస్త్రోత్పత్తియే లేదు. వస్త్రం కనబడుతుంది కనుక కారణాంతరము వూహించినట్టు గానే ఈ జన్మకు కారణము గతజన్మ కృత కర్మయే అని నిర్ధారించాలి. ఇక్కడ ఒక్కటి గ్రహించాలి. పూర్వ కర్మలు అనేకములు ఉండవచ్చు కానీ, అన్ని ఒకేసారి ఉత్పత్తి ప్రవృత్తములు కావు. 63

ఇంకాగూడా జన్మకు గతజన్మ కర్మ కారణమని నిర్ధారించు చున్నాడు.

ఈ వర్తమాన దేహముచేత ఎక్కడ ఎప్పుడు గూడా అనుభవించ నిది, చూడనిది, విననిది, ఒకానొక రూపము స్వప్నమున పొందు -చున్నాము (అనగాఏదైనఅననుభూతమైనది స్వప్నమున పొందడానికి వీలులేదు. కనుక ఈ జన్మలో అననుభూతమై నది వచ్చినదంటే గత జన్మ కర్మ సంస్కారము నొప్పవలసినదే). 64

శ్లో॥ తేనాస్య తాదృశం రాజన్ లింగినో దేహసంభవమ్ ।
శ్రద్ధత్స్వాననుభూతోఽర్థో న మనః స్పృష్టుమర్హతి ॥ 65

టీ:- తేన హేతునా అస్య లింగినో వాసనాశ్రయస్య జీవస్య తాదృశం తదనుభవాదియుక్తం. పూర్వదేహసంభవం శ్రద్ధత్స్వ నిశ్చయేన మన్యస్వ న హ్యననుభూతోఽర్థో మనః స్ప్రష్టుం మనసి స్ఫురితుమర్హతి. 65

ఓ రాజా! ఆ కారణముచేత వాసనాశ్రయుడైన అనగా గత జన్మ కర్మ సంస్కారములు గల జీవునకు, ఈ జన్మమున క్రొత్తగా కలుగని అనుభూతులు కలిగిన అవి గతజన్మ సంభవములని నిశ్చయించుకో. అననుభూతములైన విషయములు మనస్సున స్ఫురించుటకు వీలులేదు. 65

శ్లో॥ మన ఏవ మనుష్యస్య పూర్వరూపాణి శంసతి ।
భవిష్యతశ్చ భద్రం తే తథైవ న భవిష్యతః ॥ 66

టీ:- కించ మనోవృత్త్యైవ పూర్వావరాణి శుభాశుభనిమిత్తాని శరీరాణి. విజ్ఞాయంత ఇత్యాహ-మనఏవేతి. భద్రంత ఇతి సమ్యగవధానార్థ మాశిషాభినందతి. భవిష్యతః ఉద్భవం ప్రాప్స్యతః న భవిష్యతః నీచత్వం ప్రాప్స్యతోఽపి. భావీని రూపాణి శంసతి. మనఏవవౌదార్య కార్పణ్యాది వృత్తిభిః. పూర్వమప్యేవమేవాసీత్. పశ్చాదప్యేవమేవ భవిష్యతీతి జ్ఞాపయ తీత్యర్థః. 66

మరియు మనోవృత్తుల ద్వారా రాబోయే శుభ, అశుభ శరీరములు తెలియును అని చెప్పుచున్నాడు.

రాజా! నీకు మంగళమగుగాక! అని అనడం చక్కగా దృష్టి పెట్టమని ఆశీస్సులందించడం (మనోవృత్తులే) మనస్సే రాబోయే ఉత్తమ, నీచ జన్మలను సూచిస్తుంది. తన మనస్సులో కలిగే ఔదార్య భావనలను, దైన్యభావనలనుబట్టి తన పూర్వజన్మను నిరూపిస్తుంది. తరువాత జన్మ ఇట్లా ఉంటుందని జ్ఞాపకము చేయునది గూడా మనస్సు యొక్క వృత్తియే, అనగా మనోమయమైన లింగ శరీరము తిరిగి తిరిగి పుట్టదు. 66

శ్లో॥ అదృష్టమశ్రుతం చాత్రక్వచిన్మనసి దృశ్యతే ।
యథా తథానుమంతవ్యం దేశ కాల క్రియాశ్రయమ్ ॥ 67

అనుభూతమైనది మాత్రమే స్వప్నమున దర్శిస్తామని అన్నప్పుడు కొన్ని విననివి, కననివి గూడా కలలో కనబడును కదా! వేరే ప్రాంతమున

టీ:- నను కదాచిద్దర్శనానర్థ్వ మపి స్వప్నే ప్రతీయతే. యథా పర్వతాగ్రే. సముద్రః. దివా నక్షత్రాణి. స్వశిరశ్ఛేదిత్యాది తత్రాహ - అదృష్టమితి. అన్యదేశాశ్రయం సముద్రాదికం. పర్వతాగ్రే నిశాశ్రయం నక్షత్రాదికం దివా అభ్యంగాది క్రియాశ్రయం స్వశిరశ్ఛేదనాశ్రయం నిద్రాదిదోషేణ ప్రతీయత ఇత్యనుమంతవ్యం. పరస్యాపి తదనుపపత్తే స్తుల్యత్వాదితిభావః. 67

శ్లో॥ సర్వే క్రమానురోధేన మనసీంద్రియగోచరాః ।
ఆయాంతి సర్వశో యాంతి సర్వే సమనసో జనాః ॥ 68

టీ:- నను దరిద్రః క్వచిదాత్మానం మహారాజం పశ్యతి. మహారాజశ్చ దరిద్రమాత్మానం పశ్యతి. తత్కమసంభావితం సంగచ్ఛేత్తత్రాహ - సర్వ ఇతి. ఆయాంతి భోగ్యత్వేన ప్రాప్నువంతి. యాంతి చ భోగానంతరం. యది కశ్చిదమనాభవేత్. తర్హ్యేవం న స్యాత్. న త్వేతదస్తీత్యాహ - సర్వే సమనస ఇతి. అతః సర్వేషాం సమనస్కత్వాత్. మనసి చ సర్వార్థానాం క్రమేణ ప్రవేశాన్నాత్యంతాదృష్టచరః కస్యాపి కశ్చిదర్థో - స్తీత్యర్థః. 68

గల సముద్రము పర్వతముపై ఉన్నట్లు (దేశం) రాత్రి కనబడే నక్షత్రములు పగలు ఆశ్రయించినట్టు (కాలం) అభ్యంగ్యము చేసికొనిన తన తల తెగినట్టు అనగా - ఔను కనబడును. నిద్రా దోషాదుల ద్వారా అట్లు కనబడుతుంది. కాని యథార్థం కాదు. పూర్వ పక్షానికి గూడా ఈ అనుపపత్తి సమానమే అని భావము. 67

మరి దరిద్రుడు ఒకప్పుడు తనను మహారాజుగా చూస్తాడు. మహారాజు తనను దరిద్రుడుగా చూస్తాడు. అసంభావితమైన ఇది ఎట్లా పొసుగుతుంది? అనగా చెప్పుచున్నాడు.

సర్వులు గూడా సూక్ష్మ శరీరము లేదా లింగ శరీరము లేదా మనస్సుగల వారే ఈ మనస్సున అనేక జన్మలనుండి సంచితమైన సంస్కారము అదృష్టరూపమై ఉంటుంది. అలాంటప్పుడు శుభ, అశుభ అదృష్టములచే అవి ఇంద్రియ గోచరముటగును. వీడు చేసుకొన్న పుణ్యపాపాలననుసరించి క్రమముగా గాని, సమూహముగా గాని ఒకే మనస్సుయందు భోగ్య రూపముగా ప్రాప్తించి భోగానంతరము వెళ్ళిపోతవి అనగా ఎవ్వడో పేదవాడు ఏదో జన్మలో రాజై ఉండవచ్చు. రాజు పేదవాడై ఉండవచ్చు. ఆ సంస్కారములు మనస్సున నిబిడీకృతమై అవి ఇంద్రియ గోచరములు కావచ్చును. కనుక అసలే చూడని,

శ్లో॥ సత్త్వైకనిష్ఠే మనసి భగవత్పార్శ్వవర్తిని ।
తమశ్చంద్రమసీవేదముపరజ్యావభాసతే ॥ 69

టీ:- తదేవం సర్వైరపి సర్వేఽర్థాః క్రమేణ దృశ్యంత ఇత్యుక్తం. ఇదానీం యుగపదపి సర్వదర్శనం కదాచిద్భవతీత్యాహ - సత్త్వేతి. సత్త్వైకనిష్ఠేసత్త్వమేవ ఏకానిష్ఠా ఆలంబనం యస్య తస్మిన్. భగవత్పార్శ్వ వర్తిని భగవద్ధ్యానపరే మనసి. ఇదం విశ్వముపరజ్య సంయోగమివ ప్రాప్యావభాసతే. ప్రతీత్యనర్హ స్యాపికదాచిత్ప్రతీతౌ దృష్టాంతః. చంద్రమస్యుపరజ్య. తమః రాహురివ. తదిదం శుద్ధమనసి సర్వ విషయస్ఫురణం. యోగిప్రత్యక్షమితి ప్రసిద్ధం. 69

శ్లో॥ నాహం మమేతి భావోఽయం పురుషేవ్యవధీయతే ।
యావద్బుద్ధిమనోక్షార్థగుణవ్యూహో హ్యనాదిమాన్ ॥ 70

వినని, అనుభవించనిది ఎవ్వరికి, ఎప్పుడు ఇంద్రియ గోచరములు కావు. ఇప్పుడవి ఇంద్రియగోచరములగుచున్నవి. అనగా మనస్సు అనునది ఒకటి లేకున్న ఇవి ఎట్లా సాధ్యమగును? కనుక సూక్ష్మశరీరమును ఒప్పవలసినదే. 68

మనస్సునందు అందరు అన్ని విషయములను క్రమముగా దర్శిస్తారు అని చెప్పడం జరిగింది. ఇప్పుడు ఒకొక్కప్పుడు ఒకేమారు సర్వ విషయములను దర్శించడం గూర్చి చెప్పుచున్నాడు. సత్వగుణము ఎక్కువగా ఉన్న భగవధ్యానపరుడైన వ్యక్తి మనస్సు యందు ఈ జగత్తు సంయోగము పొందిన దానివలె కనబడుతుంది. మిథ్యాత్మకమైన జగత్తు ప్రతీతే లేనప్పుడికి ఎప్పుడైన ఉన్నట్టుగా కనిపించుటకు దృష్టాంతమును చెప్పుచున్నాడు.

చంద్రుడియందు (ఆరోపింపబడిన) కనపడిన చీకటి రూపమైన రాహువు వలె, సర్వ విషయములు మనకు భాసించకున్ననూ, యోగుల శుద్ధ మనస్సు యందు కనపడుతాయని లోకమున ప్రసిద్ధం. 69

ఈ స్థూల దేహము పోయిననూ లింగదేహము పోదు కనుక (సూక్ష్మ శరీరం) నశించదు. కనుక వేరు శరీరమున వేరొక కర్త, భోక్త ఉండడు. కనుక ఏ దోషం లేదని చెప్పడం జరిగినది. ఇక్కడ

టీ:- తదేవ స్థూలదేహనాశే2పి లింగదేహస్యానాశాదన్యః కర్తాన్యోభోక్తేతి దోషో నాస్తీత్యుక్తం. తత్రైవం శంకతే. నను లింగదేహస్య స్థూలద్వారేణైవ కర్తృత్వభోక్తృత్వే. న తు కేవలస్య. తత్ర కదాచిత్ స్థూలదేహాభావే. జీవస్య కర్తృత్వభోక్తృత్వాభావాన్ముక్తిః ప్రసజ్యేత. తత్రాహ - నాహమితి. అహం మమేతి భావః స్థూలదేహసంబంధః. పురుషే జీవే. న వ్యవధీయతే న విచ్ఛిన్నో భవతి. కిం పర్యంతం బుధ్యాదీనాం వ్యూహః పరిణామో లింగంయావదస్తి. అనాదిమాన్ అనాదిస్సన్. 70

సందేహమును వ్యక్తపరుస్తున్నాడు. మరి లింగదేహమునకు స్థూలదేహ మూలకముగానే కర్తృత్వ, భోక్తృత్వములు కదా! కేవల సూక్ష్మ దేహమునకు కనుక కర్తృత్వ, భోక్తృత్వములు లేవు కనుక కర్తృత్వ, భోక్తృత్వముల మూలకము గనే కదా సంసారము. స్థూలదేహము కాలిపోయినది. సూక్ష్మదేహము ఉన్నా స్థూలదేహము లేదు కనుక కర్తృత్వ, భోక్తృత్వము లేవు కనుక ముక్తి వస్తుంది కదా? అని అనగా జీవునకు స్థూలదేహ సంబంధమైన అహం, మమ అనుభావము ఎంతవరకు ఉంటుందో అనగా బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, విషయముల పరిణామము ఎంతవరకు ఉంటుందో అంతవరకు ఈ లింగ శరీరము అనేది తొలిగిపోదు. 70

శ్లో॥ సుప్తిమూర్ఛోపతాపేషు ప్రాణాయనవిఘాతతః ।
నేహతే2హమితి జ్ఞానం మృత్యుప్రజ్వారయోరపి ॥ 71

టీ:- స్వా పాదావహంకారాద్యభావాత్ తద్విచ్ఛేదమాశంక్యాహ. ద్వాభ్యాం. సుప్తిమితి. సుప్త్యాదిషు ఉపతాప ఇష్టవియోగాదిదుఃఖం. తేషు అహమితి. జ్ఞానమహంకారః నేహతే న ప్రకాశతే. ప్రాణాయత నానామిన్ద్రియాణాం. విఘాతాత్. ఇంద్రియైః. పాఠభేదే హి ఇది మహంకారాస్పదవస్తుగ్రహణే హ్యహంకారః స్ఫురతి. నాన్యథేత్యర్థః (71)

బాగా నిద్రపోయినప్పుడు, మూర్ఛవచ్చినప్పుడు, ఇష్టులైన వారి వియోగము జరిగినప్పుడు మరణము మరియు పెద్ద జ్వరము వచ్చినప్పుడు ఆ సందర్భములయందు నేను, నాది అను అహంకారము ప్రవర్తిల్లదు. కారణము కేవలము ఇంద్రియములచే ఈ వస్తువు అని గ్రహించినప్పుడే అహంకారము బయట పడుతుంది. పై సందర్భముల యందు ఇంద్రియములు వ్యాకులత చెంది ఉండడము ద్వారా అహంకారము వ్యక్తము కాదు. 71

శ్లో॥ గర్భేబాల్యేఽప్య పౌష్కల్యాదేకాదశవిధం తథా ।
లింగం న దృశ్యతే యూనః కుహ్వాం చంద్రమసోయథా ॥ 72

టీ:- గర్భ ఇతిః అపౌష్కల్యాత్ అసంపూర్ణత్వాత్. ప్రాణా యత నానామితి శేషః. యూనః తరుణస్య. యథేకాదశవిధమేకాదశేంద్రియై స్ఫుటం లింగ మహంకార కారణం. తన్న దృష్యతే. గర్భాదేరితిశేషః సతోఽప్యనభివ్యక్తౌ దృష్టాంతః. కుహ్వామమావాస్యాయాం. చంద్రమసో లింగం రూపమివ. 72

శ్లో॥ అర్థేహ్యవిద్యమానేఽపి సంసృతిర్న నివర్తతే ।
ధ్యాయతో విషయానస్య స్వప్నేఽనర్థాగమో యథా ॥ 73

టీ:- తస్మాదహంకారాస్పదస్య స్థూలదేహస్యావిచ్ఛేదాద్యస్తు భూతార్థాభావేఽపి సంసృతినివృత్తిర్నాస్తీత్యాహ - అర్థేహీతి. 73

శ్లో॥ ఏవం పంచవిధం లింగం త్రివృత్షోడశవిస్తరమ్ ।
ఏష చేతనయా యుక్తో జీవ ఇత్యభిధీయతే ॥ 74

ఏ విధముగానైతే ఒక యువకునకు పదకొండు ఇంద్రియములచే "అహంకారము" స్పష్టముగా వ్యక్తమగుచున్నదో ఆ విధముగా గర్భగతుడైన వాడికి, బాల్యమున గలవాడికి, వ్యక్తము గావడంలేదు. కారణము అజ్ఞాన జనిత లింగదేహము లేక కాదు. ప్రాణశక్తియే ఆధారముగా గల ఇంద్రియముల వికాసము సంపూర్ణముగా లేకపోవుటచే అమావాస్య నాటి చంద్రుడి రూపమువలె కనబడుట లేదు. 72

నిజానికి ఈ జగద్రూపమైన విషయములు లేనప్పటికి అహంకార మునకు ఆస్పదమైన స్థూలదేహము విచ్ఛేదము కాలేదు కనుక ఈ విషయ భోగములను చింతించుచున్న జీవునకు సుఖదుఃఖాత్మకమైన సంసారము నుండి విముక్తి లేదు. ఏ విధముగానైతే స్వప్నముయందు ఒకడు ఒకడిని కొట్టినట్టు, కనపడినప్పుడు కొట్టడము సత్యము కానప్పటికీ దాని నుండి జనించిన దుఃఖమును అనుభవించినట్టుగా. 73

ఎంతవరకు స్థూల శరీరముచే లింగ శరీరముకూడి ఉంటుందో అంతవరకు సంసార దుఃఖము నివృత్తి కాదు అని వివరించుచున్నాడు.

పంచతన్మాత్రాత్మకమై (పంచీకరణము కాని పృథివ్యాపస్తేజో వాయురాకాశములు) పంచజ్ఞానేంద్రియ, పంచకర్మేంద్రియ మనస్సులనే పదకొండు ఇంద్రియములచే విస్తృతమై సత్వరజస్తమో గుణాత్మకమై యున్న ఈ లింగ శరీరము చైతన్యముచే కూడినప్పుడు జీవుడు అని అనబడతాడు. 74

శ్లో॥ అనేన పురుషో దేహానుపాదత్తే విముంచతి ।
హర్షం శోకం భయం దుఃఖం సుఖం చానేన విందతి ॥ 75

టీ:- యావల్లింగం స్థూలదేహవిచ్ఛేదాత్సంసారాన్నివృత్తిరిత్యే తత్ప్ర పంచయతి - సార్ధైస్త్రిభిః. ఏవమితి. పంచవిధం పంచతన్మాత్రాత్మకం. త్రివృత్ త్రిగుణాత్మకం షోడశవికారాత్మనా విస్తృతం. (74-75)

ఈ లింగదేహముతో కూడిన జీవుడు (పురుషుడు) దేహములను స్వీకరించుచున్నాడు. విడిచి పెట్టుచున్నాడు ఈ దేహము చేతనే సంతోషమును, శోకమును, భయమును, దుఃఖమును, సుఖమును పొందుచున్నాడు. 75

శ్లో॥ యథా తృణ జలూకేయం నాపయాత్యాపయాతి చ ।
న తేజేన్మ్రియమాణోఽపి ప్రాగ్దేహాభిమతిం జనః ॥ 76

టీ:- నన్వేకో దేహం విసృజ్య దేహాంతరప్రవేశాత్ పూర్వమదేహతా స్యాదేవేత్యత ఆహ - యథేతి. నాపయాతి పూర్వతృణస్యాత్యాగాత్ అపయాతి చ తృణాంతరధారణాత్. తథా జనః మ్రియమాణోఽపి

మరి ఒక దేహమును విడిచి దేహాంతరమును పొందులోపు మధ్య దేహము లేకుండును కదా? యనగా చెప్పుచున్నాడు.

ఏ విధముగానైతే గడ్డి పురుగు వేరొక గడ్డి మీద కాలుపెట్టినకాని పూర్వపు గడ్డిముక్క నుండి కాలు తీయదో, అదే విధముగా ప్రాణము పోవడానికి సిద్ధమైనా ప్రారబ్ధ కర్మ జనిత దేహము పొందేవరకు పూర్వపు దేహముపై అభిమానము విడువడు 76

ప్రాగ్దేహాభిమతిం పూర్వదేహాభిమానం నత్యజేత్. అన్యం దేహం కర్మణాం ప్రాగ్దేహారంభకాణాం. వ్యవధానేన విచ్ఛేదేన. సమాప్త్యా. 76

శ్లో॥ యావదన్యం న విందేత వ్యవధానేన కర్మణామ్ ।
మన ఏవ మనుష్యేంద్రభూతానాం భవభావనమ్ ॥ 77

టీ:- ప్రకరణార్థముపసంహరతి – మనఏవేతి. భవభావనం సంసార హేతుః. కథమితి తదాహ యదితి చరితాన్ ఉపభుక్తాన్ యతః కర్మణి సతి. 77

ఎంతవరకైతే పూర్వ దేహము రావడానికి కారణమైన కర్మలు సమాప్తి కావో అంతవరకు తరువాతి దేహము పొందదు. ప్రకరణమును ఉపసంహరించుచున్నాడు. ఓ నరపతీ! ప్రాణి మాత్రమునకు మనస్సే సంసార హేతువు. 76, 77 వ శ్లోకములలో గడ్డిపురుగు దృష్టాంతముచే వేరే దేహమును పొందేంత వరకు ఈ దేహమును విడువడని చెప్పబడినది.

బృహదారణ్యకమున 4-4-3 మంత్రము ఈ విధముగా యున్నది.

"తద్యథా తృణజలాయుకా తృణస్యాంతం గత్వా అన్యమాక్రియ మాక్రియ్య ఆత్మానముపసంహరతి ఏవమేవ అయమాత్మా ఇదంశరీరం నిహత్య అవిద్యాం గమయి త్వా అన్యమాక్రియ మాక్రియ్య ఆత్మానముప సంహరతి".

ఏ విధముగా గడ్డి పురుగు వేరొక గడ్డిపైన కాలుపెట్టి గాని వెనక గడ్డిపైన ఉన్న కాలు తీయదో జీవుడు గూడా వేరొక దేహమును పొందిగాని ఈ శరీరమును విడువడని అర్థము.

ఇచ్చట సంశయము జీవుడు రెండు దేహములయందు ఏ

శ్లో॥ యదక్షైశ్చరితం ధ్యాయన్కర్మాణి కురుతేఽసకృత్ ।
సతి కర్మణ్యవిద్యాయాం బంధః కర్మణ్యనాత్మనః ॥ 78

టీ:- నన్వసంగస్య కుతఃకర్మ?తత్రాహ-సతీతి.అవిద్యాయాం సత్యాం అనాత్మనో దేహాదేః కర్మణి బంధోభవతి తేషామవిద్యాదీనాం. నాశఏవ అర్థోయస్య తథా సన్.విశ్వస్థిత్యాదయో యతో హరేర్భవంతి. (78,79)

విధంగా ఏకకాలంలో ప్రవేశిస్తాడు? ఇది విడుస్తే కాని అక్కడ ప్రవేశం అనగా బృ.ఉ."ప్రసారితయా వాసనాయా" శంకరభాష్యం

దీని స్పష్టత "బ్రహ్మసూత్రం.3-3-1 "తదన్తర ప్రతిపత్తే" అను సూత్రమున భగవత్పాదులు విచారిస్తూ..

"తత్రాప్యపరివేష్టితస్యైవ జీవస్య కర్మోపస్థాపిత ప్రతిపత్తవ్య దేహ విషయ భావనా దీర్ఘ భావమాత్రం జలూకయా ఉపమీయతే".

దీని తాత్పర్యం జీవునకు తన కర్మ బలం చేత తనచేత పొందదగిన దేహాన్ని గూర్చిన భావన కలుగుతుంది. అక్కడ నా దేహం అనే వాసన కలిగితే గాని ఇక్కడ దేహం విడువడు. ఆ భావిదేహ వాసన కర్మబలం చేత ఏర్పడుతుంది. 77

అజ్ఞానము యందుండగా, ఆత్మానుసంధాన శూన్యునకు శుభ, అశుభ కర్మ ఉంటుంది.

ఆ కర్మ ఉండగా ఆ కర్మ సంబంధి భోగము ఉంటుంది. అటు మిమ్మట ఇంద్రియములచే అనుభవింపబడిన విషయములను మనస్సుచేత ధ్యానిస్తూ మళ్ళీ ఈ విషయములకు కారణమైన కర్మను ఆచరిస్తాడు. ఈ విధముగా కర్మ చేయడం ద్వారా అనేకమార్లు ఈ సంసార బంధము కలుగుతుంది. 78

శ్లో॥ అతస్తదవబోధార్థో భజ సర్వాత్మనా హరిమ్ ।
పశ్యం స్తదాత్మకం విశ్వం స్థిత్యుత్పత్త్యప్యయా యతః ॥ 79

అందుచేత ఆ అజ్ఞానము తొలగిపోవడానికి ఈ సృష్టి స్థితి లయములు ఏ శ్రీహరినుండి జరుగుచున్నవో అతడిని; ఈ విశ్వమంతా ఆ శ్రీహరి రూపముగానే (సర్వాత్మకుడుగా) చూస్తు భజించుము. 79

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ భాగవతముఖ్యో భగవాన్నారదో హంసయోర్గతిమ్ ।
ప్రదర్శ్యనృపమామంత్ర్య సిద్ధలోకం తతోऽగమత్ ॥ 80

టీ:- భాగవతేతి. హంసయోః జీవేశ్వరయోః. 80

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

భగవద్భక్తులలో ముఖ్యుడైన భగవాన్ నారదుడు జీవేశ్వరుల తత్వమును తెలిపి, ప్రాచీనబర్హి వద్ద సెలవు తీసుకొని అక్కడనుండి సిద్ధలోకమునకు వెళ్ళెను. 80

శ్లో॥ ప్రాచీనబర్హీ రాజర్షిః ప్రజాసర్గాభిరక్షణమ్ ।
ఆదిశ్య పుత్రానగమత్తపసే కపిలాశ్రమమ్ ॥ 81

రాజర్షియైన ప్రాచీనబర్హి మంత్రులముందు వంశ అభివృద్ధి, ప్రజారక్షణ చేయమని పుత్రులనాదేశించి తపస్సు చేసుకొనుటకు గంగా సాగర సంగమమైన కపిలాశ్రమమునకు వెళ్ళెను. 81

శ్లో॥ తత్రైకాగ్రమనా ధీరో గోవింద చరణాంబుజమ్ ।
విముక్తసంగోనుభజన్భక్త్యాతత్సమతామగాత్ ॥ 82

టీ:- ప్రాచీనబర్హిరితి. ప్రజాసర్గః పుత్రోత్పాదనం. జగదభిరక్షణం చేతి ద్వంద్వైక్యం. పుత్రానాదిశ్యేతి పుత్రాణామాదేశం మంత్రిణామగ్రే కథయిత్వా. (82-83)

వీరుడైన ప్రాచీనబర్హి అన్నిటియందు ఆసక్తిని వదిలి గోవిందుని పాదపద్మములను ఏకాగ్ర చిత్తుడై ధ్యానిస్తూ ఆయనలో ఐక్యము నొందెను. 82

శ్లో॥ ఏతదధ్యాత్మపారోక్ష్యంగీతం దేవర్షిణానఘ ।
యచ్ఛ్రావయేద్యశ్శృణుయాత్స లింగేన విముచ్యతే ॥ 83

టీ:- ఏతదితి లింగేన విముచ్యతే విదేహకైవల్యం ప్రాప్నోతి. 83

ఓ పుణ్యాత్మా! ఎవరైతే దేవర్షియైన నారదుడిచే పరోక్షముగా తెలిపిన తత్త్వమార్గమును వినిపింతురో, విందురో వారు సంసార కారణమైన లింగ శరీరమునుండి విముక్తులగుదురు. 83

శ్లో॥ ఏతన్ముకుందయశసా భువనం పునానం
దేవర్షివర్యముఖ నిస్సృత మాత్మ శౌచమ్ ।
యః కీర్త్యమానమభిగచ్ఛతి పారమేష్ఠ్యం
నాస్మిన్భవే భ్రమతి ముక్త సమస్తబంధః ॥ 84

టీ:- ఏత దితి. ఏతదధ్యాత్మపారోక్ష్యం. ఆత్మశౌచం మనశ్శోధకం పారమేష్ఠ్యం సర్వోత్కృష్టఫలప్రదం. 84

శ్రేష్ఠుడైన దేవర్షి నారద ముఖారవిందము నుండి జాలువారిన ముకుందుడి కీర్తిచే భువనమును పునీతం చేసే ఈ గాథ ఎవరు కీర్తింతురో వారికి మనఃశోధకము, సర్వోత్కృష్టమైన ఫలము లభించును. దీనిని చక్కగా తెలుసుకొనిన అన్ని బంధములు తెగిపోయి ఈ సంసారమున భ్రమించకుండును. 84

శ్లో॥ అధ్యాత్మపారోక్ష్యమిదం మమాభిహితమద్భుతమ్ ।
ఏవం స్త్రియా శ్రమః పుంసశ్ఛిన్నోఽ ముత్ర చ సంశయః ॥85

టీ:- అధ్యాత్మేతి. స్త్రీ బుద్ధిస్తత్సహితస్యాశ్రమోఽహంకారశ్ఛిన్నో భవతి అముత్ర కర్మఫలభోగః. కథమితి సంశయశ్చ ఛిన్నః. 85

ఆశ్చర్యకరమైన ఈ ఆత్మతత్త్వము యొక్క పరోక్ష కథనము నాచే పొందబడినది. బుద్ధితోకూడిన వ్యక్తికి అహంకారము తొలిగిపోతుంది. (స్త్రీ యనగా బుద్ధి, ఆశ్రమః అనగా అహంకారము) పరలోకపు కర్మ ఫలభోగము ఎట్లు అను సంశయము గూడ తొలిగిపోయెను. 85

**ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే, ఏకోనత్రింశోఽ ధ్యాయః**

**శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు ఇరువది తొమ్మిదవ అధ్యాయము సమాప్తము.**

## త్రింశోఽధ్యాయః

శ్లో॥ ప్రసంగాత్పంచభిః ప్రోక్తం వృత్తం ప్రాచీనబర్హిషః ।
వర్ణ్యతే చ పునర్ద్వాభ్యాం ప్రస్తుతం చ ప్రచేతసామ్ ॥

## 30వ అధ్యాయము

ప్రసంగ వశమున ఐదు అధ్యాయములచే ప్రాచీనబర్హి చరితమును చెప్పబడినది. ప్రారంభించిన ప్రచేతసుల చరితము మళ్ళీ రెండధ్యాయముల ద్వారా వర్ణింపబడుచున్నది. (స్మరణకు వచ్చిన విషయమును ఉపేక్ష చేయకుండా ఉండడమును ప్రసంగమందురు)

ఈ ముప్పదవ అధ్యాయమున తపస్సుచేత సంతోషించిన ఈశ్వరుడి వల్ల వరములు పొంది వార్క్షిని వివాహము చేసుకొని రాజ్యపాలన చేయడం చెప్పబడుచున్నది.

**విదుర ఉవాచ**

శ్లో॥ యే త్వయాభిహితా బ్రహ్మన్ సుతాః ప్రాచీనబర్హిషః ।
తే రుద్రగీతేన హరిం సిద్ధిమాపుః ప్రతోష్యకామ్ ॥ 1

టీ:- తత్ర త్రింశే తపస్తుష్టాద్దేవాల్లబ్ధవరాస్తతః ఆగత్య వార్క్షిముద్వాహ్య రాజ్యం చక్రురితీర్యతే. యఇతి. హరిం ప్రతోష్య. కాం సిద్ధిమాపుః. 1

**విదురుడు ఈ విధముగా అడుగుచున్నాడు.**

ఓ బ్రహ్మర్షీ! నీచేత ప్రాచీన బర్హి కుమారులు ఉపదేశించబడి రుద్రగీతము ద్వారా హరిని సంతోషపరచి ఏ సిద్ధిని పొందిరి? 1

శ్లో॥ కిం బార్హస్పత్యేహ పరత్రవా ఫలం
కైవల్యనాథ ప్రియపార్శ్వవర్తినః ।
ఆసాద్య దేవం గిరిశం యదృచ్ఛయా
ప్రాపుః పరం నూనమథ ప్రచేతసః ॥ 2

టీ:- కిమితి. హే బార్హస్పత్య కస్యాం చిద్విద్యాయాం బృహస్పతేః మైత్రేయః శిష్య ఇతి జ్ఞాతవ్యం. తే యదృచ్ఛయా గిరిశం ప్రాప్య. తస్యైవ కైవల్యనాథప్రియస్య గిరిశస్య పార్శ్వవర్తి నస్తదనుగృహీతాస్సంతో నూనం పరం మోక్షం ప్రాపురేవ తతః పూర్వం తు ఇహ అథవా పరత్ర కిం ప్రాపుః. 2

ఓ బార్హస్పత్యా! అని సంబోధన చేయడం ద్వారా ఒకానొక విద్యయందు మైత్రేయుడు బృహస్పతి శిష్యుడని తెలుసుకోవాలి. అనుకోనుండా ప్రచేతసులు కైలాస నాథుడిని కలసుకొని కైవల్యనాథుడి ప్రియుడైన శివుడి సాన్నిధ్యమున గలవారై ఆయనచే అనుగ్రహింపబడి మోక్షమును పొందినవారైనప్పటికీ దానికంటే ముందు ఇహలోక, పరలోకమున ఏమి పొందిరి? 2

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ ప్రచేతసోఽంతరుదధౌ పితురాదేశ కారిణః ।
జపయజ్ఞేన తపసా నిరంజనమతోషయన్ ॥ 3

టీ:- ప్రచేతస ఇతి. రుద్రగీత స్తోత్ర జపరూపేణ యజ్ఞేన తపసా చ నిరంజనం హరిం. 3

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

ప్రచేతసులు తండ్రి ఆదేశముతో సముద్ర మధ్యమున రుద్రగీత జపయజ్ఞము, తపస్సుచే శ్రీహరిని సంతోషపరిచిరి. 3

శ్లో॥ దశవర్షసహస్రాంతే పురుషస్తు సనాతనః ।
తేషామావిరభూత్కృచ్ఛ్రం శాంతేన శమయన్రుచా ॥ 4

టీ:- దశవర్షేతి. తేషాం. కృచ్ఛ్రం తపః క్లేశం. రుచా కాంత్యా. శమయన్ శాంతేన శుద్ధసత్త్వేన వపుషా. ఆవిర్భూతః. 4

పదివేల సంవత్సరములు తపస్సుచేసిన పిమ్మట, సనాతనుడైన పరమపురుషుడు, శ్రీహరి వారి సంపూర్ణమైన తపఃక్లేశమును, తన శరీర కాంతులచేత చల్లారుస్తూ శుద్ధమైన సత్త్వప్రధానమైన రూపముచే ఆవిర్భవించెను. 4

శ్లో॥ సుపర్ణస్కంధమారూఢో వేరుశృంగమివాంబుదః ।
పీతవాసా మణిగ్రీవః కుర్వన్వితిమిరా దిశః ॥ 5

టీ:- సుపర్ణేతి. సుపర్ణః స్కంధమారూఢ ఇత్యాదినా బర్హిష్మతస్సుతానా హేతి తృతీయేనాన్వయః. 5

మేరుపర్వతముపై నీలిమేఘమున్నట్టుగా గరుడిపై కూర్చొని పచ్చని వస్త్రము ధరియించి, మెడయందు కౌస్తుభమణిని ధరించి దిక్కుల చీకట్లును పోగొడుతూ..5

శ్లో॥ కాశిష్ణునా కనకవర్ణ విభూషణేన
భ్రాజత్కపోల వదనో విలసత్కిరీటః ।
అష్టాయుధైరనుచరైర్మునిభిస్సురేంద్రై
రాసేవితో గరుడకిన్నరగీత కీర్తిః ॥ 6

టీ:- కాశిష్ణునేతి. కాశిష్ణునా దీప్తిశీలేన. కనకమయేన సువర్ణవతా. విభూషణేన భ్రాజమానం కపోలం వదనం చ యస్య. అష్టభిరాయుధైః గరుడ ఏవ కిన్నరః తేన పక్షస్వనైః గీతా కీర్తిర్యస్యః. 6

బంగారు ఆభరణముచే ప్రకాశిస్తు వెలిగిపోతున్న కపోలములు (ముఖము) గలవాడు, కాంతివంతమైన కిరీటము గలవాడు, ఎనిమిది ఆయుధములను ధరించినవాడును, అనుచరులచే, మునులచే, ఇంద్రాదులచే సేవించబడుచున్నవాడును, గరుడుడివలె గల కిన్నరులచే కీర్తింపబడుచున్న వాడును..6

శ్లో॥ పీనాయతాష్టభుజమండలమధ్య లక్ష్మీ
స్పర్ధశ్రియా పరివృతో వనమాలయాద్యః ।
బర్హిష్మతః పురుష ఆహ సుతాన్ప్రపన్నా
న్పర్జన్య నాదరుతయా సఘృణావలోకః ॥ 7

టీ:- పీనేతి. పీనాశ్చ తే ఆయతాః అష్టౌ భుజాస్తేషాం మండలం సమూహః తన్మధ్యే స్థితయా లక్ష్మ్యా స్పర్ధమానా శ్రీః శోభా యస్యాః తయా వనమాలయా పరివృతః ఆద్యః పురుషః. పర్జన్యస్య నాద ఇవ రుతం నాదో యస్యాః తయా వాచా ఆహ. సఘృణోఽవలోకో యస్య. 7

దృఢమైన, దీర్ఘములైన ఎనిమిది భుజముల మధ్య గల లక్ష్మీదేవి కాంతిచే పోటీపడుచున్న పరివేష్టించిన వనమాల గల వాడును, ఆద్యుడైన, పరమ పురుషుడు, భగవంతుడు, ప్రసన్నమైన దయగల చూపుగలవాడై మేఘ గంభీరమైన వాక్కులచే, ప్రపన్నులైన, ప్రాచీనబర్హి కుమారులగు ప్రచేతసులతో ఇట్లు పలికెను. 7

శ్రీ భగవానువాచ

శ్లో॥ వరం వృణీధ్వం భద్రం వో యూయం మే నృపనందనాః ।
సౌహార్దేనాపృథగ్ధర్మాస్తుష్టోఽహం సౌహృదేన వః ॥ 8

టీ:- వరమితి. యూయం మేమత్తో వరం వృణీధ్వం. సౌహార్దేన హేతునా అపృథక్ ధర్మో యేషాం సంబోధనం. వః పరస్పరం సౌహృదేన తుష్టోఽహం. 8

శ్రీ భగవానుడు ఈ విధముగా పలికెను.

ఓ రాజకుమారులారా! పరస్పర ప్రేమ కారణముగా అందరూ ఒకే ధర్మములోయున్న వారలారా! మీ పరస్పర ప్రేమ భావనలచే సంతోషించినాను. మీకు మంగళములు గలుగు కాక! "వరం కోరుకొనుడు". 8

శ్లో॥ యోనుస్మరతి శయ్యాయాం యుష్మాననుదినం నరః ।
తస్య భ్రాతృష్వాత్మసామ్యం తథాభూతేషు సౌహృదమ్ ॥ 9

టీ:- య ఇతి. భ్రాతృష్వాత్మసామ్యం భూతేషు సౌహృదం భవిష్యతి. 9

ఏ మానవుడు ప్రతిరోజు మిమ్ములను సంధ్యా సమయమున స్మరించునో అతడికి అన్నదమ్ములయందుపరస్పర ప్రేమ మరియు సర్వప్రాణులయందు దయ ఏర్పడును. 9

శ్లో॥ యే చ మాం రుద్రగీతేన సాయం ప్రాతస్సమాహితాః ।
స్తువంత్యహం కామవరాన్ దాస్యే ప్రజ్ఞాం చ శోభనామ్ ॥10

టీ:- య ఇతి. తేభ్యోదాస్యే. కిం పునర్యుష్మభ్యమితి శేషః. 10

ఎవరైతే నిశ్చలమైన మనస్సు గలవారై, నన్ను రుద్రగీతముచే సాయంకాల, ప్రాతఃకాలములు స్తుతిస్తారో వారికి కోరిన కోరికలు తీర్చడమే గాక చక్కటి బుద్ధిశక్తిని గూడా ప్రసాదిస్తాను. ఇక మీ విషయమున చెప్పవలసినదేమున్నది? 10

శ్లో॥ యద్యూయం పితురాదేశమగ్రహీష్ట ముదాన్వితాః ।
అథోవ ఉశతీ కీర్తిర్లోకాననుభవిష్యతి ॥ 11

టీ:- యదితి. అగ్రహీష్ట గృహీతవంతః అథో ఇతి హేతౌ. లోకాననులోకేషు భవిష్యతి. యద్వా లోకాననుభవిష్యతి. ద్రక్ష్యతి వ్యాప్స్యతీత్యర్థః. 11

మీరు మీ తండ్రిగారి ఆదేశమును సంతోషముతో స్వీకరించితిరి. కనుక మీ స్వచ్ఛమైన కీర్తి అన్ని లోకములయందు వ్యాప్తి చెందగలదు. 11

శ్లో॥ భవితా విశ్రుతః పుత్రోఽనవమో బ్రహ్మణో గుణైః ।
య ఏతామాత్మవీర్యేణ త్రిలోకీం పూరయిష్యతి ॥ 12

బ్రహ్మదేవుడిచే సమానుడైన ఒక కుమారుడు మీకు పుట్టగలడు. అతడు తన సంతానముచే మూడు లోకములను నింపగలడు. 12

టీ:- భవితేతి. అనవమః అనూనః. బ్రహ్మపుత్రాణాం మధ్యే అనవమో దక్ష ఇతి వా. ఆత్మనో వీర్యేణ సంతానేన. 12

శ్లో॥ కండోః ప్రమ్లోచయా లబ్ధాకన్యా కమలలోచనా ।
తాం చాపవిద్ధాం జగృహుర్భూరుహా నృపనందనాః ॥ 13

టీ:- పుత్రార్థమాదౌ భార్యాం సంపాదయతి. త్రిభిః. కండోరితి. తపోనాశార్థమింద్రప్రేషితయా ప్రమ్లోచయా కండుర్నామ ఋషిః. బహుకాలం రేమే. సా చ తతః స్వర్గం గచ్ఛంతీ. కండోర్జాతం గర్భం. వృక్షేషు త్యక్త్వా జగామ. తదేతదుక్తం అపవిద్ధాం త్యక్తాం. భూరుహాః వృక్షాః హే నృపనందనాః. 13

శ్లో॥ క్షుత్క్షామాయా ముఖే రాజా సోమః పియ్యూషవర్షిణీమ్ ।
దేశినీం రోదమానాయా నిదధే సదయాన్వితః ॥ 14

టీ:- క్షుదితి. స ప్రసిద్ధో వనస్పతీనాం రాజా సోమః అమృతస్రావిణీం దేశినీం తర్జనీం. రుదంత్యాస్తస్యా ముఖే నిదధే. అనేనాప్సరోగర్భసంభవే నామృత హారేణ చ తస్యా లావణ్యం క్లమస్వేదదౌర్గంధ్యాదిరాహిత్యం చోక్తం. 14

మూడు శ్లోకములచే - పుత్రుడిని పొందుటకు ప్రచేతసులకు భార్యను సంపాదించి పెడుతున్నాడు భగవానుడు.

కండువనే మహర్షి తపస్సును క్షీణింప చేయడానికి ఇంద్రుడు ప్రమ్లోచనయను అప్సరసను పంపగా, ఆమెతో కండు మహర్షి చాలా కాలము రమించినాడు. ఆ అప్సరస స్వర్గానికి వెళ్ళిపోతూ కండు ద్వారా కన్న కమలముల వంటి కన్నులు గల అమ్మాయిని వృక్షముల యందు విడిచి వెళ్ళినది. ఆ అమ్మాయిని చెట్లు స్వీకరించినవి. 13

ఆ అమ్మాయి ఆకలిచే ఏడ్చుచున్నప్పుడు వృక్షములకు రాజైన చంద్రుడు దయగలవాడై అమృతమును కురుపించు తన చూపుడు వేలును ఆమె ముఖముయందుంచెను. ఇలా చెప్పడముద్వారా అప్సరస గర్భము యందు సంభవించుటచేత; అమృతము ఆహారమగుటచేత అద్భుతమైన లావణ్యము గలిగి, శ్రమగాని, చెమటగాని, దుర్గంధము గాని, దుఃఖముగాని ఆమెకు లేకపోవడం చెప్పినట్టయినది. 14

శ్లో॥ ప్రజావిసర్గ ఆదిష్టాః పిత్రా మామనువర్తత ।
తత్ర కన్యాం వరారోహాం తాముద్వహత మాచిరమ్ ॥ 15

టీ:- ప్రజేతి. మామనువర్తమానేన పిత్రా. నియుక్తాః సంతః. తత్ర ప్రజాసర్గే నిమిత్తే తాముద్వహత. 15

శ్లో॥ అపృథగ్ధర్మశీలానాం సర్వేషాం నస్సుమధ్యమా ।
అపృథగ్ధర్మశీలేయాం భూయాత్పత్న్యర్పితాశయా ॥ 16

టీ:- నను బహునాం కథమేకా భార్యాస్యాదితి లోకశాస్త్రవిరోధా త్తత్రాహ-అపృథగితి. అపృథక్ ధర్మః శీలం చ యేషాం తేషాం వః పత్నీ భూయాత్. అర్పితో భవత్సు ఆశయో యయా ధర్మశీలయోరైక్యాత్. మద్వాక్యాచ్చ న దృష్టాదృష్టవిరోధ ఇతి భావః. 16

నన్ను అనుసరించే మీ తండ్రిగారిచేత మీరు ప్రజాసృష్టికి ఆదేశింపబడినవారైనారు కనుక త్వరగా ఆ కన్యను వివాహము చేసుకోండి. మరి ఇంతమంది ఒకే ఆమెను ఏ విధంగా చేసుకోవడం? అనగా ప్రజాపాలనాది రూప ధర్మమొక్కటే (శీలము) మీయందు అభిన్నముగా (వేరుకాక) యున్నది. కనుక, అభిన్నమైన (వేరుకాని) ఇట్టి ధర్మ శీలములుగల మీయందే ఆమె హృదయమును అర్పించ-గలదు. నా ఆజ్ఞ కనుక, ఇందమందికి ఒకే ఆమె భార్య కావడం, ఒక స్త్రీకి ఒకే భర్త అనే శాస్త్ర నియమోల్లంఘన జనిత నరకాది అదృష్ట విరోధములు ఉండవు. 15

ఈ కథా సందర్భమున (1-15 అధ్యాయము) శ్రీధర స్వాములవారు అతి సుందరమైన వ్యాఖ్య చేసినారు. పదిమందికి ఒకేస్త్రీ ఎట్లు భార్య అవుతుందని మీరు శంకించకండి? మొదలు ఆమె కండు మహర్షి తపః ప్రభావ వీర్యముచే అప్సర స్త్రీ గర్భజనిత. మరియు "అయోనిజ" ఆమెగూడా అప్సరస వంటిదే తప్ప మానుష స్త్రీ కాదు. అనేకులు ఒక అప్సరసను పొందడంలో తప్పులేదు. మరియొక కారణం విష్ణు ప్రసాదం కనుక అనేకులు భర్త కావడం దోషం కాదు అని వ్యాఖ్యానించినారు. అసలు "మనుష్యాదికారత్వాత్‌శాస్త్రస్య" అని దేవతాభికరణము యందు చెప్పబడినది "దాతవ్యేకాసుతైకస్మైబహుభ్యో

న కదాచన" అమ్మాయిని ఒకరికే ఇవ్వాలి కాని చాలామందికి ఇవ్వరాదు అను శాస్త్రవచనములు యోనిజులైన మనుష్యులకు విధింపబడిన శాస్త్రమును అయోనిజులైన, విలక్షణ జన్మ కలిగిన ద్రౌపద్యాదులకు అన్వయించి చూడడం, పురాణములను వెక్కిరించడం, అవివేకమవుతుంది. "ఋషీణామపి మంత్ర బ్రాహ్మణ దర్శినాం సామర్థ్యంనాస్మదీయేన సామర్థ్యేన ఉపమాతుం యుక్తం తస్మాత్ సమూల మితిహాస పురాణం. మంత్ర బ్రాహ్మణ దష్టలైన ఋషుల సామర్థ్యమును మన సామర్థ్యంతో పోల్చుకోవడం యుక్తం కాదు. (1-3-33 బ్ర.సూ.శాంకరభాష్యం) అని భగవత్పాదీయం "ప్రాప్త స్వయోగాగ్ని మయం శరీరం" (శ్వేతా.2-12) వారి దేహములు యోగాగ్ని మయములు, ఇదే విష్ణుపురాణమున (1-15-79) సంకల్పాత్ దర్శనాత్ పూర్వేషామభవత్ ప్రజాఃతపోవిశేషైః సిద్ధానాం తదాఽత్యంత తపస్వినాం" గొప్ప తపస్సు గలవారు కేవలం సంకల్పమాత్రం చేత దర్శన మాత్రం చేత స్పర్శద్వారా సంతానాన్ని పొందినారు. ద్రౌపద్యాదులు ఐదుగురిని, పదిమందిని వివాహం చేసుకోవడం ప్రామాణికంగా స్వీకరించి; వారు అయోనిజులు, తపఃపూతులనప్పుడు మాత్రం ప్రామాణికమున అంగీకరించకపోవడం మానసిక దౌర్బల్యమే. మరియు కోడి ముందు భాగమును భక్షించి వెనక భాగమును గ్రుడ్డు కొరకుంచుకుంటామను కోవడమే అవుతుంది. 16

శ్లో॥ దివ్య వర్షసహస్రాణాం సహస్రమహతౌజసః ।
భౌమాన్భోక్ష్యథ భోగాన్వై దివ్యాంశ్చానుగ్రహాన్మమ ॥ 17

టీ:- అన్యదపి మదారాధనఫలం గృహ్ణీతేత్యత ఆహ-దివ్యేతి. ఆహతౌజసః అప్రతిహతబలాస్సంతః. 17

మీరు నా అనుగ్రహము వలన పదిలక్షల దివ్య సంవత్సరముల కాలము, చెదరగని బలముగలవారై, భూమిపై అనేక భోగముల ననుభవించి, దేవభోగములను గూడా అనుభవించండి. 17

శ్లో॥ అథ మయ్యనపాయిన్యాభక్త్యా పక్వగుణాశయాః ।
ఉపాయాస్యథమద్ధామ నిర్విద్య నిరయాదతః ॥ 18

టీ:- అథేతి. పక్వగుణో దగ్ధకామాదిమల ఆశయో ఏషాం అతః లోకద్వయభోగాన్ని రయప్రాయాన్నిర్విద్య మత్ స్థానం ప్రాప్స్యథ. 18

అటుపిమ్మట నాయందు తొలగని భక్తి గలవారై, దహింపబడిన కోరికలు గల హృదయులై, భూలోక, దేవలోకముల భోగములనే నరక ప్రాయమునుండి వైరాగ్యమునుపొంది నా స్థానమునుపొందండి. 18

శ్లో॥ గృహేష్వావసతాం చాపి పుంసాం కుశలకర్మణామ్ ।
మద్వార్తాయాతయామానాం న బంధాయ గృహామతాః ॥ 19

టీ:- నను గృహేషు ప్రవిష్టానామస్మాకం తదాసక్త్యా బంధ ఏవస్యాత్ కుతః త్వద్భక్తిః నిర్వేదో వా? తత్రాహ - గృహేష్వితి. కుశలం మయ్యర్పితం సర్వం కర్మయేషాం. మద్వార్తయా యాతో యామః కాలో యేషాం. 19

గృహస్థాశ్రమమునగలవారునూ సమస్త కర్మలను నా యందు అర్పించి, నా చింతనచే కాలమునుగడుపుచున్నచో వారికి గృహస్థాశ్రమము బంధము కాదు. 19

శ్లో॥ నవ్యవద్ధృదయే యజ్ఞో బ్రహ్మైతద్బ్రహ్మవాదిభిః ।
న ముహ్యంతి న శోచంతి న హృష్యంతి యతో గతాః ॥ 20

టీ:- తద్వార్త శోతౄణాం గృహైర్నబంధ ఇతి కుత స్తత్రాహ-నవ్య వదితి. యద్యస్మాత్కథాశ్రవణాత్ జ్ఞః సర్వజ్ఞోఽహమిశ్వరః. బ్రహ్మవాదిభిః మత్కథా ప్రవక్తృభిర్నిమిత్తభూతైః. శ్రోతౄణాం హృత్ హృదయం నవ్యవత్ ప్రతిపదం నూతనవత్. అయే ప్రాప్నోమి మనస్యభివ్యక్తో భవామి బ్రహ్మ సాక్షాత్కారో భవతీత్యర్థః. నను త్వత్కథాశ్రవణే కథం బ్రహ్మసాక్షాత్కార స్తత్రాహ. యోహమేతదేవ బ్రహ్మ తత్ర హేతుః యతో గతాః యం మాం ప్రాప్తాస్సంతః మోహశోకహర్షాన్న ప్రాప్నువంతి. అతో మత్కథా శ్రవణేన నవ్యవన్మమ హృద్యావిర్భావా దస్యైవ బ్రహ్మసాక్షాత్కార త్వాద్గృహేషు వసతామపి న బంధ ఇత్యర్థః (20)

నా వార్తా (గాథలు) శ్రవణము చేసినవారికి గృహము బంధము కాదు ఎందుకనగా? నా కథా శ్రవణము ద్వారా సర్వజ్ఞుడనైన నేను బ్రహ్మ వాదులచే ప్రవచింపబడి హృదయములయందు (ప్రతిపదము) నిత్య నూతనముగా ప్రవేశించెదను. అనగా బ్రహ్మసాక్షాత్కారము జరుగుతుంది.

మరి నీ కథా శ్రవణ మాత్రంచే బ్రహ్మ సాక్షాత్కారమెట్లు? అనగా ఇదియే నేనైయున్నాను కనుక ఇదియే బ్రహ్మ. కారణమేమనగా ఇంతవరకు నన్ను పొందినవారు మోహ, శోక, హర్షాదులను పొందుట లేదు. అందునకు కారణం నా కథా శ్రవణము ద్వారా నిత్య నూతనముగా, హృదయములయందు బ్రహ్మ సాక్షాత్కాతము జరుగుటయే. కావున ఇంటిలో నివసించుచున్నా గూడా ఇల్లు బంధము కాదని అర్థము. 20

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ ఏవం బ్రువాణం పురుషార్థభాజనం
జనార్దనం ప్రాంజలయః ప్రచేతసః ।
తద్దర్శన ధ్వస్త రజస్తమోమలా
గిరా గృణన్గద్గదయా సుహృత్తమమ్ ॥ 21

టీ:- ఏవమితి. పురుషార్థం భాజయతి ప్రాప్తయతీతి తథా తం. 21

**మైత్రేయుడు ఈ విధముగా పలికెను.**

ఈ విధముగా పలుకుచున్నట్టి పురుషార్థమును పొందింపచేసే జనార్ధనుని అంజలి జోడించిన ప్రచేతసులు ఆ భగవద్దర్శనము ద్వారా తొలిగిపోయిన రజోగుణ, తమోగుణములు గలవారై పరమహితమును కలిగించు వానిని గద్గదమైన వాక్కులచే స్తుతించుచున్నారు. 21

ప్రచేతస ఊచుః

శ్లో॥ నమో నమః క్లేశవినాశనాయ
నిరూపితోదార గుణాహ్వయాయ ।
మనోవచో వేగ పురోజవాయ
సర్వాక్షమార్గైరగతాధ్వనే నమః ॥ 22

టీ:- నమ ఇతి. వేదైః సకలశ్రేయస్సాధనత్వేన నిరూపితాః ఉదార గుణాః ఆహ్వయానమాని చ యస్య మనోవచసోర్వేగాదపి. పురోఽగ్రతో జవో వేగో యస్య. మనోవచ సోరగోచరాయేత్యర్థః. అతఏవ సర్వేషామక్షాణామింద్రియాణాం మార్గైగతః అనగవతోఽధ్వా యస్య తస్మై నమః. 22

ప్రచేతసులు ఈ విధముగా పలుకుతున్నారు.

సమస్త క్లేశములను తొలిగించువానికి; వేదములచే సకల శ్రేయస్సులకు సాధనముగా నిరూపింపబడిన ఉదార గుణములు, నామములు గలిగిన వాడికి; మనస్సునకు, వాక్కునకంటే గూడా ముందుండే వాడికి, అనగా వాగ్మనస్సులకు గూడా కనబడని వానికి సమస్తేంద్రియములకు ఎవని మార్గమును తెలియలేకున్నదో అట్టి వాడికి అనేక నమస్కారములు. (ఈ శ్లోకమున మూడు నమస్కారములు కలవు కాయిక, వాచిక, మానసిక)..22

శ్లో॥ శుద్ధాయ శాంతాయనమస్స్వ నిష్ఠయా
మనస్యపార్థం విలసద్ద్వయాయ ।
నమో జగత్ స్థాన లయోదయేషు
గృహీత మాయాగుణ విగ్రహాయ ॥ 23

టీ:- శుద్ధాయేతి స్వనిష్ఠయా స్వరూపస్థిత్యా. శుద్ధాయ అతః శాంతాయమసి నిమిత్తే సతి. అపార్థం వ్యర్థమేవ లసత్ విస్ఫురితం.

ఆత్మనిష్ఠచే శుద్ధుడైనట్టి, కావున శాంతుడైనట్టి, ఎవని పొందుట ద్వారా మనోగతమైన ద్వైతప్రపంచము నిష్ప్రయోజనమో, ఎవడు జగత్తు సృష్టి, స్థితి, లయముల కొరకు స్వీకరింపబడిన మాయా గుణములచే బ్రహ్మ, విష్ణు, రుద్ర రూపములు గలవాడో అట్టి వాడికి అనేక నమస్కారములు. 23

ద్వయం రూపం యస్మిన్ గృహీతాః మాయాగుణైః విగ్రహః బ్రహ్మాది మూర్తయే యేన. 23

శ్లో॥ నమో విశుద్ధసత్త్వాయ హరయే హరి మేధసే ।
వాసుదేవాయ కృష్ణాయ ప్రభవే సర్వసాత్త్వతామ్ ॥ 24

స్వతసిద్ధముగా శుద్ధమై సత్వరూపము గలవాడును, సంసారమును హరించు జ్ఞానము గలవాడును, సర్వసాత్వత వంశీయులకు అనగా సత్వగుణ ప్రధానులైన వారలకు ప్రభువును, వాసుదేవుడు, కృష్ణుడునైన శ్రీహరికి నమస్కారములు. 24

శ్లో॥ నమః కమలనాభాయ సమః కమలమాలినే ।
నమః కమలనేత్రాయ నమస్తే కమలాంఘ్రయే ॥ 25

కమల నాభునకు, కమల మాల ధరించినవానికి, కమలముల వంటి పాదములు గలవాడికి, కమలముల వంటి కన్నులు గలవానికి నమస్కారము. 25

టీ:- నమ ఇతి. స్వతస్తు విశుద్ధసత్త్వరూపాయ. సంసారం హరంతి మేధా జ్ఞానం యస్య తస్మై. (24-25)

శ్లో॥ నమః కమలకింజల్క పిశంగామల వాసనే ।
సర్వభూతనివాసాయ నమోఽయుంక్ష్మహి సాక్షిణే ॥ 26

తామర కమలములలోని పుప్పొడి వలె స్వచ్ఛమైన పసుపు వర్ణము గల వస్త్రము ధరించిన వాడికి, సర్వ భూతములకు ఆధారుడైనట్టియు సర్వ సాక్షియునైనట్టి వాడికి మేము నమస్కారములను చేయుచున్నాము . 26

టీ:- నమ ఇతి కమల కింజల్క పిశంగం అమలం చ వాసో యస్య తస్మై. అయుంక్ష్మహి కృతవంతో వయం. 26

శ్లో॥ రూపం భగవతా త్వేతదశేషక్లేశ సంక్షయమ్ ।
అవిష్కృతం నః క్లిష్టానాం కిమన్యదనుకంపితమ్ ॥ 27

టీ:- యదుక్తం వరం వృణీధ్వమితి తన్మనసి నిధాయాహుః రూపమితి. సమస్తానాం క్లేశానాం సంక్షయో యస్మాత్తత్ నః ఆవిష్కృతం ప్రకటితం. అతోఽన్యదస్మాత్కిమనుకంపితం అనుకంపా ఇయమేవాస్మాకం పరమానుకంపేత్యర్థః. 27

వరము కోరమని భగవంతుడన్న మాటను మనస్సులో పెట్టుకొని ఈ విధముగా అనుచున్నారు.

ఏ రూప దర్శనము ద్వారా సమస్త క్లేశములు నశించునో అట్టి రూపమును క్లేశములు గల మాకు ఆవిష్కరించినావు. (ప్రకటించినావు) ఇంతకంటే అనుగ్రహమేమి గలదు? అనగా ఇదియే మాకు గొప్ప అనుగ్రహము అని అర్థము. 27

శ్లో॥ ఏతావత్త్వం హి విభుభిర్భావ్యం దీనేషు వత్సలైః ।
యదనుస్మర్యతే కాలే స్వబుద్ధ్యాఽభద్ర రంధన ॥ 28

టీ:- కుత ఇత్యత ఆహుః - ఏతావత్త్వమితి. హే అభద్రరంధన అమంగళనాశక. సత్వం ప్రత్యయోఽత్ర న వివక్షితః. ఏతావదేవ దీనేషు. వత్సలైః ప్రభుభిర్భావ్యం. కార్యం కిం తత్తదాహ - యదితి. అస్మదీయా ఏతే ఇతి బుద్ధ్యా. ఉచితే కాలే అనుస్మర్యతే అనుస్మరణం క్రియత ఇతి యత్. త్వయా తు రూపమపి దర్శితమితి భావః. 28

ఓ అమంగళములను తొలగించువాడా! ప్రభువులు దీనుల యందు ప్రేమగలవారు సందర్భము వచ్చినప్పుడు మీరు మావారే అని బుద్ధిలో తలిస్తే చాలు. అట్టిది నీవు రూపమును గూడా దర్శింపచేసినావు. 28

శ్లో॥ యేనోపశాంతిర్భూతానాం క్షుల్లకానామపీహతామ్ ।
అంతర్హితోఽంతర్హృదయే కస్మాన్నో వేద నాశిషః ॥ 29

ఎవరు నిన్ను స్మరిస్తారో వారికి సుఖం కలుగుతుంది. మరియు అల్ప ప్రాణుల హృదయముల యందుకూడా అంతర్యామివై యుండే

టీ:- యేనేతి. యేనానుస్మరణేన. స్మ ృతానాం తేషాముపశాంతి స్సుఖం భవతి. కించ క్షుల్లకానామపి భూతానాం అంతర్హృదయే అందర్హితః అంతర్యామిత్వేన స్థితో భగవాన్ ఈహతా మీహమానా నామిచ్ఛతాం తదుపాసకానాం నోఽస్మాకమాశిషః కామాన్ కస్మాద్ధేతో ర్నవేద జానాత్యే వేత్యర్థః. 29

శ్లో॥ అసావేవ వరోఽస్మాకమీప్సితో జగతఃపతే ।
ప్రసన్నో భగవాన్ యేషామపవర్గ గురుర్గతిః ॥ 30

టీ:- అసావితి. తథాపి వక్తవ్యం చేత్తర్హి యేషామస్మాకం భవాన్. ప్రసన్నః. అసావేవ వరః భగవత్ప్రసాద ఏవాస్మాకమీప్సితో వరః ఇత్యర్థః అపవర్గ గురుః మోక్షమార్గప్రవర్తకః. గతిః స్వతశ్చ పురుషార్థభూతః (30)

శ్లో॥ వరం వృణీమహేఽథాపి నాథ త్వత్పరతః పరాత్ ।
నహ్యంతో యద్విభూతీనాం సోఽనంత ఇతి గీయసే ॥ 31

టీ:- వరమితి. యద్యప్యేవం అథాపి హే నాథత్వత్ త్వత్తః వరమేకం వృణీమహే కథంభూతాత్ పరతః కారణాదపి పరాత్. "అక్షరా త్పరతః పర" ఇతి శ్రుతేః. అతో యద్యపి త్వం దాతుం సమర్థః. న చ దివ్యానాం

నీకు నీ ఉపాసకులైన మా కోరికలతో నిండిన ఆకాంక్షలు ఏల తెలియకుండును. తెలిసినవాడవయ్యే ఉందువు. 29

అయిన్పటికీ మా మాటలచేత మేము వరం కోరాలంటే ఇదే మేము కోరేది. ఓ జగత్పతీ! స్వయముగా పురుషార్థ రూపుడవు, మోక్ష మార్గప్రదర్శకుడు అయిన భగవానుడు ప్రసన్నుడు కావలెను అనగా భగవత్ప్రసాదమే మేము కోరే వరము. 30

ఇట్లా ఉన్నప్పటికి ఓ నాథా నీ నుండి మేము వరమొకటి కోరుకుంటాము. ఎట్టి నీనుండి అనగా? కారణమునకంటే గూడా వేరై ఉన్న - ద్వితీయముండకమున 2-1-2 మంత్రం దివ్యోహ్యమూర్తః --అక్షరత్పరతఃపరః అని అక్షరాత్ నామరూప బీజ ఉపాధిలక్షిత స్వరూపాత్ సర్వకార్య కారణ బీజత్వేన ఉపలక్ష్య మాణత్వాత్ పరం తదుపాధి లక్షణం అవ్యాకృతాఖ్యం అక్షరం, సర్వవికారేభ్యః తస్మాత్

త్వద్విభూతీనామంతోఽస్తి యతోఽనంత విభూతిత్వాదనంత ఇతి గీయసే. 31

శ్లో॥ పారిజాతేఽంజసా లబ్ధే సారంగోఽన్యం నసేవతే ।
త్వదంఘ్రిమూలమాసాద్య సాక్షాత్కింకిం వృణీమహే ॥ 32

టీ:- పారిజాత ఇతి. తథాపి యథా సారంగో భ్రమరః. పారిజాతే సుఖేన లబ్ధే సతి. సులభమప్యన్యం వృక్షాంతరం న సేవతే. తథా వయమపి సాక్షాత్త్వదంఘ్రిమూలం ప్రాప్య కిం వృణీమహే. న కించిదిత్యర్థః. యద్వా - కిమప్యన్యత్తుచ్ఛం కిమర్థం వృణీమహే. యద్వా యది వృణీమహేతర్హి తర్హి కింకిం వృణీమహే. అనంతత్వేన మనోరథానామనవస్థానాదిత్యర్థః. 32

పరతః అక్షరాత్ పరః నిరూపాధికః పురుషః ఇత్యర్థః అని శ్రీ భగవత్పాద భాష్యం. వ్యాకృతమైన నామ రూపాత్మకమైన ఈ జగత్తునకు; అవ్యాకృతమైన కారణీభూతమైన సోపాధికమైన మాయ, అవిద్య కారణం. దీనికే అక్షరమని పేరు దీనికంటే వేరై నిరుపాధికమైన ఆత్మ స్వరూపుడైన పరమాత్మ నీవు. సర్వ కార్యములకంటే పరమైనది కారణం, బీజమైనది అక్షరము, సంసార బీజాలు అనంతములు కావడం చేత ఎప్పటికి తరగనిది కనుక అక్షరంతానికంటే వేరైన..

నీవు ఏ వరమునైన ఇవ్వడానికి సమర్థుడవు. ఎందుకనగా ఇవ్వవలసిన నీ దివ్య సంపదలకు అంతము లేదు. అనంతములైన సంపదలు గలవానివి కనుకనే నిన్ను అనంతుడని స్తుతిస్తున్నారు. 31

అయినప్పటికి ఏ విధముగానైతే తుమ్మెద పారిజాత వృక్షము లభించినపుడు సులభంగా లభించినప్పటికీ వేరే వృక్షమును ఆశ్రయించదో ఆ విధముగానే నీ దివ్య పాదమూలమును చేరిన మేము ఇంకేమి కోరుదుము? ఏమిగూడా అవసరం లేదని అర్థము.లేదా నీ పాదమూలమును తప్ప తుచ్ఛమైన వేరేవాటిని మేమెందుకు కోరుదుము. లేదా ఒకవేళ కోరినప్పటికీ ఏమేమి కోరాలి? కోరికలు అనంతములు. వాటికి చాలు అనునది ఉండదు. కనుక నీ పాదము లభించిన పిమ్మట ఏమీ కోరము అని అర్థము. 32

శ్లో॥ యావత్తేమాయయా స్పృష్టా భ్రమామ ఇహ కర్మభిః ।
తావద్భగవత్ప్రసంగానాం సంగస్స్యాన్నో భవే భవే ॥ 33

టీ:- అతః ఏతావదేవ ప్రార్థయామహ ఇత్యాహుః - యావదితి. స్ప ృష్టాః వ్యాప్తా స్సంతః. భవతి ప్రకృష్టః సంగో యేషాం తేషాం. సంగోఽస్మాకం స్యాత్. 33

అందుకొరకు ఇదియే ప్రార్థిస్తున్నాము.

ఈ లోకమున ఎంతవరకు నీమాయచే వ్యాపింపబడినవారమై కర్మలచే పరిభ్రమించెదమో అంతవరకు జన్మ జన్మలలో నీ యందు గొప్ప భక్తిగల వారల స్నేహము మాకు లభించుగాక! 33

శ్లో॥ తులయామ లవేనాపి న స్వర్గం నాపునర్భవమ్ ।
భగవత్సంగి సంగస్య మర్త్యానాం కిముతాశిషః ॥ 34

టీ:- నను రాజ్య భోగాన్ స్వర్గాపవర్గౌ చ విహాయ కిమిదం ప్రార్థ్యతే? తత్రాహుః -తులయామేతి. భగవత్సంగినాం సంగస్య లవేనాపి. 34

మరి మీరు రాజ్యభోగములను, స్వర్గ మోక్షములను కాదని ఇదేమి కోరిక అంటావేమో?

స్వర్గభోగములు గాని, మోక్షముగాని భగవద్భక్తుల స్నేహముతో లేశముగూడా సరితూగవు. ఇక మానవుల సంపదలగూర్చి చెప్పేదే -ముంది. 34

శ్లో॥ యత్రేడ్యంతేకథామృష్టా తృణయాః ప్రశమోయతః ।
నిర్వైరం యత్రభూతేషు నోద్వేగో యత్ర కశ్చన ॥ 35

టీ:- సత్సంగస్య శ్రైష్ఠ్యం ప్రపంచయతి -త్రిభిః.యత్రేతి.యత్ర యేషు. యతః యాభ్యః కథాభ్యః. నిర్వైరం వైరాభావః ఉద్వేగః భయం. 35

సత్సంగము యొక్క గొప్పదనమును వివరించుచున్నాడు. ఏ సత్సంగములందు పాపశోధకములైన కథలు కీర్తింపబడునో; ఏ కథలచేత అత్యాశలు తొలిగిపోవునో, సర్వ భూతముల యందు వైరాభావము, భయము ఉండదో..35

శ్లో॥ యత్రనారాయణస్సాక్షాద్భగగవాన్న్యాసినాం గతిః ।
ప్రస్తూయతే సత్కథాసు ముక్తసంగైః పునః పునః ॥ 36

టీ:- యత్రేతి. న్యాసినాం సన్న్యాసినాం. గతిరిష్టోపాయః. 36

ఏ సత్సంగములందు సర్వసంగ పరిత్యాగులైనవారికి సాక్షాత్తు నారాయణుడే ఆశ్రయమో! సమస్త ఆసక్తులు విడిచిన వారిచేత తిరిగి తిరిగి సత్కథల యందు ఏ నారాయణుడు స్తుతింపబడుచున్నాడో. 36

శ్లో॥ తేషాం విచరతాం పద్భ్యాం తీర్థానాం పావనేచ్ఛయా ।
భీతస్య కింన రోచేత తావకానాం సమాగమః ॥ 37

టీ:- తేషామితి. పద్భ్యాం పావనేచ్ఛయా సంసారాద్భీతస్య. 37

తీర్థములను పవిత్రం చెయ్యాలని కాలినడకతో సంచరించే నీ భక్తుల సమాగమము సంసారానికి భయపడే వాడికెందుకు రుచించదు? 37

శ్లో॥ వయం తు సాక్షాద్భగవన్భవస్య
ప్రియస్య సఖ్యుః క్షణసంగమేన ।
సుదుశ్చికిత్సస్య భవస్య మృత్యో
ర్భిషక్తమం త్వాద్య గతిం గతాఃస్మః ॥ 38

టీ:- సత్సంగఫలమస్మాభిరేవానుభూతమిత్యాహుః - వయంత్వితి. తవ యః ప్రియస్సఖా తస్య భవస్య. అత్యంతమచికిత్సస్య. భవస్య జన్మనో మృత్యోశ్చ. భిషక్ తమం సద్వైద్యం. త్వా ఇతి త్వాం. గతిం ప్రాప్తాః. (38)

ఆ సత్సంగ ఫలమును మేమే అనుభవించినాము అని చెప్పుచున్నారు. ఓ భగవంతుడా! మేము సాక్షాత్తు నీకత్యంత ప్రియమిత్రుడైన శివుడి క్షణకాలమైన సమాగముచే, ఏ వైద్యమునకు లొంగని జన్మమరణములకు, శ్రేష్ఠమైన వైద్యుడిని (నిన్ను) ఈ రోజు పొందినాము. 38

శ్లో॥ యన్నస్స్వధీతం గురవః ప్రసాదితాః
విప్రాశ్చ సిద్ధాశ్చ సదానువృత్త్యా ।
ఆర్యానతాస్సుహృదో భ్రాతరశ్చ
సర్వాణి భూతా న్యనసూయయైవ ॥ 39

టీ:- వరాంతరంవృణీతే-ద్వాభ్యాం. యన్న ఇతి. నతాః నమస్కృతాః (39)

ఇంకొక వరమును కోరుచున్నాము.

ఓ పరమేశ్వరా! ఇంతకాలము మేము చక్కగా ఏ వేదాధ్యయనము చేసితిమో గురువులు, విప్రులు, వృద్ధులు, ఆర్యులు, ఇతరులైన సదాచారపరులు, శిష్టులు, మిత్రులు, అన్నదమ్ములు, సర్వప్రాణులు శుద్ధభావముచేత, సదాచారముచేత మాపై ప్రసన్నులయిరో మాచే నమస్కరింపబడిరో.. 39

శ్లో॥ యన్నస్సుతప్తం తవ ఏతదీశ
నిరంధసాం కాలమధభ్రమప్సు ।
సర్వం తదేతత్పురుషస్య భూమ్నో
వృణీమహే తే పరితోషణాయ ॥ 40

టీ:- యదితి. నిరంధసాం నిరన్నానాం. అదభ్రం బహుకాలం. తే పరితోషణాయ భవత్వితి వృణీమహే. 40

అన్నము లేకుండా నీటియందు చాలాకాలము తపస్సును చక్కగా చేసితిమో! ఇవన్ని సర్వాంతర్యామివైన పరబ్రహ్మ స్వరూపుడవైన నీ సంతోషము కొరకు అగు గాకయని కోరుచున్నాము. 40

శ్లో॥ మనుస్స్వయం భూర్భగవాన్భవశ్చ
యేఽన్యే తపో జ్ఞాన విశుద్ధ సత్త్వాః ।
అదృష్టపారా అపి యన్మహిమ్నః
స్తువంత్యథత్వాత్మ సమం గృణీమః ॥ 41

అజ్ఞానులమైనప్పటికీ నిన్ను స్తుతించుట తప్పు కాదు అని అనుచున్నారు. మనువు, బ్రహ్మదేవుడు, భగవాన్‌పరమశివుడు, తపస్సుచేత, జ్ఞానముచేత శుద్ధమైన అంతఃకరణముగల ఇతరులు ఎందరో నీ మహిమ యొక్క అవధిని దర్శించని వారు, వారి వారి

టీ:- అజానతామప్యస్మాకం త్వత్ స్తుతిర్న్యాయుక్తేత్యాహుః- మనురితి. యస్య తవ మహిమ్నోన దృష్టం పారం యైః. తేఽపి త్వాం. ఆత్మసమం స్వమత్యనురూపం యథా తథా. స్తువంతి. అథో అతః వయమపి గృణీమః. 41

బుద్ధిశక్తిననుసరించి స్తుతించుచున్నారు. అందువలన మేము గూడా స్తుతిస్తున్నాము. 41

శ్లో॥ నమస్సమాయ శుద్ధాయ పురుషాయ పరాయ చ ।
వాసుదేవాయ సత్త్వాయ తుభ్యం భగవతే నమః ॥ 42

టీ:- నమ ఇతి. సమాయ వైషమ్యహీనాయ. శుద్ధాయ రాగాది రహితాయ. పూర్ణాయ ఉత్కృష్టాయ. సత్త్వమూర్తయే వాసుదేవాయ. 42

సముడవైనట్టి, శుద్ధుడవైనట్టి, సర్వాంతర్యామివైనట్టి, సర్వాతీతుడైనట్టి, సత్యమూర్తియైన వాసుదేవుడగు భగవంతునకు నమస్కారము. 42

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఇతి ప్రచేతోభిరభిష్టుతో హరిః
ప్రీతస్తథేత్యాహ శరణ్యవత్సలః ।
అనిచ్ఛతాం యానుమతృప్త చక్షుషాం
యయౌ స్వధామానపవర్గవీర్యః ॥ 43

టీ:- ఇతీతి. యానం స్వ ప్రయాణం అనిచ్ఛతామపి సతాం స్వధామ యయౌ. అనపవర్గవీర్యః అకుంఠిత ప్రభావః. 43

మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

ఈవిధముగా ప్రచేతసులచే స్తుతింపబడిన, శరణ్యవత్సలుడు అయిన శ్రీహరి సంతుష్టుడై ఆ విధముగానే యగుగాకయని పలికి భగవద్రూపమును చూచుటయందు తృప్తి గలగని, తన ప్రయాణమును ఇష్టపడని ప్రచేతసులు అంకురిత ప్రభావుడైన భగవంతుడు, భక్తి హృదయమును ప్రవేశించెను. (తన స్వస్థానమునకు వెళ్ళెను) 43

శ్లో॥ అథ నిర్యాయ సలిలాత్ప్రచేతస ఉదన్వతః ।
వీక్ష్యాకుప్యన్ ద్రుమైశ్ఛన్నాం గాం గాం రోద్ధుమివోచ్ఛ్రితైః ॥44

టీ:- అథేతి. ఉదన్వతః సింధోః. సలిలాన్నిర్యాయ నిర్గత్య గాం స్వర్గం రోద్ధుమివ. ఉచ్ఛ్రితైర్ద్రుమైః. గాం మహీం ఛన్నాం వీక్ష్య. ద్రుమేభ్యో కుప్యన్. తథాహి. ప్రాచీనబర్హిషః ప్రవ్రజితత్వాదరాజకే కర్షణాద్యభావాత్ ద్రుమైర్భూమిః ఛన్నాభూత్. 44

అటుపిమ్మట ప్రచేతసులు సముద్రము నీటినుండి పైకివచ్చి స్వర్గమును అడ్డుకొనుచున్నవా అన్నట్టు భూమినిండా పెరిగిన చెట్లను చూచి కోపించిరి.

అప్పటికే ప్రాచీనబర్హి సన్యసించడం వలన, రాజులేకపోవడం చేత, భూమిని దున్నించేవాడు లేక చెట్లు చేమలచే భూమి నిండినది. (44)

శ్లో॥ తతోఽగ్నిమారుతౌ రాజన్నముంచన్ముఖతో రుషా ।
మహీం నిర్వీరుధం కర్తుం సంవర్తక ఇవాప్యయే ॥ 45

టీ:- తత ఇతి. నిరస్తా వీరుధో యస్యాః. తథా భూతాం కర్తుం. సంవర్తకః కాలాగ్నిరుద్రః అప్యయే. ప్రళయే. 45

కోపించినవారై భూమిపైన చెట్టులేకుండా చేయడానికి ప్రళయకాలమున కాలాగ్ని రుద్రుడివలె ముఖమునుండి వాయ్వగ్నులను విడిచిరి. 45

శ్లో॥ భస్మసాత్క్రియమాణాంస్తాన్ ద్రుమాన్వీక్ష్య పితామహః ।
ఆగతశ్శమయామాస పుత్రాన్బర్హిష్మతో నయైః ॥ 46

టీ:- భస్మాసాదితి. నయైర్యుక్తిభిః. 46

భూమిపై బూడిదచేయబడుచున్న చెట్లను చూచి బ్రహ్మదేవుడు వచ్చి బర్హిష్మంతుని పుత్రులను మంచి మాటలచేత ఉపశమింపచేసెను. (46)

శ్లో॥ తత్రావశిష్టా యే వృక్షా భీతా దుహితరం తదా ।
ఉజ్జహ్రుస్తే ప్రచేతోభ్య ఉపాదిష్టాః స్వయంభువా ॥ 47

టీ:- తత్రేతి. ఉజ్జహ్రుః సమర్పయామాసుః. 47

కాలిపోగా మిగిలిన చెట్లు భయపడి బ్రహ్మదేవుడిచే ఉపదేశించబడినవై తమ కుమార్తెను ప్రచేతసులకు సమర్పించినవి. 47

శ్లో॥ తే చ బ్రహ్మణ ఆదేశాన్మారిషాముపయేమిరే ।
యస్యాం మహాదవజ్ఞానాదజన్యజినయోనిజః ॥ 48

టీ:- త ఇతి. మారిషాం వార్క్షీం. అజినయోనిః బ్రహ్మా. తస్మాజ్జాతో దక్షః మహతః మహాదేవస్యావజ్ఞానాత్పూర్వమయోనిజో బ్రహ్మపుత్రోఽపి సన్ క్షత్రియజాతౌ యస్యామజని జాతః. 48

వారు బ్రహ్మదేవుడి ఆదేశము ననుసరించి వార్క్షిని వివాహము చేసుకొనిరి. బ్రహ్మ పుత్రుడైన దక్షుడు అయోనిజుడైనప్పటికీ, శివనింద చేయుటచేత జరాయుజుడుగా పుట్టవలసివచ్చినది. అతడు (దక్షుడు) వార్క్షిని యందు క్షత్రియుడుగా పుట్టినాడు. 48

శ్లో॥ చాక్షుషేత్వంతరే ప్రాప్తే ప్రాక్సర్గే కాల విద్రుతే ।
యస్ససర్జ ప్రజా ఇష్టాస్సదక్షో దైవచోదితః ॥ 49

టీ:- చాక్షువ ఇతి. ప్రాక్సర్గే పూర్వదేహే. కాలేన విద్రుతే గతే సతి. దైవేనేశ్వరేణ చోదితస్సన్. ఇష్టాః ప్రజాః. ససర్జస దక్ష ఇతి. ప్రసిద్ధః. (49)

పూర్వసృష్టియందలి పూర్వదేహము, కొంతకాలానికి పోగా దైవ ప్రేరణచే చాక్షుష మన్వంతరమున తనకిష్టమైన సంతానమును గని దక్షుడని ప్రసిద్ధుడాయెను. 49

శ్లో॥ యోజాయమానస్సర్వేషాం తేజస్తేజస్వినాం రుచా ।
స్వయోపాదత్తదాక్ష్యాచ్చ కర్మణా దక్షమబ్రువన్ ॥ 50

టీ:- య ఇతి. స్వయా రుచా ప్రభాయా. తేజ ఉపాదత్త ఆచ్ఛాదితవాన్. యం చ కర్మ దాక్ష్యాద్దక్షమబ్రువన్. 50

ఏ దక్షుడు పుట్టుచున్నవాడై తన తేజస్సు చేత ఇతరుల తేజస్సును కప్పిపుచ్చెనో ఎవరిని కర్మచాతుర్యమువల్ల దక్షుడని పలికిరో అతడిని దక్షుడని పిలిచిరి. 50

శ్లో॥ తం ప్రజాసర్గ రక్షాయామనాదిర్భరతర్షభ ।
యుయోజయుయుజేఽన్యాన్వై స వై సర్వప్రజాపతీన్ ॥ 51

టీ:- తమితి. తమభిషిచ్య. అనాదిః బ్రహ్మా ప్రజాసర్గ రక్షాయాం. యుయోజ. న చ దక్షః అన్యాన్ మరీచ్యాదీన్. తత్తద్వ్యాపారేషు నియుక్తవాన్. 51

ఆ దక్షుని బ్రహ్మదేవుడు అభిషేకించి ప్రజాసృష్టి, రక్షణలయందు నియోగించెను. ఆ దక్షుడు మరీచ్యాది ప్రజాపతులను ఆ యా పనుల యందు నియోగించెను. 51

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,
త్రింశోఽధ్యాయః

శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు
ముప్పదవ అధ్యాయము సమాప్తము.

## ఏకత్రింశోஉధ్యాయః

శ్లో॥ ఏకత్రింశే సుతే దక్షే ధురం న్యస్య ప్రచేతసః ।
నారదోక్తేన మార్గేణ గతా ముక్తిమితీర్యతే ॥

**మైత్రేయ ఉవాచ**

శ్లో॥ తత ఉత్పన్నవిజ్ఞానా ఆశ్వధోక్షజభాషితమ్ ।
స్మరంత ఆత్మజే భార్యాం విసృజ్య ప్రావ్రజన్గృహాత్ ॥ 1

టీ:- తత ఇతి. తతః దివ్య వర్షసహస్రాణాం సహస్రస్యాంతే. ఉత్పన్న వివేకజ్ఞానాస్తే. శ్లో. "ఉపయాస్యథమద్ధామ నిర్విద్యనిరయాదత" ఇత్యధోక్షజ భాషితం స్మరంతః ఆశుప్రావ్రజన్. 1

శ్లో॥ దీక్షితాబ్రహ్మసత్రేణ సర్వభూతాత్మమేధసా ।
ప్రతీచ్యాం దిశివేలాయాంసిద్ధోஉభూద్యత్ర జాబలిః ॥ 2

టీ:- దీక్షితా ఇతి. బ్రహ్మసత్రేణ ఆత్మవిమర్శేన. దీక్షితాః కృతసంకల్పాః బభూవుః. సర్వభూతేష్వాత్మేతి మేధా జ్ఞానం యస్మిన్ త్వేన. క్వ వేలాయాం సముద్రతటే జాబలిర్నామ ఋషి. 2

## 31 వ అధ్యాయము

ఈ ముప్పది ఒకటవ అధ్యాయమున కుమారుడైన దక్షునకు రాజ్యభారమునుంచి (కలిగించి) నారదుడుపదేశించిన మార్గమున సజ్జనులైన ప్రచేతసుల యొక్క ముక్తిని గూర్చి చెప్పబడినది.

**మైత్రేయుడు ఈవిదముగా పలికెను**

అటుమిమ్మట వేయి దివ్య సంవత్సరములు తపస్సుచేసిన పిమ్మట వివేక జ్ఞానమును పొంది భోగ నరకములనుండి వైరాగ్యమును పొంది నన్ను చేరండని చెప్పిన అధోక్షజుడి భాషణమును స్మరిస్తూ కుమారుడికి భార్యను అప్పగించి గృహము నుండి సన్యసించిరి. 1

పశ్చిమ దిక్కున సముద్రతీరమున ఎచ్చట, సర్వభూతముల యందు ఆత్మబుద్ధి గలిగిన జాబలి అనుపేరుగల మహర్షి సిద్ధుడాయెనో అచ్చట ఆత్మవిచారము చేయుటకు కృతసంకల్పులాయిరి. 2

శ్లో॥ తాన్నిర్జిత ప్రాణ వచో మనోదృశో
జితాసనాన్ శాంతసమాన విగ్రహాన్ ।
పరేఽమలే బ్రహ్మణి యోజితాత్మన
స్సురాసురేడ్యో దదృశేస్మ నారదః ॥ 3

టీ:- తానితి. నిర్జితాః ప్రాణ మనో వచోదృశోయైస్తాన్. శాంతాః ఉపరతాః సమానాః మూలాధారాదారభ్య ఋజవో విగ్రహాః యేషాం. బ్రహ్మణి యోజితః ఆత్మాయైః. సురాసురైరీడ్యోదృష్టవాన్. 3

జయింపబడిన ప్రాణము, మనస్సు, వాక్కు, చూపులు గలవారును; జయింపబడిన ఆసనములు గలవారును, శాంతులును మూలాధారము మొదలుకొని నిటారుగాగల దేహముగలవారును, శుద్ధమైన పరబ్రహ్మయందు నిలిపిన మనస్సుగలవారును అగు ప్రచేతసులను దేవతలు, రాక్షసులచేగూడా కొనియాడబడే నారదుడు చూచెను. 3

శ్లో॥ తమాగతం త ఉత్థాయ ప్రణిపత్యాభివాద్య చ ।
పూజయిత్వా యథాదేశం సుఖాసీనమథాబ్రువన్ ॥ 4

ఆ వచ్చిన నారదుడిని చూచి లేచి నిలబడి నమస్కరించి అభినందించి యథావిధిగా పూజించి, సుఖముగా కూర్చున్న నారదుడిని స్తుతించిరి. 4

**ప్రచేతస ఊచుః**

శ్లో॥ స్వాగతం తే సుర ఋషే దిష్ట్యానో దర్శనం గతః ।
తవ చంక్రమణం బ్రహ్మన్నభయాయ యథా రవేః ॥ 5

టీ:- తమితి. ఉత్థాయ తం ప్రణిపత్య. యథాదేశం యథావిధి పూజయిత్వా. (4-5)

**ప్రచేతసులు ఈ విధముగా పలికిరి.**

ఓ దేవర్షీ! నీకు స్వాగతం. దైవానుగ్రహముచే నీ దర్శనము మాకు కలిగినది. ఏ విధముగానైతే సూర్యుడి ద్వారా లోకమునకు భయము తొలుగునో ఆ విధముగా నీ సంచారము ప్రాణుల దుఃఖమును తొలగించుట కొరకే. 5

శ్లో॥ యదాదిష్టం భగవతా శివేనాధోక్షజేన చ ।
తద్గృహేషు ప్రసక్తానాం ప్రాయో నః క్షపితం ప్రభో ॥ 6

టీ:- యదితి. అదిష్టముపదిష్టం. యదాత్మతత్త్వం క్షపితం విస్మృతం. 6

భగవానుడైన శివుడిచే, అధోక్షజునిచే ఏ ఆత్మతత్త్వముపదేశించ బడినదో ఆ ఆత్మతత్త్వము గృహాసక్తి వల్ల చాలామట్టుకు విస్మరింప బడినది. 6

శ్లో॥ తన్నః ప్రద్యోతయాధ్యాత్మజ్ఞానం తత్త్వార్థదర్శనమ్ ।
యేనాంజసా తరిష్యామో దుస్తరం భవసాగరమ్ ॥ 7

టీ:- తదితి. ప్రద్యోతయ ప్రకాశయ పునరుపదేశేన తత్త్వం బ్రహ్మలక్షణమర్థం దర్శయతీతి తత్త్వార్థదర్శనం. 7

అందువల్ల మాకు యథార్థమును దర్శింపచేసే, ఏ జ్ఞానముచే దాటడానికి శక్యముగాని సంసార సాగరమును సులభముగా తరించగలమో ఆ అధ్యాత్మ జ్ఞానమును ప్రకాశింపచేయుము. 7

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఇతి ప్రచేతసా పృష్టో భగవన్నారదో మునిః ।
భగవత్యుత్తమశ్లోక ఆవిష్టాత్మా బ్రవీన్నృపాన్ ॥ 8

టీ:- ఇతీతి. ప్రచేతసా పృష్ట ఇతి ప్రాధాన్యాదేకస్య నిర్దేశః. ప్రచేతోభిః పృష్ట ఇత్యర్థః. 8

మైత్రేయుడు చెప్పుచున్నాడు.

ఈ విధముగా ప్రచేతసులచేత అడగబడినవాడై భగవాన్ నారద ముని ఉత్తమమైన కీర్తిగల భగవంతుడియందు మనస్సును లగ్నముచేసి రాజులతో ఈ విధముగా పలికెను. 8

**శ్రీనారద ఉవాచ**

శ్లో॥ తజ్జన్మ తాని కర్మాణి తదాయుస్తన్మనో వచః ।
నృణాం యేన హి విశ్వాత్మా సేవ్యతే హరిరీశ్వరః ॥ 9

టీ:- అహో గృహప్రసక్త్యా హరిసేవాం వినా సర్వం జన్మకర్మాదికం వ్యర్థం కృతమితితాన్ శోచన్నాహ - చతుర్భిః. తజ్జన్మేతి. యతో జన్మాదేర్హరిసేవైవ ఫలం అతః తద్విహీనం సర్వం వ్యర్థమిత్యతర్థః. 9

శ్లో॥ కిం జన్మభిస్త్రిభిర్వేహ శౌక్లసావిత్రయాజ్ఞికైః ।
కర్మభిర్వాత్రయీప్రోక్తైః పుంసోఽపి విబుధాయుషా ॥ 10

టీ:- కిమితి. శుక్లసంబంధి జన్మ. విశుద్ధ మాతా పితృభ్యాముత్పత్తిః . సావిత్రముపనయనేన. యాజ్ఞికం దీక్షయా విబుధానామివ దీర్ఘాయుషాపి కిం.10

శ్లో॥ శ్రుతేన తపసా వా కిం వచోభిశ్చిత్తవృత్తిభిః ।
బుద్ధ్యా వా కిం నిపుణయా బలేనేంద్రియ రాధసా ॥ 11

టీ:- శ్రుతేనేతి. వచోభిః వాగ్విలాసైః. చిత్తవృత్తిభిః నానావధాన సామర్థ్యైః. ఇంద్రియాణాం రాధసా పాటవేన. 11

**నారదుడు చెప్పుచున్నాడు.**

అయ్యో! హరిసేవను విడిచి గృహముయందు ఆసక్తిని పొంది జన్మకర్మలను వ్యర్థము చేసికొనిరేయని ఈ విధముగా పలికెను.

దేనిచే ఈ లోకమున జగద్రూపుడైన, నియామకుడైన శ్రీహరి సేవింపబడునో అదియే జన్మ, అదియే ఆయుస్సు, అదియే మనస్సు, అవియే వాక్కులు. అనగా జన్మాదులకు హరి సేవయే ఫలము. అదిలేని సర్వము వ్యర్థము. 9

విశుద్ధులైన తల్లిదండ్రులకు పుట్టినా! ఉపనయనాది సంస్కారములు కలిగినా! దీక్షాదులు స్వీకరించినా! వేదోక్తములైన కర్మలచేతగాని దేవతలవలే దీర్ఘమైన ఆయుస్సు గలిగిన మానవులకేమి ప్రయోజనము? 10

శ్రవణముచేతగాని, తపస్సుచేతగాని, వాగ్వైభవము గలిగినకాని అనేక విషయముల ధారణా సామర్థ్యము గలిగిగాని, నిపుణమైన బుద్ధి గలిగికాని, బలముచేత గాని, ఇంద్రియ పటుత్వము కలిగి గాని ఏమి ప్రయోజనము? 11

శ్లో॥ కిం వా యోగేన సాంఖ్యేన న్యాసస్వాధ్యాయయోరపి ।
కిం వా శ్రేయోభిరన్యైశ్చ న యత్రాత్మప్రదో హరిః ॥ 12

టీ:- కిమితి. యోగేన ప్రాణాయామాదినా. సాంఖ్యేన దేహాది వ్యతిరిక్తాత్మజ్ఞానమాత్రేణ. సన్న్యాస వేదాధ్యయనాభ్యామపి. అన్యైరపి వ్రతవైరాగ్యాదిశ్రేయసాధనైః. 12

శ్రీహరి ఆత్మప్రదుడు కానపుడు, ప్రాణాయామాది యోగము చేతగాని; దేహాది వ్యతిరిక్త ఆత్మ జ్ఞానము కలిగిగాని; సన్యాసము, వేదాధ్యయనముల చేతగాని; ఇతరములై శ్రేయసాధనములైన వ్రత, వైరాగ్యముల చేతగాని ఏమి ప్రయోజనము? 12

శ్లో॥ శ్రేయసామపి సర్వేషామాత్మాహ్యవధిరర్థతః ।
సర్వేషామపి భూతానాం హరిరాత్మాత్మదః ప్రియః ॥ 13

టీ:- నన్వేషాం నానాఫలసాధనానాం హరిసేవాభావమాత్రేణ కుతో వైయర్థ్యం తత్రాహ-శ్రేయసామితి. శ్రేయసాం ఫలానాం. ఆత్మైవావధిః పరాకాష్ఠా అర్థతః పరమార్థతః ఆత్మార్థిత్వైనైవాన్యేషాం ప్రియత్వాదిత్యర్థః భవత్వాత్మైవావధిః. హరేః కిమాయాతం? తత్రాహ-సర్వేషామపీతి. ఆత్మప్రదశ్చావిద్యాని రాసేన స్వరూపాభివ్యంజకః ఐశ్వర్యేణాతిరూపేణ బలిప్రభృతిభ్య ఇవాత్మ ప్రదః. ప్రియశ్చః పరమానందరూపత్వాత్. 13

మరి నానాఫల సాధనములైన ప్రాణాయామాదులు హరి సేవ లేనంత మాత్రమున ఎందుకు వ్యర్థములనగా శ్రేయఃఫలములకు ఆత్మనే అవధి. పరమార్థముగా చూచిన ఆత్మ కొరకే ఇతరములన్నీ గూడ ప్రియములు. - కానిమ్ము ఆత్మ అవధి శ్రీహరికి దాని ద్వారా ఏమి జరిగినది? సర్వభూతములకు ఆత్మ శ్రీహరియే. అవిద్య తొలగిపోవడం ద్వారా స్వరూప అభివ్యంజకుడు సగుణ రూపమున బలి ప్రభృతుకు తనను తాను ఇచ్చుకున్నాడు. సకల ప్రాణులకు ప్రియుడు. పరమానంద రూపుడగుట వలన... (తరువాతి శ్లోకముతో అన్వయము) 13

శ్లో॥ యథాతరోర్మూల నిషేచనేన
తృప్యంతి తత్ స్కంధ భుజోపశాఖాః ।
ప్రాణోపహారాశ్చ యథేంద్రియాణాం
తథైవ సర్వార్హణమచ్యుతేజ్యా ॥ 14

టీ:- కించ నానాకర్మభిస్తత్తద్దేవతా ప్రీతినిమిత్తాన్యపి ఫలాని హరి ప్రీత్యాభవంతి. కేవలం తత్తద్దేవతారాధనేన తు నకించిదితి. సదృష్టాంతమాహ - యథేతి. మూలాత్ప్రథమవిభాగాః స్కంధాః తద్విభాగాః భుజాః తేషామపి భాగాశ్శాఖాః తాసామపి భాగాః ఉపశాఖాః ఏతదుపలక్షణం పుత్ర పుష్పాదయోఽపి తృప్యంతి. న తు మూలసేకం వినా స్వ స్వ నిషేచనేన. ప్రాణస్యోపహారో భోజనం తస్మాదేవేంద్రియాణాం తృప్తిః న తు తత్తదింద్రియేషు పృథక్పృథఙ్నులేపనేన తథా అచ్యుతారాధనమేవ సర్వదేవతారాధనం న పృథగిత్యర్థః. 14

శ్లో॥ యథైవసూర్యాత్ప్రభవంతి వారః
పునశ్చ తస్మిన్ ప్రవిశంతికాలే ।
భూతాని భూమౌ స్థిర జంగమాని
తథాహరావేవగుణప్రవాహః ॥ 15

మరియు అనేక కర్మలచేత ఆ ఆ దేవతలకు ప్రీతి కలిగించినప్పుడు దాని నిమిత్తకమైన ఫలములు శ్రీహరికి ప్రీతిని కలిగించిన మాత్రముననే కలుగును. కేవల ఆ యా దేవతారాధనములచేత ఏ కొంచెము గూడా కలగదని దృష్టాంత పూర్వకముగా తెలుపుచున్నాడు.

ఏ విధముగానైతే వృక్షమూలమున నీరు పోసినచో మూలము నుండి మొదటి విభాగము మ్రాను, పెద్ద కొమ్మలు వాటి ఉపశాఖలు పత్ర, పుష్పాదులు అన్ని గూడా తృప్తి చెందుచున్నవి. మూలమున నీరు పోయక కేవలము కొమ్మలకు, రెమ్మలకు నీరు పోసిన తృప్తి చెందవు. ప్రాణములకు ఆహారము కలిగించిన ఇంద్రియములకు తృప్తి కాని ఆ యా ఇంద్రియములకు అన్నము పూసినంత మాత్రమున అవి తృప్తిపడవు. ఆవిధముగనే అచ్యుతుడి ఆరాధనమే సర్వ దేవతారాధనము. మరి వేరువేరు ఆరాధనములవసరం లేదు. 14

ఏ విధముగా సర్వ ములత్వమనగా వేరొక దృష్టాంతము చూపించుచున్నాడు. ఏ విధముగానైతే వర్షాకాలమున సూర్యుడినుండి వర్షములు పడి ఎండాకాలమున మళ్ళీ సూర్యుడిలోకి ప్రవేశించునో ఈ దృష్టాంతరము ప్రసిద్ధముగా కనబడదు గనక వేరొక ప్రసిద్ధ దృష్టాంతరమును తెలుపుచున్నాడు. ఏ విధముగానైతే భూమియందు

టీ:- కుతస్సర్వమూలత్వాదితి దృష్టాంతాంతరమాహ-యథేతి. యథైవ వారః జలాని. వర్షాకాలే సూర్యాదుద్భవంతి. గ్రీష్మే తస్మిన్నేవ ప్రవిశంతి. అస్యాపి ప్రసిద్ధత్వేన దృష్టాంతాంతరమాహ. యథా భూతాని భూమామితి. గుణప్రవాహః చేతనాచేతనాత్మకః ప్రపంచః. 15

శ్లో॥ ఏతత్పదం తజ్జగదాత్మనః పరం
సకృద్విభాతం సవితుర్యథా ప్రభా ।
యథాసవోజాగ్రతి స్వప్నవృత్తయో
ద్రవ్యక్రియాజ్ఞానభిదాభ్రమాత్యయే ॥ 16

టీ:- నను హరావేవ గుణప్రవాహ ఇత్యుక్తే తదాధారత్వేన సోపాధికత్వం హరేస్స్యాదిత్యాశంక్యాహ-ఏత దితి. ఏతద్విశ్వం . విష్ణోస్తత్సర్వశాస్త్రప్రసిద్ధం పదం పరం సర్వోపాధిరహితం. తదుత్పన్నత్వాన్న తతః పృథగిత్యర్థః. తర్హి కథమన్యథా భాతి? తత్రాహ-సకృత్కదాచిద్విభాతం స్ఫురితం. గంధర్వనగరవత్. యథా సవితుః ప్రభా. న తతో భిన్నా యథా చ జాగ్రతి. అసవః ఇంద్రియాణిః స్ఫురంతి. సుషుప్తౌతు సుప్తశక్తయో భవంతీత్యర్థః కథంభూతోఽసౌ హరిః. ద్రవ్యాదీనాం త్రివిధాహంకార కార్యాణాం తన్నిమిత్తస్య భేదభ్రమస్య వాత్యయో యస్మాత్సః. యద్వా - అజాగ్రతి సుషుప్తౌ.

పుట్టిన కదిలే, కదలని ప్రతి ప్రాణి మళ్ళీ భూమియందే కలియుచున్నవో ఆ విధముగా ఈ చేతన, అచేతనాత్మక ప్రపంచమంతా శ్రీహరి యందే ప్రవేశించు చున్నవి. 15

మరి హరియందే చేతనాఽచేతనాత్మక ప్రపంచమని చెప్తే వాటికి ఆధారరూపములో హరికి "సోపాధికత్వము" కలుగును కదా. ఈ కనబడుతున్న జగత్తు, సర్వ శాస్త్రములయందు ప్రసిద్ధమైన విష్ణువు యొక్కస్థానమే. సర్వోపాధి రహితమే. దానినుండి పుట్టినంత మాత్రమున దాని కంటే వేరు కాదు అని అర్థము. (నిరుపాధి నుండి కలిగినవి కూడా నిరుపాధికములే)

మరి వేరుగా ఎందుకు కనబడుతుంది. అనగా అప్పుడప్పుడు ఆకాశమున గంధర్వ నగరమువలె స్ఫురిస్తుంది. కాని నిజానికి లేదు. ఏ విధముగానైతే సూర్యకాంతి సూర్యుడికంటే వేరుకాదో ఏ విధముగా ఇంద్రియములు జాగ్రద్దశ యందు స్ఫురిస్తాయి. నిద్రలో వాటి పనులు ఉపరతిని చెందుతాయి. అదే విధముగా ఆ శ్రీహరి ఎట్టివాడు? ద్రవ్యాది మూడు విధములైన అహంకార కార్యమునకు దానికి నిమిత్తమైన భేద భ్రమకు నాశము దేనియందో అది శ్రీహరి రూపము.

లేదా ఏ విధముగానైతే సుషుప్తిలో ఇంద్రియములు, వాటి

అసవః సుప్తాశ్శక్తయో యేషాం తే భవంతి. ద్రవ్యాదేరప్యత్యయో భవతి సవితుః ప్రభేత్యుద్గతౌ దృష్టాంత ఇతి. 16

శక్తులు సుప్తములో లీనమగునో అదే విధముగా ద్రవ్యాదులు గూడా విలీనములే. సూర్యుడు సూర్యకాంతి అనుచోట ఉద్భూతము యందే దృష్టాంతము. పరమ తాత్పర్యము శ్రీహరి కంటే భిన్నముగా ఉన్నట్టు కనపడినా! ఆకాశంలో గంధర్వ నగరం వలె. నిజానికి భిన్నం కాదు. అజ్ఞాన దశలో భిన్నంగా కనబడుతుంది . 16

శ్లో॥ యథా నభస్యభ్రతమః ప్రకాశాభవంతి
భూయో న భవంత్యనుక్రమాత్ ।
ఏవం పరే బ్రహ్మణి శక్తయస్త్వమూ
రజస్తమస్సత్త్వమితి ప్రవాహః ॥ 17

టీ:- నన్వసంగే హరౌ కథం ప్రపంచోత్పత్తిలయౌ? తత్రాహ - యథేతి. అభ్రతమః ప్రకాశాః ఆగమాపాయినో రజస్తమస్సత్త్వస్థానీయాః హేభూపాః ప్రచేతసః. అమూశ్శక్తయః ప్రభవంతి ఉత్పద్యంతే న భవంతి లీయంతే ఇతి ఏవమయం జగత్ప్రవాహః. 17

మరి అసంగుడైన శ్రీహరి యందు ప్రపంచ ఉత్పత్తి లయములు ఏ విధముగా? అనగా ఓ రాజులారా! ఆకాశమున మేఘములు, చీకటి, వెలుగులు ఆయా కాలములయందు కనబడి అదృశ్యమైనట్లుగానే శ్రీహరియందు, అతనికి అంటకుండా సత్త్వ రజస్తమో గుణములు పుట్టుచున్నవి, లీనమగుచున్నవి. ఇదియే జగత్ ప్రవాహము. 17

శ్లో॥ తేనైకమాత్మానమశేష దేహినాం
కాలం ప్రధానం పురుషం పరేశమ్ ।
స్వతేజసా ధ్వస్తగుణప్రవాహ
మాత్మైక భావేన భజధ్వమద్ధా ॥ 18

టీ:- తేనేతి. తేన సర్వకారణత్వేన హేతునా. కాలో నిమిత్తం. ప్రధానముపాదానం. పురుషః కర్తా ఏవం త్రితయాత్మకత్వాత్సర్వకారణం పరమేశ్వరం. అద్ధా సాక్షాద్భజధ్వం. కథం ఆత్మనా ఏకభావేన. 18

సర్వ కారణుడగుట ద్వారా సర్వ ప్రాణులకు ఒకే ఆత్మగా సృష్టికి నిమిత్తకారణ, ఉపాదానకారణమైన కర్తగా అభిన్న నిమిత్తోపాదానకర్తృత్వములు కలగడం ద్వారా సర్వ కారణము పరమేశ్వరుడినిగా తన చైతన్య శక్తిచే నశింపచేయబడిన చేతనాచేతన ప్రపంచము గల వాడినిగా అనగా భిన్నముగా శ్రీహరిని సాక్షాత్తుగా భజించండి. 18

శ్లో॥ దయయా సర్వభూతేషు సంతుష్ట్యా యేన కేనచిత్ ।
సర్వేంద్రియోపశాంత్యా చ తుష్యత్యాశు జనార్దనః ॥ 19

టీ:- అజ్ఞత్వేన సాధనమాహ - దయయేతి. దయాదిభిః శీఘ్రం తుష్యతి. 19

శ్రీహరిని పొందుటకు సాధనమును తెలుపుచున్నాడు. సర్వ ప్రాణులయందు దయ కలిగిఉండడం, ప్రారబ్ధకర్మానుసారముగా లభించిన దానితో తృప్తి పడడం, సర్వేంద్రియములను, విషయ భోగములనుండి నిగ్రహించుట ద్వారా జనార్దనుడు తొందరగా సంతోషిస్తాడు. 19

శ్లో॥ అపహత సకలైషణామలాత్మన్య
విరతమేధిత భావనోపహూతః ।
నిజ జనన వశగత్వమాత్మ నోయ
న్నసరతి ఛిద్రవదక్షరస్సతాం హి ॥ 20

అటుపిమ్మట ఎప్పుడుగూడా విడువడనుచున్నాడు. సమస్త కోరికలు తొలగి, స్వచ్ఛమైన మనస్సుగల వారి మనస్సునందు నిరంతరము వర్ధిల్ల చేయబడిన భావనచే, భక్తిచే స్థిరము చేయబడినవాడై అక్షర స్వరూపుడైన శ్రీహరి స్వభక్తాధీనత్వమును తెలుసుకొని,

టీ:- తతో న కథాచిత్త్యజతీత్యాహ - అపహతేతి. అపహతాః నిరస్తాః సకలాః ఏషణాః కామా యస్మాత్స చాసావమలః ఆత్మా మనః తస్మిన్ సతాం మనసి. నిరంతర మేధితయా భావనయా ఉపహూతః సన్నిధాపితస్సన్ అక్షరో హరిః ఛిద్రవత్ తత్రత్యాకాశవత్. తతో న సరతి నాపయాతి హి కిం కుర్వన్? ఆత్మనో నిజజనవశగత్వం స్వభక్తాధీనత్వం అయన్ అవగచ్ఛన్. 20

హృదయాకాశము వలె ఎప్పడికిని తొలిగిపోదు. భగవానుదు సజ్జనులకు మాత్రమే వశ్యుదు. అతదు సజ్జనులు కానివారి పూజను గూడా పరిగ్రహించదని తెలుపుచున్నాదు. 20

శ్లో॥ న భజతి కుమనీషిణాం స ఇజ్యాం
హరిరధనాత్మధనప్రియో రసజ్ఞః ।
శ్రుత ధన కులధర్మిణాం మదైర్యే
విదధతి పాపమకించనేషు సత్సు ॥ 21

టీ:- సతామేవం వశ్యోఽసౌ అసతాం తు పూజామపి న గృహ్ణాతీత్యాహ - నేతి. కుమనీషిణాం కుత్సితమతీనాం అధనాశ్చ తే ఆత్మధనాశ్చ భగవద్ధనాః తే ప్రియాః యస్య రసజ్ఞః భక్తిసుఖజ్ఞః కే కుమనీషిణః? తానాహ-శ్రుతాదినిమిత్తైర్మదైర్యే. సత్సుపాపం తిరస్కారం కుర్వంతి. 21

భౌతిక సంపదలు లేనప్పటికి ఆత్మజ్ఞానమే ధనముగాగల భగవద్ధనులైన వారియందు ప్రేమగల, భక్తి సుఖము తెలిసిన శ్రీహరి కుచ్ఛితమైన మతులుగలవారి పూజను స్వీకరించదు. ఎవరా కుమతులు? అనగా చదువు, ధనము, కులము, కర్మానుష్ఠానము యొక్క మదముచే ఎవరులేని, ఏమిలేని సజ్జనులయందు తిరస్కారమనే పాపము చేయుదురో..21

శ్లో॥ శ్రియమనుచరతీం తదర్థినశ్చ
ద్విపదపతీన్విబుధాంశ్చ యస్స్వపూర్ణః ।
స భజతి నిజభృత్యవర్గరక్తః కథ
మముముద్విసృజేత్పుమాన్ రసజ్ఞః ॥ 22

టీ:- భక్తాధీనత్వం ప్రపంచయన్నాహ - శ్రియమితి. అనువర్త మానమపి శ్రియం తదర్థినః సకామాన్. ద్విపదపతీన్ నరేంద్రాన్. విబుధాన్ దేవానపి. యో నానువర్తతే. యతః స్వేనైవ పరిపూర్ణః అతః స్వభృత్య వర్గానురక్త ఏవ. ఏవంభూత మముం ఉదీషదపి కథం పరిత్యజేత్?22

భగవంతుడు భక్తాధీనుడు. దానిని వివరించుచున్నాడు. తనను నిరంతరము సేవించుచూ అనుసరించిన లక్ష్మీదేవిని, ఆ లక్ష్మీదేవిని కోరే రాజులను, దేవతలను అనుసరించడు. ఎందుకనగా అతడు తనను సేవించే భక్తులయందు అనురక్తుడు కావడమే కారణం. చేసిన ఉపకారమును మరవని భక్తుడు, అట్టి భగవంతుడిని ఎట్లు, ఏ కొంచమైనను అనగా ఏ కొద్దిసేపు కూడా విడిచిపెట్టును? అనగా నిరంతరము చింతించుచుండును అని తాత్పర్యం. 22

మైత్రేయ ఉవాచ

శ్లో॥ ఇతి ప్రచేతసో రాజన్నన్యాశ్చ భగవత్కథాః ।
శ్రావయిత్వా బ్రహ్మలోకం యయౌ స్వాయంభువో మునిః ॥23

టీ:- ఇతీతి. ప్రచేతసః కర్మభూతాన్. అన్యాశ్చ భగవత్కథాః. నూనం సునీతేరిత్యాది ధ్రువచరితాద్యాః. సత్రే గాయన్ ప్రచేతసామిత్యుక్తత్వాత్. (23)

మైత్రేయుడు ఈ విధముగా పలికెను.

ఓ రాజా! ఈ విధముగా కర్మయందు గల ప్రచేతసులకు ధ్రువ చరిత్రాదులు, ఇతరములైన భగవత్కథలు చెప్పి, ధ్రువచరిత్ర సందర్భమున నారదుడు ప్రచేతసుల సత్రమున ఈ గాథను గానము చేసినని చెప్పి, స్వయంభువుడైన బ్రహ్మపుత్రుడగు నారదుడు బ్రహ్మలోకమునకు వెళ్ళెను. 23

శ్లో॥ తేఽపి తన్ముఖనిర్యాంతం యశోలోకమలాపహమ్ ।
హరేర్నిశమ్య తత్పాదం ధ్యాయంత స్తద్గతిం యయుః ॥ 24

టీ:- తేఽపి ప్రచేతసః తద్గతిః విష్ణులోకం. 24

ఆ ప్రచేతసులు గూడా నారద ముఖము నుండి వెలువడిన, లోకములోని పాపములు తొలగించు శ్రీహరి యశోగాథలను విని, భగవత్పాదములను ధ్యానిస్తూ విష్ణు లోకమునకు వెళ్ళిరి. 24

శ్లో॥ ఏతత్తేఽభిహితం క్షత్తర్యన్మాం త్వం పరిపృష్టవాన్ ।
ప్రచేతసాం నారదస్య సంవాదో హరికీర్తనమ్ ॥ 25

ఓ విదురా! నీవు నన్నడిగినావు కనుక, ప్రచేతసుల నారద సంవాదరూపమైన, శ్రీహరిని కీర్తించే ఈ కథను వినిపించితిని. 25

**శ్రీశుక ఉవాచ**

**శ్రీ శుకులవారు ఈ విధముగా పలుకుచున్నారు.**

శ్లో॥ య ఏష ఉత్తానపదో మానవస్యానువర్ణితః ।
వంశం ప్రియవ్రతస్యాపి నిబోధనృపసత్తమ ॥ 26

టీ:- య ఇతి. య ఏష వంశః సోఽనువర్ణితః. 26

ఓ రాజా! మనుపుత్రుడైన ఉత్తానపాదుడి యొక్క వంశమును వర్ణించితిని. ప్రియవ్రతుడిని గూర్చి గూడా తెలుసుకొనుము. 26

శ్లో॥ యో నారదాదాత్మవిద్యామధిగమ్య పునర్మహీమ్ ।
భుక్త్వా విభజ్య పుత్రేభ్య ఐశ్వర్యం సమగాత్పదమ్ ॥ 27

ఈ ప్రియవ్రతుడు నారదుడినుండి ఆత్మ విద్యను పొంది మరల ఈ భూమిని పరిపాలించి, పుత్రులకు పంచి ఇచ్చి ఈశ్వర స్థానమును పొందెను. 27

శ్లో॥ ఇత్థం స కౌషారవిణోపవర్ణితాః
క్షత్తా నిశమ్యాజితనాథ సత్కథాః ।
ప్రవృద్ధభావోఽశ్రుకలాకులో మునే
ర్దధారమూర్ధ్నా చరణం హృదా హరేః ॥ 28

పరాజయము నెరుగని శ్రీహరి సత్కథను మైత్రేయుడు వర్ణించగా విదురుడు విని, వర్ధిల్లిన భక్తి గలవాడై, నీరునిండిన కన్నులుగలవాడై మైత్రేయుడి పాదములపై శిరస్సుంచి హృదయములో శ్రీహరి చరణములను ధరించెను. 28

**విదుర ఉవాచ**

**విదురుడు ఈ విధముగా పలికెను.**

శ్లో॥ సోఽయం తాత మహాయోగిన్భవతా కరుణాత్మనా ।
దర్శితస్తమసః పారో యత్రాకించనగో హరిః ॥ 29

ఓ మహాయోగీ! కరుణాత్మకుడవైన నీ చేత ఈ రోజు జ్ఞానము యొక్క ఆవలిగట్టు (ఎక్కడైతే ఏమీ దిక్కులేని వారికి దిక్కైయున్నాడో శ్రీహరి ఉన్నాడో) చూపెట్టబడినది. జ్ఞానమును చూపితివి. 29

టీ:- య ఇతి. యఃప్రియ వ్రతః. (27-29)

**శ్రీ శుక ఉవాచ**

**శ్రీ శుకులవారు ఈ విధముగా పలుకుచున్నారు.**

శ్లో॥ ఇత్యానమ్య తమామంత్ర్య విదురో గజసాహ్వయమ్ ।
స్వానాం దిదృక్షుః ప్రయయౌ జ్ఞాతీనాం నిభృతాశయః ॥ 30

శాంతియైన మనస్సుగల విదురుడు ఈ విధముగా మైత్రేయుడికి నమస్కరించి సెలవు తీసుకొని, తన బంధువులను చూడాలని కోరికచే హస్తినాపురమునకు వెళ్ళెను. 30

టీ:- ఇతీతి. స్వాన్ జ్ఞాతీన్ దిదృక్షుః. 30

శ్లో॥ ఏతద్యఃశ్రుణుయాద్రాజన్ రాజ్ఞాం హర్యర్పితాత్మనామ్ ।
ఆయుర్ధనం యశస్స్వస్తి గతిమైశ్వర్యమాప్నుయాత్ ॥ 31

టీ:- ఏతదితి. రాజ్ఞాం చరతమితి శేషః. 31

ఇతి శ్రీమద్భాగవతే, మహాపురాణే చతుర్థస్కంధే,
ఏకత్రింశోఽ ధ్యాయ :

హరయేనమః

ఓ రాజా! శ్రీహరి యందు అర్పింపబడిన హృదయము గల ఈ రాజుల చరితమును ఎవరు విందురో వారు ఆయుర్ధాయమును, యశస్సును, మంచి మార్గమును, ఈశ్వర భావమును పొందుదురు. 31

శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధమందు
ముప్పది ఒకటవ అధ్యాయము సమాప్తము.

శ్రీమద్భాగవతమున నాలుగవస్కంధము సమాప్తము.

హరయేనమః

